# విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము

1951

[వెల రు 1-0-0

కీర్తిశేషులైన రావుబహద్దూరు

కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కార గానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 శారంగకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహారధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయం)
4 మహారణ్యపురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వచన ప్రబంధములు

## పద్య కావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజా పూర్వదేశ
యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన
నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పక్షికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# శ్రీ విక్టోరియా మహారాజ్ఞిగారి చరిత్రము

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగముపంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

**1951**

# శ్రీ విక్టోరియా మహారాజ్ఞిగారి చరిత్రము.

## మొదటి ప్రకరణము

### బాల్యావస్థ.

స్త్రీశిశువు పుట్టినప్పటికంటె పుత్రజననము కలిగినప్పు డెల్లవారును సధికానందమును బొందుచుందురు. అందులోను మూర్ధాభిషిక్తుఁడయిన మహారాజునకు పుత్రోదయ మయినప్పుడు ప్రజలుకూడ దేశమునం దంతటను మహోత్సవములు చేయుదురు. స్త్రీలు రాజ్యమునకువచ్చుట దేశానర్థదాయకమని భావించి కొన్ని దేశములవారు స్త్రీలకురాజ్యార్హత లేకుండ నియమములను సహితము చేసికొనియున్నారు. జనాభిప్రాయ మిట్లుండఁగా నిజముగాఁ బురుషులు రాజ్యముచేయునప్పటికంటె స్త్రీల రాజ్యపరిపాలనములోనే ప్రజాసౌఖ్య మధికముగా నున్నదని లోకానుభవము సహస్రముఖముల ఘోషించుచున్నది. శ్రీయెలిజబెత్ రాణి రాజ్యభారము వహించి యుండిన కాలములో నింగ్లండు దేశము మహోన్నతదశయందుండినది. ఆకాలమునందా మెసేన లెల్లయెడలను విజయముగాంచుచు నింగ్లండు దేశము ననన్యభేద్యమునుగాఁ జేసెను; ఆకాలమునందు నాటకాలంకార సాహిత్యాదులును బ్రకృతిశాస్త్రాదులును బూర్వమెన్నఁడును లేనినిరుపమానదశకు వచ్చినవి. ఇప్పుడు విక్టోరియామహారాజ్ఞిగారి యేలుబడిలో దేశ మెట్టిస్థితికి వచ్చినదో యీచరిత్రము కొంతవఱకుఁ దెలుపవచ్చును. స్త్రీలను సగౌరవముగాఁ జూచెడి యన్య దేశములమాట యటుండఁగా స్త్రీలను చిన్నచూపునఁ జూచెడి యీ దేశమునందు సహితము స్త్రీలు రాజ్యపాలనము చేయుఁదటస్థించు భాగ్యము పట్టినప్పు

డెల్లను దేశమధికసుభిక్షముగానుండుచు వచ్చెననియుఁ బ్రజలధికసుఖవంతులయి యుండుచువచ్చిరనియుఁ జరిత్రములు మొఱపెట్టుచున్నవి.



శ్రీ విక్టోరియా మహారాజ్ఞి.

గణపతిదేవమహారాజుభార్యయైనరుద్రమదేవి త్రిలింగదేశపరిపాలనము నుబూని యున్నప్పు డీదేశము పూర్వ మేగజపతులకాలములోను లేని

యున్నతదశనొందియుండెననియు జనులత్యంతసంతుష్టులైయుండిరనియు నాకాలమునందీ దేశమునకువచ్చిన విదేశీయ యాత్రాపరులామెపాలనమును మెచ్చుకొనియున్నారు. సత్పరిపాలనమునందుమాత్రమే కాక స్త్రీ రాజ్యార్హురాలుకాదని కలహకారులయి రాజ్యవిఘాతముచేయఁబ్రయత్నించిన రాజబంధువుల కుతంత్రముల నడఁచివేయుటయందును నసమాన సామర్థ్యమును బౌరుషమును జూపి యామె పురుషులుసిగ్గుపడవలసినట్లు ప్రవర్తించినది. ఈమెవలెనే యహల్యాబాయియుమంత్రుల కుట్రలోపాయములుసాగనీయక యసాధారణపౌరుషమునుజూపిరాజ్యభారమును వహించి యెల్లవారును వేనోళ్ళఁ గొనియాడునట్లుగాస్వరాజ్య పరిపాలనముచేసినవార్తజగత్ప్రసిద్ధముకదా. ఆమెకుఁ బూర్వమునందా రాజ్యము నేలినహోల్కారు లెవ్వరంత చక్కఁగాఁ బ్రజాసంరక్షణము చేసిరి? ఈయంశము నింతట నిలిపి యిఁకఁ గథాంశమునకు వత్తము.

రాణిగారిచరిత్రమునారంభింపకముందామె తండ్రితాతలనుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. రాణిగారి పితామహుఁడగు మూఁడవ జార్జి 1760 వ సంవత్సరమునందు రాజ్యమునకువచ్చి దాదాపుగానఱువదిసంవత్సరములుప్రభుత్వముచేసి యెనుబదిరెండేండ్లు బ్రతికి 1820 వ సంవత్సరమునందుఁగాలధర్మమునొందెను. రాణిగారివలెనే యితఁడును జిరకాలజీవియుఁ జిరకాలరాజ్యపాలకుఁడు నయినను, ఈమెకుఁగల గుణసంపద యాయనకులేదు. అతఁడురాజ్యభారమును వహించినప్పుడు తండ్రిచేసినయప్పులఁదీర్పక యెగవేసెను; ఈమెరాజ్యమునకురాఁగానేతండ్రి చేసినఋణమునుదీర్చెను. అతఁడు యువరాజపట్టమునుబట్టి జ్యేష్ఠపుత్రుఁడనుభవింపవలసినయాదాయమును సహితముతానేయపహరించియనుభవింపసాగెను; ఈమె తనకుఁ బుత్రోదయముకాఁగానే యాయాదాయమునుదానుగైకొనక వేఱుగానుంచి వృద్ధిపఱిచెను. మూఁడవజార్జికిసంతానముపదునేనుగురు కలిగిరి. వారిలో శ్రీమహారాజ్ఞిగారిజనకుఁడును కెంటు

ప్రభువు నయిన యెడ్వర్డు నాలవవాఁడు, ప్రథమపుత్త్రుఁడయిన నాలవ



కెంటుప్రభువు — రాణిగారితండ్రి.

జార్జికి చార్లొట్టిప్రభ్వియను నేకపుత్త్రిక కలిగెను. ఆరాజపుత్త్రిని విక్టోరియా రాణిగారి మేనమామయైన లియోపాల్డుప్రభువున కిచ్చి వివాహము చేసిరి. తండ్రితాతల యనంతరమునఁ దాచిన్నదియే యింగ్లాండు దేశముయొక్క భవిష్యద్రాజ్ఞి యగునట్లప్పటికిఁ గనఁబడుచుండెను. మనుష్యుఁ డొకటి తలఁచిన దైవ మింకొకటి తలఁచునుగదా? ఇట్లుండఁగా నారాజపుత్త్రి యొక

స్థికముగా 1817వ సంవత్సరమునందు లోకాంతరగతురాలగుట తట స్థించెను. ఆమెమరణముతో నేతద్భర్తయైనలియోపాల్డు ప్రభువుయొక్క యాశలన్నియువిఫలములయిపోయెను. ఆమె మరణమునాటికి మూడవ జార్జియొక్క కుమారులలో నొక్కరికినిసంతానములేదు. అందుచేతరాజు తొందరపడితనయితరపుత్రులకువివాహములుచేయబూనెను. వారిలో మూడవపుత్రుడయి క్లేరెన్సు ప్రభువయిన విల్లియమునకును, నాలవ పుత్రుడయి కెంటుప్రభువయిన యెడ్వర్డునకును, ఏకదినముననే 1818 వ సంవత్సరము జూన్ నెల ౧౩వ తేదిని వివాహములుజరగెను. క్లేరెన్సు ప్రభువువివాహమాడినకాంతయడిలెయిడ్ ప్రభ్వి; కెంటుప్రభువువివాహ మాడినకాంత విక్టోరియా మేరీలూయిసా ప్రభ్వి. ఈప్రభ్విగారికిది పున ర్వివాహము; ఈమె మొదటలెయినిజిన్ ప్రభువుగారిని వివాహమాడి యాయనవలన నిద్దఱుబిడ్డలనుగనెను; ఈమె జర్మనీదేశములోని శాక్సికో బర్గు ప్రభువుగారి కూతురు; చార్లోటిప్రభ్వికి భర్తయైనలియోపాల్డు ప్రభువుగారితోబుట్టువు. ఈమెయొతనద్వితీయభర్తయైన కెంటుప్రభువు గారివలన 1819వ సంవత్సరము మెయినెల 24వ తేదిన తెల్లవాఱుజా ముననాలుగుగంటలవేళ(మనచక్రవర్తినియైన) శ్రీవిక్టోరియామహారాజ్ఞి గారినిగనెను. మన మెవ్వరిని మాతృభావముతో గౌరవించుచున్యాంత ప్రభుభక్తితో సేవించుచున్నామో ఎవ్వరికిభరతఖండమునందలిరాజాధి రాజులును బరమవిధేయులయియరియర్పణములుచేయుచున్నారో యా విక్టోరియామహారాజ్ఞి హిందూ ధర్మశాస్త్రములనుబట్టి పునర్భూపుత్రి వితంతువివాహము లాచరణీయములనివాదించెడి సాంఘికసంస్కార తత్పరుల కీయంశము కొంత ప్రోత్సాహకరముగా నుండకపోదు.

రాణిగారితల్లి గర్భవతియై భర్తతో బవేరియా దేశమునందలి యమర్బాకులోనుండగాదనకుగలుగబోవుప్రథమసంతానముస్వదేశ మయిన యింగ్లాండులోనే జననమొందవలెనని చెప్పి యొడబఱిచి రాణి



కెంటుపత్ని:—రాణిగారితల్లి

గారితండ్రియైన కెంటుప్రభువు నిండుచూలాలయి యున్న తనభార్యను వెంటఁగొని, మెట్టను బ్రయాణము చేసినంతవఱకు బండిగుఱ్ఱములను దానేతోలుచు నామెనుసురక్షితముగా నేప్రిల్ నెలమొదట కెన్సింగ్టన్ నగరమునకుఁ జేర్చెను. కెన్సింగ్టన్ నగరములండన్ రాజధానిలో రాజదంపతులుగాక రాజకుటుంబములోనిఇతరులు వాసము చేసెడి రాజమందిరము.

రాణిగారు జనన మొందినదియీ కెన్సింగ్టన్ నగరములోనే. ఈమెకునాలవ



కెన్సింగ్టన్ నగరము:—రాణిగారు జన్మించిన గృహము.

నెలలో టీకాలు వేయించిరి. రాజకుటుంబములోని శిశువులలో మొట్ట మొదట టీకాలు వేయించినది యీమెకే. ఈశిశువునందు జనకునికిఁగల ప్రేమ మింతంతయని చెప్పుటకు శక్యముగాదు. అతఁడు తన ముద్దులకూఁతును జూడవచ్చిన యాప్తులతో మహారాజ్ఞిని జూచితిరాయనిమహాసంతోష ముతోఁ బ్రసంగించుచుండును. జననకాలమునందా చిన్నది భవిష్యద్రాజ్ఞి యగునని యూహించుటకుఁ దగిన సూచనలేవియు లేవు. కెంటుప్రభువు రాజయిన మూఁడవజార్జికి నాలవపుత్రుఁడు. మొదటిముగ్గురును సంతాన హీనులై మృతినొందినంగాని యీమె రాణియగుటతటస్థింపదు. అప్పుడు సహితమీమెకుఁదమ్ములు కలుగ కుండవలెను. ఈచిన్నరాణి పుట్టిన సంవత్సరమంతమంచిదియుఁగాదు. ఆసంవత్సరముననే పీటర్లూహత్యలను పేరసంఘహత్యలు జరిగినవి. అప్పుడుజనులుదరిద్రులుగానుండిరి; పన్నులు ప్రజలకు దుర్భరములై యుండెను; వాణిజ్యము హీనదశయందుండెను; కాపులు రాజుమీఁద తిరుగఁబడి సంక్షోభము కలిగించుచుండిరి. ఇట్టి దుష్కాలములందు జననమొందియు మహానుభావురాలయిన రాణియొక్క సత్ప్రవర్తనమునుబట్టి జన్మకాలమునకును భావియోగ్యతకును సంబంధ ముండదని యెల్లవారును దెలిసికోవచ్చును. వసంతకాలమునందుఁ బుట్టిన యీచక్కనిశిశువునుజూచి బంధువులీమెను వసంతకుసుమమనిపిలుచుచు వచ్చిరఁట. రషియాచక్రవర్తి పేరునుతల్లి పేరునుగలిపియీ చిన్నదానికల గాంద్రినా విక్టోరియా యని నామకరణము చేయఁబడెను. ఈచిన్నది తండ్రికిబహిఃప్రాణమనియీవఱకే చెప్పియున్నాను. ఒకమతాచార్యుఁ డుసంతానవంతుఁడయినందున కెంటునభినందించుచు నాశిశువు పుత్రిక గాక పుత్రుఁడయినయెడల మఱింత సంతోషకరముగానుండుననిప్రసం సించినప్పుడు కెంటుప్రభువు "బుద్ధియందీశ్వరుఁడు మనుష్యునికంటెసర్వ శ్రేష్ఠుఁడు. అట్టి యీశ్వరుఁడేసంతానమును బ్రసాదించునో యదియే సర్వోత్తమమయినది" అని యుత్తరము చెప్పెనఁట! రాణిగారి కాలు

నెలల ప్రాయమప్పుడు తల్లిదండ్రులామెను సిడ్‌మౌత్తు గ్రామమునకుఁ గొనిపోయిరి. సిడ్‌మౌత్తు గ్రామ మింగ్లండు దేశములో దక్షిణసముద్ర తీరమునందున్న మనోహరమైన స్థలము. ఇక్కడనున్నప్పుడు రాణిగారికి మొదటిగండము తప్పెను. ఒకనాఁడు దాది శిశువునెత్తుకొనియాడించుచుండఁగా నొకబాలుఁడు పిట్టలను గొట్టుటకయి కాల్చినతుపాకి గుండు తప్పిపోయి గుండ్లు గవాక్షములోనుండివచ్చి సరిగాశిశువు నెత్తిమీఁది నుండిపోయెను. సేవకులప్పుడేపరుగెత్తికొనిపోయితుపాకి కాల్చినబాలుని బట్టుకొని కెంటుప్రభువువద్దకీడ్చుకొనిరాఁగా నతఁడు దయాళుఁడగుటచేత దండనము నిమిత్తము వానిని రాజభటులకొప్పగింపక యిఁకముందెప్పుడును ప్రాణాపాయకరమయిన యిటువంటిచోట్ల తుపాకి కాల్పవద్దని మందలించిబుద్ధిచెప్పి విడిచిపుచ్చెను. ఈగండము గడచినయుల్పకాలములోనే యాకుటుంబమునకొక గొప్పయాపదసంభవించెను. కెంటుప్రభువొకనాఁడు విహారార్థమై యూరివెలుపలికిఁ బోయివచ్చునప్పటికి పాదరక్షలును బట్టలును తడిసెను. అతఁడిల్లుచేరునప్పటికి వాకిటదాదిచేతులలో కూఁతురు కనబడెను. కొమారితమీఁది ప్రేమాతిశయముచేత నాతఁడులోపలికిఁబోయితడిబట్టలువిడిచిరాక యేకూఁతునెత్తుకొనిముద్దులాడుచుఁ గొంతసేపుగడపెను. అందుచేతనాతనికి శైత్యముచేజ్వరము వచ్చి శ్వాసకోశములుచెడి యాజ్వరముతోనే యతఁడు. 1820 వ సంవత్సరము జనేవరి నెల 23 వ తేదిని మృతిఁజెందెను. మంచివారికి మరణమే సాక్షి యన్నలోకోక్తి సర్వత్ర కాకపోయినను, ఇప్పుడితని యెడల సత్యమయినది. మూఁడవజార్జియొక్క కుమారులలో నెల్లనితఁడు మంచివాఁడు. ఇతఁడు మంచివాఁడేయైనను జననీజనకులకుఁ బ్రియపుత్రుఁడుకానందునఁ దఱచుగా వారికిదూరమునందుండుట తటస్థించుచువచ్చెను. అందుచేత రాజస్థానమునందుండుసుముఖస్తుతులును హాస్యోక్తులును భోగపరాయణత్వమునునీతనినంటిచెఱుపఁగలిగినవి కావు. ఇతఁ

ఎల్లవారిచేతను మిగులగౌరవింపఁబడుచుండెను; స్వార్థపరత్వము లేని వాఁడయి సమస్తవ్యవహారములలోను న్యాయదృష్టిగలవాఁడయియుం డెను. సేనలోనాయకత్వమును వహించియున్నప్పుడం దనేకసంస్కార ములు చేసెను; దండులోఁ గొలువు విడిచివచ్చినతరువాత సమస్త లోకోపకారకార్యములయందును సాదరముఁజూపుచు ముఖ్యముగా ననాథకాంతా శిశిశురక్షణమునం దత్యంతశ్రద్ధ వహించుచుండెను. అతి దయాళుఁడును దానశీలుఁడు నగుటచేత దీనపోషణమునకై ఋణములపా లై పలుమాఱుకష్టములను దెచ్చుకొనుచుండెను. పరోపకారకార్యముల నిమిత్తము స్థాపింపఁబడిన యిఱువదిరెండు సమాజములలో నితఁడు సామాజికుఁడుగా నుండెను. సత్స్వభావమునకును సద్వర్తనమునకును దోడీతనికిదృఢచిత్తతయుగలిగియుండెను. ఇటువంటిభర్తపోఁగానే కెంటు ప్రభ్వివిదేశములో నెనిమిది నెలలశిశువుతో నిరాధారురాలయ్యెను. ఈమె కప్పటికింగ్లీషుభాషసహితమురాదు. అట్లయ్యునుభర్తవలె నేఈమెయు సద్వర్తనమును మనోదార్ఢ్యమును గలదగుటచేతఁ బుట్టినింటికిఁ బోక యింగ్లండులోనేయుండనిశ్చయించుకొనెను. అప్పుడామెసోదరుఁడయిన లియోపాల్డుప్రభువు భర్తృమరణదుఃఖితయయియున్నతోఁ బుట్టువును మేనకోడలిని వెంటఁబెట్టుకొని మఱఁదిపోయినమూఁడవనాఁడే బైలుదేఱి కెన్సింగ్టన్‌నగరమునకుఁ గొనివచ్చివిడిచి సర్వవిధములవారికి సాయము చేయుచుండెను. భర్త లోకాంతరగతుఁ డగునప్పటి కామెకు విశేష విత్తము లేకపోవుటయే కాక భర్త చేసినఋణములుసహితము మీఁదఁ బడెను. పార్లమెంటువారామెకిచ్చెడుజీవనాంశము తనస్థితికిఁదగినగౌరవ ముతో జీవనముచేయుట కేచాలకున్నందునసహోదరుఁడైనలియోపాల్డు ప్రభువుతినసొంతసొమ్ములోనుండికొంత యామెకుఁబంపుచు నప్పుడప్పుడు తనవద్దకుక్లేర్మస్టునగరమునకుఁగొనిపోయి యాదరించుచుబహువిధముల నామెను బిడ్డలనుగని పెట్టుచుండెను. ఇట్టిస్థితిలోనా మెయప్పులనెట్లుతీర్పఁ

గలుగును? యిట్లుండఁగా రాణిగారు తండ్రి కాలముచేసి లండన్ నగరమున నడుగిడిన దినముననే 1820వ సంవత్సరము జనేవరి నెల 29వ తేదిని నింగ్లండునకు రాజును రాణిగారి పితామహుఁడును నగు మూడవ జార్జి లోకాంతరగతుఁడగుట సంభవించెను. ఆపద లెప్పుడో కాని యొంటిగా రావు. ఒక యాపద వచ్చినప్పుడే యింకొక యాపదయుఁ దఱుచుగా వచ్చుచుండును. అప్పుడు రాణిగారి మొదటి పెదతండ్రి నాలవ జార్జియను పేర సింహాసనమునకు వచ్చి పదిసంవత్సరములు రాజ్యపాలనము చేసి 1830 వ సంవత్సరమునఁ గాలధర్మము నొందెను. రాణిగారి రెండవ పెదతండ్రి యయిన యార్కుప్రభు వన్నగారి రాజ్యకాలములోనే 1827 వ సంవత్సరమునందు మృతినొందినందున మూడవ పెదతండ్రియయిన క్లేరెన్సుప్రభువు నాలవ విల్లియమను పేర రాజ్యమునకు వచ్చి యేడేండ్లు ప్రభుత్వము చేసి 1837 వ సంవత్సరమునఁ బరలోకయాత్రకుఁ బోయెను. ఈతని కెడిలెయిడ్ రాణివలన నిద్దఱుబిడ్డలు కలిగిరి గాని వారు పసితనములోనే పరమపదము నొందిరి. మరణమునాటి కీతనికి జారజులే కాని యుత్తరాధికారులు కాఁదగిన యౌరసపుత్రులు లేనందున శ్రీ విక్టోరియా మహారాజ్ఞియే రాజ్యమునకు తదనంతరాధికారిణియయ్యెను. ఈ నాలవ విల్లియము వివాహము కాకముందు మిస్సెస్ జార్డన నెడి యొక యాటకత్తె నిరువదిసంవత్సరములకంటె నధిక కాలముంచుకొని దానివలనఁ బదుగురుబిడ్డలను గనెను. మఱఁదలిని పరామర్శ చేయవచ్చినప్పుడు తండ్రిని బోలియుండుటనుబట్టి రెండవ పెదతండ్రియయిన యార్కుప్రభువునుజూచి తనతండ్రియనుకొని శిశువై యున్న రాణిగారు చేతులు చాచుకొని యాతనిమీఁదఁ బడెను. అప్పటినుండియు నతఁడు తమ్ముని కూఁతునం దత్యంత ప్రేమముగలవాఁడయి యామెను పుత్రికావాత్సల్యముతో నాదరించుచుండెను.

తక్కిన బావలును మఱఁదులును మంచివారు కాకపోవుటచేత కెంటుప్రభ్వికిని వారికిని మొదటినుండియు సరిపడకుండెను. ఇట్లుండుటయే

రాణిగారి విద్యాబుద్ధుల కెంతో యనుకూలపడెను. రాజాస్థానమునందు వసించకపోవుటచేత రాజనందనుల కనివార్యముగా నుండెడి యతిభోగములును వైభవములును స్తోత్రపాఠకులతోడి సావాసమును రాజోపచారములును నామెకు మిక్కిలి దూరములయ్యెను. ఈమెయే రాణియగునన్న నిశ్చయముకూడఁ బ్రారంభదశలో లేకపోవుటయుఁ గొంత యనుకూలమయ్యెను. ఈచిన్నరాణిని పెంచుటలోను విద్యాబుద్ధులు చెప్పించుటలోను జనని మొదటినుండియు నెంతో శ్రద్ధవహించుచుండెను. ఈదేశములో ధనికులయినవారిబిడ్డలకు సాధారణముగా రెండవర్థములుండును. తల్లిదండ్రులు గారాబముచేత మధురాహారములు మొదలయినవానిని బిడ్డలడిగినవాని నెల్ల నిచ్చి తిననిత్తురు. అందుచేత ధనికులబిడ్డలెక్కడనో కాని యారోగ్యదశయందుండరు. అంతేకాక ధనికులు తమ బిడ్డలవిషయమునఁ దగినంత శ్రద్ధవహింపక వారిని నీచసేవకులవశమున విడిచిపెట్టి యూరకుందురు. అందుచేత బిడ్డలు వారితోడి చెడుసాహవాసముచేత చెడుమాటలను చెడునడతలను నేర్చుకొందురు. కెంటుప్రభ్వి తనకొమారితను సేవకులవశమునవిడిచి యూరకుండక యన్నపానాది విషయమునను చిఱుతిండివిషయమునను నడతవిషయమునను తానేయెంతో జాగరూకతతో విచారించుచుండెను. మూడేండ్ల ప్రాయమప్పుడు రాణిగారికిఁనొక గొప్పగండముతప్పినది. దాది యామెనొక్క గుఱ్ఱపుబండిలో నెక్కించుకొని నిర్మలవాయుసేవకయి విహారార్థముకొనిపోయినప్పుడు గుఱ్ఱము పరుగెత్తుచుండఁగా నొకకుక్క దాని కాళ్ళసందునకు వచ్చెను. అప్పుడు గుఱ్ఱము బెదరి గంతువేయఁగా బండిలోనున్న చిన్నది రెండుచక్రములనడుమను తలక్రిందుగాఁబడెను. ఆసమయమున దాపుననున్న సైనికుఁ డొకఁడు తొడగుకొన్న బట్ట పట్టుకొని చిన్నదానిని తక్షణమే పైకిలేవనెత్తఁబట్టిగాని లేకపోయినయెడలబండి చక్రము పిల్లదానిమీఁదినుండిపోయి ప్రాణాపాయము సంభవించి

యుండును. ఇంతకాల మింతశ్లాఘ్యముగా రాజ్యపాలనము చేయవల సినయోగ్యత యున్నప్పు డీశ్వరానుగ్రహమువలన నిట్టిగండములు గడచుట వింతకాదు.

శరీర సౌందర్య మెంతయున్నను మన స్సౌందర్యములేక దానికి శోభ కలుగదు. పుష్పమునకు సౌరభమువలె రూపమునకు వన్నెతెచ్చు నది విద్య. విద్యాకల్పలతకుముఖ్యఫలము సద్వర్తనము. ఈసత్యములను మనస్సునందుంచుకొని కెంటుప్రభ్వి సనకుమారికకు విద్యయందువలెనే సద్వర్తనమును కుదురుపఱుచుటయందునుదనశక్తినంతనుధారపోసెను. ఇతర బాలురవలెను బాలికలవలెను ప్రారంభదశలోమనరాణిగారును గొంత యలసభావమునునవిధేయతను గనఁబఱుచుచువచ్చిరికానిక్రమ శిక్షచేతఁగ్రమక్రమముగా నాగుణము లామెనువదలిపోయినవి. ఆమెకు విద్య చెప్పుటకై డాక్టరు డేవిస్‌దొరగారును, విద్యకు తోడు సంరక్షణ మునువిచారించుటకై బేరనెస్ లెహిజెన్ దొరసానిగారును, నియమింప బడిరి. ఈయిరువురును విద్య చెప్పుటయందునైపుణ్యమును నీతినిబోధిం చుటయందును వర్తనమునుదిద్దుటయందును బరమసామర్థ్యమునుగల వారయి యుండిరి. స్వభావముచేతను వారిశిక్షచేతను రాణిగారు పసి తనములోనేసత్యప్రియత్వముగలవారైరి. ఒకనాడు లెహిజెన్ దొరసాని గారు పాఠమును జెప్పుచుండఁగా దానియందుదృష్టియుంచక చిన్నరాణి కొంచె మవిధేయురాలయి యా యుపాధ్యాయినికి శ్రమ కలుగఁజేయు చుండెను. అప్పుడామెమాతయయిన కెంటుప్రభ్వియక్కడకువచ్చి "యీ బాలిక యెట్లుప్రవర్తించుచున్నది? " అని యుపాధ్యాయినడిగెను. "ఇంత కాలమున కొక్కసారి నేఁడీచిన్నదిదుడుకుతనముచూపుచున్నది" అని లెహిజెన్ దొరసానియుత్తరమిచ్చెను. ఆరాజపుత్రియామెమీఁదఁ జేయివేసి "కాదు. ఇది రెండవసారి నీవు మఱచిపోయినావా? " అని వెంటనే సత్యమును జెప్పెను.

మితవ్యయము చేయవలెననియు, అప్పులు చేయఁగూడదనియు తనయొద్దనున్నదానికంటె నెక్కువ మొత్తమున కరువుగా వస్తువులను కొనఁగూడదనియు, గురువు లామెకు బోధించి పసితనమునుండియుఁ దదనుసారముగా నడపించిరి. అందుచేత నాచిన్నది యంగడికిఁ బోయినప్పు డెన్నియోసారులు చేత సొమ్ము లేకపోవుటచేతఁ దాను మక్కువపడిన యాటవస్తువు లరువుగొనక మరలి రావలసినదయ్యెను. ఒకసారి యంగడికిఁ బోయినప్పు డొక్క యాటవస్తువును గొనవలెనని యెంతో యాశపడియుఁ జేత సొమ్ము లేనందునఁ గొనక, "నాచేతికి సొమ్ము రాఁగా నేవచ్చికొనెదను. అంతవఱకునుసీవీవస్తువునునానిమిత్తము వేఱుగా నుంచిపెట్టుము" అని యంగడివానిని బ్రార్థించి యొడఁబఱిచి పోయి, సొమ్మందిన నాఁడు ప్రాతఃకాలముననే యంగడి తెఱచునప్పటి కల్లను గుఱ్ఱము నెక్కియక్కడకుఁబోయి వెలయిచ్చి యావస్తువునుగొని తెచ్చుకొనెనట. కొంతకాలము 3 నెలలకొకసారి యింతయనియు కొంతకాలము నెలకొకసారియింతయనియు కొంత సొమ్మామెకుమనసువచ్చినట్లు వెచ్చపెట్టుకొనుటకయి యియ్యఁబడుచుండెను. ఇట్టిస్థితిలోనింకొకసారి యామెతనయుపాధ్యాయితోడఁగూడి యంగడికిఁబోయితనచెలుల కిచ్చునిమిత్త మాటవస్తువులను గొన్నప్పుడామె యొక చెలికత్తె మాట మఱచిపోయి తరువాతస్మరణకురాఁగా రూపాయి నాలుగణాలు వెల వేసియున్న యొక పెట్టెనుగొనఁగోరెను. అంగడివాండ్రాపెట్టెనుతక్కిన వస్తువులతోడఁ గూడఁజేర్చి కట్టఁబోవుచుండిరి. ఉపాధ్యాయి వారిని వారించి "యాపెట్టెనుదీసివేయుఁడు. దానిని గొనుటకిప్పుడీరాచకొమార్తెవద్ద సొమ్ములేదు" అని చెప్పి యాపెట్టెను దీసివేయించెను. చేతికి సొమ్ము వచ్చినతరువాత రాణి మరల నంగడికివచ్చి యాపెట్టెను గొనిపోయి తన చెలికత్తెకుబహుమానముచేసెను. ఇటువంటికథలనేకములున్నను, ఇంకొకదానినిమాత్రమే యిందు వివరించెదను. రాణి స్వభావ

ముచేతనే మిక్కిలిదయారసముగలది. ఆపైని బీదలు మొదలైనవారియెడల దయచూపుటయవశ్యకృత్య మని తల్లియు గురువులునుగూడనామెకు మొదటినుండియు నుపదేశించుచువచ్చిరి.

రాణిగారికి శైశవమునందు బొమ్మలయందాసక్తి యెక్కువ. ఒక నాఁడామె తల్లితో బండిలోఁ బోవుచుండఁగా నొకయంగడిలోనికిటికిలో సుందరమయిన బొమ్మయొకటి కనఁబడెను. అప్పుడాచిన్నది తల్లి నిజూచి "అమ్మా! దానిని నాకుఁ గొనిపెట్టవా?" అనియడిగెను. "ఈ నెలలో నీకిచ్చినసొమ్మంతయు నీవీవఱకే కర్చు పెట్టుకొన్నావు. ఇఁకఁబదుముదినములకుఁగాని నీకు పై నెల సొమ్ముర్రాదు." అనితల్లి యుత్తరము చెప్పెను. అప్పుడాచిన్నది మొగము చిన్నపుచ్చుకొని క్షణకాలమాలోచించితల్లి వంకఁజూచి "అమ్మా! నేనుబోయి యంగడివాండ్రాబొమ్మనుపదునైదు దినములు నానిమిత్తము నిలిపియుంచుదురేమో యడిగిరావచ్చునా?" అని మరల నడిగెను. తల్లి క్షణకాల మాలోచించి "నీవాపని చేయవచ్చును" అని పలికెను. అంతట నామె బండిదిగి యంగడికిఁ బోయి యడుగఁగా, వాండ్రాచిన్నదియెవ్వరోయెఱిఁగినవారయినందునమాసాంతమువఱకును బొమ్మ నితరులకు విక్రయింపక నిలిపియుంచుట కొప్పుకొనిరి. వెంటనే యాబాలిక సంతోషముతో మరలివచ్చి బండియెక్కి తల్లితో నింటికిఁబోయెను. గడవ పదునేను దినములునుగడచిపోయెను. నూతన మాసారంభమునబాలిక యారుషిల్లింగులను జేతఁబట్టుకొని తిన్నఁగా నంగడికిబోయి బొమ్మను గొని తెచ్చుకొని మెట్లుదిగఁబోవుచుండఁగావీధిలో నెదుటశుష్కించియతిదీనదశలోనున్న యొకమనుష్యరూప మామెకంటఁబడెను. మందభాగ్యుఁడయిన యాపురుషుఁడేమో వేఁడఁబోవునట్లా బాలికవంక దృష్టిపఱపి పెదవులు వడఁక నాలుకతడఁబడ మాటరాక నిలిచియుండెను. ఆ కన్నెరాణి పోక నిలిచి "నాతో నేమైన మాటాడఁ గోరెదవా!" అని వాని నడిగెను. "నేనాఁకలిగొని

యున్నాను. ఆఁకలి బాధ దుస్సహము కాని యెడల నేను సాయమడిగి
యుండను." అని వాఁడు చెప్పెను. "నాచేతిలో సొమ్ము లేకపోయినం
దునకు విచారముగా నున్నది. సొమ్మున్న యెడల"—అనుచుండగా వాఁడు
"అమ్మా! నమస్కారము" అని పలికి రూపొందిన క్షామదేవత వలెఁ దన
దారిని మరలెను. అప్పు డామె మనస్సు కరఁగినదై "ఒక నిమిషము
నిలువుము" అని కన్నుల నీరు గ్రమ్మ గద్గదస్వరముతోఁ బలికి, మరల
నంగడిలోనికి నడిచి "ఈ బొమ్మను మరలఁ దీసికొని మఱి నాలుగు దినములు
నానిమిత్త ముంచఁగలవా?" అని యంగడివాని నడిగెను. "అట్లే యుంచెదను
సొమ్ము మరల నిచ్చి వేయవలెనా?" అని వాఁ డడిగెను. "దయచేసి యిమ్ము"
అని పలికి యామె యా సొమ్ము పుచ్చుకొని వేగముగా వీథిలోనికి వచ్చి యం
తయు నాబీదవాని చేతిలో వేసెను. వాఁ డద్భుతపడి తన కృతజ్ఞతను దెలు
పుటకు నోట మాట రాక పిడుగడఁచిన వానివలె నిలువఁబడెను. వాఁడు
తన జన్మమధ్యమున నంత సొమ్మొక్కసారిగాఁ దన చేతిలోఁ జూచినవాఁడు
కానందున వాని పాలిటికా 3 రూపాయల సొమ్ము పెన్నిధిగా నుండెను.
అంతట వాఁడు తన సంతోషమును దెలుపుచుఁ బెదవులు తెఱవఁబడ నేమో
యనఁబోవుచుండఁగా "శీఘ్రముగాఁ బోయి యేమైనను గొని తినుము" అని
యాచిన్నది త్వరపెట్టెను. ఎంతో కష్టముమీఁద మాట తెచ్చుకొని వాఁడు
"అమ్మాయీ! అట్లే చేసెదను. దేవుఁడు నీకు శుభములు ప్రసాదించును
గాక దేవుఁడు నిన్ను మహారాజ్ఞినిగాఁ జేసినను నీ యోగ్యతకది యెక్కు
నది కాదు—" అని గొణుగుచుండఁగానే యా బాలిక యిఁక నక్కడ నిలు
వక వెడలిపోయెను. ఇంటికిఁ బోయి తల్లితో జరగిన కథ చెప్పుచుండినప్పు
డామె యేమియు మాఱుపలుకక కొమారితవంక గంభీరముగాఁ జూచుచు
వినుచుండెను. అది చూచి కుమారిత తల్లివంకఁ జూచి "అమ్మా! అంత
సొమ్మును వానికిచ్చుట మంచిపని కాదా?" అని యడిగెను. "అమ్మాయీ!
నీవు చేసినది మంచిపనియే నీ యంతరాత్మ బోధించిన మార్గమున నడు

చుచు వచ్చినపక్షమున నీవెప్పుడోగాని తప్పుదారి పట్టవు. రాజవంశమునఁబుట్టినవారెప్పుడును రాజవర్తనముచూపవలెను.'' అని తల్లిపలికెను. ''అమ్మా నేనువచ్చుచున్నప్పుడా బీదవాఁడు దేవుడునన్ను రాణినిగాఁ జేసినపక్షమున నాయోగ్యత కది యెక్కువదికాదని నాతో నన్నాఁడు. నీకేమని తోఁచుచున్నది?'' అనికుమారికమరలజనని నడిగెను. అప్పుడు తల్లి కొమారితను జేరఁదీసి కౌఁగిలించుకొని ''ఓ ప్రియకుమారీ! అది యేమోవింతమాటగానున్నది. నీవెప్పుడైన రాణివయ్యెదుపక్షమున, నీవు మిక్కిలి మంచిదానవు కావలెనుసుమా.'' అనివీఁపుతట్టుచుఁ బలికెను. ''రాణినైనను గాకపోయినను గూడ నేను సర్వదా మంచిదాననగుటకుఁ బ్రయత్నించెదను. నేనురాణినగుట సంభవనీయమగునా?'' అనియా చిన్నదిమరలఁబలికెను. ''కాదని నేను జెప్పఁజాలనుగాని యింత చిన్నతనములోనీతోనట్టివిషయముముచ్చటించుట నాకిష్టములేదు. నీవింగ్లండునకొకవేళ రాణివగుటయే సంభవించెడుపక్షమున, కష్టకాలమునందునీవలని యాదరమును సహాయమును నపేక్షించువారిబీదవానివంటివార నేకులుందురు.'' అని పలికి తల్లి యాప్రసంగము నంతటితోఁ జాలించెను.

కెంటుప్రభ్వీగారు తనకొమారితను బెంచుటలో ముఖ్యముగాఁ బాటించుచువచ్చినవి మూఁడంశములు—అనారోగ్యకరములయిన భోగపదార్థములను బెట్టకుండుట, సమస్తకార్యములకును గాలనియమమేర్పఱచుట, ఎప్పుడును చిత్తోద్రేకము కలుగనీయకుండుట. రాణిగారిభోజనాదికములకును విద్యాభ్యాసమునకునుసమస్తేతర కార్యములకును బ్రతిదినమును సరియైనవేళ లేర్పఱుపఁబడెను. కాల్యకృత్యములుతీఱిన వెనుక కెంటు ప్రభ్వీగారు వేసవికాలములో ప్రాతఃకాలమున నెనిమిదిగంటలవేళ ప్రథమభోజనము చేయుచుండిరి. అప్పుడే యామెప్రక్క నొకచిన్నబల్ల వేయఁబడి దానిమీఁద రాణిగారికి రొట్టెయు పాలును ఫలములును బెట్టఁబడుచుండును. అదిశీతలదేశమగుటచేత నచ్చటివారుకొంత ప్రొద్దెక్కిన

తరువాతనే పడకనుండి లేతురు. ప్రాతఃకాలభోజనమయినపిమ్మటతల్లి యును కూఁతురును కాలినడకనుగాని బండిమీఁదగాని యొకగంటసేపు విహారము వెడలివత్తురు. పదిగంటలు మొదలుకొని పండ్రెండు గంటల వఱకును చదువుకొన్నతరువాతఁ గూఁతురు గదిలో నీడను గంతులు వేయుచఁగాని బొమ్మలు ముందుపెట్టుకొనికూరుచుండిగానియాడుకొనును మధ్యాహ్నము రెండుగంటలవేళ తల్లి లఘ్వాహారమును గైకొనునప్పు డాచిన్నది యామెచెంతఁ గూరుచుండిభోజనముచేయును. మధ్యాహ్న భోజనము కాఁగానే మరల నాలుగుగంటలవఱకు నుపాధ్యాయునివద్దఁ బాఠములు నేర్చుకొనవలెను. అటుతరువాతమిత్రబృందమును సందర్శించుటకుఁగాని విహారార్థముగాఁగాని తల్లిబిడ్డలు బండిమీఁదఁ బోవుట యాచారము. ఈ దేశమునందువలెగాక యింగ్లాండుదేశమునందు స్త్రీలును పురుషులవలెనే స్వతంత్రముగాఁ దమ మిత్రులవద్దకుఁబోయి సంభాషించివచ్చుచుఁ గొంతవఱకు యథేచ్ఛముగాసంచరింతురు. ఎంతగొప్ప యింటిస్త్రీలును మనదేశమునం దిప్పుడు జరగుచున్నట్లుగా వీధి మొగ మెఱుఁగక యంతఃపురములలో మూలమూసి పెట్టబడియుండరు. యూరపుఖండమునందువలెనేయున్నతదశయందుండిన పూర్వకాలమునం దీ దేశమునందును సుందరులు తమభర్తలతోఁ గలిసి సభలకువచ్చుచు రాణివాసములేక యథేష్టవిహారములు సలుపుచుండిరి. సీత రామునితోడఁ గూడి సభలోనికివచ్చి బహిరంగముగాసింహాసనముమీఁదఁ గూరుచుండుచువచ్చుట, చంద్రమతి మొదలగుసతులు పతులతోఁగలిసి వేఁటలకుఁ బోవుట, సత్యభామలోనగువారుపతులవెంట యుద్ధరంగములకరుగుట మొదలయిన విషయములను పురాణాదులం దెల్లవారును జదివియు వినియు నుందురు. యూరపుఖండమునందలిస్త్రీ లన్యోన్యసాంగత్యము వలనను, పరస్పరసల్లాపములవలనను, బయలమంచిగాలిలోవిహరించుట వలనను మనయిప్పటిస్త్రీలకంటె నధిక ప్రజ్ఞావతులు గాను, అధిక

వాక్ప్రౌఢిమగలవారుగాను, అధికారోగ్యవతులుగాను, ఉందురు. అందుచేత వారిబిడ్డలు సహిత మధికారోగ్యవంతులయి చిరకాలజీవు లగుచున్నారు. విఃత్రదర్శనార్థమయి పోయినతల్లితోఁ దిరిగివచ్చినతరువాత గొంతసేపు రాణిగారొంటిగాఁబుష్పవనమునందు విహరించుటయో యాశ్వారోహణముచేసి స్వారివెడలుటయో వాడుకగానుండెను. చిన్ననీళ్ళ బిందెను చేతఁబట్టుకొని పూలచెట్లనుదడుపుచు నుద్యానవనవిహారము చేయుటయందుఁ జిన్నతనములో రాణిగారికధికాసక్తి. ఆమెయాకాలమునందు ధరించుకొను వస్త్రములు విలువగలవి కాకపోయినను శుచియయి యారోగ్యయోగ్యము లయినవిగా నుండును; భుజించెడియాహారమును సామాన్యమయి యారోగ్యప్రదమయినదిగా నుండును. రాణి రాత్రి తల్లి భోజనముచేయునప్పు డామెప్రక్కనే వేయఁబడిన వేఱు బల్లమీఁదఁ దానును భోజనము చేయుచుండును. సాయంకాలభోజనమైనతరువాతఁ గొంతసేపు దాదితోనాడుకొనివచ్చి, తల్లితోనుమిత్రులతోను జేరి సంభాషించుచు, ఆమెరాత్రి తొమ్మిదిగంటలుకాఁగానేతల్లి మంచముప్రక్కను వేయఁబడియుండు పాన్పునకు శయనింపఁబోవును. ఈప్రకారముగా నాచిన్నది తల్లివద్దనైననుపాలకురాలునునుపాధ్యాయియు నయిన బారనెస్ లెహ్జన్ దొరసానివద్దనైనను సదా కాలము గడపుచుండును.

ఆమెకయిదుసంవత్సరములప్రాయమువచ్చినప్పుడు పార్లమెంటు సభవా రామె విద్యనిమిత్తమయిసంవత్సరమునకాఱువేలపౌనులనఁగా నఱువదివేలరూపాయి లిచ్చున ట్లేర్పఱిచిరి. ఆమె సూక్ష్మబుద్ధియు నభిరుచియుఁ గలదయి యల్పకాలములోనే యనేకవిద్యలు నేర్చుకొనెను. డాక్టరు డేవిస్ దొరగారామెకు తప్పక ప్రతిదినమునుమతబోధచేయుచు బైబిలును జదివించుచుండిరి. కొంతకాలములోనామెకులాటిన్ భాషలో మంచిపాండిత్యము కుదిరెను. ఇక్కడి దేశభాషలకు సంస్కృతమెట్టిదో

యక్కడి దేశభాషలకు లాటినట్టిదయి మాతృభాషగాఁ బరిగణింపఁబడు చుండును. గణితశాస్త్రము మిక్కిలి కఠినమయినను దానియందామె మంచిసామర్థ్యము కలదయ్యెను; స్వదేశచరిత్రమును, ధర్మశాస్త్రములను, స్వభాషాసాహిత్యగ్రంథములను బాగుగఁ జదివెను; సంగీతమునందును చిత్రలేఖనమునందును ధనుర్విద్యయందును సమానకౌశలము గలదయ్యెను; కుట్టుపనిలోఁ బ్రవీణురాలయ్యెను; నాట్యవిద్యయందును నిపుణురాలయ్యెను. ఆమె యనేకప్రకృతిశాస్త్రముల నభ్యసించినను వానిలోనెల్ల వృక్షశాస్త్రమామెకభిమానవిద్య. ఆమెకిటాలియాభాషలోను గ్రీకుభాషలోను గొంత ప్రవేశముకలదుగాని ఫ్రెంచిభాషలోను జర్మనీభాషలోనుమాత్రముధారాళముగామాటాడుశక్తి కలిగెను. ఆమె విద్యాభ్యాస మారంభించినయాఱుసంవత్సరములలోనిన్ని విషయములు



పదియవ సంవత్సరమున విక్టోరియారాణి.

నేర్చుకొనెను. ఈమె ప్రతిదినమును జేసెడు విద్యాభివృద్ధిని దినచర్య వ్రాసి బారనెస్ లెహిజన్ దొరసానిగారు నెలకొకపర్యాయము రాణిగారి మేనమామయగు లియోపాల్డుప్రభువుగారికిఁబంపుచుండిరి. లియో

పాల్డు ప్రభువుగారు తన మేనకోడలివిద్యాభివృద్ధినిగూర్చి తలుచుగా విమర్శించుచు నాలోచన చెప్పుచుండుటయే కాక స్వదేశమునందుఁదన యన్నకొమారుఁడయిన యాల్బర్టుప్రభువుయొక్క విద్యాబుద్ధులవిషయమునను నిరంతర శ్రద్ధవహించి కృషి చేయుచుండెను. శాక్సికోబర్గుప్రభువుయొక్క ద్వితీయపుత్త్రుఁడయిన యీయాల్బర్టురాజకుమారుఁడు 1819 వ సంవత్సరము ఆగష్టునెల 26వ తేదినఁగా రాణిగారు పుట్టిన మూడు నెలలకు జననమొందెను. తన యన్నకొమారుఁడయినయాల్బర్టును మేనకోడలయిన విక్టోరియా రాజపుత్త్రియు రూపగుణవిద్యాదులచేతనొండొరులకుఁ దగినవారని భావించి యేలాగునైన వారిదాంపత్యము నొడఁగూర్పవలయునని లియోపాల్డుప్రభువు మొదటినుండియు నెదలోఁదలఁచి యుండెను. ఈదాంపత్యమునకు రాణిగారి పెదతండ్రులు ప్రతికూలురుగా నుండినను భవగదనుగ్రహమువలన గడపట లియోపాల్డుప్రభువుయొక్క యభీష్టమే సిద్ధిపొందినది. ఈబాలరాజ్ఞివలెనే యామెభవిష్యద్భర్తయువిద్యలయందేగాక సుగుణజాలమునందును సంపన్నుఁడై యుండెను. ఎన్నివిద్యలలోఁ బాండిత్యము సంపాదించినను పాండిత్యానుగుణమైన వర్తనము లేకపోయినచో విద్యసఫలము కాదు. సద్వర్తనముతోడఁగూడినదే నిజమయినవిద్య. వల్లనవేసి చదివి శాస్త్రపరీక్షలయందుఁగృతార్థుఁడయినను దానికిఁ దగినసద్వర్తనము లేకపోయినచో నట్టిపండితబ్రువుఁడు విద్వాంసనామమున కర్హుఁడు గాక కేవలవిద్యాభారవాహియగును. విద్యాగర్వమునుబరవంచనకౌశలమును మిథ్యావాదనమును గూడఁగలవాఁడయినచో నట్టివాఁడు సాక్షరరాక్షసుఁడనఁజనును. విద్య కుక్షిని బట్టినచో మనుని దేవసమానునిగాఁ జేయవలెనుగదా:

తండ్రియు తాతయు మరణము నొందినప్పు డజ్ఞానదశయగుటచేత విక్టోరియారాజపుత్రి వారికయి దుఃఖపడుట యెఱుఁగదు. ఆమెకుఁ గొంచెముజ్ఞానమువచ్చినతరువాత 1827వ సంవత్సరమునందు రెండవ

పెదతండ్రియైన యార్కుప్రభువు కాలముచేసినప్పుడు మొట్టమొదట దుఃఖ మాచిన్నదానిమనస్సున నాటుకొనెను. అప్పటి కామె కెనిమిదవ యేఁడు. రాజకుటుంబములో నెల్లనుబురుషులలో రెండవపెదతండ్రియైన యీయార్కుప్రభువును స్త్రీలలో మూఁడవపెదతల్లియుఁ దరువాత రాణియునైన యెడిలెయిడ్ ప్రభ్వియు నిద్దఱునుమాత్రమాచిన్నదాని యందత్యంతప్రేమము గలవారయి యుండిరి. ఈచిన్నరాణి ప్రతిదినమును తోఁటలోనికిఁబోయి పుష్పములుకోసి బంతిగాఁగట్టితీసికొనివచ్చి యీపెదతండ్రి కిచ్చుచుండును. నాఁటిదిన మాబాలిక తెచ్చి యిచ్చిన పూలబంతి యవసాన సమయమునం దాతని కెంతోసంతోషము కలిగించెను. పెదతండ్రి మరణమువలనఁ దానుసింహాసనమునకొక మెట్టుచేరువ యగుచున్నానన్నసంగతి యప్పుడాచిన్నదానికిఁ దెలియదు. ఇంగ్లాండునకు రాణి గాఁదగినసూచన లున్నవని తెలిసినచో గర్వముకలుగునేమో యని తల్లి మొదలయినవా రాచిన్నదాని కెంతమాత్రమును దెలియనీయక దాఁచిరి. ఎడిలెయిడ్ రాణియుఁదనపుత్రిక లిద్దఱును శైశవముననే మృతినొందినప్పుడు తనబిడ్డలమీఁదిప్రేమమునంతను దనమఱఁది కూఁతురయినవిక్టోరియా రాజపుత్రిమీఁదికి మరలించెను. రాణికిఁ దగిన యటువంటిసత్స్వభావముకలదికాకయుండినపక్షమున ఎడిలెయిడ్ ప్రభ్వి రాజ్యమునకు రాఁదగినతనబిడ్డలు పోయి రాజ్యముపరులపాలుకాఁదగిన గతి పట్టినప్పుడు మఱఁదికొమారితయం దామెయసూయచూపియుండును. ఆయిల్లా లట్టియసూయ చూపకపోవుటయేకాక తనరెండవకూఁతురు కాలముచేసినప్పుడు "నాబిడ్డలుమృతులయిరి; నీబిడ్డబ్రతికియున్నది. మనయిద్దఱికి నదియేబిడ్డ" అని తోడికోడలి కుత్తరము వ్రాసెను. ఈరెండుమూఁడు చిన్నవాక్యములే యామెయోగ్యతను బూర్ణముగాఁ దెలుపుచున్నవి. తన భర్తనాలవ విల్లియమ్మను పేర రాజ్యమునకువచ్చి తాను రాణియైనతరువాత 1831వ సంవత్సరమున రాజప్రస్థానోత్స

వమునగరిముందఱనుండి పోవుచుండినప్పు డెడిలెయిడ్ రాజ్ఞి తనమఱంది కొమారితనుముందుంచుకొనిగవాక్షములోనుండి చూచుచుండెను. అప్పు డాయుత్సవముతోఁ బోవుప్రజలు రాణినిజూచి యభినందింపసాఁగఁగా నామె తనమాటను మఱచి తనవద్దనున్న చిన్నరాణినిబయికెత్తి గవాక్షములో నెక్కించి సంతోషభరితులయి యున్నప్రజలకుఁ జూపెను. ఈప్రకారముగానే యనేకపర్యాయము లెడిలెయిడ్ రాజ్ఞి యా చిన్న దానియెడలఁ దనయుదారభావమును బుత్రికావాత్సల్యమును జూపుచు వచ్చెను.

1830 వ సంవత్సరమునందు నాలవ విల్లియమ్ రాజయినతరు వాత నాతఁడు వృద్ధుఁడగుటచేత సంతానహీనుఁడయి మృతినొందుట సంభవించినపక్షమున రాజ్యభారమును వహించుటకు విక్టోరియారాజ పుత్రికి యుక్తవయస్సువచ్చువఱకును బ్రతినిధి నేర్పఱచుటకయి పార్ల మెంటు మహాసభలో నిర్ధారణీయశాసన మొకటి తేఁబడెను. అట్టిసమ యమునందు స్వస్థితిని ముందుగా నాచిన్నరాణికిఁగొంత తెలుపుటయుచి తమని తల్లి మొదలయినవారు తలఁచిరి. ఆచిన్నదాని కప్పటికిఁ బండ్రెం డవయేడువచ్చినది. ఆమెకీవిషయమును దెలిపినక్రమమునుగూర్చి రెండు కథలు చెప్పఁబడుచున్నవి. అందొకటి యంతగా విశ్వాసార్హమయినది కానందున నిశ్చయముగా సత్యమని తెలిసిన దానిని మాత్రమే యిం దుదాహరించు చున్నాను.

తల్లితో నాలోచించి యామె యనుమతిమీఁద నుపాధ్యాయి యైన బారనెస్ లెహింజర్ దొరసాని రాజకుటుంబముయొక్క యప్పటి వంశవృక్షము నొకకాగితముమీఁద వ్రాసి దానిని రాజపుత్రిచదివెడు చరిత్రగ్రంథములోఁబెట్టెను. ఆచిన్నది వాడుకప్రకారముగాఁ చదువు కొనుట కాపుస్తకమును దెఱచియందున్న కాగితమునుజూచిచదువుకొని "యిది నేనివఱ కెన్నఁడును జూచియుండలేదే!" అనిపలికెను. "రాజ



పండ్రెండేండ్లప్రాయమున విక్టోరియా రాజ్ఞి.

పుత్రీ! ఇదినీవివఱకుఁ జూచుట యావశ్యకమని తలఁపఁబడలేదు.'' అని లెహిజన్ దొరసానియుత్తరము చెప్పెను. ''నేననుకొన్నదానికంటెసింహాసనమునకు నేనుసమీపస్థురాలనయినట్టుదీనివలనఁగనఁబడుచున్నది'' అని యాచిన్నదనెను. ''అమ్మా! అవును. అట్లేయున్నావు'' అనియుపాధ్యాయి పలికెను. అంతట రాజకుమారికకొంతసేపాలోచించి ''చిన్నవారనేకులు గర్వపడవచ్చునుగాని వారుకష్టము నెఱుఁగరు. ఇందు వైభవమువిశేషముగా నుండునుగాని యుత్తరవాదిత్వభార మంతకంటె నధికముగా నుండును'' అని పలుకుచు కుడిచేయియొక్క చూపుడువ్రేలినిపయి కెత్తి

'నేను మంచిదాననుగా నుండెదను. లాటిన్ భాషను సహితము చదువుమని నీవునన్నంతప్రోత్సాహ మేలచేయుచుంటివో యిప్పుడు గ్రహించినాను.'' అనియామెచేతిలోఁజేయినైచి ''నేనుమంచిదాననుగానుండెద''నని మరలఁబలికెను. 'నీపెదతల్లిమెడిలెయిడ్ రాణి యింకనువయసుచెల్లినదికాదు. ఆమెకు సంతానముకలుగవచ్చును. అప్పుడు విల్లియమ్‌రాజుగారిబిడ్డలయినందున జనకునియనంతరమున రాజ్యమునకు వారువత్తురుగాని నీవురావు', అనిలెహిజన్ దొరసాని చెప్పెను. విక్టోరియారాజపుత్రి వెంటనే ''అట్లయినపక్షమున నేనెప్పుడును జింతనొందను. నాపెద్దతల్లి మెడిలెయిడ్ రాణికినాయందుఁగలప్రేమనుబట్టి యామెకుబిడ్డలన్న నెంతయిష్టమో నేనెఱుఁగుదును.'' అనియుత్తరము చెప్పెను. ఈవిషయములను స్మరణకుఁ దెచ్చుచు బారలెస్ లెహిజన్ దొరసానియే రాణిగారికి 1867 వ సంవత్సరాంతమున వ్రాసియుండుటచేతను, రాణిగారే యీయుత్తరమును బహిరంగపఱిచి యుండుటచేతను, ఈకథ వాస్తవమైనదనుటకు లేశమాత్రమునుసందేహములేదు. తరువాతఁగొన్నిమాసములకు సిర్ధారణీయ శాసనము స్థిరపడి శాసనమైనపిమ్మట పార్లమెంటు సభవారు విక్టోరియా రాచకొమారితయొక్కవిద్యనిమిత్తమును పోషణము నిమిత్తమును గౌరవనిమిత్తమును సంవత్సరమునకు మఱి పది వేలపౌను లిచ్చున ట్లేర్పాటుచేసిరి.

1832 వ సంవత్సరమునందు కెంటు ప్రభ్వీగారు తన కొమారితకు దేశమునందలిముఖ్యవాణిజ్యస్థానములనుకర్మనిలయములను ప్రసిద్ధస్థలములను జూపుట యుక్తమనిభావించి కొమార్తెను వెంటఁబెట్టుకొని యింగ్లాండు దేశములోను వేల్సు దేశములోను యాత్రచేసెను. ప్రజలు వారుపోయినస్థలములలో నెల్లనువారి నెదుర్కొని [illegible] నందనపత్రికలను జదివి తమ యానందమును వెల్లడిపఱ [illegible] సంవత్సరమునందుతల్లియుకూఁతురును వైటుద్వీపమునకుఁబోయి [illegible]

గొంతకాలముండిరి. అక్కడనున్నకాలములో నోడనెక్కి తూర్పుతీర మును జూచిమరలవైటుద్వీపమునకుఁబోవుచున్నప్పుడు రాణిగారికింకొక గండముతప్పెను. ఓడపోవుచుండఁగాగాలిచేత తెరచాపకొయ్యయొరిగి పెళపెళలాడఁ జొచ్చెను. కర్ణధారుఁడయిన సాండర్సుదొరయదికనిపెట్టి మెఱుముమెఱసినట్లు మనోవేగమునఁ బైకురికి రాణిగారినెత్తుకొని సుర క్షితమయిన స్థానమునకుఁ జేర్చెను. ఆయుత్తర క్షణముననేకొయ్యపె ళ్లున విఱిగి యంతకుముందు రాణికూరుచుండినచోటనే సరిగా పడెను. కర్ణధారుఁడట్లామె నాస్థలమునుండితప్పించుటలోక్షణకాలము జాగుచేసి యుండినయెడల నారాజపుత్రి నలిగిపోయియుండును. ఆసమయమునం దాచిన్నది శాంతతతోనేయుండెనుగానితనకు సంభవింపనుండిన యుప ద్రవము స్పష్టపడినతరువాత బారున నేడ్చి తన ప్రాణసంరక్షకుఁడయిన యాకర్ణధారునికిఁ గృతజ్ఞతాభిసూచకవందనము లర్పించెను. ఆమెరా జ్యమునకు వచ్చినతరువాతనాకర్ణధారునికి గొప్పయుద్యోగమునిచ్చుట యే కాక, వానిని దనయాస్థానమునకు బిలిపించియాదరించి వానిమర ణానంతరమున వానిభార్యకును బిడ్డలకును జీవనాధారమునేర్పఱిచెను.

1836 వ సంవత్సరము మెయినెలలో. రాణిగారి పెద్ద మేన మామయగు కోబర్గుప్రభువును, ఆయనపుత్రులయిన యెర్నెస్టు ప్రభు వును ఆల్బర్టుప్రభువును వచ్చి కెన్సింగ్టన్ నగరములో కెంటుప్రభ్వియొద్ద నాలుగువారములవఱకునుండిరి. రాణిగారి భవిష్యద్భర్తయైనయాల్బర్టు రాజపుత్రునకును విక్టోరియా రాజపుత్రికిని నిదియే ప్రథమదర్శనము. రాజబంధువు లిచ్చటఁ గొంతకాలముండి రాజుచేతనాతిథేయసత్కార ముల నంది యింగ్లండు దేశములోని దర్శనీయములైన ముఖ్యస్థలముల నెల్లఁజూచిస్వదేశమునకుఁబోయిరి. వీరిక్కడనున్నకాలములోనేమనభవి ష్యద్రాజ్ఞికిని తద్భవిష్యద్భర్తకును మనస్సులలోనొండొరులమీఁదనను రాగలతాబీజ మంకురించి చిగురుపెట్టనారంభించెను. ఇరువురునువిద్యా

వయోరూపగుణములచేత నొండొరులకుఁ దగియుండిరి. విక్టోరియారాజపుత్రి సౌందర్యరాశి కాకపోయినను జక్కనివారిలోఁ బరిగణింపఁబడదగి విశాలములైన కాటుకకన్నులతోను నవ్వుమొగముతోను నేత్రానందకరముగానుండెనని యాకాలమునందామెను జూచినవారందఱును జెప్పుచున్నారు. ఆమె కొంత పొట్టిదయినందునఁ బెద్ద పెరిగినతరువాతసహితమయిదడుగుల రెండంగుళములపొడవే యుండెను.

1837 వ సంవత్సరము మెయినెల 24 వ తేదీతో నామెకుఁ బదునెనిమిదేండ్లు నిండియుక్తవయస్సువచ్చెను. ఈపుట్టినదినమునగొప్ప పండుగ జరిగెను. నాఁడు లండన్ నగరమునందలిసమస్తకార్యస్థానములును పార్లమెంటుసభయు మూయఁబడి యందఱికిని సెలవియ్యబడెను. దొరతనమువారి వ్యయముతో గొప్పవిందు చేయఁబడెను. ఈపందొమ్మిదవ జన్మదినోత్సవమున మనభవిష్యద్రాజ్ఞికిఁ బంపఁబడిన కానుకలకు లెక్కలేదు. రాణిగారి పెదతండ్రియు నింగ్లండురాజునయిన నాలవవిల్లియముగారు తనతమ్మునితనయ కాదినమున రెండువేలరూపాయలు వెల చేయు సంగీతపేటికను (పియానాను) బహుమానముగాఁ బంపిరి.

# రెండవ ప్రకరణము

## సంసారదశ.

1837 వ సంవత్సరము మెయి నెల24 వ తేదీతో పదునెనిమిది సంవత్సరములు నిండినందున, విక్టోరియా రాణిగారికి బాల్యదశపోయి ప్రాజ్ఞతవచ్చి యా దేశశాసనానుసారముగా వ్యవహారయోగ్యత కలిగె నని యింతకుముందే చెప్పఁబడెను. ఇట్లామెకు వ్యవహారార్హతకలిగిన నెలదినములలోపలనె 1837 వ సంవత్సరము జూన్ నెల 20 వ తేదీని రాణిగారి పెదతండ్రియు రాజ్యపాలకుఁడునయిననాలవవిల్లియములోకాంతరగతుఁడగుట సంభవించెను. అందుచేతఁ బదునెనిమిదిసంవత్సరముల పిన్నవయసుననే రాణిగారు రాజ్యభారమునువహింపవలసినవారయిరి. ఆమె రాజ్యభార నిర్వహణవిషయము నింకొక ప్రకరణమునకుఁ విడిచి పెట్టి ముందుగా సంసారభార నిర్వహణమునుగూర్చియిప్పుడుప్రస్తావింతము. రాణిగారి పెద్దమేనమామకుమారుఁడునుభవిష్యద్భర్తయునైన యాల్బర్టుప్రభువు 1836 వ సంవత్సరమునందింగ్లండునకు వచ్చినకథయుఁ గొంత చెప్పఁబడెను. అప్పుడామేనత్తమేనమామబిడ్డలహృదయములలో ననురాగలతాబీజ మంకురించి తల చూపినను జక్కఁగాఁ బల్లవించి కొనలుసాగలేదు. ఇట్లుండఁగా విక్టోరియారాజపుత్రి సింహాసనమెక్కఁగానే యామె నభినందించుచు నామె యనుఁగుమఱఁదియైనయాల్బర్టుప్రభువు స్వదేశమునందుండి యిట్లువ్రాసియున్నాఁడు—

"ఓ ప్రియురాలా! నీజీవనదశయందిప్పుడుసంభవించిన మహోన్నతస్థితికిహృదయపూర్వకముగానభినందించుచుఁ గొన్నిపంక్తులు వ్రాయవలసియున్నది. యూరపుఖండములోనెల్ల బలిష్ఠమైన దేశమునకురాణివయినందున, లక్షలకొలఁదిజనులయొక్క సుఖమిప్పుడునీచేతిలోనున్నది. ఈదుష్కరమైనయుత్తమ కార్యనిర్వహణమునఁదీశ్వరుఁడునీకుసహాయుఁడయి తనబలమును బ్రసాదించును గాక! నీ పరిపాలనము దీర్ఘమై సుఖప్రదమయి కీర్తికరమయినది కావలెననియు, నీ ప్రయత్నములునీ ప్రజలయొక్క కృతజ్ఞతానురాగరూప ప్రతిఫలమునుబొందునవి కావలెననియు, అభిలషించుచున్నాను. అప్పుడప్పు డిక్కడ బానునగరమునందున్న నీమేనమామకుమారుఁను దలఁచుకొను చుండవలెననియు వారియందింతవఱకును జూపుచుండినప్రేమమునే యిఁక ముందును జూపుచుండవలెననియునేను బ్రార్థింపవచ్చునా? మాహృదయములెప్పుడును నీమీఁదనే యుండుననిదృఢముగానమ్ముము. అధికముగావ్రాసి నీకాలమును వ్యర్థపుచ్చెడియవివేకమును బూనను. నీ విశ్వాసపాత్రుఁడయిన విధేయ సేవకునిగా నన్నెల్లప్పుడును బరిగణింపుము.——అల్బర్టు"

ఈయిరువురకునుదాంపత్యము సంఘటింపఁజేయవలెనని మొదటినుండియు రాణిగారి చిన్న మేనమామయైన లియోపాల్డుప్రభువు కృషి చేయుచుండెను. ఈమేనమామయందు రాణిగారికిని బితృప్రేమమును గౌరవమును గలిగియుండెను. ఇతఁడుమాత్రమేగాక యీవివాహవిషయమున బారన్ స్టాక్ మా రనునతఁడును సంధానకర్తయైయుండెను. ఇతఁడు లియోపాల్డుప్రభువునకుఁ బరమమిత్రుఁడయి రాణిగారిమాతయగు కెంటుప్రభ్వికి భ్రాతృసమానుఁడయి మంత్రివలెనామెకు సమస్త వ్యవహారములలోను హితోపదేష్టయై యుండెను. అతనియాలోచనను గొనక కెంటుప్రభ్వి యే ముఖ్యవిషయమునను స్వతంత్రించి పనిచేయకుండెను. రాజ్యాభిషిక్తురాలయిన పిమ్మటఁ దనమేనకోడలికిలియోపాల్డు

ప్రభువు వివాహవిషయమును సూచించుచు వ్రాసినప్పుడెల్ల నామెతన కిరువదియైదేండ్లు వచ్చువఱకును వివాహమాడనిచ్ఛ లేనట్లుసూచించు చుఁ బ్రత్యుత్తరము వ్రాయుచువచ్చెను.

ఇట్లుత్తరప్రత్యుత్తరములు జరుగుచుండినకాలములో 1839 వ సంవత్సరము అక్టోబరు నెల 10 న తేదిని తనయన్నతోడఁ గూడి యాల్బర్టుప్రభువు మరలనిగ్లండునకువచ్చెను. ఈసారియతఁడు తొంటికన్నను బహుగుణము లధికసౌందర్యశాలిగాఁ గనఁబడుచుండెను. మొదటిసారి యతఁ డిక్కడకు వచ్చినప్పుడుపదునేడుసంవత్సరములప్రాయమువాఁడే యయినందున నాతని కప్పటికి సమస్తావయవములును సంపూర్ణదశకు రాలేదు. ఇప్పుడాతనికిరువదయేండ్లుదాఁటిసమస్తావయవపరిపూర్తి గలిగి లావణ్యాతిశయము మించి యుండుటచే నవయౌవనవిరాజితుఁ డయి యున్న యారాజపుత్రుఁడు సుందరులకు నేత్రపర్వముగా నుండి హృద యాకర్షకుఁడగుచుండెను. సౌందర్యమునకువన్నె దెచ్చెడు గుణసంపదయు నాతని కమూల్యాలంకారముగా నుండెను. అతఁడుచిన్ననాఁటనుండియు నిష్కళంకమయిన పరిశుద్ధవర్తనముగలవాఁడు. రూపగుణసంపదలకు రెంటికిని మెఱుఁగిడుచు నాగరికముద్రతలఁపూపియాతనిసరసవాక్ప్రౌఢిమయునమ్మోహజనకముగానుండెను. అట్టిరసికాగ్రగణ్యునితో లెక్క నాలుగుదినములుసహవాసము చేయునప్పటికె రాణియంతటిదానిమనసు కరఁగి యామె తానావఱకుఁ జేసికొన్న నిశ్చయమును గిశ్చయమును మఱచి యాతనిని వరించెదనని మనసుబయలఁబెట్టెను. తనకిరువదియైదేండ్లు వచ్చువఱకును వివాహమును నిలుపుట కంతకుమున్ను చెప్పిన యుక్తులన్నియు నాతని ముఖదర్శనమబ్బినయుత్తరక్షణముననే పూర్వపక్షములయ్యెను. హృదయములో నాలుగేండ్లక్రిందటనంకురించి శీఘ్రముగా కొనలు సాగ కున్నయనురాగలత యాతనిముఖచంద్రకాంతి ప్రసారమువలననొక్కసారిగాననలెత్తిబయలుప్రాఁకి ఫలించెను.అందు



రాణిగారిభర్తయగు నాల్బర్టుప్రభువుయొక్క పెండ్లినాఁటిరూపము.

చేత నాఁనెల పదవ తేదీని సందిగ్ధహృదయుఁడయియింగ్లండునందడుగిడిన రాజకుమారుఁడుపదునేనవ తేదినాఁటికి తద్దేశమేలుచుండిన మహారాజ్ఞికి ప్రధానము చేయఁబడిన భర్తయయ్యెను. ఆదేశమునందు సాధారణముగా వరుఁడుముందుగాఁదనకోరికను వధువుతోఁ దెలుపుట యాచా

రము. శ్రీవిక్టోరియా రాజ్ఞి విషయములోని క్రమము తాలుమా అయివధువే ప్రథమమునఁ దన యభిమతమునువరునకుఁ దెలుపుటసంభవించెను. వీరి దాంపత్యమునకుబంధుబృందమెల్లనామోదించెను. తానాతనినివివాహమాడెదనని వాగ్దానముచేసిన దినముననే యాశుభవార్తను విక్టోరియా రాణిగారు తనయాప్తమిత్రుఁడయిన స్టాక్మారుగారికిని ప్రియమాతులుఁ డయిన లియోపాల్డురాజుగారికిని దెలుపుచు లేఖలను వ్రాసెను. శ్రీ విక్టోరియా రాజపుత్రియింగ్లండునకు రాణియగుటకుముందే లియోపాల్డు ప్రభువు బెల్జియముదేశమునకు రాజయ్యెను. ఈయిరువురకును వ్రాసిన లేఖలలోని కొన్నివాక్యములను విన్నచో రాణిగారికి తనమేనమామ కొమారునిమీఁదఁ గలిగినగాఢానురాగము తేటపడకపోదు. ఆమె స్టాక్మారుగారిపేర వ్రాసినలేఖలో "ఆల్బర్టు సంపూర్ణముగా నాహృదయమును దనవశము చేసికొన్నాఁడు. మాయుభయులమధ్యను సర్వమును నేఁటియుదయమున నిర్ధారణమైనది. అతఁడునన్నత్యంతసుఖురాలినిగాఁ జేయునని నాకు దృఢవిశ్వాసము కలిగియున్నది.................. ......నేనును నాతని నంతసుఖునిగాఁ జేసితినని నిశ్చయముగాఁజెప్పఁ గలుగుదునుగాక! నాశక్తివంచనలేక నేను బ్రయత్నించెదను." అను వాక్యములు కనఁబడుచున్నవి. లియోపాల్డుప్రభువుగారిపేర వ్రాసిన లేఖలోను "నేను మనస్సు నిశ్చయముచేసికొన్నాను. నేనునాయిూప్సితమును నాఁటియుదయకాలము నాల్బర్టునకుఁ జెప్పివేసినాను. నాహృదయమును దెలిసికొన్నతరువాత నతఁడుచూపిన యవ్యాజాదరమునన్ను బరమానందభరితురాలినిగాఁ జేసినది. అతఁడు సుగుణప్రపూర్ణుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. మహాసుఖవంతురాల నయ్యెడుభాగ్యము నాకు ముందు పట్టునని తలఁచెదను. అతనియెడలనాకుఁగల యనురాగమును మాటలతోఁ దెలుపుటకు శక్యముకాదు. నానిమిత్తమతఁడు పొందిన కష్టములు తోఁచకుండునట్లు చేయుటకయి నాచేతనైనవఱకు సర్వవిధ

ములఁ బ్రయత్నము చేసిదను..............................
కడచిన కొన్ని దినములును నాకు స్వప్నావస్థలోనివివలె నున్నవి. నా మనస్సు నావశములో లేనందుననాకిప్పుడేమివ్రాయుటకును తోఁచకున్నది. అయినను నేననిర్వాచ్యసంతోషరసమగ్నురాలనయియున్నాను''
అని యనురాగద్యోతకము లయినయిట్టివాక్యములు కనఁబడుచున్నవి. ఆల్బర్టుప్రభువు తన హితుఁడయినస్టాక్మారునకు వ్రాసినలేఖలో "విక్టోరియా యుత్తమసతీమణి యయి నాయెడలనత్యంతానుగ్రహముచూపి యున్నది. ఆమెయనురాగమునకు నేనాస్పదుఁడనన్న మేలివార్తనుచిత్త సంభ్రమముచేత నేను పలుమాఱు నమ్మఁజాలకున్నాను.........
నేనిప్పుడువిశేషముగా వ్రాయలేను. ఈనిమిషముననాస్వాంతముసంభ్రమాక్రాంత మయియున్నది.'' అని సంక్షిప్తముగాఁదన ధన్యతనుదెలిపి యున్నాఁడు. ఇట్టి యనురాగ విశేషముగల వధూవరులు వివాహదిన నిమిత్తమై యెంతకాలమువిలంబాసహిష్ణులయి వేచియుందురో చెప్పుటకన్న నూహించుకొనుటసులభము. వివాహమునకుముందుపార్లమెంటు సభవారికిఁ దెలుపవలెను. ఆమహాసభ జనవరి నెలలోఁగానిసమావేశము కాదు. ఆనాయికానాయకుల కీలోపల దిన మొకయుగముగా తోఁచి యుండవలెను. ఆమహాసభ కూడులోపల రాణిగారు 1839 వ సంవత్సరము నవంబరు నెల 23 వ తేదిని తనయభిమతమును బ్రకటించుటకయి మంత్రుల సభకూర్చెను. రాష్ట్రములో నెల్లప్రముఖులుగానుండు మంత్రివరులముందఱమహాసభలోనిలిచియిరువదివత్సరములప్రాయము గల యువతి తనవివాహవిషయమున ముచ్చటించుట కెంతో సంకోచపడియుండవలెను. అయినను సభవారి కది వెల్లడింపక తీఱదు. ఆమె యేమిచెప్పునో వినవలెనని యప్పుడెనుబదిమంది సభికపురుషులచ్చటఁ జేరిరి. అంతట నామె తన మనోనాయకునిప్రతిబింబము గల పతకము ధరించుకొని తలుపుతీసికొని మెల్లగా నడిచివచ్చిసభాభవనముచొచ్చి

తాను వ్రాసికొనివచ్చిన కాగితమును చేతులువడఁకఁదలవంచుకొని విస్పష్టమయిన మృదుమధురకంఠస్వరముతోఁ జదివి మరల లోపలికి పోఁ బోవుచుండెను. అప్పుడొకప్రభువు ముందుకువచ్చి యాపత్రికను బ్రకటించుటకు సెలవు వేఁడఁగా వినమ్రమయయి కాగితమునాతనిచేతిలోఁ బెట్టి యంగీకారసూచకముగా తలయూఁచి లోపలికిఁ బోయెను. ఈవిషయమునుగూర్చి తనదినచర్యాపుస్తకములో రాణిగా రిట్లు వ్రాసికొనిరి—

"సరిగా రెండుగంటలకు నేను సభలో ప్రవేశించితి అప్పటికిసభనిండి యుండెను. అక్కడ నెవ్వరెవ్వరుండిరోనాకుఁదెలియ లేదు......తరువాత నాచిన్నప్రకటనను జదివితిని. అప్పుడు చేతులు వడకఁజొచ్చెను గాని నేనొక్కమాటయైన తప్పుగాఁ జదువలేదు. అది ముగిసినప్పుడు నేను ధన్యురాలనైనట్లు సంతోషించితిని....అంతట నేను సభవిడిచి యీవలఁబడితిని. ఇదియంతయు రెండుమూడునిమిషములలోపలనె పరిసమాప్తినొందినది....నాపతకములోఁ జిత్రింప బడియున్న నాప్రియుని విగ్రహమే సభలో నాకుధైర్యమును గలిగించినట్లు తోఁచుచున్నది."

అటుతరువాత 1840వ సంవత్సరము ఫిబ్రవరి నెల 10వ తేదిని వారివివాహము జరిగెను. వివాహమునకుబూర్వమునందాల్బర్టుప్రభువు తా నింగ్లాండు దేశపు కాపుగా నగుట కొప్పుకొని, రాణిగారియధికారమునకు లోఁబడినప్రజలలోఁ దాను నొకఁడయిప్రభుభక్తికలవాఁడయి యుండునట్లు ప్రమాణము చేసెను. వివాహదినమునఁ బ్రాతఃకాలముననే వధూవరులు క్రైస్తవాలయమునకుఁ బోయిరి. వివాహమహోత్సవమును జూచుటకయి వేలకొలఁది జనులక్కడఁ జేరిరి. పాణిగ్రహణ సమయమునందు "సమస్తవిషయములలోనునీకులోబడి నడుచుకొనెద" నని వరునిగూర్చి వధువుచేతఁ జెప్పించువిషయమయి మతాచార్యులలో ధర్మసందేహ మొకటికలిగెను. వధువు దేశపరిపాలకురాలైనరాణివరుఁడు రాణికాజ్ఞావిధేయుఁడుకావలసినప్రకృతివర్గములోనివాఁడు. ప్రభువుతన



రాణిగారియొక్క వివాహమునాఁటి రూపము.

ప్రజలలోనొకరికిఁ బోఁబడుదుననుటపొసఁగ నేరదు. ఈవిషయమున నొకింత గుజగుజలు పోయినపిమ్మట ప్రధానాచార్యుఁడు రాణిగారిని జేరి వివాహ కాండములోని "విధేయురాలనయ్యెద" నన్న వాక్యమును విడిచిపెట్ట వలెనని దేవిగారియభీష్టమా యని యడిగెనఁట! ఆప్రశ్నకామె "ఏవా

క్యమును విశిచి పెట్టనక్కఱలేదు. ఇతర స్త్రీలకువలెనే సమస్త వివాహ విధులును నడవవలెననియే నాయభీష్టము. రాజ్ఞీత్వముచేతఁగాకపోయి నప్పటికిని భార్యాత్వముచేత నేను సమస్తగృహిణీధర్మములకును బద్ధురాలనయి భృత్యురాలనయి వర్తించెదను.'' అని యుత్తరము చెప్పెనఁట! అప్పుడు రాణిగారి పినతండ్రులలో నొకరగు ససెక్సు ప్రభువుగారామెను కన్యాదానముచేసిరి. ఆసమయమునందుజయజయధ్వనులతో "ఈశ్వరుఁడీవధూవరుల సుఖులను జేయునుగాక!'' అన్నయాశీర్వాదనినాదములు మిన్నంటెను. అంతటఁ బ్రధానాచార్యుఁడు లేచి "ఓవిక్టోరియా! ఆల్బర్టును వివాహితభర్తనుగాఁ జేకొని, భగవదాజ్ఞారూపమయిన పవిత్ర వివాహబంధానుసారముగాఁగలిసివర్తించెదవా? నీవీతనికిలోఁబడి, సేవించుచు, ప్రేమించుచు, గౌరవించుచు, ఆరోగ్యదశలోను వ్యాధిదశలోనుగూడ ననుసరించి, మీరిరువురునుజీవించి యున్నంతవఱకితరము సర్వము విడిచి నిన్నీతనికర్పించుకొనెదవా?''అనిప్రశ్న వేసెను. "తప్పక వర్తించెదను. ఆత్మార్పణముచేసెదను.'' అనియామె వివాహభవనమునందున్న వారికందఱికినివినఁబడునట్లుగా శ్రావ్యమయినమృదుస్వరముతో స్పష్టముగా నుత్తరము చెప్పి, తలయెత్తి భర్తమొగము వంక దృష్టినిగిడించెను. ఆనాఁపామెవాక్యములు హృదయాంతరాళము నుండి వచ్చినవిగాని నాలుకచివరనుండివచ్చినవి కావనియెల్ల వారికినినమ్మకము కలిగించెను. ఆసమయమునం దామె కిరీటమును ధరింపక రత్నహారమును స్వర్ణాభరణములునుదాల్చిస్వర్ణాంబరముతో మేలిముసుఁగు వేసికొనియుండెను. ఆమెయప్పుడుధరించుకొనియున్న వస్త్రాలంకారాదులమూల్యములయినవని వేఱుగఁజెప్పనక్కఱలేదు. ఆమెధరించినయొక్క మొహమలుబట్టకు వేసినసరిగ వెలయే వేయిపౌనులనగా 10 వేలరూపాయలకంటె హెచ్చుగానుండెను. పెండ్లితంతంతయు యథావిధిగా నడిచిన తరువాత వధూవరులు వివాహవేదికను విడిచివచ్చిబంధువులకును పెద్ద

లకును నమస్కరించి వారిదీవనలను గైకొనిరి. వధూవరులుశకటారోహణమునకుఁ బోవునప్పు డారాజదంపతులనుజూచుటకయివచ్చినప్రజతో నిరువది రెండుమైళ్ళ పొడుగునను వీధులునిండి క్రిక్కిరిసిపోయెను.

ఆ నెల 28 వ తేదీని రాణిగారిమామగారు కుమారు నక్కడ విడిచిస్వదేశమునకుఁబోయెను. జనకుని నెడఁబాయునప్పుడాల్బర్టుకన్నుల నీరుపెట్టుకొని యెంతో దుఃఖపడెను. నాఁటిదినచర్యయందు రాణిగారిట్లువ్రాసికొనిరి. "నీవెప్పుడునునాప్రక్కనేయుండుటవలన, నాకుఁగల పితృవియోగదుఃఖమును నీవు మఱపింపఁజాలవనియాల్బర్టునాతోననెను. ఆతనిబాల్యదశ యత్యంతసంతోషకరముగాఁ గడచెను. 'నాకుప్రేమాస్పదు లయినవారిలో నా చిన్ననాఁటియాప్తబంధువులలోనెల్ల నొక్కరెన్నొటుమాత్ర మిప్పు డిక్కడ నున్నాఁడు; నీయిప్పటిప్రేమనే యెల్లకాలమును నీవునామీఁదఁజూపుచుందువేని, నేనప్పుడు వారినందఱిని మఱవఁగలుగుదును' అనియుఁ బలికెను . ఈనిమిషమందు నాప్రియతముఁడైన పురుషరత్నమునుగూర్చి నాకెంతో జాలికలుగుచున్నది. నానిమిత్తము తండ్రిని, సోదరుని, మిత్రులను, దేశమును,సమస్తమును విడిచిపెట్టెను. ఈశ్వరుఁడు నన్ను ధన్యురాలినిగాఁ జేయునుగాక! ఈ ప్రియతముఁడైనపుణ్యశ్లోకుని సుఖునిగాను సంతుష్టునిగాను జేయుటచే నన్ను ధన్యతమురాలినిజేయునుగాక! ఈతని సుఖునిగాఁ జేయుటకయి నాశక్తిలోఁ గలదంతయుఁ జేసెదను."

ఈవాక్యములు యథార్థములగునట్లుగా నీపతివ్రతామణి తన సౌఖ్యలోపమునకైనను సహించి యావజ్జీవమును భర్తృసౌఖ్యమును బెంపొందించుటకయి సర్వవిధములఁ బాటుపడెను. తనరాష్ట్రములో నెల్ల రాణియైనతనకుఁ దరువాత తనభర్తకేయెక్కువగౌరవముకలుగునట్లామె యేర్పాటుచేసెను.ఈదంపతులకుఁ గలయన్యోన్యానురాగము నిర్వ్యాజ మయినది. లోకములో సామాన్యముగా దంపతులకుఁ

గల యనురాగము మొదటనున్నంత తరువాత నుండదు. ఈరాజదంపతుల కట్లుగాక యేండ్లుగడచినకొలఁదిని వారివయస్సుతో ననురాగమును దినదినాభివృద్ధినొందెను. భార్యాభర్తృసంబంధమన్న నిట్లుగదా యుండవలెను. దేహములు వేఱయినను మనస్సు లొక్కటిగాఁ గలిసియిట్లున్నప్పుడే భార్యకర్ధాంగియన్ననామము సార్థక మగును. చిరకాలము కాపురముచేసి సంతానముగాంచిన తరువాత నొక్కసారి భర్త తన్నువిడిచి కొన్నిదినములు ప్రవాసముచేయఁదలఁచినప్పుడు రాణిగారొకరికిట్లువ్రాసిరి—"నాకిది యెంతమనోవేదనకలిగించినదో, అతఁడు నన్నెడఁబాసియున్నప్పుడు నేనెంతనిరాశ్రయతాదశను బొందియుందునో, అతఁడు వచ్చి మరల నాకంటఁబడువఱకును గడియ లెట్లు లెక్కపెట్టుకొనుచుందునో నీవూహింపఁజాలవు. అతఁడుదూరముగానున్నప్పుడింతమంది బిడ్డలును బిడ్డలుగా తోఁచరు; గృహముయొక్కయుకుటుంబముయొక్కయు ప్రాణము వెడలియున్నట్టు కనఁబడును."

ఆదంపతు లెప్పుడునుగలిసి యిద్దఱును బండిమీఁదఁ బోవుచుందురు; ఇద్దఱును విహారార్థము నడుచుచుందురు; ఇద్దఱునుపాడుచుందురు; ఇద్దఱునుఆడుచుందురు; ఇద్దఱునుచిత్రములు వ్రాయుచుందురు; ఇద్దఱును నొకరుచదువుచుండిన నొకరు వినుచుందురు. ఇట్లన్యోన్యము సదా కలిసియుండుటచేత రాజకార్యములనామె యణుమాత్రమునుపేక్షించుచురాలేదు. రాజ్యతంత్రవిషయములయం దామె తొంటికంటె నెక్కువశ్రద్ధవహించినదయి యధికజాగరూకతతోఁగార్యనిర్వహణము చేయఁ జొచ్చెను. అతఁడు రాజ్యాంగమర్మములను శ్రద్ధాళువయి కృషిచేసి మంత్రివలెనామెకుసర్వవిధములఁదోడుపడుచుండెను. అతఁడు సర్వదా ప్రజాక్షేమమునేతనదృష్టియందుంచుకొనుచువచ్చెనుగాని యెప్పుడును స్వార్థపరుఁడయి యేపనియుఁ జేయలేదు. ఇట్టి సుగుణసంపదగలవాఁడగుటచేతనే వివాహసమయమునం దనేకుల కాదరణీయుఁడు

కాకపోయినను శీఘ్రకాలములో నేయెల్లవారికిని విశ్వాసపాత్రుఁడయి ప్రజానురంజకుఁడయ్యెను. మహారాజ్ఞి గర్భవతియైయుండినప్పు డేదయిన వైపరీత్యము కలిగెడిచో శిశువునకు సంరక్షకుఁడును బ్రతినిధియు నయియుండి రాజ్యపాలనము చేయుటకై రాణిగారిపినతండ్రులలో నెవ్వరిని నియమింపక పార్లమెంటు సభవారీతనిని నియమించుటయే యీతని యోగ్యతను సహస్రముఖముల ఘోషించుచున్నది.

1840 వ సంవత్సరము నవంబరు నెల 21 తేదిననఁగా వివాహమయిన తొమ్మిదినెలల పదునొకండుదినములకు రాణిగారికి ప్రథమ పుత్రికాజననము కలిగినది. వివాహమయిననాలుగుమాసములకీశిశువు గర్భస్థురాలై యుండఁగా 1840వ సంవత్సరము జూన్ నెల 10 వ తేదీని రాణిగారును భర్తయుఁగలిసినాలుగుగుఱ్ఱములబండి నెక్కి బక్కింఘాము రాజభవనమునుండిఉద్యానవనమార్గమునవిహారమునకు వెడలిరి. బండికిముందిద్దఱు గుఱ్ఱపురౌతులుండిరి; వెనుకప్రక్కనిద్ద ఱశ్వపాలకులు నడుచుచుండిరి. ఇట్లు రాజశకటమొకగుట్టవద్దకుఁ బోవునప్పటికి సాయంకాల మాఱుగంటలసమయమయినది. అప్పుడు పదుచువాఁడొకఁడు జనోద్యానమువైపునుండి రాణిగారిమీఁదికి గుఱిపెట్టి చేతితుపాకిని కాల్చెను. దానిధ్వనివిని యాల్బర్టుప్రభువు తలయెత్తి యాధ్వని వచ్చిన వైపునకు దృష్టినిగిడించెను; ఆక్షణమునందే రాణిగారును లేచి పయికి జరగఁబోయెనుగాని భర్త వెంటనే యామెను క్రిందికి మరలఁ దిగిచి తన ప్రక్కకుఁ జేర్చుకొనెను. అయుత్తరక్షణముననే యాదుష్టుఁడు తనవద్దనున్న వేఱొక చేతితుపాకినిదీసిగుఱిచూచి రాణిగారిమీఁద కాల్చెను. అంతట మనుష్యు లన్నిప్రక్కలనుండియు పరుగెత్తుకొనివచ్చి వానిని బట్టుకొనిరి. వాఁడెంతమాత్రమును జడియక తుపాకులను కాల్చినది తానే యని యొప్పుకొని రాజభటులవెంటనిర్భయముగా నారక్షకస్థానమునకు నడచెను. ఆ ఘాతుకుని పేరు ఎడ్వర్డు ఆక్స్ఫోర్డు. మొగము

కొంచెము వెలవెలపాఱుటదక్క రాణిగారి వర్తనమునందప్పుడు భయచి హ్నములేవియుఁ గనబడలేదు. ఈవార్త తెలిసినప్పుడు కెంటుప్రభ్వియేమి భయాకులతనొందునో యని యీరాజదంపతులు తిన్నఁగా తమబండి నామె నివాసమునకుఁ దోలించి తమక్షేమవార్తను దెలిపి యందుఁ గొంతసేపుండి మరల బైలుదేఱి జనోద్యానమార్గమున రాజమందిర మునకుఁ బోవ వెడలిరి. అంతకుముందే యీవార్త పురమెల్లను వ్యాపించినందున మితిమీఱిన జనసంఘము జనోద్యానవనమునఁ జేరి జయ జయ ధ్వనులతో వారి నభినందించుచు స్త్రీలును పురుషులును రాజ దంపతులబండి వెంట బక్కింఘాము నగరమువఱకును బోయిరి. ఈయపా యవిముక్తి కలిగినందునకయి జనులపారసంతోషము నొంది వార్తాపత్రి కలమూలమునను తదితరమార్గములను దమ రాజభక్తి నత్యధికముగా వెల్లడించిరి. అటుపిమ్మట దుష్టుఁడయిన యాక్సుఫోర్డు రాజద్రోహిగా విమర్శచేయఁబడి చెఱసాలయందుఁ బెట్టఁబడెను. వాఁడు ముప్పదియైదు సంవత్సరములు కారాగృహవాసశిక్ష ననుభవించిన తరువాత నింగ్లాం డును విడిచిపోవు పద్ధతిమీఁద విడిచిపెట్టఁబడి యాస్ట్రేలియాద్వీపములో మొన్నమొన్నటివఱకును గృహములకు వర్ణము వేయువృత్తిని గైకొని జీవనము చేయుచుండెనఁట. వాఁడు రాణిగారిని జంప నుద్యమించుటకుఁ దన్మూలమునఁ దాను ప్రసిద్ధుఁడనగుదునన్న కోరికదక్క వానికి మఱియొక యుద్దేశ మేదియు లేదఁట! ఈఘాతుకకృత్యమునకుఁ బూనినప్పుడు వానికి వయస్సుపదునేడుసంవత్సరములు. రాణిగారు ధైర్యవంతురాలగుటచేతఁ దనకు దైవికముగా తప్పిపోయిన ప్రాణాపాయమును బట్టి భయపడి యింటఁ గూరుచుండక వింతకార్యమేదియు జరగనట్టే మఱునాఁటినుండియు యథా ప్రకారముగా బండిలో విహారమునకు వెడలుచుండెను.

1. పైని జెప్పినట్లు 1840 వ సంవత్సరము నవంబరు నెల 21వ తేదీన జననమొందిన జ్యేష్ఠపుత్రికకుఁ దమ వివాహ ప్రథమసంవత్సరో

త్సవమునాఁడనఁగా 1841 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 10వ తేదిని విక్టోరియా ఎడిలెయిడ్ మేరీ లూయిసా యని తల్లిదండ్రులు నామకరణముచేసిరి. ఈనామకరణమహోత్సవముజరిగిన రెండవదినమున రాణిగారిభర్తగారికొకగొప్పవిపత్తుతప్పిపోయెను. భార్యాపరివారసహితముగానతఁడు నాఁటిదిన ముద్యానవనవిహారముచేయుచు, క్రీడాసరోవరముమీఁది మంచుపయి నినుపపాదుకలు తొడుగుకొని వినోదక్రీడ సలుపుచుండెను. ఇట్లు క్రీడించుచున్న సమయమునం దాకస్మికముగా పయిహిమావరణము విఱిగిపడి యతఁడు లోఁతునీటిలోఁగూలెను. ఏమియుఁదోఁచక యఱచుచు సేవకులందఱును కళవళపడి త్రొక్కులాడుచుండిన యాసమయమున శ్రీవిక్టోరియామహారాజ్ఞి సమయోచితబుద్ధిస్ఫురణము కలదయి యాతని రక్షణోపాయమును వెంటనే ప్రయోగించియుండని యెడలఁ గొన్నినిమిషములనుండి యగాధజలములోఁనీదులాడుచు కొట్టుకొనుచుండినయతఁడు నీటిగండముచే ప్రాణాపాయము నొందియుండును. ఇంగ్లాండు మొదలయినశీతల దేశములలో శీతకాలమునందు నదులు సరస్సులు మొదలయినవానిమీఁది జలము పేరుకొని పై భాగముగడ్డకట్టిన మంచుమీఁద జను లినుపపాదరక్షలు తొడుగుకొని జాఱుచు లేచుచు వినోదార్థముగా నాటలాడుచుందురు. కొంచెము ధనవంతులు కాఁగానే పాలదాదులనుబెట్టిస్వశిశువులనిమిత్తమయియీశ్వరుఁడుద్దేశించిన స్తన్యము నెండఁగట్టియీశ్వరవచనమునుశిశుద్రోహమునుజేసెడుగొప్పయింటిస్త్రీలవలెఁగాక రాణిగారు ప్రథమశిశువునకును దరువాతఁబుట్టిన యితర శిశువులకును దామే పాలిచ్చి పెంచుచువచ్చిరి. అయినను రాజకుటుంబాచారానుసారముగా శిశువులకు పాలదాదులను బెట్టుటమానలేదు. ఈ పెద్దకూఁతునిమిత్తము పెట్టిన పాలదాది కేనూఱు పౌనులనఁగా నైదు వేలరూపాయలియ్యఁబడెను. తల్లియొక్క నిరంతరసంరక్షణముచేత నారోగ్యవంతురాలయి యాచిన్నదిదినదినాభివృద్ధిఁ జెందు

చుండెను. శైశవదశలో నీబాలిక తనతల్లియాడుకొన్న యాటవస్తువుల తోనే యాడుకొనుచు నామెవలెనే యుల్లాసముతో గంతులువేయుచు నవ్వుచు త్రుళ్ళుచు నిర్విచారముగాఁ గాలము గడుపుచువచ్చెను. తల్లి మహారాజ్యభారము నిర్వహించుచున్నదయినను బ్రతిదినమును గొంత యవకాశముచేసికొని కూఁతునకు దానును బాఠములు చెప్పుచునాచిన్న దాని విద్యాబుద్ధుల విషయమయి యెంతోశ్రద్ధ వహించుచుండెను. ఇట్లు పెరుగుచుండినయాచిన్నదానికిఁ బదునైదుసంవత్సరములప్రాయము వచ్చినప్పుడు ప్రష్యాదేశపురాజు తన జ్యేష్ఠకుమారుఁడైన విలియమ్ ఫ్రిడరిక్కుతోడఁగూడ నింగ్లండునకువచ్చెను. అప్పుడాచిన్నదానిరూప గుణసంపదలను జూచి యారాజకుమారుఁడాకన్యను కామించెను. ఆ రాజపుత్రికయు నారాజకుమారునిపై మనసు నిలిపెను. వధూవరుల తల్లిదండ్రు లిరువురును వారి దాంపత్యమున కంగీకరించిరి. అయినను దన కుమారికకు యుక్తవయస్సు వచ్చి తన యంగీకారమును దెలుపు వఱకును వివాహనిశ్చయము చేయుటకు రాణిగారిష్టపడనందున, రాజ పుత్రికకుఁ బదునాఱవ సంవత్సరము వచ్చినతరువాత ప్రధానముచేయఁ బడి పదునెనిమిదవ సంవత్సరము వచ్చినపిమ్మట 1858 వసంవత్సరము జనేవరి 25 వ తేదిని వివాహముచేయఁబడెను. వివాహసమయము నందుపార్లమెంటుసభవారిచిన్నదానికినలువదివేలపౌనులనఁగా నాలుగు లక్షలరూపాయలరఁణమిచ్చుటయేకాకసంవత్సరమున కెనిమిదివేలపౌను లు(ఎనుబదివేలరూపాయలు)ఇచ్చుచుండుటకేర్పాటుచేసిరి. ఈవధూవరు లకుఁ గల పరస్పరానురాగమునకు పరిమితిలేదు. అతఁడు తనభార్య యంతటిసమర్థురాలుయూరపుఖండములోమఱియొకతె లేదనియునామె తనపాలిటిభాగ్యదేవత యనియు పలుమాఱు చెప్పుచుండెను. ఇతఁడు తనతండ్రియనంతరము జర్మనీచక్రవర్తియయియల్పకాలము రాజ్యము చేసి 1888 వ సంవత్సరమున లోకాంతరగతుఁడయ్యెను. ఈదంప

తుల కెనమండ్రు సంతానము కలిగిరి కాని వారిలో 1897లో ఆఱుగురు మాత్రమె సజీవులయియున్నారు. ఈరాజదంపతులకు 1859 వ సంవత్సరము జనేవరి 27 వ తేదిని జనించిన ప్రథమపుత్రుఁడే యిప్పుడు రెండవ విల్లియమను పేర జర్మనీచక్రవర్తిగానున్నాఁడు. ఇట్లునలువది రెండు సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికి విక్టోరియారాణిగారికి దౌహిత్రలాభము కలిగినది. ఇప్పుడీ కొమారితవలనఁ బెక్కండ్రుముని మనుమలును మనుమరాండ్రునుగూడఁ గలిగియున్నారు. రాణిగారి పెద్ద కొమార్తెయుఁ దన తల్లిదండ్రులవలెనే తనబిడ్డలవిద్యాబుద్ధులవిషయమున దాను శ్రద్ధవహించుచు, వారు పాఠములు చదువునప్పుడు తాను దాపుననుండి చూచుచు వారిని ప్రోత్సాహపఱుచుచుండెను. ఆమెతల్లివలె నిగర్వచూడామణియై వేషభాషలయందు డంభమెఱుఁగక దాను స్వయముగా పనిపాటులు చేయఁగూడదను దురభిమానము లేనిదయి యుండెను. ఆమె యొకనాఁడు సేవకురాలిని బిలువవలసివచ్చునని కుర్చీని తానే గదిలోనుండి తెచ్చుకొనుచుండఁగా సేవకురాలదిచూచి పరుగెత్తుకొనిరాఁగా, "నాతల్లి యింగ్లండునకు రాణియనినీ వెఱిఁగియుండవచ్చును. ఆమె తనబిడ్డలకు వేయుటకు రెండుచేతులలోను రెండుకుర్చీలనుమోచి తెచ్చుచుండఁగా నేను జూచినాను ; అప్పుడప్పుడు వారి మైలబట్టలను సహిత మామె తీసికొనిపోయి దూరముగావైచుచుండును." అనియా రాచకూఁతురు పరిచారికతోననెను. ఆమెతనబిడ్డలకందఱికినుపయుక్తములయినపనులను నేర్పెను. ఇప్పుడు జర్మనీచక్రవర్తి గానున్నయామె జ్యేష్ఠపుత్రుఁడు పుస్తకముల కట్టలుకట్టుపనిని నేర్చుకొనెను. ఆమెభర్త సహితము ముద్రాక్షరములను గూర్చుటయు నచ్చువేయుటయు నభ్యసించెను.

2. పెద్దకొమారితపుట్టిన సంవత్సరములోపలనే రాణిగారికి 1841 వ సంవత్సరము నవంబరు నెల తొమ్మిదవ తేదిని ప్రథమపుత్రో

దయము కలిగినది. ఇట్లు పుత్రలాభము కలిగినందునకై జననీజనకులకుఁ గలిగిన యపారసంతోషమునుండఁగా, రాజ్యమునకు త్తరాధికారికలిగె నని రాష్ట్రమంతయు నపరిమితానందమొందెను. ఈసారిపాలదాదిమొద లయినవారికిచ్చిన బహుమానములు మొదటిసారికంటె రెట్టింపుచేయఁ బడినవి. ఒక్క పాలదాదికే పదివేలరూపాయ లీయఁబడినవి. ఈతని నామకరణ మహోత్సవమునందు జరిగిన వేడుకలకయి యిరువదిలక్షల రూపాయలు వ్యయపెట్టఁబడినవి. ఈశిశువున కాల్బర్టు ఎడ్వర్డని నామ కరణము చేయఁబడినది. ఇందాల్బర్టను మొదటిది రాణిగారిభర్తపేరు ఎడ్వర్డను రెండవది రాణిగారితండ్రిపేరు. ప్రథమపుత్రలాభముకలిగిన యల్పకాలమునకే రాణిగారు తమమేనమామయగులియోపాల్డుప్రభు వునకుత్తరముప్రాయుచుశిశువునుగూర్చియిట్లువ్రాసిరి.—"మాయీ చిన్నపాప యెవరిని బోలియుండునో యని నాకు వింతగానున్నది.గుణ ములయందును రూపమునందును సర్వవిధములచేతను తండ్రిని బోలి యుండవలెనని నేను నిరంతరము నీశ్వరుని బ్రార్థింతునని నీవెఱుఁగు దువు." తమ బిడ్డలను మంచివర్తనము కలవారినిగాఁ జేయుటకయి మొదటినుండియురాణిగారునుతద్భర్తగారునుసర్వవిధములఁ బాటుపడు చుండిరి. ముఖస్తుతిపరాయణులు చుట్టునుజేరిగొప్పవారిబిడ్డలనుముఖ్య ముగా రాజకుటుంబములోని బిడ్డలను తమ స్తోత్రపాఠములచేఁ దఱు చుగాఁ జెడఁగొట్టుచుందురు ; అందుచేత వారు గర్విష్ఠులును స్వేచ్ఛా విహారులును నగుదురు ; పాటుపడుటయం దిష్టములేనివారయి యలసు లగుదురు ; ఇంకనునకనేకములయినదురభ్యాసములకులోనగుదురు. చిన్న తనములో పట్టుపడిన దురభ్యాసము లెంతోపట్టుపట్టి పనిచేసినఁగాని తరువాత వదలవు. ఈసత్యములను మనస్సునందుంచుకొని రాజదం పతు లెప్పుడును సద్వర్తముగలవారినే తమ పరిచారకులఁగాను బరి చారికలఁగాను నియమించుకొనుటకయి సాధ్యమయినంత కృషిచేయు

చుండిరి. రాణిగారి కొమారితకును కొమారునకును విద్యచెప్పుటకయి సమర్థులయినవారిని సద్వర్తనముగలవారిని పలువుర నేర్పఱిచియున్నను తల్లిదండ్రు లుపేక్షచేసి యూరకుండక పయినుండి తాముసుగనుఁగొను చుండిరి. వారిలో నాల్బర్టుప్రభువు తనబిడ్డ లెట్లు చదువుచున్నారో గురువు లెట్లు బోధించుచున్నారో నిత్యమును దానువిచారించుచుండెను. పిల్లల చేతఁ జదివించుట కుద్దేశింపఁబడిన పుస్తకము నెల్ల ముందుగా నతఁడు చదివిచూచి యది మంచిదని తోఁచినపిమ్మటనే వారిచేతులలోఁ బెట్టు చుండును. ఈప్రకారముగానే రాణిగారు తానును బలుమాఱుపాఠశా లకుఁబోయి చూచుచు నప్పుడప్పుడు తానే యుపాధ్యాయయయి పాఠ ములు బోధించుచుండును. ఆబిడ్డలకు శిక్షకురాలుగానుండిన యొకక్రై స్తవమతాచార్యునికూఁతురు తనతల్లి వ్యాధిబాధితయయియుండినప్పు డామె కుపచారముచేయునిమిత్తమయి తన పనిని మానుకొనఁ గోరఁగా రాణిగారు సమ్మతింపక "ఇప్పుడు నీవింటికిఁబోయి యావశ్యకమైనంత కాలము నీతల్లివద్దనుండి తరువాతరమ్ము. ఈలోపల నేనునుదండ్రియుపిల్ల లకుపాఠములనుబోధించుచుందుము. ఈవిషయముననీమనసునాయాస పెట్టుకొనకు." అని సదయవాక్యములు పలికి యామెకు సెలవిచ్చి పంపిరి. పెద్దకూఁతురు గర్భములో నున్నప్పుడు తప్పిపోయినట్టే యీ కుమారుఁడు పుట్టిన యాఱుమాసములకుఁ దరువాత నొకఘాతుకపురు షునివలనియాపద మఱియొకటి రాణిగారికి తప్పిపోయెను. 1842 వ సంవత్సరము మెయినెల 29 వ తేదీని సాయంకాలము రాణిగారును భర్తయుఁ గలిసిక్రైస్తవాలయమునకుఁబోయి యుపాసనానంతరమున తిరిగి యింటికివచ్చుచుండఁగా నొక దుష్టుఁడు గుంపులోనుండిముందుకు నడిచివచ్చి వారిబండికి రెండుబారలదూరములో నిలిచి తనచేతి తుపా కిని వారివంక గుఱిపెట్టి తుపాకి గుఱ్ఱమును లాగెనుగాని దైవికముగా నిప్పంటుకొనక తుపాకి పేలలేదు. ఇంతలో వారిబండి ముందుకు సాగి

పోయెను. ఈక్రూరప్రయత్నమును తానొక్కఁడు తక్క మఱియెవ్వరును జూడలేన ట్టాల్బర్ట్ప్రభు వనుకొనెనుగాని యొకముసలివాఁడును బాలుఁడునుగూడఁ జూచి వారిలో బాలుఁడు మఱునాఁడువచ్చి తాను జూచినసంగతిని రాజమందిరమునఁజెప్పెను. మఱునాఁడు బాలుఁడువచ్చి చెప్పకమునుపేయారాత్రిదారిలోనే భర్తరాణిగారికిఁదానుజూచినదానిని జెప్పెను. వారుమఱునాఁటియుదయమున రక్షకశాఖవారి కావార్తను జెప్పిపుచ్చిరి. ఆరాజదంపతు లెంతధైర్యస్థైర్యములు గలవారయినను వారి మనస్సులు కొంత సంచలింపకపోలేదు. అయినను వారంతటితో వాహ్యాళి వెడలుట మానక యాఘాతుకుఁడు యథేచ్ఛముగాఁ దిరుగుచున్నాఁడని యెఱిఁగినవారయ్యును మఱునాఁడు సాయంకాల మెప్పటి యట్ల బండిలో విహారమునకు వెడలిరి. నాఁటిదినమున వారుతమతో వాడుకగావచ్చెడిముఖ్యపరిచారికనుబండిలోనెక్కించుకొనకపోవుటయే కాకగుఱ్ఱములను వేగముగాదోలవలసినదనిసారథికాజ్ఞయిచ్చిరి.ప్రయాణమునకు సంసిద్ధురా లయి వచ్చిన యాగౌరవపరిచారిక తన్ను వారు బండిలో నెక్కవలదనుటచే మొగము చిన్నపుచ్చుకొని వెనుకకు మరలి పోయెను. బండిముందిద్దఱు సవారులంగరక్షకులుగా గుఱ్ఱములమీఁదఁ బోవుచుండిరి. బండిజనోద్యానవనసమీపమునకువచ్చునప్పటికిఁ బూర్వమాక్సఫోర్డుతుపాకినిగాల్చిన స్థలమునకుదాపుననే బండి కయిదుబారల దూరములో నిలిచి యొక దురాత్ముఁడు మరలవారిమీఁద చేతితుపాకిని కాల్చెను. ఆగుండు వారికిఁ దగులక బండిమీఁదినుండియో క్రిందినుండియో పోయెను. వాఁడు తత్క్షణమే పట్టుకోఁబడి రాజభటులకప్పగింపఁబడెను గతదినము తమపైని తుపాకికాల్ప యత్నించిన ఘాతుకుఁడే వాఁడని యాల్బర్టుప్రభువు వానిని జక్కఁగా గుఱుతుపట్టెను. వానిపేరు జాన్ ఫ్రాన్సిస్. వానిని బట్టుకొని శోధించి యింకను వేఁడిగానున్న చేతి తుపాకిని మఱియొక గుండును మందును వానియొద్దనుండి లాగుకొనిరి.

ఎంతయడిగినను వాఁడు తానేల రాణిని జంపఁబూనెనో చెప్పలేదు. నాఁటి సాయంకాలమునందు భోజనసమయమున రాణిగారుతన గౌరవ పరిచారికనుజూచి "నేటిసాయంకాలము నిన్ను మాబండిలో నెక్కించుకొని పోనందునకు నీకాశ్చర్యము కలిగియుండును. నిన్నరాత్రి మేమాలయమునుండి వచ్చుచుండఁగా నొకపురుషుఁడుమాబండి గవాక్షమునకు గుఱిపెట్టి తుపాకిని గాల్చి, మేము విభ్రాంతిగొనియున్న సమయములో తప్పించుకొనిపోయెను. అందుచేతనా కేదో కీడుమూడనున్నదని యెఱిఁగినదాననై, నాప్రాణమునకుఁదక్క మఱియొకరిప్రాణమున కపాయము రాకుండఁ జేయవలెనని నేను నిశ్చయము చేసికొన్నాను." అని కారణమును వివరించి చెప్పెను. తరువాతరాజహంతయైన ఫ్రాన్సిస్సుధర్మాధికారులవద్ద విమర్శింపఁబడి జూన్ నెల 17 వ తేదిని మరణదండనము నొందునట్లు విధింపఁబడెను. ఆశిక్షను వినఁగానే వాఁడు మూర్ఛపోయి నేలఁబడి యాస్థితిలోనే ధర్మస్థానమునుండి యావలికిఁ గొనిపోఁబడెను. రాణిగారావార్తనువిని జాలినొంది వానినిమరణదండనమునుండి విముక్తునిగాఁజేసి యాశిక్షను యావజ్జీవద్వీపాంతరవాసశిక్షకు మార్పించి టూస్మానియాకుఁ బంపించి వేసిరి. ఆమె దయాగుణమెంతయైనశ్లాఘింపదగినదిగదా! 'తన ప్రాణముల కెగ్గు తలఁచిన దుష్ప్రయత్నమున కణుమాత్రమును భీతిల్లక యాప్రయత్నము జరగిననాటిరాత్రియే యామె భర్తతోడఁగూడి యొక నాటకమును జూడఁబోయెను. తమ యేలికసానియొక్క ధైర్యసాహసములకు జను లత్యద్భుతరసాక్రాంతు లయి నాటకరంగమునం దామెను భర్తను గరతాళములును జయజయధ్వానులును మిన్నుముట్ట బహుభంగుల నభినందించిరి; మేనమామయు నామెను మహాధైర్యశాలిని యని పేర్కొనెను. ఇట్లొకదుర్మార్గునియెడదయ దలఁచిన మఱునాఁడే జూలయి నెల మూఁడవ తేదిని మఱియొక దుర్మార్గుఁడు బయలువెడలి రాజకీయ క్రైస్తవాలయమునకుఁబోవుచుండఁగా

రాణిగారిపయిని తుపాకి కాల్చుటకుఁ బ్రయత్నించెను. ఈసారి యామె తోఁడగూడ బండిలో భర్త లేక మేనమామయుండెను. కుబ్జుఁడయిన జాన్ విల్లియమ్ బీన్ అనువాఁడు రాణిగారిమీఁద తుపాకిగాల్చెనుగాని దైవవశమున మందంటుకొనలేదు. అంతకుఁబూర్వమే యాదుష్టుఁడు 'కేవల దుష్కార్యము కాకపోయినను నేనొక సాహసిక కార్యమును జేయనుద్దేశించియున్నందున మరల నిన్నెప్పుడును జూడఁబోను' అని తనతండ్రి కొకయుత్తరము వ్రాసియుండెను. ఈసారి సహితము రాణిగారుభయ చిహ్నములను జూపక రాజద్రోహము తలపెట్టువారికి ప్రాణాంతశిక్ష విధించు ప్రస్తుత శిక్షాస్మృతినిమార్చకుండుటకును నిట్టియత్నములు జరుగుచునేయుండునని ప్రధానమంత్రితోఁ దెలిపి దానిని సంస్కరింపఁ గోరెను. వెంటనే పార్లమెంటు సభవారు రాజద్రోహముచేయఁ బ్రయత్నించువారేడుసంవత్సరముల ద్వీపాంతరవాసశిక్షకుఁగాని బహిరంగముగా మూడుసారులకు మించకుండ దెబ్బలు కొట్టఁబడుట కర్హుఁడయి మూడుసంవత్సరములు కారాగృహవాసశిక్షకుఁగాని పాత్రుడగుననినిర్ధారణీయశాసనమును దెచ్చి నాల్గుదినములలో దానిని రాజశాసనముచేసిరి. ఈనూతన శాసనప్రకారముగా విమర్శింపఁబడి జాన్ విల్లియమ్ బీను పదునెనిమిదిమాసములు కారాగృహవాస శిక్షనుబొందెను. యువరాజయిన రాణిగారి యీజ్యేష్ఠపుత్రుఁడు కొంతకాలమింటఁజదువుకొన్న తరువాత వరుసగా ఎడింబర్గు నగరోన్నతపాఠశాలలలోను, అక్సుఫోర్డు శాస్త్రపాఠశాలలలోను, కేంబ్రిడ్జి శాస్త్రపాఠశాలలలోను, కొంతకాలం చదివెను. 1861వ సంవత్సరమునందు యువరాజుగారు కేంబ్రిడ్జిసర్వకలాశాలలోఁ బ్రవేశపరీక్షయందుఁ గృతార్థులయిరి. ఇతఁడు 1863 వ సంవత్సరము మార్చినెల 10 తేదిని డెన్మార్కు రాజకూఁతురైన అలెగ్జాండ్రా రాజపుత్రినివివాహమాడియామెవలన నిద్దఱుకుమారులను ముగ్గురుకుమారికలను గాంచెను. ఈతని జ్యేష్ఠపుత్రుఁడయినయాల్బర్టు

విక్టరనునతఁడు 1864 వ సంవత్సరమున జనేవరు నెల 8 వ తేదీని, ద్వితీయపుత్రుఁడయినజార్జి ఫ్రిడరి క్కనునతఁడు 1865 వ సంవత్సరము జూన్ నెల 3 వ తేదీని జననమొందిరి. ఇట్లు రాణిగారికి నలువది యైదవయేట మొదటిపౌత్రుఁడు కలిగెను. 1872 వ సంవత్సరాంతమున మనయువరాజుగారికి విషజ్వరముతగిలి ప్రాణాంతోపద్రవదశ వచ్చినట్లు కనఁబడినను, ఈశ్వరానుగ్రహమువలన నతఁడు స్వస్థుఁడయి మరలఁ బ్రజలలోఁ [illegible]ను. అతనికి రోగశాంతియైనందున ఈశ్వరునికిఁ గృతజ్ఞతాభివందనములు సమర్పించుటకయి [illegible]క్కలండన్ నగర దేవా



వేల్సుప్రభువు—రాణిగారి ప్రథమ పుత్రుఁడు.

లయములోనే 13000 జనులుచేరిరి. యువరాజువారి రూపమీ ప్రక్క-పుటయందలి పటమున [illegible] యున్నది.



వేల్సు ప్రిన్సెస్ — రాజ్ఞీగారి పెద్దకోడలు.

ఈయువరాజుగారు 1875 వ సంవత్సరము అక్టోబరు నెలలో నింగ్లండు నుండి బైలుదేఱిమనభరతఖండమునకువచ్చి యిచ్చటఁగొన్నిమాసము లుండి యిందు దర్శనీయములైనస్థలములనెల్ల సందర్శించి 1876 వ సంవత్సరమున మరల స్వదేశమునకు విజయంచేసిరి. ఈయనహిందూ దేశమునందుండినకాలములో నిందలిప్రజలుకనఁబఱచినరాజభక్తియు సంతోషమును నెల్లవారునుస్వానుభవముచేఁ నెఱిఁగియుందురుగాన నిందువివరింపవలసిన యావశ్యకములేదు. ఇతఁడుసాండ్రింఘాముసంస్థానమును గొని యందువ్యవసాయము పెట్టి పసుజాతియొక్క వంగసమును బాగుచేయుటకై యెంతో పనిచేసెను. ఇతఁడు లండనునగరమునం దొక మహాప్రదర్శనాలయమును స్థాపించి యందు బ్రిటిషుద్వీపములలోను బ్రిటానియారాజ్యమునకులోఁబడిన సమస్తదేశములలోనుచేయఁ బడుశిల్పములయొక్కయు నుత్పన్నములయొక్కయు ధాన్యాదులయొక్కయు మాదిరుల నుంచుటకేర్పాటుచేసెను. ఈయేర్పాటువలననే దేశమునం దేయే వస్తువిశేషములున్నవో తెలిసికొని వానినిదెప్పించుకొనుటకు జనులకవకాశముకలిగి తన్మూలమున వాణిజ్యాభివృద్ధికలుగును. ఇతఁడుతనకుమారుల విద్యాభివృద్ధివిషయమునను దనతండ్రివలెనే యధికశ్రద్ధను జూపెను; బాల్యదశయందుండఁగానే వారి నొకయుపాధ్యాయునివశమున నొప్పగించి ప్రపంచముచుట్టును దిరిగివచ్చునొకయోడలోఁబంపెను; వారి నటుతరువాత నోడలో నావికులనుగాఁ బెట్టి యోడనడుపువారు చేయుపనులనెల్ల వారికి నేర్పించెను. వీరిలో పెద్దవాఁడయిన యాల్బర్టు విక్టరు రాజకుమారుఁడు 1960 వ సంవత్సరమున మన హిందూదేశ మునకువచ్చెను; ఇతఁడుగుఱ్ఱపుసేనలోనొకనాయకుఁడుగా నియమింపఁ బడెను. రెండవవాఁడయిన జార్జ్ ఫ్రెడరిక్కు నావికసేనానాయకుఁడు గా నియమింపఁబడి యప్పుడొకయుద్ధనౌక కధికారిగా నున్నవాఁడు. మన యువరాజుగారి జ్యేష్ఠపుత్రుఁడును క్లేరెన్సుప్రభువునైనయాల్బర్టు

రాజపుత్రుఁడు 1896 వ సంవత్సరమునందు లోకాంతరగతుఁడగుట సంభవించెను. యువరాజుగారి ద్వితీయపుత్రుఁడును యార్కుప్రభువు నయినజార్జిఫ్రెడరిక్కునకు 1893 వ సంవత్సరమునందు వివాహము చేయఁబడియాతనివలన 1894 వ సంవత్సరమునందు రాణిగారికి మొదటి ప్రపౌత్రుఁడు కలిగెను.

3. కుమారుఁడు పుట్టినసంవత్సరముమీఁద నైదుమాసముల కనఁగా 1843 వ సంవత్సరము ఏప్రిల్ నెల 25 వ తేదిని రాణీగారికి మరలకూఁతురుకలిగెను. ఈరాజపుత్రిపేరు ఆలిస్. ఈమె చిన్నతన ములోఁ గొంత పరిహాసప్రియురాలుగాను వ్యాయామ నిరతురాలు గాను నుండినను, పెంపొందినకొలఁదిని దూరదృష్టియు వివేకమును గలదయి పరోపకారపారీణురాలు కాఁజొచ్చెను. 1861 వ సంవత్సర మునందుఁ దండ్రివ్యాధిగ్రస్తుఁడయియుండినకాలములో నీమెయే సదా యాతనివద్దగనిపెట్టుకొనియుండినసముపచారములను జేసెను. 1862 వ సంవ్సరముజూలయి నెల1వ తేదీని జర్మనీలోని హెస్సీ దేశపులూయిస్ రాజకుమారునకీమెనిచ్చివివాహము చేసిరి. వివాహసమయమునందీమెకు పార్లమెంటుసభవారు ముప్పదివేలపౌనులు(మూఁడులక్షలరూపాయలు) అరణమును, ఆఱువేలపౌనులు (అఱువదివేలరూపాయలు)సాంవత్సరిక స్త్రీధనమును, ఇచ్చుటకేర్పఱిచిరి. ఈమె తల్లివలెనే తనబిడ్డలనుదానే స్వయముగాఁబెంచుచు వారికి బట్టలు తానే కుట్టుచుండెను.తల్లివలెనే యీమెయుబీదలకుటీరములకుఁ బోయిచూచుచు వారికిఁదగినసాయము చేయుచుండెను. ఫ్రెంచివారికిని జర్మను దేశస్థులకును యుద్ధముజరగు చుండినకాలములో నీమె గాయపడినసైనికుల సంరక్షణమునిమిత్తము దాదులను నియమించుటయేకాక వైద్యశాలలలో రోగులను దిన్నఁగాఁ జూచుచున్నారో లేదో పరీక్షించుటకుఁ దాను వైద్యశాలలకుఁ బలు మాఱు పోవుచువచ్చెను. ఈమె యొకసారి స్త్రీవైద్యశాలకుఁ బోయి

నప్పు డావైద్యశాలాధికారిణి 'మీానిమిత్తముశ్రమచేయుచున్నయీామె యెవరో యెఱుగుదురా' యని యచ్చటి వ్యాధిబాధితలతోఁదన్నుఁ గూర్చి చెప్పఁబోఁగా వారించి యీామె "వలదు. నేనిచ్చటికిరోగపీడిత లయిన స్త్రీలక్షేమమును విచారించునిమిత్త మొకసోదరినిగా వచ్చి నాను," అని పలికెనఁట. ఇట్టిపరోపకారగుణముచేత నీమెతనకొఱకుఁ గాక లోకముకొఱకుద్భవించినట్లు కనఁబడెను. అందుచేత దేశములోని గొప్పవారును కొలఁదివారును గూడ నేకరీతిగా నీమెయెడల గౌరవాను రాగములు గలవారయి యుండిరి. లోకములో నెంతమంచివారికిని కష్ట ములు రాకమానవు. 1873 వ సంవత్సరమునం దీమెయిద్దఱుకుమారు లలో ద్వితీయుఁడు మేడగవాక్షములోనుండి క్రిందఁబడి యీామెకన్నుల యెదురనే ప్రాణములు విడిచెను. 1878 వ సంవత్సరమునందొక్క సారిగా నీమెభర్తకును బిడ్డ లయిదుగురికిని నపాయకరమయినవ్యాధి వచ్చి యీామెయొక్క నిరంతరోపచార పోషణమువలన నొకశిశువు దక్క తక్కినవారందఱును స్వస్థత నొందినను, ఆవ్యాధియీామెనుబట్టు కొని మ్రింగివేసెను. రాణిగారి కిదియే మొదటి కడుపుశోకము.

4. ఈకొమారిత తరువాత సంవత్సరమునిూఁద నాలుగుమాస ములకు 1844 వ సంవత్సరము ఆగష్టునెల 4 వ తేదీని రాణిగారికి మఱియొక కుమారుఁడు కలిగెను. ఈతనిపేరు ఆల్ఫ్రెడ్డు. ఇతఁడునావిక సేనాధికారిగా నుండి భూమధ్యసముద్రనావికసైన్యమునకుఁ ప్రధాన సేనానాయకుఁడుగానున్నవాఁడు. ఈతనినిజంపుటకయియొకక్రూరుఁడు 1868 వ సంవత్సరమున నడుముపైని తుపాకిని గాల్చెనుగాని లోపల దూఱిన గుండును దీసి చికిత్సచేయఁగా బ్రతికెను. 1869-70 వ సంవ త్సరములలోనితఁడుహిందూదేశమునకువచ్చిచూచిబోయెను. 1874 వ సంవత్సరమునం దితఁడు పూర్వపు రషియాచక్రవర్తి కొమారితయు నిప్పటిచక్రవర్తితోఁబుట్టువునయిన మేరీయను నామెను వివాహమాడి

యామెవలన నొక కుమారుని నలుగురు కూఁతులను గనెను. ఇతడెడింబర్గ ప్రభు వనఁబడుచున్నాఁడు.



ఎడింబర్గ్ప్రభువు—రాణీగారి ద్వితీయ పుత్రుఁడు

5. ఈకొడుకు తరువాత 1846 వ సంవత్సరముమెయి నెల 25 వ తేదిని రాణిగారికికొమారితపుట్టెను. ఈమె పేరు హేలినా. పిల్లల



ఎడింబర్గుప్రభ్వి—రాణిగారి రెండవ కోడలు.

యారోగ్యమునకు జనాకీర్ణములైనపురములకంటె జనపదము లధికానుకూలములుగానుండునని యెంచి వైటుద్వీపమునందు ఆస్బోర్న ననునారామక్షేత్రమునుగొని రాణిగారందు సువిశాలమైననూతనమందిరము నొక



ఆస్బోర్న్ ఆరామగృహము.

దానిని కట్టించిరి. ఈయారామస్థలమును గొనుటకును గృహాదులను కట్టుటకు నిరువదిలక్షలరూపాయలయినవి. రాణిగారుమితవ్యయము చేతను తనభూములను చక్కఁగాఁ జూచుకొని యమర్చుకొనుచుండుట చేతను ఋణముచేయవలసిన యావశ్యకములేక యింతమొత్తమునుదన సొంత యాదాయమునుండి మిగుల్చుకోఁగలిగెను. ఈయారామగృహమునకు చుట్టును ప్రమదవనములు నిర్మించి యందు బహువిధఫలపుష్ప వృక్షములను నాటించుటయేకాక యాల్బర్టుప్రభువుగా రందందుఁజక్కని విహారప్రదేశముల నేర్పఱిచిరి. ఈయుద్యానవనవాటికలోఁ బరిశుద్ధ

వాయువనుభవించుచుమనసువచ్చినట్లుపిల్లలు విహారముసలుపవచ్చును. ఇందొకచోటబాలికాబాలకులనిమిత్తమొక యాశ్రమకుటీరమునిర్మింపబడి దానిముందొక్కొక్కరి కొక్కొక్క చిన్నపూలతోఁటయు వేయఁబడెను. వనపాలకుని నియోగానుసారముగాఁ బ్రతిశిశువును బ్రతిదినమును రెండుమూడుగంటలసేపు తనతోఁటలో పనిచేయవలెను. వారివారి పేరులు వ్రాయఁబడి ప్రతివత్సరమునతనతనతోఁటలో పనిచేసికొనుటకై ప్రత్యేకముగా పనిముట్లియ్యఁబడెను. ఆబాలురనిమిత్తమొక చిన్నకర్మశాలకూడ నిర్మింపఁబడితండ్రియొక్క నిదేశప్రకారముగా బాలురందు వడ్రపుఁబని మొదలయినవి నేర్చుకొనియందఱును జేరితామేయొక చిన్నకోటను గట్టిరి. దానిగోడలకుఁ గావలసిన యిటుకను సహితము మారాజకుమారులు స్వయముగాఁ జేసిరి. ఆయాశ్రమకుటీరములో బాలికలనిమిత్తమొకచోట పాకశాలయొకటి యేర్పాటుచేయఁబడెను. ఆవంటయింట బాలికలు పాకముచేయ నభ్యసించుచు తాముకాపించినకాయలతో కూరలు వండుటకును, ఊరుఁగాయలు పెట్టుటకును, ఫలములను కాపాడుటకును,వివిధములయిన సామాన్యభక్ష్యములు చేయుటకును నేర్చుకొనిరి. ఈబాలిక లప్పుడప్పుడు తాముచేసినవంటను దామే భుజించుచు, కొన్నిసమయములయందుజననీజనకులను భ్రాతలనుగూడవిందులకుఁబిలుచుచుండినను సాధారణముగా వారు చేసినవంట బీదలకుఁబంచిపెట్టఁబడుచుండెను. ఈప్రకారముగా రాణిగారిబిడ్డలకెల్లను విద్యమాత్రమే కాక యుపయుక్తములయిన వృత్తులు సహితము బాల్యమునుండియు నేర్పఁబడుచువచ్చెను. ఈహెలినా రాచకూఁతునకిరువదిసంవత్సరములప్రాయము వచ్చినతరువాతక్రిస్టియన్ అను పేరుగల ఆగస్టెన్ బర్గు రాజపుత్రునితోడ వివాహముజరగెను.ఈమెకుఁగలిగిన సంతానములో నిప్పుడు కొడుకు లిద్దఱును కూఁతు లిద్దఱును జీవించియున్నారు.

6. 1848 వ సంవత్సరము మార్చినెల 21వ తేదిని రాణి

గారికి మరలనొకకూఁతురు జననమొందెను. ఈమె పేరులూయిసీ. ఈమె జననమొందిన సంవత్సరములోనే రాణిగారు స్కాట్లాండు దేశములోని యున్నతప్రదేశమునందు బాల్మోరల్ అనుగిరిదుర్గమునొకదానినిగొనిరి.



బాల్మోరల్ గిరి దుర్గము.

దీనియావరణ మేడుమైళ్ళపొడుగును నాలుగుమైళ్ళ వెడల్పును గలదిగా నున్నది. ఈకోట యొక్క యేటియొడ్డుననుండి చుట్టును రమణీయప్రదేశ మును గలదిగానున్నది. ఇందు వాయువు శుద్ధమయి యుత్సాహజనక ముగానుండును. ఇక్కడ బిడ్డలు గుట్టలకెగఁబ్రాకుచు, సెలయేళ్ళను దాటుచు, అడవిపువ్వులనుగోయుచు, కొండలపయి దుముకులాడు జింక లనుజూచుచు, వినోదింపవచ్చును; ఏదో కొండకోనఁకు ప్రక్కను జన సంఘమునకు దృగ్గోచరము కాకుండ వనభోజనములుచేసి యానందింప వచ్చును. ఇక్కడనున్న కాలములో రాణిగారును భర్తయు బీదలగుడిసె లకుఁబోయి చూచుచు, పనిలేనివారికి పనికల్పించుచు, అత్యావశ్యక మయినప్పుడొక పశువును మేపుకొనుటకో యొక చిన్నతోఁట వేసికొను టకో కొంచెముభూమినియిచ్చి యాదరించుచు, పేదవారి నెన్నోవిధములఁ గనిపెట్టుచుండిరి వారక్కడి బసులకుఁబోయి పిల్లలపాటలను జాతములను విని వారికి బహుమానములిచ్చుచుందురు. రాణిగారు తామొక్కరును గూడ బీదలగుడిసెలలోనికిఁ బోయి వారిక్షేమమును విచారించుచు, అరమరికలేక వారితోఁ గలిసికూరుచుండి పలుకులాడుచు, పిల్లలకాట వస్తువులనిచ్చుచు, వృద్ధులకును రోగులకును బట్టలు మందులు మొద లయినవి యిచ్చుచు, సర్వవిధముల వారిసుఖసంతోషములకు సహాయ పడుచుందురు. ఇట్టిపనులతోఁ గాలముగడపుచు రాణిగారు రాజకీయ వ్యవహారముల నుపేక్ష చేసియుందురనికొందఱనుకోవచ్చును. ఈమెకుఁ బూర్వులైనరాజు లెవ్వరును రాజ్యతంత్రములలో నీమెయంత శ్రద్ధ చేయుచువచ్చినవారు లేరు. ప్రతికార్యమునకునుగాలనియమమేర్పఱుచు కొని సరిగా నాయాకాలములో నాయాపనిని నిత్యమును దప్పక నిర్వ హించుచుండుటచేత నీమెయెంతపనినైనను జేయఁగలుగుచుండెను. ఈమెసూర్యోదయముతో నేనిద్రనుండి లేచును; తొమ్మిదిగంటలవేళ భర్త తోఁగలిసి ప్రాతఃకాలభోజనముచేయుట; కొంతసేపు విహరించి వచ్చిన

తరువాత సొంతపనిచేసికొనును; రెండుగంటలకు ఫలాహార మయినతరువాత మంత్రులతోఁ గలిసి సాయంకాల మైదుగంటలవఱకు రాజ్యాంగ వ్యవహారములను జక్కఁబెట్టును; తరువాత గంటసేపు భర్తతోనో యతఁడు రానప్పుడు తల్లితోనో కలిసి బండిలో విహారమునకుఁ బోయి వచ్చి సంగీతాదివినోదములతోను గ్రంథపఠనముతోను గొంతసేపు గడపి రాత్రి యెనిమిదిగంటలవేళ సకుటుంబపరివారముగా భోజనము చేయును. ఆదంపతు లతిభోగాసక్తులుగాక సామాన్యములయిన పదార్థములనే భుజించుచుండురు. బాల్మోరల్ దుర్గమున నుండినప్పుడు రాణిగారప్పుడప్పుడుకొండ లెక్కుచుండుటయు, తద్భర్త మృగయావిహారము సలుపుచుండుటయుఁ గలదు. 1849 వ సంవత్సరము మెయినెల 19 వ తేదని విహారమునకుఁ బోయినప్పుడు విల్లియమ్ హామిల్టన్ అనువాఁడు రాణిగారి బండిమీఁద చేతితుపాకిని గాల్చెను. వాఁడు వెంటనే పట్టుకొఁబడి విమర్శమీఁద నేడుసంవత్సరములద్వీపాంతరవాసశిక్షనుబొందెను. లూయిసీ రాజపుత్రి 1871 వ సంవత్సరమునందు లోర్న్ ప్రభువును వివాహమాడెనుగాని యీయామెకు సంతానము కలుగలేదు.

7. 1850 వ సంవత్సరము మెయినెల 1 వ తేదిని రాణిగారికి తృతీయపుత్రజనన మయినది. ఈతని కార్థరనుపేరు పెట్టఁబడినది. ఇతఁడే కెన్నాటుప్రభువు. ఇతఁడు పుట్టి నెలదినములయినతరువాత రాణిగారు వ్యాధిబాధితుఁడయియుండిన తనపినతండ్రినిజూచియీవలికివచ్చినప్పుడు లెప్టినెంటుప్లేట్ అనునతఁడుముందుకువచ్చి యామెనెత్తిమీఁద తనచేతికఱ్ఱతో సత్తువకొలఁదినిగొట్టెను. శిరస్సుమీఁదనున్నటోపీవలన గొంతదెబ్బ యాగినను రాణిగారినొసటనుగాయమయినది. విమర్శింపఁబడినప్పు డతనిపక్షమునఁ జిత్తచాంచల్యమని వాదింపఁబడెనుగాని ధర్మాధికారు లావాదము నంగీకరింపక యేడుసంవత్సరము లాతని ద్వీపాంతరమునకుఁ బంపిరి. 1851 వ సంవత్సరమునందు రాణిగారి భర్తయైన

యాల్బర్టుప్రభువువారి ప్రయత్నములవలన లండన్ నగరములోని జనో ద్యానములో నొకమహాప్రదర్శనము జరిగినది. లోకములోఁగలసమస్త విశేషవస్తువులు నొకచోట సమకూర్చుటయు సమస్తదేశములవారును నొకచోట సమావేశమగుటయు నందుమూలమునఁ బరస్పరైకమత్య మును వాణిజ్యాభివృద్ధియుగలుగుట నీప్రదర్శనముయొక్క ముఖ్యో ద్దేశములు. ఇందు నిమిత్తమయి జనోద్యానవనములో నిరువదియైదు వేలజనులు ధారాళముగాపట్టఁదగిన విశాలభవనము కట్టఁబడినది. ఈ ప్రదర్శనము మెయినెల 1 వ తేది మొదలుకొని యైదుమాసములపదు నైదుదినములు జరిగినది. మొదటిదినమున రాణిగారుభర్తతోను దన పెద్దకొమారునితోనుకొమారితతోను గలిసి ప్రదర్శనమందిరమునుబ్ర వేశించినప్పుడు లోపలనున్నయిరువదియైదువేల్వునుగాక వెలుపల నేడుల క్షలజనులుగూడిరాజదంపతులనభినందించిరి. ఈప్రదర్శనముజరిగినకాల ములోఁజూడవచ్చినవారిసంఖ్య యఱువదిరెండులక్షలు; వారివలనపోగ యినసొమ్మమొత్తమయిదులక్షలపౌనులనగానేఁబదిలక్షలరూపాయలు. కెన్నాటుప్రభువు 1879 వ సంవత్సరమున ప్రష్యాదేశపు రాజపుత్రి యైన లూయిసీకాంతను వివాహమాడి యామెవలన నొకకుమారుని నిద్దఱు కుమారికలను గనెను. ఇతఁడు కొంతకాలము మనహిందూదేశ మందుండిబొంబయిరాజధానిలోని సేనకెల్లను ముఖ్యసేనానాయకుఁడు గా నుండెను.

8. రాణిగారికి 1853 వ సంవత్సరము ఏప్రిల్ నెల 7 వ తేదిని నాలవ పుత్రుఁడయిన లియోపాల్డు పుట్టెను. ఇతఁ డాల్బనీప్రభువుగాఁ జేయఁబడెను. ఇతఁడు బాల్యమునుండియు దుర్బలుఁ డయియుండినను, విద్యావిశేషముచేతనుగుణసంపత్తిచేతను దండ్రినిబోలినవాఁడు. ఈతఁడు 1882 వ సంవత్సరమునందు హెలినా రాజపుత్రిని పరిణయమయి యామెవలన నొకపుత్రికను గని 1884 వ సంవత్సరమున లోకాంతర

గతుఁడయ్యెను. అంతకుమున్ను గర్భవతియై యుండిన యాతనిభార్య యాతని మరణానంతరమున నొకచిన్నకొమారుని గనెను.

9. రాణిగారికి 1857 వ సంవత్సరము ఏప్రిల్ నెల 7 వ తేదిని మరల నొకకొమారితకలిగెను. ఈమెయే రాణిగారి కడపటిపుత్రి. ఈ రాజపుత్రిపేరు బీట్రిస్. పెద్దతనములో తల్లికిఁ బ్రాపుగానుండవలెనన్న యుద్దేశములో నీమె యిరువదియెనిమిదేండ్లు వచ్చువఱకును వివాహ మాడకుండెనుగాని తరువాత 1885వ సంవత్సరమునందు బాటెన్ బర్గ రాజపుత్రుఁడైన హెన్రీయను నాతనిని వివాహమాడి భర్తతోఁగూడ వేఱుగా తల్లియొక్క రాజభవనమునందేవసించుచుండెను. ఈమెవివా హమునాఁటికే రాణిగారికి మనుమలును మనుమరాండ్రును ముప్పది నలుగురు కలిగి వారిలో నిరువదితొమ్మండ్రిప్పుడునుజీవించియున్నారు. ఈమెభర్తయాఫ్రికాఖండమునకు సేనానాయకత్వమును వహించిపోవు చు మార్గములో సముద్రముమీఁద 1896 వ సంవత్సరారంభమున విషజ్వరముచేత దేహవియోగము నొందెను. ఈమెకుముగ్గురు కొమా ళ్ళును నొకకొమారితయుఁ గలిగిరి.

నిరుపేదలకు వలెనే మహారాజులకును కష్టములుండును. బీదలకు లేని దుఃఖములును సంపన్నులకనేకములుకలుగుచుండును. ఈవఱకెన్ని సారులు దురాత్ములురాణిగారిప్రాణములకెగ్గుతలఁచిరో చదువరులెఱిఁగి యున్నారుగదా. బయట నెన్ని దుష్ప్రయత్నములు జరుగు చుండినను గృహమునఁగష్టములురానందున రాణిగారికిఁ బూర్ణమయినమనశ్శాంతి కలిగియుండెను. దినము లెల్లకాలము నేకరీతిగా జరగవు. ఇట్లుసంపూర్ణ సౌఖ్యము ననుభవించుచుండిన కాలములో 1861 వ సంవత్సరమున విపత్పరంపర ప్రారంభమయ్యెను. ఆసంవత్సరముమార్చినెలలో రాణి గారిప్రియమాతయైన కెంటుప్రభ్వీలోకాంతరగతు రాలయ్యెను. తండ్రి పోయినపసిబిడ్డను పెంచి పెద్దదానిని జేసినప్రాణసమాను రాలయిన

జననియొక్క మరణమునకే పరితపించుచుండిన రాణిగారికా సంవత్సరాంతమున గోరుచుట్టుపయి రోకటిపోటువలెఁ బ్రాణాధికుఁడయిన భర్తయొక్క మరణముకూడ సంభవించెను. మృత్యుదేవతయొక్క చరిత్రము మహావిచిత్రమైనది. మృత్యువు చావు కావలెనని కోరువారి చెంతకు రాక బ్రతుకవలెనని యపేక్షపడువారిని జేరి తఱుచుగా వారిని మ్రింగివేయును. ఒక్కవారమెడఁబాయవలసివచ్చినప్పుడు తల్లడిల్లఁ జింతిల్లెడి యాదంపతులయొక్క నిరంతర పరస్పరానురాగము నొక్కింత తలఁపుననిలిపినవారామెకు శాశ్వతపతివియోగము మెంతదుర్భర వేదనను గలిగించియుండునో కొంత తెలిసికోవచ్చును. ఆల్బర్టుప్రభు వొక్కసారి భార్యను విడిచి రెండుదినములు లివర్పూలు పట్టణమునకుఁ బోయినప్పుడు "నా ప్రియతముఁడైన ప్రాణవల్లభుఁడింటలేక నేనత్యంతాసహాయురాలనయి యున్నాను. ఇతరదంపతులు పలుమాఱొండొరులను విడిచియుందురని నేనెఱిఁగినదాననయ్యును అట్టి వియోగమునకు నేనెన్నఁడు నలవడఁగలుగుదుననుకోను......అతఁడులేక నాకేదియు నింపుగ నుండదు. అతనినుండి యెడఁబాసియుండుట రెండుదినములయినను నాకదెల్లప్పుడును భయంకర వేదనను గలిగించును. అతని యనంతరమున నన్ను బ్రతికింపకుండుటకయి దేవునిఁ బ్రార్థించుచున్నాను. అతఁడు నాకన్నులయెదుర నుండి నన్నుఁ బ్రేమించుచుండుటయే నాభాగ్యము." అని స్టాక్మారుద్వార పేర వ్రాసిన రాణిగారికిఁ బతిశోకము దుస్సహమగునని వేఱుగఁ జెప్పవలసినపనియుండదు. రేపు రాఁబోవునది నేఁడు తెలియదు. తమ కల్పకాలములోనే కలుగనున్న స్థిరవియోగకష్టమును లేశమైనను దెలిసికోలేక యారాజదంపతులాసంవత్సర మెంతో సంతోషముతోఁ దమయిరువదియొకటవయేటి పెండ్లిదినపు పండుగ చేసికొనిరి. వివాహదినోత్సవము చేసికొన్న మఱునాడు రాణిగారు తన మేనమామయగు లియోపాల్డు రాజుగారికి—"నిజముగా సుఖప్రదములైన వివాహబంధములవలనఁ

గలుగు సంపూర్ణమైత్రిని దయను ప్రేమమునుమాత్రమే కాక తమపైని భర్తలువివాహారంభదశలో ననురాగవిశేష మెంతచూపిరోయంతయిప్పుడును జూపుచున్నారని యిరువదియొక్కయేండ్లకుఁ దరువాతనావలె జెప్పఁగలుగువారు మిక్కిలి తక్కువగా నుందురు.'' అనివ్రాసిరి. గుణవంతుఁడగు కాంతుఁడు లోకాంతరగతుఁడయినప్పుడు కాంత కాతని సుగుణసంపద యెల్లను అపుడనువచ్చును; ఆల్బర్టు ప్రభువుగుణవంతులలో నగ్రగణ్యుఁడు; సదా పరోపకారచింతగలవాఁడు. అట్లగుటచే వివాహబంధమూలమునఁదాను స్వస్థలమునుగాఁ జేసికొన్న యింగ్లాండు దేశముయొక్క ప్రజల సౌఖ్యాభివృద్ధికిఁ దోడుపడవలెనన్న పరిశుద్ధచింతతో నతఁడు వివాహమయినది మొదలుకొని యింగ్లీషుభాషాజ్ఞానమునువృద్ధి చేసికొని, ఆంగ్లేయులయాచార వ్యవహారములను రాజ్యాంగపద్ధతులను ధర్మశాస్త్రములనువివిధవ్యాపారములనుబూర్ణముగా గ్రహించుటకయి యావచ్ఛక్తిని బాటుపడఁజొచ్చెను. 1840 వ సంవత్సరమునందింగ్లీషు భాషలో నతఁడు మొట్టమొదటఁ జేసిన ప్రసంగము బానిసవ్యాపారము మాన్పుట యావశ్యకమని. బీదలమేలునకయి తాను జేయఁ గలిగిన దెల్లఁ జేయుటకును దేశోపకారకమయిన యేపనిలోనయినఁ దనుతోడుపడుటకును నతఁడు సర్వదా సంసిద్ధుఁడగుచుండెను. ఇట్టివంటిభర్తమృతుఁడయినతరువాత రాణిగారు బహుసంవత్సరములవఱకును వెలుపలికి రాలేదు. అయినను దాను దుఃఖసముద్రములో మునిఁగియుండియుఁ దన ప్రజలదుఃఖమునకుపరితాపపడుచుతన్ని వారణమునకయియామె యెన్నడును బ్రయత్నముచేయకయూరకుండుట లేదు. పెనిమిటిపోయిన నెలదినములలోపల బొగ్గుగని యొకటి కూలి యందున్నూటయిరువదిమనుష్యులు ప్రాణములతో పూడిపోవుటతటస్థించెను. ఆమహావిపత్తును వినఁగానే శ్రీవిక్టోరియారాజ్ఞి తన సంతాపమును మఱచి యా మృతులపత్నులకొఱకునుమాతలకొఱకునుసంతాపపడుచువారిదుఃఖోపశమనార్థముగా

తంత్రీముఖమున ననునయవాక్యములను దెలిపి వారి సాయమునకయి యిన్నూరుపౌనులను (రెండువేలరూపాయలను) బంపెను. 1863 వ సంవత్సరమునందు యువరాజయిన తన జ్యేష్ఠపుత్రుని వివాహమహోత్సవము జరిగినప్పుడామె దేవాలయములో నొకమూలనొంటిగాఁ దలవంచుకొని కూరుచుండి చూచి వెడలిపోయెను. ఇట్లామె చిరకాలము సభలు మొదలయినవానికి వేనికిని రాక యేకాంతచర్యను కాలముగడుపుచుండి సను రాజకార్యములమాత్ర మెప్పుడు నుపేక్షచేయక యథాప్రకారము గానే యప్పుడును నిర్వహించుచుండెను. 1862వ సంవత్సరము డిసెంబరు నెల 14వ తేదిని భర్తయొక్క సాంవత్సరికమునాఁడు తనబిడ్డలతోఁ గలిసి రాణిగారు నూతనముగాఁ గట్టఁబడిన పెనిమిటియొక్క సమాధివద్దకుఁ బోయిరి. ఈసమాధిమందిరమును గట్టుటకయి యిరువదిలక్షల రూపాయలను రాణిగారు దమసొంతసొమ్ములోనుండియే పెట్టుకొనిరి. ఇంతసొమ్మును రాణిగా కొక్కసంవత్సరములో నెట్లు తేఁ గలిగి రని కొంద అడుగవచ్చును. 1852వ సంవత్సరమునందు న్యాయవాదియొకఁడు తన మరణశాసనములో తనకుఁగల యిరువదియైదులక్షల రూపాయలసొత్తును రాణిగారికిఁ జెందవలెనని వ్రాసియిచ్చెను. అతనికి బంధువు లున్నయెడలఁ దానావిత్తమును గైకొనననని మొదట రాణిగారు నిరాకరించినను బంధువులు లేరని తెలిసినపిమ్మట స్వీకరించిరి. ఇప్పుడు వ్యయపెట్టిన సొమ్మిదియే కాదు.

ఇద్దరు అల్లుండ్రును నొక్కకొమారితెయు నొక్కకొమారుఁడును యుక్తవయస్సువచ్చిన పౌత్రుఁడొకఁడునుపరలోకగతులయి రాణిగారికి మనోవ్యథను గలిగించినవార్త యీవఱకే చెప్పఁబడినది. 1865 వ సంవత్సరము డిసెంబరు నెల 9వ తేదిని రాణిగారి ప్రియమాతులుఁడైన లియోపాల్డుప్రభువు లోకాంతరగతుఁడయ్యెను. ఇతఁడు డెబ్బదియైదు సంవత్సరములు బ్రతికి వార్ధకదశలోనే స్వర్గస్థుడైనను, భర్తను జనని

కిని తరువాత రాణిగారీ మేనమామనుగూర్చియే యధికదుఃఖమునొంది దిరి. రాణిగారు జననమొందినది మొదలుకొని యాతఁడామెక్షేమాభి వృద్ధులయందు శ్రద్ధచేసి సింహాసనమునకువచ్చినతరువాతఁ బ్రథానాంశములయందెల్ల నామె కాలోచనచెప్పుచు నాంతరంగికమంత్రియునాప్త బంధుఁడును ప్రాణమిత్రుఁడునై యుండెను. ఇటీవలరాణిగారి ప్రాణము లఁగొనుటకయిమటిరెండుయత్నములుచేయఁబడినవి. రాణిగారి జ్యేష్ఠ పుత్రుఁడైనయువరాజుగారికిప్రాణముమీఁదికివచ్చి నిమ్మళించినతరువాత గొన్నిదినములకామెవిహారమునకువెడలివచ్చిరాజభవనావరణములోఁ బ్రవేశింపఁగానే పదునేడుసంవత్సరముల యీడుగల ఆర్థర్ ఓకొన్నర్ అనెడియైరిష్‌వాఁడొకఁడు కుడిచేతిలోనొకచేతితుపాకియు నెడమచేతిలో నొకవిజ్ఞానపత్రమును బట్టుకొనివచ్చి తుపాకిని రాణిగారిమీఁద గురిపెట్టి చేయి చాచెను. రాణిగారిపరివారములో ముఖ్యుఁడయిన జాన్ బ్రౌననునతఁడు వెనుకనుండివచ్చి వానినిబట్టుకొని శోధింపఁగా, తుపాకిలోపట్టిమందే కాని గుండులేకపోయెనుగాని వానియొద్దనొకకత్తికూడఁ గనఁబడెను. వాఁడువిమర్శింపఁబడిదెబ్బలశిక్షయునొకయేడుకారాగృహ వాసశిక్షయు నొందెను. 1882వ సంవత్సరము మార్చినెల 2 వ తేదీనిరాణిగారు లండన్‌నగరమునుండివచ్చుచువిండ్సర్ నగరు వొచ్చుచుండఁగా రోజర్ మెక్లీననువాఁడుబండిమీఁద తుపాకిని గాల్చెనుగాని దైవికముగా నెవ్వరునుగాయపడలేదు వాఁడువిమర్శింపఁబడి పిచ్చివాఁడయినట్టు స్పష్టపడినందున రాణిగారియిచ్చవచ్చినంతకాలము చెఱసాలలోనుండునట్లు విధింపఁబడెను. రాణిగా రిరువదియొక్కసంవత్సరములు కన్యాత్వదశలోనుండియిరువదియొక్కసంవత్సరములువైవాహికసౌఖ్యమునను భవించి ముప్పదియాఱుసంవత్సరములనుండి వైధవ్యావస్థనుబూనియిప్పటికి డెబ్బదియెనిమిదియేండ్ల ప్రాయముగలవారయియున్నారు.

---

# మూడవ ప్రకరణము

## ప్రభుత్వదశ

రాణిగారి రాజ్యపరిపాలనమును గూర్చి వివరించుటకై యీమెను డెబ్బదియెనిమిదేండ్ల వార్ధక్యదశనుండి పదునెనిమిదేండ్ల బాలప్రాయమునకు మరలం దీసికొనిరావలెను. 1837వ సంవత్సరమునందు డెబ్బదియేండ్లరాజు రాజ్యమును విడిచి స్వర్గస్థుండు కాంగాం బదునెనిమిదేండ్ల యబల తద్రాజ్యభారమును వహించుటకుపస్థమయ్యెను. జూన్ నెల 20వ తేదిని తెల్లవారుజామున రెండుగంటలు దాటినతరువాత రాజు విగతజీవుండు కాంగానే కాంటర్బరీ ప్రధానమతాచార్యుండును కానింఘాము ప్రభువును విండ్సర్ రాజభవనమును విడిచి రాణిగారికా దుఃఖవార్తను విన్నవించుటకై కెన్సింగ్టన్ నగరికై బయలుదేఱిరి. వారారాచనగరు చేరునప్పటికైదుగంటలసమయమయ్యెను. అక్కడనందఱును గాఢనిద్రలోనున్నందున నగరు నిశ్శబ్దముగాయుండెను. వారు గంటవాయించివాయించి యెంతోసేపు తలుపుతట్టంగాతట్టంగా దుదకులోపలినుండివచ్చినపరిచారికతోం దామొక ముఖ్యకార్యమునుగూర్చి ముచ్చటించుటకయి దర్శనార్థము వచ్చితిమని రాజపుత్రితో మనవిచేయుమని చెప్పంగా నాసేవకురాలు రాచకొమారితమంచినిద్రలోనున్నందునం దానామెకు నిద్రాభంగముచేయసాహసింపంజాలనని యుత్తరముచెప్పెను. అపయినివారు "మేమిప్పుడు రాజకార్యముమీద రాణివద్దకువచ్చినాము; ఆమెనిద్రసహితము దానికెడమియ్యవలెను" అనిపలికిరి. పరిచారిక లోపలికిం బోయిన కొన్ని నిమిషముల కెల్లను రాత్రి కట్టిన పడకబట్టతోనే తన దీర్ఘ శిరోజములు

వీపున జీరాడఁ గన్నుల నీరుగ్రమ్మ రాజపుత్రీవారున్న గదిలోనికి నడచి వచ్చెను. వారు తాము వచ్చిన సమాచారమును విన్నవింపఁగా నేయామె యాప్రధానాచార్యుని నుద్దేశించి “నాకొఱకీశ్వరునిఁ బ్రార్థింపుము” అని ప్రథమవాక్యము పలికెను. అప్పుడు వారందఱును మోకరించుకొని యామె భావిగౌరవపదమునకు వలయు బుద్ధిని బలమును బ్రసాదింపవలయునని దేవునిఁ బ్రార్థించిరి. ఆమె రాజ్యపాలనమిట్లు ప్రారంభమయ్యెను. అటుతరువాత నామె వెంటనే తన పెదతండ్రి భార్యయైన యడిలెయిడ్ రాణిపేర పితృవ్యమరణమును గూర్చి తన వ్యసనమును దెలుపుచు శోకోపశమనలేఖ వ్రాసి యాయుత్తరమును ముడిచి పై పేరు ‘మహారాజ్ఞిగారి’ కని వ్రాయఁగాఁ జూచి దగ్గఱనున్న చనవరి యొకరు ‘గతమహారాజ్ఞిగారి’ కని చిరునామ వ్రాయవలెనని హెచ్చరించిరి. ‘ఆమెకుఁ గలిగిన మార్పు నే నెఱుఁగుదును; అయినను దాని నామెకు స్మరణకుఁ దెచ్చుటకు నేను మొదటిదాననుగానుండను’ అని చెప్పి యట్లే యాయుత్తరము నామె పెదతల్లికిఁ బంపివేసెను. ఈయొక్క సంగతియే యామెయొక్క యుదారభావమును సౌజన్యమును సహస్రముఖములఁ బ్రకటించుచున్నది.

తరువాత నామె తల్లియొద్దకుఁ బోయి కొంతసేపామెతోఁ గడపెను. తొమ్మిదిగంటలగునప్పటికి ప్రధానమంత్రియైన మెల్బోర్న్ ప్రభువు రాణిగారి దర్శనమునకు వచ్చి నాఁటిదినము పదునొకండుగంటల కాంతరంగికసభ కూడుననియు నామె విజయంచేసి సభ్యుల యభివాదనములంగీకరించి స్వాభిప్రాయప్రకటనము చేయవలయుననియు విజ్ఞాపనము చేసెను. ఆమెయాశౌచమును సూచించు వస్త్రములుధరించి సరిగాపదునొకండుగంటలకు సభామందిరమును బ్రవేశించి తనపినతండ్రులెదురేగి తోడ్కొనిరాఁగా ముందుకువచ్చి వినమ్రమై పీఠమును స్వీకరించి విస్పష్టమయిన మధురస్వనముతో నిర్భయముగాఁ దన ప్రకటనము నిట్లు చదివెను,—

"నాప్రియపితృవ్యులైనరాజుగారిమరణం వలన దేశమునకుసంభవించినమహాదుఃఖకరనష్టమురాష్ట్రముయొక్క పరిపాలనకృత్యమును నాకొప్పగించినది. ఇంతవంటియుత్కృష్టభారము నిట్లు యాకస్మికముగా నింతపిన్నవయస్సులో నామీఁదఁ బడినందున నన్నీపనికి నియమించిన యీశ్వరుఁడు దీనిని నిర్వహించుటకుఁ గావలసినబలమును నాకుఁ బ్రసాదింపక పోఁడనియు, అల్పకనుఁ బరిపాకమును నల్పకాలానుభవమును గలవారికి సామాన్యముగాఁ గలుగని యుదారభావములను సాధనములను నాకు నాపరిశుద్ధచిత్తములను ప్రజాక్షేమాకరి స్నేహమును గలిగించక పోవనియు, నాకుఁగలయాశయములన్నియు నన్నుఁ బైకి లేవదీయకున్న యెడల నేనీభారముక్రింద క్రుంగవలసినదానననితోఁచుచున్నది.

పార్లమెంటు మహాసభవారి బుద్ధివిశేషమునందును నాప్రజల ప్రభుభక్త్యనురాగములయందును నే నత్యంత విశ్వాసము కలదాననై యున్నాను. * * * * * * నాప్రజల యొక్క స్వాతంత్ర్యములను సర్వదా కాపాడుచు, అన్నితరగతులవారియొక్క సౌఖ్యమును శ్రేయసు మును నా యావచ్ఛక్తిని జూపి వృద్ధి పఱిచెదను.''

ఈప్రకటనచదువఁబడినతరువాతప్రభుసంఘమువారొక్కొక్కరే వచ్చిమోకాళ్ళమీఁదఁ బ్రణమిల్లి కిరీటమును ముట్టి ప్రభుభక్తిని జూపి ప్రమాణములుచేసి పోవుచుండిరి. వారిలో ముందుగా వృద్ధులగు నీ యామెపినతండ్రులు కంబర్లండు ప్రభువును ససెక్సుప్రభువును వచ్చి నప్పు డామె ప్రత్యుత్థానముచేసియెదుర్కొనినను వారు మోకాళ్ళమీఁద బడి మ్రొక్కి చేయి ముద్దిడి రాజభక్తిగలవారమని ప్రమాణముచేసి నప్పుడామె మేను పులకరించెను. బంధుధర్మమునుబట్టి తాను మ్రొక్క వలసినవారు రాజధర్మమునబట్టి తనకు మ్రొక్కవలసినవారగుటయామె మనస్సును కొంత కలఁత పఱిచియుండును. ఆమె పీఠమునుండి లేచి పినతండ్రుల నిద్దఱిని ముద్దుపెట్టుకొని గౌరవించెను. ఈయిరువురు పిన



పట్టాభిషేకోచితమైన వస్త్రాభరణములు ధరించిన విక్టోరియా రాజ్ఞి.

తండ్రులలో కంబర్లాండుప్రభు విప్పుడు హానోవరు దేశమునకు రాజ య్యెను. నాలవవిల్లియముయొక్క యనంతరమున హానోవరురాజ్యము

కూడ రాణిగారికే రావలసియుండెనను స్త్రీలు రాజ్యభారమును వహింప గూడదని యా దేశమునందు విధియేర్పడియున్నందున నారాజ్యమామె పినతండ్రియగు నర్నెస్టు కుమారుని కీయబడెను. సభ్యులందఱును ఒకరితరువాత నొకరుగావచ్చి పీఠముమీఁద వ్రాలి రాజభక్తికలవారమని ప్రమాణముచేసి పోయిరి. ఆదినమక్కడకువచ్చినవారందఱును రాణిగారిసౌమ్యతకు సంతోషించిరి.

ఆమె యాదినముననే నిజముగా రాజ్యపదము నొందినను మఱునాఁడు యథావిధిగాఁ బ్రకటనచేయఁబడినది. ఉత్సవమునకు నియమితమైనకాలమునకు ముందుగానే రాజభవనము ముందఱఁగల వీథులును తోఁపులును వృక్షములును గవాక్షములును సమస్తోన్నత ప్రదేశములును వేడుకచూడవచ్చినజనసంఘముతో నిండిపోయెను. రాణిగారుతమస్థానమునకు రాఁగానే గౌరవచిహ్నములయినఫిరంగులు కాల్పఁబడెను. టోపులు చిమ్ములుచుఁ బోవునట్లుగా జనులు కరతాళములతో జయజయధ్వనులు చేసిరి. రాజు మృతిఁ బొందుటయు నాతనిస్థానమున రాణి సింహాసన మధిష్ఠించుటయుఁ బ్రకటింపఁబడినతరువాత దేశాచారానురూపముగా నడవవలసిన కృత్యములన్నియు క్రమముగాజరగెను. నడుమనడుమ విరామములేక యాకాశము వ్రీలునట్లు జనులు జయఘోషములు చేయునప్పుడామె కన్నులనుండి బాష్పములు బొటబొటపడఁజొచ్చెను. ఆమె మనస్సులో గలిగినసంభ్రమోద్రేకము నణఁచుకొని తంతంతయు ముగియువఱకు నోపికచేసియుండి యుత్సవము ముగియఁగానే తొందరపాటుతో వేవేగ తల్లియున్న గదిలోనికి నడిచి యామెనుకౌఁగిలించుకొనియొక్కసారిగ నేత్రములనుండి బాష్పప్రవాహములు వఱపెను. తల్లిబుజ్జగించి యూరార్చినపిమ్మట విక్టోరియారాజ్ఞి తల్లినిజూచి యిట్లనెను.

'అమ్మా! ఇంగ్లండునకు రాణినని నేను నమ్మలేకున్నాను. నిజముగా నేను రాణినైతి ననుకొనియెదను; కాలేదా ?'

'బిడ్డా! రాణివయినట్టునీ వేయెఱుఁగుదువు. నీవిప్పుడువిడిచివచ్చిన యుత్సవస్థలమే నీకాసత్యమును నిస్సందేహముగా దెలిపియుండవలెను.'

'ఇఁక గొంతకాలములో నేనీనూతనావస్థ కలవాఁడనుపడుదును. ఇది నిశ్చయ మగుటచేతను నీచిన్నముద్దులకూఁతు రీగొప్ప దేశమునకు రాణియని నీవు తలఁచుటచేతను, రాజ్ఞీధర్మమును బట్టి నేఁ జేసికొనెడి యీప్రథమప్రార్థనను జెల్లించెదవా? ఓప్రియజననీ! రెండుగంటలసేపు నన్నొంటిగా విడువఁగోరెదను.'

ఆమెయొంటిగానుండగోరినకారణమేమో చెప్పకయే తెలిసికొన వచ్చును. ఆకాలములో నామె యీశ్వరునికిఁ దన మనోగతమును దెలిపి తనకృత్యమును యుక్తముగా నిర్వహించుటకుఁ దగినబలము ననుగ్రహింప వేఁడుకొని తన మనస్సులోని భారమును తొలఁగించుకొనెను.

శ్రీవిక్టోరియారాజ్ఞి సింహాసనమునకు వచ్చిన యల్పకాలములోనే మంత్రులలో నొకరగు విల్లింగ్టన్ ప్రభు వొక సైనికునికి విధించినమరణ దండనమునుగూర్చిన యనుజ్ఞాపత్రమును సంతకమునిమిత్తము బల్ల మీఁదబెట్టెను. రాణి యదిచూచి కన్నులనీరుగార్చుచు "వీని కను కూలముగా మీరు చెప్పఁదగినదేదియు లేదా?" అని యడిగెను.

"ఏమియు లేదు. వీఁడు మూఁడుసారులు సేననువిడిచి పాఱిపోయి నాఁడు." అని యతఁడు పలికెను.

"ఓ ప్రభువా! మరల నాలోచించి స్మరణకుఁ దెచ్చుకొమ్ము." అని యామె మరలఁ జెప్పెను.

"ఓ దేవీ! వీఁడు సైనికధర్మమునఁ గ్రమముగానడవకపోయినను సత్ప్రవర్తనము గలవాఁడని సాక్షులు చెప్పుచున్నారు. ఇందుకు విరుద్ధముగా నాకేమియుఁ దెలియరానందున వీఁడు మంచివాఁడే యయి యుండవచ్చును." అని యతఁ డుత్తరమిచ్చెను.

"మీకు వేయివందనములు" అని పలుకుచు న్యాయాధికార పత్రముమీఁద "క్షమింపఁబడెను." అనివ్రాసిచేవ్రాలుచేసి కాగితమును చేయివదలక మెల్లఁగా నాతనివైపునకుఁ ద్రోచెను.

పూర్వపురాజులకువలె తండ్రినుండి సొత్తేదియు రానందునను హానోవరు రాజ్యమువలనియాదాయము పోయినందునను పార్లమెంటు సభవారు రాణిగారికి వ్యయములక్రింద సంవత్సరమునకు 385000 ల పౌనులనఁగా ముప్పదియెనిమిదిలక్షల యేఁబదివేలరూపాయల నేర్పాటు చేసిరి. ఈమొత్తములో 60000 పౌను లామె నిలువచేసుకొనునిమిత్తమును, 131260 పౌనులు పరివారముయొక్క జీతములనిమిత్తమును, 172500 పౌనులు భోజనవస్త్రాలంకారాది వ్యయములనిమిత్తమును, 13200 పౌనులు దానధర్మాదులనిమిత్తమును,8040 పౌనులితరవ్యయముల నిమిత్తమును, ఉద్దేశింపఁబడినవి.

రాణిగారు ప్రధానమంత్రి తనవద్దకుఁ దెచ్చినవిషయములలో నెల్లవివరములనువిచారించి తెలిసికొనుచుండిరి కానిసాధకబాధకములను బూర్ణముగావిమర్శించి తెలిసికోక యొక్కయంశములోనుముందు బెట్టిన కాగితముమీఁద చేవ్రాలు చేయలేదు. అది చూచి గూామె మొదటి ప్రధానమంత్రియైన మెల్బోర్న్ ప్రభువు "ఒక్కరాణిదగ్గఱ పనిచేయుటకంటె పదుగురురాజులయొద్ద పనిచేయుట సులభము" అని పలికినట్లు చెప్పుచున్నారు. ఆమె తనవద్దకు తేఁబడిన కాగితములవిషయములో నెల్ల ననేకప్రశ్నలు వేయుచుండుటయే కాక మంత్రులు చెప్పినయుత్తరములుతృప్తికరముగాతోఁచనిపక్షమునమరలనాలోచించిగాని చేవ్రాలు చేయనని పట్టుపట్టుచు నిరాకరించుచు వచ్చెను. ప్రధానమంత్రియొకప్పుడొకరాజశాసనము నామెయంగీకారనిమిత్తము తెచ్చి, కార్యసౌలభ్యమునుబట్టి దాని నంగీకరింపవలెననియేమేమో చెప్పఁబోవుచుండఁగా నామె యాతనిమాట కడ్డమువచ్చి "ఓప్రభువా! తప్పొ యొప్పొయని

విమర్శించుటకు నేను మొదటినుండియు నేర్చుకొన్నాను. కార్య 'సౌలభ్య'మన్నది వినుటకును గ్రహించుటకును నాకిష్టములేనిమాట." అని పలికెను. అతఁ డంతటితో నూరకుండక తనచేతనైనంత బలముతోను నేర్పుతోను వాదించిదానిమీఁద సంతకము చేయుటరాజకార్యమున కత్యంతావశ్యకమనియతఁడునొక్కి చెప్పెను. "నేనుబూర్ణముగా తృప్తినొందని కాగితముమీఁద సంతకము చేయకుండుట నాకార్యమునకంతకంటె నత్యావశ్యకము." అని యామె బదులుచెప్పి చేవ్రాలు చేయక నిరాకరించెను. ఇది యిట్లున్నను రాణి యాప్రధానమంత్రిని మిక్కిలిగౌరవముతోను మైత్రితోను జూచి యాతనియెడనత్యంతాదరమును విశ్వాసమును గలదిగానే యుండెను.

రాణిగారు రాజ్యభారమునువహించి వ్యవహరించుచుండినను తరువాత నొక సంవత్సరమునకుఁగానిపట్టాభిషేకమహోత్సవముజరగలేదు. పూర్వపు రాజులు ధరించెడు కిరీటము మిక్కిలి బరువైన దగుట వలన మరల క్రొత్తగా కిరీటము చేయవలసి వచ్చుటచేతను మఱి కొన్ని యితర కారణములచేతను 1838 వ సంవత్సరము జూన్ నెల 28 వ తేది వఱకును రాజ్యాభిషేకోత్సవము నిలుపుచేయఁబడి యాదినమున మహావైభవముతో నడపఁబడినది. నాటిదినము పగలు పది గంటలవేళ నిరువది ఫిరంగులు కాల్పఁబడి నగరివాకిట రాజపతాక యెత్తఁబడినతోడనే రాణి బక్కింఘాము నగరు వెలువడినదని జనులు తెలిసికొనిరి. ఆమె పోవు మార్గముపొడుగునను లక్షలకొలఁది జనులావఱకే గుమికూడి క్రిక్కిఱిసియుండి, యెనిమిదిగుఱ్ఱములను బూన్చిన రాజశకటములో నెక్కిపోవుచుండినమహారాజ్ఞినివెస్టుమిన్‌స్టరు దేవాలయము చేరువఱకు నొక్కరీతిగా జయజయశబ్దములతో నభినందింపఁ జొచ్చిరి. ఆ యాలయములో నాసమయమునందుఁ గూరుచుండి వేడుక చూచుటకయిస్థానముసంపాదించుకొఁగోరినవారొక్కరొక్కరిన్నూటేసి

రూపాయలు పెట్టి ప్రవేశార్హపత్రికలుకొనవలసివచ్చెను. ఆసమయము నందు జరగనలసిన తంతంతయు యథావిధిగా జరిగినపిమ్మట ప్రధాన మతాచార్యుఁడు కిరీటమును దెచ్చి రాణిగారిశిరస్సుమీఁద నుంచెను.



పట్టాభిషేక మహోత్సవసమయమున ప్రధానమతాచార్యుఁ
రాణిగారి శిరస్సుపై నుంచుట.

అప్పుడు జయఘోషములతో "ఈశ్వరుఁడు రాణిని రక్షించునుగాక" యను నాశీర్వాదనినాదము లొక్కపెట్ట మిన్నుముట్టెను. ఆమె ధరించిన కిరీటమునందుఁ జెక్కఁబడిన రత్నముల వెలనే పదునొక్కలక్షలముప్పది వేలరూపాయలుండెను. అందు దేదీప్యమానములైన వజ్రములే 1463 చెక్కఁబడియుండెను. ఈపట్టాభిషేకమహోత్సవమునకు దాదాపుగా నేఁడులక్షలరూపాయలయినవి.

అప్పుడధికారములోనున్న మంత్రివర్గము తాముతెచ్చిన శాసనము జనప్రతినిధిసంఘములో బహుజనాంగీకారమును బడయక నిరాకరింపఁబడినందునఁదమపనులనుమానుకోవలసినవారైరి. అందుచే మెల్బోర్న్ ప్రభువు ప్రధానమంత్రి పదమునువిడువఁగా నెదుటిపక్షమునకు నాయకుఁడైన సర్ రాబర్టుపీలుదొర ప్రధానమంత్రిత్వమును వహించెను. పార్లమెంటు మహాసభలో రెండు ప్రధానపక్షములవారుందురు. అందొకరికి స్థితిపాలనపరులనియు, రెండవవారినివృద్ధికరణపరులనియు, చెప్పవచ్చును. ఇందు మొదటిపక్షమువారెంతో యావశ్యకము కలిగినప్పుడుగాని పూర్వమున్నదానిని మార్చుకోఁగూడదనువారు; రెండవపక్షమువారు కాలానుగుణముగా పూర్వమున్నదానిని తఱుచుగామార్చుకొనుచుండవలె ననువారు. ఈయుభయపక్షములవారు సాధారణముగా ననేకవిషయములలో భిన్నాభిప్రాయములుకలవారుగా నుందురు. జనప్రతినిధిసంఘములో నేపక్షమువారిసంఖ్య యధికముగా నుండునో వారధికారమునకువచ్చి వారిలోనివారే మంత్రులుగా నేర్పడుదురు. అధికారములోనున్నపక్షమువారికి రెండవపక్షమువారెప్పుడును ప్రతిపక్షులుగానుండి వారు పూనినకార్యములకుఁ బ్రతికూలముగాఁ బనిచేయుచుందురు. అయినను రెండుపక్షములలోనుగల దేశాభిమానులెప్పుడును దేశక్షేమమునే ముఖ్యముగా మనస్సునందుంచుకొనిసమయమువచ్చినప్పుడు ప్రతిపక్షులతో సహిత మేకీభవించి పనిచేయుచుందురు. ఏపక్షమువారధి

కారములో నుందురో యాపక్షములోని ప్రభువుల భార్యలు కొందఱు గౌరవార్థముగా రాజపరివారములోఁ జేరియుందురు. సర్ రాబర్టుపీల్ తాను ప్రధానమంత్రి కాఁగానే యట్టి స్త్రీలనని ప్రత్యేకముగాఁ జెప్పక పరివారమునుదీసివేసి క్రొత్తవారిని నియమింపవలెనని రాణిగారికు త్తరము వ్రాసెను. ఆపనిచేయుట కామెయంగీకరింపలేదు. అందుచేత మంత్రులకును రాణిగారికిని కొంతవివాదము జరగెను. మంత్రివర్గములోనివారు కొందఱు పోయి యామెతో మాటాడితమపట్టును సాగించుకోఁజూచిరి. దృఢనిశ్చయురాలైన యారాణిముందఱ వారియాటలు సాగినవి కావు. ఈవిషయమునుగూర్చి రాణిగారు పూర్వపు ప్రధానమంత్రియైన మెల్బోర్న్ ప్రభువునకు "నేనుచిత్తస్వాస్థ్యము చెడి శాంతివిడనాడి ఉన్నానని తలఁపవలదు. వారిప్పుడునాపరివారమును దీసివేయఁజూచుచున్నారు; రేపు నాసేవకురాండ్రను సైరంధ్రులనుగూడఁ దొలగింపఁ జూతురు. వారు నన్నుపిల్లదానివలె నాడింపఁజూచుచున్నారు; నేనింగ్లండుదేశపు రాణినని వారికిఁజూపెదను." అని యుత్తరము వ్రాసెను. గౌరవపరివారమును మాత్రము తొలఁగింపవలయునని మంత్రివర్గము వినయముతో నామెకు మొదటనే వ్రాసియుండినయెడల నిట్టిచిక్కు కలుగకపోయియుండును. ఇటువంటియసౌకర్యములు సంభవించునప్పుడాలోచనయు ధైర్యమును జెప్పనిరంతరసహచరుఁడై యుండియుత్సాహముపుట్టించి చనవుచే నర్హమార్గమున నడిపింప స్వాతంత్ర్యముగల ప్రియతముని తోడ్పాటవశ్యాభ్యర్థనీయమని తెలిసికొని రాణిగారుసాధ్యమైనంత శీఘ్రముగా నట్టి మహనీయుని చెట్టఁబట్ట నిశ్చయించుకొనెను. ఆమెదృష్టియందాల్బర్టురాజపుత్రుఁ డట్టియోగ్యపురుషుఁడుగాఁగనఁబడుటయు నామెయాతనిని వరించుటయు నింతకుముందే వివరింపఁబడెను. వివాహానంతరమున పార్లమెంటుమహాసభవా రాల్బర్టుప్రభువునకుసంవత్సరమునకు ముప్పది వేలపౌనులు (మూడులక్షలరూపాయలు) ఇచ్చుటకేర్పఱచిరి. రాణిగారు

తమయధికారమునుబట్టి తమభర్తకే తమరాష్ట్రములో నెల్లవారికంటె నధికగౌరవము జరగవలయునట్లు విధించిరి. ఆల్బర్టుప్రభువు 1840 వ సంవత్సరము సెప్టెంబరునెల 11 వ తేదిని రాణిగారి యాంతరంగిక సభలో సభ్యుఁడుగాఁ జేర్చుకొనఁబడెను.

రాణిగారి చిరకాలరాజ్యపాలనమునుగూర్చిన వివరముల నిందు వ్రాయఁబూనక కొన్నిముఖ్యాంశములనుమాత్రము సూచించి యీమె రాజ్యకాలములో దేశమునకుఁ గలిగిన యభివృద్ధిని గొంత తెలుపుచున్నాను. 1848వసంవత్సరమునందుయూరపుఖండము నందంతటను రాజులను దీసివేసి ప్రజాపరిపాలన మేర్పఱుపవలెనన్న ప్రయత్నముచేత గొప్పసంక్షోభము కలిగినది. ఫ్రాన్సుదేశమునందుఁబుట్టిన మహాసంక్షోభములో జరిగిన క్రూరకృత్యములకు భయపడి యెట్లో ప్రాణములు దక్కించుకొనిపారీసునగరమునుండిపాఱిపోయి రాజు తనకుటుంబముతో స్మిత్తను మాఱుపేరితోవచ్చి యింగ్లాండు దేశమునఁ బ్రచ్ఛన్నవృత్తిని బ్రవేశించెను. అతఁ డింగ్లండునకుఁ జేరక పూర్వము రాణిగారు తన మేనమామయైన లియోపాల్డు ప్రభువుపేర వ్రాసిన యుత్తరములో "(ఫ్రాన్సుదేశపు) రాజుయొక్కయు రాణియొక్కయు గతియేమైనదో యింకను దెలియదు. పరితాపకరమైన స్థితికివచ్చినయాకుటుంబవిషయమున మనచేతనైన దంతయుఁ జేయుదము. అయినను మనమాతని పక్షమవలంబించిఫ్రాన్సుదేశమునందునడచుచున్న నూతనపథకమునకు విరోధముగా ధ్వజమెత్తఁ జాలము. అక్కడికార్యములతో సంబంధము కలుగఁజేసికొనకమనముతటస్థులమయియుందుము. ప్రజలకభిమతమయిన పాలనపద్ధతి యేర్పడినపక్షమున, మనకు ప్రధానములైన యిప్పుడున్న యొడంబడికలను దేశక్షేమమును కాపాడునిమిత్తమై వారినిహద్దులో నుంచుటకొఱకు మనము దానినంగీకరింతము. ఇట్లుచేయుట యింపుగా నుండదుకాని మనస్వప్రయోజనమునకంటెఁబ్రజాక్షేమమునుయూరపు

ఖండముయొక్క కుశలమును మనమెక్కువగాఁ జూచుకొనవలెను.''అని వ్రాసెను. రాజ్యపదభ్రష్టుఁడయి శరణార్థియయివచ్చిన లూయిస్ ఫిలిప్పును ఫ్రెంచిచక్రవర్తినిరాణిగారత్యంతప్రేమముతోనాదరించిగౌరవించిరి. ఇట్టి ప్రజాసంక్షోభము స్పెయిన్, ప్రష్యియా, ఆస్ట్రియా మొదలైన బహుదేశములయందుఁగలిగెనుగాని బెల్జియము దేశములోలియోపాల్డు ప్రభువుగారి సత్పరిపాలనమువలన జనులకు రాజుపై కోపోద్దీపనము కలిగించుటకుఁ జేసినప్రయత్నములన్నియు విఫలములయ్యెను. యూరపుఖండమందంతటను ప్రజాసంరంభము కలిగిన యీ సంవత్సరములో నన్యదేశ రాజ్యాంగములనుగూర్చి యుత్తరప్రత్యుత్తరరూపముననిరువదివేల రాజలేఖ్యములను భర్తతోను గార్యదర్శితోను నాలోచించి పంపునంతటి శ్రమ రాజుగారికిఁ గలిగెను.

1844వ సంవత్సరమునందు రషియాచక్రవర్తియైన నికొలస్ ఇంగ్లాండునకువచ్చికొంతకాలమురాణిగారినగరునందుండి యామెసత్కారమునుబొంది మరల స్వదేశమునకుఁబోయెను. అతఁడింగ్లండులోనున్న కాలములోరాణిగారితోనుతత్కాలమునందామెమంత్రులుగా నుండిన పీల్ ప్రభువు, ఆబర్డీన్ ప్రభువు మొదలైన వారితోను క్రూరుఁడైన తుర్కీ సుల్తాను తన ప్రజలయిన క్రైస్తవులను బెట్టుచున్న బాధలను గూర్చి ముచ్చటించి వారి కామహమ్మదీయచక్రవర్తిమీఁదఁ గొంత దురభిప్రాయమునుగలిగించెను. ఇట్లుండఁగాఁగొంతకాలమునకాబర్డీన్ ప్రభువు రాణిగారికిఁబ్రధానమంత్రియయ్యెను. అప్పుడు రషియాచక్రవర్తి యింగ్లండురాణియు నామె ప్రధానమంత్రియు, దనపక్షమున నుందురనియు, వారొకవేళఁ బ్రతికూలురుగానున్నను వారికిజడియవలసినపనిలేదనియు, ఇంగ్లండుదేశము తనతో యుద్ధముచేయుటకు సాహసింపఁజాలదనియు, భావించి 1853వ సంవత్సరమునందు తురుష్కదేశముమీఁద దండెత్తెను. అయినను జక్కఁగా నాలోచించినమీఁదట

రషియాచక్రవర్తి తురుష్కులబాధలనుండి క్రైస్తవులనువిముక్తులను జేయు మిషమీఁద దండయాత్రవెడలినను నిజమైన యాతనియుద్దేశ మీ నెపమున టర్కీదేశమును తద్రాజధానియైన కాన్‌స్టాంటునోపిల్ నగరమును స్వాధీనముచేసికొని తన్మూలమునఁగృష్ణ భూమధ్యసముద్రములమీఁద నధికారము వహించి తాను జిరకాలమునుండి కన్నువేసి యుండినఇండియామీఁద గట్టకడపటఁబడవలెనన్న దురాశయైనట్టు తేటపడినందున 1854వ సంవత్సరము మార్చినెలలో రాణిగారురషియా దేశముతోడి యుద్ధమును ఘోషించిరి. ఈక్రిమియాయుద్ధమునం దింగ్లీషువారికి ఫ్రెంచివారును దోడుపడిరి. అన్నిరాష్ట్రములవారికంటెరషియావారికి బలిష్ఠమైన మెట్టసేనయధికముగానుండినను, మంత్రులయు సేనానాయకులయు లోపమువలన నింగ్లీషుసేనచే యుద్ధ మంతతృప్తికరముగా నడపఁబడకపోయినను, ప్రతియుద్ధమునందును రషియావారే యోడఁగొట్టఁబడుచు వచ్చిరి. ఇట్లు యుద్ధము ఘోరముగా నడుచుచుండఁగా 1855వ సంవత్సరము మార్చినెల 2వ తేదిని రషియా చక్రవర్తి పరమపదమునొందెను. ఆతనిమరణ మపజయమువలనఁ గలిగిన వెంగచేతనే సంభవించినట్టు కొందఱాకాలమున భావించిరి. సిబాస్టపూల్ యుద్ధమునం దోడిపోయిన తరువాత రషియావారుపరాభవమునొంది సంధిచేసికొని టర్కీదేశమును విడిచిపోవలసినవారైరి. ఈయుద్ధమునందు జరిగిన స్తోత్రపాత్రమయినయంశము ఫ్లోరెన్సునైటింగేలను మహనీయురాలు కేవలపరోపకారచింతతోయుద్ధమునగాయపడినవారి సంరక్షణము జేయుటకయితనతోనింగ్లీషు స్త్రీలను పలువురను వెంటఁబెట్టుకొనిపోయి వైద్యశాలలయందుగాయములతోఁబడియున్ననూఱుల కొలఁది సైనికుల కుపకారముచేయుట ఆమెయొక్క ప్రోత్సాహము చేతను వర్తనముచేతనుధాత్రులుగానామె వెంటవచ్చినకాంతలందఱును వికలాంగులయినవీరభటులనుకన్నబిడ్డలనుతల్లులాదరించినట్లాదరించిరి.

అందుచేత దయాశూన్యులైనమూర్ఖభటుఁడు సహితముమాతృభక్తి తో హృదయాంతరాళమున ఫ్లోరెన్సునైటింగేలుయొక్క నామమును స్మరింపఁజొచ్చెను. ఆభటులలో నొకఁడు "ఆమె కొందఱితో శాంతవాక్కులు పలుకును ; అంతకంటె నెక్కువమందికడమందహాసముచేసిశిరఃకంపముచేయును ; ఆమె యందఱియెడ నిటువర్తించుటశక్యముకాదు-మేమక్కడ నూఱులకొలఁదిఁ బడియున్నాము-మే మామెనీడ మా మీఁద సోఁకినను ముద్దుపెట్టుకొని మరల దిండ్లమీఁద మాతలలు చేర్చుకొని తృప్తినొందెదువారము." అని యామెనుగూర్చి యొకయధికారితోఁ జెప్పెను. పురుషజన్మమెత్తినను స్త్రీజన్మమెత్తినను లోకోపకారచింత యిట్లుగదా యుండవలెను. స్వసౌఖ్యము నుపేక్షించియన్యదేశములో నగతికులయియుండినవారియుపచారమునకయి తనదేహమును శక్తిని ధారపోసిన నైటింగేలు దొరసాని స్వదేశమునదిగినప్పుడుత్సవముచేసి గౌరవముతో నింటికిఁ గొనిపోవ నచ్చటివారుయత్నించిరిగాని యామెయంగీకరింపక యోడదిగియొంటిగా నింటికిఁబోయెను. భటులు మొదలయినవారయిదులక్షల రూపాయలనామె పేరనిధిగానేర్పఱుచుటకుపోగుచేసి యాధనమునామెకోరికప్రకారముగారోగులకుపచారములు చేయ నేర్చుకొనుఛాత్రులకొఱకొక వైద్యవిద్యాశాలకిచ్చిరి. ధైర్యశాలులైన సైనికుల విషయమునఁజేసినయుపకారమునకై, కృతజ్ఞతాగౌరవసూచకముగా నియ్యఁబడినదని చిత్రించిన వజ్రాలపతకమునొకదానిని రాణిగా రామెకు బహుమానము చేసిరి.

1857వ సంవత్సరమునందు బంగాళా సిపాయీలుదొరతనము వారిమీఁద తిరుగఁబడి యింగ్లీషువారిననేకులనుసంహరించుటయుఇట్లు తిరుగఁబడిన సైనికులను బ్రోత్సాహపఱిచి నానాసాహేబు కొందఱు దుష్టులనుగూడి యనేకక్రూరకృత్యములను జేయుటయు,అల్పకాలములోనే యింగ్లండునుండి సేనలువచ్చి కలహకారులనడఁచి మరల దేశ

మున నాజ్ఞను స్థాపించుటయు, ఎల్లవారును కనియు వినియునుందురు. కలహమడఁచినతరువాత జను లిఁకముం దెప్పుడును మరల నిట్టికలహములకుఁ జొరకుండ బుద్ధి తెచ్చుకొనునట్లుగా కఠినచర్య జరపవలయునని యింగ్లీషువారనేకులభిప్రాయపడినను రాణిగారు ప్రజలయెడల క్రౌర్యమును జూపక దయకనఁబఱచవలెనన్న యుత్తమపద్ధతినవలంబించి యప్పటి హిందూదేశపు ముఖ్యపరిపాలకులైన క్యాన్నింగుప్రభువుగారి యభిప్రాయముతో నేకీభవించియాయనకుఁదగినంతయుత్సాహమునుగలిగించిరి ఇట్లు సామోపాయమును బ్రయోగించిన యాపరిపాలకాగ్రణి కప్పటి యాంగ్లేయులచే "సదయప్రభు" వని పరిహాసార్థముగా బెట్టఁబడినయా పేరే యిప్పుడు సార్థకమయి గౌరవసంజ్ఞగాఁగొనియాడఁబడుచున్నది. రాజద్రోహకార్యమునందుఁగాని స్త్రీలవిషయమునను శిశువులవిషయమునను ఘోరకృత్యములను జరుపుటయందుగాని దోషులని స్థాపింపబడిన వారినందఱిని శిక్షాస్మృతి ననుసరించి కఠినముగా దండించుటయావశ్యకమని మీయభిప్రాయముతో నేకీభవించుచు, ఇప్పుడు హిందూదేశమునందున్న యాంగ్లేయులలో నత్యధిక సంఖ్యాకులు సామాన్యముగా స్వదేశస్థు లందఱిమీఁదను బగదీర్చుకోవలెనని దురాగ్రహావేశముచేత చేయుచున్న యుపదేశములకుఁ బ్రతికూలముగా ధైర్యముతో మీ రాచరించుచున్న దృఢప్రయత్నమును బలపరుచుచున్నానని రాణిగారు క్యాన్నింగుప్రభువుగారికి వ్రాసిరి. ఈసైనికసంక్షోభము శాంతి పొందినపిమ్మట హిందూదేశరాజ్యపాలనము తూర్పిండియా వాణిజ్యసంఘమువారినుండితొలఁగించి తాముస్వయముగాఁ జేకొన్నప్పుడు చేయనుద్దేశించిన ప్రకటనముయొక్క చిత్తు రాణిగారికి ప్రధానమంత్రియైన డెర్బీప్రభువుగారిచే బంపబడి, నూతనముగా వివాహముచేయఁబడి ప్రష్యాదేశములో నున్న పెద్దకుమారితను మొదటిసారిచూడఁబోవఁ బ్రయాణసన్నాహములోనున్న సమయమునం దందెను. అప్పుడా చిత్తుకాగితము

నామెచదివి యది భావమునందుఁగాని, భాషయందుఁగాని సమయమునకుఁ దగినదిగా నుండలేదని భావించి, తన యాక్షేపణముల నన్నిటిని బూర్ణముగా నప్పుడు సన్నిధానమునందుండిన మంత్రియయిన మాల్మెస్ బెరీప్రభువుతో వివరించి చెప్పి, ప్రధానమంత్రి క్రిందరీతిని ఉత్తరమును వ్రాసెను.—

"హిందూదేశ ప్రకటనమునుగూర్చినతనయాక్షేపములను డెర్బీ ప్రభువుతో వివరముగాఁ దెలుపుటకు రాణి మాల్మెస్ బెరీప్రభువును కోరినది. తమయొక్క పరిపాలనమును స్వాయముగా వహించునప్పుడు పదికోట్లకంటె నెక్కువసంఖ్యగల ప్రాగ్దేశప్రజలకు ఘోరమైన ప్రకృతిక్షోభానంతరమున తనభవిష్యత్పరిపాలనము చెల్లింపవలసిన ప్రతిజ్ఞలను జేయుచు తనపరిపాలనముయొక్క మూలతత్వములను వివరించుచు వచించుకాంత ప్రకృతికోమలమైన మహారాజ్ఞియని మనసునందుంచుకొని, డెర్బీప్రభువుగారు తమ సరసభాషతో దీనిని స్వయముగా వ్రాసెడుపక్షమున రాణి యెంతో సంతోషించును. అటువంటి లేఖ్యము ఉదారభావమును దయాళుత్వమును పరమతద్వేషరాహిత్యమును వెల్లడించుచు, బ్రిటిష్ రాజ్యములోని ప్రజలతోడి సమస్థితియం దుంచఁబడుటచేత హిందువులు పొందెడు స్వాతంత్ర్యములను నాగరికతను ఫలముగాఁ గలిగెడు సుఖసంపదలను దెలుపవలెను."

కాన్నింగుప్రభువు హిందూదేశ ప్రధానపరిపాలకుఁడును రాజప్రతినిధియునై యుండినకాలములో 1858 వ సంవత్సరము నవంబరు నెల 1 వ తేదిన రాణిగారు స్వయముగా హిందూదేశ రాజ్యభారమును గైకొన్న ప్రకటనము సమస్తప్రదేశములయందును బహిరంగముగాఁ జదువఁబడినది. ఆప్రకటనమునుండి రెండుమూడువాక్యముల నిందుదాహరించుట యనావశ్యకముకాదనియెంచి యట్లుచేయుచున్నాను.—

"క్రైస్తవమతముయొక్క సత్యమును మేము దృఢముగా నమ్మిన వారమయి మతమువలనఁ గలిగెడుచిత్తశాంతిని మేము కృతజ్ఞతతో నొప్పుకొనుచున్నవారమయ్యును, మావిశ్వాసములను మాప్రజలలో నెవరిమీఁదను నిర్బంధించుకోరికగాని స్వాతంత్ర్యముగాని మాకు లేదని చెప్పుచున్నాము. తమతమ మతవిశ్వాసములనుబట్టిగాని యాచారములనుబట్టిగాని యెవ్వరు నేవిధముగాను మావలన నిగ్రహమునుగాని యనుగ్రహమునుగాని పొందక యందఱును సమానముగా ధర్మశాసనములవలని సంరక్షణమును నిష్పక్షపాతముగాఁ బొందవలయుట మా యభిమతమును మాకు సంతోషకరమునునని మేము ఘోషించుచున్నాము. మాప్రజలలో నెవ్వరియొక్క మతవిశ్వాసములతోను పూజావిధానములతోను తామేవిధమైనసంబంధమును మాక్రిందియధికారు లెవ్వరును కలుగఁజేసికోఁగూడదనియుఁ, గలుగఁజేసికొన్నయెడల మాయాగ్రహమునకట్టివారు పాత్రులగుదురనియు మేము దృఢముగా విధించుచున్నాము.

మాప్రజలయినంతవఱకు వారేజాతివారయినను ఏతెగవారయినను నగే విద్యవలనను సామర్థ్యమువలనను సద్వర్తనమువలనను దాము చక్కఁగా నిర్వహించుట కర్హులయినవారు మాప్రభుత్వములోనిపనులకు యథేచ్ఛముగాను నిష్పాక్షికముగాను చేర్చుకొనఁబడవలయుట మాచిత్తమయియున్నది.

* * * * * *

ఈశ్వరానుగ్రహమువలన దేశములో స్వస్థత మరల కలిగింపఁబడినప్పుడు హిందూదేశముయొక్క నెమ్మదియైనకర్మలను బ్రోత్సాహపఱచుటయు జనోపయుక్తములును వృద్ధికరములునైనపనులను పెంపు చెందించుటయు దేశములో నున్న సర్వప్రజలయొక్కలాభకొఱకు పరిపాలనము జరపుటయు మాయత్యంతాభిలాషమై యున్నది. మా

బలమువారిసంపదలోను, మాక్షేమమువారితృప్తిలోను,మాయుత్తమ ప్రతిఫలమువారికృతజ్ఞతలోనుఉండును. సర్వశక్తుఁడయినయీశ్వరుఁడు మాకును మాక్రింది నధికారములోనుండువారికిని మాయీయభీష్టములను ప్రజలమేలుకొఱకు కొనసాగించుటకు శక్తిని బ్రసాదించునుగాక!''



FROM PHOTO : HUGHES AND MULLINS.
పంచాదశ్వత్సర రాజ్యపాలనోత్సవము నాటి రాణిగారి రూపము,

1877 వ సంవత్సరము జనేవరు నెల 1 వ తేదిని రాణిగారు హిందూదేశ చక్రవర్తినీ బిరుదమును వహించినట్లు ఢిల్లీనగరమునందు జేయఁబడినమహాసభలో నప్పటిరాజప్రతినిధి యగు లిట్టన్ ప్రభువు గారిచేఁ బ్రకటింపఁబడెను. ఈమహాసభకీ భరతఖండమునందుఁగలమహా రాజులును రాజులును నితరప్రముఖులునుబోయి యానందించిరి. ఇంత గొప్పసభ మనహిందూస్థానమునఁ బూర్వమెప్పుడును జరిగియుండ లేదు.

188- వ సంవత్సరము ఫిబ్రవరినెల 16 వ తేదిని రాణిగారి పంచాదశ్వత్సర రాజ్యపాలనోత్సవముడఫ్రిన్ ప్రభువుగారు మన దేశము నకు రాజప్రతినిధిగానుండినప్పుడుపదిసంవత్సరములక్రిందటమహావైభవ ములో హిందూదేశమున దంతటను జరపఁబడినది. ఆసమయమునం దిచ్చటిప్రజలు రాణిగారిపేర జనోపయుక్తము లయినధర్మకార్యము లనేకములు చేసి తమయవ్యాజరాజభక్తిని వెల్లడించిరి. ఆమహో త్సత సమయము నందిచ్చటనుండిన రాజప్రతినిధి డఫ్రిన్ ప్రభువుగారి రూపమీక్రిందిపటమునఁ జూపఁబడియున్నది—



ఈయన హిందూదేశమునకుఁ బ్రధానపరిపాలకుఁడుగా నియమింపఁబడి పంపఁబడునప్పుడు శ్రీ విక్టోరియా మహారాజ్ఞిగారీయనపత్నీతిలకమును

దమయొద్దకు రప్పించుకొని యామెతో హిందూదేశస్త్రీలవిషయమయి చేతనయినంతమేలు చేయవలసిన దని సెలవిచ్చిరి. ఆమెయు రాణిగారి యాజ్ఞను శిరసావహించి హిందూదేశమునకు రాఁగానే డఫ్రిన్ ప్రభ్వి నిధి యను పేర నిప్పుడు పరఁగుచున్ననిధిని స్థాపించెను. ఆనిధియొక్క



FROM PHOTO RUSSELL AND SONS
షష్టిసంవత్సర రాజ్యపాలనోత్సవము నాఁటి రాణిగారి రూపము.

సాహాయ్యమున స్త్రీలకొఱకు వైద్యశాలలు పెట్టుటయు వైద్యురాం డ్రను ఛాత్రులకు నియమించుటయు మొదలగునపనులు జరుగుచున్నవి. కొంతకాలముక్రిందట పునానగరమునందుండిన యొకరాణియొక్క దీర్ఘవ్యాధిని కుదిర్చిన యొకయింగ్లీషువైద్యురాలు ఇంగ్లండునకుఁ బోయినప్పుడు శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారిని సందర్శించి, హిందూదేశస్త్రీల యవస్థనుగూర్చి యారాణిశ్రీమహారాజ్ఞిగారితో విన్నవింపుమన్న సందేశమును నివేదించుటచే మనదేశమున కీమహోపకారము కలిగినది. ఆ సందేశమునునివేదింపఁగా నేశ్రీమహారాజ్ఞిగారు పూనారాణికిసాదర లేఖను బంపుటయే కాక "హిందూదేశ స్త్రీలయొక్క సంతాపకరమైన స్థితిని తొలఁగించుటకుఁ జేయఁబడు ప్రతిప్రయత్నమును మాకు సంతోషకరమని సర్వత్ర తెలియ నభిలషించుచున్నాము." అని సెలవిచ్చిరి.

ఈ 1897 వ సంవత్సరమున రాణిగారి రాజ్యపాలనమునకుషష్టిపూర్తియైనందున జూన్ నెల 21వ తేదిని వజ్రోత్సవమనుపేరహిందూదేశమునందెల్లయెడలను మహోత్సాహముతోను మహావైభవముతోను కన్నులపండువుగా నుత్సవములు చేయఁబడినవి. ఈయుత్సవసమయమునందు ప్రభుభక్తిని దెలియఁజేయుటకయి యనేకసంస్థానాధిపతులును ధనికులును రాణిగారిపేర పెక్కు ధర్మకార్యములను జేసిరి. అంతేకాక యీసంతోషసమయమునందు కారాగృహవాసులలోసద్వర్తనముకలవారు నూఱులకొలఁదిబంధవిముక్తులుఁగాఁజేయఁబడిరి. మఱియు నూఱురూపాయలకు మించని చిన్నమొత్తములను తీర్చలేక వానినిమిత్తమయి ఋణప్రదాతలచే చెఱసాలలయందుఁ బెట్టింపఁబడినఋణగ్రస్తులయప్పులను దొరతనమువారు తీర్చి వారి సందఱను విడిపించిరి. ఈ యుత్సవసమయమునాఁటి రాణిగారిరూపమిందలిపటమున జూపబడియున్నది. ఈరూపమునకును పదిసంవత్సరముల క్రిందట జరిగిన పంచాదశవత్సర రాజ్యపాలనోత్సవమునాఁటి రూపమునకునుముఖమునందెంతో

వ్యత్యాసము కనఁబడుచున్నది. ఇప్పటి రూపమునందు వార్ధక్యచిహ్నములు మఱింతస్పష్టముగాఁ గానఁబడుచున్నవని వేఱుగఁ జెప్పవలసిన యక్కఱలేకయే దృష్టిమాత్రముచేతనే యెల్లవారికి గోచరమగును. ఈవత్సరోత్సవకాలములోను మనకిప్పుడు రాజప్రతినిధిగా నున్న యెల్జిన్ ప్రభువుగారే హిందూదేశ ప్రధానపరిపాలకులుగానుండిరి. ఈయెల్జిన్ ప్రభువుగారి రూప మీపటమునఁ బ్రదర్శింపబడినది—



రాజభక్తిని వెల్లడించుటకయి సిమ్లానగరమునఁ జేయఁబడినమహాసభయందు రాజులు మొదలయినప్రముఖులసమక్షమునం దీయనరాణి

గారిపరిపాలనమునుగూర్చి మంచి ప్రసంగమును జేసియున్నారు. ప్రజల క్షేమాభివృద్ధులకొఱకు సత్పరిపాలనచేయుచు రాణిగారింకను జిర కాలము వర్ధిల్లుదురుగాక!

ఇతరస్థలములయందప్పుడప్పుడక్కడక్కడ యుద్ధములుజరుగుచు వచ్చినను విక్టోరియారాజ్ఞిగారిపరిపాలనములో స్వదేశమునందు యుద్ధములులేక నెమ్మదిగలిగియున్నందున దేశమత్యంతాభివృద్ధికి వచ్చినది. ఈమె రాజ్యమునకువచ్చిన 1837 వ సంవత్సరమున బ్రిటిషుద్వీపముల లోని జనులసంఖ్య 26000000 లు; ఇప్పుడది యించుమించుగాద్విగుణ మయి దాదాపుగా 40000000 వఱకు వచ్చినది. ఈమెకాలములో జయింపఁబడినక్రొత్తరాజ్యమే యూరపుఖండ మంతయుఁ గలిసిన దానికంటె నాలువపాలు పెద్దదిగా నున్నది. ఇప్పుడీమెరాజ్యము 11399316 చదరపుమైళ్లవిస్తీర్ణమయి ప్రపంచములోని భూభాగము లో నైదవపాలుకంటె హెచ్చుగా నున్నది. ఇప్పుడీమె పరిపాలనము క్రిందనున్న దేశములయొక్క జనసంఖ్య 402514000 లయి లోకము లోని జనసంఖ్యలో నాలవవంతుకంటె నెక్కువయియున్నది, శ్రీవిక్టో రియామహారాజ్ఞి సింహాసనమునకువచ్చిన సంవత్సరమున హిందూదేశ ములో నింగ్లీషువారిస్వాధీనములో నున్నభాగముయొక్క వైశాల్యము 560000 చదరపుమైళ్లు; ఇప్పుడు 1068000 చదరపుమైళ్ళు. అప్పుడీ హిందూదేశముయొక్క జనసంఖ్య 100000000 లు; ఇప్పుడది త్రిగుణ మయి రక్షితసంస్థానముల దానితోడఁ గలుపుకొని 300000000 లయి నది. రాణిగారు రాజ్యమునకువచ్చిన సంవత్సరమున సన్నూటడెబ్బది లక్షల పౌనులుగానుండిన బ్రిటిషుద్వీపములవలనిరాబడి యిప్పుడు వేయిలక్షలపౌనులయినది. 1840వసంవత్సరమునందు 120000000 ల పౌనులుగానుండినబ్రిటిషుద్వీపములయొక్కయితరదేశములతోడివాణి జ్యము1890వ సంవత్సరమున 700000000 ల పౌనులయిమైదురెట్లు

పెరిగినది. 1837 వ సంవత్సరమునందు పంధొమ్మిదికోట్ల రూపాయలు గానుండిన హిందూదేశముయొక్క యితరదేశములతోఁడి వాణిజ్యము 1895 వ సంవత్సరమునాఁటి కిన్నూరుకోట్లరూపాయలకు వృద్ధి పొందినది. 1837 వ సంవత్సరమునందు హిందూదేశముయొక్క యెగుమతి దిగుమతులు రెండుకోట్ల పదిలక్షలపౌనులు; 1897 వ సంవత్సరమునందు పదునాలుగుకోట్లపౌనులు. రాణిగారు ప్రభుత్వమునకువచ్చిన సంవత్సరమునం దింగ్లీషువారి సేనయంతయుఁ గలిసి 101580 రు సైనికులను గలదిగానుండెను; అప్పుడాసేనలో 19000 లు హిందూదేశములోను, 20000 ఐర్లండులోను, ఉండెను. ఇప్పుడింగ్లీషువారి రాణువ 690000 ల సైనికులను గలదిగా నున్నది. క్రమమైన యీసేన గాకయాయుధవిద్యయందు శిక్షితులైనవారు స్వేచ్ఛాసైనికులుతొమ్మిది లక్షలు వలసినచో యుద్ధసమయములయందు స్వరాష్ట్రరక్షణార్థముగా వత్తురు. రాణిగారు రాజ్యమునకువచ్చిన సంవత్సరమునందునిప్పుపుల్లలు మొట్టమొదట చేయఁబడినవి. ఈమె రాజ్యారంభకాలమునకుఁ గొంత ముందే విద్యుచ్ఛక్తికని పెట్టఁబడినను, వైద్యుతదీపములు, వైద్యుత తంత్రులు మొదలగునవి యీమెరాజ్యకాలముననే స్థాపింపఁబడి యిప్పుడు తంత్రీవార్తలు ప్రపంచముయొక్క నానాముఖములఁ బంపఁబడుచున్నవి. 1837 వ సంవత్సరము జూన్ నెల 20 వ తేదిని సింహాసన మెక్కినరాణిగారి రాజ్యభారవహనవార్తను హిందూదేశములోని రాజకీయవ్యవహారపత్రికలో ఆగష్టునెల 25 వ తేదిలోపలఁ బ్రచురించుట కవకాశము చిక్కనియీకాలము పోయి విద్యుచ్ఛక్తిసాహాయ్యమున నీసంవత్సర మింగ్లండులోని యీమె షష్టిపూర్తిపరిపాలనోత్సవ వార్తనాదినముననే తంత్రీముఖమున హిందూదేశములోని వార్తాపత్రికలలోఁ బ్రకటించుటకవకాశముకలిగినది. రాణిగారు సింహాసనమారోహించిననాఁటికిఁ బ్రపంచమునం దంతటను 1600 మైళ్ళ పొడుగుననే

యుండినయయోమార్గమిప్పుడు 420000 మైళ్ళపొడుగునకువృద్ధినొందినది. ఆకాలమునం దావిరిబండ్లు గంట కిరువదిమైళ్ళుపోవుటయేయధికవేగమని జనులాశ్చర్యపడుచుండినను, అప్పటివారే యిప్పుడు నేటిరైలుపోగబండ్లు సాధారణముగా గంటకిరువదిమైళ్ళపోవునుపోవుచుండినను వింతపడకుండుట కలవడియున్నారు.

ఇంక మన హిందూదేశమున శ్రీమెరాజ్యకాలములోం గలిగిన లాభములను మాత్రము కొన్నిటిని దెలిపి యీచరిత్రము నింతటితో ముగించుచున్నాను.

1. ఈమె రాజ్యకాలములో హిందూదేశమునందువ్యవసాయమెంతో యభివృద్ధినొందినది నదులకానకట్టలుకట్టి వ్యర్థాగాజలమును సముద్రగామి కాకుండ నిలిపి సస్యములు మొదలయినవాని కుపయోగపడునట్లుచేయుటచేంబూర్వకాలమున దుష్ప్రజ్ఞలుగాను గహనములుగాను నుండు పనికిమాలిననేల లిప్పుడు పంటభూము లయినవి. ఈ నదులనుండి యిప్పుడు తొమ్మిదివేలమైళ్ళు పెద్దకాలువలును నిరువదివేల మైళ్ళు పంటకాలువలును త్రవ్వంబడి జలము సస్యక్షేత్రములకుం బ్రవహింపం జేయంబడుచున్నది. మన దేశమునం దిప్పుడు జనసంఖ్య పూర్వమునకంటెమూండురెట్లు హెచ్చయినను, ఇచ్చటిపంట జనులకు చాలంగా మిగిలినది సంవత్సరమున కెనిమిదికోట్లరూపాయల ధాన్యాదులితర దేశములకు విక్రయింపంబడు చున్నవి. ఈధాన్యాదు లితర దేశముల కెగుమతిచేయంబడకయీ దేశమునందే నిలువయుంచంబడెడుపక్షమున వానితో మఱి యేంబదిమైదులక్షలజనులు బ్రతుకవచ్చును. ఇట్లయ్యును పురాణములలో వర్ణింపబడినట్లు ద్వాదశవర్షక్షామములు లేక పోయినను వర్షాభావముచేత మన దేశమునందప్పుడప్పుడు కాటకములు సంభవించుచునేయున్నవి. అయినను బూర్వకాలపు కఱవునకును నిప్పటికాలపుకఱవునకును నెంతో వ్యత్యాసమున్నది. 1770వ సంవత్సరమునందు

బంగాళమునకు క్షామమువచ్చినప్పుడునూటికి ముప్పదిముగ్గురువంతునం జచ్చిరి. 1877వసంవత్సరమున కఱవువచ్చినప్పుడుపస్తువలననువ్యాధుల వలనను మృతినొందిన వారునూటికై దుగురికంటె హెచ్చుగాలేరు. ఈ సంవత్సరమున వచ్చినమహాక్షామమునం జచ్చువారిసంఖ్యయంతసహిత ముండదు. బూర్వపుక్షామములోజనులు కులనుగడ్డినికొన్నిచోట్లశవము లనుసహితముతినిరి;ఇప్పుడట్టిదుస్థితియెంతటికఱవులోనుబట్టదు. ఇప్పుడు పంటభూములయొక్క వెలలు పూర్వమునకంటెబదిరెట్లు హెచ్చుయిననవి. పూర్వకాలమునందు సేద్యముచేయబడునేలయిప్పటికంటెనెంతో తక్కువగానుండినను మొగలాయిచక్రవర్తుల రాజ్యకాలములోభూమి పన్ను 1655 మొదలుకొన్ని 1761 వసంవత్సరమువఱకును మొత్త మమీఁద సంవత్సరమునకు ముప్పదిరెండుకోట్లరూపాయలు గైకొనం బడెను; ఇప్పుడింత యెక్కువనేల సేద్యముచేయఁబడు చున్నను భూమి పన్ను సంవత్సరమున కిరువది కోట్లరూపాయలకంటె హెచ్చుగావచ్చు చుండలేదు. ఇతర మహమ్మదీయప్రభువులకాలములోను స్వదేశప్రభు వులకాలములోను భూమిపన్నుకు పరిమితిలేకపోయినను మహమ్మదీయ చక్రవర్తులందఱిలోను మహాధర్మాత్ముఁడని పేరుపడిన అక్బరుచక్రవర్తి కాలములో 1587వసంవత్సమునకు తోడర్‌మాలేర్పఱిచినభూమిపన్ను పంటలో నూటికి ముప్పదిమూడువంతున నుండెను; ఇప్పుడింగ్లీషువారు గైకొనుభూమిపన్ను దానిలోనాలవపాలుకంటె హెచ్చుగాలేదు.

2 ఇప్పుడు ప్రయాణమున కెక్కువ సదుపాయము లేర్పడి యున్నందున వాణిజ్య మంతకంతకు హెచ్చుచున్నది. విక్టోరియాచక్ర వర్తిని రాజ్యమునకువచ్చినకాలమునకుమనదేశములోకంకర వేసిచక్క పఱిచిన బాటలేలేవు; ఇప్పుడు లక్షమైళ్ళ నిడుపుగల మంచిబాటలు దేశమునందంతటను వేయఁబడియున్నవి. అప్పుడీదేశములో నయో మార్గమన్న పేరే తెలియదు; ఇప్పుడు దాదాపుగా నిరువదివేలమైళ్ళ

పొడుగున నినుపదారి వేయఁబడి యున్నది. కాశికిఁ బోయినవాఁడును గాటికిఁబోయినవాఁడునుసమానుఁడన్న లోకోక్తి యిప్పటికినివాడుకలో నున్నను, ఇప్పుడు కాశీయాత్రయనఁ బొరుగూరికిఁ బోయివచ్చుటతో సమానమయినది. ఇప్పుడు గంగ, యమున మొదలయిన నదులకనేకములకు వంతెనలుకట్టఁబడి వానిపయినుండిబండ్లని రాటంకముగానడపఁబడుచున్నవి. ఈదేశమునందలి సముద్రతీరపట్టణముల కెల్లను పొగయోడలు వారవారమునువచ్చి యాత్రాపరులను వాణిజ్యవస్తువులను మహావేగముతో నొకరేవునుండి యొకరేవునకవలీలగాఁ గొనిపోవుచున్నవి. ఈయన్నిమార్గములచేతను వాణిజ్యమభివృద్ధియయి దేశము ధనసంపన్నమగుచున్నది. 1850వసంవత్సరమునాఁటికి పదిలక్షలరూపాయల జనపనారకంటె నెక్కువగా నెగుమతిచేయఁబడనిఈదేశమునందు 1887 వసంవత్సరమునాఁటి కఱువది రెట్లనఁగానాఱుకోట్లరూపాయల జనపనార యితరదేశముల కెగుమతిచేయునంతటిమంచిదశ వచ్చినది. 1850 వ సంవత్సరమునాఁటి కీదేశమునందు కోటిముప్పదిలక్షరూపాయలప్రత్తికంటె నెక్కువగా నెగుమతిచేయఁబడుచుండలేదు. 1865 వ సంవత్సరము నాటికి ముప్పదిరెట్లెక్కువ యనఁగాముప్పదికోట్లడెబ్బదియైదులక్షల రూపాయలప్రత్తి యెగుమతిచేయఁబడు మంచిస్థితిసంభవించినది. 1865 వ సంవత్సరములోమనదేశమునుండి యఱువదతొమ్మిదికోట్లరూపాయలసరకులన్యదేశములకెగుమతిచేయబడినవి. 1887 వ సంవత్సరమునాఁటి కెగుమతిచేయఁబడుసరకులవెల యెనుబదియెనిమిదికోట్లరూపాయలకు హెచ్చినది. ఈకడపటిసంవత్సరమునఁబూర్వకాలమునం దెన్నఁడును పేరైనవినని తేయాకు మనదేశమునుండియితరదేశములకైదుకోట్లరూపాయిల వెలగలది యెగుమతిచేయఁబడినది. ఇప్పుడితరదేశములనుండి యీదేశమునకు దిగుమతిచేయఁబడుసరకుల వెలకంటెనీదేశమునుండియితరదేశములకునెగుమతిచేయఁబడుసరకుల వెల

సంవత్సరమున కిరువదియొక్క కోట్లరూపాయలు హెచ్చుగానున్నది. ఈ యిరువదియొక్కకోట్లరూపాయలలో నయోమార్గాదులకొఱకుఁ జేయబడినబుణముల వడ్డీక్రిందను నింగ్లండులోనయ్యెడు వ్యయములక్రిందను బంపఁబడెడుపదునాలుగుకోట్లరూపాయలునుపోఁగామిగిలిన యేడుకోట్లరూపాయలకును వెండిబంగారము లీదేశమునఁ బ్రతిసంవత్సరమును జేరుచున్నవి. పూర్వకాలమునందు పెంకుటిండ్లు చూడఁబడనిపల్లెలయందు సహితముదివ్యభవనములును మేడలును లేచుచుండుటయే దేశముయొక్క యిప్పటిసుభిక్షతను, సంపన్నతను ఘోషించుచున్నది. పూర్వముకఱవు దినములలో నొకచోటఁబండినపంట యొకచోటకుఁగొనిపోవుటయెంతో దుష్కరముగా నుండెను; ఇప్పు డావిరియంత్రములు మొదలైనవానితోడ్పాటున నొకచోటిపంట నొకదేశమున కతిసులభముగాఁ గొనిపోవచ్చును. 1854 వ సంవత్సరమునందు మొట్టమొదట నావిరిబలముతో బట్టలు నేయుయంత్రము బొంబయినగరమునందు స్థాపింపఁబడినది. ఇప్పుడట్టివినూటనలువదియంత్రములవఱకుమన దేశమునందక్కడక్కడ నెలకొల్పఁబడి వానిలో నూటయేఁబదివేలమంది పనిచేయుచున్నారు. పూర్వము కాగితముచేయుయంత్రములుహిందూదేశమున లేవు. ఇప్పటికిని ప్రతిసంవత్సరమును ఏఁబదిలక్షలరూపాయలు వెలచేయుకాగితములితర దేశములనుండి మన దేశమునకు వచ్చుచున్నవి. 1896వ సంవత్సరాంతమునకు మన దేశమున కాగితములుచేయుయంత్రములుపది పెట్టఁబడి వానియందు దాదాపుగానఱువదిలక్షల రూపాయల కాగితములు చేయఁబడుచున్నవి.

3 పూర్వకాలమునం దొకరిక్షేమవార్త నొకరు తెలిసికొనుట గ్రామాంతరవాసుల కత్యంతదుర్ఘటముగానుండెను. రాణిగారు రాజ్యమునకు వచ్చినసంవత్సరముతో ననఁగా 1837 వ సంవత్సరమునందు హిందూదేశమున మొట్టమొదట పోషణకార్యస్థానము లేర్పఱుపఁబడి

నవి. అప్పుడుబొంబయినగరమునుండికలకత్తానగరమునకు త్తరముపంప వలెనన్నచో నొక్కరూపాయ యియ్యవలసివచ్చుచుండెను. ఇప్పుడరణాతోనో మూఁడుదమ్మిడీలతోనో యత్యల్పకాలములోనే యొకరిక్షేమవార్తనొకరుసేతువు మొదలుకొని హిమాచలమువఱకునుగల ప్రతిగ్రామమునకునుబంపవచ్చును. ఒక్కరూపాయయో యరరూపాయయో వ్యయపెట్టుడుపక్షమున నాఁటివార్తను నాఁడో మఱునాఁడో యందునట్లుగా నాసేతుహిమాచలాంత మైనభరతఖండమునం దెక్కడకైనను తంత్రీముఖమునఁబంపవచ్చును. విద్యుచ్ఛక్తిచేతవర్తమానములనుబంపుటకై యిప్పుడు మన దేశమున లక్షనలువదివేలమైళ్ల పొడుగునతీగెలు వేయఁబడియున్నవి. ఇప్పుడీ దేశమునుండి ప్రపంచములోని యున్ని ముఖ్యదేశములకును తంతిమార్గమున వార్తలను బంపవచ్చును. వార్తాహరణము నిమిత్తము యి యిప్పుడు సముద్రములోనమాత్రము నూటడెబ్బది వేలమైళ్ళ పొడుగున నినుపతీగెలు వేయఁబడి యున్నవి.

4 రాణిగారి ప్రభుత్వమునందు భరతఖండనివాసులగు జనులయొక్క యారోగ్యాభివృద్ధికై యనేకమార్గములు యేర్పాటుచేయఁబడినవి. ప్రధానపట్టణములయందు వైద్యవిద్యాశాలలు స్థాపింపఁబడినవి; పట్టణములలో మాత్రమేకాక గొప్పగ్రామములలోసహితము ధర్మార్థముగా మందులిచ్చెడు వైద్యశాలలు పెట్టఁబడినవి. గొప్పపట్టణముల కనేకముల కయోనాళమార్గమున శుద్ధజలమువచ్చునటుపాయ మేర్పఱుపఁబడినది; టీకాలువేయుట నిర్బంధముచేయు శాసననిర్మాణమువలన స్ఫోటకమువలని బాధలు తగ్గింపఁబడినవి.

5 విద్యాభివృద్ధికై యెన్నెన్నివిధములనో ప్రయత్నములు చేయఁబడుచుండుటచేత జనులలో జ్ఞానాభివృద్ధియు సదాచారప్రవృత్తియు నంతకంతకు హెచ్చుచున్నవి. 1857 వ సంవత్సరమునం దీదేశమున మొట్టమొదట మూఁడుసర్వకళాశాలలుస్థాపింపఁబడినవి. 1887 వ

సంవత్సరమునాఁటి కీదేశమునందలి శాస్త్రపాఠశాలలయొక్కయు నితర పాఠశాలలయొక్కయు సంఖ్య నూట ముప్పదివేలయి యందు మూఁడు కోట్ల యేఁబదిలక్షల విద్యార్థులువిద్యాభ్యాసము చేయుచుండిరి. ఇప్పుడు విద్యావిషయమున సంవత్సరమునకు రెండుకోట్ల యేఁబదిలక్షలరూపాయలు వ్యయపెట్టఁబడుచున్నవి. రాణిగారు రాజ్యమునకువచ్చునప్పటికీ దేశమునందు స్వదేశీయులచేఁ బ్రచురింపఁబడువృత్తాంతపత్రికలునాలుగై దేయుండెను; ఇప్పుడవినన్నూఱువఱకు వృద్ధిపొందినవి. స్త్రీవిద్యాభివృద్ధికి ప్రోత్సాహముకలిగింపఁబడినది; సహగమనము, శిశుహత్యలు, నరబలులుగాలపుసిడులు మొదలయినవి,మాన్పఁబడినవి;వితంతువివాహములు శాస్త్రీయములుగాఁ జేయఁబడినవి; పాశకరులబాధలు రూపుమాపఁబడినవి.ఉత్తరహిందూస్థానమునందుపాశకరులనునొక తెగవారు వణిజులవలెనుయాత్రాపరులవలెను దేశసంచారముచేయుచుమార్గస్థుల మెడల కాకస్మికముగా తమచేతిపాశములను తగిలించి లాగి చంపివారి సొత్తు నపహరించెడువారు.వీరు కాళికోపాసకులు; ఈనరహత్యలు దేవికి ప్రీతికరముగానుండుననివీరునమ్ముదురు. తరములనుండి యీక్రూరవ్యాపారముచేజీవనముచేయుచువీరిలోకొందఱొక్కరొక్కరు నూఱేసిమందిని జంపినవారుసహితముండిరి. రాజ్యాంగవిషయములయందును నెంతోయభివృద్ధికలిగి,మునుపటివలెఁగాక యిప్పుడు ప్రాణములకునుధనమునకును నెక్కువరక్షణముకలిగినది;పూర్వమువలెదొంగతనమేవృత్తిగాఁగల జాతులవారిప్పుడు లేరు; బందిపోటుదొంగతనము లించుమించుగారూపుమాసినవి;లంచములుతగ్గినవి; రాజ్యాంగవిషయకములైన స్వాతంత్ర్యములుజనులకు క్రమక్రమముగా నియ్యఁబడుచున్నవి. 1853వ సంవత్సరమున మొట్టమొదటశాసననిర్మాణసభ లేర్పఱుపఁబడినప్పుడందలిసభ్యులందఱును దొరతనమువారికొలువుకాండ్రుగా నేయుండిరి. 1861 వ సంవత్సరమునం దాసభలో రాజకీయోద్యోగులు కానివారినిసహితము

చేర్చుకొనునట్లేర్పాటు జరగుటయేకాక యందు కొందఱుస్వదేశస్థులు సహితము నియమింపఁబడిరి. 1871 వ సంవత్సరమునందు నగరపారిశుద్ధ్యవిచారణ సంఘములును స్థలనిధి సంఘములును బెట్టఁబడి స్థానిక స్వపరిపాలనము కొంతహిందువులకియ్యనారంభింపఁబడినదికానియప్పటి సభికు లందఱును దొరతనమువారిచే నియమింపఁబడినవారుగా నే యుండిరి. ఆసభికులలోఁ గొందఱి నేర్పఱచుకొనుస్వాతంత్ర్యము1883వ సంవత్సరమునఁ బ్రజల కియ్యఁబడినది. 1893 వ సంవత్సరమునందు శాసన నిర్మాణసభలోఁ గొందఱు సభికుల నేర్పఱచుకొనుటకుపురపారిశుద్ధ్య విచారణ సంఘములకును స్థలనిధి సంఘములకును స్వాతంత్ర్యమియ్యఁబడినది. ప్రజలు ప్రభుభక్తిగలవారయి తా మట్టిస్వాతంత్ర్యములను బొందుట కర్హు లయినట్లు తమవర్తనమువలనఁ జూపినచో నింకను బెక్కుస్వాతంత్ర్యములు కాలక్రమమున నియ్యఁబడు ననుటకు సందేహములేదు.

ఈచరిత్రమునుజదువఁదటస్థించువారందఱునుసత్యప్రియత్వము పరోపకారచింత, దీనదయాళుత్వము, ఋజువర్తనము, యుక్తకాలకార్య నిర్వహణశీలత, గర్వరాహిత్యము, భృత్యజనానురాగము మొదలైన రాణిగారికిఁ గలసుగుణసంపదల నలవరించుకొనఁబ్రయత్నింతురుగాక !

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

## స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తకచరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతి కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆరవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞ చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 ,, ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్హకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహ భూత వర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము

2 స్వదేశసంస్థాన చరిత్రాదులు

3 విగ్రహతంత్రవిమర్శనము

4 ఉపన్యాసమంజరి

5 వివేకవర్ధని మొదటిభాగము

6 ,, రెండవభాగము

7 ,, మూడవభాగము

8 శంకరాచార్యులు

9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము

2 కావ్యసంగ్రహము

3 అలంకార సంగ్రహము

4 నీతిచంద్రిక-విగ్రహము

5 నీతిచంద్రిక-సంధి

6 తర్కసంగ్రహము

7 సత్యవాదిని

8 ఉత్తమస్త్రీచరిత్రములు

9 జీసస్ చరిత్రము

## ఆంధ్రకవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు

2 మధ్యకాలపు కవులు

3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శాక్స మున్ద్రాక్షరశాల, రాజమహేంద్రవరము-1951

# సతీహితబోధిని.

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:

హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము

1950

[వెల 1-0-0

కీర్తిశేషులయిన రావుబహద్దూరు

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.



### ప్రహసనములు

**మొదటి సంపుటము**

1 అపూర్వబ్రహ్మచర్య
2 విచిత్రవివాహము
3 మహాబధిర
4 పునర్మ్మరణము
5 బలత్కారగానవినోదం
6 కలహప్రియా
7 మహామహోపాధ్యాయ
8 యోగనిద్రా
9 మహావంచక
10 అసహాయశూర
11 కలిపురుషశనైశ్చరవిలాసము
12 వేశ్యాప్రియా
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొదటిభాగం
16 ,, రెండవభాగం
17 ,, మూడవభాగం

### నాటకములు

**రెండవ సంపుటము**

1 బ్రహ్మవివాహము
2 వ్యవహారధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసురవిజయం)
4 మహారణ్యపురాధిపత్యము
5 ప్రహ్లాద
6 సత్యహరిశ్చంద్ర
7 దక్షిణగోగ్రహణము
8 వివేకదీపిక

**భాషాంతరీకృతనాటకములు**

**మూడవ సంపుటము**

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాలవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసువర్తక చరిత్రము

### వచనప్రబంధములు

### పద్యకావ్యములు

**నాల్గవ సంపుటము**

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు (1,2 భాగములు)
2 రాజశేఖర చరిత్రము
3 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
4 రసికజనమనోరంజనము
5 శుద్ధాంధ్రభారతసంగ్రహము
6 అభాగ్యోపాఖ్యానము
7 పథికవిలాసము
8 జాన్ గిల్పిన్
9 నీతిదీపిక

# స్త్రీహితబోధిని.



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



3 కూర్పు

ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1950



[వెల 1-0-0

# విషయసూచిక

# సతీహితబోధిని.

——(:o:)——

## చదువెఱుఁగని స్త్రీలు తమబిడ్డలకు శత్రువులు.

(౧౮౮౩ వ సం॥ మేయి నెల.)

—:(o):—

స్త్రీలు చదివి వివేకము గలవారైనపక్షమున తామెప్పుడును పరుషవాక్యములను తిట్లును నోట రానియ్యక యెవ్వరితోను కలహము పెట్టుకొనక శాంతత గలవారయి మంచినడవడిక గలవారయి యుందురు. తల్లిచాలు పిల్లలకువచ్చునన్నసామెతప్రకారముగా తల్లి మంచిదగుటవలన బిడ్డలును మంచి నడత గలవారయి, అందఱకునుముద్దుగా నుందురు. చిన్నతనములో మంచిచెడ్డలను విచారించి నడుచుకొనెడి శక్తియుండక బాలురు తమయింట నున్నవారేప్రకారముగా నుం డురో వారిని చూచి తామాప్రకారముగా నడుచుచుందురు గనుక, తల్లిదండ్రులు చెడ్డవారయినపక్షమునతఱచుగాబిడ్డలును వారివలెనే చెడ్డవారయి పొరుగుపిల్లలతో పోట్లాడుచు పెద్దవారికి కూడ కలహములు తెచ్చి పెట్టుదురు. తండ్రి సాధారణముగా బయటకుపోయి పనిచేయవలసినవాఁడును తల్లిమాత్రము సదాయింటనే యుండి కాలము గడపవలసినదియు, గనుక, తల్లితోనే విస్తారము సహవాసముండి తల్లి గయ్యాళి దయినపక్షమున పిల్లలుమఱింత ముఖ్యముగా పాడగుదురు. తల్లి చదు వెఱుఁగని మూఢురా లయినపక్షమున చదువునిమిత్తము తండ్రికూకలు వేసినప్పుడును శిక్షించినప్పుడును తల్లికల్పించుకొనియడ్డము వచ్చి కొమాళ్ళచదువుకూడ చెడఁగొట్టి వాండ్రను ఎందునకుంబనికి రానివారినిగాఁజేయును తల్లి విద్యావతి యయ్యెనేని బిడ్డలచదువును తాను స్వయముగా కనుఁగొని యింటివద్ద పాఠములు చెప్పి చదివించి

వారిని విద్యాబుద్ధులయందు ప్రవీణులనుగాదిద్దును. పూర్వకాలమునం దొక రాజు గ్రామపాఠశాలను పరీక్షించుటకయి వెళ్ళి యందులో నొక చిన్నవాఁడు తానడిగినప్రశ్నల కన్నిటికిని మంచి సమాధానములు చెప్పుటచేత ఆశ్చర్యపడి, ఉపాధ్యాయులను పిలిచి యీపిల్లవాఁడింత తెలివితో చదువుట కితని విద్యవిషయమయి నీవెక్కువ శ్రద్ధ పుచ్చుకొనుచున్నావా అని అడిగెను. ఆయుపాధ్యాయులు తానందఱి కంటెను ప్రత్యేకముగా ఈబాలునివిషయమయి యెక్కువశ్రద్ధపుచ్చుకొనలేదనియు, అతనితల్లి చదివిన దగుటచేత ఇంటివద్ద ఆమె శిక్షచేతనే యీచిన్నవాఁడు తనతోడివారికంటెవయస్సునచిన్నవాఁడయినను విద్యయందు వారందఱికంటెను తెలివి గలవాఁడయ్యె ననియు, రాజుతో చెప్పెను. ఆమాటలకు రాజు మిక్కిలి సంతోషించి పిల్లవానికి మంచి బహుమాన మిచ్చుటయేకాక కొమరుని చదువువిషయమయి యంత శ్రద్ధ పుచ్చుకొన్నందునకయి తల్లికి కూడ స్వర్ణమయమయిన రత్నాభరణమును బహుమతిగా నంపెను. అందఱు తల్లులును ఈప్రకారముగా విద్యావతులయి కొడుకుల విద్యావిషయమయి శ్రద్ధచేసెడివా రయినయెడల లోకములో బిడ్డలందఱును విద్యయందును బుద్ధియందును పెక్కురెట్లు గణనకెక్కి పెద్దవారయినతరువాత సుగుణములుగలవారయి తాము సుఖపడి యితరులను సుఖపెట్టఁగలుగుదురనుటకు సందేహము లేదు.

తల్లులు మూర్ఖురాండ్రయి గయ్యాళిగంపలయినయెడల బిడ్డలు చదువు తిన్నగారాక మూర్ఖులయి దుర్మార్గులయి చెడిపోయి కడపట తాము దుఃఖములపాలయి తమవారికికూడ దుఃఖమును తెచ్చిపెట్టుదురు. పూర్వకాలమునందు మూఢురాలయిన తల్లి తన కొమారుని పొలములలోనికి వెళ్ళి తోటకూర మెత్తుకొనివచ్చితనకిమ్మనిబోధపఱిచి వానిచేత చిన్న దొంగతనములు చేయించుచు, ఎవ్వరైనమీపిల్లవాఁ

డీప్రకారముగా చేసినాఁడుగనుక మందలింపవలసినదని చెప్పవచ్చినచో మాపిల్లవానిమీఁద లేనిపోనినిందలు కట్టెదరా యని వారితో జగడ మాడుచుండెను. ఈవిధముగా వాఁడు తల్లివలన దొంగతనము నేర్చుకొని క్రమక్రమముగా పెద్దదొంగతనములకుదిగి పదియాఱుసంవత్సరముల ప్రాయమప్పు డొకసారి చెఱసాలలో పెట్టఁబడెను. అప్పుడేడ్చుచు చెఱసాలవాకిట నిలుచున్నతల్లి నొక్కమాఱు చూడవలసిన దని అధికారులను వేఁడుకొని, వా రాప్రకారముగా సెలవిచ్చి పంపినప్పుడు తన కెదురుగావచ్చి కౌఁగలించుకొని యేడువఁబోయినతల్లిని చూచియా చిన్నవాఁడు విచారపడక కోపముతో దగ్గరగావెళ్ళిముందటిపండ్లతో ముక్కు కటుక్కున కొఱికి ముక్కలూడఁదీసి నెత్తురునఱదలు వాఱ విరూపినిజేసి చిన్నతనములో తోటకూరనాఁడే చెప్పకఉపేక్షచేసి, తన కిట్టిపాట్లు తెచ్చి పెట్టినందునకయి నీకిదిశిక్షయని తల్లితో చెప్పి లోపలికి పోయెను. ఈప్రకారముగానే తమబిడ్డలను ముద్దుచేతను గారాబముచేతను నెత్తిమీఁద నెక్కించుకొని తప్పుచేసినప్పుడు మందలింపక యిరుగుపొరుగులవారేమైన నన్నప్పుడు గయ్యాళితనమున వారితోపోట్లాడి వారిని తిట్టి తమబిడ్డలను చెడఁగొట్టినతల్లులు లెక్కకెక్కువగా నున్నారు. దీనిని చదివినవా రటువంటిమార్గము నవలంబింపక తమబిడ్డలను విద్యయందును బుద్ధియందును దిద్ది బాగుపఱుప ప్రయత్నింతురని నమ్ముచున్నాము.

## పతివ్రతాధర్మము.

(౧౮౮౩ సం॥ జూన్ నెల.)

లోకములో స్త్రీలకుపతివ్రతాధర్మముతో సమానమైనధర్మము మఱియొకటిలేదు. కాఁబట్టి, ఓనారీమణులారా! మనము సమస్త విధ

ములచే తను పాతివ్రత్యమును కాపాడుకొనుటకయి ప్రయత్నపడ వల యును. అరకాసుతో పోయిన మాన మూలు వేలవరాలిచ్చినను రా దన్న సామెతప్రకారముగా, మన మొక్కసారి కొంచెము కక్కూఱితి పడినపక్షమున మనయావజ్జీవము విచారించినను కూడిరాదు. మననడత నిష్కళంక మయినదయిన యెడల మన మెంతకురూపురాండ్ర మయి నను మన మెంతనగలులేని వారమయినను యోగ్యులందఱును మనలను భగవదర్పితమైనపుష్పమాలనువలెకన్నులకద్దుకొందురు. మనము చెడు తిరుగుడు తిరుగుచుంటిమేని మనము రతీదేవివంటిసౌందర్యముకలవార మైనను దేహమునిండ కనకాభరణములను దిగవేసికొన్నను, ఉత్తము లైన వారందఱును మనలను స్మశాన వాటికయందలి పూలదండలనువలె దూరమున విడుతురు, నూఱు నోము లొక్క అంకుతో పోవు నన్నట్లు మననడత తిన్ననిది కానప్పుడు మనము లక్షవ్రతములు పట్టినను కోటి దానములు చేసినను వానివలన నేమియు ప్రయోజనముండదు. అగ్ని సాక్షికముగా వివాహమాడినప్పటినుండియు భార్యాభర్తలొక్క దేహమగుదురుగనుక, వారొకరినొకరు ద్రోహముచేసి 'అన్యత్ర' తిరు గుట మహాపాతకము. మానాభిమానములుగలదంపతులు మఱియేమి చేసినను సహించి యూరకుండగలుగుదురుగాని యొండొరుల నతిక్ర మించి సంచరించుటచూచి యోర్చియుండజాలరు. మానభంగమున కంటె ప్రాణభంగము మేలని యెంచి కొన్ని సమయములయందు తమ ప్రాణములకును ఎదుటివారి ప్రాణములకునుకూడ తెగింతురు. అందు చేతనే సదాపురుషులు స్త్రీలపాతివ్రత్యమును రక్షించుటకయి పూర్వ కాలము నుండియు సర్వప్రయత్నములును చేయుచున్నారు. అయినను ఈపాతివ్రత్యము విద్యాప్రభావమువలన గలిగినవివేకముచేత నిలువ వలసినదే కాని పురుషులు చేయు నిర్బంధములచేత నిలుచునది కాదు. ఈ సంగతి నాలోచించియే ధర్మశాస్త్రకారులలో నెల్ల ప్రధానుడయిన

మనువు ఈపత్రికాముఖమున నుదాహరింపఁబడిన వచనముచేత పురుషులు స్త్రీలను గదులలోఁ బెట్టి తాళము వేసి కావలియుంచి నిరోధించుట వలన పాతివ్రత్యమును రక్షింపఁజాలరని యు స్త్రీలకు విద్యావివేకాదులు కలిగించి వారియాత్మలను వారు కాపాడుకొనునట్లు చేసిననే పాతివ్రత్య రక్షణము కలుగునని యు స్పష్టముగా కనఁబఱిచియున్నాఁడు కాబట్టి మనము కష్టపడి విద్యాధనమును సంపాదించి, వివాహబంధముయొక్క గౌరవస్వభావమును చక్కఁగా గ్రహించి, పురుషులవలని భీతియు నిర్బంధములును పనిలేక మనంతటమనమే రూపమునమన్మథులనైనను పరపురుషులను తృణప్రాయముగా చూచి మనమానము కాపాడుకొన వలయును. మన మొంటిగానున్నప్పు డెప్పుడయిన దుర్బుద్ధిపుట్టవచ్చును గనుక, సాధ్యమయినంతవఱకు గుణవంతురాండ్రను తోడుగా నుంచుకొనుచు, అట్టియిల్లాండ్రు దొరకకరనితోఁచినయెడల సద్గ్రంథకాలక్షేపము చేసికొనుచు మనమనస్సునకు దుర్మార్గపుచింతలకవకాశము లేకుండ చేసికొనుటయే కాక మనహృదయ మెప్పుడును సన్మార్గమువీఁదికే పోవునట్లు చేయుటకయి జీవదయాపరుఁడయినపరమేశ్వరుని నిత్యమును వేఁడుకొనుచుండవలయును.

మనకు భగవంతుఁడీలోకములోననుగ్రహించినశ్రేష్ఠపదార్థములలోనెల్లను పతియే యుత్తముఁడు కాఁబట్టి మనము భగవదాజ్ఞకు తరువాత పతియాజ్ఞయే శిరసావహించి, ఆయనయెడల భక్తివిశ్వాసములుంచి, వినయవిధేయతలుగలవారమయి, సమస్తవిషయములయందును పతియాజ్ఞకులోఁబడి నడుచుకొనవలెను. మనకు భగవంతుఁడొ

---

* శ్లో॥ అరక్షితాగృహే రుద్ధాః పురుషై రాప్తకారిభిః
ఆత్మానమాత్మనా యాస్తు రక్షేయుస్తా స్సురక్షితాః॥ మనువు, ౯-౧౨

[అర్థము—ఆప్తులైన పురుషులచే గృహమున నిర్బంధింపబడిన స్త్రీలు రక్షితురాండ్రు కారు; ఏస్త్రీలు తమయాత్మను తామే కాపాడుకొందురో వారే సురక్షితురాండ్రు.]

క్కుడే పతిని మించినప్రభువు. భగవదాజ్ఞకు విరుద్ధముగా నుండనంత వఱకుసమ స్తవిషయములయందును మనము పెనిమిటి కాజ్ఞానువ ర్తినుల మయి భయభ క్తులు కలిగి మెలఁగవలయును. ఒక వేళపతియాజ్ఞ మైనను భగవదాజ్ఞ విరుద్ధమగుటవలన దొంగతనము మొదలైన దుష్కృ త్యములను మన మెన్నడును చేయరాదు. మూర్ఖులయినభ ర్తలుచెడు కార్యములుచేయ నియమించినప్పుడు మనము వారితో నెదురొడ్డి కల హింపక శాంతత యవలంబించిమంచిమాటలచే వారిబుద్ధిమళ్ళించుచు వారినిసన్మార్గులనుగాఁ జేయువలయునని యీశ్వరుని ప్రార్థించుచుండ వలయును. లోకములో నందఱికిని మంచిభ ర్తలేలభింపవలెనని కోరిక యున్నను పురుషులందఱును మంచివారుగనే యుండుట యెన్నడును సంభవింపనేరదు గనుక, అందఱికినిమంచివా రేదొరకరు. దైవఘటన చేత మనకు లభించెడు పురుషులొక వేళకుంటివారైననుకురూపులయి నను దుష్టులయినను అప్రయోజకులయిననుమఱియెట్టివారైననువారు మనకు నాథులేయగుదురు గనుకవారి నెంతిమాత్రముమనమవమానిం పక గొప్పగా భావించి వారియందు పరిపూర్ణస్నేహ ముంచవలెను. వారిదుర్గుణములను గాని లోపములనుగాని మఱచియైనను పరులతో ప్రస్తావింపరాదు. ఒకానొకప్పుడు భ ర్తలుమనమీఁదనన్యాయముగా కోపపడినను, ఆసమయమునందువారిమాటకెదిరించియు త్తరమియ్యక శాంతతయవలంబించి చల్లనిముఖము చూపి కోపము చల్లాఱిన తరు వాత హితవాక్యములు చెప్పి శాంతాత్ములను జేయవలెను. పెద్ద గాలి వీచునప్పుడు వంగి నేల యంటియున్న చెట్లు చెడక తలయె త్తి యెదిర్చి నిలిచినగొప్పవృక్షములే వేళ్ళతో పెల్లగిల్లునట్లుగా, భ ర్త లకు పట్టరానికోపమువచ్చినప్పుడుమాఱుమాటాడకవంగియున్న భార్య లేయపాయము చెందక సుఖపడుదురు; అట్లుచేయకమగనిమీఁదతిరుగఁ బడి మాటకు మాఱుమాట చెప్పుచు ఎదిరించినవారు తప్పక చెడు

డురు. ఒకవేళ మనము భర్తల కెంతయనుకూలముగా నడుచుకొను చున్నను వారుమనలను బాధించుచు వచ్చినయెడల దానికెల్లను మన మోర్చి భార్యాభర్త లేక దేహమగుట విచారించి ప్రియవచనములచే వారికోపమును మఱపింపఁ జూచియు, ఉపచారవార్తలుచెప్పి శాంతి పఱుపఁజూచియు ప్రయాస పడవలెనేగాని తొందరపడకూడదు.మన పల్లే యొకానొకప్పుడు మననాలుకను కఱచినచో మనమేమి చేయ వచ్చును?మనముమాత్రముసన్మార్గమున నడచుచువచ్చినయెడల మన యోగ్యతను కనిపెట్టికాలక్రమమునవాథులే మనలను ప్రేమింతురు.

మనభర్తలుబయుటపనిచేసియలసియింటికివచ్చినప్పుడువారుగు వారితోడి కలహములనుగాని సంసారదుఃఖములనుగాని చెప్పి వారికి విసుగుపుట్టింపరాదు. వారింటికి వచ్చునప్పటికిల్లుపరిశుభ్రముగానుంచి తామశుచిగానుండిమంచిమాటలతోను మజ్జనభోజనాద్యుపచారము లచేతను వారిని తృప్తిపఱుపవలయును. బుద్ధిహీనురాండ్రయినమూఢ స్త్రీలవలె భాగ్యవంతులు ధరించుకొను వస్త్రాభరణాదులను తెమ్మని పట్టుబట్టిభర్తలనుబాధింపకబుద్ధిగలిగి మనకున్నదానితో తృప్తిపొంది యుండవలెను. బాహ్యవేషమున కనుకూలముగానుండు నగలు లేక పోయినను సుగుణములే మన కాభరణములుగానుండును. ఈసంగతు లను సదామనసునందుంచుకొని పతిభక్తిగలవారమయి ప్రవర్తింతు మేని మనకు సర్వాభీష్టములును కలుగును.

—(:o:)—

## అత్తగారి కోడండ్రికము.

(౧౮౮౩ వ సం॥ జూలయి నెల)

ఏమిపాపమోకాని మనదేశమునందు సాధారణముగాఅత్తలు తాము కోడండ్ర నెంతబాధ పెట్టినఁ దమ కంతప్రతిష్ఠగా భావించు

కొనుచున్నారు. కోడండ్రుతమతల్లిదండ్రులను బంధువులను వదలిపెట్టి భర్తలయింట సుఖపడవలెనని కొండంతయాశపెట్టుకొనివచ్చిరనియు, అందుచేత వారికేమియు మనస్తాపము కలుగకుండబిడ్డలవలె నాదరింప వలయుననియు, తలంపక వారు తప్పిదము చేసినప్పుడును చేయనప్పుడును కూడ నేదోవంకపెట్టి తిట్టుచు చీటికిమాటికి కోపపడుచు, మూర్ఖురాండ్రయిన అత్తలు తాము తినికూరుచుండి యింటిపని యంతయు వారి చేతనే చేయించుచు, తిన్నఁగా కట్టుకొనుటకు బట్టయును తినుటకన్నమును పెట్టక సకలవిధముల బాధ పెట్టుదురు. అందుచేత కోడలు అత్తగారిని చూచెనా యెలుక పిల్లికి జడిసినట్టు భయపడుచు ఈయత్తగారెప్పుడు చచ్చునా నేనప్పుడు హాయిగా నుందునా యని లోపలకోటి వేల్పులకు మ్రొక్కుకొనుచుండును. కొన్ని కుటుంబములలో అత్తగారి సెలవయినంగాని కొడుకునకునుకోడలికిని మాటలేలేవు. కొడుకు ప్రయోజకుఁడయి జీవనమునిమిత్తము విధవయైనతల్లినే నమ్ముకొనియుండుట తటస్థమయ్యెనా, ఆకుటుంబములో కోడలికి బ్రతుకే లేదు. తిట్లను చీపురుకట్టదెబ్బలను త్రికాలములయందును నిత్యకర్మలుగానే యుండును. అత్తగారు కోడలిమీఁద కొడుకుతో చెప్పెడి నేరములు వ్రాసినచో నిత్యమును నొక్కొక్కపుస్తకమునిండును. ఆ నేరములు నమ్మి కొడుకు కోడలిని కొట్టెనా, ఆదినమత్తగారికి స్వర్గలోకములో నున్న బంధువులు లేచివచ్చినంత సంతోషము వచ్చి గొప్పపండువు గానుండును; ఒకవేళ తన చాడీలను నమ్మికొట్టకపోయెనా నాటిదినమత్తగారికి ఇంట పీనుఁగువెడలినంత దుఃఖము వచ్చి నూతిలోను గోతిలోను పడఁబోవును. కొన్నిసమయములయం దత్తగారుపెట్టుబాధలు తలఁచుకొన్న, పురుషులకు వివాహ మాడుటకన్న సన్యాసాశ్రమము స్వీకరించి యడవుల పాలగుట యెంతో సుఖకరముగా తోఁచును. తల్లిమాటవినినిష్కారణముగా భార్యను కొట్టుటను మనసొప్పకకొట్టకున్నతల్లియొక్క కోఁత

పడుటకు శక్యముకాదు. ఏమియు నెఱుఁగనట్టూరకున్నచో ప్రతిదిన
మును కలహములతోను దుర్భాషలతోను గృహము మహాయుద్ధరం
గము వలె నుండును. భార్యనే తిట్టికొట్టుచునచ్చినయెడల లోకనింద
మాత్రమేకాక కొన్నిసమయములయందెక్కడను సుఖము లేకపోవుట
చేత భార్య నూతిలోనో నదిలోనో పడి యాత్మహత్య చేసికొనుటయు
సంభవించును; కొంచెము తల్లిమీఁద కోపపడినయెడల కొడుకును
కోడలిని అడలఁదిట్టుచు గోలయెత్తి యిల్లువిడిచిలేచిపోయితనకొడుకు
కోడలితోఁజేరి తనకు తిండిపెట్టక యిల్లువెడలఁగొట్టెనని యెల్లచోటుల
నల్లరిచేయును. అటువంటి అత్తలు కొడుకేమయినను సరే కోడలి
తాళిపు తెగినంజాలునని సంతోషింతురు. విద్యాగంధమును యుక్తా
యుక్త వివేకమును లేకపోవుటవలన మనలోని స్త్రీలు పలువురు
ప్రత్యక్షరాక్షసులుగా నున్నారు. కోడండ్రను సుఖపెట్టెడి యత్తలును
కొందఱుందురు కాని మొత్తముమీఁద వారు మిక్కిలి యరుదుగా
నున్నారు. అత్తలను బుట్టలో పెట్టి తిరపెట్టెడు గయ్యాళికోడండ్రును
కొందఱుందురు కాని వారును మిక్కిలితక్కువగానున్నారు. ఈవిధ
ముగా సకలకష్టములును పడిన కోడండ్రు సహితము తమకడుపున
నొక్క కొడుకు పుట్టి జానెడుకోడలు వచ్చినతోడనే తమపూర్వావస్థ
మఱచిపోయి దానిని కోసిపెట్టుట కారంభించి సిగ్గులేక తమకాలములో
నున్న కోడండ్రికనులో నిప్పుడు నూఱవపాలు లేదని తోడివారితో
ప్రతిష్ఠగా చెప్పుకొనుచుందురు. ఇటువంటి మూఢవనితల కెప్పుడు
వివేకము వచ్చునో తెలియఁజాలకున్నాము. దీనింజదువువారందరును
తమ యవివేకమునువదలి చక్కఁగా నాలోచించి తమకు కోడండ్రు
వచ్చినప్పుడు వారినెంతమాత్రమును చిన్నపుచ్చక తమగర్భవాస
మున పుట్టిన వారివలెనే యాదరించి సమస్తవిధముల సుఖపెట్టుచు
తాము తమకొడుకులునుకూడ సుఖపడుచు గృహము భూలోక
స్వర్గమువలె నుండునట్లుచేయ ప్రయత్నింతురని నమ్ముచున్నాము.

—:(O):—

## బాలశిక్షణము.

(౧౯౦౩ వ సం॥ ఆగష్టు నెల.)

—:o:—

ఈ దేశములో పసితనమునుండియు బాలురను మంచియుదవు నందుంచి వారికి బుద్ధి నేర్పుక్రమము బొత్తిగా తెలియదు. పలువురు బాలురనుచిన్నతనములో మనసువచ్చినట్లు తిరుగనిచ్చినను పెద్దయైన తరువాత వారికే బుద్ధివచ్చునని తలంతురు. కొందఱు పిల్లలల్లరిపని చేసినప్పుడు వారిని శిక్షించుటకుమాఱుగా ముద్దుచేసినవ్వుచు నూర కుండిపోత్సాహముకలుగఁజేయుదురు. అటువంటిబిడ్డలుభయభక్తులు లేక చెడ్డపనులయందలవాటుపడి తరువాత తల్లిదండ్రులకే లొంగక చెప్పినమాటవినక పాడగుదురు. మొక్కయివంగినిదిమ్రానయివంగునా యన్న సామెతను జ్ఞప్తియందుంచుకొని యెల్లవారును తమబిడ్డలవిష యమయి పసితనమునుండియు గట్టి శ్రద్ధచేసి చిన్నతనములోనేవారు మృదుసంభాషణమును వినయవిధేయతలను మంచినడవడియు నేర్చు కొనునట్లు చేయవలెను. వారెల్లకాలమును పిల్లలుగానే యుండెడి పక్షమున వారి నడవడివిషయమై మనమొకవేళ నుపేక్షచేసినను చేయవచ్చునుగాని వారును కొంతకాలములో మనవలెనే పెద్దవారై లోక వ్యవహారములయందు మెలఁగ వలసినవారగుటచేత వారినడత విషయమై మనమెంతమాత్రమును అశ్రద్ధవహింపఁగూడదు. ఈ విష యములో మనము ముఖ్యముగా శ్రద్ధచేసి బాలురను తల్లితండ్రుల మాటకెదురుచెప్పక వారియాజ్ఞకులోబడియుండునట్లు చేయవలయును. అట్లుగాక వారు జననీజనకుల యాజ్ఞల నతిక్రమించి లక్ష్యము చేయ నప్పుడు మనము చూచీచూడనట్లూరకుందుమేని వారిని సత్ప్రవర్త నమునదిద్దుటకుమనమెన్నఁడునుశక్తులము కానేరము. కాఁబట్టిమాతా పితలునను స్వప్రయత్నములచేతను తమబిడ్డలకు ఆజ్ఞానువర్తులై యుండు

గుణమును మొట్టమొదట నేర్పవలయును. ఈవిషయమై మాత్రము కొన్ని ముఖ్యాంశముల నిక్కడ చెప్పుచున్నాము. పిల్లలకు విధేయత నేర్పవలెనని వారి నెప్పుడును కొట్టితిట్టుచు సదా భయముచేతవడకు నట్లు చేయఁగూడదు. వారుత్సాహముతోనే మనయాజ్ఞలకు మాఱు మాటాడక లోఁబడునట్లు చేయవలెను. పిల్లవాండ్రకు హేతువులు చెప్పి వారిని ఒప్పగించి వారిచేత మనముచెప్పినపని చేయించుటయు మంచిపద్ధతి కాదు. పిల్లలు మంచిచెడ్డలను పూర్ణముగా గ్రహించెడి శక్తికలవారు కారుగనుక, వారిని ఒప్పించియేపనిచేయుట తఱుచుగా సాధ్యము కాదు. కాఁబట్టి మనము చేసెడిపనులు వాండ్రమేలుకొరకే యని వారు తెలియునట్లు చేయుట యావశ్యకమేయైనను వారియిష్ట ప్రకారముగా పనిచేయనిచ్చుటమాత్రముక్రమముకాదు. వానియిష్ట మెట్లున్నను మనము విధించినట్లే చేయుటకు వారినభ్యాసపఱుపవల యును. ఇట్టి యభ్యాసము వారికి కలిగించుటకై వారులోఁబడవలసిన దని మనముద్దేశింపనియాజ్ఞలను వారి కెన్నఁడును ఇయ్యకుండవలెను. ఒకపని చేయవలసినదని వారినాజ్ఞాపించి వారుదానిని చేయనప్పు డుపేక్షించి యూరకుండుటకంటె వారి కవిధేయతను నేర్పుమార్గము మఱియొకటి లేదు. ఒక్కసారి మనమాలాగున నుపేక్ష చేసినతోడనే మనమాటను నిర్లక్ష్యముచేయుట వారికలవాటై పోవును.

ఆవలకు ముట్టుకొకూడదని చెప్పిన బల్లమీఁది గాజుపన్నీటి బుడ్డిని పిల్లవాఁడు ముట్టుకొనఁగా చూచినప్పుడు సాధారణముగా దాని నెప్పటిస్థలమున పెట్టుమని మాత్రము చెప్పుదురు. అంతేకాని వాఁడప్పుడు చేయితీసినను మరల నిమిషమునకు దానినియథాప్రకార ముగాముట్టుకొననారంభించినపక్షమున చూచీచూడనట్లూరకుండురు గాని చెప్పినమాటను విననందుకు శిక్షింపరు. ఒకవేళ వాఁడాబుడ్డిని తీసినప్పుడు చేయిజారి పగిలిపోయినయెడల మాత్రము తిట్టరానితిట్లను

తిట్టి క్రూరముగా తిట్టుదురు. అది పగులక పోయినా మరల నెప్పటి యట్ల యుపేక్ష చేసి యూరకుందురు. అట్లు చేయుట యెంతమాత్రము సరి కాదు. పిల్లవాని తప్పిదము మనయాజ్ఞను మీరుటలో నున్నదిగాని పగిలిపోయినవస్తువులో నెంతమాత్రము లేదు. మనము చెప్పినమాటకు విరుద్ధముగా పిల్లవాఁ డెప్పుడు నడచెనో యప్పుడే వానిని మన మాట తప్పిదమునకయి తప్పక శిక్షింపవలెను. అట్లు చేయకయొక్కసారి యుపేక్షించి యూరకుందుమేని వాఁడు ముందుమనయాజ్ఞలయందంత లక్ష్యముంచఁడు. కాఁబట్టి మనయాజ్ఞను మీరుటవలనఁ గలిగిన నష్టము నుగుణించి మనమెంతమాత్రమును విచారింపక, అందువలన నష్టముకలిగినను కలుగక పోయినను కూడ చెప్పినమాట విననందుకే శిక్ష చేయవలెను. వస్తువు చెడిపోయి నష్టము కలిగినదన్న హేతువుచేత వాని నధికముగా శిక్షింపరాదు. వాఁడూరక యాటలలోనే యాపని చేసియుండునుగాని నష్టము కలిగింపవలెనని యెంతమాత్రము నుద్దేశించి యుండఁడు. ఆజ్ఞను మీఱినప్పుడు మనము సహించి యూరకుండమని వాని మనస్సునకు తెలిసెనేని వాఁడు ముందేవిషయమునందును మీఱి నడవఁడు. పిల్లలుపట్టినమంకుపట్టును మాత్రము మనమెన్నఁడును గెలువ నియ్యకూడదు. కొందఱు పిల్లలు మంకుపట్టుపట్టి తల్లిదండ్రులకు మిక్కిలియాయాసము కలుగఁజేయుదురు. అటువంటిసమయములయందు మనము వారి మనస్సు వచ్చినట్లుగా విడుతుమేని తమపట్టే గెలిచినదని గర్వపడి ముందు మఱింత పెంకెపట్టు పట్టుచుందురు. కనుక అటువంటిదానిని మనము మొదటనే సాగనియ్యకుండవలెను. ఇందులో నిదర్శనముగా నొక పుస్తకమునం దుదాహరింపఁబడిన యంశము నిక్కడ తెలుపుచున్నాము.

ఒకదొర తనమిత్రులతో కూరుచుండియుండి అయిదేండ్లప్రాయముగల తనకొమారుఁ డక్కడనుండి వెళ్లుచుండఁగా పిలిచి “బాల

బోధ" ను తీసి దీనిలో మొదటియక్షర మేమియని యడిగెను. ఆ చిన్నవాఁ డెందుచేతనో చిరాకుగా నున్నందున తెలిసియుండియు దానిని చెప్పకపోయెను. అప్పుడు తండ్రి బెదరించియు కార్యములేక పోఁగా పిల్లవానిని మనసువచ్చినట్టు పోవిడుచుట యుచితముగాదని యెంచి గదిలోనికి తీసికొనివెళ్ళి యొకదెబ్బకొట్టి మరలతీసికొనివచ్చి, ఆయక్షర మేమని యడిగెను. అప్పుడు వాఁడు మోటుపట్టుపట్టి చెప్పక పోయెను. అందుమీఁద తండ్రి వానిని మరల గదిలోనికితీసికొనిపోయి మఱిరెండుదెబ్బలుకొట్టి తీసికొనివచ్చి, చెప్పుమనియడిగెను. అప్పుడును వాఁడు మూర్ఖత్వమునుమానక యథాప్రకారముగా నేచేసెను. ఆపయిని తండ్రి పిల్లవానిని మరల గదిలోనికిఁగొనిపోయి మనసులో నెంతో ఖేదముగానున్నను విధిలేక దిట్టముగా కొట్టితీసికొనివచ్చి యీసారిచెప్పుమని యడిగెను. పిల్లవానికి దేహమునిండను చెమ్మట పట్టినది, దేహమంతయు భయముచేతకంపమెత్తఁగా వెక్కివెక్కి యేడ్వసాగెనుగాని, ఆయక్షరమును మాత్రము చెప్పకపోయెను. అప్పుడు తండ్రికి మిక్కిలి దుఃఖమువచ్చి యేమిచేయుటకునుతోఁచక బాలుని క్షేమమునుకోరినయెడల వదలిపెట్టి యూరకుండకూడదని యెఱిఁగి మరల శిక్షించుటకయి నాల్గవసారి వానిని చేయిపట్టుకొని గదిలోనికి తీసికొనివెళ్ళఁబోయెను. అప్పుడా చిన్నవాఁడు "ఏ" యని మొదటి యక్షరమును చెప్పెను. అటుతరువాత నక్షర మేమనఁగా "బి" యనియు, దానిపయిని "సి" యనియు, అడిగినప్రశ్నకెల్లను ప్రత్యుత్తర మియ్యనారంభించెను. అది మొదలుకొని తాను పట్టుపట్టిన కార్యములేదని తెలిసికొని యాచిన్నవాఁ డెప్పుడును తండ్రియాజ్ఞ నతిక్రమింపలేదు. అదిచూచినయింటనున్న తక్కినపిల్లలుకూడబుద్ధిగలిగి పెద్దవారియాజ్ఞకు లోఁబడి నడుచుకొనుచు వచ్చిరి. ఇదియంతయు జరుగుచున్నప్పుడు తల్లికూడదగ్గఱనేయున్నను పిల్లవానిక్షేమమును

గోరి యూరకుండెనే కాని లోపల నెంతవిచారముగా నున్నను కొట్ట వలదని మగనితో నొక్కమాట యయినను అన్నదికాదు. అట్టి సమయములయందు మనలోని స్త్రీలు చెంతనున్న పక్షమున వలవల యేడ్చుచు మగనికడ్డమువచ్చి పిల్లవానిని చెఱుపుదురు.

పిల్లవాండ్రను శిక్షించుట సదా దెబ్బలచేత నేకాదు. కొన్ని సమయములయందు కొట్టియు, కొన్ని సమయములయందు వారినాట విడుపుసమయములయందు విడిచిపెట్టకయు, మఱికొన్నివేళలయందు వారికిచ్చు తినుబడి పదార్థముల నీయకయు, నీవీనేరము చేసినందున కిది శిక్షయని వారితో చెప్పి యాప్రకారముగా చేయవలయును. పొఱపాటుచేత పిల్లవాఁడేదైనను తప్పిదము చేసినప్పుడు వాని కా సంగతిని చెప్పి శిక్షింపక యూరకుండవలెను. అట్లుచేయక ప్రమాదముచేత సంభవించినదానికి కూడ కొట్టుచువచ్చిన యెడల, పిల్లవాండ్రకు బుద్ధిపూర్వకముగా చేసిన యపరాధమునకును ప్రమాదమునకును భేదము తెలియక మొండికెత్తిపోదురు. మనలో స్త్రీలుసాధారణముగా స్వల్పతప్పిదమునకుఁ గూడ బిడ్డలను నోట పట్టరాని తిట్లను తిట్టి పశువును బాదినట్లు బాదుదురు. ఒకానొకప్పుడు తమకితరుల మీఁద కోపమువచ్చినప్పుడు నిష్కారణముగా తమకోపము నంతను నిరపరాధు లయిన బిడ్డలమీఁద చూపి వారిని కొట్టి తిట్టుదురు. అట్లు చేయుటవలన బిడ్డలు చెడిపోవుటయే కాక పాపముకూడ సంభవించును. కాఁబట్టి యీసంగతులను మనసునం దుంచుకొని మనస్త్రీలు నిర్హేతుకముగా తమబాలుర నెప్పుడు తిట్టి కొట్టకుందురనియు, వారు నిజమైన తప్పిదము చేసినప్పుడు ప్రేమచేత నూరకుండక తగినశిక్షను చేసి తరువాత మన్నింతు రనియు కోరుచున్నాము.

## భూ త ద య.

[౧౮౯౩ వ సం॥ సెప్టెంబరు నెల]

ఒక్క మనుష్యులయెడల మాత్రమేకాక దయాస్వరూపుఁడైన భగవంతుఁడు మనలను సృజించినట్లే సృజించి ప్రేమతో కాపాడుచున్న సమస్తజీవరాసులయెడలను కూడ దయ కలిగియుండుట మిక్కిలి ఆవశ్యకము. మనుష్యుల కీయుత్తమగుణముఅభ్యాసమువలన నేస్థిరపడి రెండవస్వభావముగా నేర్పడును. మొదటినుండియు కొందఱీ యభ్యాసము లేకపోవుటచేత జంతువులను నిష్కారణముగాహింసపెట్టుక్రూర స్వభావము గలవారయి, అనేకపాపములకొడిగట్టుచున్నారు. కాఁబట్టి యింటివద్ద తల్లులు తమబిడ్డల విషయమయి మంచిశ్రద్ధను వహించి వారికి ఉగ్గుపాలతోకూడ భూతదయను నేర్పవలెను. ఈసద్గుణమును బిడ్డలకు నేర్పుటకయి యేదయినజంతువునకు బాధకలిగినప్పుడు తాము విచారపడినట్టు వారికితోఁచునట్టుచేసి వారుకూడజాలిపడునట్లుచేయ వలెను; జంతువులవిషయమయిపిల్లలు అక్రమముగా ప్రవర్తించినపక్షమున, తమచూపులవలనను ఆకారమువలననుతమకదియిష్టములేనట్టు కనఁబఱిచి, తామట్టిపనిని మఱియొకసారి నురలచేసినయెడలతమతల్లి దండ్రులకు కోపము వచ్చునని పిల్ల లనుకొనునట్లు చేయవలెను. తమ కోపమును కనఁబఱుచుటకు ముందు బిడ్డ లేజంతువునకైనను హాని చేసినపక్షమున వారు తాముచేసినహానిని తెలిసికొనునట్లుచేయవలెను. సాధారణముగా పిల్లలుఆటలవేడుకచేత జంతువులకుబాధకలిగింతురే కాని బుద్ధిపూర్వకముగా నొప్పి కలిగింపవలెనని చేయరు. వారుచేతి లోనికఱ్ఱతో గోడలను తలుపులను కొట్టినట్టే జంతువులనుకొట్టుదురు గాని, అట్లు చేయుటవలన తాము వానికి నొప్పి కలుగఁజేయుచున్నా మని యెఱుఁగఁజాలరు. కొందఱు తల్లులు తమబిడ్డలుపిల్లులు మొదల

యిన జంతువులను తోకపట్టిలాగియు, చెవులును మెడయు పట్టుకొని పిసికియు, హానిచేయుచున్నప్పుడు చూచి నవ్వునుగాని యూరకుండుదురుగాని వారి నట్లుచేయు వలదని మందలింపరు; ఒకానొకప్పుడు పిల్లిపిల్లగాని కుక్కపిల్ల గాని బాధ పడ లేక స్వసంరక్షణార్థము నిమిత్తము ఎదురు తిరిగి పిల్లవానిని బరికినను కఱిచినను అప్పుడు పిల్లవానిని తీసి చంకఁ బెట్టుకొని యేడు పుడుపుచు నిష్కారణముగా నోరెఱుఁగని యాజంతువులను కొట్టి తిట్టుదురు. అవి పిల్లవానికి కొంచెము హాని చేసినను, ముందట్టి క్రూరమైనపని నెప్పుడును చేయకుండునట్లు బుద్ధి చెప్పుటచేత తల్లులకంటె అవియే పిల్లలకునిజమైన యుపకారమును చేసినట్లు ఎంచవలయును. కాఁబట్టి పిల్లల టువంటిపనులను చేయునప్పుడు తల్లులుతగిన జాగ్రత్త పుచ్చుకొని "నాయనా! దానిజోలికి పోకు. పాపము! అది మంచి జంతువు" అనికొంచెము చెప్పవలసియున్న దో పిల్లవాని మనస్సునందది యెంతో పనిచేసి ముందు వానిని మంచి వానినిగాఁ జేయును. అట్లు చేయక అటువంటిసమయములయందు పేకు చేసికొంచెముతిరుగఁబడినప్పు డాజంతువులనే కొట్టుట పట్టుటచేత, మొట్టమొకట పిల్లవానికి క్రూరత్వమలవాటుపడును; రెండవది నోరు లేని జంతువునకన్యాయము చేసిన ట్లగును; మూడవది పగ తీర్చుకొనుబుద్ధిని పిల్లవానికి బోధించినట్లగును. పగసాధించవలెననుబుద్ధికంటె లోకములో హానికరమైనది మఱియేదియు లేదు. కాఁబట్టి చిన్నతనము నందు బాలురమనసులలో అటువంటిబుద్ధియుదయింపకుండఁ జేయుటకయితల్లు లెంతో శ్రమ పడవల యును. పిల్లలెప్పుడును తాము చేయుపనియొక్క ఫలము నాలోచించి యొకపనినిచేయరు. తా మేదిచూచిన దానినెల్లనుఆలోచన లేక తామవలంబింతురు. కాఁబట్టితల్లిదండ్రులు సదాతమచేష్టలచేతను, ఆకారములచేతను తమబిడ్డలుభూతదయను సత్స్వభావమును నేర్చుకొనునట్లు ప్రవర్తింపవలయును. మనము చెప్పుమాటలు మనము చేయు కార్య

ములవలె వారి మనసులమీఁద పనిచేయవు. కాఁబట్టి మనము కోపము మొదలయిన వికారములను పిల్లలసమీపమున నెప్పుడును కనఁబఱపక సాధ్యమైనంత సాత్వికముగా నడుచుకొనుచుండవలెను.

—o—

## తల్లిదండ్రులను పూజించుట.

(౧౮౮౩ వ సం॥ అక్టోబరు నవంబరు నెలలు)

—(o)—

లోకములో మాతాపితలను పూజచేయుట యనఁగా మనకు మితిమీఱిన మేలు చేసియుండుటచేత వారియెడల నడుచుకోవలసిన ధర్మముల నెఱిఁగి యథాప్రకారముగా కృతజ్ఞతగలవారమై ప్రవర్తింపవలయు ననుటయే కాని విగ్రహములను జేయించి వారిమీఁద పువ్వులు మొదలయినవి చల్లి యారాధింపవలయు ననుట కాదు. వారియెడల మనము ముఖ్యముగాఁ గనఁబఱుపవలసిన ధర్మములు విధేయత, గౌరవము, ప్రేమము మొదలయినవి. మనము పుట్టకపూర్వమే మననిమిత్తమెన్నెన్నో తపస్సులు చేసి కష్టపడి మనలను తొమ్మిదిమాసములు కడుపులో మోచి మనము గర్భమునన్న కాలములో మనకొక్కయాపద రాకుండ కాపాడుటకై యిష్టదేవతలకును నిత్యమును మ్రొక్కుకొనుచు మిక్కిలి వేదనతో కన్నదినము మొదలుకొని వేయి యంగరక్షలు చేసి చన్నుగుడిపి కాపాడుచు మంచముమీఁదను తొట్లలోను బెట్టి మనలను జోలలుపాడి జోకొట్టి నిద్రపుచ్చుచు మనము కన్నుమూఁత పడక పోరుపెట్టి యేడ్చునప్పుడు ఱొమ్ములమీఁదను భుజములమీఁదను పెట్టుకొని త్రిప్పి పాటలుపాడి యోదార్చుచు మనము కాలుచేయి యుపయోగించుకోలేని యవస్థలో వేళపట్టున నన్నపానాదులిడి సమస్తవిధముల సంరక్షించుచు మనకుకొంచెము కాలునొచ్చినయెడల మన దేహము మరల కుదురుటపఱకును నిద్రాహారములు మాని తల్లడించు తల్లి

విషయమును, నుదము గర్భమున పడినది మొదలుకొని మన నిమిత్త మయి సమస్త కష్టములును పడి ధనార్జనము చేసి మనము పుట్టిన తరు వాత మనకే విషయమునను లోపము రాకుండునట్లుగా బట్టలు మొద లైనవి తెచ్చి యిచ్చుచు అర్ధరాత్రి వేళ మనకు కడుపునొచ్చినదన్నను లేచి పరుగెత్తి వైద్యునిపిలుచుకొనివచ్చి తగినమందులు వేయించుచు బైట పనిమీఁద వెళ్లినప్పుడు కూడ ప్రాణములు మనమీఁదనే పెట్టు కొని యుండి వచ్చియిల్లు చేరినతోడనే మనలను "నాకన్నతల్లీ! నాముద్దు పాప!" యని ముద్దులాడి యెత్తుకొనితిరుగుచు మిక్కిలి ప్రయాసపడి విద్యయు బుద్ధియు చెప్పించి తనజీవితకాలములో మాత్రమే కాక తన యనంతరమును మనము సుఖసంతోషాదులు గలిగి బ్రతుకవలయునని కోరి భగవంతుని ప్రార్థించుతండ్రివిషయమునను, మనము కృతజ్ఞత మొదలైనవి కలిగి యుండవలసినదని చూపుటకు శ్రమపడవలసిన పని లేదు. చిన్నతనములో జననీజనకులు మన విషయమున నంత శ్రద్ధ పుచ్చుకొని కాపాడకపోయినయెడల మనము బ్రతికి బట్టకట్టి యింత వారము కానే లేకపోదుము. కాఁబట్టి యీలోకములో మనము సమస్త మునకును తల్లిదండ్రులకు ఋణపడియున్నాము. ఈసంగతి నెఱిగిన వారమై మొట్టమొదట మనము సర్వకార్యములయందును తల్లి దండ్రులకు లోఁబడి వారియాజ్ఞను శిరసావహించి చేయుచు వారి యెడల వినయ విధేయతలు గలిగి మెలఁగవలయును. పుత్రులుగాని పుత్రికలుగాని న్యాయమైన విషయములలో తల్లిదండ్రుల మాటను వినక యెదురుతిరిగి ప్రవర్తించినయెడల వారిమనసెంతో ఖేదపడును. వారికన్నులనుండి యొక్కనీటిబొట్టు మనమూలమున రాలిచ్చుట యెం తో మనకు హానికరము. తల్లిదండ్రులు చెప్పుదానిని మాఱు మాటాడక వెంటనే చేయవలెను. వారిచేత పలుమారు చెప్పించు కొని చేసినయెడల చేసినకార్యము గౌరవము సగము చెడును. కొం

దఱు బిడ్డలు తల్లిదండ్రులేదైన నొకపని చెప్పినప్పుడు విధిలేక చేసి నట్లు మొగము మటమట లాడించుచు నేడ్చుచు చేయుచుందురు. అట్టిష్టములేక చేయుటయు శ్రేయస్కరముకాదు. చేసెడిపని నెప్పుడును ఉత్సాహపూర్వకముగాను సంతోషముతోను చేయవలెను. ఆప్రకారముగాచేయుట కభ్యాసముచేసినయెడల మనము స్వప్రయోజనపరత్వమును మఱచిపోయి యొక్కతల్లిదండ్రుల విషయముననే కాక లోకమువిషయమునను సత్కార్యముల నుత్సాహముతో చేసి పరోపకారచింతగలవార మగుదుము. తల్లిదండ్రుల కన్నివిషయముల లోను లోబడియుండవలసినదని కల్లలాడుట దొంగతనము చేయుట హత్యలుచేయుట మొదలయిన నీతిమాలినపనులు తల్లిదండ్రులుచెప్పినను, అత్తమామలు చెప్పినను, గురువుచెప్పినను, ప్రభువుచెప్పినను, భర్త చెప్పినను, మఱియెవ్వరుచెప్పినను చేయరాదు. అట్లుచేయనందునకువారు మనల నొకవేళ దండించినను వారుచేసిన శిక్షకు సహించి యక్రమముచేయక యూరకుండవలసినదే కాని వారియభిమతప్రకారమెంతమాత్రమును చేయరాదు. సత్యము, భూతదయ మొదలయినవి మన కీలోకమునందును పరలోకమునందునుకూడ సమస్తసుఖములను సుఖసాధనములనుఇచ్చి పాలించువాఁడును జననీజనకులకంటెను పెనిమిటికంటెను ప్రభువుకంటెను అందఱికంటెను సర్వాధికుఁడు నయిన పరమేశ్వరునియాజ్ఞ లగుటవలన ఎన్నికష్టములువచ్చినను ఎవ్వరికి కోపమువచ్చినను మనము సత్యము మొదలయినవానిని విడువరాదు. అవి యెవ్వనియాజ్ఞలో యాభగవంతుని యనుగ్రహము లేకపోయిన యెడల మన మెక్కనిమిషమయినను సుఖమును పొందఁజాలము.

విధేయత తరువాత తల్లిదండ్రులయెడల నడపవలసినధర్మము గౌరవము. మనము వారియెడల సదాగౌరవము చూపవలయును. మనజన్మమునకు హేతుభూతులయి మనలను పెంచిపెద్దవానిని చేసిన

మహోపకారము నిమిత్తమయి వారిని ఘనతపఱుపవలసియుండును గనుక వారుమనకంటె విద్యాదులచేత నధికులయినను కాకపోయినను కూడ గౌరవింపవలసినదే. అదిగాక గౌరవము సత్ప్రవర్తనమును బట్టి యుండవలసినదే కాని యదిలేని కేవలవిద్యనుబట్టి యుండవలసినదికాదు. విద్యలేనివారుకూడ మంచినడవడిక కలవారయి తమ సుఖములను మానుకొని కడుపునఁబుట్టిన బిడ్డలసుఖమునిమిత్తము పాటుపడుచున్నారుగనుక బిడ్డలు తాము చదువుకొన్నామని తల్లిదండ్రులకంటె నెక్కువవారమని గర్వపడక వారికిరుము స్తవిధములను గౌరవము చేయవలెను. కొందఱుతల్లిదండ్రులయెడ నిజమైన గౌరవము కలవారైనను మర్యాదలేక మోటుతనముగామాటాడుచున్నారు. అట్లుమాటాడుట యనాగరికతకు గుఱుతు కాఁబట్టి యెల్లవారును మృదుత్వముతప్పక మన్ననతో మాటాడుటకు నేర్చుకోవలయును.

అన్నిటికంటెను కడపట చెప్పినను తల్లిదండ్రులయెడలప్రేమ అన్నిటికంటెను ప్రధానమైన ధర్మము. ఇదిలేకపోయినయెడలతక్కిన వేమియున్నను నిరర్థకములు. ఒకదుష్టుని సహితము ప్రేమలేకపోయినను భయముచేత విధేయతచూపి గౌరవింపవచ్చును. అట్లుగాకతల్లిదండ్రుల విషయమయిన మనవిధేయత మొదలయినవాని కిప్రేమయే కారణముగునట్లు చేయవలయును. ప్రేమయొక్కటిలేకపోయినయెడల నిజమైన గౌరవముండకరహస్యమునవారికిష్టము లేనిపని చేయుటసంభవింపవచ్చును. ప్రేమ లేకపోవుటచేత వారుప్రేమించెడి యితరసోదరులవిషయమునఁగాని యక్కచెల్లెండ్రవిషయమునఁగాని మనమేదైన కానిపని చేసినయెడల తల్లిదండ్రులకు కలకాలమునుమనస్తాపముకలుగును. కన్నబిడ్డ లట్టివారయిరేని మంచిగృహము లున్నను సంపద లున్నను మఱియేమున్నను గృహజయమానులుసుఖము లేకకృశింతురు. ప్రేమ గలుగుటకు కృతజ్ఞత ముఖ్యసాధనము. కాఁబట్టి మనసుఖము

నిమిత్తమయి మనతలిదండ్రు లెన్నికష్టములుపడి యెన్నిసుఖములను సంతోషములను వదలుకొన్నారో జ్ఞప్తియం దుంచుకోవలెను.

## మితవ్యయము.

(౧౮౭౩ వ సం॥ అక్టోబరు నవంబరు నెలలు]

పురుషులు సంపాదించి తెచ్చిన పదార్థములనుగాని ధనమునుగాని పదిలముగావాడుచు నేమియువ్యర్థముగా పోనీయక స్త్రీలుసాధ్యమైనంత మితముగా సంసారము గడపవలెను. ఒకవేళధనికులయినను ధనము మొదలయిన వానినివ్యర్థముగాంగానినిజముగా కావలసినదానికంటెనధికము గాగాని వాడకూడదు. కాలమెన్నటికి నేకరీతిగానుండదు. ఏదోయొక కారణముచేత మనధనాదులు పోయి మనము బీదలము కావచ్చును. వ్యాధులు మొదలయినవివచ్చిమనముపాటు పడశక్తిలేని వారమయి క్రొత్తగా నార్జించుటకు శక్తులము కాకపోవుటయేకాక మునుపున్నదానినికూడకొంచెముకాలములో నేవ్యయము చేయుటయు సంభవింపవచ్చును. బొత్తిగానేమియులేని బీదలు ముందువిచారించి కొంచెను నిలువచేసికొని జాగ్రత్తగా నుండనియెడల వ్యాధులు మొదలయినకష్టములువచ్చినప్పుడు వారు పడెడిపాట్లు చెప్పనలవియే కాదు. కొంతధన మున్నవా రయినను మితముగా వాడుకొనుటకలవాటుపడి యుండనియెడల స్థితి తగ్గినప్పుడు సహితము మునుపటి యలవాటు చొప్పున నధికవ్యయము చేయుచు శీఘ్రకాలములోనే యప్పులపాలయి తలవంపులు తెచ్చుకొందురు. కాబట్టియెల్లవారునుతమరాబడికి తగినట్లుగావ్యయమును జేయుచు సమస్తవిధముల నున్నదానిలోకొంచెము మిగుల్చుకొను చుండవలెను. అట్లు చేసినయెడలముసలితనమువచ్చినప్పుడుగాని, వ్యాధివచ్చినప్పుడుగాని, ఇతరబాధ లేవైనను తటస్థించినప్పుడు

గాని కష్టములపాలు గాక జీవింపఁ గలుగుదురు. ఉన్నవారుకూడతమకు నిజముగా కావలసినవస్తువులుతప్ప చౌకగావచ్చినవను హేతువుచేత నక్కఱకు మాలినవస్తువులుకొని ధనము పాడుచేయరాదు. కొందఱు స్త్రీ లన్న మెక్కువగా ఉడుకఁబెట్టి పాఱవేసియు, బియ్యముపోసి గవ్వలను గచ్చకాయలనుకొనియు, కూరలు మొదలయినవెక్కువగా తెప్పించికుళ్ళఁబెట్టియు, విశేషనష్టమును కలిగింతురు. మఱికొందఱు స్త్రీలు దూబరతిండితనముమరిగి పెరుగుమొదలయినవి విస్తారముగాకొనియు, ఉన్నడబ్బుతోననావశ్యకములైనగుడ్డలను మధురాహారములను తెప్పించియు, పురుషులు ధనమునియ్యనియెడల చాటుగా బియ్యము మొదలయినవానినితక్కువ వెలకువిక్రయించి కోరినవస్తువులను పొందియు సంసారమును పాడుచేయుదురు. ఈవిధముగా చేయు పాడుస్త్రీలవలన గృహయజమానులకు రెండు నష్టములు గలవు. దుర్వ్యయమునకు తగినట్లుగా సంపాదించితే లేనికష్టమటుండఁగా తెచ్చినదనుకూలముగానుపయోగమునకు రాకుండుటయు తెచ్చినవస్తువులను చాటునవిక్రయించునప్పుడు కాసువస్తువుగవ్వకు పోవుటయునొకనష్టమును, స్త్రీలనడతచెడి దొంగతనము అసత్యములు పలుకుటయు మోసము చేయుటయుపట్టుపడుట రెండవనష్టమును కలుగుచున్నవి. కొందఱు స్త్రీలు తామిటువంటి కానిపనులను చేయకపోయినను గృహోపకరణములు మొదలయినవాని విషయమయి తాము శ్రద్ధపుచ్చుకొని కాపాడకచూచియు చూడనట్టూరకుండుటవలన పనికత్తెలు మొదలయినవారియజాగ్రత్తవలన తినుబడిపదార్థములు వ్యర్థపడియు బల్లలు మొదలయినవి విఱిగియు బిందెలు మొదలయినవి సొట్టలుపడియుసొమ్ము నష్టమగును. కాఁబట్టి కనుగలిగి యిటువంటివిషయములం దెల్లను మిక్కిలి శ్రద్ధవహించి గృహకృత్యములను చక్కఁబెట్టవలెను. ఇట్టివ్యయములత్యాము లేనివారుసహితము వ్యర్థముగా పోయెడుదానిని నిలిపి దానిని

బీదలకుపయోగపడిచిన నెంతపుణ్యముండును; ఈవిషయమున బాలి కలును బాలురునుకూడా మిక్కిలి జాగ్రత్తగా నుండవలెను. పిల్లలు సాధారణముగా వస్తువులను నలిపియు పగులఁగొట్టియు నెవ్వరికిని పనికి రాకుండ పాడుచేయుదురు. పిల్లలను తమకున్నదాని నితరులపిల్లలకు పెట్టునట్లు చేయవలెనుగాని యెవ్వరికిని పెట్టక తమకెక్కువయినదానిని పాడు చేయనియ్య కూడదు.

## దేహారోగ్యము.

[౧౮౮౩ వ సం॥ అక్టోబరు నవంబరు నెలలు]

——: ○ ;——

ప్రపంచములో దేహారోగ్యముతో సమానమయినసంపద మఱి యొకటి లేదు. కోట్లకొలఁదిధనమున్నను, లక్షలకొలఁదిబట్టలును, నగ లును ఉన్నను, వేలకొలఁది పరిచారికలున్నను, నూఱులకొలఁదిదివ్య భవనము లున్నను, ఈలోకములోనివి మఱియేవి యెన్ని యున్నను, అనుభవించుట కొక దేహారోగ్యము లేనియెడల వేనివలనను సుఖము కలుగదు. మన అవయవము లన్నియు వేనిపనియం దవి తిన్నఁగా నడ చుచు మనకిబ్బంది కలుగచేయ కున్నపుడు మనశరీర మారోగ్యస్థితి యందుండి మనకు సుఖము కలుగుచుండును. మనఅశ్రద్ధవలననులోప మువలనను మనజీర్ణకోశమును పేగులును తిన్నయన్నమును తిన్నఁగా జీర్ణముచేయకయు, మనహృదయమును నాడులును రక్తము తిన్నఁగా ప్రవహించునట్లు చేయకయు, ఊపిరితిత్తులు తిన్నఁగాగాలినిపీల్చి పరి శుద్ధము చేయకయు, మనమెదడు తిన్నఁగా నుండక బుద్ధి మొద లయినవానిని క్రమముగానుంచకయు, మనచర్మము శుచిగానుండి చెమ ట మొదలయినవానిని పయికితిన్నగా రానీయకయు, ఉన్నప్పుడు పలు విధములయిన రోగములుపుట్టి సుఖముచెడి పెక్కుబాధలుకలుగును.

మనమునిజముగాసుఖపడఁ దలఁచినయెడల, పయిని చెప్పినలోపములు కలుగకుండశరీరమును చక్కఁగా కాపాడుకొనుచుండవలయును. జీర్ణకోశము తిన్నఁగా పనిచేయునట్లు చేయుటకయి అతిభోజనమును అరగనివస్తువులను తినుటనుమాని, పుష్టికరములయినపదార్థములను వేళపట్టున తినుచు, ఎప్పుడు నొకవస్తువునే తినక భోజనపదార్థములను కొంచెముమార్చుచు, సారాయములనుగాని మత్తువస్తువులనుగాని పుచ్చుకొనక, పనిపాటులుచేయుచుండవలెను; మనహృదయమునురక్తనాడులను క్రమముగా తమవ్యాపారములను చేయునట్లు చేయుటకయి శరీరమంతయు కదలునట్లుగా పనిచేయుచు నిర్మలజలపానముచేయుచు కాఁకమొదలయిన దుర్గుణములను పుట్టించుపదార్థములను తినకుండ వలయును; శ్వాసకోశములు తమవ్యాపారములు సరిగాజరుగునట్లుచేయుటకయి తేమ గలయిండ్లలో నుండక రాత్రులందు పగలును పడకగదులును తక్కినయిల్లును శుచిగానుంచి శుద్ధవాయువు ప్రవేశించునట్లు చేయుచు చలిగాలిలో తిరుగక ప్రాతఃకాలమునందు గానిసాయంకాలమునందుఁగాని రెండుమూడుగడియలసేపునకు తక్కువగాకుండ బయల మంచిగాలిలో సంచరించుచు మురికికాల్వలు మొదలయినవానినుండి పుట్టినదుర్గంధముతో మిళితముకాని శుద్ధవాయువునుపీల్చుచుండ వలయును; బుద్ధికి స్థానమయినమెదడు క్రమముగా పని చేయుచుండుటకయి ప్రతిదినమును ఎనిమిది పది గంటలసేపు దేహపరిశ్రమమును బుద్ధిపరిశ్రమమును గలపని చేయుచు తీరికగానున్నకాలములో కొంతసేపు వేడుకగానుండు వినోదములతో ప్రొద్దుపుచ్చుచు కష్టము వచ్చినప్పుడతివ్యసనమునుమాని ధైర్యమవలంబించుచు ప్రతిదినము రాత్రులే డెనిమిదిగంటలసేపు నిద్రపోవుచు నుండవలయును; దేహము శుచిగానుంచుటకయి ప్రతిదినమును నిర్మలజలములతో స్నానముచేసి శరీరమును శుభ్రముగా తోముకొని తడి యారకుండ వెంటనే తుడుచు

కొనుచు నిమిష కాల మయినను తడిబట్టలతో నుండక చలిగాలి మొదలయినవి విశేషముగా సోకకుండుటకై, మురికి లేనిబట్టలను ధరించుచు మాసినబట్టలు తీసి వేయుచు చెమ్మటపట్టునట్లుగా దేహసాధనము చేయుచు నుండవలయును. ఈవిషయములన్నిటియందును మనవారు శ్రద్ధవహించి శరీరారోగ్యమును కాపాడుకొనుచు వచ్చినయెడల, ఎల్లవారును దృఢగాత్రులయి చిరకాలజీవులయి సాధారణముగా జీవితకాలములో రోగములులేక సుఖపడుదు రనుటకు లేశముకాని సందేహము లేదు. ఇల్లు శుచిగానుంచుట మొదలైనపనుల నేకములు ముఖ్యముగా స్త్రీలు చేయందగినవి గనుక వారీవిషయములయందు మిక్కిలి జాగరూకతగలవారయి యుండవలెను. అట్లుండక యశ్రద్ధచేసినయెడల తాము మాత్రమే కాక తమ బిడ్డలును భర్తలు మొదలయినబంధువులును జ్వరములు మొదలయిన బహువ్యాధులచేత బాధపడుచు నింట నెన్నడును సుఖము లేక దుఃఖపడవలసినవా రగుదురు. శరీరసుఖ సాధనములయిన వాయువు జలము భోజనపదార్థములు మొదలయిన సమస్తవిషయములనుగూర్చియు ముందు పత్రికలయందు క్రమక్రమముగా వివరముగా వ్రాయుచుందుము. మన మెంతజాగ్రత్తగా నున్నను పరులదోషమువలనవచ్చెడు కొన్ని యంటురోగములు మొదలయినవి కలవుగాని, మనము శుచిగా నుండి పెంటకుప్పలు మురికినీరు మొదలయినవి సమీపమున లేకుండునట్లు మనవాసగృహములనుగూడ శుచిగానుంచి పయిని చెప్పినవిషయములలో సాధ్యమైనంత శ్రద్ధవహించినయెడల వానినిసహితము సామాన్యముగా తప్పించుకోవచ్చును.

## అజీర్ణము.

[౧౮౮౩ వ సం॥ అక్టోబరు నవంబరు నెలలు.]

మన దేశములో పురుషులును స్త్రీలును సాధారణముగా తిన్న అన్నము అరుగక బాధపడుచుందురు. ఈయజీర్ణవ్యాధి తిన్నఁగా పనిచేయక కూరుచుండుటచేతను విస్తారముగా పిండివంటలు మొదలయినవి తినుచుండుటచేతను కలుగును. అందుచేత నీయారోగము పనిపాటులుచేసి సామాన్యమైన యాహారము పుచ్చుకొనుబీదవారిలో నెక్కడనో కాని లేకపోవుటయు దిట్టముగాతిని పనిలేక కూరుచుండు భాగ్యవంతులలో ఇంచుమించుగా అందరిలోనుండుటయుతటస్థించుచున్నది. ఒకనాఁడొక ధనికుఁడు అజీర్ణరోగముచేత బాధపడుచు గొప్పవైద్యునియింటికిపోయి యడుగఁగా, ఆతఁడు రోగస్వభావమునుకనిపెట్టి రోగినిగుఱ్ఱపుబండిలో నెక్కించుకొని ఊరుదాటి రెండుక్రోసులదూరము వఱకు తీసుకొని వెళ్ళి గుఱ్ఱపుకొరడా బుద్ధిపూర్వకముగా క్రింద బడవైచి దానిని తీసుకొని రమ్మని యాధనికునిని క్రిందకుదింపి గుఱ్ఱములను మళ్ళించి బండిని వేగముగా నింటికి తోలుకొనివచ్చెను. అప్పుడాధనికుఁడు మఱియొకబండి దొరకక విధిలేక యింటికి నడచివచ్చెను. ఆదినమతనికితిన్నయన్నము చక్కఁగా జీర్ణమయినందున, తెలివితెచ్చుకొని యతఁడు మఱునాఁటి నుండియు ప్రతిదినమును కొంతదూరము నడవనారంభింపఁగాతరువాత వ్యాధికుదిరి సుఖముగానుండెను. మఱియొకధనికుఁడొక వైద్యుని నే వెళ్ళి అజీర్ణరోగమునకు మందు చెప్పుమని యడిగినప్పుడు దినమునకు రెండణాలతో భోజనముచేసి ఆరెండణాలనుస్వయముగాకష్టపడిసంపాదించుట గొప్పమందని చెప్పిపంపెను. మనలో ధనికులలోని స్త్రీలు సాధారణముగా పనిపాటులు చేయక బయలతిరుగక పోవుటచేతతిన్న యన్నము జీర్ణముకాక మూల్గుచు మూలుగుచు నుందురు. ఇది చది

వినవారకుండునంటి సోమరితనమును విడిచి యూపిరివిడిచిన బోజ్జయందుగు నన్నపిచ్చితలంపును పనిచేసిన పరువుతక్కువ యనుదురభిమానమును విడిచి యెందరుపనికత్తెలున్నను తాముకూడ నింతపనిచేయుచుసుఖ మనుభవింతురని కోరుచున్నాము.

## స్త్రీలు చదువవలసిన విషయములు.

(౧౮౮౩_౮౪ వ సం॥ డిసెంబరు జనవరి నెలలు.)

—:(o):—

స్త్రీలును పురుషులవలెనే గ్రంథములను చూచి చదువుటకును చదివినదాని నర్థముచేసికొనుటకును తమయభిప్రాయములు మొదల యినవానిని వ్రాయుటకును సాధనమైన భాషావిషయకజ్ఞానముననఁగా వ్యాకరణమును పద్యవచనరూపములనుండు సాహిత్యగ్రంథములను నేర్చుకొనవలయును. ఇవిగాక భాషాజ్ఞానమునుకలిగించుగణితాదులను దేశకాలవర్తమానములను తెలుపుచరిత్రములను, ప్రపంచజ్ఞానమును పుట్టించు భూగోళశాస్త్రమును, మూఢత్వమును పోఁగొట్టి యథార్థ జ్ఞానమును కలుగఁజేసెడు ప్రకృతిశాస్త్రవిషయములను, ప్రవర్తన మును తిన్నపఱిచెడు నీతిపుస్తకములను, భగవన్మహిమను బోధించు గ్రంథములను పురుషులవలెనే యవశ్యముగా చదువవలయును. ఈ పైనిచెప్పినవిగాక స్త్రీలుప్రత్యేకముగా నేర్చుకోవలసిన విషయములు ను కొన్నిగలవు. అవిగృహకృత్యముల తీర్పును నేర్పెడుగ్రంథములు, పాతివ్రత్యధర్మములనుబోధించు పుస్తకములును, కుట్టుపనియు, సంగీ తమును, శిశువులను పెంచురీతియు, నయియున్నవి. వీనిలో కుట్టుపనిని ప్రస్తుతకాలస్థితినిబట్టి స్త్రీలు మఱియొకరివద్ద నేర్చుకో వలసియే యుండునుగాని యిటువంటిపత్రికలయందుఁజెప్పదగినదిగానుండ లేదు.

తక్కిన విషయములనుగూర్చి మాకు తెలిసినవియును ప్రసిద్ధులయిన యిప్పటికాలపువారును పూర్వకాలపువారును రచియించిన గ్రంథముల వలన సంపాదింపఁదగినంతవఱకును మాశక్తివంచనలేక క్రమక్రమముగా నీపత్రికయందు వ్రాయఁ బ్రయత్నించెదము.

సభలకుఁ బోయి పాడఁబోయెదరా, కులాంగనలకు సంగీతమెందుకని కొందఱభిప్రాయపడియుందురు. అదిసరికాదు. సంసారభారము మీఁదపడి యందుమూలమున పెక్కు కష్టములును మనోవ్యాకులతలును సంభవించునప్పుడు మనస్సునకుల్లాసము పుట్టించి యసారమయిన సంసారమును సారవంతముగాఁ జేయుశక్తి సంగీతమునందుతప్ప మఱిదేనియందును లేదు. లోకములో నొక్కొక్కవిషయ మొక్కొక్క-రికి రుచించునుగాని సంగీతముమాత్ర మందఱికిని ఆనందమును కలిగించును. పురుషుఁడు పగలెల్లను బయలపనిచేసి శ్రమపడివచ్చి యిల్లు చేరినప్పుడు జిహ్వాకింపుగా నన్నపానాదులుపెట్టి తృప్తిపఱచి శ్రావ్యమయినగీతములనుపాడి మనస్సునకుల్లాసమును పుట్టించి యాతని యాయాసము కనఁబడకుండఁ జేసి గృహము భూలోకస్వర్గమువలెఁ జేయవలసినభారము స్త్రీలయందేయున్నది. ఈకారణమును బట్టియే పరమదయాపరుఁడైన పరమేశ్వరుఁడు పురుషకంఠమునకంటె స్త్రీకంఠమునందు సాధారణముగా నెక్కువమాధుర్యమును మార్దవమును బెట్టియున్నాఁడు. సంసారమును సారవంతముగాఁ జేసెడియీసౌఖ్యము గృహమున లేకపోఁబట్టియే కలహములతోను మాధ్యములతోను నిండియుండు గృహమొకయరణ్యముగా కనఁబడి దూరాలోచనలేనివారనేకులు రంభలవంటి భార్యలనువిడిచిపెట్టి పాతివ్రత్యవృత్తములకు వేరుపురుగులైన వేశ్యలపంచలఁబట్టి తమదేహములను ధనమును ఆపెనుభూతములకుసమర్పించి యాపదుపుకత్తెలకు దాసులై తిరుగుచున్నారు. ఇప్పుడు మన దేశముయొక్క యభాగ్యముచేత సంగీతమంతయు పండువంటి

సంసారములను కూలద్రోయు కంకణముకట్టుకొన్న భోగస్త్రీలపాలు కాబట్టి సాంసారికస్త్రీలు గానవిద్యనభ్యసింపఁగూడ దన్నంతదుర్గతి మనదేశమునకు పట్టియున్నది. అయినను వేశ్యలన్నముతిందురను హేతువచేతమనము పస్తుండిచావరాదుగనుక, వేశ్యలభ్యసింతురను హేతువుచేత సుఖప్రదమైనసంగీతమును మనము మానుట యుచితము కాదు. కానియిప్పుడు వేశ్యలుపాడు మువ్వగోపాలపదములను, కృష్ణ లీలలనెడుపేరుచేత తేనెపూసినకత్తులవలెనున్న పాడుపాటలనుశృంగార మనునామముచేత ప్రసిద్ధములయియున్న యటువంటి యితరగీతము లను వర్ణములనుమాత్రము స్త్రీలెంతమాత్రము నభ్యసింపఁగూడదు. వారు భగవద్భక్తిని సత్ప్రవర్తనమును, జ్ఞానమును వినోదమును గలి గించు మంచిగీతములను నేర్చుకొనవలయును. అటువంటివాని నప్పు డప్పుడు కొన్నియీపత్రికయందు ప్రకటింపుచుండ ప్రయత్నించెదము.

మఱికొందఱు పాకముచేయుటకు శాస్త్రముకావలయునాయని యాశ్చర్యపడుచున్నారు. మనయిండ్లలో పెళ్ళి చోట్ల చేయునట్లు ఉడకనియ్యకయో చిమిడిచియో మాడిచియో రెండుజాములకింతయున్న ముండడిఉప్పెక్కువవేసియో తక్కువవేసియో రెండుకూరలుడుకబెట్టు టకు పాకశాస్త్రమక్కఱలేదుగాని జిహ్వాకింపుగా పలువిధములయిన వింతవింతపాకములు చేసి యారోగ్య ప్రదములగునట్టుగా నమర్చుట కవశ్యముగా శాస్త్రము కావలసియే యుండును. వస్తుస్వభావము తెలి యక చిలుమెక్కినగిన్నెలతోను నేతితోను పాకముచేసి యజ్ఞానముచే తమవారికి రోగమును ప్రాణభయమును తెచ్చిపెట్టిన ముద్దరాండ్రెందఱ మున్నారు కారు? కాబట్టి మనముజీవించుటకు దేహసుఖము ననుభ వించుటకును ముఖ్యసాధనమైన పాకమువిషయమై తప్పకశ్రద్ధవుచ్చు కొనవలయును. మాకుహిందూపాకశాస్త్ర మీవఱకొక్కప్రతిమాత్ర ములభించినది. ఇంకను పుస్తకములనిమిత్తము ప్రయత్నించుచున్నా

ము. ముందుముందు వానిలోని భాగములను కొన్నిటిని తెనిఁగించి ప్రచురింపుచుందుము.

శిశుపోషణము స్త్రీలకు ధర్మమగుటచేత బిడ్డలకు రోగమును నొప్పియు లేకుండ సంరక్షించుటకును, అటువంటివి సంభవించినప్పుడు తగినచికిత్స చేయుటకును నేర్చియుండవలెను. పురుషులెప్పుడును బయల తిరిగి పనిచేయవలసినవారు; స్త్రీలుమాత్రము సదాయిల్లుకనిపెట్టుకొని యుండి యింటనున్న బిడ్డలు వృద్ధులు మొదలయినవారి యోగక్షేమముల విచారించుచుండవలసినవారు. కాఁబట్టి యొక్క బిడ్డల విషయమునసేకాక యింట నెవ్వరయినను గర్భముధరియించి యున్నప్పుడును ప్రసవమయినప్పుడును జరుపవలసినపనులను, అకస్మాత్తుగా నెవ్వరికయిన గాయముతగిలినప్పుడును రోగములు వచ్చినప్పుడును తాత్కాలికముగా చేయవలసిన వైద్యకృత్యములను, ప్రతిస్త్రీయు తప్పక నేర్చియుండవలెను. అటువంటి యాపత్సమయములయందు తఱుచుగా పురుషు లింటనుండుట సంభవింపదు; స్త్రీలేమియుతోఁచక విచారపడుచు పురుషులువచ్చివైద్యునిపిలుచుకొనివచ్చువఱకును ఉపేక్షచేసినయెడల నొకానొకప్పుడు ప్రాణాంతముసంభవింపవచ్చును. అదిగాక ప్రతిస్వల్ప రోగమునకును వైద్యునిపిలుచుకొని వచ్చుచుండుట యాయాసమునకును ధనవ్యయమునకును, కారణమగును. కాఁబట్టి స్త్రీలయుపయోగమునిమిత్తమయి సాధారణరోగములకు కావలసిన మందుల నిందు ప్రచురించుచుందుము. మేముగర్భిణీస్త్రీల విషయమును, ప్రసవావస్థ విషయమును, శిశుపోషణవిషయమును వ్రాసెదుసంగతులు శారీర శాస్త్రాదులను చక్కఁగానెఱిఁగి యనుభవశాలులయినప్రసిద్ధులయిన వైద్యశిఖామణుల గ్రంథములలోనివి. వైద్యవిషయమయి వ్రాయఁబోయెదు మందులును శాస్త్రజ్ఞానమును అనుభవజ్ఞానమునుగలమన వైద్యులిచ్చెడివియు ప్రసిద్ధులయిన యింగ్లీషువైద్యులుపరీక్షచేసివాని

గుణములను కనిపెట్టి మంచిమందులని నిశ్చయించినవియు కొన్నిరోగ ములమీఁద నడవ నప్పుడు సహిత మేవిధమయినదుర్గుణములనుపుట్టిం పనివియుఁ గనుక మనవారు వానిని సులభముగా నుపయోగించుకొని సుఖింపవచ్చును.

— :)0( :—

## ధ న ము.

(౧౮౭౩-౭౪ వ సం॥ డిశంబరు జనవరి నెలలు.)

——(:o:)——

ధనము మిక్కిలి యుపయుక్తమయినదే కాని మనవారు దాని యుపయోగమును తిన్నగా నెఱుఁగక అత్యాశగలవారయిసుఖమునకు మాఱుగా లేనిపోని దుఃఖమును తెచ్చిపెట్టుకొనుచున్నారు. రూపాయలు, డబ్బులు, మొదలయిన నాణెములులేని పూర్వకాలమునందు ధాన్యమును పండించు కాపు తనకు కుండలో కత్తిలో కావలసివచ్చిన యెడల ధాన్యమును నెత్తిమీఁదపెట్టిమోచుకొని కుమ్మరవానియింటికిఁ గాని కమ్మరవానియింటికిఁ గాని వెళ్ళవలసియుండును. ఆసమయమునం దాకుమ్మరవానికిని కమ్మరవానికిని ధాన్యమక్కఱలేక బట్టలు కావలసి యున్నయెడల సాలెవానియింటికిపోయి ధాన్యమిచ్చి బట్టకొని దానిని మరల తీసుకొనివచ్చి దానితో కుండలుగాని కత్తులుగాని కొనవలసి యుండును. ఒకానొకప్పుడుసాలెవానికి ధాన్యమావశ్యకములేకఉప్పో పప్పో కావలసియుండినయెడలమరలనాధాన్యమును మఱియొకనివద్దకు తీసికొనిపోయి యావస్తువునుకొని దానితో బట్టకొనిమరల నాబట్టతో కుండలు కొనవలసి వచ్చుచుండును. ఈప్రకారముగా చేయుచుండుట వలన కాలహరణ మగుచుండుటయే కాక విశేషశ్రమముకూడ కారణ మగుచుండెను. రూపాయలు మొదలయిన నాణెములుకల్పెట్టినతరు వాత జనులకట్టియిబ్బందులు లేక తమకేవస్తువు కావలసివచ్చిననుడబ్బి

చ్చి కొనుచుందురు. డబ్బును సులభముగా తీసికొనిపోవచ్చును గనుకను దానితో నన్ని వస్తువులను గొనవచ్చును గనుకను ధనము మనకు మిక్కిలి యుపయుక్తముగా నున్నది. ధనము సంపాదనము మన సుఖసంతోషాదుల నిమిత్తము కావలసిన వస్తువులను సంపాదించుకొనుట కొఱకే గాని కేవల ధనముతో మనకడుపు నిండదు. ఉపయుక్తము లయిన వస్తువులను కొనుటకే పనికి రాకుండిన యెడల ధనము కేవల మపనికిమాలినది. మనసుఖము నిమిత్తమే ధనము కావలసినదన్న మాట మఱచిపోయి లోభులనేకులు ధనము నిమిత్తము సుఖముల నన్నింటిని చెడఁగొట్టుకొందురు. అత్యాశ చేత తాము సంపాదించిన ధనములో నేమియు వ్యయము చేయక కడుపునకైన తిన్నగా తినక మంచి బట్టలను కట్టుకొనక ధనికులయ్యును బీదవారికంటె నెక్కువగా బాధపడుచుందురు. బీదతనము నేవిధముగా నైన పాటుపడి పోఁగొట్టుకొనవచ్చును గాని లోభితనమువలన సంప్రాప్తమయిన డబ్బుగల బీదతనము పోఁగొట్టుట కెవ్వరును సమర్థులు గారు. లోభి యెంతధనము వచ్చుచున్నను తనివితీఱక మఱియెంత రావలెనని యేయెప్పుడును కోరుచుండును గనుక, వానికి దేనివలనను తృప్తియు సౌఖ్యమును కలుగవు. అతిధనార్జనము చేత దొంగలవలనను పరులవలనను తుదకు స్వజనమువలనను కూడ పలువిధములయిన యుపద్రవములు వచ్చుచుండును. కాఁబట్టి బుద్ధిమంతులయిన వారతివిస్తారముగా ధనము కూడఁబెట్టక తాము ముసలివారయి కష్టపడలేని సమయముకొఱకును రోగములు మొదలయినవి వచ్చుకాలముకొఱకును కావలసిన దానిని మాత్రము ముంచుకొని తక్కిన దానిని లోకోపకారకములయిన సత్కార్యములకొఱకును పరులకష్టముల తొలగించుటకొఱకు నుపయోగింతురు. అట్లు చేయువారే పరలోకసుఖమున కనుకూలమయిన యుత్తమధనమును కూడఁబెట్టినవారు.

## సుగుణ దుర్గుణములు

[గతసంవత్సర ఫిబ్రవరి పత్రికనుండి]

— ? ౧ ? —

సుగుణములుగలవారి నెల్లవారును ప్రేమింతురనియు, దుర్గుణములుగలవారినందఱును ద్వేషింతురనియు, మీరనుభవముచేత నెఱిఁగియుందురు. ఒకరియొద్ద సత్యము, శాంతత, దయ, వినయము మొదలయిన మంచిగుణము లున్నయెడల పైకిఁ గాకపోయిన మనసులో నయినను శత్రువులుసహిత మట్టివారిని మెచ్చుకొందురు. కల్లలు, కోపము, హింస, గర్వము మొదలయిన చెడుగుణములున్నవారిని జూచి వారిపరమమిత్రులుసహితము పైకిఁ గాకపోయిన లోపలనయిన నసహ్యపడుచుందురు. తనజీవమును లోకోపకారార్థము ధారపోసెడు పుణ్యాత్ముని ప్రియముతో నాదరింపనివారును పరహింసయే జీవనముగాఁగల పాపాత్మునియెడ కోపము పూనని వారును లోకములో నెవ్వరుందురు? ఒకసత్పురుషునకు మేలు కలిగినప్పుడు తమకు మేలు లభించినప్పటికన్నను ఎక్కువ సంతోషము బొందుదురు. ఒక్క దుర్మార్గునివలన నిరపరాధులయినవారికి నిష్కారణముగా బాధసంభవించినపక్షమున తమకా బాధసంభవించినప్పటికన్నను అధికదుఃఖపడుదురు. దీనినిబట్టి విచారింపఁగా సుగుణముల నాదరించుటయు దుర్గుణములను తిరస్కరించుటయు లోకస్వభావమనియు, భగవన్మతమనియు స్పష్టమగుచున్నది. అందుచేతనే మనమీకాలపువారినిమాత్రమే కాక యెప్పుడో పురాణములయందును కథలయందును విన్న సత్పురుషులను భూషించుచు దుర్జనులను దూషించుచున్నాము. శ్రీరాములచరిత్రమును విన్నప్పుడు సంతోషము పూనుటకును రావణుని చర్య వినునప్పుడు కోపము పూనుటకును మనకు శ్రీరాములు చేసినయుపకారమేమున్నది? రావణుడు చేసినయుపకారమేమున్నది? సీతకష్టములు విన్నప్పుడు దుఃఖపడుటకును శూర్ప

ణఖముక్కుచెవులు కోసిరని విన్నప్పుడు సంతోషపడుటకును మనకు సీతచుట్టమయిశూర్పణఖ కాకపోయినదా? హరిశ్చంద్రోపాఖ్యానమును విన్నప్పుడు చంద్రమతినిభూషించుటకు మనకామెయిచ్చినలంచ మేమి? కలహకంటకిని దూషించుట కామెయియ్యనిదేమి? ఈప్రకారముగా పుణ్యముపయి ప్రీతియుంచుటయు పాపముపయి రోతవహించుటయు మనకు భగవంతుఁడుప్రసాదించినసహజగుణములగుటచేతనే కానిమఱి దేనిచేతనుకాదు. లోకుల కిట్టియభిప్రాయముండుటచేతనే లోకములో దొంగలుసహితము తమ్మితరులు మంచివారనుకొనవలెనని కోరుచుండుటయేకాక తమ్మెవ్వరైన దొంగాయన్న నెంతో కోపపడుదురు; లంజెను లంజెయనిపిలిచినచో దానికెక్కడలేనికోపమునువచ్చును. పరులను వంచనముచేయువారునుతమ్మితరులు వంచింపకుండవలయునని యే కోరుదురు; అన్యులయింటకన్నము వేసివస్తువులెత్తుకొనిపోవువారు సహితము తమయింటికొరులుకన్నము వేయకుండవలెనని యేవాంఛింతురు. తాము చెడ్డవారయియుండియు పరులుతమ్ము మంచివారనితలఁచునట్లు చేయుటకయి పాటుపడువారు తాము నిజముగా మంచివారే యగుటకు ప్రయత్నించినయెడల తాము సుఖమనుభవించుటయేకాక లోకమునుకూడ నెంత సుఖపెట్టుదురు? లోకములోని నేకులున్యాయమార్గమున ప్రవర్తించుట బహుకష్టమని భావించుచున్నారు. అది కేవలము భ్రమయేకాని దానియందు కొంచెమయినను సత్యము లేదు. చక్కఁగా విచారించిచూడఁగా న్యాయముగా ప్రవర్తించుటకంటె సులభమయిన కార్యము మఱియొకటి లేదు. ఒక్కదొంగతనముచేసెడిచో కత్తులను కట్టులను సంపాదించియు గోడలకుకన్నములు వేసియు గోడలెక్కిదుమికియు కన్నములోదొరకిసున్నములోని కెముకలు లేకుండ దెబ్బలుతినియు తరువాత పట్టుపడి చెఱసాలయందు పెట్టఁబడి సంవత్సరముల కొలఁది స్వేచ్ఛగోలుపోయిహింసపడియు లేశమయినను లాభము లేకయే యెంత

కష్టపడవలెను? చౌర్యముమానినచో నీకష్టములన్నియునుండవుగదా? సత్యము పలుకుటయనఁగా జరిగినసంగతి జరిగినట్లుగా చెప్పివేయుట యెంతసులభము? యనప్రయత్నమక్కఱలేకయే సత్యమెన్నడును నాలుక చివరనుండి తనంత నే బయలు దేఱుటకుసిద్ధముగానుండును. అట్టిసత్యము నడఁచివేసి జరగనికార్యమును జరిగినట్లుగాఁ గాని జరిగినకార్యమును జరగనట్లుగాఁగాని చెప్పిపూర్వోత్తరవిరోధముకలుగకుండునట్లుగాచేసి పరులను నమ్మించుటకయి యెంత కష్టపడవలెను? అడుగున పునాది లేకుండ బయలనిల్లుకట్టఁబూనిన దాని కెన్నిబోటులు పెట్టిననదిస్థిరముగా నిలువఁగలుగును? అస్థిభారములేని గోడవలెనే యడుగునసత్యములేని కల్లలకోటయును ప్రయాసపడి వేయి మెఱుఁగులు పెట్టినను శీఘ్రకాలములోనేకూలిపోయి పడినయాయాస మంతయు వ్యర్థమగుటయేకాక చేసినవాని కవమానమునునష్టమునుకలుగును. అసత్యము మోసము, చౌర్యము, హింస, కోపము, మొదలయినవానిని విడిచి సత్యము మొదలయినవాని నవలంబించి వంకరమార్గముపదలి ఋజుమార్గమున ప్రవర్తించుటలో నేమిశ్రమ యున్నది? ఒకవేళకొంచెము శ్రమయున్న దే యనుకొన్నను పొట్టనిమిత్తమయి మహాసముద్రముమ దాటియు, సేనలో కొలువు కుదిరి ప్రాణముల కాశపడక పోరాడియు, అడవులలోను కొండలలోనుతిరిగియు, ఎండకునువానకునుసహించియు, కష్టపడువారికి ఇహలోకమునందును పరలోకమునందును గూడస్థిర సౌఖ్యమునిచ్చెడు సత్యము శాంతి మొదలయినవానివిషయమున కొంచెముశ్రమపడ నక్కఱలేదా? సన్మార్గమునప్రవర్తించుటలోపయినిచెప్పిన కష్టములో సహస్రాంశమయిన నుండదుగనుకనుకలిగెడిఫలము సహస్రగుణము లధికముగానుండునుగనుకను అందఱునుసన్మార్గమున ప్రవర్తించుటకయి ప్రయత్నపడవలెను.

## పరివర్తనము. (వస్తువులొండొరులు మార్చుకొనుట.)

(౧౮౮౫ వ సం॥ ఫిబ్రవరి మార్చి నెల.)

——:O:——

క్రిందటిసారి ధనముయొక్క యుపయోగమునుగుఱించికొంచెము వ్రాసియున్నాము. ఈధనమును ఒకవస్తువు కావలసివచ్చినప్పు డావస్తువు చేసినవానివద్దకు పోయి దానిని తెచ్చుకొనుశ్రమము లేకుండ, నెవరికి కావలసినవస్తువులను వారే యేలచేసికొరాదని కొందఱికి సంశయము తోఁచవచ్చును. తమకు కావలసినవస్తువులనన్నిటిని తామేచేసికొనుట యెంతటి సమర్థులకును సాధ్యముకాదు. ఒకవేళకొంతవఱకు సాధ్యమయినను వస్తువు లేపయు ననుకూలముగా నుండక కలుగవలసిన సుఖములో నాలవపాలయినను కలుగకుండును. ఎట్లనఁగా ఒకకమ్మరవాఁడు కుండలనమ్ముకొని దానివలనవచ్చెడుసొమ్ముతో తనకు కావలసిన వస్తువులనన్నిటిని కొని సుఖముగానుండక తనకు కావలసిన బట్టలను పాత్రసామగ్రిని వాసముచేయు గృహములు మొదలయినవానిని తానే చేసికొనవలెనని ప్రయత్నించినయెడలమునుపటికంటె పదిరెట్లెక్కువకష్టపడినను ఏపనియు తిన్నగా జరుగక దేనివలనసుఖముకలుగకుండును. బట్టలు నేసికొనుటకయి మొట్టమొదటపొలముసున్నివి త్తనములు నాటి పత్తిపండించి దానిని బాగుచేసి నూలువడికికండెలుచేసి యంత్రములు సంపాదించిమగ్గములలో వేసి నేసికొనవలసి యుండును. మొట్టమొదట పొలమును దున్నుటకయి కావలసిననాగళ్ళను తరువాతపత్తివడుకుటకయి కావలసినరాట్నములను కడపటబట్టలునేసికొనుటకయి కావలసిన మగ్గములు మొదలయిన సాధనములను చేసికొనుటమాటయటుండఁగా పత్తిపండించుకొని యొక్క బట్టను నేసికొనుటకే బహుమాసములు పట్టును. ఈప్రకారముగానే పాత్రసామగ్రులనుబల్లలు మొదలయినవానిని చేసికొనుటకయి త్రవ్వుటకునునఱకుటకునుసాధనములు

చేసికొని యడవులను కొండలను తిరిగి లోహములను బ్రాఁతలను తెచ్చుకొని లోహములనుసాగఁగొట్టుటకై సుత్తులు మొదలయినవానిని కట్టెలు కోయుటకయి యంపములు మొదలయినవానినికూర్చుకొని పని చేయ నారంభించినయెడల నొక్క బిందె చేసికొనుటకుఁగాని యొక్క బల్ల చేసికొనుటకుఁగాని పెక్కు నెలలు పట్టును. కాపుర ముండుటకయి యిల్లుకట్టుకోవలసినయెడల నెంతచిన్నగృహమును నిర్మించుకొన్నను ఇటుకలు పెంకులు మేకులు బందులు తలుపులుద్వారబంధములు తానే చేసికోవలసిన పక్షమున బహుసంవత్సరములు పట్టుననుటకు సందేహములేదు. ఇట్లన్నిపనులు నొక్కమనుష్యుఁడు నేర్చికోవలసి వచ్చిన యెడల బహుప్రయాసపడినను ఒక్కపనియు తిన్నగానుండక చేసికొన్న యేవస్తువును తిన్నగా నుపయోగించుకొనుట కక్కఱరాక మోటుగాను పనికిమాలినదిగాను నుండును. కాఁబట్టియెల్లవారును తామేదో యొకవృత్తి నవలంబించి దానిని చక్కఁగానేర్చుకొని పనిచేయుచు తాము చేసినవస్తువు లితరులకును ఇతరులు చేసినవస్తువులు తమకును ఉపయోగపడునట్లు చేయుచు జనులు పరస్పరసహాయు లయియున్న యెడలనే యందఱును ధనసంపన్నులై సుఖమనుభవింపుచుందురు. అట్లుచేయక యెవరికికావలసినవానిని వారే చేసికొన నారంభించిన యెడల నందఱునుకూడ బీదలై యనాగరికులై తగినంత సుఖము లేక కొండవాండ్రవలెనుందురు. అందఱునుతలయొకవృత్తియునవలంబించి కావలసిన వస్తువుల నన్నిటిని చేసికొనివీరుచేసినదానిని వారును వారుచేసినదానిని వీరును మార్చుకొనుట యంతగాలేక యెవరికికావలసినవానిని వారే చేసికొనుచుండుటవలన కోయవాండ్రు మొదలయిన వారు మృగప్రాయులై వేయిమంది జీవింపఁగల దేశములోపదిమంది యుండియు తిన్నగాతిండిలేక చింతంబలిత్రాగియు దుంపలుతినియుజీవనముచేయుచున్నారు; వాండ్రునివసించుగృహములుకోళ్లగుడిసెలకంటె

మేలైనవిగా నుండవు; వారు ధరించుకొనునవి యాకులుగానో తోళ్ళుగానో చాపలుగనో యుండును; వారి గృహోపకరణము లన్నియు నాలుగు రాళ్ళును గొబ్బరిచిప్పలును సొరకాయబుఱ్ఱలును వెదురుగొట్టములు నై యుండును; వాండ్ర కుండెడి తక్కినసొత్తంతయు రెండు బిండ్లును పదియాచలును జిగురుకండెలును మట్టియుండలును అయి యుండును. కాబట్టి యెవరికి కావలసినదానిని వారు చేసికొని తృప్తిపొందియుండక నాగరికులైనవారు తమ దేశములో నొకరుచేసిన వస్తువు లొకరుపయోగించుకొనుచు పరస్పరసుఖము నకు తోడుపడుటయే కాక తమ దేశములోని వస్తువుల నితర దేశము లకుఁ బంపి యితర దేశములలోని సరకులను తాము తెప్పించుకొనుచు సమస్తవస్తుసమృద్ధియు కలవారయి సర్వసుఖములను పొందుచుం దురు. ఇట్లుచేయుటయే వాణిజ్యమని పేరు.

## శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారు.

(౧౮౯౮ సం॥ [illegible] ఏప్రియల్ నెల)

మన దేశము నెవరు పాలించుచున్నారో, ఎవరిమూలమున మన ధన ప్రాణములకు రక్షణముకలిగి మనకు సుఖాభివృద్ధియగుచున్నదో, వారివిషయమై యెల్లవారును కొంతవరకైనను తెలిసికొనియుండుట యావశ్యకము. ఇప్పుడు మన దేశమును పాలించుచున్నది యింగ్లండు దేశమునకు రాణియైన శ్రీవిక్టోరియాయనునామె. ఈమె ౧౮౧౯వ సంవత్సరము మేయి నెల ౨౪వ తేదీని జననమొందినది. ఈమెజన్మిం చి నప్పుడు తాతగారైన మూడవజార్జి యింగ్లండునకు రాజుగా నుండెను. ఈమెతండ్రిమూడవజార్జికిచతుర్థపుత్రుఁడైన కెంటుప్రభువు.



శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారు.

ఈమె జన్మించినతరువాత సంవత్సరమున కెల్లను తండ్రిగారునుతాత గారునుకూడ కాలధర్మమునొందిరి. అటుతరువాత నీమె పెత్తండ్రియైన నాలవవిల్లియము రాజ్యమునకువచ్చి ౧౮౩౭వ సంవత్సరమువఱకును రాజ్యపాలనముచేసెను. విల్లియముతరువాతసింహాసమునకీమెయే యర్హురాలనిముందుగానే తెలిసినను, ఈమెకాసంగతి చిరకాలమువఱ

కును తెలియనియ్యక మిక్కిలిశ్రద్ధతో విద్యాబుద్ధులను చెప్పించి తల్లి మొదలగునవారీమెను బహువిషయములయందు సమర్థురాలినిగాఁ జేసిరి. ఆకాలమందలి పండితులలో నగ్రగణ్యులైన వారిచేత నీమెకు విద్య చెప్పించిరి. ఇంగ్లీషుభాషగాక యీమె జర్మన్ ఫ్రెంచి, ఇటాలియా భాషలనుగూడ నభ్యసించి లాటిన్ భాషయం దొకమహాకవిచే రచియింపఁబడిన ప్రబంధముల నితరసాహాయ్య మక్కఱలేక స్వయముగా నర్థము చేసికొనునంతపాండిత్యము సంపాదించినది; స్వదేశపు చరిత్రములయందును, ధర్మశాస్త్రములయందును, సాహిత్యగ్రంథములయందును, ఆమెకసమానపాండిత్యము కలిగెను. సంగీతశాస్త్రమందును చిత్రలేఖనమందును, ఆమె మిక్కిలి ప్రవీణురాలనిపించుకొనినది; ఆమె యనేక ప్రకృతిశాస్త్రములనభ్యసించి వృక్షశాస్త్రమందు ముఖ్యముగా విశేషజ్ఞానము సంపాదించినది; కుటుంబమునందామె యెవ్వానికిని తీసిపోవునది కాదు. ఇన్నివిద్యలయందు చిన్నతనములోనే సమర్థురాలయినను నీతివిద్య మితవ్యయము మొదలైనవానిలో నశ్రద్ధ చేయలేదు. రాణిగారొకనాఁడు బజారునకు వెళ్ళి తమవద్దనున్నసొమ్ముతో బంధువుల పిల్లలకందఱకు నాటవస్తువులు కొని యింటికి మరలునప్పుడొక్కబాలునికిఁ జూచిపోయినట్లు జ్ఞప్తికివచ్చెను. అప్పుడామెయెనిమిదణాలు వెలచేయుబొమ్మ నొకదానిం గొనఁబోఁగా దానిసొమ్ము లేనిది కొనఁగూడదని మందలించి దుకాణమువా రరువిచ్చెదమన్నను కొననీయకపోయెను. అప్పుడు రాణిగారు తననిమిత్తమాబొమ్మనుతీసిప్రత్యేకముగా మఱియొకచోట నుంచుఁడని వాండ్రతో చెప్పి, అన్నవేళకు స్వయముగావచ్చిసొమ్మిచ్చి దానినిపట్టుకొని పోయెను. చిన్నతనములో బాలురకుఁగాని బాలికలకుఁగాని తమవద్దసొమ్ము లేనప్పుడప్పుచేసి యనావశ్యకములయిన వస్తువులను కొనఁగూడదని నేర్పుటలో నింతకఠినముగానే యుండవలెను.

రాణిగారు తమకు రాజ్యము వచ్చునని మొట్టమొదట తెలిసి నప్పుడు ప్రప్రథమమున చెలికత్తెతో చెప్పినమాట 'తాను మంచి దానినిగా నుండుటకు ప్రయత్నించెద' నని పెత్తండ్రి కాలముచేసి ౧౮౩౭వ సంవత్సరమున తన్ను రాణిగా ప్రకటించి బహుతూర్యవాద్యములు మ్రోగఁగా వేలకొలఁది జనులు తన్నభినందింపవచ్చినప్పు డామె తల్లిని కౌఁగిలించుకొని యీ రాజ్యకార్యభారమును తానెట్లు యుక్తముగా నిర్వహింపఁ గలుగుదునా యని కన్నుల నీరుపెట్టుకొనెను. ఆమె సింహాసనమునకు వచ్చిన మూఁడుసంవత్సరముల కనఁగా ౧౮౪౦వసంవత్సరమునందు తన మేనమామకొమారుఁడును వయస్సున తనతో సమానుఁడును జర్మనీ దేశములో శాక్సికోబర్గు గోథా దేశములకు ప్రభువు నగు ఆల్బర్టుప్రభువును వివాహము చేసికొనెను. అతఁడు విద్యయందును, సుగుణసంపదయందును, రూపమునందును కూడ సమానుఁడుగా నుండెను. ఆయన విద్యను, శాస్త్రములను, కళలను, మిక్కిలి ప్రోత్సాహపఱచి దేశమున కెంతో మేలుచేసెను. అతఁడుకూడ గానవిద్యయందును చిత్రలేఖ నాది శిల్పములయందును బహుసమర్థుఁడు. వివాహమైన తరువాత ఆ రాజదంపతులు పూవును తావియువలె గలిసి యెంతో యైకమత్యముగలవారై లోకములో నితరభార్యాభర్తలు సుఖపడువిధము నా రాజదంపతులనుజూచి నేర్చుకోవలెనన్నట్టుగా ప్రవర్తించిరి. రాణిగారి పెద్దకొమార్తెను జర్మనీచక్రవర్తియొక్క పెద్దకుమారున కిచ్చి వివాహముచేసిరి. ఇప్పుడు మనకు రాణిగారి జ్యేష్ఠపుత్త్రుఁడు నయిన ఆల్బర్టు ఎడ్వర్డునకు డెన్మార్కు దేశపు రాజుకొమార్తె నిచ్చి వివాహముచేసిరి. ఇతఁడు ౧౮౪౧వ సంవత్సరమున జననమొందినాఁడు. ద్వితీయ పుత్త్రుఁడైన యాల్ఫ్రెడ్డునకు రష్యాచక్రవర్తిగారి కొమార్తె నిచ్చి వివాహముచేసిరి. ౧౮౬౧వ సంవత్సరమునందు భర్తగారు లోకాంతరగతులైనప్పు డామె దుఃఖసముద్ర

ములో మునిగి కొన్నిసంవత్సరములు బయిలికి రాలేదు. ఈనడుమను జ్యేష్ఠపుత్రికయు కనిష్ఠపుత్రుఁడునుకూడ కాలముచేసినందున రాణి గారికి కలిగిన వ్యసనమింతింతయని చెప్ప నలవి కాదు.

శ్రీమహారాణిగారి యోగ్యతయు భూతదయాదులును నిరుపమానము లైనవి. ఆమె రాజ్యకార్యభారమును నిర్వహించుచుతీఱిక చేసికొని యప్పుడప్పుడు తనరాష్ట్రములోని బీదలగుడిసెలకు సహితము పోయి వారియోగక్షేమములు విచారించుచుండును. ఆమె బీదలకు ధనసాహాయ్యముచేయుచు, రోగులకౌషధదానములు చేయుచు, తాను బయలిపల్లెలకు వెళ్ళినప్పుడు పిల్లలకిచ్చుటకై లండన్ నగరమునుండియాటవస్తువులనుతీసికొనిపోవుచుండును అప్పుడప్పుడు తాను స్వయముగా కుట్టినబట్టలు మొదలైనవానిని తీసికొనిపోయి ధర్మార్థముగా వినియోగింపుచుండును. ఆమె తన సేవకులయందపరిమితప్రేమ గలది. దీనింజదువు హిందూసుందరులు పరోపకారకృత్యములయందు రాణిగారివలెఁ బ్రవర్తించుటకు బ్రయత్నింతురని నమ్ముచున్నాము.

ఈమె ౧౮౭౭ వ సంవత్సరమునందు డిల్లీనగరమున హిందూదేశ చక్రవర్తినీపట్టణమునువహించినది. ఇప్పుడీమె రాజ్యము ప్రపంచము నందలి యన్నిభాగములలోను వ్యాపించి భూమండలములోని యాఱవ పాలిమెక్రిందనున్నది. భూలోకములోని జనులలో నైదవవంతిప్పు డీమెపరిపాలనలో నున్నారు. ఇంకను చిరకాలమీయమె రాజ్యముచేయునట్లనుగ్రహింప పరమేశ్వరునిఁ బ్రార్థింపుచున్నాము.

---

## తగవుల మాలితనము.

(౧౮౮౪ వ సం॥ మేయి నెల.)

—?౦?—

మనలో సాధారణముగా స్త్రీలు కారణము లేకయే కలహము లాడుదురని యొకనిందవచ్చియున్నది. సాధ్యమైనంత ప్రయత్నము

చేసి యీనిందను శీఘ్రముగా పోఁగొట్టుకొనుట స్త్రీలకందఱకును ముఖ్య
కర్తవ్యము. లోకానుభవమును బట్టి చూడఁగా, ఈనింద నిష్కారణ
ముగా వచ్చినదిగా కనఁబడదు. మనలోని స్త్రీలు పదిమంది యొక్క
చోట చేరినతోడనే యావలి కెంతో యాదరముతో మాటాడుకొను
చున్నను మనకు నేదో యొకస్వల్పవిషయమునం దేకీభవింపక తగవు
లాడి యొకరి నొక రొకరుముం దెప్పుడును చూచుకొననిలాగున తెగఁ
బట్టి తిట్టుకొనుచుండుట తఱచుగా చూచుచున్నాము. ఈకలహశీలత
కొంతవఱకు చదువు లేకపోవుటవలనఁ గలిగిన మూర్ఖతవలన సంభవించు
చున్నను విశేషభాగము చిన్నతనమునందు తల్లిదండ్రులు చేసిన యుపేక్ష
వలననే పొసఁగుచున్నదని మనము దృఢముగా చెప్పవచ్చును. కల్లలాడి
నప్పుడు కాని, దొంగిలించినప్పుడు కాని మనము బాలికల నేలాగున శిక్షిం
తుమో తగవులాడినప్పుడును ఆలాగుననే శిక్ష చేయవలెను. పిల్లలు పెట్టు
కొను స్వల్పకలహములయందు మనము జోక్యము కలుగఁజేసికొనఁ గూడ
దనియు వారు కొంచెము సేపు తగవులాడి మరల వారే కలిసికొందురని
యు కొందఱు చెప్పుచున్నారు. కాని వారు చెప్పెడిది సరికాదు. అసత్యము
పలుకుటయు దొంగతనము చేయుటయు నెంత పాపమో యితరులతో
కలహము లాడుటయు నంత పాపకార్యమే. చిన్నతనములోనే తగవు
లాడుట పాపమని బాలికల మనస్సులకు పట్టింపక పోయినపక్షమున, వారి
కంత కంతకు తగవులు పెట్టుకొనుట యభ్యాసమయి తరువాత విడువ
వలెనన్నను సాధ్యము కాక పెద్ద పెరిగిన పిమ్మట కుటుంబసౌఖ్యమునకంత
కును భంగము కలిగించును. మనలో నెన్ని కుటుంబములయందు నెమ్మది
లేక స్త్రీల మూలమున సోదరులు సహితము భ్రాతృస్నేహమును విడచి
కాట్లకుక్కలవలె కయ్యము లాడవలసినవారగుచున్నారు! ఎన్ని కుటుం
బములలో పురుషు లింటికి వచ్చునప్పటికి స్త్రీలు కుడిచి కూరుచుండి పని
లేక తగవులాడి గృహము మహారణ్యమువలె చేయఁగా వారు మనో

వ్యథచేత బాధపడ వలసినవా రగుచున్నారు! ఈహేతువుచేత నేయొక యింటనూ ఉజుట్లిముడునుగాని రెండుకొప్పులిముడవన్న సామెతమనలో వెలసి యున్నది. సాధారణముగా కలహములకు దురాశయో, ఆగ్రహమో, ఓర్వలేనితనమో, స్వప్రయోజనపరత్వమో, కారణములుగానుండును గనుక చిన్నతనములోనే వానినడఁచివేయకపక్షమున ముందాదుర్గుణములు మేరమీఱి తమకునుపొరుగువారికినిసంబంధులకును మిక్కిలిమీఱిన నష్టముల నాపాదించును, కాఁబట్టి యిద్దఱుపిల్లలు పోట్లాడుచుండఁగాచూడఁగానే కారణమును విచారించుటమానివేసి వెంటనే యీపిల్లల నిద్దఱిని చెఱియొకచోటికి పంపివేసి కాని, వారిద్దఱిమీఁదనుకోపపడిగాని ముందుగా కలహమునడఁచివేయవలెను. ఎవ్వరిది తప్పిదమయినను కారణ మున్నను లేకపోయిననుకూడవారుముం దెప్పుడును ఏవిషయమునందునుపోట్లాడఁగూడదనిఖండితముగామందలించి వారింపవలయును. చిన్నతనములో నెవ్వరును న్యాయాన్యాయములను విచారించి ప్రవర్తింపఁ జాలరు. ఈచిన్నకలహము నీప్రకారముగా మొలకలోనేయడఁచివేయక యుపేక్షించిన పక్షమునవయస్సుమీఱినకొలఁదిని వారు మఱింత గయ్యాళులయి పుట్టినయింటికిని చొచ్చినయింటికినికూడ నపఖ్యాతిని తీసికొనివత్తురు. వారిని జూచి వారి పిల్లలును తల్లులవంటివారేయయి చీటికి మాటికి కలహములకు కాలుద్రవ్వుచు నెల్లవారికిని కంటకముగా నుందురు. తల్లిచాలుపిల్లకు వచ్చుననియు, తల్లినిచూచి పిల్లను చేసికొమ్మనియు, మన పెద్దలు చెప్పెడిమాట వ్యర్థముకాదు. కాఁబట్టి బిడ్డలను పెంచువారందఱును తా మీవిషయమున గట్టిశ్రద్ధ చేయుదురని కోరుచున్నాము.

---

## పరులమీఁది దోషములు చెప్పుకొనుట.

[౧౮౮౪ వ సం॥ జూన్ నెల]

సాధారణముగా మనలోని స్త్రీలు నలుగురొక్కచోట కూడి నప్పుడువారు విద్యాగంధమెఱుఁగనివారు గనుక ముచ్చటించుటకు మంచి సంగతులు దొరకక పరులదోషములనుగురించి మాటాడు కొందురు. అట్టిసంగతులను మాటాడుకొనుట యవివేకకార్యము. మాటాడిన మాట లాప్రకారముగానే యావలికిఁబోవు. ఒకచోటిమాటల నొక చోటికిఁ గొనిపోయి చెప్పుటయే పనిగాతిరిగెడువారు తామువిన్నసంగ తులను కసంతయున్న గంపంతగా పెంచి యితరులవద్ద చెప్పుదురు. విన్నమాటకన్న చెప్పెడుమాటచేటన్నసామెతనందఱునువినియే యుం దురు. అందుచేత నెవరివిషయమామాటలు చెప్పఁబడినవో వారికిని మాట లన్నవారికిని విరోధము సంభవించును.ఇచ్చకములకయియిద్ద ఱివద్దను జేరి యిష్టులవలె నటించి తలవులుపెట్టి తాము లాభమును పొందెడివారివలన నీవిరోధములు ప్రబలి కొన్ని సమయములయందు బహుదుఃఖములకు కారణ మగును; ప్రాణములవంటి మిత్రులు సహి తము గర్భశత్రువులగుదురు; ఆప్తబంధులు సహితము పరులగుదురు. కాఁబట్టి యెదుటలేనివారివిషయమయినదోషములను చాటునమాటా డెడుదురాచారములనుసాధ్యమయినంతకృషిచేసి మాని వేయవలయు ను.ఒక్కమాఱునోరుజాఱివచ్చినతరువాత దానిని కూడఁదీసికొనుట కొంతమాత్రమునుశక్యము కాదు; మన మది యెంతమనసుకలసినవారి ముం దన్నను వారు తమయాప్తులతో చెప్పఁగానానోటిమాట యా నోటను అందఱియొద్దకునుపోవును. సాధారణముగా నిరుగుపొరుగుల వారిలో కలహములు సంభవించుటకిదియే కారణ మగును. కాఁబట్టి యొకరిమీఁద నేరము లెన్నెడుదుర్గుణమునుమానుకొనుట చిన్నప్పటి

నుండియు నభ్యాసము చేసికొనవలెను. ఒక్కసారియలవాటుపడ్డదానిని విడిచిపెట్టుట యెంతో దుర్ఘటముగానుండునుగనుక తల్లులయినవారు తామాదోషమున కెడమియ్యక పోవుటయే కాక తమ బిడ్డలుకూడ నొకరిమీఁద కొండెములుచెప్పకుండునట్లుజాగ్రత్తపుచ్చుకొని వారట్లు చేసినప్పుడు నయమున భయమున బుద్ధిచెప్పుచు రావలెను. అన్యుల దోషములనే సదా చింతించుచుండెడి మనస్సు తఱుచుగా తానేయా దోషములను చేయుటకు పాలుపడ వచ్చును. ఇట్లుచెప్పుటచేతపరులు దోషములు చేసినప్పుడు వానిని కప్పి పుచ్చవలయునని కాని, ఆదోషములసంగతి నెవ్వరితోను జెప్పఁగూడదని కాని మాయభిప్రాయము కాదు. పరులదోషములను వారికి కనఁబఱిచి వారిని దిద్దుకొనునట్లు చేయుటకయి శక్తియుండిన తప్పక యాప్రకారముగాఁ జేసి వారిని మంచిమార్గమునకు త్రిప్పుటకు సర్వవిధముల ప్రయత్నముచేయవలసినదే. తనచేత కానప్పుడుశక్తిమంతు లయినయితరులతోఁజెప్పి వారి మూలమున చెడు తెరువు పట్టినవారిని దిద్దుటకయిప్రయత్నించుటయు మంచిదే. కాని నిష్ప్రయోజనముగా మొగము వెనుక పరులమీఁద దోషారోపణము చేయుటమాత్రము కానిపని.

## పరోపకారము.

[౧౮౭౮ వ సం॥ జూలై నెల.]

——(౦)——

లోకములోని సమస్తజనులను సృజించినవాఁడొక్క యీశ్వరుఁడే. ఆసర్వేశ్వరుఁడు మనల నందఱిని పుట్టించినందున మనకతడు తండ్రివంటివాఁడు. సృజింపఁబడిన మన మందఱమును సోదరులవంటివారము. ఒకకుటుంబములో కొందఱసమర్థులయినను కుటుంబక్షేమము నిమిత్తమందఱు పాటుపడుట యెట్లుధర్మమో, ఈశ్వరకుటుంబమైన

యీప్రపంచమునందలియెల్లవారును సోదరభావమునువహించిపరస్పరానురాగము కలవారయియన్యోన్యసాహాయ్యము చేసికొనుచుండుటయట్లే పరమధర్మము. మనము నడుమతెచ్చిపెట్టుకొన్న జాతిమతాభిమానములను పూనియొకరినొకరు ద్వేషించుచు దూషించుచుపరస్పరసహాయులు కాకుండుట పాపమూలము. భగవంతునిదృష్టియందుజనులందఱును సమానులు; ఆయన తనబిడ్డలయినసమస్తజనులనుసమానమయిన దయతోనే కాపాడుచున్నాఁడు. ఆయన రాజని, కాపని, బ్రాహ్మణుఁడని, పంచముఁడని, ధనికుఁడని,దరిద్రుఁడని,పండితుఁడని, పామరుఁడని, హిందువని, మ్లేచ్ఛుఁడని, క్రైస్తవుఁడని, వైష్ణవుఁడని చూడక యెల్లవారికినిసమానముగాకరచరణాద్యవయవములను, మనోబుద్ధ్యాదులను, సుఖసాధనములను దయచేసియున్నాఁడు. రాజులదివ్యభవనములమీఁదప్రకాశించునట్లేబీదలగుడిసెలమీఁదకూడ సూర్యుడు నిత్యమును ప్రకాశించి వెలుతురునిచ్చునట్లు చేసియున్నాఁడు. బ్రాహ్మణులకునుపంచములకు నొక్కరీతిగామంచినీరిచ్చునట్లు మేఘములనుచేసియున్నాఁడు. వాయు వెల్లవారును సమానముగా ననుభవించునట్లుగాఁ చేసియున్నాఁడు. కాఁబట్టియేయీభూతములన్నియునీశ్వరాజ్ఞ చేత మనకు జీతబత్తెములు లేనిపరిచారకులవలె విడువక సేవ చేయుచున్నవి. సూర్యుఁడుచమురుపోయనిదీపమువలెకాలముతప్పక ప్రతిదినము వెలుఁగుచున్నాఁడు. వాయువువీధులు మొదలగువానినిశుద్ధిచేయుచు మనచెమ్మటలార్చుచు సదా పనిచేయుచున్నది; అగ్ని మనచలి పోఁగొట్టి నీళ్ళుకాచి పాకముచేయుచున్నది. భూమి యాహారపదార్థములనిచ్చుచున్నది. ఈప్రకారముగా నొక్కభూతములుమాత్రమే కాక ప్రపంచములోని సమస్తజీవరాసులునుసమస్తచరాచరములును భగవదాజ్ఞచేత మనకందఱకును సమానముగానేదోయొకవిధమున పనిచేసి మన సుఖసంతోషాదులకు సహాయపడుచున్నవి. ఈలోకమునకుఁ బంపు

నప్పుడును మనల నందఱిని సమానముగానే పంపియున్నాఁడు. శైవుని బిడ్డ విభూతిరుద్రాక్షలతోను పుట్టఁడు; వైష్ణవునిబిడ్డ తులసీనళినాక్షమాలలతోను పుట్టఁడు; రాజుబిడ్డ పీతాంబరముతోను కిరీటముతోను పుట్టఁడు; కాపుబిడ్డ గోచిపాతతోనుకొడవలితోనుపుట్టఁడు. చక్కగా విమర్శించిచూచినయెడల భగవంతునకెవ్వరియందును పక్షపాతములేదని విశదముగాకమానదు. ఆయనయుద్దేశానుసారముగానెవ్వరుపాటుపడుదురో యెవ్వరుసన్మార్గమునప్రవర్తింతురో వారందఱునుభగవత్కటాక్షమునకు పాత్రులై సుఖసంతోషాదులననుభవింతురు. అంతేకాక యీశ్వరుఁడు మనుష్యులందఱును స్వార్థపరత్వమును విడిచి పరస్పర సహాయులయి పని చేయునప్పుడే సుఖాతిశయమును పొందునట్లు విచిత్రముగా చేసియున్నాఁడు. రాజునకయినను బీదవానికైనను ఒక్క దినము సుఖముగాజీవించుటకెందఱిసాయమో కావలసియుండును. శ్రీమంతులు భుజించుపంచభక్ష్యపరమాన్నముల కెట్లోయిరుపేదలు తిను గంజిమెతుకులకట్లేపలువురుభూమిదున్ని, గింజ నుచల్లినీరుపెట్టి, కలుపుతీసి, కావలికాచి, పంటకోసికుప్పలువేసి, ధాన్యముచేసి, దంచిబియ్యము చేసి పలువిధములపాటుపడవలయును. ఈవిధముగా నేమనకు కావలసిన బట్టలు మొదలయినవానివిషయములోను బహుజనులు బహువిధముల కష్టపడవలయును. ఒకకుటుంబములోనిపలుపనులు చేయుటకు కుటుంబములోనివారుపాటుపడవలసినట్లేయీగొప్పభగవత్కుటుంబమయినప్రపంచములోనివారును పరస్పరసహాయులయి సర్వజనసుఖార్థముయి ప్రయాసపడవలయును. ఒక్కకుటుంబములో నెవ్వరికయినను వ్యాధిగాని విపత్తుగాని వచ్చినప్పుడు తక్కినవారునిద్రాహారాదులు మాని కష్టపడి వారిక్షేమమునిమిత్తమయి పాటుపడునట్లే లోకకుటుంబములోను జను లన్యోన్యక్షేమమునిమిత్తమయి శ్రమ పడుచు నొకరి నొకరు మోసపుచ్చక యొండొరులకు కీడుచేయుని వ్యాధులుమొదల

యిన యాపదలు వచ్చినప్పుడు చేతనయినంతసాహాయ్యమును జేయుచు జాతిమతద్వేషములను విడిచి సర్వజనయోగక్షేమార్థమయి శ్రమపడవలెను. ఇదియే పరోపకారము. ఇందువిషయమై ముందు కొంత వ్రాసెదము. ఈశ్వరదృష్టి కందఱునుసమానులే యైనను దేశక్షేమము నిమిత్తమై కుటుంబమునందువలెనే జగత్కుటుంబమునందును గౌరవతారతమ్యము లుండవలెను.

---

## భవిష్యత్తును జెప్పుట.

[౧౮౯౯ వ సం॥ ఏప్రిల్ నెల]

—— : )0( :——

తాత్కాలికస్థితిని మాత్రమే కాక ముందురాఁబోవుదానినిగూడ విచారించుట మనుష్యులకు సహజగుణమైయున్నది. ఈ గుణమే మృగాదులకంటె మనకున్న యాధిక్యములలో నొకటిగానున్నది. దీనిని బట్టి మానవులు సామాన్యముగా భవిష్యత్తును తెలిసికోవలెననెడి యాసక్తి కలవారుగానుందురు. ఈయాసక్తి కలిగియుండుట యాధారము చేసికొని స్వప్రయోజనపరులైనవారు తమయొక్క యుత్తమ సంతతివారియొక్కయు తమజాతివారియొక్కయు జీవనాధారమునకును ధనాకర్షణమునకును వివిధములైన మాయోపాయములను గల్పించియున్నారు. అందులో కొన్ని యిప్పుడు శాస్త్రములనికూడ పేర్కొనబడుచున్నవి. అఱచేతిలోని రేఖలనుబట్టి యొక శాస్త్ర మేర్పఱుపఁబడి యున్నది. ఈశాస్త్ర మొక దేశములో నొకవిధముగాను, మఱియొక దేశములో మఱియొకవిధముగాను ఉన్నది. ఆభేద మెట్లున్నను పలువురకు చేతులలో తొమ్మండ్రు కొడుకులున్నను, భార్యలకొక్కడునుఉండఁడు; చేతులలో దీర్ఘమైనధన రేఖయున్నను, ఇంట చిల్లిగవ్వయుండదు. హస్తములలో పూర్ణాయుర్దాయమున్నను, లోకములో నర్ధాయుస్సుసహితముండదు. ఒకానొకప్పుడు కాకతాళీయ

న్యాయముగా చేతులలోనున్నదియు గృహముననున్నది సరిపోను వచ్చును. ఈప్రకారముగా భవిష్యత్తును సూచించుననునది యొకహస్తమే కాదు. ముఖములును, నఖములును, మెడలును, తొడలును, తక్కినసమస్తావయవములును, వాని దీర్ఘతలును హ్రస్వతలును, స్థూలతలును, సూక్ష్మతలును, శుభాశుభములనుసూచించునని శాస్త్రములు, వ్రాయబడియున్నవి. ఈశాస్త్రములకు సాముద్రిక శాస్త్రములనిపేరు. ఒక్కమనుష్యుని అవయవములుమాత్రమే కాక, అతడు వేసెడియంకెలను, వ్రాలెడియక్షరములను, విడిచెడు శ్వాసములును, పలికెడుకంఠస్వరమును, గూడ శుభాశుభసూచకములని వ్రాయబడిన శాస్త్రములు పెక్కులుగలవు. ఈశాస్త్రములను చేసినమహానుభావులు వాయువులో సంచరించెడుపక్షులను, నేలమీద ప్రాకెడుబల్లులను, ఆకాశమున తిరిగెడు గ్రహనక్షత్రాదులను, గూడ విడిచిపెట్టలేదు. పక్షిశాస్త్రములని, గౌళిశాస్త్రములని, జ్యోతిశ్శాస్త్రములని, పేరులుపెట్టి యవి మనయొక్క కలిమి లేములను, లాభనష్టములను, ఆయవ్యయములను, శుభాశుభములను, జననమరణములను, సుఖదుఃఖములను, ఆయురారోగ్యములను, వ్యాధిబాధలను, యోగక్షేమములను, పాడిపంటలను, పేర్కొనగల సమస్తమునుముందుగా తెలుపుడుచేయునని వ్రాసియున్నారు. మూఢత్వమే దేశమునందధికముగా నుండునో దీనియందు నమ్మిక మా దేశములో నధికముగానుండును. మనదేశములో నొకపురుషుడు నిద్రలేవగా నేతనవిధవతోబుట్టువును జూచినను త్రాచుపామును జూచినప్పటికంటెను నెక్కువభయపడును; జోడుకాకులను చూచినపక్షమున పెన్నిధిదొరకినట్లుసంతోషించును. రాత్రివేళ తీతువుకూత వినబడినపక్షమున మీదికి వచ్చెడు పులి గాండ్రింపునకన్నను జడియును; గరుడపక్షికూతవినబడినచో దేవుడు ప్రత్యక్షమైనట్లు బ్రహ్మానందమునొందును. ఇటువంటి నిదర్శనములు లక్షలు చెప్పవచ్చునుగాని గ్రంథవిస్తారమువలన ప్రయోజనములేదు.

ఇటువంటి శాస్త్రములే లేకపోయినయెడల పైనివవరించిన రీతియనావశ్యకములైన భయములుండవుగదా? ఈశాస్త్రములు లేనివారాపదలు వచ్చినప్పుడుమాత్రమే చింతనొందుదురు. ఈశాస్త్రములుండి నమ్మినవారో యాపదలుసంభవించునప్పుడుమాత్రమేగాక శోక హేతువులేవియు లేనప్పుడుసహితము కుక్కగూబకూసినను, బల్లిపడినను, ఆకాశమునతోకచుక్కనుజూచినను, ఒంటిబ్రాహ్మణుడెదురుపడినను పొడుగువాఁడు తుమ్మినను, తనయెడమకన్నదరినను, లేనిపోనిచింతనొందుచుందురు. కాఁబట్టి యీశాస్త్రములవలన దుఃఖమధికమగుననుట నిస్సంశయము. ఈశాస్త్రములయందు విశ్వాసముగలవారు నిజమైన యాపదలవలనఁ బొందెడుభయమునకంటె నాపదలురాఁబోవుననిపొందెడు భీతిచే విస్తారముగాఁబొందుదురనియు, వచ్చుననుకొన్నయాపదలశాంతికయి తాంత్రికులకిచ్చుట కేకుటుంబపోషణమునకంటె నెక్కువధనమును వ్యర్థముగాఁబోఁగొట్టుకొందురనియు, చెప్పనక్కరలేక యేయెల్లవారును తమంతనే తెలిసికోవచ్చును. వివాహములకెందఱుజ్యోతిష్కులుమంచి ముహూర్తములుపెట్టినను, జన్మపత్రికలనుపరిశీలించినను, శకునములు చూచినను, శాంతులుచేసినను, ఇట్టిశాస్త్రవిశ్వాసములేనిహూణులు మొదలయినవారి దాంపత్యములే యెక్కువసుఖకరములుగానున్నవో మనవేయున్నవో, వారిలోనే విధవలధికముగానున్నారో, మనలోనే యున్నారో, కొంచెమాలోచించినపక్షమున, ఈభాగ్య(లేకనిర్భాగ్య) శాస్త్రములయందుంచెడువిశ్వాసముంచవలయునో తేటతెల్ల మగును. ఈలోకములో కలిగెడుఫలములన్నియు మనప్రయత్నములకునుకర్మలకును ననుగుణముగానుండునని తెలిసికొన్నపక్షమున, పైశాస్త్రములయందలివెఱ్ఱినమ్మకము పోవచ్చును. అఱచేతిలో విద్యారేఖ యెంత పొడుగుగా నున్నను కష్టపడి చదువుకొన్నఁగాని పండితుడుకానేరడు. ధనరేఖయెంతదీర్ఘముగానున్నను, కోటికొక్కనికెప్పుడో పాతుద్ధారకి

వంగాని సాధారణముగా పాటుపడిగడింపక పూలకాసులభింపదు. చేతియందెందఱుబిడ్డలున్నను, వివాహముచేసికొని భార్యతో సంసారము చేసినంగాని యొక్కకొడుకైన నాకాశమునుండి యూడి పడఁడు. ఈప్రకారముగానే తక్కినశుభములును, అశుభములును, మనముచేసెడి సత్కార్యదుష్కార్యములవలనఁ గలిగెడిఫలములే యగునుగని వేఱుగాదు. భవిష్యత్తును దెలిసికొనుటవలనను మనకు విశేషప్రయోజనము లేదు గనుక, దానికై మనమంతప్రయత్నము చేయవలసిన పనిలేదు. ఆపదముందుగా తెలిసినపక్షమున దుఃఖము ద్విగుణమగును; శుభముముందుగా తెలిసినయెడల సంతోషము తగ్గును. కాఁబట్టియటువంటి భావిశుభాశుభములకై వ్యర్థముగా మన మేల యాయాసపడవలెను? అట్టి శాస్త్రము లోకవేళ నిజమను కొన్నను మనకవియక్కరలేదు. అవిచెప్పెడుకీడే నిజమైనయెడల నెప్పుడో రాఁబోయెడు దుఃఖమిప్పుడే యారంభమగును; నిజము కానియెడల పడినదుఃఖము లేనిదగును. అవిబోధించెడు మేలే నిజమైన యెడల మేలుకలిగినప్పుడు కలుగవలసినసంతోషమప్పుడు లేకపోవును; తనకు భూములమీఁద వేయిరూపాయలు వచ్చునని యెఱిఁగినవా డెవ్వఁడు కాపుసొమ్ము తీసికొనివచ్చినప్పుడు బ్రహ్మానందమునొందును? ఆమేలు నిజముకానియెడల, ఏమో కలుగునని చిరకాలమునుండి యెదురుచూచునది రాకపోవుటచేత నపరిమితమైన పరితాపము కలుగును. కాఁబట్టిబుద్ధిమంతులగువారటువంటివింత శాస్త్రములకును శాస్త్రజ్ఞులకును తమవద్దకురాకుండ దూరమునుండి నమస్కరించుచు, భగవంతుఁడు తమ కనుగ్రహించిన జ్ఞానముచేత తెలిసికోఁదగిన దానితో తృప్తివహించి సమస్తమునకును భగవంతుని దయామహిమనే నమ్మికొని నిర్విచారముగా నుండవలెను.

## జ్యోతిశ్శాస్త్రము.

[౧౮౮౮ వ సం॥ మె ఋ నెం

——(:o:)——

సమస్తశాస్త్రములలోను జ్యోతిశ్శాస్త్రము మిక్కిలి మనోహరమయినది. ఈ శాస్త్రము నందలి జ్ఞాన మెంతయెక్కువ యైన, బుద్ధివికాస మంతయెక్కువగుటయే కాక భగవంతుని మహిమనహిత మధికముగాఁ దెలియును. ఈ శాస్త్రవిషయముల నప్పుడప్పుడు ముందుపటములతోఁ గూడ కొంతకొంత వివరింపుచుందుము.

ఈ బ్రహ్మాండకటాహమందున్న యాకాశమునందలి ప్రకాశమానములయిన జ్యోతిర్మండలములలో నెల్ల సూర్యుఁడు మధ్యగా నుండును. సూర్యునకును సూర్యుని చుట్టును దిరిగెడు జ్యోతిర్మండలములకును గ్రహము లని పేరు. మనము నివసించెడు భూమి కూడ గ్రహములలో నొకటి. ఈ భూమియందుండు వారికి యంత్రసాహాయ్యము లేని పూర్వకాలమునందు నేడు గ్రహములు మాత్రము తెలియును. సూర్యుఁడు, చంద్రుఁడు, అంగారకుఁడు, బుధుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శని, అని వాని నామములు. ఈ యేడు గ్రహములను బట్టియే మొట్టమొదట వారము లేర్పడినవి. కాఁబట్టియే వానికి భాను (సూర్య) వారము, సోమ (చంద్ర) వారము, అంగారక వారము, బుధ వారము, బృహస్పతి వారము, శుక్ర వారము, శని వారము, అను నామములు కానఁబడుచున్నవి. మన పౌరాణికులా యా గ్రహములను పురుషులనుగాఁ జెప్పి పెక్కుచర్యలను సంబంధములను కల్పించుటయే కాక, ఆకాశమునలేని రాహు కేతువు లను రెండు కల్పిత గ్రహములనుగూడ వానితోఁ జేర్చి విచిత్రకథలను గల్పించిరి. పయిని జెప్పినవిగాక సూర్యుని చుట్టును తిరిగెడు గ్రహముల నేకముల నిప్పటి వారు దూరదర్శకయంత్రసాహాయ్యముచేత కనిపెట్టి యున్నారు. ఈ గ్రహములలో కొన్నిటికి తమచుట్టును తిరుగుచుండెడి యుపగ్రహములు

సహితముగలవు. సత్యమువిచారింపఁగా చంద్రమండలమొకగ్రహము గాక భూమి కొకయుపగ్రహముగా నున్నది. అందుచేతనే చంద్రబింబము ఇరువదియేడు దినముల, ఏడుగంటల, నలుబదిరెండు నిమిషముల, అయిదు సెకనుల కాలములో నొకసారిభూమిచుట్టు తిరిగిమరల యథాస్థానమునకు వచ్చుచుండును. ఈ కాలమున కేమాసమని పేరు. ఈ ప్రకారముగానే బృహస్పతికి చంద్రునివంటియుపగ్రహములునాలుగు కలవు. శనిగ్రహమున కేడున్నవి.

గ్రహములన్నిటిలో బుధగ్రహము సూర్యునకు మిక్కిలి సమీపముగానున్నది. ఇదిగ్రహము లన్నిటిలో మిక్కిలి చిన్నదియయియును స్ఫటికమువలె ప్రకాశమానమయిన కాంతికలిగియుండును. ఎప్పుడును సూర్యుని సమీపమునందుండుటచేత బుధగ్రహము తఱచుగా నగపడకపోవుటయేకాక కనఁబడినప్పుడుసహితము తనయొక్క శీఘ్రగతిచేత మిక్కిలియల్పకాలముమాత్రమే కనఁబడును. అది సూర్యాస్తమాన మయినతరువాతకొంచెము సేపును, మరల సూర్యోదయమునకు పూర్వము కొంచెముసేపునుమాత్రము కానఁబడును. చంద్రునివలెనే దీనికిని కళలు గలవు. ఈగ్రహము ౮౭ దినముల, ౨౩ గంటల, ౧౪ నిమిషముల, ౩౪ సెకనులకాలములో తనకక్ష్యలో సూర్యునిచుట్టును తిరిగివచ్చును. ఒకగ్రహముసూర్యునిచుట్టునుతిరిగివచ్చెడుకాలమునకే సంవత్సరమని పేరుగనుక, బుధగ్రహమునందు వాసము చేయువారికెనుబదియెనిమిది దినములకే సంవత్సరమగును.

గ్రహములలో నెల్ల శుక్రగ్రహము మిక్కిలి సుందరమయినది. ఇది వజ్రమువలెప్రకాశించుచుండును. తెల్లవాఱుజామునసుదయించునప్పుడుదీనిని వేగుచుక్కయందురు. చంద్రునికివలె దీనికినికళలుగలవు. ఇది ౨౨౪ దినముల, ౧౬ గంటల, ౪౧ నిమిషముల, ౩౦ సెకనుల కాలములోనొక్కసారిసూర్యునిచుట్టునుతిరిగివచ్చును. ఇందుండెడివారి

కీకాలమే సంవత్సరము. బుధుని తరువాత సూర్యునికి సమీపములో నున్నగ్రహ మిదియే. ఒక గ్రహము సూర్యునిచుట్టును తిరిగెడు మార్గమును కక్ష్యయందురు.

శుక్రునితరువాత నున్నగ్రహము భూమి. భూమికిని సూర్యునకును గలదూరము ౮౧౦౦౦౦౦౦౦ మైళ్ళు. హిందూజ్యోతిశ్శాస్త్రజ్ఞులు భూమికిని సూర్యునకును గల దూరము ౬౮౮౬౨౭ యోజనము లని చెప్పియున్నారు. ఈభూమి ౩౬౫ దినముల, ౫ గంటల, ౪౮ నిమిషముల, ౫౭ సెకనుల కాలములో సూర్యునిచుట్టును తిరిగి వచ్చును. ఈభూలోకమునం దుండెడి మనకిదియే సౌరమానమును బట్టి సంవత్సరము. భూమి తనయక్షము (ఇరుసు) మీద ౨౩ గంటల, ౫౬ నిమిషముల, ౪ సెకనుల కాలములో నొకసారి గిఱ్ఱునతిరుగును. ఈకాలమునకే దినమని పేరు.

భూమితరువాతనంగారకగ్రహమున్నది. అంగారకుఁడుపగడమువలె నెఱ్ఱగానుండును. ఈగ్రహము పరిమాణమునందొకానొకప్పుడు శుక్రునియంత యున్నను, అంత కాంతి కలదిగాదు. ఇది యొకప్పుడు సూర్యునకు మిక్కిలిసమీపముగాను, ఒకప్పుడుమిక్కిలిదూరముగాను ఉండును. ౧ సంవత్సరము, ౩౨౧ దినముల, ౨౨ గంటల, ౧౮నిమిషముల, ౧౯ సెకనుల కాలములో నంగారకుఁడొక్కసారిసూర్యుని చుట్టును తిరిగివచ్చును. ఇందుండువారి కీకాలమేసౌరసంవత్సరము.

అంగారకుని తరువాత బృహస్పతిగ్రహమున్నది. గురుమండలము తఱుచుగా సూర్యునకు మిక్కిలిదూరముగా కానఁబడును. ఈ గ్రహము మిక్కిలిప్రకాశముగలపుష్యరాగమువలెబంగారు ఛాయను ప్రకాశించుచుండును. ఇది ౧౧ సంవత్సరములు, ౩౧౩ దినముల, ౮ గంటల, ౩౫ నిమిషముల, ౪ సెకనులలో నొక్క సారి సూర్యుని చుట్టును తిరిగివచ్చును. ఈకాలమే యందుండువారికి సంవత్సరము.

బృహస్పతిగ్రహము సరాసరి పండ్రెండుసంవత్సరములలో భచక్రమున నొక్కసారి భ్రమణముచేయునని సూర్యసిద్ధాంతమునందు చెప్పబడి యున్నదిగనుక, ఇప్పటి యంత్రములులేక మనపూర్వులు చేసిన గణమునకును దూరవస్తుదర్శకయంత్రములలో హూణులు చేసిన గణనమునకును విస్తారవ్యత్యాసముండదు.

బృహస్పతి తరువాత శనిగ్రహమున్నది. శనిగ్రహముకూడ తెలుపుగా సూర్యున కత్యంతదూరమున కనబడును. ఈగ్రహము మెఱుఁగుపెట్టిన నల్లసీసమువలె వెలవెలపోవునరంగుకలదిగానుండును. దుర్బిణిలోఁ జూచెడుపక్షమున తక్కినగ్రహములకంటె శనిగ్రహము చిత్రవిచిత్రముగా నుండును. ౧౦౬౦ దినములు, ౧౩ గంటల, ౧౪ నిమిషముల, ౪౨ సెకనులలో నొక్కసారి శనిగ్రహము సూర్యుని చుట్టును తిరిగివచ్చును. శనిలోకమునం దుండెడివారికీ కాలమే సౌర సంవత్సరము. శనిగ్రహము సరాసరి ౨౯ సంవత్సరముల, ౧౬౭ దినములకు భచక్రమున నొకభ్రమణముచేయునని గోళాధ్యాయమునఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి మనపూర్వుల లెక్కయును హూణుల లెక్కయు నించుమించుగా సరిపోయినది.

ఇప్పుడు చెప్పిన గ్రహములును, ఉపగ్రహములును గాక తోఁకచుక్కలనెడి మఱియొకరీతి తేజోరూపములుకూడ సూర్యుని చుట్టును తిరుగుచుండును. వానిగతులును బహువిధములుగానుండును. సమస్తగ్రహములును తనచుట్టును తిరుగ గ్రహరాజని పేరుపొంది, అవమానమైన దుస్సహకాంతితో ప్రతిదినమును వెలుగుచుండు సూర్యుని యుపరిభాగమున నల్లనిమచ్చలున్నట్టును, అవి రూపమున కాలక్రమమున పెద్దవియు చిన్నవియు నగుచు వివిధాకారములు పొందుచున్నట్లును యంత్రములతోఁ జూచినచో తేటపడును.

ఇఁక నక్షత్రములకును భూమికిని గలదూరము నెంతయని చెప్ప

టకు శక్యము కాదు. ఆనక్షత్రము లన్నియు సూర్యులనియు మన సూర్యమండలముచుట్టును గ్రహములు తిరుగుచున్నట్లే వానిచుట్టును పెక్కుగ్రహములు తిరుగుచుండుననియు, శాస్త్రజ్ఞు లూహించుచున్నారు. దూరదర్శకయంత్రముతోఁ జూచెడుపక్షమునఁ గొన్ని నక్షత్రముల కాంతిసూర్యునిదానికంటెను, పెక్కుమడుఁగులధికముగానుండును. ఇంచుమించుగా వానిరూపములనుబట్టి మనవారునక్షత్రములను రాసులనుగా భాగించియున్నారు. సూర్యుఁడుసంవత్సరములో నిప్పుడు చెప్పబోయెడు రాసులగుండ తిరుగును. సౌరమానముబట్టి యొక్కొక్కరాశియందుండు కాలము నాయారాశి పేరుగలమాసమునుగా వ్యవహరింతురు. ఎట్లనఁగా సూర్యుఁడు సింహరాశియం దుండు కాలమునకు సింహమాసమనియు, మీనరాశియందుండు కాలమునకు మీనమాసమనియు, ఈరీతిగానే వ్యవహారముకలదు. మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము ధనస్సు, మకరము, కుంభము, మీనము;—ఇవి పండ్రెండును రాసులు.

---

## గృహిణీ ధర్మము.

(౧౮౮౫ వ సం॥ జూన్ నెల)

—:o:—

కొందఱనుకొనునట్లు మంచిబట్టలను నగలనుధరించుకొని మగనిని సంతోషపెట్టుటయు, దాసివలె నింటిపనులుచేయుటయు, మాత్రము నిజమైనపత్నీధర్మములుకావు. తల విఱియఁబోసికొని చింపిబట్టలతో రాకాసివలె నగపడక యలంకరించుకొని శుచిగానుండుటయు, నోటపెట్టుకొన్న నరుచికలుగునట్లుగా వంటచేయక జిహ్వాకింపుగా శాకపాకాదులను జేయఁగలుగుటయు, ఆవశ్యకములేయైనను గృహిణికమాల్యాలంకారము లైనధర్మములు వీనికంటెభిన్నమైనవనేకములున్నవి.

భార్య యనుసరింపవలసినధర్మము లెన్ని యున్నను, అవి యన్నియు గృహకృత్యములతో సంబంధించినవే కాని యితరములు కావని భార్యా పర్యాయమయినగృహిణీశబ్దమే తెలుపుచున్నది. భార్య గృహమునందు రాణి; గృహకృత్యములను విచారించి పాలించి కుటుంబమును సుఖపెట్టుట యామెకు పరమధర్మము. ఆమె భర్తకు సమస్త సత్కార్యములయందును సహాయురాలుగాను హితబోధకురాలుగాను నుండవలెను; బిడ్డలకు విద్యాబుద్ధులు చెప్పి కాపాడు సన్మాతగా నుండవలెను; దాస దాసీజనములను చక్కఁగా విమర్శించి యెవ్వరిచేత నెట్లు పని చేయింపవలెనో తెలిసిన యుత్తమయజమానురాలుగా నుండవలెను; కుటుంబమున కుత్సాహమును సంతోషమును నాగరికతను వృద్ధిపఱుచు ప్రౌఢురాలుగానుండవలెను. ఇట్టికృత్యములయందు నేర్పుగలభార్యయే భార్యకానియింటిపనికిని భర్తయొక్క యింద్రియసుఖమునకును మాత్రముపయోగపడెడు గృహిణిగృహిణి కాదు. పయిని వివరించిన కృత్యములయందుపరమనిపుణురాలయినభార్య యేగృహమునం దుండునో యాగృహము భూలోకస్వర్గమని చెప్పవచ్చును. ఈగుణములు విద్యాభ్యాసము లేక పట్టుపడ నేరవు. సమస్తవిషయములందును మంచి జ్ఞానమును గలిగించుటకు సాధనమయినదిమాత్రమే విద్యయని చెప్పఁదగినదిగాని యుత్తరములు వ్రాయుటకును చదువుటకును మాత్రము శక్తిగలిగించునదివిద్యయనఁదగినది కాదు. కాఁబట్టి కుటుంబములయందుసంపూర్ణసుఖమును నెమ్మదియుఁ గలిగింపఁ దలఁచినయెడల స్త్రీలకుయుక్తాయుక్తపరిజ్ఞానముఁ గలిగించెడుసద్విద్యనుచెప్పింపవలెను. సద్విద్యాప్రభావమే లేకపోయిన పక్షమున, విద్యావివేక సంపన్నుఁడయినభర్తతో నేకీభవించి భార్యసత్కార్యాచరణము నెట్లు ప్రోత్సాహపఱుపఁ గలుగును? బిడ్డలమనస్సులను నీతిమార్గమునకుఁ ద్రిప్పి వారి నెట్లుగుణవంతులనుగాఁ జేయశక్తురాలగును? తాను ధర్మసూక్ష్మతల

నతిఁగియెల్లన్యాయపథమునప్రవర్తింపఁగలుగును! సత్యమునందును న్యాయమునందును జ్ఞానసంపాదనమునందును తానెల్లగాఢానురాగముకలది కానేర్చును? ఈగుణసౌందర్యములేని శరీరసౌందర్యము స్త్రీకలంకారము కాదు. ఎఱ్ఱనితోలును, సుంద్రనిముఖమును, వస్త్రాభరణములునుతప్ప వేఱుయోగ్యతలు లేని చిత్రప్రతిమవంటిభార్య వివేకియైనభర్తకెవ్వనికి సంతోషజనకముగానుండును? జ్ఞానశోభయు, నీతిభూషణములును, లేని మానవరూప మేరసిన కాష్ఠోదకరముగా తోఁచును? పురుషునకుఁగావలసినది సుఖదుఃఖములయందు సహధర్మచారిణిగానుండి సఖ్యమున కర్హురాలయినపవేకురాలు కానిచూచుకొని సంతోషించుటకయిచిత్రపుబొమ్మవంటిరూపము కాదు; ఆలోచించుటకు శక్తికలదయి, యుక్తాయుక్తతలను గ్రహించి, సత్కార్యావలంబనమునందు ధైర్యసాహసములు కలదయి, హితము చెప్పిదుఃఖములను శాంతిపఱుచుచు, సంతోషమునువృద్ధిపఱుచుచు, సరసవచనములతో చెవులనుదనుపుచు, ధర్మగుణమును స్థిరపఱుచుచు, సదాచరణమును పురికొల్పుచు, దురాచారముల నిరసింపఁజేయుచునుండెడు ప్రాణేశ్వరియనఁదగినభార్య కావలెనుగాని పురుషునకు యంత్రపుబొమ్మవలె కేవలమాడుచు పలుకుచు తిరుగుచు పనులుచేయుచుండెడు రూప మక్కఱలేదు. విద్యామహిమచే మన దేశమునందు భార్య లిట్టియర్హతలు గలవారయ్యెడికాలము శీఘ్రముగానేవచ్చునుగాక! అట్టికాలమేవచ్చినయెడల, అప్పుడు భార్యలు గృహముల కలంకారములుగాను, ఇరుగుపొరుగులవారలకు ప్రాణములుగాను, సుగుణములకు జన్మభూములుగాను, భర్తలకు సుఖదాయకములయినయర్ధాంగములుగాను, బిడ్డలకు నీతివిద్యావినయదాయినులుగాను, చూచువారికికన్నులపండువుగాను, ఉండురుకదా? ఆహా! అటువంటిభాగ్య మీదేశమున కెప్పుడు కలుగునో! బిడ్డలుతల్లులయొడిలోఁ గూరుచుండి యేకేశ్వరుని మహిమల

నెప్పుడు తెలిసికొనుచుందురో! భార్యాభర్తల సరసంగూడుచుండి యైహికాముష్మికవిషయములనుముచ్చటించుచు వారికిహితోపదేశము నెప్పుడుచేయఁగలుగుదురో! అంతటిభాగ్యమీదేశమున కింతటఁగలుగునని తోఁచదు. ఓ కాంతలారా! మీరు బాలికాపాఠశాలలనువిడిచినను చదువునమాత్రము విడువక, తీఱికయైనప్పు డెల్లను మీవిద్యను వృద్ధిచేసికొనుటకు ప్రయత్నింపుడు; కోడండ్రను బాధించుటకు మాఱుగా నాదరించుటకు నేర్చుకొనుడు; బిడ్డలకు తిట్లనునేర్పుటకుబదులుగా జ్ఞాననీతుల నుపదేశించుట కలవాటు చేసికొనుడు. పరులమీది దోషములను ప్రసంగించుటకుమాఱుగా సచ్చరిత్రములను ముచ్చటించుటకభ్యసింపుడు; కలహములాడుటకు బదులుగా నైకమత్యము కుదుర్చుకొనుటకు పాటుపడుడు. సత్కార్యములయందు భర్తలఘూనికకువిఘ్నములు చేయుటకుమాఱుగా నుత్సాహము పుట్టింపఁజూడుడు. అన్నిటికంటెను ముఖ్యముగాసర్వకారుణ్యుఁడయినయీశ్వరునినిరంతరభక్తితాత్పర్యములతో నారాధించుచు నీశ్వరాజ్ఞలను మీఱకుండుటకును భూతదయకలవారయిమానవకోటినెల్ల సోదరవాత్సల్యముతో నాదరించుటకును, ఎన్నికష్టములువచ్చిననునీతిమార్గమునణుమాత్రమునుతొలఁగకుండుటకును నేర్చుకొనుడు.

## అమితత్వము.

(౧౮౯౯ వ సం॥ జూలయి నెల)

———(೦)———

లోకములో సమస్తమయినవానివలనను మనము సుఖమనుభవించుట న్యాయమేయైనను దేనినిమితిమీఱి యనుభవించుటమాత్రముయుక్తము కాదు. అమితముగాననుభవించుటవలన నెంతమంచిదానివలనను తప్పకకీడుకలుగును. కాబట్టి యారోగ్యముకలిగి చిరకాలము సుఖమనుభవింపఁగోరువాడేవిషయములోను అతిమాత్రాను

భవమునకు జూడక ప్రతిసుఖసాధనమును దేశకాలపాత్రములనువిచారించిమితముగాననుభవించుటకు సమస్తవిధములచేతను బ్రయత్నింపవలెను. "అతిసర్వత్రవర్జయేత్" అను సంస్కృతనీతివాక్యము నెల్లవారును పలుకుచూ ఉవిన్యుండవచ్చును. అతిభోజనము, అతిపానము, అతినిద్ర, అతిసంభోగము, మొదలైన మితముతప్పినకార్యము లన్నియు చెఱుపునకే కారణములగును. అన్నాదులు లేక చచ్చెడివారికంటె నన్నాదు లెక్కువయై చచ్చెడివారే ప్రతిదేశమందును లెక్కకెక్కుడుగానుందురు. మనలోనున్న మూఢత్వమునుబట్టి యాహార మెంతయెక్కువతిన్నవంతబలము కలుగునని మన్ర్భమపడుటయేకాక కావలసినదానికంటె నధికముగాఁదిన్నరోగాదికము కలుగునని జనులు తెలియఁజాలకున్నారు. మనకుటుంబములలో స్త్రీలుభోజనము చేయువారు వలదువలదని చేతులడ్డముపెట్టుచున్నను మానక బలవంతముగానన్నమునుపిండివంటలనువడ్డించిపోవుచుండుటయు,భుజించువారు వడ్డించిన పదార్థము విడిచిపెట్టబోవునప్పు డన్నముపరబ్రహ్మస్వరూపమనియు వడ్డించినవానిని పరిహరించుటపాపమనియుఁజెప్పి వారిచేతఁదినునట్లు చేయుచుండుటయు, తమబిడ్డలను కొట్టియుతిట్టియుబలవంతముగావారిచేత తినలేనంతయన్నమునుతినిపించుచుండుటయు, తాము తినలేకతినలేకకడుపునిమురుకొనుచు విస్తళ్ళవద్దతెడవుగాఁగూరుచుండి వెక్కసముగాభుజించుచుండుటయు, ఎల్లవారికి ననుభవసిద్ధమయియుండును. ఇట్లెక్కువ తినుటచేతనే యాజీర్ణము మొదలగు వ్యాధులుపుట్టుటయు ఆరోగ్యముచెడుటయు, మరణములుకూడ కొన్నిసమయములయందు సంభవించుటయు,కలుగుచున్నవి. ఈయనర్థమునకంతకునుమనవారిలో వ్యాపించియున్న మూఢతయేప్రధానకారణము. కాఁబట్టియిట్టిమౌఢ్యము మానునట్లుగాస్త్రీలనువిద్యావతులనుగాఁజేయుట పురుషులకందఱికిని పరమధర్మము. అతిపానముచేత దేహపటుత్వము చెడి, వడఁకు

పుట్టి, బాల్యదశలోనే వార్ధక్యమువచ్చి, అకాలమరణము నొందుచున్న వారిని మనమెందఱిని జూచుచున్నాము కాము? పనిపాటులు లేక యతి నిద్రవలనమాంద్యముప్రవేశించి, అవయవపాటవము తగ్గి, తిన్న అన్నము జీర్ణముగాక సొక్కుచుసోలుచు ముక్కుచుమూలుగుచు సదా వైద్యులకు చేతులు చూపుచుండెడువారెందఱు మన కన్నులకుఁ గానఁబడు చున్నారు కారు? అతిసంభోగమువలన కన్నులు గుంటలుపడి, క్షయవుట్టి జీవచ్ఛవములవలెనయియు, బలమలస్వేచ్ఛగాఁదిరిగిరోగాదికము తెచ్చుకొని యింద్రుఁడు కన్నులవలె దేహమునిండ పెట్టనిభూషణములను తగిలించుకొనియు, బాధపడువారెందఱు నిత్యమును మనకన్నులకువ్యథ చేయుచున్నారు కారు! ఈవిధముగానే సమస్తవిషయములలోను అమితత్వమే సర్వానర్థములకునుమూలమగును. ఈసత్యమును విశదీకరించెడి యొకచిన్నకథ నిందు వివరించుచున్నాము—

పూర్వకాలమునం దొకసారి మృత్యుదేవత తన భృత్యులలో నొకరిని మంత్రిపదము నియ్యఁదలఁచితనపరివారమును రావించిమంత్రిత్వమునకు కెవ్వరర్హులోవారు తమతమసామర్థ్యములనువిన్నవించుకొనవలసినదని సెలవిచ్చెను.

జ్వరము—ఓమహాప్రభూ! మంత్రిస్థానమునకు నేను ముఖ్యార్హుఁడను. నేనుమిక్కిలిస్వామిభక్తికలవాఁడనయి కొంచెమవకాశము దొరకఁగానే జనులనుపట్టుకొని పీల్చిపిప్పి చేసిప్రతిసంవత్సరమును వేలకొలఁదిమనుష్యులను తమసన్నిధానమునకుఁ బంపుకొను చున్నాను.

వాయువునొప్పులు—ప్రధానిత్వమునకు నేనత్యంతార్హుఁడను. కాలుమొదలుకొని తలవఱకును కీలుకీలునుస్వాధీనముతప్పించి నేనపరిమితజనులను తమసాన్నిధ్యమునకుఁ బంపుచున్నాను.

సుఖరోగము—మంత్రిత్వమున కెవ్వరును నాకంటె నర్హులు కారు. నేనెప్పుడును ముదిమిచేత చావునకుసిద్ధముగానున్నవారిజోలికి

పోకవయసు లోనున్నవారివద్ద కేపోయిరక్తము చెఱచి, అవయవములు తినివేసి, అనుదినమును లక్షలకొలఁది పడుచువాండ్రను మీసన్నిధికిఁ బంపుచున్నాను.

దగ్గు, ఉబ్బు మొదలైన సమస్తరోగములును క్రమముగా వచ్చి యీప్రకారముగా తమతమశక్తులనుప్రభువుతో విన్నపముచేసికొని మంత్రిపదమును తమకిమ్మని చెప్పుకొనెను. అప్పు డందఱివిజ్ఞాపనములను మృత్యుదేవత యాలోచించి, అమితత్వమునకు మంత్రిత్వమిచ్చి యీ క్రిందిమాటలు చెప్పి యందఱిని పంపివేసెను.—

ఓజ్వరాది ప్రియభృత్యులారా! జాగరూకులయియుండువారు మిమ్ము శత్రువులనుగాఁజూచి దరికిఁజేరనియ్యరు; చేరినను వైద్యులు మిమ్మొతఱుముగాతరిమివేయుదురు. అమితత్వమో యెల్లవారికిని ప్రాణమిత్రమైయుండును. అమితత్వమునందఱును కోరితెచ్చుకొందురు. అమితత్వము మీవలె చేరఁగానే బాధింపక చేరినవారికి సుఖసంతోషములు కలుగజేయుచునేవారిని చెఱుచును. అంతేకాక యమితత్వమే ముందుగా వారినాశ్రయింపకపోయినపక్షమున, మీకెవ్వరికినిపనియే లేకుండును. మీకందఱికిని పనిగలిగించు మిత్రుడునగుటఁ కాఁబట్టి మంత్రిపదము నొంది మీచేతపనిచేయించుటకై యమితత్వమే యర్హమైనది. కాఁబట్టి మంత్రిపదముదానికిచ్చితిని మీరందఱునన్నుగాంచుడు.

---

దేహమనస్సౌందర్యములు.

[౧౮౮౭ వ సం॥ ఆగష్టు నెల.]

—: ౦ :—

ఉ. సుందరకాయముఁ మొగముసోయగమున్ నునుమేనిచాయనున్
డెందమునందుమెచ్చ నొకటిన్; వినుమీయవి రానురాను దా
మందముఁగోలుపోవుఁ బ్రియునాత్మకు నిత్యముఁ జూచునుంటచే;
సుందరి కందమిచ్చు గుణసుందరతాగరిమంబె యెప్పుడున్.

ప్రేమానుబంధము చిర కాలము నిలిచినను నిలువక పోయినను గూడ శరీర సౌందర్యమును జూచినమాత్రమున భ్రమపడి ప్రేమించుచుండుట యెల్లవారికిని సహజగుణముగానున్నది. అయినను దేహసౌందర్యమును గుణసౌందర్యముతోఁ గూడినపక్షమున, తఱుచుగా స్త్రీలయందుఁగాని పురుషులయందుఁగాని యట్టిరూపవిశేషము కట్టకడపట దుఃఖమునకే కారణమగుచున్నది. చక్కఁదనముగల బిడ్డలనుజూచి సంతోషించుచు వారియందు డెడియతిప్రేమచేత తల్లిదండ్రులుసాధారణముగా వారివిద్యాబుద్ధులవిషయమై యశ్రద్ధచేయుచుందురు. అందఱును మెచ్చుచుండుటచేత సౌందర్యముగలవారికి మొదటినుండియు లోపల నొకవిధమైనగర్వము కలుగుచుండును. తామే చక్కని వారమని గర్వము కలుగుటచే వారెల్లప్పుడును తమసౌందర్యమును పోషించుకొనుటయే ముఖ్యకార్యమనితలఁచి బొట్టుదిద్దుకొనుటలోను తలవెండ్రుకలుదువ్వి మెఱుఁగుపెట్టుటలోను వస్త్రాలంకార ధారణములోను విశేషకాలమునుగడుపుచు మనస్సునకు శోభతెచ్చెడు విషయములయందు నిరాదరులై యుందురు. కాఁబట్టి వారు పెద్దవారయిన కొలఁదిని తామెంతచక్కని వారమని లావణ్యముగలవారమనిశృంగారులమని గర్వపడుచున్నను, రసికజనులతోఁ చక్కఁగా పదిమందిముందు సమయములు మాటాడుటకునుగృహకృత్యములననుకూలముగా నిర్వహించుటకును మనోరంజకములైనట్టియునుపయుక్తములైనట్టియు మఱియేపనులను జేయుటకును బనికిరాక వివేకులదృష్టికిఁ బరిహాస పాత్రులగుచుందురు. మొట్టమొదట దేహసౌందర్యమునకులను వారివంక కాకర్షించినను, కొంతకాలము సహవాసము చేయఁగానే వారిమనస్సులయందు గర్వమును వ్యర్థడంభమునుదప్ప మఱియేవియు లేవని తెలిసికొని వివేకులు వారినివిడిచి దూరముగా తొలఁగుచుందురు. అవివేకులకు సహితము చిరపరిచయముచేత చక్కఁదనమునందున్న మాధుర్యము తగ్గిపోయి

క్రమక్రమముగా కేవల శరీరసౌందర్యమునం దనాదరము కలుగును. అందుచేత నేమన దేశములో వివాహమాడినవారిలో సహితమనేకులు రంభలవంటి తమభార్యలపొందొల్లక కోతులవంటివారితో నైనను వేశ్యలతో సుఖించుచుండుటయు, మన్మథులవంటి తమభర్తలయందను రాగములేక కొండముచ్చులవంటివారితో నైనను బరపురుషులతో సుఖించుచుండుటయు, తటస్థించుచున్నది. ఈయనర్థమంతయు మొట్టమొదట నాఁడారులు కేవలశరీరసౌందర్యమును జూచి గుణాతిశయాదులను పాటింపకపోవుటవలనఁ గలిగినదే కాని వేఱు కాదు. దేహసౌందర్యమువలన నింకొక యనర్థముకూడఁ గలదు. ఎట్టివారలును సుందరిని ముఖమునుదప్ప వేఱుగుణాతిశయము లేని భార్యయందు మగనికి నిత్యపరిచితివలన ననాదరము కలిగిన నుపయి చిన్నెలుచూచి భ్రమించుటయే లోకసామాన్యధర్మమగుటచేత ననేకులకట్టిసుందరియుపేక్షణీయయయి యుండును. అందుచేత ఘాతుకమృగములవంటి నీతిమాలినపురుషులనేకు లింద్రియచాపల్యముగల యట్టియబలలను చెడకుండ సంరక్షించుటకుమాఱుగా గోముఖవ్యాఘ్రములవలెఁ బయికిఁ బరమసాధువులవలెఁ గానవచ్చుచు లోపలఁ గావలసినంత విషమున్నను పయికమృతమొలుకుచుండెడి తియ్యనిమాటలతోఁ దమ యావచ్ఛక్తిని వినియోగించి వారిని తమ వలలోఁ బడవేయ సమస్త ప్రయత్నములను జేయుచుందురు. విద్యావివేకములు లేకపోవుటచేత యుక్తాయుక్తవిచారమునకు సామర్థ్యములేక స్వభావముచేతనే యబలలయియున్న యాసుందరులు మనుష్యరూపములనున్న క్రూరమృగములయొక్క ప్రబలప్రయత్నములకు తఱచుగా లోఁబడి చెడుచుందురు. ఈప్రకారముగానే కేవల శరీరసౌందర్యమునే నమ్ముకొని యున్న పురుషుఁడును విద్యావివేకసంపన్నుఁడు కాకపోవుటచేత నుచితానుచితజ్ఞత లేక దుస్సహవాసములు చేయుచు దుర్వ్యయములు చేయుచు తన కాలమును జూదపానాదు

లైనదుష్కృత్యములయందువిసియోగించుచు లోకోపకారకమైనయే పనికిని బనికిరాక పలుకులచేత మాత్రమాదరింపఁబడుచువివేకులకుఁ బరిహాస పాత్రుఁడయి చెడును. ఇటువంటి పురుషులకును స్త్రీలకును వయసులో నున్నంతకాలముతమతోడిపాటిమిత్రులుండి కాలముసుఖముగానే గడచుచున్నట్లు కానఁబడినను, వయసుజాఱినతరువాతవారికి సుఖసాధనము లేవియులేక యప్పుడు తమదుస్స్థితినిగూర్చిపరితాపపడవలసినవారగుదురు. కాఁబట్టి తల్లిదండ్రులు తమబిడ్డ లెంతచక్కనివారైనను వారిచక్కఁదనమున కతివ్యామోహపడిగారాబముచే విద్యాబుద్ధులవిషయమయియశ్రద్ధచేయక కుమారులకును కుమారికలకును గూడయుక్తసమయములో జ్ఞానమును నీతిని వృద్ధిపఱిచెడు సువిద్యను జెప్పించుచు, ఉపయుక్తములైనగృహకృత్యాదులయందుదిద్దుచు, ప్రవర్తనమునుచక్కఁబఱుచుచు, సాధ్యమయినంతవఱకు సమస్తసద్విషయములలోనుకుశలత గలవారినిగాఁ జేయవలెను. చిన్నతనములోఁ తల్లిదండ్రు లొకవేళఁ దమ పుత్రికాపుత్రుల విద్యాబుద్ధుల విషయమయి శ్రద్ధవహింపకపోయినను, బిడ్డలయినను తెలివితెచ్చుకొని వయస్సును సౌందర్యము నేసమస్తముఁగా నమ్ముకొనక సాధ్యమయినంతవఱకు జ్ఞానమును నీతిని వృద్ధిపఱుచుకొనుచు, సర్వవిధముల యుక్తప్రవర్తనమునకయి ప్రయత్నించుచు. ఉపయుక్తములయిన గృహకృత్యాదులను చక్కఁగానిర్వహించుటకు నేర్చుకొనుచు, సంభాషణాదులయందుమృదుత్వమును రసికతనుజూపుచు, ఎల్లవారికిని హృదయరంజకముగానడుచుకొనఁ బ్రయత్నింపవలెను. అట్లుచేయుటచే భార్యాభర్తలలో ననురాగము చిరపరిచయమువలనతగ్గుటకుమాఱుగాదినదినాభివృద్ధి చెందుచుండును పరులవలన నంతకంతకు గౌరవము కలుగుచుండును; తమ్ము చెఱుపఁ బ్రయత్నించు దుష్టులకవకాశము లేకుండును; మన యీలోకములో ననుభవింపఁదగినంత సుఖము కలుగును; వయసు చెల్లిన తరువాత

పశ్చాత్తాప పడవలసిన యావశ్యకము లేకపోవును. వార్ధక్యమత్యాప్తికిని విచారమునకును హేతువుగాక సుఖదాయకమగును; ఈశ్వరాను గ్రహమునకు యోగ్యత కలుగును. కాబట్టి యీలాభముల నన్నిటిని బట్టి విచారింపఁగా లోకములో గుణసౌందర్యమే మనుష్యుల నలంకరించెడి దివ్యాలంకారముగాని యది లేని వట్టిశరీరసౌందర్య మలంకారముగాదు. యౌవన మస్థిరము; వయసులోనుండి రూపసంపదను జూచి కులుకుచున్నకాలములో సహితము స్ఫోటకాదులువచ్చి దేహమునిండ మచ్చలుపడియు నంగవైకల్యము కలిగియు నిమిషములో సురూపము చెడి వికారరూపము కలుగవచ్చును. కాబట్టి యెల్లవారును రూపము చెడినను చెడని గుణసంపదను గడించుకొనుటకై సర్వవిధముల పాటుపడుచుండవలెను.

## శకునములు.

[౧౮౮౮ వ సం॥ సెప్టెంబరు నెల]

మన దేశమునందనేకులు శకునములయందుమిక్కిలినమ్మకము కలవారైయున్నారు. అట్టివారు సాధారణముగా లేనిపోనిభయము చేత మనస్సునకు సంతోషము లేక నిష్కారణముగాసుఖమునకుదూరులగుచున్నారు. రాత్రివేళ కడుపుగొప్పివచ్చియెప్పుడైన కుక్కయొకటి వీధిలో తమయింటి సమీపమునందేడ్చుట సంభవించిన పక్షమున, శకునములయందు నమ్మకమున్నవారు తామారాత్రియంతయు నిద్రపోవక పరితపించుటయే కాక, అందువలన తమకేమోకీడుమూడునని బహుదినములవఱకునుగూడ బెంగపెట్టుకొని మనోవ్యథ పడుచుందురు; రాత్రి వేళ నొకగుడ్లగూబగాని, తీతువుగాని కూసినపక్షమున తమ కనిష్టసూచకమని యెంచుకొనితమయింట నెవ్వరో చచ్చిపోదు

రని ముందుగానే యేడ్చుచుందురు. అట్టివారికి బల్లిపాటువల్లను, పక్షికూఁతవల్లను, తుదకు బంధువులైనవితంతువుల యెదురుపాటువల్లను, మితిలేనిభయము కలుగుచుండును. "అందఱకునుశకునములు చెప్పెడు బల్లి కుడితికుండలోఁ బడ్డద" న్న లోకోక్తిని వారు తలఁచుకొనరు కాఁబోలును! ఆహా! ఏమియీమూర్ఖత! సహోదరుఁడుకూడ కార్యము మీఁద వీధిలోనికిఁ బోవలసివచ్చినప్పుడు వితంతువైన తనతోఁబుట్టు వెదురుగా వచ్చినను పెద్దపులియెదురైనప్పటికంటెను నెక్కుడుభీతి నొందుచున్నాఁడుగదా! ఇట్టిసమయములయందు తామాదరింపవలసిన భర్తృవిహీనలైన తోఁబుట్టువులు మొదలైనవారిని దుర్భాషలాడి మానుషస్వభావమును మఱచియున్నవారినిమన మెందఱినిజూచుచున్నాము కాము? ఈ దేశమునందిట్టిమూర్ఖతాపిశాచముయొక్క నిరంకుశప్రభుత్వ మింకను నెంతకాలముండునో! విద్యాదేవత తనసైజ తేజముతోఁ బోయి యంధకారబంధురములై యున్న కుటుంబ స్త్రీల హృదయములయందుఁ బ్రవేశించి చీఁకటిలోఁ రాజ్యము చేయుచున్న మూర్ఖతాపిశాచముయొక్క స్థానమును కదల్చినంగాని యది మన దేశమును విడిచిపెట్టుటకు ప్రయత్నింపదు. కాఁబట్టి బుద్ధిమంతులయిన వారు సాధ్యమైనంతవఱకు స్త్రీలలోను సామాన్యజనులలోను విద్యయభివృద్ధియగుటకు తగినప్రయత్నముల నన్నిటిచేయవలెను. మనుష్యులకుఁ దెలియరానిశుభాశుభములను నక్కలును, కుక్కలును, కాకములును, ఘూకములును దెలుపుననుకొనుటకంటె మూర్ఖత వేఱుండునా? జనులలోనుండెడియీమూర్ఖత్వమును బుద్ధిహీనతను గనిపెట్టియేకదా వంచకులైనవారు దుశ్శకునములవలని దుష్ఫలములనుబోఁగొట్టుదుమని, అనేకతంత్రములుపన్ని తెలియనివారివలననేకవిధములుగా మోసముచేసి ధనమునార్జించుచున్నారు. శకునములను నమ్మెడి యవివేకమును దెలిపెడికథల నొకటిరెండింటినిక్కడ చెప్పుచున్నాను.

ఒక యజమానుఁడు నిద్రలేవఁగానే రెండుకాకులను జూచిన యెడల మేలుకలుగునని విని, తన సేవకుని బిలిచి ప్రాతఃకాలమున రెండు కాకులు జంటగా కూరుచున్న పక్షమున వెంటనేవచ్చి తన్ను లేపవలసినదని యుత్తరువు చేసెను. నాఁటనుండియు భృత్యుఁడు తన యజమానుని సంతోషపెట్టెడు సమయ మెప్పుడు వచ్చునాయని ప్రతి దినమును నిరీక్షించుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు ప్రాతఃకాలమున వసారాలో పరుండి కన్నులు తెఱచి చూచునప్పటికి నిద్రలేవఁగానే కన్నులయెదుర చెట్టుమీఁద రెండు కాకులు జంటగా నాసేవకునకుఁ గానఁబడెను. అప్పుడు వాఁడు మంచిశకునమయినదని సంతోషించి, యజమానుని వెంటనే లేపి యాకాకులను జూపినయెడలఁ దనకు మంచిబహుమానము దొరకునన్న యాసతో పరుగెత్తుకొనిపోయి యాతనిని లేపి తీసికొనివచ్చెను. ఇంతలో చెట్టుమీఁదనున్న రెండు కాకులలోనొకటి యెగిరిపోఁగా యజమానుఁ డొక్కకాకినిమాత్రమే చూచి రెండుకాకులుండఁగా లేపనందునకయి యాసేవకుని దిట్టముగా గొట్టెను. సేవకుఁడా దెబ్బలతో బుద్ధితెచ్చుకొని, యజమానివంకఁ దిరిగి, ''అయ్యా! నేను నేఁడు నిద్రలేవఁగానే మొట్టమొదట చెట్టు మీఁద రెండుకాకులను జంటగాఁనుండఁగాఁ జూచితిని. ఆమంచిశకునమయినందుకు ఫలముగా నాకిప్పుడే దేహమునిండ కావలసినన్ని దెబ్బలు తగిలినవి. మీరపేక్షించిన యామంచిశకునము నాకువలెనే తమకును నేఁటియుదయకాలమున గలిగియుండినపక్షమున, నాకిప్పుడు లభించిన ఫలమే తమకును పూర్ణముగాలభించియుండు నేమోయని సందేహమగుచున్నది''అనెను. ఆమాటలకు సిగ్గుపడి యజమానుఁడు తెలివి తెచ్చుకొని నాఁటినుండి శకునములయందలివిశ్వాసముమానుకొనెను.

ఒకరాజొకనాఁడు ప్రాతఃకాలమున నిద్రలేచి కిటికీసందులో తలదూరిచి వీధిలోనికిఁజూచెను. అప్పుడొకయురుగుమీఁద తనవంకఁ

దిరిగి కన్నులు నలువుకొనుచునిద్రమత్తుతోనిలుచున్న యొకశూద్రుఁ డారాజున కగపడెను. అప్పుడే నిద్రలేచి కన్నులు నలువుకొనుచున్న యాశూద్రునకును మొట్టమొదట మేడమీఁది కిటికిసందులోనుండి పయికిఁ బెట్టిన యారాజుముఖమే కానఁబడెను. అంతటరాజుకిటికిసందు లోనుండు తనతలను పయికిఁదీసికొను నప్పుడు గుమ్మము నె త్తికితగిలి నెత్తురువచ్చి తలబొప్పికట్టెను. అప్పుడారాజుతనతలకు దెబ్బతగులుట కాశూద్రుఁడే కారణమనియెంచుకొని, ఒకనాఁడు వాని మొగముచూచిన నాకేయింతయుపాయకరమయిన దెబ్బ తగిలినప్పుడుప్రతిదినమును వానిమొగముచూచుచుండువారి కెందఱి కెన్నియాపదలు వచ్చుచుండునో యని యూహించి, వానినిబట్టుకొనిపోయి శిరశ్ఛేదముచేయుఁడని రాజభటుల కాజ్ఞాపించెను. రాజభటులు వానినిబట్టుకొని వధ్యస్థానమునకుఁ దీసికొనిపోవుచు, ప్రొద్దుననే లేచి రాజుగారునీమొగము చూచుటచేత రాజుగారికిదెబ్బతగిలినందునకయి నీకీదండనమువిధింపఁబడెనని వానితోఁ జెప్పిరి. వాఁడు తన్నుఁ జంపుటకుముం దొకసారి రాజుగారిదర్శనము చేయింపుఁడని వారినిబహువిధముల వేఁడుకోఁగా, వారాప్రార్థనను రాజుగారికి విన్నవించి, రాజానుమతిమీఁదరాజభటులు వానిని రాజసన్నిధికిఁ దీసికొనిపోయి నిలువఁబెట్టిరి. అప్పుడువాఁడు చావునకు తెగించియున్నవాఁడుగాన భయపడక సాహసముచేసి, "ఓ మహాప్రభూ! దేవరవారు నేఁటియుదయమున నే లేచి నాపాపముఖమును జూచితిరి. అందుచేత దేవరవారిదివ్యశిరస్సునకు దెబ్బతగిలినది. ఈపనికిమాలిన సేవకుఁడును నేఁటియుదయమున ముందుగా నేలినవారి పుణ్యముఖమునే సందర్శించెను. అందుచేత నాపాడుశిరస్సు శరీరమునుండి వేఱగుచున్నది. ఒకసారి నాముఖము చూచినమాత్రనే దెబ్బ తగిలినప్పుడు నిత్యమును జూచుచుండువారి కెంత యుపాయకరముగా నుండునో యని ప్రభువువారికి సందేహముకలిగినట్లే నాకును దేవర

వారిదివ్యముఖసందర్శనలాభ మొక్కసారి లభించిన మాత్రముననే శిరశ్ఛేదము కలుగుచుండఁగా నిత్యమును లభించెడువారి కేమికలుగు నోయని సంశయము కలుగుచున్నది. సర్వజ్ఞులయిన దేవరవారు నాసంశయ నివారణముచేసి నాశిరశ్ఛేదము చేయింపుఁడు'' అని పలికెను. రాజు వాఁడు చెప్పినదానిని విని సిగ్గుపడి బుద్ధితెచ్చుకొని యప్పటి నుండి వివేకము గలవాఁడయి శకునములు మొదలయినవి నమ్మక ప్రవర్తించుచుండెను.

కాఁబట్టి బుద్ధిమంతులయినవారుశకునములని వెఱ్ఱిభ్రమ పడక గౌళిపలుకులవలనఁగాని కూబకూఁతవలనఁగాని యిటువంటి మఱియే శకునములవలనఁగాని కీడు మేళ్ళు కలుగునని యెంచక, నిర్భయముగా ప్రవర్తింపవలెను. ఒకానొకప్పుడు దుశ్శకునమయినప్పుడు కీడును, మంచి శకునమయినప్పుడు మేలును నిజముగానే సంభవించినను, వాని కవి కారణములు కావనియు కాకతాళీయముగా సంభవించియుండుననియు తెలిసికొని వివేకియయి మెలఁగవలయును. శకునములయందునమ్మకము గలవారికి దుశ్శకునములైనప్పుడు వానివలన నిజముగా కీడేమియు కలుగక పోయినను ముందేమో కీడువచ్చునన్న భీతిచేత వారిమనస్సులకు నిష్కారణముగా నొప్పికలుగుచుండును. ఒకవేళ వారి మనస్సులలోనున్న భయముచేత రోగాదికము వచ్చినను రావచ్చును.

## అగ్ని పర్వతములు.



[ ॥

ఈప్రపంచమునం దగ్నిపర్వతము లనేకములు గలవు. పూర్వకాలమునందు కృష్ణామండలములోని బొజ్జలకొండ యొక యగ్నిపర్వతముగా నుండెనని చెప్పుదురు గాని యిప్పుడు దానిచిహ్నములు లేవియుఁ గానఁబడవు. ఈశ్వరానుగ్రహమువలన మనహిందూదేశమునం దుపద్రవకరము లయిన యగ్నిపర్వతము లేవియు లేవు. అందుచేత నిచ్చటిజను లగ్నిపర్వతములని వినుటయే కాని చూచియుండరు. గోళాకారమయినయీభూమియొక్క లోపలిభాగ మగ్నిమయమయి యున్నదని ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. భూమిలోపలనున్న యగ్నిహోత్రమును మనము ప్రత్యక్షముగా చూడకపోయినను, అగ్నిపర్వతములనుబట్టి భూమియొక్క యంతరాళమునం దగ్నియున్నదని నిశ్చయముగాఁ దెలిసికోఁగలము. భూమియొక్క మధ్యభాగమునందు రాళ్ళతోను లోహములతోను గలిసి యగ్నియుండును. ఆ యగ్నిచుట్టును

పెక్కుక్రోసులువరకును రాతిబండలు వ్యాపించి యుండును. ఆరాతి బండలపయిని మన్ను మొదలయినవి చేరి భూమికి పయికప్పుగా నుండును. రాతిబండలు మొదలయినవానిలోనుండిలోపలనున్నయగ్ని యొక్క వేడిమిక్రమక్రమముగాపయికిబికివెట్టకలుగుచుండును. భూమి త్రవ్వినకొలఁదిని లోపలవెట్టయధికమగుచుండును. పయినిచల్లగానున్న నేలయందుమోకాలిలోతు గొయ్యిత్రవ్వి దానియడుగుననున్నమంటి నంటిచూచినయెడల, ఆమన్ను పయిమంటికంటె వెచ్చగానుండును. ఆ గోతినే మఱింతలోతుగా త్రవ్విన పక్షమున,అడుగునకుపోయినకొలఁ దిని మన్నుయొక్క వేఁడిమి యధికమగుచుండును,నూతులనుగానిగను లనుగాని మిక్కిలిలోతుగా త్రవ్వినప్పుడుడక్కడనున్నజలమువాయువు మొదలయినవి మిక్కిలవెచ్చగానుండును. మననూతులలోనినీరు వెచ్చగా నుండుటకు భూమిలోని వేఁడిమియే కారణము. ఈవఱకు మిక్కిలి లోతుగా త్రవ్వబడిన గనులుసయిత మొక్కమయిలులోతయినపూర్ణముగానుండవు. మంచెస్టరునగరమునకు సమీపమున ౨౧౫౧ అడుగుల లోతువఱకును త్రవ్వినబొగ్గులగనియొక్కయడుగుభాగమునందు పయిని భూమిమీఁదనుండు దానికంటె ౨౮ భాగములు వేడియధికముగా నుండెను. ఈవఱకుఁ జేసిన పరీక్షలనుబట్టి శోధింపఁగా భూమిలోపల వేఁడిమి యఱువదియడుగులకొక్క భాగముచొప్పున హెచ్చుచున్నట్లు తేలినది. ఈలెక్కనుబట్టిచూడఁగా ౨౮ మయిళ్ళలోతుననున్నజలము కొలిమిలోనీరుగాకరఁగఁబడినబంగారమంత వేఁడిగానుండును. దీనినిబట్టి విచారింపఁగాభూమియొక్క మధ్యభాగమంతయునగ్నిమయమయియుందున్న పదార్థములన్నియు కరఁగి యావిరిరూపమున జలరూపముగను నుండునుగాని ఘనపదార్థములుగా నుండవనిస్పష్టమగుచున్నది. భూమి లోపలనగ్ని యున్నదనుటకు వేఁడినీళ్ళబుగ్గలును భూకంపములును గూడ నిదర్శనలుముగానున్నవి. కుండలో పాలు మొదలగునవి పోసి మంట

పెట్టినయెడల కాకచేత పాలు మొదలయినవి పొంగుచుండుట యెల్ల వారును జూచియుందురు. ఆప్రకారముగానే యంతరగ్నిచేత భూమి లోనిజలము పొంగి కొన్నిస్థలములలో భూమిలోని సందులగుండ బహు దూరము లేచి సంతతధారగాపడు చుండుటను నేకులు వినియుందురు. అట్టి వేడినీరుగోదావరిమండలమునందు భద్రాచలమునకుబోవుమార్గములో నొకచోటకొంతవఱకుపయికిపొంగుచుండుటయు, జనులు వానిని "ఉష్ణ గుండములు" అనిపిలుచు చుండుటయు, పలువు రెఱిఁగియుందురు. ఇట్టువంటి యుష్ణధారలు ఉత్తర మహాసముద్రమునందలియొకద్వీపము నందు మిక్కిలి వేఁడిమిగలవై రెండువందలయడుగులయెత్తువఱకును లేచిపడుచుండును. అంతేకాక పాలకుండమీఁదఁగాని నీటికుండమీఁదఁ గాని మూతపెట్టి క్రింద మంటపెట్టినచో లోపలిజలము యావిరిరూపమును వహించిపయికిలేచు చుండుటయు, దానిమూలమున పయిమూతకదలు చుండుటయు, అనేకులు కనిపెట్టి యుండవచ్చును. ఈవిధముగానే భూమిలోపల కరఁగి పొంగుచుండెడు పదార్థములమూలమున భూమి కొన్నిస్థలములయందు కదలు చుండుటయుఁ గలదు. అట్టి కదలికకు భూకంపమని పేరు. భూకంపములు సాధారణముగానగ్నిపర్వతములున్న దేశములలో నగ్నిపర్వతములనుండి నిప్పులు మొదలయినవి పయికి లేచుటకు ముందుగా కలుగుచుండును. హిందూదేశము యొక్క యుత్తరభాగమునం దల్పములయిన భూకంపములప్పుడప్పుడు కలుగు చున్నను, భరతఖండమునందు గొప్ప భూకంపము లంతగా లేవు. డెబ్బదిసంవత్సరముల క్రిందట భరతఖండమునందలి కచ్చిదేశములో నొక గొప్ప భూకంపము గలిగి, ఏడామడల దూరమువఱకును పది యడుగులయెత్తున భూమి పయికి లేచుటయే కాక కొంత భాగము క్రిందికిదిగిపోవుటవల్లకచ్చిసింధుశాఖ యేర్పడివిస్తారదేశముపట్టుగామా ఱిపోయినది. కొన్నిసమయములయందుభూకంపములవలనభూమి కొంత

వఱకు పగిలి పట్టణములు మొదలయినవి పూడిపోయి వేలకొలదిజనులు చచ్చుటయుఁ గలదు.

కడవలో సలసలలాడుచు కాగెడునీరు చిల్లులగుండ పైకి వెడలి పోవునట్లే, భూమధ్యమునందు కరఁగి ద్రవరూపమున సలసలలాడుచు పొంగుచుండెడు లోహాదులును భూమిలో నుండెడిమార్గములగుండ గొప్పధ్వనితో బుస్సున పైకిలేచుచుండును. ఇట్లు కరఁగినద్రవపదార్థములు పైకిలేచెడుమార్గములకే యగ్నిపర్వతములని పేరు. పైకి లేచెడియీపదార్థ వేగమువలన భూమియొక్క పైభాగమునకు సమీపమున నుండెడుగొప్పరాళ్లుసహిత మొక్కొకసమయమునందు తొమ్మిది మైళ్ళ దూరమువఱకును పోయిపడినవి. ఆవిరి, దుమ్ము మొదలైన పదార్థములు వందలకొలఁది మైళ్ళవఱకును లేచి పట్టపగలుకూడ ఆకాశమును అంధకారబంధురముగాఁ జేయును. రాళ్ళుదుమ్ము మొదలైనవి మాత్రమే కాక యగ్నిపర్వతములప్రక్కలనుండిలోపలినుండి కరఁగివచ్చిన మృత్పాషాణాదులప్రవాహము బహుయోజనముల దూరమువఱకును ప్రవహించి దారిలోనున్న వృక్షాదిసమస్తపదార్థములను కాల్చి భస్మము చేయుచు. నేపుల్సుదేశమునందు పదునెన్మిది వందల సంవత్సరములక్రిందట నొకయగ్నిపర్వత మాకస్మికముగా పగిలి దానిలోనుండియుష్ణమొదలైనవి పైకిలేచినవి. అప్పుడాపర్వత సమీపమునఁ గట్టఁబడిన రెండుపట్టణములుజాడలేకుండ పూడిపోవుటయే కాక, చుట్టునున్న దేశముకూడ నానవాలుపట్టుటకు వీలులేకుండ మాఱిపోయినది. రాళ్ళుపడుటచేతను, దుమ్ముకప్పుకొనుట చేతను, అపరిమితజనులు మృతులైరి. ఆవఱకెంతో మనోహరముగ నుండిన ఫలవంతమైన దేశమంతయు కొన్నిదినములలో పాడుపడిపోయి రాళ్ళకుప్పలతోను భస్మరాసులతోను నిండినయెడారియైనది. అటుతరువాత పదునేనువందలసంవత్సరముల కాపర్వతప్రాంతమున

త్రవ్వుచుండఁగా నాశనమైపూడిపోయిన రెండునగరములలో నొకటగు పాంపేపురము బయలపడినది. కప్పులేని మొండిగోడలుగల యాపట్టణము యొక్క పూర్వపువీధులగుండ మనుష్యులిప్పుడు సహితము నడవవచ్చును.

## ఆ భ ర ణ ము లు.

[౧౮౮౭ వ సం॥ అక్టోబరు నెల]

స్త్రీలకు విద్యయును, వినయాదిసద్గుణములును, అలంకారములుగాని, అవిలేనిలోహమయములును మణిఖచితములునయిన నగలలంకారములు కావు. శరీరమునిండ తగిలించుకొన్న వెండిబంగారపునగలు తెలిసినవారిమనస్సులకు తమ్ముధరించుకొన్నవారియజ్ఞతను దప్పమఱి దేనిని చాటవు. లోహపునగలవలన నిజమైనగొప్పతనమేమియు రాదు. దొరతనమువారు నేరములు చేసినవారి కాళ్ళకుమాత్రము సంకిళ్ళను పేరుగల లోహపుకడియములను వేసెదరు. మూఢురాండ్రైనస్త్రీలో తమకుతిండి లేకపోయినను, బిడ్డలవిద్యకు లేకపోయినను, మఱి దేనికి లేకపోయినను విచారింపక భర్తలను బాధించి వారిచేత అకార్యములను సహితము చేయించి వారిని ఋణములపాలు చేసి తమ కాళ్ళకును వ్రేళ్ళకును కరములకును శిరములకును మెడలకును నడుములకును సర్వాంగములకును సంకిళ్ళవలె గొలుసులు మొదలైనవి తగిలించుకొందురు. ఇట్టినగలు పెట్టుకున్నవారినిజూచి వారివంటిమూఢులు సంతోషించినను వివేకముగలవారిదృష్టియందు వారు పరిహాసపాత్రురాండ్రుగాక పోరు. సింహమునకుఁగల స్వాభావిక తేజము కుక్కకు వేయినగలు పెట్టినను రాదు. సౌందర్యముగలవారికి నగలక్కర లేకయే వారిసౌందర్యము ప్రకాశించును; నగలవలన వారిసౌందర్యము మఱుగుపడినను పడును,

సౌందర్యము లేనివారికి లక్షనగలుపెట్టినను క్రొత్త సౌందర్యము రాదు. నగలవలన వానియంగవికారము హెచ్చయినను కావచ్చును. లోక ములో నెమలికందము తెచ్చుటకయి దానికి రంగులు వేయవలెనా? మూఢు లొకవేళ రంగులు వేసినను, ఆరంగులవలనదాని సౌందర్యము చెడునుగాని వృద్ధియగునా? కాకికిరంగులు వేసినను నెమలితో సమాన మగునా? ఇట్టిపై వేషములవలన నేమియుప్రయోజనములేదు. స్త్రీలకు విద్యయును సుగుణములునుమాత్రమే గౌరవమునుదెచ్చెడి యలంకార ములు. అటుపిమ్మట దేహారోగ్యముగలిగి గుణవంతులయియున్నబిడ్డ లు గొప్పయలంకారములు. పూర్వ మొకధనికురాలయిన స్త్రీ తన దేహమునిండ రత్నాభరణములనుధరించుకొని తనకునగలున్నవన్న గర్వములో నొకబీదస్త్రీని జూచి నీకేలనగలులేవని యడి గెను. ఆబీదస్త్రీ తన్నుమెనగలులేవని పరిహసించుచున్నదని తెలిసి కొనియుచింతనొందక, నాకునీకున్న వానికంటె మంచినగలుకలవుచూపె దను తాళుమని లోపలికిబోయి యాడుకొనుచున్న తనకొడుకును గూతునను దెచ్చి చూపెను. అప్పుడాధనికురాలు సిగ్గుపడి తలవంచు కొనెను.

లోహమయములయిన యాభరణములు శరీరమునకు నిజమ యినయలంకారములు కాకపోయినను, మూఢులునగలుగలవానినిధన ముగలవానినిజూచి యాదరించి గౌరవింతురు. కన్నతల్లిదండ్రులుసహి తముతమబిడ్డలలో ధనహీనులకంటె ధనికులనెక్కువగా నాదరింతురు. అది యెంతయుకానిపని. పూర్వకాలమునం దొకస్త్రీకికొమార్తెలు పలువురుండిరి. వారిలోనొక్కతె తక్కినవారికంటె పేదదిగానుండెను. అందుచేతల్లి యాపేదకొమార్తెనుదానిమగనిని తిన్నగానాదరింపక తక్కినయల్లుండ్రకును కొమార్తెలకును పీటలు వేసి కూరుచుండబెట్టి భోజనములుపెట్టిగౌరవించి, వీరికిపీటలువేసిగౌరవింపక యనాదరము

చేసెను. ఈబీదచిన్నది బంగారుభూషణములు లేకపోయినను సుగుణ భూషణములుకలదిగనుక, తల్లిమీఁద నెంతమాత్రమును కోపపడక భర్తతో పుట్టినింట కొన్నిదినములుండి తరువాత భర్తయింటికి వెళ్లెను. అటుతరువాతకొంత కాలమునకామె భర్తకు గొప్పయుద్యోగమయినందున, వారును గొప్పవారయి నగలు మొదలయినవి సంపాదించుకొని గొప్పతనమును పొందిరి. ఇట్లు కొంత కాల మున్నతరువాత నొకనాఁ డామెతనభర్తతోఁగలిసిమరలపుట్టినింటికిఁబోయెను. అప్పుడామెతల్లి కూఁతురు వచ్చుచున్నదనివిని యెదురుగాపోయి తీసికొనివచ్చి సమస్త గౌరవములను జేసిపిండివంటలు మొదలయినవి చేసెను. పెద్దవిస్తరివేసి విస్తరినిండ బహువిధము లయినకూరలును, పిండివంటలును వడ్డించి పెద్దపీటవేసి తల్లికొమార్తెను కూర్చుండుమని పిలిచెను. అప్పుడామె తల్లిని దగ్గఱకూర్చుండఁబెట్టి, తనశరీరముననున్న నగల నొక్కటొకటి నేతీసిపీటమీఁదఁబెట్టివిస్తరిలోవడ్డించినయుత్తమపదార్థములను వానికి నివేదనచేయుచు, "ఓయుంగరములారా! మీరు బూరెలనుభక్షింపుఁడు. ఓచంద్రహారములారా! మీరు గారెలనుతినుఁడు. ఓకంకణములారా! మీరుపరమాన్నమునుతినుఁడు." అని పేరుపేరువరుసలచెప్పి తానుక్రింద కూరుచుండితనకుసామాన్యమైనయన్నమునుపప్పునుమజ్జిగయువడ్డింపుమని తల్లినడిగెను. అదియేమని తల్లియడిగెను. అందు కామె "మనే మీయమ్మనుపటికొమార్తెనే కాని క్రొత్తదానను గాను. ఇప్పుడు క్రొత్తగా వచ్చినవీనగలు మాత్రమే. ఈనగలమూలముననే మీరీదినమున నిన్ని పిండివంటలు చేసితిరిగాన, అవియన్నియువానివే కాని నావి కావు. నగలు లేక యీప్రకారముగా నున్నప్పుడు న నెట్లాదరముచేసితిరో యిప్పుడును నా కాయాదరమునే చేసి, అప్పుడు పెట్టుచువచ్చినభోజనమునే యిప్పుడును పెట్టుఁడు నాకదే పరమసమ్మతము" అని పలికెను, తల్లి యామాటలకు సిగ్గుపడి తలవంచుకొని యూరకుండెను, ఈప్రకారము

గానే ధనవంతుల ధనమువలన తమ కేమియు లాభము లేకపోయినను వారి ధనమును జూచి వారికి విందులు చేయుచు, ఆదరింపవలసిన బీదల కాపత్సమయమునం దైన నన్నము పెట్టక యనాదరించుచుందురు. అట్టి వారి కథనువిని బుద్ధి తెచ్చుకోవచ్చును. వినయమును, శాంతతయు, భూతదయయును, ఈశ్వరభక్తియును, భర్త్రనురాగమును స్త్రీలకు ముఖ్యాలంకారములుగాని తుచ్ఛములయిన లోహములును రాళ్ళును గావు. స్వర్ణాలంకారములు నిమిషములో నశించును; వినయాదులు దేహము నశించిన తరువాతను స్థిరముగానుండును. వెండి బంగారు నగలవలన నొకప్పుడు ప్రాణమానములకు భంగముకూడ కలుగును; వినయాదులయిన గుణాలంకారములవలన ప్రాణమానములకు రక్షణము కలుగును. కాబట్టి వివేకురాండ్రెప్పుడును గుణాలంకారములకై ప్రయత్నము చేయుచుండవలెను. కలిగినవారు తగుమాత్రపు నగలు పెట్టుకొన్నను పెట్టుకొనవచ్చునుగాని యెరువులు తెచ్చుకొనియు ఋణములు చేసియు నగలు పెట్టుకొనుటకంటె బుద్ధిహీనత వేఱు లేదు. ఎరువుల సొమ్ము లెప్పుడును బరువులచేటే కదా!

## జీవ కారుణ్యము.

[౧౮౯౨ వ సం॥ నవంబరు నెల.]

ఈశ్వరారాధనము చేయుట యెల్లవారికి ధర్మమెట్లగునో యట్లే సమస్తజనులకును జీవకారుణ్యము గూడ పరమధర్మమయి యున్నది. ఈశ్వరసద్భావమునందు నమ్మకము లేని నాస్తికులవంటి వారు సహితము జీవకారుణ్య మవశ్యముగా నుండవలసినదని యే బోధించుచున్నారు. మనకు జీవకారుణ్య మున్నందుకు ఫలములుగా మనమాలమునలోక

మునకు కలుగవలసినది యుపకారశూన్యత్వమును సాధుజనోపకారమును, కాఁబట్టి మన మొకవేళ నెల్లవారికిని నుపకారము చేయశక్తులము కాకపోయినను, ఎవ్వారికినుపకారమునైనను జేయుచుండవలెను. జ్ఞానహీనులకు జ్ఞానదానమువలనను, ఆపన్నులకు దుఃఖశాంతి చేయుటవలనను, రోగపీడితుల కౌషధాదు లిప్పించుటవలనను, స్వకోపమువలనఁగాక ముదిమివలనను వ్యాధులవలనను శోకబాధలు మొదలయినవానివలనను బీదతనమువలన బాధనొందినవారి కన్నవస్త్రాదు లిచ్చుటవలనను, లోకులకు మనము చేయవలసిన యుపకారము లనేకవిధములయియుండును. కాఁబట్టి మానవదేహమును ధరించినవారందఱును శక్తివంచనలేక యావచ్ఛక్యమయినప్పుడెల్ల లోకమున కేదో చేతనయిన యుపకారము చేయుచుండవలెను. పెట్టెలలో కావలసినంతధనమును దేహములనిండ మోయలేనన్నినగలను ఉన్నను సహితము నేకులు కాటకపుదినములయందైనను నొక్కబీదవానికి పట్టెడన్నమును పెట్టనిపాపమునఁ బోవకున్నవారిని మన మెఱుఁగుదుము. అట్టిలోభులధనములు నిరర్థకములు. వేయికుటుంబము లన్నములేక బాధపడుచుండఁగా, వేయికుటుంబములయన్నమును జేర్చి యొక్కయబల వెండిబంగారునగల రూపమున తనశరీరముమీఁద వేసికొని మోయలేక తిరుగుచు నలుఁగుచుండుటవలన నేమియాధిక్యము వచ్చును? బంగారపునగ లెన్నయినను స్త్రీకొక్క పరోపకార మనెడుదివ్యాభరణముతో సమానమగునా? ఈశ్వరుఁడు మనయందు దయగలవాఁడయి భూమిసస్యాదు లిచ్చునట్లును పంచభూతములును సమస్తసౌఖ్యముల నిచ్చునట్లును జేసి నిరంతరమును మనకు మహోపకారము చేయుచున్నప్పుడు మన మాతనిచేత సృజింపఁబడిన మనతోడిమానవులు కష్టపడుచుండఁగాఁ జూచి యుపకారము చేయకుండుట న్యాయమగునా? పరోపకారమువలన లభించుపుణ్యము మాత్రమే మనమీలోకమునందలిసుఖదాయకములయినసమస్తపదా

గ్రములనువిడిచిపోయినతరువాత పరలోకసుఖమునకనుకూల మయిన యమూల్యధనముగా నుండును.

ఇట్లు పరోపకార మందరికిని ధర్మమయినందునజనులుపరస్పరోపకారమువలన నెజగత్తునందునిజమయినసుఖమునుపొందుదురుగాని యుపకారశూన్యత్వమువలన నెవ్వరునుసుఖపడరు. మానవహృదయములు పరులవిషయమయి ప్రేమచూపుటకును పరులవలన ప్రేమను పొందుటకునుసృజింపఁబడినందున, ఆరెండునుగలిగియున్నప్పుడు మాత్రమే యవి లోకములో నిష్కళంకమయిన యానందమును పొందును. పరులనుప్రేమించివారివలనప్రేమనుపొందనివారికి సత్యమయినహృదయానందము గలుగదు. మనములోకమునుప్రేమింపనియెడలమనలను మాత్రములోకమెట్లుప్రేమించును? మనమితరులయెడలదయగలవారమయి స్నేహమును జూపుచుండెడుపక్షమున, వారుమనయెడల దయగలవారయిమనమీఁదస్నేహమునుచూపకుండఁజాలరు. ఇతరులయెడల దయగలిగి యుండవలెననిజాతిమతాదులవలనఁగలిగినదురాచారముల ననుసరించివారియనుగ్రహమునకుపాత్రులమగుటకయిమనమెన్నఁడును ప్రయత్నపడఁగూడదు. మనముసదాసత్యమునే గ్రహించుచు జనుల దురాచారముల ననుసరింపక యీశ్వరప్రీతినిపొందుటకయిమాత్రమే ప్రయత్నించుచు వచ్చినపక్షమున, మన మంచితనమువలననుపరిశుద్ధచింతనలనను కాలక్రమమున మనలను మొదట ద్వేషించువారుసహితముకడపటప్రేమించువారయిమిత్రులగుదురు. లోకమునకంతకునుపకారముచేయుటయొక్కని కెవ్వనికిని సాధ్యముకాదు గనుక, మనము మొట్టమొదట నిరుగుపొరుగులవారినిబంధువులనుప్రేమించుటకు నేర్చుకొనవలయును. వారిని ప్రేమించుటకు గురుతుగా వారి మనస్సులకు నిష్కారణముగానొప్పికలిగించెడుపనులను మనమెప్పుడునుచేయకుండవలెను. మనపశువులుమొదలయినవివారితోఁటలలోను దొడ్లలోనుపడి

పై రులనుపువ్వులశాల్లను మేయకుండులాగునను, మనబిడ్డలు మొద లైనవారు వారిబిడ్డలు మొదలైనవారితోపోట్లాడి తొందరకలుగం జేయకుండులాగునను, చేయవలెను; మనమెప్పుడునువారితోజగడము లాడక వారియాపత్తునుమనయాపత్తుగాజూచుచు వారికిచేతనైనంత సాయమును జేయుచుండవలెను. అన్నిటికంటెను ముఖ్యముగావారిని మంచిమార్గమునందు నడిపించుటకై సమస్తప్రయత్నములును జేయు చుండవలెను. ఈప్రకారముగా మనముచుట్టుపట్లవారివిషయమునను బంధువర్గమువిషయమునను ప్రవర్తించుటకలవాటుపడినపక్షమున, మనప్రయత్నమక్కఱలేకయే మనము పరులవిషయమునుంగూడ దయగలిగి యోగ్యముగా ప్రవర్తించుటకు నేర్చుకొందుము. తెలిసిన వారు పరులనుగూడ తమవలెనేభావించుకొనుచు, వారిసుఖమును తమసుఖమునుగాజూచుకొనుచు, భగవత్కుటుంబమైన యీలోకము లోని సమస్తప్రజలను తోబుట్టువులవలెనెంచి తమకష్టములకైన సహించి వారిక్షేమమునిమిత్తము పాటుపడుచుందురు.

---

## హిందూసుందరుల ప్రస్తుతస్థితి.

[రాజారావు సాహిత్యాభిలాషిణి]

ఈభరతఖండమునం దిప్పుడున్న స్త్రీలస్థితికిని పూర్వకాలమునందుండిన స్త్రీలస్థితికిని మిక్కిలివ్యత్యాసముగలదు. పూర్వకాలమునందలిసుందరులు విద్యలయందును కళలయందును పాండిత్యముకలవారై పురుషులకుపదేశము చేయందగినంత మంచిదశయందుంగూడ నుండుచువచ్చిరి—వేదమునందు వర్ణింపంబడిన గార్గి, మైత్రేయి, మొదలైనవారినే యిందుకునిదర్శనముగాం జెప్పవచ్చును; ఆకాలమునందలి స్త్రీలువేదవేదార్థములెఱిగినవారని చూపుటకుశకుంతలమొద

లైనవారినిదృష్టాంతముగాఁ గొనవచ్చును; యజ్ఞాదులయందును వివాహాదులయందును స్త్రీలు పఠింపవలసినమంత్రము లుండుటయె మన పూర్వులు స్త్రీలుభాషాపాండిత్యము కలవారై మంత్రార్థములనెఱిఁగి యుండవలెనని యుద్దేశించినట్లు స్పష్టమగుచున్నది. ఆకాలమునందు స్త్రీలు పురుషులవలెనే గౌరవింపఁబడుచుండిరిగాని యిప్పటివలెగదులలో మూసిపెట్టఁబడుచుండలేదు. వారి కట్టిస్వాతంత్ర్యములుపూర్వకాలమునందుఁ గలిగియున్నవని చూపుటకుసీత మొదలగుక్షత్రియస్త్రీలు సహితము భర్తలతోవచ్చి సభలలో సింహాసనములమీఁదఁ గూరుచుండుచువచ్చినవార్తనుసూచించుటకంటె విశేషమేమియుఁ జెప్పనక్కఱలేదు. ఇవియవియని వేఱుగఁ జెప్పనేల? ఆకాలమునందలి స్త్రీలకుండవలసిన స్వాతంత్ర్యములన్నిటిని వారుగలిగియుండిరనుటకు సందేహము లేదు. వారికప్పుడున్న విద్యాప్రభావమునుబట్టి వారట్టి గౌరవములకును స్వాతంత్ర్యములకును నర్హురాండ్రయి యుండిరి. మన పూర్వులు గృహిణీధర్మములను వివరించుచు, భర్తకుఁ భార్యమంత్రివలెనాలోచన చెప్పవలెననియుతల్లివలెనుపచారము చేయవలెననియు గురువువలె హితోపదేశము చేయవలెననియు వైద్యునివలె శరీరారోగ్యమును కాపాడవలయుననియు చెప్పియున్నారు. ఇటువంటిపనులను యుక్తముగా నిర్వహింపఁ గలుగుటకు స్త్రీ లెంతటివిద్యావంతులుగా నుండవలయునో చెప్పుటకంటె నెవరికివారూహించుకొనుటయే సులభముగా నుండును. జ్ఞానమూలమైన విద్యానిక్షేపమే హేతువుచేతనో క్రమక్రమముగా మన దేశపుస్త్రీలను విడిచిపోయినది. ఆ విద్యాధనముతోనే వారికిఁగలసమస్తలాభములును సమస్తస్వాతంత్ర్యములును క్రమక్రమముగా నశించుచు వచ్చినవి. కడపట స్త్రీలకు విద్య కావలయునాయని సంశయపడునంత దురవస్థ మన దేశమునకిప్పుడుపట్టినది. స్త్రీలువిద్యావిహీనురాండ్రగుటచే మూఢత్వములో

మునిగియుండి సంసారభారమును చక్కంగా నిర్వహించుటలో మును పటివలె పురుషులకు సహాయురాండ్రుకాంజాలకున్నారు. అందుచేత పురుషులకు స్త్రీలయందుగుపూర్వకాలమునందుండెడు గౌరవ మంతయు తగ్గిపోయినది; ఏవిషయమునందైనను స్త్రీల నాలోచనయడుగుటయే యనర్థదాయకమని సామాన్యముగా పురుషులిప్పుడు భావించు చున్నారు. అందుచేతపురుషు లనేకులు స్త్రీలయొక్క యభిప్రాయ మును గాని యంగీకారమునుగాని పొందకయే వారిని వివాహమును మిషమీాంద నంగహీనులకును వృద్ధులకునుగూడంగట్టిపెట్టుచున్నారు. మానవదేహమున కలంకారమైన విద్యాభూషణము వారికి లేకుండ జేసి లోహపునగలనుమాత్రము పెట్టి తమవేడుకకొఱకుమాత్రమె వారిని తోలుబొమ్మలవలెం జేయుచున్నారు; వారిని గృహయజమానురాండ్రనుగాం జూడక తమ యుపచారముకొఱకుమాత్రమె దాసులనుగాం జేయుచున్నారు. పురుషులు స్త్రీలవిషయమునం జేసినయిట్టి యన్యాయములవలన స్త్రీలను మూఢురాండ్రనుగాం జేసి చెడగొట్టుటయే కాక తాము వారితోడిపాటుగా మూఢశిరోమణులయి చెడి పోవుచున్నారు. అందుచేత పురుషులలోగూడ నిజమయిన యీశ్వర భక్తియు సద్వర్తనమును బోయి మూఢభక్తియు నీతిరాహిత్య మును వర్థిల్లుచున్నవి. దానినిబట్టి నిజమయినసౌఖ్యమును సంతో షమును లేక యనేకులకు భూతలస్వర్గముగా నుండవలసినగృహము మహారణ్యమువలెనగుచున్నది. ఏయింటజూచినను నైకమత్యమునకు మాఱుగా కలహములును మనస్తాపములును పెరుగుచున్నవి. ఈస్థితి యంతయు పురుషుల లోపమువలనను స్వప్రయోజనపరత్వము వల నను గలుగుచున్నదే కాని స్త్రీలదోషమువలన నణుమాత్రమును గాదు. ఏకాలమునందును ఏదేశమునందును తమ స్త్రీలను మంచి స్థితికి తీసికొనిరాక తాము బాగుపడినపురుషులు లేరు.

తాము బాగుపడదలచినపక్షమున ముందుగా తమస్త్రీలను బాగు చేయవలెను. స్త్రీలబాగే పురుషులబాగు; స్త్రీలయోగే పురుషుల యోగు. కాబట్టి పురుషులు తను యోగక్షేమాభివృద్ధి నిమిత్తమే మూఢురాండ్రయియున్నట్టి స్త్రీలను తొంటి యుత్తమ దశకు వారల దీసికొనవచ్చునట్లుగయి ప్రయత్నింపవలెను. స్త్రీల యభివృద్ధినిమిత్తము యెక్కడెక్కడను త్తనుపురుషులు చేయుప్రయ త్నములకు మూఢతా పిశాచా వేశముచేత స్త్రీలే ప్రతిబంధకారిను లగుచున్నారు. ఇంటివద్ద స్త్రీలసాహాయ్యమున్నంగాని మతాచార విషయములయందు పూర్వాచారములకు విరుద్ధములయిన నూతన సదాచారములను నెలకొలుపుట పురుషులకు సాధ్యము కాదు. కాబట్టి పురుషులు తను స్త్రీలను మూఢదశయందుంచియే దేశ మున కేమోమహోపకారమును జేయుదు మన్నకరహంకారమును విడిచి వారియొద్వాయువుబోందమే సత్కార్యములను జేయఁజూడ వలెను. స్త్రీల సాహాయ్య మున్నప్పుడే పురుషులకు విజయముగలిగి లోకమునకు సత్వమైన యుపకారము కలుగును. సద్విషయములలో స్త్రీలతోడ్పాటును పొందఁదలఁచినపక్షమున ముందుగా వారి నాశ్రయించియున్న మూఢతాపిశాచము తొలఁగునట్లుగా వారిని విద్యా వతులనుగాను వివేకురాండ్రనుగాను జేసి మనకు సరియైనతోడ్పాటు చేయుటకు వారిని శక్తురాండ్రను జేయవలెను.

## మంచుగడ్డ.

[౧౮౮౮ వ సం॥ డిశంబరు నెల.]

——: ౦ :——



వాయువునందుఁ గలిగియున్న పదార్థములలో నొకటియావిరి యని ప్రకృతిశాస్త్రజ్ఞానము కలవారి కందఱికిని దెలియును. అది మనకంటికగపడకపోయినను కొంచెముగానో గొప్పగానో వాయువునం దెల్లనుండును. కుంపటిగాని పొయ్యిగాని యున్నయింటిలో నిప్పుమండుచుండునప్పుడు గాలి వెచ్చగానుండుటకు కారణము గాలిలోని యావిరి నిప్పుసెగ చేతనింకిపోవుటయే. నీటియావిరి తనసూక్ష్మరూపమును విడిచి స్థూలరూపముపొంది దృశ్యమయినప్పుడది యాయాస్థితి కనుకూలముగా మంచని కాని జలమని కాని చెప్పఁబడును. చల్లని గాలిలోకంటె వేఁడి గాలిలో నీటియావిరి విస్తారముగా నిముడఁదగియుండును. దీనికొక చిన్న నిదర్శనముఁ జూపవచ్చును. మనము శ్వాసము విడుచునప్పు డెల్లను శ్వాసాశయములలోనుండి నీటియావిరి పయికివచ్చుచుండును. వేఁడి

యధికముగా నున్నందున గాలితో గగ్గనమే కలిసి పోవుటచేత వేసవి కాలమునం దాయావిరి మనకన్నులకు గోచరము కాదు; వేఁడి తక్కువ యయి గాలి చల్లగా నున్నందున శీతకాలము నందు మనము శ్వాసము విడువఁగానే దానిలోని నీటియావిరి మనకన్నులకు స్పష్టముగా కానఁబడును. గాలి చల్లపడినకొలఁదిని దానికినీటియావిరిని తనలోనిముడ్చుకొనెడుశక్తి తక్కువయగు చుండును గనుక, అప్పుడందులోనియావిరి దట్టమయి నేత్రముల కగపడుచుండును. సూర్యుఁడు చక్కఁగా ప్రకాశించుచుండెడు మధ్యాహ్నకాలమునందు మంచు చేమయుం గానఁబడక సాయంకాలమునం దెండ చల్లపడిగాలి చల్లనయినకొలఁదిని పొగవలె నాకాశమునందు మంచనఁబడెడు దట్టమయిన నీటియావిరి కానఁబడుచుండుట కిదియే కారణము. ఇది విన్నతరువాత నీయావిరియంతయు వాయువులోని కెట్లువచ్చునని మీకు శంక కలుగవచ్చును. మన మొక మూకుటిలో కొంచెము నీరుపోసి బయటను గాలిలో పెట్టెదుపక్షమున నందలిజలము క్రమక్రమముగా తగ్గుచువచ్చి కొన్నిదినములలోనదృశ్యమగుట యెల్లవారునుగని పెట్టియుందురు. ఇట్లుజలము మాయమగుటకు దానిని వాయువు తనలోనికి పీల్చుకొనుచుండుటయే కారణము. చల్లగాలికంటె వేఁడిగాలి తనలో నెక్కువనీటి నిముడ్చుకోఁ గలిగినందున జల మావిరిరూపమును పొంది వాయువులోఁ గలియుచుండుట రాత్రికంటె పగలును, శీతకాలముకంటె వేసవికాలమునందును నధికముగా నుండును. మనము తడిబట్టల నింట్లలో నాఱఁగట్టినప్పుడు మబ్బు వేసి చల్లగానున్న దినమునకంటె నితరదినములయందు వేగిర మాఱుచుండుట కిదియే కారణము. అంతే కాక గాలి లేకున్నప్పటికంటె గాలియున్నసమయమునందు తడిబట్టలు వేగముగా నాఱుచుండుట యుమనము చూచుచున్నాము. ఇందునకుఁ గారణము గాలికదలుచున్నప్పుడు క్రొత్తగాలి వేగముగా రాచుండుటచేత విశేషజలమునావాయువు తనలో నిముడ్చు

కో లేకుండుటయు, గాలి విసరుచుండునప్పుడు ప్రతిక్షణమును క్రొత్త గాలి వేగముగా వచ్చుచు పోవుచు నుండుటచేత వచ్చిన గాలియెల్లను ప్రతిక్షణమును కొంతజలమునుతనలోనికిపీల్చుకొనుచుండుటయు, తప్ప మఱియేమియుఁ గాదు. తాను వహింపలేనంతటి యంతటి నెక్కువనీటి యావిరి వాయువులో నెప్పుడుచేరునో యప్పు డది సాంద్రీభావమును పొంది నేత్రములకు దృశ్యమగు చుండెను.

సూర్యాస్తమానమయినతరువాత గడ్డిమీఁదను మంచుపడితడిగా నుండుటయు, ఉదయకాలమునందు మనము లేచి సంచారము వెడలి నప్పుడు చెట్లమీఁదను నదులమీఁదను పర్వతములమీఁదనుపొగవలె మంచు క్రమ్మియుండుటయు, మనము తఱచుగా చూచుచున్నాము. ఈమంచంతయు సూర్యోదయ మయియెండయెక్కినకొలఁదిని మరల కరఁగిపోయిమరలనదృశ్యమగుచుండుటయుమనముచూచుచున్నాము. దీనివలన గాలిచల్లబడుటవలన గాలిలో నానఁబడియున్న యావిరి దట్టమయి హిమరూపమునో జలరూపమునో పొందునని తేలుచున్నది. ఆవిరి మొట్టమొదట మిక్కిలి సూక్ష్మరూపము కలదగానే యున్నను, ఆకర్షణశక్తివలన నానూటాణువులన్నియు నొకటిగాఁజేరి పెద్దపెద్దనీటి బొట్లుగా నేర్పడుచుండును. ఈహేతువుచేత నేమనము ప్రాతఃకాలమున లేచి యెండరాకమునుపు పోయి చూచినయెడల, ఆకులమీఁదనుగడ్డి మీఁదను మంచుచేత నయిననీటిబొట్లనుజూచుచున్నాము. రాత్రివేళ మేఘావరణము లేనప్పుడు భూమితనలోనియుష్ణమును పయికి విడుచు చుండును. కాఁబట్టి భూమి వేగముగా చల్లపడఁగా దానితోఁగూడ దానిసమీపమున నున్నగాలి చల్లపడుచుండును. అందుచేత చల్ల పడిన యాగాలి తనలోనున్న యావిరినంతను నిముడ్చుకొనుశక్తి కలది కాకపోవుటచేత, అధికముగానున్న యావిరిదట్టమయి గడ్డి చెట్లు మొద లయినవానిమీఁదనిలిచిమంచుబిందువులగును. ఈప్రకారముగా నేగాలి

చల్లనిపర్వతశిఖరములయందు సోఁకుటచేత వానిచుట్టు నుండు గాలి యంతయు చల్లపడి యందులోనియావిరి సాంద్రమయి పర్వతశిఖర ములచుట్టును గొడుగువలె మంచు గాని మేఘములుగాని యేర్పడుట సంభవించు చున్నది. ప్రొద్దెక్కిన కొలఁదిని పర్వతశిఖరములచుట్టును జేరినమంచును మేఘములును కరఁగి మరల గాలిలో కలిసిపోవును. మిక్కిలిసూక్ష్మమయి యాకాశమునఁ గ్రమ్మి నేత్రములకు దృశ్యమగు చుండునీటియావిరిని మనము పొగమంచని చెప్పుదుము. ఒక్కపర్వత సమీపములయందు మాత్రమే కాక యితరస్థలములయందుఁగూడ గాలి చల్లపడినచోట్లనెల్లనుఆకాశమునందు మేఘము లేర్పడి యెండయెక్కిన కొలఁదినిమరలతఱిగి క్రమక్రమముగా నదృశ్యము లగుచుండును. ఆకాశమునందు మేఘములెప్పుడేర్పడినను గాలిచల్లబడుచుండుటచేతనే కలుగుచుండును. మొట్టమొదట చేటలవలె చిన్నచిన్న మేఘశకలము లేర్పడి తరువాత నవియన్నియునొకటిగాఁ జేరి పెద్దమేఘములయి యాకా శమున వ్యాపించియందలిజలము వర్షరూపమున భూమిమీఁద కురియు నారంభించును. భూమిమీఁద కురిసెడువర్షమంతయు భూమిలోనుండి యు నదులలోనుండియు సముద్రములు మొదలయినవానిలోనుండియు నావిరిరూపమున లేచి వాయువులోఁ గలిసినజలమువలననే కలుగుచుండును మేఘములోనిజలము వర్షరూపమున కురియుటయే గాక గాలి మిక్కిలి చల్లపడినప్పుడు గడ్డకట్టి మంచుగడ్డలరూపమునఁ గూడ భూమిమీఁద పడును. ఆమంచుగడ్డను మనము గదులలోనికి తెచ్చియుంచినయెడల వెంటనే కరఁగనారంభించి జలరూపమును పొందును. దీనిని బట్టిచూడగా నీరు మూడుభిన్నరూపములను పొందియుండవచ్చునని తేటపడుచున్నది. ఇందు మొదటిరూపము కన్నులకదృశ్యమయి సూక్ష్మభావమును పొందెడి యావిరి; రెండవరూపము పలుచగానుండి ప్రవహించుస్వభావము గల జలము; మూడవరూపము రాతివలె గట్టిగానుండెడుమంచుగడ్డ; అతి

శీతలదేశమునందలి నదులు సరస్సులు మొదలయినవానిలోని జలము సహితము పయిభాగమునందు గడ్డకట్టుచుండును. శీతమెంతయెక్కువగా నుండునో యీగడ్డ యంతగట్టిగా నుండును. ఒకానొకప్పుడు శీతమత్యధికమయినయెడల సరస్సులు మొదలయినవాని జల మంతయు గడ్డకట్టును. పయికి చూచునప్పుడు మంచుగడ్డలు రూపములేనివిగా కానఁబడినను పరీక్షించి చూచినయెడల పయిపటమునందు చూపఁబడినట్లు వివిధచిత్రరూపములను గలిగియుండును. మన మొకమంచుగడ్డ ముక్కను దెచ్చి సూక్ష్మమయినముక్కలుగా విఱుగఁగొట్టి వానిని నల్లగుడ్డమీఁద వేసి పరిశీలనతోఁ జూచినపక్షమున, ప్రతిసూక్ష్మశకలమును నక్షత్రాకారముగానుండి యాతేసికిరణములతోఁ గానఁబడును.

వాయువులోఁ జేరెడుజలము మంచురూపమునను వర్షరూపమునను భూమిమీఁదపడుచుండుటయే కాకయొకానొకప్పుడు వర్షోపలరూపమున రాళ్ళవలె క్రిందపడుచుండును. ఈవర్షోపలముల నేమనవారువడగండ్లని చెప్పుదురు.

## గర్వము

(౧౮౯౮ వ సం॥ జనేవరి నెల)

———(ο)———

ఎవ్వరును తాము గొప్పవారమనియు తమయందాధిక్యముకలదనియు తలఁచుకొనగూడదు. అట్లుతమలోపలభావించుకొనుటవలన గర్వముకలిగి యనేకము లయినకష్టములను జేయును. ఎవ్వరైనను స్వవిషయమే విస్తారముగా మాటాడుకొనుచున్నను ఆత్మస్తుతి చేసికొనుచున్నను, తామేగొప్పవారమని లోపల నహంభావమున్నట్లు మఱియేవిధముగాఁగన బఱిచినను, జనులదృష్టియందట్టివారుపరిహాసపాత్రులుగా నుందురు. కాఁబట్టి యెల్లవారునునిజముగాతమ కెంత యోగ్యత

కలిగియున్నదో యంతకంటె నెక్కువవారుగా కనఁబడుటకై ప్రయ
త్నింప కుండవలెను. అంతేకాక లోకమునందలి మన యల్పత్వమును
భావించుకొని యొకవేళ మనయం దేదో యోగ్యతయున్నదనుకొన్నను
గర్వపడక యడఁగిమడఁగియుండవలెను. అట్లు వంగియుండుటచేతనే
లోకములో మంచివారుగొప్పవారగుదురుగాని తమయల్పజ్ఞానమును
శక్తినిసంపదను తలచుకొనివిఱ్ఱవీగువారెప్పుడును గొప్పవారుకారు.
మనసుగుణముల విషయమై యితరు లొకవేళ స్తుతిచేయుచున్నను
మన ముబ్బిపోక నమ్రతను గనఁబఱుపవలెను. విధేయతవలన సుగు
ణము లన్నియు వన్నెకెక్కి మిక్కిలి ప్రకాశించును; వినయ విధే
యతలు లేకపోవుటవలన సుగుణములుసహితము తమయోగ్యతను
బోఁగొట్టుకొని శోభిల్లకుండును. మనకున్న యోగ్యతలే వినయము
లేకపోవుటవలన నిట్లు నిష్ప్రయోజనములగుచుండఁగా, మనకు లేని
యోగ్యతలున్నట్లు నటించుటవలనమనమధికపరిహాసపాత్రులమగుదు
మని వేఱుగ వివరింపనక్కఱలేదు. జనసామాన్యమునకంటె మన
యం దేదో యొకచిన్నయాధిక్య మున్నదని దానిని పెద్దచేసి యందు
వలన గొప్పవారమగుదుమనివిజృంభించితిమేని, పంచతంత్రమునందు
వర్ణింపఁబడిన నక్కవలెలేనిపోనికష్టములకు హేతుభూతులమగుదుము.

పూర్వకాలమునం దొకనక్క రాత్రివేళ శవములనిమిత్తమై
స్మశానవాటికలోతిరుగుచు, చేరువనున్నయొకనీలిచేనులోఁబ్రవేశించి
చీఁకటిలోకన్నుగానక యొకనీలివండుకుండలోపడి, ఆగూనలోనుండి
వెలుపలికిరాలేక తెల్లవారినదాఁకనందుండి, ఇంతలోప్రాణముతప్పిం
చుకొనుటకై యొకయుపాయమాలోచించి, పొలముకాపువచ్చునప్ప
టికి కన్నులుమూసికొని కాళ్ళుచేతులునుబిగియఁబట్టిబిఱ్ఱబిగిసికొని
చచ్చినట్టుపడియుండెను. వాఁడదిచూచినక్కచచ్చినదనుకొనికుండలో
నుండి పైకిఁదీసి దూరముగఁ గొనిపోయి విడిచిపెట్టెను. ఆ కాపుదూర

ముగాపోయినతరువాత నక్క కన్నులువిప్పిచూచితనదేహమునందంటు కొన్ననీలవర్ణమున కాశ్చర్యపడిగర్వముకలదై తనకువచ్చినయాయాధిక్యమువలనగొప్పలాభముపొందవలెనని నిశ్చయించుకొని, తనకులము వారివద్దకుపోయి తనరంగునుచూపి, రాత్రితన్ను దేవేంద్రుడుతనలోకమునకు గొనిపోయి మృగరాజ్యమునకభిషేకముచేసి యీరంగుప్రసాదించెననియు, ఈవార్తను సమస్తమృగములతోను చెప్పి రావలసినదనియు చెప్పెను. అప్పుడానక్కలు తమ కులమువారిలో నొక్కనికి మృగరాజ్యమువచ్చినందుకు సంతోషించి, అడవులవెంబడిని పోయి యీవార్తను మృగములకన్నిటికిని జెప్పి, సింహము పులి మొదలైన జంతువులుసహితము దానిని కొలుచునట్లుచేసెను. అట్లుసింహాదులు తనసేవకులగుటవలన నక్కపోతు పట్టరానిగర్వముకలదై తనకులము వారితోఁగలియుట తనగౌరవమునకు లోపమనియెంచి తన కిట్టిస్థితిని దెచ్చినతనబంధువులతోఁగూడమాటాడకూని వేసెను. అప్పుడవమానింపబడిననక్క లన్నియు నొకచోటచేరియాలోచించుకొనిపులి మొదలైనవి చేరువనున్నప్పుడు నక్కరాజునకెదురుగాకూరుచుండి కూతమొదలుపెట్టెను. ఆకూతవిని స్వభావగుణమును విడువలేక నక్కరాజునువానితోసమానముగాకూయనారంభించెను. ఆకూతవినిచేరువనున్నపులి యిది సామాన్యనక్కయని తెలిసికొనితమ్ముందటిని మోసపుచ్చినందుకు మిక్కిలి కోపముగలదై దానిమీఁదపడి చంపివేసెను.

తనువద్దలేనియాధిక్యమును కల్పించుకొని గర్వపడువారు లేనిపోనివేషమువేసికొన్న యీనక్కవలెనేకష్టములపాలగుదురు. మనకు నిజముగాలేనిపాండిత్యమునుగాని, కలిమినిగాని, గొప్పతనమునుగాని, కలిగినట్లు నటించెడుపక్షమున జనులు నిజముతెలియగానే మనయందెంతమాత్రమును గౌరవమును కనఁబఱుపకపోవుటయేకాక మనలను ఛులుకచేసి విద్యాధనాదులు మొదలేలేనివారికంటెను తక్కువగాఁ

జూతురు. మనము చెప్పినదే సరియైనదనియు, ఇతరులు చెప్పినది సరియైనది కాదనియు, మనలో సాధారణముగాఁ గలుగుచుండు గర్వమును సాధ్యమయినంతవఱకు విడఁచివేయుచుండవలెను. మనము చెప్పినది మనకు సరియైనదని తోఁచినను నిజముగా మన మొకప్పుడు భ్రమపడియుండవచ్చును; ఇతరులు చెప్పినది మనకు సరిగా తోఁచకపోయినను కొన్నిసమయములయందు వారు చెప్పినదే క్రమమయియుండవచ్చును. కాఁబట్టి మనమనస్సునకు సరిగా తోఁచనంత మాత్రముచేత నితరులు చెప్పినదంతయు పనికిమాలినదని త్రోసివేయక వారి మాటయందును గౌరవముంచి సావధానముగా విచారించుచుండవలెను. మన మెంతయడఁకువను గనఁబఱిచిన మనగుణము లంతగా ప్రకాశించును; మన మెంత గర్వముగలవారమయి విఱ్ఱవీఁగుచుందుమో మన గొప్పతన మంతతక్కువగుచుండును. మనశక్తిని మనము పూర్ణముగా తెలిసికోఁ గలుగుటకును చిరకాలానుభవము కావలెను. కాఁబట్టియే లోకానుభవము విస్తారముగా లేనిపడుచువారియందే గర్వము విశేషముగాఁ గానఁబడుచున్నది. లోకానుభవముతగినంత గలిగి కష్టనిష్ఠురములకోర్చి జ్ఞానులయిన పెద్దలయందు మనము సామాన్యముగా గర్వరాహిత్యమును వినయవిధేయతలను జూచుచున్నాము. మనలోపములను మన కితరులు చూపుటకంటె లోకానుభవమువలనను శోధనవలనను మనమే తెలిసికొని దిద్దుకొనుచుండుట వలన మన కెంతశ్రేయస్కరముగా నుండును! అయినను పలువురు తమతప్పులు తమ కన్నులు కనఁబడుచు వఱకును దెలిసికోలేకున్నారు. లోకులు తమలోపములను జూపినప్పుడుకూడ కొందఱు తెలిసికోలేక యితరులోర్వలేమిచేత తమ్ముదూషించుచున్నారనియు, భావించుకొందురు. ఒకవేళ నీర్ష్యాదులచేత కొందఱిగొప్పతనమును మఱుఁగుపఱుచుటకయి కొందఱు కొంతకాలముకృషిచేయుఁ గలిగినను; నిజమయినయోగ్యత గలవారి నెల్లవారును నెల్లకాలమును చులుక

చేయుట యెంతమాత్రమును సంభవింపనేరదు. మనయొద్ద యోగ్యత యున్నప్పుడుగూడ లోకులకు మనయెడల దురభిప్రాయము కలిగి యున్నను మనప్రవర్తనవలననే యాదురభిప్రాయమునుతొలగించుట కయి ప్రయత్నము చేయవలెనుగాని మాటలవలన నెంతమాత్ర మునుగాదు. మనయోగ్యతలను మనమేయితరులతోఁ జెప్పుకొని యాత్మస్తుతిని జేసికొనెడుపక్షమున మునుపున్నగౌరవముకూడ క్రమ క్రమముగా తగ్గుచువచ్చును. కాఁబట్టి యెల్లవారును ఆత్మస్తుతి చేసు కొనుటయు తాము గొప్పవారమని మనస్సులోనైన గర్వపడుటయు మానుకొనవలెను.

## బిడ్డల నాజ్ఞలో నుంచుట,

(౧౮౮౮ వ సం॥ ఫిబ్రవరి నెల.)

—:o:—

తల్లిదండ్రులు తమబిడ్డలకు మొట్టమొదట నేర్పవలసినది విధే యత. బిడ్డలుతల్లిదండ్రులయాజ్ఞలకుకదాలోఁబడి, వారిమాటకుమాఱు మాటాడక వారుచెప్పినపని చేయుచువచ్చినంగాని పిల్లలను మంచి మార్గముననడిపించుటసాధ్యము కాదు. మనము చెప్పినమాటలనులక్ష్య ముచేయక మనసువచ్చినట్లు తిరుగునట్లుగాబిడ్డలనువిడిచినపక్షమున, వారు మనకులోఁగక యెందుకును పనికిరానివారయిపోదురు.అటుతరు వాత వారిని మరల మనము మంచిమార్గమునకు దిద్దుట యసాధ్య మయి, ఆవిషయమయి మనము చేయుప్రయత్నము లన్నియు నిష్ఫ లములగును. కాఁబట్టి యెల్లవారును మొట్టమొదట చేయవలసినపని తమబాలురను బాలికలను సమస్తవిషయములయందును తమకు లోఁబడి నడుచుకొనునట్లు చేయుట. బిడ్డలకుతల్లిదండ్రులమాటవినని దుర్గుణము పట్టుపడినపక్షమున, అది వారిని పెంచెడు జననీజనకుల లోపమేకాని యాశిశువులలోప మెంతమాత్రమునయియుండదు. ఒక

నాఁ డొకధనికురాలయిన స్త్రీ తనబిడ్డలను వెంటఁబెట్టుకొని పొరుగు వీధిని కాపురమున్న తన బాల్యమిత్రురాలిని జూడఁబోయెను. ఆమిత్రు రాలిబిడ్డలందఱును బల్లలమీఁదఁగాని, గూళ్ళలోఁగాని, ఇతర స్థల ములయందుఁగాని, ఉన్నవస్తువులను వేసిని ముట్టుకొనక తల్లిరవికకుట్టు కొనుచుండఁగా సమీపమునఁ దాదుకొనుచుండిరి. అప్పుడామె తన చెలి కత్తియుతన్నుఁ జూడవచ్చుటచూచి యెదురుగాఁబోయి, ఆమెనుబిడ్డ లనుతీసికొనివచ్చి, ఆమెతోఁ గలిసి మాటాడుచు తమబిడ్డల నామెబిడ్డ లతోఁ గలిసి యాడుకొండనియాజ్ఞయిచ్చెను. చూడవచ్చినమిత్రురాలి బిడ్డలలో నొకఁడుబల్లమీఁద నున్నయద్దమును తీసి, రెండవ యామె యొక్క బిడ్డలలోనొకనిచేతికిచ్చెను. అదిచూచి తల్లి కొడుకును బిలిచి, అద్దమును బల్లమీఁద నెప్పటిప్రకారముగా పెట్టిరమ్మని చెప్పెను. ఆ చిన్నవాఁడు వెంటనేపోయి తల్లి చెప్పినట్లు చేసెను. అంతట మొదటఅద్ద మును దీసిన రెండవచిన్నవాఁడు పోయి యాయద్దమును మరలపుచ్చు కొనెను. అప్పుడా తనితల్లి యాయద్దమును మును పున్నచోట పెట్టు మని యాజ్ఞాపించెను. ఆమాటచిన్నవాఁడు లక్ష్యపెట్టక యద్దమునుతీసి చేతిలోనే పట్టుకొనెను. అప్పుడు తల్లి యద్దమును బల్లమీఁద పెట్టక పోయినయెడల కొట్టెద నని కేక వేసెను. అప్పుడును ఆ చిన్నవాఁ డద్ద మును బల్లమీఁద పెట్టలేదు. అందుమీఁద తల్లి తనమిత్రురాలితో నీబిడ్డలవలె నాబిడ్డలు చెప్పినమాట వినువారు కారని చెప్పెను. అట్లు బిడ్డఁడు తల్లిమాట వినకపోవుట తల్లిలోపముచేతనేగాని బిడ్డలోపము చేతఁ గాదు. ధనికురాలయినతల్లి మొదటినుండియు తనబిడ్డకేదైనపని చెప్పినప్పుడు, ఆబిడ్డ యాపనిని నిశ్చయముగా చేయవలయు ననెడి యుద్దేశముతో చెప్పుచువచ్చుటలేను చెప్పినతరువాత తానుచెప్పినపనిని బిడ్డచేసినదో లేదో విచారించుట కాని, చేయకపోయినయెడల శిక్షిం చుటకాని, అంతకుమునుపే లేదు. అందుచేత నామెబిడ్డలకు తల్లిమాట

లయం దంతగౌరవము లేక, అప్పుడప్పుడు కొట్టుచువచ్చినను తలుచుగాతల్లిమాటలను వారులక్ష్యముచేయకుండిరి. రెండవయామెయో, అక్కఱకుమాలినపనుల నెప్పుడును తనబిడ్డలకు చెప్పదు; చెప్పినపనిని వారిచేతచేయించుచు, చేయకపోయినయెడల వారిని తప్పక శిక్షించుచుండెను. అందుచేత నామెబిడ్డలు తల్లిమాటయందు గౌరవము కలవారయి, దెబ్బలక్కఱలేక యామె చెప్పినపనిని వెంటనేచేయుట కలవాటుపడి యుండిరి.

ఈవిధముగా నీయెల్లవారును తమబిడ్డలు విధేయతగలిగి బాగుపడవలెనని కోరెడుపక్షమున, తమబిడ్డల నేదియైనను జేయుఁడనికాని చేయకుఁడని కానివిధించునప్పుడు ముందుగానే చక్కఁగా నాలోచించుకొనినిరర్థకము లయినయాజ్ఞల నెప్పుడు నియ్యక యాపనిని వారిచేత చేయింప నిశ్చయించుకొనియే యాజ్ఞాపింపవలెను. ఆజ్ఞాపించిన తరువాత, ఆవశ్యకమయినప్పుడు శిక్షించియైనను ఆపనిని వారిచేత తప్పక చేయించవలెను. కాని వారాపనిని చేయక నిరాకరించినప్పుడు వారిపంత మెప్పుడును గెలుపనియ్యఁ గూడదు. ఇట్టివిషయములలో నొక్కసారి మనముపేక్ష చేసినపక్షమున, పిల్లలుతరువాత గూడమనమాటవినకయుండు పట్టు పట్టుచుందురు. ఈవిషయమును గూర్చి యొకపుస్తకమునందుఁ జెప్పఁబడిన నిజమయినకథ నిందు వ్రాయుచున్నాము:—

ఒకనాఁ డొకగృహస్థుఁడు తనభార్యతోను బిడ్డలతోను గూరుచుండియుండి కొందఱు మిత్రులురాఁగా వారితో సంభాషించుచు, అయిదేండ్లప్రాయముగల తనకొమారునియొక్క తెలివినివారికిచూపవలెననికుమారునిచేరఁబిలిచిబాలబోధ చేతఁబట్టుకొనిచూపి "అబ్బాయీ! ఈయక్షరము పేరేమి?" అనియడిగెను. ఆచిన్నవాఁ డప్పుడేహేతువుచేతనో చిరాకుగానున్నందున, అక్షరములన్నియు తెలిసియు తన కాయక్షరము తెలియదనెను. అప్పుడుతండ్రి కుమారుని కోపదృష్టి

తోఁ జూచి చెప్పుమని యాజ్ఞాపించెను. ఆచిన్నవాఁడు చెప్పనని నిరాకరించెను. అందుమీఁద తండ్రి యాబాలుని లోపలికిఁదీసికొనిపోయి శిక్షించి, మరలఁదీసికొనివచ్చి యిప్పుడాయక్షర మేదో చెప్పుమని యడిగెను. అప్పుడును వాఁడు చెప్పకపోయెను. తరువాత తండ్రి కోమారుని రెండవసారి లోపలికిఁదీసికొనిపోయి మరల దండించితీసికొనివచ్చి యాయక్షర మేదో చెప్పుమని యడిగినను చెప్పలేకపోయెను. ఇటువంటి సమయమునం దేలయడిగితినని తండ్రికిఁలోపల దుఃఖముకలిగినను, అప్పుడువిడిచిపెట్టినయెడల పిల్లవాఁడు చెప్పినమాటవినక చెడిపోవునని యెఱిఁగి యాచిన్నవానిని మరల లోపలికిఁదీసికొనిపోయి బెత్తముతో దిట్టముగాఁగొట్టితీసికొనివచ్చి యీయక్షర మేమో చెప్పుమనియడిగెను. అప్పుడుగహితము వాఁడు లోఁబడక వెక్కివెక్కి యేడ్చుచు దేహము వడఁక నిలుచుండెనుగాని యాయక్షరమిదియని చెప్పకపోయెను. దగ్గఱనే యున్నతల్లి కెంతవిచారముకలిగినను బాలునియొక్క క్షేమమును గోరి యూరకుండెను. తండ్రి కాబిడ్డనిగొట్టిన దెబ్బలన్నియుతన దేహముమీఁదతగిలినట్లున్నను, పిల్లవానిపంతము గెలువనియ్యఁగూడదని యెఱిఁగి యేలాగునైన వానిచేత నాయక్షరమును చెప్పింపనిశ్చయించుకొని మరలలోపలికిఁదీసికొనిపోయి శిక్షించుటకై వానిచేయి పట్టుకొనెను. అప్పుడాపిల్లవాఁడు తండ్రియొక్కనిశ్చయమును జూచి యిఁక నెదిరించిన కార్యము లేదనుకొని, ఆయక్షరము "అ" అని చెప్పెను. తండ్రికప్పుడపరిమితసంతోషమువచ్చి బాలబోధ చేతఁబట్టుకొని దాని తరువాతి దేయక్షరమనయడిగెను. "ఆ" అనిపిల్లవాఁడు చెప్పెను. అటు తరువాతియక్షర మేమో యనియడుగఁగా, "ఇ" అనిపిల్లవాఁడు చెప్పెను. ఈప్రకారముగామఱికొన్ని యక్షరములుకూడఁ జెప్పించి తండ్రి పిల్లవాని నాడుకో వదలిపెట్టెను. దీనినిబట్టి తల్లితండ్రుల నెదిరించినప్పుడు తాము గెలువలేమని తెలిసికొని యాచిన్నవాఁడు మాత్రమే కాక తక్కిన

పిల్లలందఱునుగూడ జననీజనకులయాజ్ఞల నతిక్రమింపక నాఁడు మొదలుకొని పరమవిధేయులై నడువ మొదలుపెట్టిరి.

ఆపసిపిల్లవాని విషయమై తండ్రి జరిగించినచర్య కొందఱికి క్రూరముగాతోఁచవచ్చును. కాని యది యెంతమాత్రమును క్రూరమైనది కాదు. తండ్రి యప్పుడా చిన్నవానిని మనసువచ్చినట్లు విడిచి పెట్టి యుండినయెడల, వాఁడు ముందన్ని విషయములయందును పెద్దవారిమాటవినక చెడిపోయియుండును. కాఁబట్టి వాని బాగునుగోరి చేసిన యీదండన మాచిన్నవానికనుగ్రహమే కాని నిగ్రహముగాదు. అయినను తల్లిదండ్రులు తమబిడ్డలతో నిటువంటివివాదములను సాధ్యమైనంతవఱకు తప్పించుకొనుచు రావలెను.

బిడ్డలకునిజమైనవిధేయతను నేర్పఁదలఁచుకొన్నపక్షమున, బుద్ధిపూర్వకముగా చేయనితప్పిదములనిమిత్తము వారి నెప్పుడును శిక్షింపకుండవలెను. కొందఱుతల్లులు మొదలైనవారు బల్లలు మొదలైన వానిమీఁద నెక్కవలదని పిల్లల కాజ్ఞాపించి వారెక్కినప్పుడు శిక్షింపక యూరకుండి, వారెక్కినప్పుడు దైవికముగా నొకయద్దముకానిమఱియొకవస్తువుగాని పగిలినప్పుడుమాత్రము శిక్షింతురు. అట్లు దండించుట మిక్కిలి యవివేక కార్యము. దానిమీఁదనున్నవస్తు వేదియైనను పడకపోయినను, ఆవస్తువు విలువగలదియైనను కాకపోయినను, తనయాజ్ఞమీఱి బల్లమీఁద నెక్కినందులకై వారితో తప్పిదమును జెప్పి శిక్షింపవలెను. అట్లుచేయక యేదైనవస్తువుపడి నష్టముకలిగినప్పుడుమాత్రమే శిక్షించుచువచ్చినపక్షమున, ఆపని బుద్ధిపూర్వకమైనది కాదుగనుక వారు నిజమైనతప్పిదమునకును ప్రమాదమునకును భేదము తెలిసికోలేక పాడగుదురు. ఇటువంటిసమయములలో వారికాడుకొనిచ్చిన వస్తువులనుదప్ప మఱియేవస్తువులను ముట్టుకోకుండ నుత్తరువుచేసి వారాజ్ఞనుమీఱి యేవస్తువునైనను ముట్టుకొన్నప్పుడెల్లను దానివల్ల చెఱుపు

కలిగినను కలుగకపోయిననుగూడ శిక్షించుచు వచ్చిన చో వారికి విధేయత పట్టుపడియుంటనున్న వస్తువుల కేవిధమయిన చెఱుపునుకలుగక పెట్టినవస్తువులు పెట్టినచోట నేయుండును. పిల్లలనుశిక్షింప వలసినదని చెప్పినప్పుడు శిక్షయెప్పుడును దెబ్బలవలననే కాదు. వారికిపెట్టెడుమంచి పదార్థములనాదినము పెట్టక పోవుటచేతను వేఱువిధముగాను కూడ శిక్షింపవచ్చును. బల్లలు మొదలయినవెక్కుట, ఇంటనున్నవస్తువులు తీయుట, తప్పిదమని బాలురకు బోధించనప్పుడా పనులనిమిత్తమయి వారిని శిక్షించుట యన్యాయము. అట్టి సమయములయం దాతప్పిద మంతయు తల్లిదే కాని బిడ్డలది కాదు. సమయమువచ్చినప్పుడుబిడ్డలను శిక్షించుటతల్లిదండ్రులకు ధర్మమేయైనను వారుబిడ్డలయెడల సదా కోపదృష్టి గలవారుగాను క్రూరముగాను ఉండకయితరసమయముల యం దెల్లవారియందు ప్రేమయు, దయయుఁ గలవారయియుండవలెను; వారియెడల ప్రేమను జూపెడుమాటలనుజెప్పుచువారుమంచిపనినిజేసి నప్పుడెల్లను తాము సంతోషించినట్లు కనఁబఱుచుచు వారికి ప్రోత్సాహము కలిగించు చుండవలెను. పిల్లలచేత మన మొకపనిని జేయింపఁ దలఁచుకొన్నప్పుడు ముందుగా మంచిమాటలతో చెప్పి యొప్పించుట యావశ్యకమేయయినను వారికిబోధించి న్యాయమును దెలిపియొప్పించియే పనులు చేయింపఁజూచుటమాత్రము పనికిరాదు. వారు మంచి మాటలతో విననియెడల బెదరించియు శిక్షించియు చెప్పినపనిని వారి చేత చేయింపవలెను.

## కొండెములు చెప్పుట.

[౧౮౭౭ వ సం॥ మార్చి నెల]

———(:o:)———

మన దేశములోని స్త్రీలలో సాధారణముగా కొండెములు చెప్పుట యొక గొప్పతప్పిదముగా నున్నది. ఈదురాచారము చదువు

కొన్నివారిలో కంటె మూఢస్త్రీలలో విస్తారముగాఁ గానఁబడుచున్నది. కాఁబట్టి యీలోపమునకు ముఖ్యకారణము విద్యాభావమే యని చెప్పవచ్చును. చదువుకొని మూఢస్త్రీలు పదుగు రొక్కచోట కూడినప్పుడు ప్రసంగించుటకు వారికి మంచివిషయము లేవియు తెలియనందున సామాన్యముగా వారిసంభాషణము కూరగాయవిశేషములలోనుండి పరదోషకథలలోనికి దిగుచుండును. పరులమీఁద నేమరిసభలలో స్త్రీలు చెప్పుకొనెడుదోషములలో కొన్ని నిజమయినవే యయినను వారిలో ననేకము లసత్యమయినవయి కూడ నుండును. సోమరులకిటువంటిమాటలు చెప్పుట తప్ప వేఱుపనియుండమిగనుక ప్రొద్దుపోవుటకొఱకును తాముపోయినచోట నెల్ల నేదో క్రొత్తవిశేషము చెప్పుటకొఱకును లేనిపోని వేవో పుక్కిటిపురాణములను కల్పించి తఱుచుగా నితరులమీఁద నపవాదములు మోపుచుందురు. పనిపాటులు లేని స్త్రీలు కొందఱీదేపనిగా భోజనములయినతరువాత నింటింటికిఁ బోయిన వారికడ నెల్లను పరులమీఁదిదోషములనో యొండొరులకు కలహములను పుట్టించెడు మాటలనో చెప్పి వచ్చుచుందురు. మఱికొందఱు వీరు చెప్పినమాటలను వారికడను వారు చెప్పినమాటలను వీరికడను జెప్పి యొండొరులకు కలహములను పుట్టించి వారు తగవులాడి యొండొరులను తిట్టుకొనుచుండఁగా చూచి తాము వేడుక చూచుచుందురు. తెలివిగలవా రిటువంటిదుష్టస్త్రీలను తమయిండ్లకు రానీక వారు చెప్పెడుమాటలను వినక వారిని కాలసర్పములను జూచినట్లుగాఁ జూచుచుండవలెను. విన్నమాటకన్న చెప్పెడుమాట చేటన్న లోకోక్తి యెల్లవారికి ననుభవసిద్ధమయినదే కదా! ఈసత్యమునెఱిఁగినవారు పనిలేక యింటింట తిరుగువారితోను మిక్కిలి వదరుఁబోతులుగా నుండువారితో మిక్కిలిమితముగా సంభాషించుచు బహుజాగ్రత్తగా నుండవలెను. అట్లుండనిపక్షమున వీరిమాటలమూలమున ప్రాణములవంటిబంధువులయినను పగవారగుట

సంభవించును. ఒకవేళ నితరులయెడల నిజమైనదోషములేయున్నను వానినెల్లవారిముందఱను జెప్పక మనసులోనుంచుకొనుట మంచిది. ఊరక కన్నవారికడనెల్లనువారితప్పిదములను వెల్లడిచేయుచుండుట వలన వారికినిష్కారణముగా మనకు వైరులనుగా చేసికొనుటతప్ప ప్రయోజనముకలుగదు. అటువంటివిషయములలో మనము చేయ వలసినపని యంతయు వారియయోగ్యప్రవర్తనమును గుఱించివ్యసన పడుచు సాధ్యమైనయెడల నయమున భయమునబుద్ధిచెప్పి వారిని మంచిమార్గమునకు ద్రిప్పుటకై ప్రయత్నించుటగా నుండవలసినది. వారితరులు చెప్పెడుబుద్ధి వినక తమదుష్టస్వభావమునువిడువకున్నయెడల సమయము తటస్థించినప్పుడు తగినవారిచేత వారిని దండింపించుటకై ప్రయత్నింపవలయునేకాని యప్పుడుమాత్రము నిజమును మఱుగు పఱిచి దుష్టుని కుపకారముచేయుటకై పూనగూడదు. ఒకని తప్పి దముల నతనిపరోక్షమునందితరులతోఁ జెప్పుటకంటె ప్రత్యక్షముగా తప్పిదముచేసినవానియెదుట చెప్పుటయే యుత్తమపక్షము. అట్లు నిర్భయముగా ముఖముముందర చెప్పుటకు ధైర్యముచాలకపోయిన పక్షమున చాటున నెవ్వరితోను జెప్పక యూరకుండుట క్షేమకరము. అనేకకుటుంబములలో కలహములును మనస్తాపములును కలుగుటకు కారణము కొండెపుమాటలే గనుక వివేకముగలవారందఱును కొండెపుమాటలను కాలకూటవిషమునువలె విడుచుచు సత్ప్రవర్త నము గలిగి మెలఁగుచుండవలయును.

## పాతివ్రత్యము.

[౧౮౮౮ వ సం॥ ఏప్రిల్ నెల.]

———(౦)———

లోకములో జనులు వృద్ధియగునిమిత్తమును, స్త్రీ పురుషు లొకరికొకరుసహకారులుగానుండునిమిత్తమును, వారికిఁగలిగినసంతా

నమునకు విద్యాబుద్ధులును సంరక్షణమును చక్కఁగాకలుగునిమిత్తమును, వివాహసంబంధమేర్పడినది. ఈవివాహసందర్భమువలన నెక్కడనో పుట్టిపెరిగి స్త్రీయును మఱియొకయింట జన్మించినపురుషుఁడును ఆప్తబంధువులగుటయే కాక యిరువురునునేక దేహమని చెప్పఁదగినంత యన్యోన్యసంబంధు లగుచున్నారు. ఈవివాహసంబంధమువలన భార్యయెడలభర్తప్రవర్తింపవలసినవియుభర్తయెడలభార్య ప్రవర్తింపవలసినవియుఅయినధర్మము లనేకము లేర్పడుచున్నవి. అట్టిధర్మములనేకములున్నను వారు యావజ్జీవమును పరస్పరప్రేమముకలవారై యేక దేహమువలె నొండొరులకు తోడుపడుచుండుటయు, పరస్త్రీసాంగత్యమువలనఁగాని పరపురుషసాంగత్యమువలనఁగాని యొండొరులకు ద్రోహముతలఁపకుండుటయు వానిలోనెల్ల ముఖ్యధర్మములని చెప్పవచ్చును. పురుషునియెడలభార్యప్రవర్తింపవలసినవిధమును పాతివ్రత్యమని మనపెద్దలు చెప్పియున్నారు. భార్యాభర్త లొండొరులవిషయమున నడుచుకోవలసిన ధర్మము లన్నియు ఇరువురకును సమానములేయయినను, భర్తయాజ్ఞకులోఁబడి విధేయతగలిగిప్రవర్తించుట స్త్రీకొక్కటి విశేష మైయున్నది. భార్యభర్తయొక్క యభీష్ట ప్రకారముగా ప్రవర్తించుచుండెడుపక్షమునభర్త కామెమీఁదనను రాగము హెచ్చగుటయే కాక తఱుచుగా నతఁడును భార్యయొక్క యభీష్టప్రకారమే నడచుచుండుననుటకుసందేహముండదు. కుటుంబమునకంతకును పురుషుఁడే యజమానుఁడుగానుండినను, సాధారణముగా తనకుప్రియముగా నడిచెడు భార్యయొక్క మాటచొప్పున నేపురుషుఁడుప్రవర్తించుచుండునుగాన సామాన్యముగా స్త్రీయే కుటుంబయజమానురాలని చెప్పవచ్చును. అందుచేత భార్యయెప్పుడును సమస్తవిధములచేతను భర్తమనస్సు సంతోషపెట్టుటకై చూచుచుండవలెను. అతఁడు బయల పని చేసి యలసియింటికివచ్చినప్పుడాతనిమనస్సునుకలహకథల

తోను గృహచ్ఛిద్రములతోను నొప్పింపక యిల్లు శుచిగా నుంచి తాను శుచిగా నుండి నవ్వుమొగముతోను ప్రియవచనములతోను పురుషున కుల్లాసము కలుగఁజేయవలెను. అటుపిమ్మట నాతనికిష్టముగా పాకము చేసి భోజనము పెట్టితృప్తిచేయవలెను. ఒకవేళభర్తకోపియై నిష్కా రణముగా కానిమాటి లాడినను తానెదురొడ్డికలహింపక యోఁదుగాలి వచ్చినప్పుడొదిగియుండినిరపాయముగానుండెడుచిన్న మొక్కలవలెనే తనక్షేమము నిమిత్తమయి కోపశాంతి యగువఱకును మాఱుమాటా డక యొదిగి యుండి యాతనికోపాగ్నిని తనశాంతిజలముచే చల్లార్చు చుండవలయును. ఇట్లు చేయక కోపసమయమునందు భర్త నెదిరించి యుత్తరమిచ్చుచు కలహించుచువచ్చెడుపక్షమునభర్తమఱింత కూరు డయి తిట్టుచు కొట్టుచు నెక్కువయనాదరము చేయు చుండును. భర్త చేసిన యనాదరమును గాని పలికిన కానిమాటలను గాని పరులతో నెప్పు డును చెప్పఁగూడదు. ఈవిధముగాఁ జేయుచువచ్చినచో భర్తయెంత దుష్టుఁడయినను క్రమక్రమముగా మంచివాఁడయి భార్యయందు నిజ మయినయనురాగము కలవాఁ డగును. భాగ్యవంతులు కట్టుకొనెడు వస్త్రములను పెట్టుకొనెడుభూషణములను జూచితమకట్టివి తెచ్చిపెట్టు మని భార్య పెనిమిటి నెప్పుడును తొందర పెట్టరాదు. తనకుకలదాని తో నేతృప్తిఁ బొందియుండి యెల్లప్పుడును తనస్థితికనుగుణమయిన వేష ముతో నే ప్రవర్తింపవలయును. పెనిమిటి యయోగ్యప్రవర్తనము కల వాఁ డయియున్నపక్షమున నతని నిందింపక, ఆతని నాజ్ఞాపించినట్లు చెప్పక, మంచిసమయముచూచి ప్రియవచనములతో హితోపదేశము చేసి ప్రేమానుబంధముచేత నే యాతనిని మంచిమార్గమునకుఁద్రిప్పుట కయి ప్రయత్నించు చుండవలెను. యోగ్యురాలయినస్త్రీ భర్తచేత లేనిపోనివస్తువులను కొనిపించి ధనము దుర్వినియోగము చేయింపక మిగిలినధనమునులోకోపకారముగా సత్కార్యములయందుపయోగించు

నట్లు ప్రోత్సాహ పఱుపవలయును. భార్యసమస్త విషయములయందును భర్తకులోఁబడియాతని యాజ్ఞానువర్తినియయి మెలఁగవలసిన దేయయి నను, హత్యచేయవలసిన దనికాని, అసత్యము పలుకవలసిన దనికాని దొంగతనము చేయవలసిన దనికాని, నీతిమాలినపనులను భర్త విధించి నను భార్య యెప్పుడును చేయఁగూడదు. ఇటువంటి దుష్టకార్యములు భగవంతునికి సమ్మతము లయినవి కానందున నరకహేతువులగును స్త్రీకి పెనిమిటియే యీలోకములో ప్రభు వయినను. అందఱికిని ప్రభువయి మనకు శాశ్వతమయినసుఖదుఃఖములనుగలుగఁజేసెడి యీశ్వరుఁడను పరిపాలకుఁడు మఱియొకఁడున్నాఁడు. కాఁబట్టి స్త్రీలెల్లప్పుడును భగవం తునియెడలభక్తిగలవారయి త్రికరణశుద్ధిగా నారాధించుచు, ఈశ్వరు నకు ప్రీతికరములు కావనిపాపకార్యములనుభర్తలువిధించినను చేయక వారందువిషయమయి శిక్షించినను లోఁబడుచు, సాధ్యమయినంత వఱకు భర్తలనుగూడ నీశ్వరభక్తియు పాపభీతియు గలవారినిగాఁ జేయుటకయి పాటుపడు చుండవలయును.

## సహాసమును ధైర్యమును.

[౧౮౮౯ వ సం। మెయి నెల]

— : )0( : —

లోకములో ననేకులు కష్టములు రానంతవఱకు మహాధైర్య శాలులవలె నటించినను కొంచెమాపదరాగానే ధైర్యమును విడిచి పిల్లలవలె నేడ్వఁజొత్తురు. ఈయధైర్యము పురుషులలోను విస్తారము గానే యున్నను స్త్రీలలో మఱింతయెక్కువగా కానఁబడుచున్నది. ఆపదవచ్చినప్పుడు వావిడిచి యేడిచిచేసెడి కార్య మేదియులేదు. అట్టి శోకమువలనవచ్చిన యాపదయెంతమాత్రమును తగ్గకపోవుటయే కాక

శోకించెడువారి మనస్సులకును కొన్నిసమయములయం దితరుల మనస్సులకును మితిమీఱిన యాయాసము కలుగును.ఇంట నెవ్వరికయిన రోగమువచ్చినప్పుడుధైర్యముకలిగిరోగనివారణమునకయితగినప్రయత్నములు చేయ టకుమాఱుగా రోగము హెచ్చుగానున్నప్పుడింటనున్న స్త్రీలందఱును వ్రేలుమొగములు వేసికొనిరోగియొక్క మంచముచుట్టును జేరిరోదనముల కారంభింతురు.అందువలన రోగికి రోగము కుదురునేమో యని మనస్సులో నున్నయాశ తగ్గిపోయి యధైర్యముపుట్టి రోగమసాధ్యమగును.రోగికధైర్యముకలిగినతరువాత సాధారణముగా రోగముకుదురుటకిష్టము; వైద్యుఁడెంతగట్టివాఁ డయినను రోగికి నమ్మకము చెడినప్పుడౌషధముతిన్నగాపనిచేయదు. రోగితనరోగము కుదురునన్నదృఢవిశ్వాసముకలవాఁడయియున్నపక్షమున,ఆతనిధైర్యము రోగమునుపదిపాళ్ళునిర్మూలింపఁజేయును. కాఁబట్టి రోగులదగ్గఱ నుండువా రాకారవికారములచేతను మాటలచేతను శోకమున కెంత మాత్రము నెడమియ్యక సహనము గలవారయి నవ్వుమొగములతో నుండి రోగికి ధైర్యముచెప్పి యుత్సాహము కలిగించు చుండవలెను. లోకములోకొందఱితరులకురోగాదికమువచ్చినప్పుడు ధైర్యంకలిగియే యున్ననుతమ కేమైనను కొంచెమురోగమో చిన్నకష్టమోరాఁగా నేధైర్యమంతయువిడిచిగోరంతలుకొండంతలుచేసి చుట్టుపట్లనున్నవారి కేమి యుపనితోఁచకుండునట్లుతొందరపడుచు తాముత్తరక్షణముననే యీ లోకమును విడిచిపోవుచున్నట్లుగాదుఃఖింతురు.నిజముగావారికవసాన కాలము సమీపించినదే యనుకొన్నను; అప్పుడేడిచి సాధించెడికార్యమేమున్నది?తనుకెంతకష్టమువచ్చిననుసహించుకొనియుండియితరులకు కొంచెముకాలిలోముల్లుగ్రుచ్చుకొన్న దనఁగానే యధైర్యపడి విలపించెడివిపరీతస్వభావము మఱికొందఱియం దుండును. ఈరెండువిధములయినపనులును మంచివికావు. ఆపత్సమయములయందుసహనమును

ధైర్యమును గలిగియుండవలెను. అట్టిసమయములయందు మనస్సు చెడక దృఢముగా నున్నపక్షమున విపన్నివారణములకుమార్గముకలిగినను కలుగును. ఆపదవచ్చినప్పుడే యుండనిపక్షమున, సహనమును ధైర్యమును మఱియెప్పుడు కావలసియుండును? స్వతంత్రురాండ్రు కాక పోవుట మొదలయిన కారణములవలన స్త్రీలకీలోకములో కష్టములధికముగా నుండునుగాన సహనము మొదలయినవి వారియం దధికముగా నుండవలెను. అట్టిసహనమువలననే కష్టములయొక్క బాధసగముతగ్గి పోవును. సహనమువిడిచి దుఃఖించుచు పలుమా రాపదలనే తలంచు కొనుచు పరులతో చెప్పుచునుండెడుపక్షమున దాని బాధరెట్టింపగును. కొందఱుస్త్రీలు తమభర్తలు బాధించిరనియు, అత్తలుకోడఱికము పెట్టిరనియు, తఱచుగా పరులముందఱ ఘోషించుచుందురు. అట్టి ఘోషవలన తమకు కలిగెడులాభ మేదియు లేదుగాని యింటిగుట్టువీధి కెక్కుటవలన ననేకము లయిన నష్టములుమాత్ర ముండును. కాబట్టి తెలివిగలవారు తమకష్టములనుగృహచ్ఛిద్రములను పరులవద్దకుపోయి మొఱపెట్టుకొనుచుండక తమలోనే యడంచి వేసి మిక్కిలిగోప్యముగా నుంచుటయెంతయు శ్రేయస్కరము. నలుగురిలో రవ్వాయగుటతప్పవారు గింటిఛిద్రములను పరులువిని యేమిచేయఁగలరు? కొందఱికందఱికన్న విశేషకష్టము లేవియు లేకపోయినను తామేమో లోకములో లేనికష్టముల ననుభవింపుచున్నామని కన్నవారికడ నెల్లను మొఱపెట్టుచు తమ తెలివితక్కువను చాటుచుందురు. ఈయవివేకమునువదలి యెల్లవారును ఓర్పును కనఁబఱుతురుగాక!

## సూక్ష్మవస్తుదర్శకయంత్రము.

[౧[illegible] వ సం॥ అక్టోబరు నెల]

---(o)---



ఈకాలమునందు బుద్ధిమంతులైన శాస్త్రజ్ఞులు కనిపెట్టిన యంత్రములలోసూక్ష్మవస్తుదర్శకయంత్రముమిక్కిలియద్భుతమైనది. ఇదిమిక్కిలియుపయుక్తమైనదని వేఱుగ చెప్పనక్కరలేకయేయెల్ల వారును తెలిసికోవచ్చును. ఈయంత్రసాహాయ్యమునమనముకంటితో చూడలేని సృష్టిలోని పదార్థములయొక్క రహస్యములను తెలిసికో గలము. ఇదియద్దపుబిళ్ళలతోచేయఁబడినది. ఆయద్దపుబిళ్ళలకు చిన్న వస్తువులను పెద్దవిగాకనఁబఱచెడుశక్తియున్నందున, వాని సాహాయ్య మునఁ జూచునప్పుడు కేవలదృష్టికిగోచరములుకానిసూక్ష్మవస్తువులనే కములు తేటగాకానఁబడును. ఈయంత్రముతోచూచెడుపక్షమున సూదిరొకసన్నగునపమువలెను, తలవెండ్రుక వెదురుబొంగువలెను, ఇసుకరేణువు పోకకాయవలెను, పెద్దవిగాకానఁబడును. ఇందుపైనున్న పటమునందు చూపఁబడినదిసూక్ష్మవస్తుదర్శక యంత్రముతోచూడఁ బడిన రొకబిందువుయొక్క స్వరూపము. నీటిచుక్కపైకినిర్మలము గాకానఁబడినను దానియందనేక సూక్ష్మాతిసూక్ష్మములయినవిచిత్ర

జంతువులుండును. ఒక్క నీటిబొట్టులో లెక్కలేని సూక్ష్మజంతువులను వివిధాకారములుగా సృజించివానిని స్వేచ్ఛగాతిరుగుచు సంతోషించు నట్లుచేసిన యీశ్వరునిమహిమ లత్యద్భుతములైనవిగదా! మనమా భూతదర్పణముతో నిదానించి చూచుచున్నయెడల, ఆనీటిబొట్టు లోని యపరిమితములైన జంతువులలో కొన్నిమహావేగముగానిటు నటు పరుగెత్తుచుండుట మొదలైన వానిచేష్టలను, కొన్ని నిడుపు గాను కొన్ని గుండ్రముగాను వివిధాకారములుగానున్నవానిరూపము లను, చిత్రములైనవాని అవయవము లనుచూచియానందింపవచ్చును.

ఈయంత్రములు సామాన్యముగాగుండ్రని యద్దపుబిళ్ళలతోం జేయఁబడియిత్తడిగొట్టముల యందమర్పఁబడియుండును. కొన్నిటి కొక్కబిళ్ళమాత్రమేయుండుటయు, మఱికొన్నిటికి పెక్కుబిళ్ళలుండు టయుఁ గలదు. అద్దపుబిళ్ళకుబదులుగా నీటితోకూడ ఈయంత్రములు నిర్మింపఁబడినవిగాని, అవిమొదటివానియంత చక్కఁగా నుపయోగ పడలేదు. అద్దపుబిళ్ళలను లోపలబోలుగాచేసి యాలోపలనొకద్రావ కమునువేసి దూరవస్తుయంత్రములను నిర్మించిచూచిరికాని వాని వలనఁగూడ రూపము లంతస్ఫుటముగా కనఁబడలేదు.

---

## పాములు.

(౧౨౨౭ వ మెయి నెం)

—?౧?—

లోకములో సర్పజాతులలో వందలకొలఁది భేదములున్నవి. వానిలోనధికసంఖ్యవిషముకలవికాకపోయినను నలువదిజాతులకంటె నెక్కువగానే విషముగలపాములున్నవి. మనదేశములోనున్న పాము లన్నిటిలోను త్రాచుపాముయొక్కవిషము మిక్కిలి యపాయకరమైనది. అది కఱచినయైదునిమిషములలోపల చచ్చినవారు సహితము

పలువురున్నారు. కొందఱిరువదినాలుగుగంటలలోపల చత్తురు. కాట్లు లోతుగా దిగినను విషము తగినంత పడకపోయినపక్షమున, ఒకవేళ దేహము తెలియక మూర్ఛపోయినను బ్రతుకుదురు. ఈవిషమునకువిరుగుడైన మందేదియు నిదివఱకుదొరకలేదు. మంత్రములచేతపాముకాటు కుదిర్చెదమని కొందఱు చెప్పుదురుగాని మంత్రములచేత బ్రతికెడువారు మంత్రము వేయకపోయినను బ్రతుకుదురు. ఈక్రిందిరీతి త్రాచుపాములను పాములవాండ్రు బుట్టలలో పెట్టి తెచ్చి యాడించుచుండఁగా



మీరు చూచియుందురు. ఈజాతిపాములకు పడగయుండును. ఈపడగమీఁదమనవారు కృష్ణపాదములని చెప్పెడుగీతలుండును. పాములవాండ్రు త్రాచుపాములను పట్టుకొనిగరళము పిండి వేసి కానికోఱ లూడదీసి కాని బుట్టలలోపెట్టి యింటింటికి తెచ్చి నాగస్వరము పట్టియాడించుచుందురు. ఊడఁదీసినకోఱలును పిండివేసినవిషమును నెలదినములలోపల మరల వచ్చుచుండును. పాములవాండ్రుతమయొద్దమణి రాయియుండుననియు దానిప్రభావముచేత తమకు విషమెక్కదనియు, చెప్పినను పాములవాండ్రనేకులు పాములుగఱచిచచ్చుచునేయుందురు. ఆమణిరాయివలన నెత్తురునకంటిపట్టుకొనుటతప్ప వేఱుప్రయోజనముకలుగదు. పామునకు పైదౌడయందిరుప్రక్కలరెండుకోఱలువంపుగానుండివానిక్రిందవిషపుతిత్తులుండును. పాము కాటు వేసి యాతిత్తులనునొక్కఁగానేకోఱసందు

లోనుండి నీరువంటియావిషముగాయములో పడిరక్తములోనుండి దేహమంతటను వ్యాపించి హృదయముయొక్క వ్యాపారమును నిలిపివేయును. ఈకోఱలు సామాన్యముగా వాలియుండి పాముకోపము వచ్చినప్పుడు నిలువుగా లేచును. త్రాచుపామైదారడుగుల పొడుగుండును.



ఈపైది అమెరికా ఖండమునందుండెడు మిక్కిలి క్రూరమైన గిలకపామనంబడెడు విషసర్పము. ఇదికఱచినవారు మూడునాలుగు గంటలలోపల తప్పక మృతినొందుదురు. దీనితోకచివరను గిలకలవలె గలగలలాడెడు పొలుసుండునుగనుక దీనికీపేరు కలిగినది. ఇదినడుచునప్పుడు గలగలమని తోకచప్పుడగునుగనుక సాధారణముగా జంతువులు దానిరాకను కనిపెట్టి తప్పించుకొనుట కవకాశము కలుగును. దీని నిడివి యేడడుగులకంటె హెచ్చుగానుండదు.



ఈపైని వేసినది కొండచిలువ. ఈజాతిలో పెద్దవి యిరువదియైదడుగులవఱకును పొడుగుండును. ఇవి విషముకలవి కాకపోయినను నిరపాయకరమైనవి కావు. ఇవి సాధారణముగా జంతువులు నీళ్ళు త్రాగుటకై వచ్చెడు జలాశయముల సమీపమున పొంచియుండియే

దయిన జంతువుతగినంత సమీపమునకు రాఁగా నేదానిమీఁదికి దుమికి నోటితో మెడపట్టుకొని తన దేహమును దానికడువుచుట్టును చుట్టి తోఁకచివరతో చెట్టు మొదలును దేనినయినను పట్టుకొని కాని మఱి యొకవిధముగాఁ గాని చుట్టలు బిగించును. దానియొక్క బలముచేత పట్టుకొన్న జంతువుయొక్క యెముకలన్నియు పటపటవిఱిగి ముద్దయయి జంతువు నిమిషములో చచ్చిపోవును. ఈవిధముగా అది బలమయిన దున్నపోతులను సహితము చంపి తినును. జంతువు చచ్చినతరువాత కొండచిలువ తనచుట్టలనువిప్పి జంతువు దేహమంతయునాకిపసునుచేసి కొమ్ములతోను గిట్టలతోను కూడజంతువునంతను మెల్లమెల్లగా మ్రింగివేసి నెలదినములవఱకును దేహము తెలియక మత్తెక్కి పడియుండును. నెల దినములకు జంతువంతయు జీర్ణముకాఁగా మరల లేచి యది యెరనిమిత్తమయి ప్రయత్నము చేయుచుండును.

## స్త్రీల కుపయోగించు కథలు

### అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్రచరిత్రము
7 రఘు దేవరాజీయము
8 కురంగేశ్వరనర్తకచరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళిని సాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీవిలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీప్రభాకరము
19 మాలతీమధుకరము

## స్త్రీలకుపయోగించు పుస్తకములు

### ఆరవ సంపుటము

1 శ్రీవిక్టోరియామహారాజ్ఞి చరిత్ర
2 సతిహితబోధిని
3 పత్నీహితసూచని
4 స్త్రీ నీతిదీపిక
5 సత్యాద్రౌపదీ సంవాదము
6 మాతృపూజ పితృపూజ
7 నీతికథామంజరి ప్ర॥ భాగము
8 డిటో ద్వి॥ భాగము
9 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు.

### ఏడవసంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్యవివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణులయుక్తాకృత్యంబు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల యుప॥
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీ పునర్వివాహచరిత్రం
20 స్త్రీపునర్వివాహ విషయకోపన్యాసం
21 స్త్రీపునర్వివాహ విషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహ వి॥ ద్వి॥ ,,
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సం॥
24 స్త్రీపునర్వివాహభూతవర్త
మానస్థితులు

ఉపన్యాసములు జీవితచరిత్రలు.

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ
దానియుద్దేశము
2 శంకరాచారులు
3 బసవరాజు గవర్రాజుగారి
జీవచరిత్రము
4 జీసస్ చరిత్రము
5 స్వదేశసంస్థాన చరిత్రాంశములు
6 విగ్రహతంత్రవిమర్శనము
7 ఉపన్యాసమంజరి
8 వివేకవర్ధని మొదటిభాగము
9 ,, రెండవభాగము
10 ,, మూడవభాగము

సాహిత్యగ్రంథములు

తొమ్మిదవసంపుటము

1 సంగ్రహవ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకారసంగ్రహము
4 నీతిచంద్రిక విగ్రహము
5 నీతిచంద్రిక సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీ చరిత్రములు

ఆంధ్రకవుల చరిత్ర.

పదియవ సంపుటము

పూర్వకాలపు కవులు 1 వ భా॥
మధ్యకాలపు కవులు 2 వ భా॥
ఆధునిక కవులు 3 వ భా॥

స్వీయ చరిత్రలు.

పదకొండవ సంపుటము

1, 2 భాగములు కలిపి

N. B. పైగ్రంథములన్నియు వాల్యూములుగాను, విడిగాను, కూడ దొరకును,

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి. హితకారిణీ సమాజము.

రాజమహేంద్రవరము

అని వ్రాసిన బడయగలరు.

# పత్నీహితసూచని




గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు





ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1951


[వెల రు 1-0-0

కీర్తిశేషులైన రావుబహద్దూరు

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కార గానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగవిద్యా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయము)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కల్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వచనప్రబంధములు

## పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# సతీహితసూచని.



గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగము పంతులు

3వ కూర్పు

ప్రకాశకులు:
హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము
1950

# విషయసూచిక

# పత్నీ హితసూచని.

## మొదటి ప్రకరణము.

### ఆర్తవకాలము.

—:)0(:—

ఆర్తవకాలమనఁగా సమర్తాడినది మొదలుకొని ముట్లుడుగువఱకును గలకాలము స్త్రీలయాయుష్కాలములో మిక్కిలి ప్రధానమయినది. స్త్రీ మొట్టమొదట పుష్పవతియగుట సమర్త యని చెప్పుదురు. స్త్రీకి రజస్వలకాఁగానే బాల్యముజాఱి యౌవన మారంభమయినట్లు చెప్పవచ్చును. ఇప్పటి నుండియే కనిపెంచెదుకాల మారంభమయి ముట్లుడుగువఱకు నుండును. మిక్కిలి కాక దేశములలో బాలికలు పది సంవత్సరముల ప్రాయమప్పుడే రజస్వల లగుదురు. అతిశీత దేశములలో నిరువది సంవత్సరములవయస్సు వచ్చువఱకును పుష్పవతులు కారు. ఈ హిందూదేశములో స్త్రీలు సాధారణముగా పండ్రెండుసంవత్సరములు మొదలుకొని పదునాలుగు సంవత్సరములలోపల ఋతుమతులగుదురు. కాని యీయీడునకులోపలనుతరువాతనుకూడ రజస్వలలయినవారును పలువురుందురు. బొత్తిగా రజస్వలలుకాని స్త్రీలుసహితము కొందఱుందురు. అట్టివారికి మూచకమ్మలని పేరు. అట్లుండుట వ్యాధిగుణముకాని సహజగుణముకాదు. గర్భాశయములోఁగలుగు వ్యాధివలనఁగానిమఱికొన్ని యితరరోగముల వలనఁగాని మూచకమ్మలగుట సంభవించును. మూచకమ్మలు తఱుచుగా బలహీనురాండ్రుగాను, మంచియాఁకలియు నిద్రయు లేనివారుగాను, ఆయాసమును నడుమునొప్పులును కలవారుగాను, ఉందురు. ఇట్టివారికి కాళ్ళును చేతులును చల్లగానుంమును ;

మనోవ్యాకులతయు, పనిచేయుట కనిష్టమును, కష్టశ్వాసమును, కూడ నుండును. వీరికిబలముకలుగఁజేసెడియౌషధములనిచ్చుచు,మలబద్ధము లేకుండఁజేసి, పుష్టికలుగఁజేసెడి యాహారమును శీతోదకస్నానమును దేహపరిశ్రమమును మంచిగాలిలో సంచారమును కలిగించిన యెడల, వీరిలోపలువురుఋతుమతులగుదురు. ఒకతొట్టిలోఉప్పునీళ్ళు వేడివిపోసి యందరగంటసేపు నడుమువఱకును మునుఁగునట్లుకూరుచుండుటకూడ పుష్పవతియగుటకు సహాయము చేయును. అయిననుమాచకమ్మలెక్కడనో యరుదుగానుందురుగాని తఱుచుగా నుండరు.

స్త్రీలుసమర్తాడినది మొదలుకొని ముప్పది ముప్పదియైదు సంవత్సరములవఱకును నెలకొకపర్యాయము ముట్టగుచుందురు. అటుతరువాత ముట్లుడిగిపోవును. రజస్వలయయినతరువాతనే దేహముచక్కగా వృద్ధిపొందుట కారంభించును, సమస్తాంగములునుపూర్తియగును.బుద్ధి వికాసము కలుగును. స్త్రీయెప్పుడురజస్వలయగునోయప్పటినుండి గర్భమునుధరించుట కర్హురాలని యేర్పడుచున్నది. అయినను సమర్తాడిన మాత్రముచేతనవయవపూర్తి కాదు;అటుతరువాతఁగొన్నిసంవత్సరము లకుఁగాని యవయవములన్నియు నెదిగి సంపూర్ణదశను పొందవు కాఁబట్టి స్త్రీ కథమపక్షముపదునాఱుసంవత్సరములు వచ్చువఱకైనను గర్భాధానముచేయకుండవలెను. అంతకు లోపలనే గర్భాధానముచేసిన యెడల, స్త్రీ బలహీనురాలయి యంగపరిపూర్తి యుపయుత్వమును లేనిదగును. అంతేకాకయటువంటి స్త్రీగర్భవతియైనపక్షమున, ప్రసవ వేదన దుర్భరమయివాయువుసహితమురావచ్చును; పొత్తికడుపునందలియెముకలు పూర్ణముగా నెదుగవుగనుక శిశువుశిరస్సుపైకివచ్చుట మిక్కిలికష్టమగును; మాతాశిశువు లపాయములేకుండ బ్రతికినను మిక్కిలి బలహీనులును రోగిష్ఠులునునగుదురు. కాఁబట్టితల్లిదండ్రులు తమకూఁతుల కీదేశములో పదియాఱేండ్లకు లోపల పునస్సంధానము (ఆలుమగలను

కలుపుట) చేయకుండవలయును. స్త్రీపురుషుల నల్పవయస్సులో కలుపుట యెట్లు చెఱుపుచేయునో యట్లే యత్యధికవయస్సులో కలుపుటయు చెఱుపుచేయును. ముప్పదిసంవత్సరములు దాటినతరువాత మృదువుగా నుండవలసిన గర్భాశయాదులయందలికండలు గట్టిపడి బిగిసి పోయి ప్రసవమగుట దుస్సాధ్యమగునుగనుక, క్షత్రియులు మొదలయినవారు కూడ తమకూఁతులకు ముప్పదిసంవత్సరములలోపలనే తప్పక వివాహము చేయవలెను.

ఆరోగ్యదశయందుండుస్త్రీలు చాంద్రమాసమునకనఁగా నిరువది యెనిమిదిదినములకొక్కపర్యాయము ఋతువగుచుందురు. ఋతువగుట వెనుకనైనదినమునందుమాత్రమే కాకసరిగా మునుపయిన వేళకుఁ గూడ సాధారణముగా సంభవించును. సరిగా మూఁడువారములకొక్కపర్యాయముఋతువగుస్త్రీలునుకొందఱుందురు. ఋతుకాలముసామాన్యముగా మూడుదినములు మొదలుకొని యైదుదినములవఱకు నుండును. కొందఱికి వారముదినములవఱకు నుండునుగాని యది సాధారణముగా జబ్బుచేతనైనది. ఈదినములలోసాధారణముగా పదపంద్రెండు తులములరజస్సు (ముట్టునెత్తురు)పయికివచ్చును. స్త్రీలుగర్భమునుధరించుటకు క్రమముగాఋతువగుచుండవలెను. ఋతువుకాకమునుపే గర్భమును ధరించిన స్త్రీలుసహితము కొందఱు కలరుగాని యట్టివా రెక్కడనో నూటికికోటికినొక్కరుగానుందురు. పల్లెలయందువసించుబాలికలకంటె పట్టణములయందుండువారుశీఘ్రముగారజస్వలలగుదురు; పట్టణములలో నుండెడువారిలోసహితము బీదవాండ్రలోకంటె ధనికులయి భోగపరాయణులయి యుండెడివారిలో బాలికలు శీఘ్రముగా ఋతుమతులగుదురు. కాఁబట్టి యీహిందూదేశములో పదిసంవత్సరములు దాటకమునుపే బిడ్డలతల్లులయిన పడుచులును కొంద అక్కడక్కడఁ గానఁబడుచున్నారు. ఋతువగుట యనఁగా స్త్రీయొక్కగర్భమునుండి

యెఱ్ఱనినీరువంటిద్రవము పయికివచ్చుటయని యెల్లవారికిని దెలియును. ఈద్రవమునకు రజస్సని పేరు. ఇదిబహువిషయములయందు రక్తమును బోలియున్నను రక్తముమాత్రముకాదు; ఆరోగ్యస్థితిలోనున్న స్త్రీకెప్పుడును రజస్సు రక్తమువలె పేరుకొనదు. ఇది నెత్తురువలె నెఱ్ఱనిదయి గర్భాశయమునందూరును. ఇది పేరుకొన్నపక్షమున, వాకిటనున్నప్పుడపరిమితమయిన శూలకలుగును; అట్లు పేరుకొనుగుణము పోకమునుపు స్త్రీ గర్భమును ధరింపదు; ఒకవేళ గర్భమునుధరించినను, కడుపునిలువదు. గర్భమునుధరించినతరువాతనుబిడ్డనుగనిపాలిచ్చుకాలమునందును స్త్రీఋతుమతికాదు. గర్భమునుధరించియున్నకాలములోకూడ ముట్లగుచుండెడుస్త్రీలు కొందఱు కలరుగాని, వారికాకాలమున వచ్చినది నిజమయినరజస్సుగాక గర్భాశయముయొక్క ముఖమునందున్నచిన్నరక్తవాహికలనుండివచ్చెడునిజమయినరక్తమేయైయుండును. అదియొకటిరెండుదినములును కొన్నిసమయములయందు కొన్నిగంటలవఱకునుమాత్రమేయుండి యత్యల్పముగానుండును. ఆకాలములో గర్భాశయమునుండి నిజమయినరజస్సేపయికివచ్చుటసంభవించినపక్షమున గర్భపాతముకలుగును. కొందఱుస్త్రీలుశిశువులకుపాలియ్యవలసినకాలములో ఋతువగుచుండుటయుఁగలదు. అట్లు ఋతువుకాఁగానే పాలుచెడి యనారోగ్యకరమగునుగాన, ముట్లగుచుండెడు తల్లిచేతఁగాని, దాదిచేతగాని శిశువులకు పాలిప్పింపఁగూడదు.

వాకిటనున్నకాలములో దేహకష్టమువిస్తారముగాఁ జేయఁగూడదు; చల్లనిపానకము మొదలయినవిత్రాగఁగూడదు; చలినీటిలోస్నానము చేయఁగూడదు; తేమలోతిరుగఁగూడదు పాలిపోయినబలహీనముగానుండి యతిసుకుమారిణులుగా నుండువారు సాధారణముగా రజస్సుత్యల్పమగుట యత్యధికమగుట మొదలయిన ముట్టుదోషమేదైనను గలిగియుందురు. ఋతుకాలమునందు కడుపునొప్పి యుండుటకాని, స్రావ

మత్యధికమగుటగాని, అత్యల్పమగుటగాని, తెల్లగానుండుటకాని, నలుపెక్కుటగాని, మిక్కిలి జబ్బు. శరీరములో తగినంత నెత్తురు లేక బక్కచిక్కియుండు స్త్రీకి స్రావ మత్యధికముగాని యత్యల్పముగాని యగుట సంభవించి దెల్లపడిపోయి కొన్నిసమయములయందు నీటివలె నగును. రజస్సు తెల్లపడి నీటివలెనయినను, నల్లపడిచిక్కనయినను, గర్భోత్పత్తికాదు. స్రావము తక్కువగుట సాధారణము తెలుపురోగ మువలనఁ గలుగునుకాఁబట్టి యుక్తసమయములో దానికి తగినచికిత్స చేయింపవలెను. ఆరోగ్యదశలో లేనప్పుడు రజస్సొక్కొక్కముట్టున కొక్కొక్క విధముగా నుండును; ఒకప్పుడు తెల్లగాను, ఒకప్పుడెఱ్ఱ గాను, ఒకప్పుడు నల్లగాను, ఒకప్పుడాకుపచ్చగాను, ఉండవచ్చును; స్రావ మొకప్పుడు ఒక్కదినమును, ఒకప్పుడు రెండుదినములును, ఒక ప్పుడు మూడునాలుగు దినములును, మఱియొకప్పుడు వారముదినము లును, ఉండవచ్చును. ఒక స్త్రీకి ఋతువుక్రమముగా నున్నప్పుడు, రజస్స్రావము యొక్క పరిమితియు, రూపమును, కాలమునుకూడ తిన్నగానుండవలెను. కాలము సరిగానుండి పరిమాణముగాని వర్ణము గాని సరిగానుండకపోయినను, పరిమాణము సరిగానుండి వర్ణముగాని కాలముగాని సరిగానుండకపోయినను, వర్ణముసరిగానుండి కాలపరి మాణములలో నేరెండుగాని యొక్కటిగాని మూడునుగానిసరిగా నుం డకపోయినను, ఆరోగ్యదశలో లేదనికనిపెట్టి తరుణముమించకుండ యుక్తకాలములోనే తగినచికిత్సచేయింపవలెను. ఒక స్త్రీసంతానవంతు రాలయి కుటుంబమున కపారసంతోషముకలిగించుటకును, గొడ్రాలయి బంధుమిత్రాదుల కపారదుఃఖమునుకలిగించుటకును, ఋతుస్థితియే ముఖ్యకారణముగనుక దీనివిషయమయి యుపేక్షచేయక తగినశ్రద్ధ పుచ్చుకొనుచుండవలెను.

కొందఱికి ఋతువుకావలసినదినములలో బొత్తిగా ముట్లునిలిచి

పోయి, గర్భాశయమునం దూరినరజస్సు శరీరములోనింకిపోవును; మఱి కొందఱికి ముట్టారంభమయినతరువాత వెంటనే స్రావము కట్టిపోవును. ఇట్టివారి కారంభదశలో బాధయేమియు లేనట్లు కానఁబడినను కాలక్రమమున జ్వరమును, అజీర్ణత్వమును, బలహీనతయు కలుగును: కొందఱికి ముక్కులోనుండిగాని, ఆసనములోనుండిగాని, శ్వాసకోసములలోనుండిగాని, జీర్ణాశయమునుండిగాని, ఏదయినను వ్రణముండినయెడల దానినుండిగాని మిక్కిలి వేదనతో నెత్తురుకారును. ఈవ్యాధిని ముట్టుకట్టని చెప్పుదురు. తడిబట్టలు కట్టుకొనుట, తఱుచుగా చన్నీళ్లలో స్నానములు చేయుచుండుట, తేమలో నడుచుట, చలిగాలి దేహమునకు సోఁకుట, వానలో తడియుట మొదలయినవానివలన జలుబు చేసి యీవ్యాధి సంభవించునుగనుక బుద్ధిమంతురాండ్రగువారీదురాచారములను మానవలెను. ఇంతేకాక యీవ్యాధి భయమువలనఁగాని, అధికవ్యసనమువలనగాని, ఆహారలోపమువలనఁగాని, అమితసంభోగమువలనఁగాని, తెలుపు రోగమువలనఁగాని, చెడుగాలివలనఁ గాని, తఱుచుగా గర్భపాతములగుచుండుటవలనఁగాని, కలుగును. ఈకారణములచేత ముట్టునిలిచినప్పుడు జ్వరమును, పొత్తికడుపులో నొప్పులును, తప్పుమాటలును కూడ రావచ్చును. ఇట్టిసమయములో సైంధవలవణసంబంధమయిన విరేచనౌషధమియ్యవలెను; వేడినీళ్ళలో చేరెడునువ్వులు నలుగఁగొట్టివేసి యానీళ్ళలో నడుమునుమునుఁగునట్లుకూర్చుండఁబెట్టవలెను; కడుపునొప్పి నిలుచుటకు నల్లమందుగాని, కురాసానీ ఓమముగాని, చేర్చిన మందులియ్యవలెను; పొత్తికడుపుపయిని గసగసాలకాయలు (నల్లమందుకాయలు) వేసి కాచినసలసలలాడు వేడినీళ్ళలో కంబళి మొదలయిన బొచ్చుగుడ్డముంచినీరుపిడిచి కాచవలెను; జ్వరముపోవుటకై కాక తగ్గించి చెమటపట్టించెడియౌషధముల నియ్యవలెను. అసలేముట్టునిలిచిపోయినప్పుడును, ముట్టయినతరువాత స్రావముతిన్నగా లేనప్పుడును, ఈక్రింది

యీపథములలో దేనినైనను ఇయ్యవచ్చును:—

(1) చక్కగా చూర్ణముచేసిన పరిశుద్ధమయిన ముసాంబరము ఇరువదినాలుగు(24)ధాన్యపుగింజలయెత్తును, చూర్ణముచేసినఅన్నభేది యిరువదినాలుగు (24) ధాన్యపుగింజల యెత్తును, అరువది (60) ధాన్యపు గింజలయెత్తు దాల్చినచెక్క చూర్ణమును, ఈమూడును చేర్చి చక్కగా కలిపి దానిలో మాత్రచేయుటకు తగినంత తేనెను పోసి మెదిపి యిరువదినాలుగు మాత్రలుచేసి రెండేసి మాత్రలుచొప్పునదిన మునకు రెండుసారులు పుచ్చుకోవలెను. తులము (రూపాయి) నూట యెనుబది (180) ధాన్యపుగింజలయెత్తు కడుపుతోనున్నప్పుడుగాని, ముట్టుతోనున్నప్పుడుగాని, యీమాత్రల నియ్యఁగూడదు. స్త్రీ పాలి పోయి చిక్కి జలహీనురాలుగానున్నప్పు డవశ్యముగా నియ్యవలెను.

(2) పది (10) ధాన్యపుగింజలయెత్తు వెలిగారపుపొడుమును, పది (10) ధాన్యపుగింజలయెత్తు దాల్చినచెక్కపొడుమును, చేర్చి దిన మునకు మూడేసిసార్లు పుచ్చుకొన్నయెడల పైవ్యాధి నిర్మూలించును.

ముట్టుతోకూడనొప్పికనిపించినపక్షమునదానినిబుతుశూలయం దురు. ఈరోగముగలవారికి ముట్టయినప్పుడు స్రావముతక్కువగానుండు టయేకాక దానితోఁగూడ నల్లని నెత్తురుకుదుపలును తీగెలవంటి రక్త మును పడును ఇట్టివారికి తలనొప్పి, పొత్తికడుపులోనొప్పి, వాంతులు మొదలయినవికలుగును. పొత్తికడుపు చేతితోనొక్కినపక్షమున నొప్పి మఱింతయెక్కువగును. ఈవ్యాధిచేత బాధపడువారు సాధారణముగా గొడ్డురాండ్రుగానుందురు. పయినిజెప్పిన రీతిని తొట్టిలో నువ్వులుకలి పిన వేడినీళ్ళుపోసి, ఒక్కొక్కసారి యరగంటచొప్పున దినమునకురెండు సారులందులో ముట్టయినకాలములో స్త్రీని నడుమువఱకును మునుగు నట్లుగా కూర్చుండఁబెట్టినపక్షమున నొప్పితగ్గును. నల్లమందును,కర్పూ రమును, చేరినమందులిచ్చినను నొప్పిశాంతించును. ఈవ్యాధికిదేహాపరి

శ్రమము సౌఖ్యమునిచ్చును. ఈ క్రిందవివరించిన మందులను నడుమునకు రాచినయెడల నొప్పి నివ్మారించును:—

(1) నల్లమందుద్రావకము:—అఱువది (60) ధాన్యపుగింజల యెత్తునంగా తులములో మూఁడవవంతు బజారు నల్లమందును తెచ్చి, అయిదుతులముల గొబ్బరినూనెలోఁగాని నువ్వులనూనెలోగానిదానిని వేసి రుద్దినయెడల, నల్లమందందులో మిళితమయి ద్రావకమువలె నగును. దీనినిచక్కఁగా కుదులించి నొప్పిగలచోట్ల రాయుచుండవలెను.

(2) ఉమ్మెత్తద్రావకము:-రెండున్నరతులములయెత్తుఉమ్మెత్త గింజలను నలుగఁగొట్టి, అరసేరునువ్వులనూనెలో వేసి యేడుదినములు నాననిచ్చి దానిని గుడ్డతోవడియఁబోసి యాచమురును రాచినయెడల నొప్పిశాంతించును. ఇదిచేయుటసాధ్యముకానిపక్షమున, ఉమ్మెత్తాకులు పచ్చివితెచ్చి (కావలసినయెడల కొంచెము నీళ్ళుపోసి) ముద్దగానూరి, దానితో సమానపరిమాణముగల బియ్యపుపిండినికూడ కలిపి నూరి, ఆ ముద్దను నొప్పిగలచోట్లను పట్టించినను నొప్పిపోవును.

స్వాభావికముగా కావలసినదానికంటె రజస్స్రావ మధికముగా నయ్యెడుపక్షమున దానికి కుసుమరోగమని పేరు. ఈరోగముకలవారికి ముట్టయినదినములలో స్రావమధికమగుటకాని,ముట్టుదినములధికమగు టకాని, నెలనిండకమునుపే నడుమనడుమ ముట్టగుచుండుటకాని,సంభ వించును. ఈసమయమునందు శాకచేసెడు భోజనపదార్థముల నెంత మాత్రము తినకుండవలెను. వాకిటనున్నకాలములోమనస్సు నాయాస పెట్టక, అధికముగాతిరుగుట కూర్చుండుట మానివేసి, దేహమునకు విశ్రాంతికలుగునట్లు వెల్లికల పరుండవలయును. ప్రతిదినమును ప్రాతఃకాలమున పొత్తికడుపు మొదలయిన భాగములమీఁద తడిబట్ట వేయవలెను. లేదా తొట్టిలో చల్లని నీళ్ళుపోసి దానిలో మొలవఱ కును మునుఁగునట్టుగా గడియసేపు కూర్చుండవలెను. నాడితీవ్రముగా

నున్నపక్షమున, అయిదు ధాన్యపుగింజలయెత్తు శుద్ధిచేసిన పట్లుప్పును (సురేకారమును) నీళ్ళలోకలిపి గంటకొకసారి యియ్యవలెను; నాడిబల హీనముగా నున్నయెడల, గంధకద్రావకము రెండు మూడుచుక్కలు నీళ్ళలోవేసి యియ్యవలెను. అధికస్రావమువలన కాళ్ళును చేతులును చలువలుక్రమ్మినపక్షమున, కర్పూరతైలమునుఅఱకాళ్ళకునుఅఱచేతుల కునురాచిమర్దనచేసి, మంగలములోవేఁచిన వేఁడితవుడుతోఁగాని, వేఁడి యిసుకతోఁగాని, వేఁడియుప్పుతోఁగానివెచ్చపుట్టునట్లుగాచుట్టుచుట్టున కాచవలెను. ఇట్టియపాయసమయములోరోగిని లేవఁదీసిననుకూర్చుండఁ బెట్టినను కన్నులుతిరిగి మూర్ఛవచ్చునుగనుక వ్యాధిగ్రస్తురాలిని సదా పరుండఁబెట్టియేయుంచవలెను. నీళ్ళువిస్తారముగాత్రాగనియ్యకూడదు. ఇతరదినములలో రోగని వేళకుభోజనముచేసి, మంచిగాలిగలచోటప్రతి దినమును తిరిగి కొంచెము దేహపరిశ్రమము చేయుచుండవలెను. కొంత కాలమువఱకును పురుషసంభోగమును మానవలెను. సాధ్యమయిన యెడల సముద్రస్నానముచేయుట మిక్కిలి మంచిది. రక్తము విస్తార ముగా స్రవించుచున్న కాలములో నీక్రిందిమందుల నుపయోగించ వచ్చును:—

(1) శ్వాసకోశములు మొదలయినలోపలియవయవములనుండి నెత్తురువచ్చుచున్నపక్షమున పదిపండ్రెండువడ్లగింజలయెత్తు పటికారపు పొడుమును నల్లమందుతోచేర్చిగాని చేర్చకగానిదినమునకుమూడుసార్లు చొప్పున లోపలికియ్యవలెను. జ్వరము విశేషముగా నున్నయెడల దీని నియ్యఁగూడదు. అరసేరుపాలలో నూటయిరువది వడ్లగింజలయెత్తు (తులములో మూడుపాళ్ళలో రెండుపాళ్ళు) మెత్తగా నూరినపటికారపు పొడుము వేసి పదినిమిషములవఱకునుకాఁచి వడియఁబోసియొక్కొక్క సారి నాలుగయిదుతులములచొప్పున దినమునకు మూడుసారులు సేవిం చినపక్షమున రక్తస్రావము కట్టును.

(2) ఇంతకంటె మంచిమందు దొరకనిపక్షమున కల్లుకాడిని (సిరకాను) నీళ్ళలోకలిపి రుచికితగినంత పంచదారను వేసి లోపలికియ్య వచ్చును. అంతేకాక చల్లని కల్లుకాడిని నీళ్ళను జేర్చి, రక్తము స్రవించు చున్న భాగమునందు తఱుచుగా చల్లుచువచ్చినయెడల రోగిణికిశమనము గానుండుటయేకాకవిశేషభాగము రక్తస్రావముసహితముకట్టిపోవును. చిన్నగుడ్డపీలికను కల్లుకాడిలో నానఁబెట్టిముక్కులో పెట్టినయెడలకొన్ని సమయములయందు ముక్కులోనుండి నెత్తురు కారుట నిలిచిపోవును.

వైద్యాభావమునందు పయిచికిత్సల నన్నిటిని సొంతముగానే చేయవచ్చినను రోగతత్వము తెలిసియనుభవశాలియయిన వైద్యుఁడు దొరకెడు పక్షమున వెంటనే యాతని పిలిపించి యుక్తసమయములో తగినచికిత్సచేయించుట యెంతయు శ్రేయస్కరము.

ముట్లు ముప్పది మొదలుకొని ముప్పదియైదుసంవత్సరముల వఱకు నుండునుగాన, ఈదేశములో స్త్రీలకు నలువదియైదు సంవత్సరముల ప్రాయమువచ్చునప్పటికి ముట్లుడిగిపోవును. కొన్నిచలువదేశములయం దేఁబదిసంవత్సరముల ప్రాయమువచ్చువఱకును ముట్లుడుగవు. కాఁబట్టి యతిశీతలదేశములలో నేఁబది యఱువదసంవత్సరములువచ్చిన స్త్రీలకుఁ గూడ సంతానము కలుగుట యక్కడక్కడఁ గానఁబడుచున్నది. ముట్లు డుగుటకుముందు వ్యాధియందువలెనే స్రావము కాలవర్ణపరిమాణముల యందు హెచ్చుతగ్గులుగలిగి యక్రమముగా నుండును. ఈమార్పుకలి గెడుకాలమునందు క్రొత్తరోగములను దౌర్బల్యమును కలుగుట కధి కావకాశము కలిగియుండును గనుక ఈకాలమునందు జాగరూకతతో మెలఁగవలయును. ముట్లుడిగినతరువాత సంతానయోగ్యతలేక నెమ్మ దిగా కాలము గడపవలసినదశ యారంభమగును.

## రెండవ ప్రకరణము.

## గర్భిణీ స్త్రీలు.

ఆవర్తవకాలము స్త్రీలు బిడ్డలను కనఁదగిన కాలమని యీవఱకే చెప్పియున్నాము. ఆఁడువారి యాయుష్కాలములో నిది సార్థకమయినదనియు ప్రధానమయినదనియు చెప్పవచ్చును. ఈకాలములో గర్భోత్పత్తియగుటకు కారణము స్త్రీపురుషసంయోగము. స్త్రీయొక్క రజస్సును పురుషునియొక్క యింద్రియమును మంచిస్థితిలోనుండి ఋతుకాలానుసారముగా సంభోగము సంభవించినపక్షమున పిండోత్పత్తియగును. ఈపిండము గర్భాశయమునందు రెండుపొరలతోఁ గప్పఁబడి, కొలనిలోని తామర మొగ్గవలె గర్భజలములో తేలుచుండును. పిండమునకును మాతృగర్భమునకును మావిమూలమున సంబంధము కలిగియుండును. పిండమునకు రెండుమాసములు వచ్చువఱకును మావి ప్రత్యేకముగా కానఁబడదు. గర్భాశయమున కంటియుండెడు మావితో బొడ్డుతీగె యనఁబడెడి యొకప్రేగుమూలమున పిండము చేరియుండును. పూర్ణముగా నెదిగినప్పుడిరువదియంగుళముల పొడువుగలిగి రెండుత్రాళ్ళను కలిపి పేనినట్లుగా నుండెడి యీప్రేగుదారినే రక్తము బొడ్డులోనుండి పిండమునకుఁ బోవుచుండును. అవయవవిభాగము లేవియులేక పిండము నాలుగువారములు గడచువఱకును బూడిదవర్ణముగల జిగటగానుండు ముద్దవలె నుండును. అప్పుడు దానిప్రమాణము గచ్చకాయంతతిత్తిలో పెద్దచీమయంతయయి యుండును. ఆఱవవారమునందది సీమచిక్కుడుగింజంతయగును; ఆకాలమునందు తక్కినభాగమంతయు నెంతయుండునో యించుమించుగా దానితలయునంతయుండును. ఏడెనిమిదివారములు వచ్చునప్పటికి ముఖ్యావయవములన్నియు స్పష్టముగా నేర్పడి పొడవునందు పిండమొకటిమొద

లుకొని రెండంగుళములవఱకునుండును. మూడవ నెలలో పిండమూఅం గుళములవఱకు నెదుగవచ్చును. నాలవ నెలలోశిశువునకు స్త్రీపురుషభేద మేర్పడును. అయిదవమాసములో గర్భములోని శిశువునకు వెంట్రుకలును గోళ్ళును మొలచును; ఈమాసమునందేకడుపులోపిండము కదలుట కారంభించును. ఎనిమిదివమాసములోశిశువుకన్నులు తెఱచును.

గర్భమును ధరించినది మొదలుకొని ముట్లునిలిచిపోవును. కొందఱికి రోగాదికముచేత ముట్లునిలుచుటయు కొందఱికిగర్భమునుధరించిన తరువాతకూడ కొంతకాలము వఱకును ముట్లు కలుగుచుండుటయు, కలవు. కాఁబట్టి యీయొక్కటియేగర్భచిహ్నమని భ్రమింపఁగూడదు. గర్భమయినతరువాత స్త్రీకినిద్రాభంగము, జ్వరమువచ్చినట్లు దేహము కాకగానుండుట, ఉమ్మియెక్కువగానూరుట, అరుచి, అజీర్ణత, రొమ్ము లలో సూదులుగ్రుచ్చినట్లుపోట్లుకలుగుట, మొదలయిన చిహ్నములు కూడ కానఁబడును. గర్భమువృద్ధిపొందినకొలఁదిని చనుమొనలునలుపెక్కి పెద్దవగుట, రొమ్ము లెదుగుట, రొమ్ములలోపాలుపడుట, మొదలయిన లక్షణములుకూడ కానవచ్చును. కొందఱికి చిరాకునుకోపమును హెచ్చును. ఈచిహ్నములలో నిద్రలేవఁగానే నోటిలోనుండి నీరూరుచుండుట, పైత్యపునీరువాంతియగుట, భోజనమునందిష్టము లేకపోవుట, కడుపులో వేదనగానుండుట, మొదటినెలలోనే యారంభమగును. ఇవిగాక రెండవమాసములో రొమ్ములలో పోట్లుపొడుచుట, కదుములు కట్టుట, రొమ్ములపయిని పచ్చనరములు స్ఫుటములగుట, చనుమొనల చుట్టునుగలప్రదేశమునల్లనగుట, చనుమొనలచుట్టునుముండ్లుముండ్లుగా నుబికియుండి పిండినయెడల పాలువచ్చుట, మొదలయిన చిహ్నములు కనఁబడును. మూడవమాసముకడపటరొమ్ములునుపొత్తికడుపును పెద్దవగును. కాఁబట్టియీచిహ్నములనుబట్టిస్త్రీగర్భమును ధరించినసంగతిని తెలిసికోవచ్చును. కడుపులోని వేదన, నోటిలోనుమ్మియూరుట, వాంతు

ము, నాలవమాసములోనిలిచిపోవును. ఆఱవమాసములో గర్భాశయ మెదిగి నాభినంటును; ఏడవమాసములోపొత్తికడుపు మిక్కిలి పెద్దదయి నాభిపయిని రెండంగుళములవఱకును పయికి లేచును. తొమ్మిదిమాస ములునునిండి పదవమాసములో మర్మస్థానమునుండి మనవాఱుతీగెలు వేయుటయనిచెప్పెడు జిగటపదార్థముపయికి రానారంభింపఁగానే ప్రసవ కాలము సమీపించినదని తెలిసికోవచ్చును.

శిశువుయొక్కయు తల్లియొక్కయు ఆయురారోగ్యవృద్ధిని సుఖ ప్రసవమును కోరెడు కడుపుతోనున్న పడుచులు ఈక్రిందచెప్పెడుఅంశ ములయందును మిక్కిలి శ్రద్ధయుంచవలయును:—

1.—కడుపుతోనున్నవారెప్పుడును బట్టలను బిగువుగా కట్టు కొనరాదు; మిక్కిలి గుత్తమైన రవికలను తొడుగుకొనకూడదు. చీర మిక్కిలిబిగువుగాబిగించికట్టుకొన్న పక్షమున, లోపలిశిశువునకునుతల్లికిని కూడ అపాయమునంభవించును. అట్లుచేయుటవలనకొన్నిసమయముల యందు కడుపుదిగఁబడిపోవును; కొన్నిసమయములయందు పిల్లఅడ్డము తిరిగి కష్టప్రసవముకలుగును; కాఁబట్టిగర్భిణీస్త్రీలు స్వేచ్ఛగాకడుపెదు గుటకు తగినట్లు బట్ట వదులుగాకట్టుకొనవలయును. రవికను మిక్కిలి బిగువుగా ముడివేసికొన్నపక్షమున, ఱొమ్మెదుగుటకు ప్రతిబంధముగా నుండుటయేకాక చనుమొన లణఁగిపోయి శిశువుపాలుత్రాగుటకువీలు లేకుండపోవును; ఒకానొకప్పుడు స్తనములయందు నొప్పిసహితముకలు గును. కాఁబట్టి చన్నులెదుగుటకుతగినట్లుగారవికలను వదులుగాతొడు గుకొనవలయును.

2.—కడుపుతోనున్నవారు వేఁడినీళ్ళ నెంతమాత్రమును పోసి కొనరాదు. దేహమునకు పడినపక్షమున నిత్యమును చన్నీళ్ళలో స్నానముచేసి దేహమును శుభ్రముగా తోముకొని తుడుచుకొనవల యును; అప్పుడుసహితము తడవునీళ్ళలోనానక వెంటనే లేవవలయును,

ఒడలికి చన్నీళ్ళుపడనిపక్షమున, ప్రతిదినమును తడిగుడ్డతో శరీరమును తుడుచుకొనుచువారమునకొకసారియైననునులివెచ్చనినీళ్ళతోస్నానము చేయుచురావలెను. నిత్యమును గోరువెచ్చనినీళ్ళుపోసికొన్నను పోసికో వచ్చును. గర్భవతులుపయినుండి ధారగాపడునీటియందుఁగాని, కొండ కాలువలయందుఁగాని, సముద్రమునందుఁగానిస్నానముచేయకూడదు.

3.—కడుపుతోనున్నవారికి దేహపరిశ్రమముముఖ్యముగానుండ వలయును. వారుదొడ్డియందును, ఇంటియందును తఱుచుగాతిరుగుచు పనిచేయుచుండవలయును. తినికూరుచుండక యింటిపనిచేయుచుప్రాతః కాలమునందును సాయంకాలమునందును మంచిగాలి తగులునట్లుగా దొడ్లలో వెల్లడియైనచోట మెల్లగా తిరిగెడుపక్షమున, దేహారోగ్యము కలిగి విరేచనబద్ధములేక సుఖముగానుందురు.మంచిగాలియు, దేహపరి శ్రమమును, పనియులేనియెడల దేహము దుర్బలమయి యధికమయిన గర్భవేదనయు చిరకాలప్రసవమునుసంభవించును. అందుచేతనే పాటు పడెడుబీదస్త్రీలు దేహదార్ఢ్యముగలవారయి రెండునొప్పులతో సుఖ ముగాబిడ్డనుగని ప్రసవవేదన యనుమాటయే తలపెట్టకుండుటయు, భాగ్యవంతులస్త్రీలు పాటుపడక తిని కూరుచుండుటచేత ముక్కుచు మూలుగుచుప్రసవకాలమువచ్చునన్నమరణముతో సమానముగాచూ చుచుండుటయు సంభవించుచున్నది.వారుభయపడినట్లుగానేసాధారణ ముగా ధనికులస్త్రీలలోప్రసవము తల్లికో బిడ్డకోగండముగానుండును. ధనవంతులయింతులుకూడ తమయింట బీదలవలె పాటు పడి పని చేసెడుపక్షమున ప్రసవమునకు భయపడవలసినయక్కఱ లేక సుఖపడ వచ్చును.కడుపుతోనున్నవారుపరుగెత్తుటకాని,దుముకుటగాని,బిందెలు మొదలయినబరువు లెత్తుటగాని, నృత్యముచేయుటగాని, ఉయ్యాల లూగుటకాని, వంగుటకాని,ఒడలువెనుకకువిఱుచుకొనుటగానిబొత్తిగా మానివేయవలయును. మాననిపక్షమునగర్భపాతంసంభవింపవచ్చును.

గర్భిణీస్త్రీలకు సోమరితనముతో సమానమయిన శత్రువుమఱియొకటి లేదుగనుక దానినిమాని, తినికూరుచుండి పరుండుటతో కాలముగడపక గృహకృత్యములుస్వయముగాచేసికొనుచు తాము దేహపటుత్వము గలవారై తమకుపుట్టెడుబిడ్డలనుకూడ రోగాదులచే తీసికొనక బలిష్ఠులుగా నుండునట్లు చేయవలయును.

4.—కడుపుతోనున్నవారు నెలలు హెచ్చినకొలఁదిని కొంచెమాహార మధికముగా తినవలయునుగాని గురువుగానుండు పదార్థములనుమాత్రము తినఁగూడదు. మత్తుచేసెడు ద్రవ్యముల నెంతమాత్రమును దరికి చేరనియ్యరాదు. కాఁక చేసెడు పదార్థములను వేనిని తినకుండవలయును. మన దేశములోసూడిదలపేరు చెప్పి గర్భిణీస్త్రీలకుమధురాహారములు విశేషముగా పెట్టుదురుగాని, ఆయాచారము మంచిది కాదు. అట్టివస్తువులను తఱుచుగా తినుటవలన అజీర్ణత్వాదివ్యాధులు పుట్టి దేహముచెడిపోవును. కావలసియున్నపక్షమున ద్రాక్షపండ్లుమొదలయిన ఫలములను, నిమ్మకాయలరసము మొదలగునవానిని, ఇయ్యవచ్చును. అట్టివి తినుటవలన దాహశాంతియై మలబద్ధము మొదలయినవి నశించును. గర్భిణీస్త్రీలకెప్పుడు నేకరీతిపదార్థములే పెట్టక కూరలు మొదలయినవానిని తఱుచుగామార్చుచు భోజనమునందుఅభిరుచి కలిగింపవలయును. అంతేకాక కడుపుతోనున్నవారు త్రాగెడుజల మెప్పుడును మిక్కిలి నిర్మలముగ నుండుటయావశ్యకము. అటువంటి పరిశుద్ధమయిన నీరు సంభవింపనియెడల త్రాగెడునీటిని కాచిమఱిపుచ్చుకొనవలయును. దీనిని అశ్రద్ధచేయుదురేని కొన్ని సూతికారోగములు తటస్థించును.

5.—కడుపుతోనున్నవారు పగలు రెండుమూడుగంటలసేపునకొకపర్యాయము గడియసేపుమంచముమీఁదనొరగుటమంచిది. పరుండుట ఆయాసకరముగా నుండకుండునట్లుగామంచముమీఁద ననుకూల

ముగా తలగడలను దిండ్లను ఎత్తుపెట్టుకొనవలయును. రాత్రులుమిక్కిలి ప్రొద్దుపోయినదాఁక మేలుకొనియుండక పదిగంటలకెల్లను పాన్పుచేరవలయును. పడకగదిలోనికిపయినుండి శుద్ధవాయువుప్రవేశించునట్లుగా గవాక్షములను తెఱచియుంచవలెను. గాలిరానిచీకటిగదులలోనుమిద్దెగదులలోను బొత్తిగా పరుండరాదు. అట్లుపరున్నచో శ్వాసాదులవలన గాలిచెడిపోయి జబ్బుచేసి కడపట బాలింతరోగములుసంప్రాప్తములగును. కాఁబట్టి గాలివిషయమునను దుర్గంధపదార్థములవిషయమునను మిక్కిలి శ్రద్ధవహించుచు, మురికికాల్వలనుప్రతిదినమునుతఱుచుశుద్ధిచేయుచు, దొడ్లలో పెంటపోగులును కుళ్ళెడుకొమ్మలుమొదలయినవియు మురిగిన పేడకుప్పలును నిలువయుండనీయకతీసివేయుచురావలెను. రాత్రులుమాత్రమేకాక పగళ్ళయందు సహితము మంచిగాలిలోపలికివచ్చు సదుపాయములనుచేసి వాసముచేయుగృహములతలుపులనుగవాక్షములను తెఱచియుంచవలెను. ఇఱుకుగానుండక పడకగదులు విశాలముగానుండుటయెంతయునావశ్యకము. పక్కనువేయు దుప్పట్లను మాయనియ్యక తఱుచుగా ఉతికించుచు శుభ్రమయినక్రొత్తదుప్పట్లను వేయుచుండవలయును. పరుండుమంచము గాలికెదురుగా తలుపులవద్దవేయకకొంచెముప్రక్కకువేయవలెను. శీతకాలమునందుగవాక్షములతలుపులనుపూర్ణముగా తెఱవకనాలుగయిదంగుళములవఱకుతీసియుంచవలెను. వేసవికాలమునందు చలువచేసెడుపండ్లనుతినవచ్చును. విరేచనబద్ధము కలిగిన పక్షమున చిట్టాముదము కొంచెము పుచ్చుకోవచ్చును. ప్రొద్దెక్కినదాఁక నిద్రపోవక తెల్లవాఱుజామున నేలేచిపయిని చెప్పినరీతిని దేహపరిశ్రమమును స్నానాదికమునుచేయవలయును. కడుపుతోనున్న స్త్రీలీప్రకారముగా నడుచుకొందురేని, తాము రోగమును రొచ్చును లేక తిన్నగాతిరుగుచు సుఖప్రసవముగలవారయినిరోగులును దీర్ఘాయుష్మంతులునయిన బిడ్డలను గందురు.

కడుపుతోనున్న స్త్రీలకా కాలమునందు కొన్ని స్వల్పరోగములు సంభవించును. చిన్నతనములోనున్నవారు సిగ్గుచేత వాని నితరులతో చెప్పక దాచుచుందురు. అట్లుచేయుటజబ్బు. ఆరంభదశలోనే తమజబ్బును పెద్దవారితో చెప్పి తగినమందు పుచ్చుకోవలెను. అట్లుచేయనియెడల మొదట గోటితోతీర్పవలసినపని తరువాత గొడ్డలితో తీర్పవలసివచ్చును.

1.—గర్భిణీస్త్రీలకు సాధారణముగా విరేచనబద్ధము సంభవించుచుండును. ఆసమయమునందు రసభస్మము మొదలయిన రసము కలిసిన విరేచనౌషధముల నెంతమాత్రము పుచ్చుకొనకూడదు. అప్పుడు విరేచనముల నిమిత్తము పుచ్చుకోవలసిన మందులలోనెల్లను చిట్టాముదము మిక్కిలి శ్రేష్ఠమయినది. సాధారణముగా విరేచనౌషధములను పుచ్చుకొనక కమలాఫలములు మొదలయిన పులుపులేని పండ్లను కాయగూరలను తినుటవలనను క్రమముగా దేహపరిశ్రమమును చేయుటవలనను కాలవిరేచనము కావచ్చును. మలబద్ధము కలిగినయెడల చిట్టాముదము నప్పుడప్పుడు విస్తారముగా పుచ్చుకొనుటకంటె తఱచుగా ననఁగా వారమునకు రెండుపర్యాయములు కొంచెము కొంచెముగా పుచ్చుకొనుట మంచిది. అప్పటిస్థితినిబట్టి డబ్బెత్తు మొదలుకొని రెండుడబ్బులయెత్తు వఱకును చిట్టాముదమును లోపలకు పుచ్చుకోవచ్చును. ఆముదము కంపుకొట్టకుండ పుచ్చుకొను మార్గములు కొన్నిగలవు. ద్రాక్షసారాయము పుచ్చుకొనెడిరీతి అద్దపుగిన్నెను తెచ్చి దానిలోపలిభాగమంతయు చక్కగా తడియునట్లుగా నీళ్ళతోతడిపి తరువాత దానిలో సగమువఱకును అప్పుడు తెచ్చిన తేటనీటినిపోసి తరువాత కావలసిన చిట్టాముదమును అంచులకుతగులకుండునట్లు పదిలముగా నడుమనుపోసి చటుక్కున నోటిలోపోసికొని మింగినయెడల, ఆముదము పుచ్చుకొన్నట్లే యుండదు. నీటికి బదు

లుగా అప్పుడు పితికిన పాలనుపోసి వానిమీఁద తేలిన యాముదము నైనను పుచ్చుకోవచ్చును. లేదా పంచదార వేసిన కాఫీనీళ్ళలో పోసి యైనను చిట్టాముదమును పుచ్చుకోవచ్చును. అసలు కాఫీనీరే విరేచనకారిగనుక, అప్పుడాముదముయొక్క మోతాదుకూడ తగ్గించవచ్చును. నారింజపండ్లరసములో ఆముదమును వేసియైనను పుచ్చుకోవచ్చును. ఇట్లని విరేచనబద్ధము లేనప్పుడుమాత్ర మాముదమును పుచ్చుకోరాదుసుమీ. ఈయాముదమును ప్రాతఃకాలమున మాత్రమే త్రాగవలయును. ఆముదము త్రాగుట మిక్కిలి కష్టముగా తోఁచిన యెడల ప్రాతఃకాలమునందు డబ్బేస్తు తేనెను ప్రత్యేకముగాఁగాని తేయాకునీళ్ళలో కలిపిగాని పుచ్చుకొన్న యెడల జాడించి విరేచనమగును. ఏ యౌషధమును పుచ్చుకొనక విరేచనబద్ధమువిషయమై అశ్రద్ధ చేసినపక్షమున ప్రసవవేదన చిరకాలముండి కష్టముగాను బాధాకరముగాను అగును.

2.—గర్భిణీస్త్రీలు సాధారణముగా మలబద్ధము కలవారుగా నున్నను, వారికొకానొకప్పుడునీళ్ళవిరేచనములు వెళ్లుటయుకలదు. అట్టి సమయములయందు కడుపులోనున్న జబ్బుపదార్థమేదోప యికిరావలసి యుండును. మనమప్పుడు క్రొత్తగా పితికినపాలపయిని కొంచెము చిట్టాముదము వేసి లోపలికిచ్చినయెడల సమస్తము నివారణమగును. విరేచనములతోడిపాటుకడుపునొప్పికూడకలిగియున్న యెడల ప్లానలుగుడ్డతో కుట్టినసంచిలో వేఁడిఉప్పువేసికడుపుకాచినయెడలనిమ్మళించును. ఆసమయములో కాళ్లనుచేతులనుపొడిగానుంచుటయే కాక కడుపుమీఁదప్లానలుగుడ్డవేసియుంచుటమంచిది. అంతటితో విరేచనములుకట్టకపోయినపక్షమున, మోదుగుబంకనుచూర్ణముచేసి దానిలో కొంచెముదాల్చినిచెక్కచూర్ణమునుకూడకలిపి పదిమొదలుకొనిముప్పదివడ్లగింజలయెత్తు వఱకును ఇచ్చినచో నిమ్మళించును. లేదా మాచికాయచూర్ణముచేసి పదునేను వడ్లగింజలయెత్తు తేనెలోకలిపి దినమునకు మూడుసారులిచ్చి

నను నిమ్మళించును. దీనిలోకొంచెము దాల్చినిచెక్కపొడుమునుకూడ కలుపవచ్చును. విరేచనము లధికముగా నున్నయెడల ప్రతిపర్యాయము మును మాచికాయ పొడుములో ధాన్యపుగింజయెత్తులో సగము నల్ల మందును చేర్చుచురావలెను.

3.—కడుపుతోనున్న వారికికొన్నిసమయములయందు కాళ్ళును చేతులును తాపముగానుండి నిద్రపట్టకుండును. అప్పుడు వారు పరుపు మీఁదినుండి లేచిగదిలో ఇటునటుపచారుచేసి, చిన్న చెంబెడు చల్లనినీళ్ళు దాహముపుచ్చుకొని అల్పాచమనమునకు వెళ్ళివచ్చి, తలగడను త్రిప్పి చల్లని అడుగువైపు తలక్రిందపెట్టుకొని మరల పరున్నయెడలనిద్రపట్టు ను. ఈతాపము పగలు వచ్చినయెడల కొంచెముసేపు గాలిలో తిరిగి యింటిపని చేసినయెడల నెమ్మదికలుగును. అటువంటి సమయములో స్త్రీలుప్రాతఃకాలమున దేహమంతయు చక్కగాతోమి కడుగుకొని, కొంతవఱకుపనిచేసిగాలిలోతిరుగుచు, రాత్రులుచన్నీళ్ళతోముఖమును, ఱొమ్మును, మెడను, చేతులను, భుజములను కడుగుకొనుచు, వెచ్చని యిఱుకుగదులలో పరుండక విశాలమయినగదిలో గాలి వచ్చునట్లు తలుపుతీసి పరుండవలయును.

4.—ఒకానొకప్పుడు గర్భిణీస్త్రీలకుగుండెలలోమంట బయలు దేఱుటకలదు.అప్పుడుపులిత్రేనుపులునువచ్చును.కడుపులోనున్న శిశువు నకుకూడ పోషణము కావలెననియున్న మెక్కువతినుటచేతను,ముల్లం గి, కంద, పెండలము మొదలైన గురుపదార్థములను తినుటచేతను, తిన్నదితిన్నగాజీర్ణముకాక యారోగముపుట్టును. అప్పుడన్నముయొక్క మొత్తమునుకొంతతగ్గించి,అజీర్ణకారులై గురుత్వముచేసెడి పదార్థముల నేమియు తినక, సాధ్యమయినంతవఱకు ఆకుకూరలును నేయియు తగ్గింపవలయును. పులుసుపదార్థముల నంతగాతినకుండవలెను. సున్న పునీటి తేట తులము తెచ్చి కాచినపావుసేరు పాలలో వేసి దినమునకు

రెండుసారులు పుచ్చుకొన్నయెడల పులిత్రేనుపులు నిమ్మళించును. కడుపుతోనున్నవారికి తినుటకు మనసువచ్చినదెల్ల పెట్టినయెడల తల్లియు పిల్లయుకూడ బలహీనపడుదురు.

5.—వాతత్వపు స్త్రీలకును పైత్యతత్వపు స్త్రీలకును కడుపుతోనున్న కాలములో మలబద్ధమువలనఁగాని యెండలోతిరుగుటవలనఁగాని వానలోతడియుటవలనఁగాని తేమలో నడుచుటవలనఁగాని శిరోవాయువుచేసి తలనొప్పి వచ్చుటగలదు. ఈతలనొప్పి సాధారణముగా విరేచనౌషధ మిచ్చుటవలనపోవును. ఇటువంటిసమయములో మజ్జిగ, అనపకాయ మొదలయినజలుబువస్తువులను, గుమ్మడికాయ, చిక్కుడుగింజలు మొదలయినవి సులభముగా జీర్ణముకాని వస్తువులను తినకుండవలెను. మంచులోను గాలిలోనుతిరుగకుండవలెను. తలలో మల్లెపువ్వులు మొదలయినవి పెట్టుకొనకూడదు. తలనొప్పియు పడిసెమునువచ్చినపక్షమున వెచ్చచేసినఓమము (వాము) కాని నల్లజీలకఱ్ఱకాని సన్నగుడ్డలో మూటకట్టి పీల్చవలెను.

6.—గర్భిణీస్త్రీలకు కడుపులోను పేగులలోనుగాలిచేరి రాత్రులు నిద్రపట్టకుండుటయు సాధారణముగా సంభవించును. ఇది తగినంత దేహసాధకములేకపోవుటచేతను రాత్రిమితముతప్పితినుటచేతను సంభవించును. కాఁబట్టి యిటువంటి సమయములలో ఔషధసేవచేయక పగలు మంచిగాలిలోతిరిగి పనిచేసియు రాత్రి లఘువుగా భుజించియు దేహస్థితిని బాగుపఱుచుకోవలెను. సొంటికషాయములో కొంచెము చిట్టాముదము వేసి ప్రాతఃకాలమున పుచ్చుకొన్నయెడల మంచివిరేచనమయి యీబాధశాంతించును.

7.—కొందఱికి కడుపుతోనున్న కాలములోమూలశంకకనఁబడి మిక్కిలి శ్రమకలుగచేయును. బహిర్భూమికి వెళ్ళినపుడు మూలముల గుండ రక్తముపడి మిక్కిలి బాధగానుండును. అప్పుడు తినుకుచు చాల

సేపు కూరుచుండక మలవిసర్జనమయిన తత్క్షణమే లేచిరావలెను. ఒక వేళ పేగుమిక్కిలి పైకివచ్చినపక్షమున గోళ్ళులేని ప్రేళ్ళతో మెల్లగా లోపలికి త్రోయవలెను. కొందఱికెన్నియౌషధములిచ్చిననుపోక యీ మూలవ్యాధి ప్రసవమగువఱకును నిలిచియుండును. ఇదిమిక్కిలిబాధగా నున్నయెడల వేడినీళ్ళఆవిరిపావుగంటవఱకుపట్టిన కొంతయుపశమనము కలుగును.

8.—కొందఱికి గర్భముతోనున్నప్పుడు పండ్లతీతయు నొప్పియు కలుగును. అప్పుడు పుప్పిపన్ను నెంతమాత్రము నూడతీయించరాదు. ఊడదీయించినచో సాధారణముగా గర్భస్రావముకలుగును. లవంగద్రావకముతో దూదితడిపి బాధగానున్న పంటిమధ్య పెట్టినచో శాంతించును.

9.—సాధారణముగా గర్భిణీస్త్రీల కారంభదశయందు వేవిళ్ళు పుట్టి పిల్లకదలనారంభించువఱకు నుండును. అప్పుడు వమనము వచ్చిన ట్లుండి నోటివెంబడిని నీళ్ళువెడలిపోవును. ఇది ప్రాతఃకాలమునందుమాత్రముండితరువాత స్త్రీయెప్పటివలెనే తిన్నగానుండును. ఇదికొంతబాధగానున్నను దీనివలన నేమియునష్టము కలుగదుగనుక మందులు వేయనక్కరలేదు. పసరు విస్తారముగా వెడలుచు మిక్కిలిబాధగానున్నపక్షమున, కొంచెములవంగములను నలుగగొట్టిసలసలకాగెడు వేడినీళ్ళలో వేసి యరగంటసేపుంచి యాకషాయము పుచ్చుకొనుటవలన నిమ్మళించును. కొందఱికి వేవిళ్ళు ప్రసవదినములకు ముందుకూడ వచ్చును. ఈచిహ్నములు ప్రాతఃకాలమునందుమాత్రమేకాకదినమెల్ల నున్నపక్షమున వేవిళ్ళు కానేరవుగనుక జబ్బుకు తగినచికిత్స అప్పుడు చేయించవలెను. వమనము తిన్నగావెళ్ళక వేవిళ్ళవలన వికారము కలిగినప్పుడు లోపలికి కొంచెము వేడినీళ్ళు పుచ్చుకొన్న వమనమునకుసహాయమునయి నెమ్మదికలుగును.

10—కడుపుతోనున్నవారికి కొందఱికి చనుమొనలు పుండ్లు

పడి యెంతో బాధకలుగును. దీనికిముందుగా నేజాగ్రత్తపడిచనుమొన లకు ప్రతిదినమును ఉడుకులాము‌ను రాయుచువచ్చిన పక్షమున,ఆబాధ నివర్తించును. లేకపోయినయెడల చనుమొనలుకడిగితుడిచి వానిపైని నువ్వులుసూనెరాచినను బాధపోవును. గర్భధారణదినములలో చను లుబ్బి నొప్పిగానున్నను దానివలన కీడేమియు గలుగదు.

11.—బలహీనురాండ్రయి యధికసుకుమారిణులుగా నుండు స్త్రీల కయిదవనెలలో మూర్ఛవచ్చుచుండుట కలదు. ఒకానొకప్పుడు ప్రసవవేదనయందును మూర్ఛవచ్చును. అప్పుడు కాళ్ళును చేతులును చల్లపడి నాడికనఁబడకపోవును. మూర్ఛపోయిన వారిని పడిపోయిన తావునుండి కదలించఁగూడదు; తలక్రింద దిండ్లను ఎత్తుపెట్టఁగూడదు. చుట్టును మనుష్యులు గుంపుగాచేరక చక్కఁగా గాలిపాఱునట్లు చేయ వలెను.అఱకాళ్ళకుకర్పూరతైలముగాని, అదిదొరకనియెడల కర్పూర ముకలిపి పసుపుపొడుముగాని, రాయవలెను. మొగమున చన్నీళ్లుకొట్ట వలెను. విరేచనముల కౌషధమిచ్చి పాలు, పెరుగు మొదలయినబలము చేసెడు పదార్థములను యథేష్టముగానిచ్చుచు శరీరదార్ఢ్యము కలుగఁ చేసినపక్షమున మూర్ఛ రాకుండును.

12.—కడుపుతోనున్నవారికి పలువురకు మనోవ్యాకులతకలు గును. ఇది సాధారణముగా బాల్యస్త్రీలకు తామెట్లు ప్రసవవేదనకు సహింపఁగలుగుదుమాయను భీతిచేతను, భీతినిపుట్టించెడుకథలనువినుట చేతను, కలుగును. కాఁబట్టి మొదటిసారికడుపుతోనున్నస్త్రీలవద్ద నెప్పు డును కష్టప్రసవమునుగూర్చికాని ప్రసవమయిరోగపడిమరణమునొందిన వారిని గూర్చికాని యెంతమాత్రమును మాటాడక సురక్షితముగా ప్రసవముసంభవించుననియు మంచిబిడ్డ కలుగుననియు చెప్పి సంతోష పెట్టి వారికుత్సాహము కలిగించుచుండవలెను.

కడుపుతోనున్న కాలములో ముఖ్యముగాప్రసవదినములుసమీ

పించినప్పుడు విరేచనబద్ధము లేకుండునట్లు చేయుటకయి బహుశ్రద్ధ పుచ్చుకొనవలయును. అప్పుడావిషయమయి అశ్రద్ధచేసినయెడల సుఖ ప్రసవము సంభవింపక మిక్కిలి హానికలుగును. విరేచనముల నిమిత్తమయి ప్రత్యేకముగా మందులు తినక తినెడు పదార్థములతోనే తగిన సదుపాయమునుచేయుచుండవలెను. ప్రొద్దునలేవఁగానేకొంచెముచన్నీళ్ళుత్రాగినయెడల మంచివిరేచనము కావచ్చును. ఆకుకూరలను,పచ్చికాయలను, ఉడుకనికూరలను బొత్తిగా తినకూడదు. మిక్కిలి కోమలమయిన దేహస్థితి గలవారికి గర్భదినములలో అప్పుడప్పుడు మూర్ఛవచ్చుటయుకలదు. అప్పుడు ముందుకొంచెముసూచనకనపడఁగానే తలక్రిందదిండులేకుండ మంచముమీఁద వీపుమోపి వెలికిలపరుండవలయును; కిటికీలతలుపులు తీసియుంచవలెను; ముఖముమీఁద చల్లనినీళ్ళు చల్లవలెను; గదిలో పలువురు గుంపు కూడ కుండవలెను; వాసనచూచెడి యుప్పును ముక్కువద్ద పెట్టవలెను. అటువంటి స్త్రీలకు మనోవ్యాకులత మొదలయినవి కలుగకుండ కాపాడుటయేకాక రాత్రులు ప్రొద్దుపోయినదాఁక మేలుకొనకుండునట్లును, తలుపులుబిగించిగాలిరానిగదిలో నిద్రపోకుండు నట్లును, జాగ్రత్తపుచ్చుకొనవలెను.

గర్భపాతము—గర్భిణీస్త్రీలకుసాధారణముగావచ్చెడిరోగములనుగూర్చి కొంత చెప్పియున్నాముగదా? ఏదయిన జబ్బుచేత ఏడవ మాసము పూర్తికాకమునుపు కడుపు దిగఁబడిపోవుట గర్భపాత మనఁబడును. అది సంభవించినప్పుడు నిజముగా ప్రసవమైనప్పటికంటెఎక్కువ బలహీనత కలుగును, గనుకను, ఒక్కసారి కడుపు దిగఁబడిపోయిన పక్షమున మరల నదేప్రకారముగా సంభవించుచువచ్చి దేహముచెడిపోయిసంతానప్రాప్తియేలేకపోవచ్చును గనుకను,దానినిగుఱించికూడ కొంత వ్రాయవలసియున్నది. విస్తారముదూరమునడుచుట, మిట్టపల్లములుగానుండు దారిని బండిలో ప్రయాణముచేయుట, పొగబండ్లలో

అధికదూరము వెళ్ళుట, శక్తికిమించికష్టపడుట, రాత్రులు విస్తారముగా మేలుకొనుట, అతిసంభోగము, ఎత్తునుండిపడుట, కోపము భయము మొదలైన మనోవికారము లధికముగా గలుగుట, బరువైన వస్తువుల నెత్తుట, గాఢమయిన విరేచనౌషధములు వేసికొనుట, రసముతినుట, బలహీనత, నాట్యముచేయుట, నడుముగట్టిగాబిగించుట, పిడుగులు మొదలయిన గొప్పధ్వనులు వినుట, కాకమందులనువేసికొనుట, కడుపులో పురుగులుపుట్టుట, మొదలయినవి గర్భపాతమునకు కారణములు గనుక, ఈవిషయమయి మిక్కిలి జాగ్రత్తగా నుండవలెను.

గర్భపాతము సంభవించుటకు ముందుగా స్త్రీ ఒకటి రెండుదినములు బలహీనముగాను, నిరుత్సాహముగాను, ఉండును. అప్పుడుపొత్తికడుపు, తొడలు, గజ్జలు, నొప్పిగానుండును. ఇటువంటి చిహ్నములు కనబడిన వెంటనే తగినవైద్యునిచికిత్సపనిచేయించినయెడల గర్భపాతం మాన్పవచ్చును. సముద్రపుగాలియుచన్నీళ్ళస్నానమును కొన్నిసమయములయందు గర్భపాతమును మాన్పును.

పయిచిహ్నములు కనబడినప్పుడు ఉపేక్షచేసినయెడల, ఒకటి రెండు దినములయినతరువాత కొంచెమురక్తముపడుటయారంభమయి క్రమక్రమముగా ప్రవాహముక్రిందమారి తరువాత పేరుకొనును. అప్పుడు నొప్పులంతగా కనపడవు. ఇప్పుడునసహితము తగినశ్రద్ధపుచ్చుకొనిపని చేసినయెడల గర్భపాతమును మాన్పవచ్చును.

అటుతరువాత నొప్పులారంభమయి, మొట్టమొదట కొంచెముగాను, అప్పుడప్పుడు వచ్చునవిగాను, కడుపుమెలివేసినట్టుగాను, ఉన్నను పిమ్మటఅధికముగాను, క్రమమయినవిగాను, కడుపునుండిపిండముజారువిధముగాను, అగును. అప్పుడు పిండముచచ్చి గర్భమునుండి విడిపోయియుండును గనుక గర్భపాతము తప్పదు.

సాధారణముగా గర్భపాతములు రెండవ నెల కడపటివారము

మొదలుకొని మూడవనెల చివరవఱకును సంభవించినను, ఒకానొక ప్పుడు తరువాత నెప్పుడైనను సంభవించును. నాలవమాసము లోపల గర్భస్రావము కలిగినయెడలనంతహానికరముకాదు.అప్పుడుతగినచికిత్స చేయించినయెడల ముం దట్టివి జరగకుండ నివారింపవచ్చును. నాలవ మాసమునకు తరువాత దినములు గడచినకొలదిని గర్భపాతమువలన హాని యధికమగుచుండును.

రక్తస్రావమునకు తరువాత ప్రసవవేదనతోసమానమైననొప్పు లువచ్చినను, రక్తస్రావమధికమయి ముద్దలుముద్దలుగావచ్చినను, స్తన ములు చిన్నవయి మెత్తపడిపోయినను, అకస్మాత్తుగా పాలెండిపోయి నను, కడుపులో చల్లగాను బరువుగాను ఉండి కడుపు చిన్నదయినను, కడుపులో పిల్లకదలుచిహ్నాలు కనపడక పోయినను,ఒత్తిగిలిప్రక్కమా ర్చినప్పుడుకడుపులోపిండమొకప్రక్కనుండియొకప్రక్కకుపడినట్లుకనపడి నను,పిల్లచచ్చుట నిశ్చయమేగనుకగర్భపాతముతప్పకకలుగవలసినదే. తఱుచుగా గర్భపాత మారంభమయినఅయిదాఱుదినములలోనేకలిగి నను కొన్నిసమయములయందు రెండు మూడు వారముల దాఁక కూడనుండును.

కొంచెము రక్తము పయికి వచ్చుట కనపడఁగానే తిరుగుట చాలించి మంచమును జేర్చి వీపుమీఁదగాని ప్రక్కలనుగానిపరుండవల యును. ఆసమయములోపథ్యముగా మితాహారమునుతినుచు, తేలికగా జీర్ణమగు జావ మొదలయినవానిని పుచ్చుకొనవలెను. త్రాగెడు జలము మొదలయినవి చల్లనివిగా నుండవలెను. ద్రాక్షపండ్లు చలువను బల మును కలుగఁజేయును. ప్రసవమైనస్త్రీల కేప్రకారముగా పథ్యపాన ములు నడుపుదురో గర్భపాతమయినస్త్రీలకునుఅదేప్రకారముగాజరప వలెను. అట్లుచేయనియెడల తరువాత దేహముచెడి వ్యాధులకు పుట్టి నిల్లగును. ప్రతిదినమును ప్రాతఃకాలమున తప్పక చన్నీళ్ళలోస్నానము

చేయుచు వచ్చినయెడల దేహముదృఢపడును. శీతకాలములో మాత్రము గోరు వెచ్చనినీళ్ళు పోసికొనవలయును.

గర్భపాతమునకు పాత్రురాండ్రయిన స్త్రీలు కడుపుతో నున్నది మొదలుకొని ప్రతిదినమును చాలసేపు పరుండియుండవలెను. మనస్సు నెప్పుడును విచారములపాలు కానియ్యక నెమ్మదిగానుండవలెను. పిండి వంటలను మధురాహారములను తినక సామాన్యమైన పదార్థములనే పుచ్చుకొనుచుండవలెను. మత్తుచేసెడి పదార్థముల నెంతమాత్రమును పుచ్చుకొనఁగూడదు. సాధ్యమైనంత శీఘ్రముగా రాత్రులు పడకగది చేరుచు, సంభోగచింత సహితము లేకుండువట్లుగా ప్రత్యేకముగామంచి గాలి ప్రవేశించెడు గదియందు పరుండవలెను. విధిలేక వచ్చినప్పుడు కొంచెము చిట్టాముదమును తప్ప విరేచనౌషధములను పుచ్చుకొనఁ గూడదు. ప్రతిదినమును కొంచెమునడిచిస్వల్ప దేహసాధకమును చేయ వలెను. కడుపుతోనున్నవారితర స్త్రీలు ప్రసవమగుచున్నప్పు డాగదుల లోనికి పోఁగూడదు. పోయిప్రసవమునుచూచెడుపక్షమునగర్భపాతము సంభవించును. కడుపుతోనున్నవారు చిత్రమూలము, గోరోజనము, కస్తూరి, ఇంగువ, మొదలైనవేవియు తినఁగూడదు. పురుష సంభోగముకూడ గర్భపాతమున కొక కారణమయినందున, ఇంటనున్న పెద్ద వారు పడుచుతనములోనున్న దంపతులను ఆకాలములో నొకగదిలో పరుండనియ్యక వేఱుచేయవలెను.

దొంగనొప్పులు — ప్రసవసమయమునకుముందే కడుపుతోనున్న వారికి కొందఱికిముఖ్యముగాప్రథమగర్భమునదొంగనొప్పులువచ్చును. అవి నిజమయిన నొప్పులని భ్రమింపఁగూడదు. నిజములైన నొప్పుల కును వీనికినిగల భేదము కొంతచెప్పెదము. దొంగనొప్పులు నెలలునిండు టకు మూడు నాలుగు వారములకుముందే వచ్చును; నిజమైననొప్పులు నెలలు నిండినతరువాతఁగానిరావు. దొంగనొప్పులువచ్చినప్పుడు తీగెలు

వేయుటయుండదు; నిజమయిన నొప్పులు తీగెలు వేయుటతో నే యారంభమగును. దొంగనొప్పు లొకచోటనుండక మొదట నొకచోటనుతరువాత మఱియొకచోటను మాఱిమాఱి గజ్జలలోను, తుంట్లలోను, మొలలోను, కడుపులోను కనపడును; నిజమైన నొప్పులు సాధారణముగా వెనుక తట్టున నారంభమగును. దొంగనొప్పులు క్రమముగా నుండక యొకప్పుడు పావుగంటతరువాతను మఱియొకప్పుడుఒకటిరెండుగంటల తరువాతను వచ్చును; ఒకప్పుడు నొప్పికొంచెముగాను మఱియొకప్పు డత్యధికముగాను ఉండును; నిజమయిన నొప్పులు క్రమకాలమునవచ్చుచు అంతకంత కధికమగును. ఇటువంటి సమయములో కొంచెము చిట్టాముదము లోపలికి పుచ్చుకొన్నయెడల, అంతయు నిమ్మళించును; అట్లు నిమ్మళించనియెడల, కొంచెము పెచ్చచేసి కర్పూరతైలము కడుపునకురాచి, రాత్రులు పరుండఁబోవునప్పుడు బొచ్చు(ఫ్లానలు) గుడ్డలో వేఁడిఉప్పు వేసికాని, రబ్బరుసంచిలో వేఁడినీళ్ళుపోసిగాని శమనముకలుగునట్లు కాచవలెను.

కడుపునోచుకాలము—సాధారణముగాకడుపు నిలిచిన దినము మొదలుకొని రెండువందల యెనుబది దినములకనఁగా తొమ్మిదిమాసములపదిదినములకు ప్రసవమగుదురు. ఈచెప్పినకాలమునకంటెమిక్కిలి ముందుగా ప్రసవమైనయెడల సాధారణముగా స్త్రీశిశువును, మిక్కిలి ఆలస్యముగా ప్రసవమయిన యెడల సాధారణముగా పురుషశిశువును పుట్టును. సాధారణముగా స్త్రీలందఱును పదవనెలలో నేప్రసవమైనను కొందఱక్కడక్కడ పంధ్రెండవ నెలవఱకును నీళ్ళాడుచుందురు. కొన్నిచోట్ల ఏడుమాసములకు నీళ్ళాడినవారి శిశువులును బ్రతుకుదురు. కొందఱు స్త్రీలు శిశువునుగనినతరువాత ఋతువుకాకయేమరలకడుపుతో నుందురు. అటువంటి సమయములయందు కాలమును లెక్కపెట్టుటకు శక్యముకాదు. కాని పిల్ల కదలనారంభించినతోడనే యప్పటికి నాలుగు

నెలలు దాటినవని తెలిసికోవచ్చును. వాకిటనున్నతరువాతఆరంభదశలో మూలునిలిచినయెడల స్త్రీశిశువును, అంత్యదశయందు మూలునిలిచిన పురుషశిశువును, కలుగునని వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుదురు. అయినను కొడుకుపుట్టునో కూతురుపుట్టునో నిశ్చయముగా తెలిసికొనుట కెవ్వరికిని చక్కగా తెలియదు. ఊహచేత చెప్పినప్పుడు కొన్నినిజము కావచ్చును. కొన్ని కాకపోవచ్చును.

## మూండవ ప్రకరణము.

## ప్రసవావస్థ.

ఈవఱకు గర్భిణీ స్త్రీలనుగుఱించి కొంచెము చెప్పియున్నాము గదా! ఇఁకముందు ప్రసవదశనుగుఱించి కూడ కొంత చెప్పెదము. మొదటిసారి కడుపుతో నున్నప్పుడు సాధారణముగా ప్రసవవేదన తక్కినసారులకంటె అధికముగాను, ఎక్కువకాలముండునదిగాను ఉండును. నొప్పులుపొడముటకొకటిరెండుదినములుముందుమూలాలు వెనుకటికంటె మిక్కిలిచులకనగానుండును; బిడ్డక్రిందికి దిగిపోయి దేహము చులకపడునుగనుక, అప్పుడామె హాయిగానుసంతోషముగానుకనపడి, స్వేచ్ఛగా ఊపిరివిడువఁగలిగి పనిపాటులయం దిష్టముగలదానివలె నుండును. ప్రసవవేదన మారంభమగుటకు పూర్వము సాధారణముగా కొన్నిదినములకు ముందును, ఒకానొకప్పుడుకొన్నిగంటలకు ముందును శిశువున్నగర్భకోశము కడుపులోక్రిందికిదిగును. అప్పుడన్నివిధములసుఖముగానున్నను, గర్భకోశము మూత్రాశయమునొఱసికొనుటచేతతఱుచుగా అల్పాచమనమునకు వెళ్ళవలసినట్లుండి కొంచెము కష్టముగా నుండును. తఱుచుగా వాకిటిలోనికి వెళ్ళవలెనని యిచ్ఛపుట్టుటప్రసవచిహ్నములలో మొదటిది; అటుతరువాత గర్భద్వారమును పయిభాగ

ములును మఱింతతడిగానుండి, పిమ్మట కొంచెమునొప్పులారంభించును; అటుపయిని గర్భద్వార ముఖమునందు మూఁతగానుండు ఒకవిధమైన జిగటపదార్థము కొంచెమురక్తముతోకూడి పయికి రానారంభించును; వీని నేమనవారుతీగెలు వేయుటయందురు. ఇదివచ్చినతోడ నేనిజమయిన నొప్పులారంభించినట్లు నిశ్చయించుకొనవచ్చును. ఈప్రథమదశఅయిన తరువాత రెండవదశలో కడుపుమెలివేసినట్లు నొప్పు లారంభించును; ఆరంభమునందవిక్రమముగానుండక మొదటరెండుగంటలకొకపర్యాయ మును, తరువాత గంటకొకపర్యాయమును, అటుతరువాత అరగంట కొకపర్యాయమును వచ్చుచుండును. ఈమెలివేసెడు నొప్పులు అంత కంతకు వేగిర వేగిరము క్రమముగావచ్చి బాధ యధికముగానుండును. ఇటువంటి సమయములో పలువురకు దేహమువడఁకెత్తి కొన్నిసమయ ములయందు పండ్లు కఱచుకొనిపోవును; ప్రసవసమయమునందువడఁకు వచ్చుట జబ్బుకాదుగనుక మందు లేవియు నిప్పించకూడదు. వడఁకుగా నున్నప్పుడు వేఁడిజావ లోపలికిచ్చినచో ఉపశాంతికలుగును.కుడుపుచేత బాధపడుచున్నప్పుడుబఱాతుపచ్చడమునుగాని మఱియొకదుప్పటినిగాని పయినికప్పి చెమటపట్టినతరువాత క్రమముగాతీసివేయవచ్చును.పయికి చలిచేత శరీరము వడఁకుచున్నను లోపలివెట్ట తగ్గదు గనుకను, వెట్ట యత్యధికమయిన యెడలప్రసవమగుట యాలస్యమగునుగనుకను,కప్పిన బట్ట లతివిస్తారముసేపుంచఁగూడదు. కొందఱు స్త్రీలకు నొప్పులారంభ మయినది మొదలుకొని దేహము నలఁతగానుండి, వమనములుకూడ వచ్చుచు శిశుజనన మగువఱకునుతిన్నదేమియులోపలనిముడకుండును. అప్పుడు సహితము జడియవలసిన పనిలేదు. అట్టినలఁత తరువాతమేలే చేయును. ఈమెలివేయు నొప్పులున్నకాలములో నెంతమాత్రముతినుక రాదు. అట్లు చేసినచో, ఆయాస మెక్కువగుటయేకాక ప్రసవమును ఆలస్యమగును. ఆస్థితిలో నడవనైననునడవవలెను; లేదాకూరుచుండ

వలెనుగాని పరుండియుండకూడదు. అటుతరువాతమూడవదశలోపయి రీతి నొప్పులునూటి పోట్లు పొడిచినట్లుగా మఱియొకవిధమయిననొప్పు లారంభమగును.అప్పుడుకాళ్లునుతొడలునుతఱుచుగాతిమ్మిరులెక్కును. ఈతిమ్మిరికష్టపడుచున్న స్త్రీని ఏకస్థానమునందుచాలసేపుకూరుచుండఁ బెట్టుటవలనఁ గలుగును. కాఁబట్టి మొదటి రెండు దశలయందును గదిలో తిరుగుచుండుట యావశ్యకము. ఈతిమ్మిరి మూడవదియైనకడ పటిదశయందు సంభవించినయెడల నొప్పివచ్చినప్పు డెల్లను ఉండును గనుక స్త్రీకి మిక్కిలి బాధగానుండును. అప్పుడు మంత్రసాని తిమ్మిరి యెక్కిన భాగములను తన వెచ్చనిచేతులతోతిన్నగారాయవలెను.ఈ తిమ్మిరి మూఁడవదశయారంభములోపలవచ్చినయెడలస్థానమునుమార్చి జేరగిలఁబడి కూరుచుండునట్లయినను చేయవలెను; లేదా యిద్దరు స్త్రీ లిరుప్రక్కలను ఆసరాగానుండి మెల్లగాగదిలో నడిపించనైనను వచ్చు ను. ఈతిమ్మిరివలన సహితము జబ్బేదియులేదు. నొప్పులువిస్తారముగా వచ్చుచున్నను కొన్నిగంటలవఱకును కడుపులోని బిడ్డ కదలక యొకే స్థానమునందున్నట్టుకనఁబడినయెడల వెంటనే వైద్యునిపిలిపించవలెను. సాధారణముగా స్త్రీలకు ప్రసవవేదన మొదటిసారినొప్పులారంభమయి నది మొదలుకొని పండ్రెండు గంటలసేపును, తరువాత నన్నిసారులును ఆఱుగంటలసేపునుండును. కాని కొందఱివిషయములలో నింతకంటె హెచ్చుగాఁగానితగ్గుగాఁగానియుండవచ్చును. మొట్టమొదటిసారిబిడ్డను కనుటకుముందు నొప్పులధికముగానుండునుగనుక బిడ్డనుకన్నతరువాత నొప్పులంతగానుండవు. అటుతరువాత ప్రతిగర్భమునకును క్రమముగా బిడ్డను కనుటకుపూర్వము నొప్పులు తగ్గుచువచ్చినట్టుగానే తరువాత హెచ్చుచువచ్చును. ప్రసవమునకుముందు వచ్చెడునొప్పులు గర్భమును వికసింపఁజేయుటకుపయోగించునట్లే తరువాత వచ్చెడునొప్పులుదానిని మరల ముడుచుకొనునట్లుచేయుట కుపయోగపడును గనుక, అవి

పోఁగొట్టుటకు మందులు మొదలయినవి వేయకూడదు. పయిని చెప్పిన మూడుదశలలోను మొదటి దశయందు గర్భముదిగుట పిల్లసయికివచ్చు ప్రయత్నముగాను తీగెలు వేయుటగర్భద్వారమునకడ్డుగానున్న మూఁత విడిపోవుటగాను ఉన్నది ; ఈదశయందు స్త్రీ యెప్పటివలె నింట పని పాటులు చేసికొనుచుండవలెను. రెండవదశయందు మెలివేయునొప్పుల చేత గర్భద్వారము క్రమక్రమముగా తెఱచుకొనుచు శిశువుతల రాఁ దగినంత స్థితికివచ్చును; ఈదశయందు గదిలోనేయుండవలెను. మూడవ దశయందు పొట్లు పొడిచినప్పు డెల్లను బిడ్డ కొంచెముకొంచెముక్రిందికి జరుగుచుండును. వీనిలో మొదటి రెండుదశలయందును తెలివిమాలిన మంత్రసానులు చెప్పినట్టువినియెంతమాత్రమును తినుకరాదు. అట్లుచేసి నచో బలహీనత తటస్థించి ప్రసవము మఱింత యాలస్యమగును. మూడవదశయందు గదిలోనే పరుండియుండి సరిగా నొప్పివచ్చినప్పుడు మాత్ర మూపిరి బిగియఁబట్టి కొంచెము క్రిందికి తినుకవచ్చును. నొప్పి సహింప రాకుండినయెడల కడపటి దశయందు స్త్రీ యేడువవచ్చును ; అందువలనకూడ కొంచెముశాంతికలుగును. వెన్నునననఁగానడుమునకు వెనుకవైపున నొప్పు లెత్తినప్పుడు మెత్తనితలగడను వెన్నునఁ జేర్చి మంత్రసాని తనచేతులతో దృఢముగా నొక్క వచ్చును. చేతులకును నడుమునకును మధ్య తలగడ మొదలైనమెత్తనివస్తువేమియు లేక కేవలము చేతులతోనే నొక్కినయెడల పెక్కుచోట్ల కఠినమయిన చేతుల వలన నడుమునకుహానికలుగుచువచ్చినది. నొప్పులుముందువైపునకడుపు మీఁదికి వచ్చినప్పుడు మంత్రసాని కడుపుమీఁద చేయిపెట్టినొప్పివచ్చి నప్పు డెల్లను దృఢముగా నొక్కుచురావలెను; ఇందువలన బాధ ఉపశమనము కలుగుటయేకాక ప్రసవమునుసుఖముగానగును. ఈచెప్పినదాని కంటె మంత్రసాని యధికముగా తనమనసు వచ్చినప్పు డెల్లను నడుము గాని కడుపుగానినొక్కిపిసుకుచువచ్చినయెడలతల్లికినిబిడ్డకునుకూడహాని

కలుగును. ప్రసవమగుగదిసాధ్యమయినంతవిశాలమయినదిగానునిర్మల వాయువు వచ్చుటకు వీలుగలదిగానుచూచి యేర్పఱపవలెను. ప్రసవమునకు ముందుగాని తరువాతఁగాని బ్రాంది యియ్యకూడదు. కడపటి నొప్పులు వచ్చునప్పుడు స్త్రీ తెప్పలువాల్చి కన్నులుమూసికొనవలెను.

కొన్ని దేశములలో స్త్రీలు ప్రసవమగునపుడు వెలికిలపరుందురు. ఈదేశమునందువలెనేమఱికొన్ని దేశములలోనిలుచుండిబిడ్డనుగందురు; ఇఁక కొన్ని దేశములయందు శిశువునుకనుటకు స్త్రీని మోకాళ్ళమీఁద నిలువఁబడునట్లు చేయుదురు; ఇంగ్లండుమొదలయిన కొన్ని దేశములలో స్త్రీని ఎడమప్రక్కను పరుండఁబెట్టి పిల్లను కనునట్లుచేయుదురు. ఈకడపటచెప్పిన పద్ధతి యనఁగా నెడమప్రక్కను స్త్రీని పరుండఁబెట్టి నీళ్ళాడునట్లు చేయుటయే తల్లికిని బిడ్డకునుకూడ మిక్కిలి సుఖప్రదమును, అనుకూలమును. అయియున్నది. ప్రసవమగుటకుముందు విరేచనబద్ధము లేకుండునట్లు మిక్కిలి జాగ్రత్త పెట్టవలయును. మలబద్ధముయొక్క చిహ్నము లేమాత్రము కనఁబడినను వెంటనే తగినంత చిట్టాముదమును లోపలికిచ్చి విరేచనమగునట్లుచేసి సుఖప్రసవమునకుసాహాయ్యముచేయవలయును. అప్పుడు పురిటింటితలు పెప్పుడును మూసియుంచక, అప్పుడప్పు డొకవాకిలిగానుంచి మంచిగాలివచ్చునట్లుచేయుచుండవలెను. ఆసమయమునందు గదిలో పలువురుండినయెడల ధ్వనిచేసి తొందరపెట్టి బాలింతరాలి కాయాసము కలుగఁజేయుటయేకాక గదిలోనిగాలినిసహితము ఉచ్ఛ్వాసనిశ్వాసములచేత పాడుచేయుదురు. కాఁబట్టి గదిలో మంత్రసానిని మఱియొకరినితప్ప ఎక్కువమంది నుండనియ్యకూడదు. మంత్రసానితోగూడ బాలింతరాలికి తోడుగానుండు స్త్రీ బిడ్డలతల్లిగాను, దయగలదిగాను, ధైర్యముకలదిగాను, ఉల్లాసముతో నుండునదిగాను, ఉండవలయును. బాలింతరాలి కధైర్యము కలిగించెడిమాట యొక్కటియు గదిలో నననియ్య కూడదు. పిల్లకుఁ

గాని తల్లికిఁగాని భంగమువచ్చినప్రసవవార్తలను చెప్పెడి మంత్రసానిని సహితము చేరనియ్యరాదు. ఆరంభదశలో బాలింతరాలితో ఉత్సాహకరములును, సంతోషకరములు నయినసంగతులు చెప్పుట యావశ్యకమే యయినను, ప్రసవమగుచున్నకడపటిదశయం దప్పుడప్పుడు సమస్తముననుకూలముగానడుచుచున్నదని ధైర్యము కలిగించెడియొకటి రెండుమాటలుతప్ప మఱి యేవిధమయిన ప్రసంగమును చేయరాదు. అట్టిసమయములయందు తనబాధచేత బాలింతరాలొకవేళ తొందరపడినను దగ్గఱనున్న వారెంతమాత్రము తొందరపడక తాలిమివహించి మంచిమాటలతో ధైర్యమును ఉత్సాహమునుపుట్టించవలెను. కొమార్తెయందును ప్రేమచేత నట్టిసమయములయందు తల్లి తొందరపడుట సహజముగనుక సాధ్యమయినంతవఱకు ప్రసవమగునప్పుడు తల్లినిపురిటి గదిలో లేకుండునట్లుచేసి తల్లి తనయొద్దనున్నదన్నధైర్యము కలుగుటకయి యప్పుడప్పుడు తల్లి బాలింతరాలికి కనఁబడుచుండునట్లు చేయవలెను. నొప్పులుపడుచున్నకాలములో కావలసినయెడల బాలింతరాలికి వేఁడిజావ లోపలి కియ్యవచ్చును. నొప్పులు పడుచున్నసమయములో కడుపుతో నున్నవారి కిష్టమువచ్చినన్నిమాఱులు అల్పాచమనమునకు వెళ్ళుచుండుట యావశ్యకము. కొందఱుసిగ్గుచేత తఱుచుగా నీరుముట్టుకొనుటకువెళ్ళక బహువిధములయిన నష్టములను తెచ్చుకొని తరువాత బాధపడుచుందురు. కాఁబట్టి యీదశలో మలమూత్రములను ధారాళముగా నడిపించుటకయి తగినంతశ్రద్ధ చేయవలెను. ఇం దేవిషయమును నశ్రద్ధచేసినను తరువాతమిక్కిలివ్యసనపడవలసివచ్చును. ప్రసవమైనతరువాత సహితము పండ్రెండు గంటలలోపల మూత్రము రానియెడల వెంటనే వైద్యుని కాసంగతి తెలియఁజేసి తగినచికిత్సచేయించవలెను.

మొదటి ప్రసవమునకుతప్ప తరువాతతరువాత సాధారణముగా మంత్రసానిని పిలుచుకొని వచ్చులోపలనే శిశువుపుట్టుట సంభవింప

వచ్చును. అటువంటి సమయములలో పురుటిగదిలోనున్నవారు నెమ్మది గాను ధైర్యముగానుండి, ఇతరులతో మాటలును గుసగుసలునుమాని తొందరపడక నిశ్శబ్దముగానుండి, ఉపద్రవమేమియు లేదని బాలింత రాలికి దృఢముగా తోచునట్లు చేయవలయును. అట్లుచేయక యిటు నటు పరుగెత్తి తొందరపడి యేదో యుపద్రవమున్నట్లు బాలింతరాలికి భయము కలుగునట్లు చేసినయెడల నెంతహానియైననుకలుగును. వెంటనే శిశుజననమైనపక్షమున, అక్కడనున్నవారు బొడ్డుత్రాడు శిశువుమెడకు చుట్టుకొన్నదేమోచూచితొలగించవలెను; తొలఁగింపని యెడల బిడ్డ ఊపిరి సలుపక మృతిపొందును. ఊపిరివిడుచుట కడ్డముగా శిశువు మొగముమీఁద మావియొక్క పనుచని పొరయేదియైన పడినయెడల బిడ్డకు ప్రాణహానికలుగకుండ తక్షణము తీసివేయవలెను; ఆప్రకారము గానే మొగమునకడ్డముపడకుండ బట్టలు తొలఁగించుటయే కాక, జిగట మొగమున కంటుకొని యున్నయెడల బట్టతో తుడిచివేయవలెను. ప్రతిశిశువును పుట్టినతోడనే యేడువవలయును; అట్లు యేడువనిపక్షమున బిడ్డయొక్క పిఱ్ఱలమీఁద కొట్టి యేడిపించవలెను. పుట్టిన శిశువుపయికి చచ్చునట్లుగా కనఁబడినయెడల, పిఱ్ఱలమీఁదనువీపుమీఁదనుచుఱ్ఱుమను నట్లు కొన్నిదెబ్బలు కొట్టవలెను; నవాసారమును సున్నమును గలిసిన వాసనచూచెడియుప్పును ముక్కురంధ్రములవద్దనుంచవలెను. మొగము మీఁద చన్నీళ్లు చల్లవలెను; గుడ్డకాల్చిచర్మమునకు తగులకుండునట్లు గా ముక్కుక్రిందనుంచవలెను. సాధారణముగాపిఱ్ఱలమీఁదకొట్టుట చేతనే చచ్చిరనుకొన్న పిల్లలు బ్రతుకుచుందురు. ఈపనిని మానుట వలన బ్రతుకదగినబిడ్డలనేకులు నిష్కారణముగా చత్తురు. చచ్చినట్లు పుట్టినబిడ్డను ఏడుచునట్లు చేసినయెడల నిఁక నాబిడ్డ బ్రతికినట్టే. బొడ్డు నరము నాడివలె కొట్టుకొనుచున్నయెడలదానినికట్టివేయరాదు; వెచ్చని చేతులలో శిశువుయొక్క కాళ్లనుచేతులను వీపును రొమ్మును చక్కఁ

గా రాయవలెను. పయిపద్ధతులవలన ప్రాణము తేకుండినయెడల బొడ్డుదారము కొట్టుకొనుట మాని వేసినపక్షమున, త్రాడు ముడి వేసి బొడ్డుకోసిబిడ్డను చట్టుక్కున వేడినీళ్లలో ముంచవలెను. చట్టుక్కున వెచ్చనినీళ్ళలో ముంచిన తోడనే ప్రాణము తేజి ఊపిరి యాడనిపక్షమున, నీళ్ళలోనుంచిన కార్యము లేదుగనుక వెంటనే శిశువును నీళ్లనుండి తీసివేయవలెను. ఈ చెప్పిన వేనివలనను తెలివిరానియెడల శిశువును మొగము పాన్పుమీఁద ఆనునట్లుగా బోరగిలపరుండబెట్టి మెల్లగా శరీరమును వీపువఱకును వచ్చునట్లుగాపొరలించుచు మరల మొగము పక్కమీఁద ఆనునట్లుగా నిమిషమునకు పదునేనుసార్లు చొప్పునకొంత సేపుపొరలించినయెడల ప్రాణము రావచ్చును. అక్కడికును రానిపక్షమున మంత్రసానిగానిమఱియొకరు గాని పయికి పోకుండునట్లుగా శిశువుముక్కును ఎడమచేతతో గట్టిగా పట్టుకొని పిల్లవానినోటిలోనోరు పెట్టి గట్టిగాఊది, శ్వాసకోశములు పయికిలేచినతోడనేకుడి చేతితో ఱొమ్మునుపయికినిమురుచులోపలిగాలి మరల పయికివచ్చునట్లు చేయుచు నిమిషమునకు పదునయిదు సార్లు చొప్పున కొన్నినిమిషములవఱకు నాప్రకారము చేసినచో సాధారణముగా బిడ్డ యులికిపడి యేడుచుట సంభవించును. అట్లు జరుగుట ప్రాణము తెప్పిఱిలుటకుసూచకము. బొడ్డుదారమునాడివలెకొట్టుకొనుచున్నయెడల ప్రాణము తెప్పఱిలువఱకును దానిని ముడివేయరాదు. శిశువు ఊపిరివిడిచి యేడుచుటకుముందుగా బొడ్డుదారము కట్టివేసినయెడల బిడ్డ బ్రతుకునన్నయాశవదలుకోవలసినదే. చలనమున్నంతవఱకును బొడ్డుదారమును ముడివేయక పూర్ణముగా నుంచినయెడల, తల్లి యొక్క రక్తప్రసారమునుపోషణమునువచ్చిబిడ్డబ్రతుకవచ్చును. ఎందునను ప్రాణమురానియెడల నిఁకబిడ్డపోయినట్టే. ఈప్రకారముగాబిడ్డలు వచ్చి జనించుభాగ్యము పనిపాటులుచేయకయూరకకూరుచుండిమనసు వచ్చినట్టు తిని యెప్పుడును మెత్తనిపఱుపులమీఁద పరుండు ధనికుల

భార్యలకే కానియొడలువంచి పనిచేయుచు పెందలకడలేచి వేళకుపరుం డుచు మితముగా తినెడు బీదలభార్యల కెక్కుడనో కానిలేదు.

బిడ్డ క్రమముగా పుట్టి యేడిచి తిన్నగానున్న యెడల శిశువుశరీర మునకు రెండంగుళముల దూరమునబొడ్డుదారమునకడుగుపొడుగుదార మొకటి బిగించి, దానికి మూడంగుళములదూరముననదే ప్రకారముగా మఱియొకదారము బిగించి, ఆరెండుకట్లకును మధ్యగా బొడ్డుదార మును పదిలముగా కోసివేయవలెను. మావి నెంతమాత్రమునుమంత్ర సానికాని మఱియొకరుకాని బలవంతముగా పయికిలాగరాదు. ఏమియు చేయక యూరకున్నచో కొంతసేపటికి తనంతటఅదియేపయికివచ్చును. కాని కుడిచేతితో బాలింతరాలి పొత్తికడుపును నొక్కిన యెడల గర్భ ము వేగముగా ముడుచుకొనిపోయి, మావి పయికివచ్చి స్రావముకట్టు ను. గంటసేపటివఱకును మావి పైకిరాక స్రావమువిస్తారముగానున్నచో వెంటనే వైద్యుని తీసికొనిరావలెను. అంతేకాని మంత్రసాని నేమియు చేయనియ్యరాదు. తెలివిమాలిన మంత్రసానులు తాము మధ్య ప్రవే శించి మావిని బలవంతముగా లాగుటవలన బాలింతరాండ్రకు పలువు రకు ప్రాణహాని సంభవించుచు వచ్చినది.

ప్రసవమయినతరువాత గంట సేపటివఱకును ఆస్త్రీని బిడ్డను కన్నప్పటి స్థితిలోనే పరుండనిచ్చి కాళ్ళుమాత్రము చాచుకొని యను కూలముగా నుండునట్లు చేయవలెను. ఒకటిరెండుగంటలయినతరువాత ఆమె నిద్దఱు బుజములకడను తుంట్లకడను పట్టుకొనిమెల్లగానొకప్రక్క నుండి యొకప్రక్క కొత్తిగిల పరుండబెట్టవలెను. అంతేకాని ఆమె నెంతమాత్రమును స్వయముగా ప్రయత్నముచేసి యొత్తిగిల నియ్య కూడదు; బాలింతరా లాసమయములో పరుపుమీఁద నిలువుగాలేచి కూరుచుండఁగూడదు. ప్రసవమయినతరువాతసాధారణముగా బాలింత రాలి కలసటగాను చలిగాను ఉండును గనుక, అప్పుడొక దుప్పటిని

దేహము నిండ ముసుఁగు వేసి, ఆమెకు ఉక్కగా నున్నతోడనే తీసివేయ వలెను. పయిని బట్ట లతివిస్తారముగా మాత్రము కప్పరాదు; అట్లుకప్పి నచో స్రావమధికమయి మూర్ఛకూడ రావచ్చును, కాళ్ళు చల్లఁగా నున్న యెడల ఫ్లానలుగుడ్డ చుట్టఁబెట్టి దిండుమీఁద కాళ్ళు పెట్టుకొనవలె ను. బాలింతరాలి దేహారోగ్యమునకు పక్కబట్టలు మొదలయినవితఱు చుగా మార్చి క్రొత్తబట్టలు వేయుచుండుటతో సమానమయినదిమఱి యొకటి లేదు. బాలింతతనములో శుచిగా నుండనియెడల మురికివలన జ్వరములును ప్రసూతిరోగములును వచ్చునుగనుక, బట్టలు మొదలయి నవి గాలిలో నాఱఁబెట్టి శుభ్రపఱుచుటయే కాక సూతికాగృహము లోనికి మంచిగాలివచ్చు వీళ్ళుచేసి లోపలికి పుచ్చుకొనునీరు మొదలయి నవి నిర్మలముగానుండునట్లు చూడవలయును.

శిశుజననమయినతోడనే బాలింతరాలికి వేఁడిగానుండని తేయాకు నీళ్ళు దాహమున కిచ్చుట మిక్కిలి మంచిది; బాలింతరాలు మంచము మీఁద సరుదుకొనికొంచెమునిమ్మళిపడిన తరువాతలోపలికివెచ్చనిజావ యియ్యవలెను. కష్టపడి శోషిల్లియున్నతరువాత బడలికపోయి తేఱు కొనుటకయి ఆహారమిచ్చుటకు మాఱుగా మన దేశములో బాలింత రాండ్రను లంకణములుకట్టిమాడ్చుచున్నారు. ఈదురాచారమువలననే ప్రసవమయినవారి కనేకవికారములు కనఁబడి సూతిక మొదలయిన రోగములుసహితము వచ్చి కొన్ని సమయములయందు ప్రాణభయము కూడ కలుగుచున్నది.

ఒకమె త్తనిగుడ్డను రెండుమూడు మడతలు వేసిగర్భమునకుపయి భాగమున వేసి దానిచుట్టును కడుపునకు మూడుమూరలగుడ్డను నడి కట్టుకట్టి, దానిని మిక్కిలి గట్టిగా బిగింపక సాధారణముగా బిగువుగా నుండునట్లు ప్రతిసాయంకాలమునను ఉదయకాలమునను, వదులైనప్పు డెల్లను మరల బిగించుచుండ వలెను. మనదేశమునందుకట్టుకొన్నచీర

యొక్క చివర భాగమునే నడికట్టుగానుపయోగింతురు కాని యరశకంటె ప్రత్యేకముగా మఱియొకగుడ్డను కట్టుటయే యుత్తమము. ఈనడికట్టు వలన బాలింతరాలికి హాయిగానుండును; కడుపెప్పటి పరిమాణమునకు మారును; స్రావమధికముగాక కట్టును. ఈనడికట్టు విషయమయి శ్రద్ధ చేయనియెడల బానకడుపులుపడి రూపము చెడి కానుపు లధికమయిన కొలఁదిని మఱింత వికారరూపములను పొందుదురు.

పురిటిల్లు సదా చల్లఁగా నుండునట్లును ధారాళముగా శుద్ధవాయువు వచ్చునట్లును చేయుటయేకాక, అందులో నిప్పుగాని పొగగాని యెంతమాత్రమును లేకుండునట్లు బహుజాగ్రత్త పుచ్చుకొనవలెను. నిప్పుపొగమొదలయినవానిచేత గాలి చెడియు కాఁకయెక్కువయియు పలువురు బాలింతరాండ్రును శిశువులును పలువిధములయిన వ్యాధుల పాలగుటయేకాక ప్రాణములనుసహితముపోఁగొట్టుకొనుచున్నారు. శిశువుయొక్క శరీరము వెచ్చచేయుట మొదలయిన పనులకు కావలసి వచ్చినయెడల పొగ లేకుండ కొంచెమునిప్పును పురుటింట నుంచ వచ్చును. గాలి స్వేచ్ఛముగావచ్చుచుపోవుచునుండుటకై తలుపెప్పుడు నోరవాకిలిగా నుంచవలెను. ప్రసవమైనతరువాత వెంటనే తలుపులు మొదలయినవి మూసి గది చీకఁటిగానుండునట్లుచేసి నిశ్శబ్దముగానుంచి బాలింతరాలికి నిద్రవచ్చునట్లుచేసి కొంతసేపు విశ్రాంతి పొందనిచ్చిన యెడల, ఆమె కెంతోయారోగ్యముకలుగును. కాఁబట్టియప్పుడామెతో నేవిధమైన మాటలును పెట్టక శిశువునకు నీళ్ళుపోసి బట్టలువేసిన తోడనే మంత్రసాని తప్ప మఱియెవ్వరును గదిలోనుండక లేచిరావలయును. బాలింతరాలు మొదటి పదిదినములలోను మనస్సునకుఁగాని దేహమునకుఁగాని ఆయాసము లేకుండ పూర్ణమయినవిశ్రాంతి పొందవలసి యుండును గనుక, ఆమెక్షేమమును గోరువారు పురుటింటిలోనికి వెళ్ళక యీవలినుండియే యామెక్షేమసమాచారమునువిచారించుచు

నామె కేవిధమైనయాయాసమును కలిగింపకుండ వలెను. ఈహేతువు చేతనే మనపూర్వులు పది దినములు మైలనేర్పఱిచియెవ్వరునుగదిలోనికి వెళ్ళకుండ కట్టుదిట్టముచేసిరి. అట్లు క్రమముగా చేయుటయే వేయియౌషధములపెట్టు.

ప్రసవమయినతోడనే బాలింతరాలికి మూత్రవిసర్జనము చేయువలెనని యిచ్ఛ కొంచెమయిన నున్నచో తప్పక అల్పాచమనముచేయవలసినదే కాని యామె యెంతమాత్రమును లేచికూరుచుండి యాపని చేయరాదు. లేచికూరుచున్నచో స్రావ మధికమయి జబ్బు చేయును. గనుక నిద్రపోవుటకు ముందుగా పరుండియే మూత్రవిసర్జనము చేయునట్లు చేయవలెను. ప్రసవ మయినతరువాత బాలింతరాలి మేలుకొఱకే భగవత్సంకల్పమునుబట్టి విరేచనబద్ధముకలుగును. మూడవదినమువఱకును విరేచనము నిమిత్తమయి మనమేమియుపనిచేయరాదు. మూడవ దినము తనంతనేకాని కొంచెము కాఫీనీళ్ళయినను ప్రత్యేకముగా వేఁడి నీళ్ళయినను పుచ్చుకొనుటవలనఁగాని విరేచనమగును. అట్లుకానియెడల వెనుక చెప్పిన ప్రకారముగాడ బ్ల్యెస్తుచిట్టాముదమునులోపలికిపుచ్చుకొనవలెను. దానివలనను సుమారెండుగంటలలోపల మలవిసర్జనము కాని యెడల మరల చిట్టాముదము నియ్యవలెను.

స్రావము ప్రసవమునిమిత్తమయి మంచము చేరినది మొదలుకొని ప్రసవమైన వారముదినములవఱకును కొన్నిసమయములలో పదియేను దినములవఱకును నుండును. అది మొట్టమొదట కొంచెమెఱ్ఱరంగు కలదిగా నుండును ; అది యయినతరువాత క్రమక్రమముగా పండుటాకు వర్ణమునకు మాఱి తుదకు కొంచె మాకుపచ్చరంగునకు దిగును. కొంతవఱకు జలరూపమయిన యీస్రావ మావశ్యకమే కాని యత్యధికమైనచో బాలింతరాలినిబలహీనురాలినిగాఁజేయును. తెలివి మాలినవా రాభాగములను కడుగుట జలుబని భావింతురుగాని యట్లు

కడుగనియెడలనే దేహారోగ్యమునకు భంగము కలిగించును. అంతేకాక యాభాగములకు దినమునకు రెండుసారులయినను తప్పక వేడినీళ్ళలో గుడ్డముంచి కాచి మెత్తనిగుడ్డతో తుడుచుచుండవలెను.

మొదటి పదిదినములును బాలింతరాలు తాను లేచుటకయి ప్రయత్నింపక కదలమెదల కుండుట యావశ్యకము. అయిదుదినముల వఱకును మొదటిప్రక్కమీఁద నేపరున్నతరువాత పయియైదుదినములు రెండవ మంచమును మొదటిమంచమునకు దగ్గఱగానే చేర్చి యామె నేమియుప్రయత్నముచేయనియ్యక వెనుక చెప్పినప్రకారముగా నామె నిద్దఱుపట్టుకొని మెల్లఁగా రెండవమంచముమీఁద పరుండఁబెట్టవలెను. ఆమెతొమ్మిదిదినములయినతరువాత పదవదినమునగంటసేపటివఱకును లేచి కూరుచుండి నాఁడుమొదలుకొని దినదినక్రమమున కూరుచుండు కాలమును హెచ్చుచేయుచురావలెను. కాని మొదటిపదునేనుదినముల లోను ఆమె విస్తారకాలముపరుండియేయుండవలెను. ఈప్రకారముగా జరిగించనియెడల స్రావ మధిక మగుటయు, గర్భము వాలిపోవుటయు, గర్భపాతములు కలుగుచుండుటయు, సంభవింపుచుండును. బీద స్త్రీ లీప్రకారముగా చేయలేక లేచి తిరుగుచువచ్చుటవలనపలువురకుత్రేవులు కదుపులు వచ్చుచుండును. కడుపుతోనున్న కాలములో స్త్రీలుపనిచేయు టయు ప్రసవమయినతరువాత పూర్ణమయినవిశ్రాంతిపుచ్చుకొనుటయు రెండునుకూడ దేహారోగ్యమునకు మిక్కిలియావశ్యకములు. వీనిలోబీద వారికి కడుపుతోనున్నకాలములో పనిచేయులాభమును ధనము గల వారికి ప్రసవమయినతరువాత విశ్రాంతి పొందులాభమును సామాన్య ముగా కలుగుచుండును. కాని జరుగుబాటుగలవారి కిష్టమున్నచో రెండు లాభములును కూడ కలుగవచ్చును.

మనవారు సాధారణముగాచేయునట్లు బాలింతరాండ్ర నిగురఁ బెట్టక చక్కఁగా కాఁగినజావనుపాలనుగాని, కొంచెమన్నమునుపాలను

గాని పెట్టుచుండవలెను. అయినను మితముతప్పి పెట్టుటనుగాని అతి విస్తారముగా జలపదార్థముల నిచ్చుటనుగాని మాని బహుజాగ్రత్తగా నుండవలెను. అందుచేత జావనుగాని తేయాకునీళ్ళనుగాని పాలనుగాని యొకసారి చిన్నగిన్నెడుకంటె నెక్కువగానియ్యగూడదు. అట్లిచ్చినచో బాలింతరాలి కాయాసముగానుండి, చెమట యెక్కువగాపట్టి, పాలత్యధికముగా నూరును. ఈప్రకారముగానే ప్రతిదినమును బాలింతరాలి కనుకూలమయిన పథ్యపానములు పెట్టుచురావలెను. లంకణములుకట్టిన యెడల శరీరముదుర్బలమయి బహుదుర్గుణములు పుట్టుచు బాలింతరాలికి పాలిచ్చినప్పుడు పాలతోసమభాగము నీరునుకలిపి మఱియియ్యవలెను. అట్లు పాలతో నీటిని చేర్చకపోయినయెడల జీర్ణముకాకపోవుటయేకాక మలబద్ధమునుకూడకలుగఁజేయును. పాలయందుమలబద్ధము కలిగించుగుణమునునీటియందువిరేచనమును కలిగించుగుణమునుగలవు; పాలలో నీటిని కలిపిన పక్షమున పాలయం దేదోషమును లేక పుష్టికర మగును.

మూడువారము లయినతరువాత బాలింతరాలుసాధారణముగా తిరుగుచు నింట నందఱితోడిపాటుగా లోపలికివచ్చి భోజనము చేయవచ్చును. కాని యామె పగటిపూట కొంచెముసేపు మంచముమీఁద పరుండి విశ్రాంతి పొందుచుండవలయును. ఇరువదియొక్కదినములైన తరువాత నామె బయలగాలిలో యథాప్రకారముగా తిరుగవచ్చును. నెలపురుడు వెళ్ళినతరువాత నఁగా ముప్పదిదినములయినపిమ్మటనింట నెప్పటిప్రకారము క్రమముగా పనిపాటు లన్నియు చేసుకొను చుండవచ్చును. కొందఱు బాలింతరాండ్రు కొన్నిమాసములవఱకు పనిచేయరాదనిభ్రమపడుచున్నారుగాని సాధారణముగా పనిచేయువారే యేవిధమయినజబ్బులును లేకుండ దృఢగాత్రలయియున్నగా తిరుగుటకు శక్తిగలవారగుచున్నారువారియొద్దనేతమపిల్లలకుకావలసినన్ని పాలుండి

మఱియొకరిబిడ్డలకుఁగూడ వారు పాలియ్యఁ గలుగుచున్నారు. వీరిట్లుం డఁగా పనిపాటులుమానిసుఖమనుభవింపుచున్నామనుకొనుచున్న ధనికు రాండ్రయిన బాలింతరాండ్రు సదాతలనొప్పిచేతను వేఁటునొప్పులచేతను ముక్కుచు మూలుగుచునుండి తమబిడ్డలకిచ్చుటకే పాలుచాలక పాట్లు పడుచుందురు. కాఁబట్టి యెవ్వరికిఁగాని యొడలువంచి పనిచేయుటతో సమానమయిన లాభము మఱియొకటిలేదు.

## నాల్గవ ప్రకరణము.

## బాలింతతనము

తల్లులుకొందఱు తమవద్దపాలుండియు యౌవనమును దేహపటుత్వమును చెడుననియెంచి తాముబిడ్డలకు పాలియ్యక దాదులనేర్పఱిచి వారిచేత పాలనిప్పింతురు. తాను కన్నబిడ్డను భగవంతుఁడు దయచేసిన పాలియ్యకపోవుట క్రూరమును పాపము నగుటయేకాక పాలియ్యక పోవుటచేతనే మఱియొకవిధముగా దేహపటుత్వము చెడును. అట్టిదయావిహీన లయినస్త్రీలు తామందుచేత ముందు గొడ్డురాండ్రయిన నగుదురు; లేదా కొంచెముకాలము పయికి దృఢముగాకనఁబడినను మరల వేగముగాకడుపుతోనున్నవారయితఱుచుగా ప్రసవమగుచువచ్చుటచేత శరీరపటుత్వము చెడఁగొట్టుకొని వ్యాధులపాలయి యకాలమరణము నయినను పొందుదురు; అంతేకాక యట్టివారికిపుత్రులనుగనుటవలనఁ గలుగవలసినసంతోషమెప్పుడును పూర్ణముగా కలుగనేరదు. భగవదుద్దేశమునకు వ్యతిరేకముగా నడుచుకొనుటవలన సామాన్యముగా దేహము దుర్బలమగుటయేకాక పాలకుస్థానములగు న స్తనములయందును చనుబిళ్లలును పుండ్లును వాపులు నుపాలజ్వరములును సంభవించి మిక్కిలిబాధపెట్టును. కాఁబట్టి పిల్లయొక్కయుతల్లియొక్కయు సౌఖ్య

మంతయు తల్లి పాలిచ్చి పెంచుటలోనే యుండునుగనుక పాలుగలిగి శరీర దార్ఢ్యముగల సుందరులెవ్వరునుతమపిల్లలనన్యులపాలు చేసియూరకుండ రని కోరుచున్నాము. అయిదుమాసములలోపల బిడ్డకెప్పుడును పాలు గాక వానితోఁజేర్చి మఱియేవస్తువును పెట్టఁగూడదు. అటుతరువాత సహితము తల్లియొద్ద పాలున్నపక్షమున మఱియేవిధమయిన యాహా మును లోపలికియ్యఁగూడదు. పాలులేనియెడల నియ్యఁదగిన యాహా రమునుగూర్చి ముందు శిశుపోషణప్రకరణమునందు వివరించెదము.

ప్రసవ మయినబడలిక తీఱఁగానే యనఁగా బిడ్డను గన్నయయి దాఱుగంటలలో ముఖ్యముగా మొదటిసారినీళ్ళాడినప్పుడు ఱొమ్ము విష యమయి కొంచెము శ్రద్ధచేయవలెను. మొదటికానుపునకు సాధారణ ముగా మూడవదినమువఱకును పాలు తిన్నఁగా పడనేపడవు. ఆదినము నను తరువాత రెండుమూడుదినములవఱకును సాధారణముగా స్తనము లుబ్బి, కదుములుకట్టి, ఆయాసముగానుండును; అంతేకాక యాసమయ మునందు తఱుచుగా జ్వరముకూడవచ్చును. చనుమొనలు పిండిచూచి ఱొమ్ములోపాలున్నపక్షమునతఱుచుగాఁగాక పాలుకూడఁబడువఱకును నాలుగుగంటలకొకసారి శిశువును కుడుపవలెను. పాలు తిన్నఁగాపడిన తరువాత శిశువునకుమఱింత తఱుచుగా చను గుడుపవలెనుగానియప్పు డునుమితిప్రకారముగానేపాలిచ్చుచుండవలయును. ఱొమ్ము చేపిలోపల పాలున్నవని నిశ్చయముగా తెలిసినప్పుడు తప్ప శిశువు నోటిలో చన్ను పెట్టరాదు; అట్లుచేయనియెడల తఱుచుగా స్తనము లీచుకొనా పోయి పాలు లేక శిశువునకు పోతపాలుపోయవలసినగతి సంభవించును. కొందఱుపిల్లలు చెమటపట్టినప్పుడుగాని పాలెండి పక్కులు కట్టినప్పుడు గాని పాలుకుడువరుగనుక పిల్లవానినోటిలో పెట్టకమునుపే చనుమొన లనువేడినీళ్ళతోకడిగి మెత్తనిగుడ్డతో పదిలముగాతుడిచివేయవలెను. అట్లుతుడిచినతరువాతసహితము పాలుకుడువనిపక్షమున, చనుమొనలకు

కొంచెము వెన్నరాచి వెంటనే శిశువునోటిలో పెట్టవలెను. స్తనములు నిండుగాను గట్టిగాను నుండి నొప్పిగానున్నయెడల కర్పూరము వేసిననూనెతో మెల్లఁగా మర్దనచేయవలెను. కుచములుబ్బి నిండుగా నుండి యసౌఖ్యకరముగానున్నసమయమునందు పాలు మఱింతవిస్తారముగా నూరకుండునట్లుచేయునుగనుక ద్రవపదార్థములనువిస్తారముగా లోపలికి పుచ్చుకొనఁగూడదు. ఈప్రకారముగా చేసినయెడల రెండు మూడు దినముల తరువాత చన్నులుతీసిపోయి నొప్పిమాని శిశువు సుఖముగా పాలు త్రాగుట కనుకూలముగానుండును. తరువాతికానుపుల కెల్లను పాలుచేఁపినప్పుడు క్రమమయిన మితప్రకారముగా శిశువు నొకచన్ను విడిచి యొకటికుడుపుటతప్ప మఱియేమియు చేయనక్కఱలేదు.

ఱొమ్ములలోపాలుకూడెడుసమయమునందనఁగాసాధారణముగా ప్రసవమైన మూడవదినము మొదలుకొని యొకటి రెండుదినములు బాలింతరాలికి 'పాలకాఁక' యని కొంచెము జ్వరమువచ్చును. అది సామాన్యముగానొకదినములోనేపోవును. ఏదోమఱియొకజబ్బువచ్చినంగాని యదెప్పుడును రెండుదినములకంటెనధిక కాలముండదు. అది చలిజ్వరమువలెవచ్చి మొదట కొంతసేపు చలిగాను, తరువాత తాపముగాను, ఉండి కట్టకడపట చెమటపట్టి విడిచిపోవును. తఱుచుగా తలనొప్పియు, స్తనములలోను వీపులోను పొత్తికడుపులోను పోట్లును, వచ్చును. ఈజ్వరమువలన నెప్పుడో కాని బాలింతరాలికిజబ్బు చేయదు. అయినను జాగ్రత్తగానుండుట మంచిది.

అప్పుడు పుట్టినబిడ్డ నీళ్ళుపోసినతరువాత కొన్నిగంటలసేపునిద్రపోవును. ఆసమయమునందు లేపి చన్నుకుడుపుట మంచిదికాదు. అప్పుడు తల్లిఱొమ్ములో పాలుసహిత ముండవు. కొంచెము పాలుచేరుసమయమునకెల్లను బిడ్డ తనంతనేమేలుకొని పాలకై యేడ్వ మొదలుపెట్టును. అందాక తాళక నిద్రపోయెడుబిడ్డను లేపియు నిద్రలేకుండఁ

జేసియు బిడ్డ కాఁకలివేయు నని చన్నుకుడిపినయెడల చెఱుపునకే కార ణమగును. తల్లి బిడ్డకు నియమితకాలములోమాత్రమే పాలిచ్చుచుండ వలెను. కారణము తెలిసికోలేక యేడ్చినప్పుడెల్లను పాలు కుడుపుచుం డుట తల్లికిని పిల్లకును గూడ చెఱుపు గలుగఁజేయును. మొదటినెల యందు నాలుగు గడియల కొకపర్యాయముపాలిచ్చుచుండవలెను; తరు వాత క్రమ క్రమముగా కాలము హెచ్చుచేసి పదిగడియల కొక్క పర్యాయ మిచ్చునంతవఱకును తీసికొనిరావలెను. తల్లులు తఱుచుగా బిడ్డలను రాత్రివేళ రొమ్మువద్దనే పరుండఁబెట్టుకొని సదా చన్ను నోట పెట్టుచునేయుందురు. ఈచెడువాడుకవలన తల్లియు బిడ్డయుకూడ బల హీనపడుదురు; అంతేకాక మాతాశిశువులనిద్రచెడి పెక్కుజబ్బులుతట స్థించి కొన్నిసమయములయందు తల్లిచనుముక్కులును శిశువునోరును పుండుపడును. తల్లి విస్తారదూరము నడిచివచ్చినప్పుడును, చెమ్మటపట్టి యున్నప్పుడును బిడ్డకు పాలియ్యకూడదు; అప్పుడు పాలు మిక్కిలివేఁడి గానుండునుగనుక బిడ్డ కడుపులో జబ్బుచేసి విరేచనములు పట్టుకొను టయేకాక చిడుము మొదలయిన చర్మరోగములు తటస్థించును. చంటి బిడ్డతల్లి తఱుచుగాపిండివంటలును మధురాహారములునుమానిబలప్రద మయిన సామాన్యలఘ్వాహారమును పుచ్చుకొనవలెను; సాధ్యమయి నంతవఱకనుభవజ్ఞానముచేత కని పెట్టిశిశువునకు పడనివస్తువులను వేనిని తల్లి తినకుండవలయును. తల్లివిరేచనములకు మందుపుచ్చుకొన్న యెడల బిడ్డకుకూడవిరేచనములుపట్టుకొనునుగనుక పాలిచ్చుచున్నంతకాలమట్టి యౌషధములేవియు తినకుండవలయును. తల్లివద్దపాలున్నయెడల పాల దాది నెప్పుడును పెట్టఁగూడదని యీవఱకే చెప్పియున్నాము. దాది యెంత దేహారోగ్యదశయందున్నను పిల్లకు తల్లిపాలుపడ్డట్టు దానిపాలు పడవు. తల్లియొక్కయు దాదియొక్కయు వయస్సువ్యత్యాసమును బట్టియు, వారిబిడ్డలయీడు హెచ్చుతగ్గులనుబట్టియు, వారిశరీరతత్వము

లనుబట్టియు. తల్లిపాల పెరిగినబిడ్డవలెపాలిప్పించినబిడ్డ యెప్పుడునుండదు. దాది తల్లికంటె కొన్నివారములు ముందుగా ప్రసవించిన దయినను, దానిపాలవలన బిడ్డకు విరేచనబద్ధము మొదలయినవి కలుగును. ఆరోగ్యదశయందుండు పాలదాదిపాలే యిట్లు జబ్బుచేయుచున్నప్పుడు తినరానివస్తువులను తినెడునట్టియు శరీరదౌర్బల్యము కాని వ్యాధి కాని కలిగినట్టియుదాదిమాట చెప్పనేయక్కఱలేదు. ఒక్కతల్లిపాలుమాత్రమే బిడ్డయొక్కవయస్సునకును తత్వమునకునుచేష్టలకును తగినట్టుగామాఱి సుఖప్రదముగానుండును. కాఁబట్టి సాధ్యమయినంతవఱకు పరులచేత పాలిప్పించుటమానిపించి పాలున్నయెడలతప్పక తల్లిపాలేయిచ్చి పెంచవలెను.

సాధ్యమయినయెడల పసిబిడ్డతల్లులు కొంచెముసేపు బయల మంచిగాలిలో తిరుగుట తల్లికిని బిడ్డకునుగూడ క్షేమకరము. ఇల్లువిడిచి పోవుటకు వలనుపడనిపక్షమున పూలచెట్లు మొదలయినవి గల దుర్గంధములేనిదొడ్లలోఁగాని, తలుపులు తెఱచియుంచి మేడమీఁదఁగాని గదులలోఁ గాని పచారుచేయవచ్చును. బొత్తిగా దేహసాధకములేని యెడల తల్లులకు మంచిపాలుండవు. తిరిగివచ్చినవెంటనే బిడ్డకుపాలియ్యక, అరగంటసేపువిశ్రాంతి యయ్యవలెను. రాత్రులు పరున్నకాలములో బిడ్డకు కూరుచుండిపాలియ్యఁగూడదు; పరుండియేచన్నుగుడుపవలెను. పగటిపూట మాత్రము కూరుచుండియే చన్నుగుడుపవలెను. సగమువంగి మంచముమీఁద చేయానుకొని యేటవాలుగా నెప్పుడును పాలియ్యఁగూడదు. అట్లుచేసినచో రూపము చెడుటయేకాక నడుము పట్టు తప్పిపోవును. తఱుచుగా కోపము తెచ్చుకొనుచుండుట వలనఁగాని ఆకస్మికముగాశోకసంతోషాదులనుపూనుటవలనఁగాని పాలుచెడి తల్లికిని బిడ్డకునుగూడజబ్బుచేయునుగనుక మనస్సున నతిదుఃఖమునకుఁగాని యతిసంతోషమునకుఁగాని యెడమియ్యకుండవలెను. అంతేకాక పాలి

చ్చెడు మాత యింట పనిపాటులు చేసికొనుచుండవలెను గాని పనిలేక యూరక కూరుచుండరాదు. సాధారణముగాబీదలు కావలసినంతపనిని గలిగియుందురుగనుక వారికి మంచి దేహసౌఖ్యము కలిగి తమబిడ్డలకు మాత్రమేకాక యితరులబిడ్డలకుకూడ నియ్యఁదగినన్ని పాలుండటయు పనిపాటులు చేయని డబ్బుగలవారి స్త్రీల దేహములుచెడి దుర్బలము లయి తమ శిశువులకే పాలుచాలకపోవుటయు, తటస్థించుచున్నది. పని చేయకయధికముగాతినికూరుచుండు స్త్రీలకుతఱుచుగాపాలెండిపోవును ప్రతిదినమును పొట్టనిమిత్తమయి కష్టపడిమితముగాతినుచుండుస్త్రీలకు సామాన్యముగా కావలసినన్ని పాలూరును. కాఁబట్టి జరుగుబాటుగల వారి స్త్రీలు పనిపాటుచేయక సదామంచములమీఁదను పోతబొమ్మల వలె పొదిగిళ్ళను కూరుచుండి కాలము గడుపుచు తాముచెడి పిల్లలను చెడఁగొట్టెడు దురాచారమునుమాని వేసిగృహకృత్యములయందుతగు పాటి దేహపరిశ్రమము చేయుచు తామును బిడ్డలును నాయురారోగ్య వృద్ధిని పొందియుందురని కోరుచున్నాము.

నియమితకాలములలో పాలియ్యక బిడ్డలకు తఱుచుగా చన్ను కుడుపుచుండుటవలన చనుమొనలుపుండ్లు పడుటయు పగులుటయుసంభ వించును. ఎఱుఁగనివారు కారణములు తెలిసికోలేక శిశువులు చన్ను కొఱికి రనుకొందురుగాని వారియూహసత్యముకాదు. పాలుకుడిచినతరు వాత చనుమొనలు తడిగానుంచుట పగులుటకింకొక కారణము. కాఁబ ట్టి శిశువు స్తన్యపానము చేసినతోడనే మెత్తనిగుడ్డతో చనుమొనలను మెల్లగా తడిలేకుండ తుడువవలెను. ఒకవంతువెలిగారముమ పదువం తులు పిండియు మెత్తగానూరిచనుమొనలకురాయుచువచ్చిన-చోపుండ్లు గాని పగులుటకాని మానును. తులముపావు మంచి తుమ్మజిగురు తెచ్చి చూర్ణముచేసి దానిలోనయిదుధాన్యపుగింజలమెత్తుపటికారపుపొడుము కలిపి దానిని చనుమొనలకు రాయుచువచ్చినను పుండ్లుమానును. తల్లి

చన్నులు పుండుపడ్డప్పుడు సాధారణముగా శిశువునోరుకూడ పుండు పడుట తటస్థించునుగనుక, పయిని చెప్పినపొడుమువలన బిడ్డల కేమియు హాని కలుగక నోరుమానుట కే సహాయపడునుగనుకను, పయినిరాచిన పొడుము తుడిచివేయకయే పిల్లలకు చన్ను కుడుపవచ్చును. నియమిత కాలములోనైనను చన్ను బిడ్డనోటపెట్టకముందు స్తనములలో పాలున్నవో లేవో చూచి లేనియెడలపాలూరువఱకును తాళియుండవలెను. చనుమొనలు పిండిచూచినయెడలపాలున్నదియు లేనిదియుసులభముగా తెలియును. పాలు లేనప్పుడు చన్నుకుడుపుచువచ్చినయెడల, తల్లికిచన్ను లెండిపోవుటయు పుండ్లుపడుటయు బిడ్డకు నోరుపూచుటయు విరేచనములు పట్టుకొనుటయు సంభవమగును. స్తనములలో పాలుండి బిడ్డ కుడుచుకొని పక్షమున, శిశువున కేదోజబ్బుకలిగియుండునుగనుక వెంటనే వైద్యునకు చూపవలెను. స్తనములలో పాలధికముగానుండి భారముగాను శ్రమగాను ఉన్నయెడల ఆలీవుచమురును ఉడుకులామును సమ భాగములుగా కలిపి దినమునకు మూడునాలుగు పర్యాయములు స్తనములకు రాయవలెను. పాలిచ్చునప్పుడు స్తనములమీఁద గాలిసోఁకనియ్యక బట్టమూసియుంచవలెను. రవికలనుగట్టిగాబిగించుటవలన స్తనములు చిన్నఁగా నెదుగకయు చనుమొనలడఁగిపోయియు పాలుండియు శిశువు కుడుచుకొనుటకు వీలుపడకమాతాశిశువులకిరువురకును చెఱుపు కలుగును గనుక రవికలను మిక్కిలి గట్టిగాబిగింపక కొంచెమువదులుగానే ముడివేయుచుండవలెను.

తెలివిమాలిన స్త్రీలు తమ బిడ్డల కించుమించుగా విరామము లేకుండ చన్నుకుడుపుటచేత, అట్టివారిలో పలువురకు మూర్ఛసహితము రావచ్చును. పాలిచ్చెడి తల్లికి బలహీనముగానుండి మూర్ఛ వచ్చునట్లు కనఁబడినయెడల, అదియే తల్లియొక్క సారమంతయుబిడ్డ లాగుకొనుచున్నట్లు నిదర్శనము గనుక బిడ్డకప్పటినుండి తల్లిపాలతోడి

పాటుగా ఇతరాహారము సహితము పెట్టుచుండవలెను. అప్పటికినితల్లికి సొలిపోవునట్లు దుర్బలముగానుండునట్టి గుణము తగ్గనియెడల, బొత్తిగా చన్నుగుడుపుట మానివేయవలెను. బిడ్డలు పాలువిడిచిపెట్టని యవస్థలో తల్లికి విరేచనముల కౌషధము లిచ్చుచుండినయెడల మాతాశిశువుల కిద్దఱికిని కూడ జబ్బుగనుక, సాధ్యమయినంతవఱకు బలమయిన భేదిమందు లేవియు నియ్యఁగూడదు. ఎప్పుడైననావశ్యకము తటస్థించిన యెడల కొంచెము చిట్టాముద మియ్యవచ్చును. తల్లికి మలబద్ధముగా నుండినయెడల, కొంచెము తేనెనాకించవలయును. అందువలన విరేచనమగుటయేకాక దేహమునకుఁగూడమంచిగలుగును. ప్రాతఃకాలముననే నిర్మలమయిన చల్లనినీళ్ళు చెంబెడు లోపలికిచ్చుటవలనఁగూడజాడించి విరేచనము కావచ్చును. చలినీళ్ళులోపలి కిచ్చుటకూడదని కొందఱు భ్రమపడినను, దానివలననేవిధమయిన యపాయమునుగలుగక మేలే కలుగును.

బిడ్డను గర్భములో తొమ్మిదిమాసములు భరించునట్టే తొమ్మిది మాసములవఱకు మాత్రమే తల్లి బిడ్డకు చన్నుకుడుపవలెను. శిశువునకు నవమాసములు రాకమునుపే చన్నిచ్చుటమాన్పినయెడల, శిశువునకుకండసత్తువకలుగదు; నవమాసములుదాఁటినతరువాతఁగూడ చన్నుగుడుపుచుండినయెడల బిడ్డ పాలిపోయి బోలుశరీరము కలిగి బలహీనమగును. పదవనెలను పాలువిడిచిన శిశువులే సాధారణముగా నధిక దేహారోగ్యము కలవారయి యుందురు. చిరకాలము పాలిచ్చుటవలన తల్లికిని పిల్లకునుకూడ చెఱుపుకలుగును. ఆరోగ్యదశలోనున్న మాతాశిశువులవిషయమయి తొమ్మిదినెలలు దాఁటగానేచనుగుడుపుటమాన్పవలసినను, తల్లి బలహీనముగానున్నయెడల నాలుగునెలలుదాఁటఁగానే బిడ్డకు తల్లిపాలుమాన్పవచ్చును; శిశువు వ్యాధిచే బాధపడుచుండిగాని బలహీనపడిగానియుండినయెడల సంవత్సరముదాఁటువఱకును స్తన్యము

నిచ్చుచుండవచ్చును. అటులిచ్చిన స్తన్యపానము చేయ నిచ్చుటమాత్ర మెటువంటి స్థితిలోనుగూడ తల్లికిని బిడ్డకునుగూడ తప్పక చెఱుపు చేయును. తల్లిపాలెక్కువబలమని భ్రమపడి సంవత్సరము దాటినతరువాతఁగూడ పాలిచ్చుచుండినయెడల, తల్లి తెలుచుగా బలహీనపడి యెండిపోవుటయే కాక యప్పుడప్పుడు చెవుడును మూర్ఛరోగమునుగూడ పుట్టును; తల్లి గతి యట్లుండఁగా శిశువున కజీర్ణము, పాలిపోవుట, బలహీనత, కలిగి యకాలమరణము సంభవించును. ఒకవేళ బ్రతికినను, ఊచకాళ్లు పడి, ఆరోగ్యము చెడిపోయి, దుస్థితిలోనుండును.

తొమ్మిది నెలలు దాటఁగానే స్తన్యము మాన్పవలసినను, అపనిని క్రమక్రమముగాఁ జేయవలెనుగాని యొక్కసారిగాఁ జేయఁగూడదు. మొట్టమొదట చన్నుగుడుపుట తగ్గించుచువచ్చి, అన్నము కొంచెము హెచ్చుచేయుచు రావలెను; అటుపిమ్మట రాత్రులమాత్రమే చన్ను గుడుపుచురావలెను; కడపట రెండుమూడుదినములు పిల్లను తగినవారి సంరక్షణములోవిడిచి తల్లి బంధువులయింటికిఁబోవుటగాని తానింటనే యుండి బిడ్డనే బంధువుల యింటికిఁ బంపుటకాని చేయవలెను. అట్లు చేయుట తటస్థింపనిపక్షమున, బిడ్డను తనగదిలో పరుండఁ బెట్టుకొనక మఱియొకగదిలో తగిన శాధ్యతగల స్త్రీయొద్ద పరుండఁ బెట్టవలెను. ఇట్లు చేయుటవలన శిశువునకు పాలయలవాటు తప్పిపోవును. పగలు శిశువు దగ్గఱనుండి పాలయలవాటుతప్పించుటకు శక్యము కానియెడల, చనుగుడుపుటకుముందుగా రెండుమూడునీటిబొట్లలోకొంచెము ముసాంబర మఱగఁదీసి చనుమొనలకు కొంచెము రాచుకొనవలెను. అట్లుచేసిన యెడల, శిశువు చన్నునోటపెట్టుకోఁగానే విడిచిపెట్టియుమ్మివేసి రెండు మూడుసారులలో రోతపుట్టి చనుగుడుచుట మానివేయును. బిడ్డకు చన్నిచ్చుట మానివేసినతరువాత తల్లి పాలుపిండివేయఁగూడదు; పిండివేసినయెడల మరలమరల నూరుచుండును. స్తన్యము నిండుగానుండి

కొంచెము బాధగానున్నను, దానిజోలికి పోక శాంతముగా నోర్చి యుండినయెడల క్రమక్రమముగా పాలుతగ్గిపోయి అయిదారు దినములలో పాలెండి పోవును. అట్లు తగ్గక మూడుదినము లయినతరువాత కూడ పాలునిండుగానుండి బాధగానున్న యెడల, ఆలీవుచమురునుఉదుకులోమును సమభాగములుగా గలిపి నాలుగుగంటల కొకపర్యాయము దానితో మెల్లగా స్తనములు రుద్దినయెడల బాధ పోవును. చనుగుడుపుట మానివేసినతరువాత పాలుపూర్ణముగా నెండిపోకకొందఱికికొన్ని వారములవఱకును కొందఱికి కొన్ని మాసములవఱకును గూడ కొంచెముగా నుండును. అట్లుండుటవలన నేవిధమయిన చెఱుపునులేదు.

శిశువునకు పాలుమాన్పవలసిన కాలము రాకముందే చెవులలో ధ్వని, కన్నులు చీకట్లుక్రమ్ముట, కనుగ్రుడ్లు నొప్పిపెట్టుట, తలదిమ్ము; ఒడలు జల్లుమనుట, ఆకలిపోవుట, గుండెలుకొట్టుకొనుట, బలహీనత, అజీర్ణము, మలబద్ధము, ఎడమప్రక్క నొప్పులు, నరములాగుట, మొగము తెల్లపడుట, చీలమండలువాచుట, అతిశ్వాసము, మొదలయినవానిలో నేవైన మూడునాలుగు తల్లికిగలిగి, పాలిచ్చినప్పుడెల్ల నవి యెక్కువయినయెడల వెంటనే శిశువునకుతల్లిపాలుమాన్పించి, శరీరారోగ్యము గలపాలదాదినిపెట్టి పాలిప్పించవలెను. అట్లుచేయక యలక్ష్యపెట్టిన యెడల, తల్లికి క్షయగాని హృదయరోగముగాని వచ్చి యపాయము గలుగును; పిల్లకును పాలుచాలనందునను, చాలినను మంచివికానందునను, క్షయాదులువచ్చి శరీరముచిక్కి చావు సంభవించును.

ఉన్నట్టుండి యాకస్మికముగా చన్నులలో పాలు విస్తారముగా తగ్గిపోయినయెడల, తల్లికి గర్భము నిలిచిన ట్టూహింపవచ్చును. అట్లు కడుపువచ్చినతరువాత పాలు కుడుపుట తల్లికిని పిల్లకును కూడ నపాయకరము. తల్లికి గర్భపాతముకూడ కలుగవచ్చును. కాబట్టి బిడ్డ పాలు మానతగిన స్థితిలోనున్నపక్షమున తక్షణము పాలుమాన్పవలెను; అట్లు

కాకయింకను పాలుత్రాగవలసినస్థితిలోనేయున్న పక్షమున, మంచిపాల దాదిని పెట్టి పాలిప్పించవలెను.

సామాన్యముగా స్త్రీలకు ప్రసవించిన తొమ్మిది మాసములకు మరల ముట్లారంభమగును. అట్లారంభమయినతరువాత పాలు తగ్గుట యేకాక బలప్రదము కాకపోవును. కాబట్టి వెంటనే శిశువునకుపాలు మాన్పవలెను. అట్లుమాన్పక పాలుత్రాగనిచ్చుచుండినయెడల, శిశువు పాలుత్రాగి బలియుటకు మారుగా దినదినక్రమమున చిక్కి క్షీణించి యెదుగక తొమ్మిదినెలలునిండినప్పటికున్న దానికంటెనుబలహీనముగా నుండును. చనుమొనలు కదుములుగట్టి పుండ్లుపడి మందులు వేసినను శీఘ్రముగా మాననప్పుడుగాని, క్షయ, నెత్తురుక్రక్కుట, గుండెలువిస్తారముగా కొట్టుకొనుట, నిస్త్రాణచేసెడువ్యాధి. మొదలయిన వానిలో నేదయినను కలిగియున్నప్పుడుగాని, వెంటనేతల్లిపాలు మాన్పించి దాదిని పెట్టవలెను. పాలదాదిని పెట్టుటకు ముందు దాని నడతను దేహస్థితిని చక్కగా విచారించి మరిపెట్టవలెను.—దాదియు దానిబిడ్డయుమంచి యారోగ్యదశలోనుండవలెను; దానిబిడ్డయొక్కయు పాలిప్పింపదలచిన బిడ్డయొక్కయు వయస్సు సాధ్యమయినంతవఱకు సమానముగా నుండవలెను; జ్వరముగాని యంటువ్యాధులుగాని యున్నది పనికిరాదు. స్ఫోటకము మొదలయిన యంటురోగములు వచ్చినప్పుడు పాలదాదియొద్దనుమాత్రమేకాక తల్లియొద్ద సహితము పిల్లను పాలు త్రాగింపఁగూడదు; దగ్గఱకైనను తీసికొనిపోఁగూడదు. బిడ్డకుపాలుమాన్పుచున్న దశలో తల్లిమితభోజనము చేయుచు, కారముగలవస్తువులనుపిండివంటలను తినక, సమస్తమయిన మత్తుచేసెడు పదార్థములను దగ్గఱకుఁ జేరనీక, జాగరూకతతో నుండవలెను; పానకము మొదలయినద్రవపదార్థములను మిక్కిలి తక్కువగాపుచ్చుకొనవలెను; సాధ్యమయినంతవఱకు బిడ్డకంటఁబడుచుండుటయు బిడ్డకు తనమాట వినఁబడు, చుండుటయు

తప్పింపవలెను వెచ్చవెచ్చగానుండుపాటికర్పూరము వేసికాచినచమురు దినమునకు మూడుసారులు స్తనములకు పూయవలెను. పాలు మాని వేసినతరువాత మరల నెప్పుడును చన్ను బిడ్డనోట పెట్టరాదు. అట్లు తెలివిమాలి పెట్టినయెడల బిడ్డకు విరేచనములును, తల్లికిచనుమొనలు పుండ్లుపడుటయు సంభవమగును.

## ఐదవ ప్రకరణము.

## శిశు సంరక్షణము.

---

శిశువు జనన మొదినతరువాత బొడ్డుకోయఁగానే వేఁడినీళ్ళను చన్నీళ్లనుగాక గోరువెచ్చగానుండునీటితో శరీరము మెల్లగా కడిగిబిడ్డకు నీళ్లుపోయవలెను. చన్నీళ్ళుపోసినయెడల, బిడ్డకు కన్నులోజయుటగాని రొంపపట్టుటగాని, విరేచనములుగాని సంభవింపవచ్చును; ఉడుకునీళ్ళు పోసినయెడల, బిడ్డ బలహీనపడి వ్యాధికిస్థానమగును. కాఁబట్టి యెప్పుడునునులివెచ్చనినీళ్ళేపోయు చు శీతకాలమునందుకొంచెము వేఁడి హెచ్చుగా నుండులాగునను వేసవికాలమునందు మఱింత చల్లఁగానుండులాగునను నీళ్ళుతొలుపుచురావలెను. శిశువులకుపోసెడునీ రప్పుడు పితికిన పాలుండు దానికంటె కొంతవెచ్చగానుండవలెను. అప్పుడుపుట్టినశిశువునకు వెన్నకాని చమురుగాని రాచి దేహముమీఁదనంటుకొనియుండెడి జిగురుపదార్థము పోవునట్లు మెల్లగా రుద్ది వేడినీళ్ళు పోయవలెను. ఆజిగురుపదార్థము పోక దేహమున నట్టెయున్నయెడల, చిడుముగాని చెమటపొక్కులుగాని లేచును. శిశువునకుదయకాలమునప్రతిదినమును తప్పక నీళ్ళుపోఁయవలెను. నీళ్ళుపోయుటకు మునుదుగా తెలతడుపుట మంచిది; అటుపిమ్మట శిశువునుతొట్టెలోసగమువఱకునీళ్ళుపోసియందులోఁ గూరుచుండఁబెట్టి యొడలు తోమినను తోమవచ్చును. చంకలు

గజ్జలు మొదలయిన స్థలములో ముఱికి యెంతమాత్రము లేకుండు నట్లు చక్కఁగా నుండవలెను. నీళ్ళుపోయఁగానే శిశువును నాననియ్యక శుభ్రమయినపొడిగుడ్డతో శరీరమంతయుతుడిచి,మఱింతముఖ్యముగా చెవులలోతడియెంతమాత్రమును లేకుండఁజేయవలెను. రెండవమాసము వచ్చిన తరువాత శిశువు దుర్బలముగా కనఁబడనిపక్షమున, స్నానము చేసెడు జలములో చేరెడు ఉప్పువేసి నీళ్ళు పోయుచువచ్చిరేని శిశువు నకు బలము కలుగును. శిశువులకు ప్రక్కవేసెడునట్టిగాని, కప్పెడునట్టి గాని బట్టలు చవుడుపెట్టి యుతుకఁగూడదు. చాకలివాండ్రగుడ్డలకు చవుడు పెట్టిన యెడల శిశువులకు చిడుము పట్టును; ఉదయమున పా లియ్యక మునుపే శిశువుకు స్నానము చేయించవలెను. పాలిచ్చినతరు వాత నీళ్ళుపోయుచు వచ్చెడుపక్షమున, శిశువున కజీర్ణమును, కడుపు నొప్పియు, కలుగును. నీళ్లుపోసి తుడిచిన తరువాత తల్లి తన చేతులు నొండొంటితోరాచి యావెచ్చనిచేతులతో శిశువుదేహమునురాచుట యారోగ్యప్రదము. ప్రతిదినమును స్నానముచేయించుట దేహమునకు బలమును సుఖమును కలిగించుటయే గాకశరీరమును దృఢపఱిచిపుష్టిని గలుగఁజేయును గనుక, తల్లు లెప్పుడును తమబిడ్డల కనుదినము నీళ్ళు పోయుటలో నశ్రద్ధచేయఁగూడదు.

బొడ్డు కోసినతరువాత దానికొకగుడ్డచుట్టియుంచవలెను. కోసిన బొడ్డుదారములోనుండి నెత్తురువచ్చుచున్నట్టుకనఁబడినయెడలవెంటనే దానికి గుడ్డచుట్టి దారమును బిగించి నెత్తురు కారకుండఁజేయవలెను. బొడ్డుసాధారణముగా నయిదాఱుదినములలోను, ఎక్కడనో కొందఱికి పదిపదునేనుదినములలోను, ఊడిపోవును. అది తనంతటయు క్తసమయ ములో నూడిపోనిపక్షమున, ఊడిపోవువఱకును వేచియుండ వలసినదే గాని దానినూడఁదీయుటకయి యెంతమాత్రమును ప్రయత్నముచేయ రాదు, సామాన్యముగా మంత్రసానులు బొడ్డునుబలవంతముగానూడఁ

దీయుటకు ప్రయత్నించుటచేత బొడ్డు వాచిపుండుపడుటసంభవించును. కనుక, మంత్రసానులు బొడ్డుజోలికిపోకుండునట్లు జాగ్రత్తపెట్టవలెను.

శిశువుల యారోగ్యమునకు శుద్ధవాయువత్యావశ్యకము. పురుటిండ్లలోనికి మంచిగాలి రాకపోవుటచేతనే యీదేశములో శిశువులనేకులు పురుటిదినములలోనే మృతినొందుచున్నారు. మంచిగాలిరాని యిఱుకుగదులలో పెట్టి పొగలు మొదలైనవి పెట్టి యున్నగాలిని కూడ చెడఁగొట్టుచుండుటచేత నొక్క శిశువులకు మాత్రమే కాక తల్లులకు సహితము తెలియకుండగా శిశువులగతియే పట్టుచున్నది. పురుటిండ్లతలుపులన్నియు మూసియుంచుటవలనను, ఇరుగు పొరుగుల స్త్రీలందఱును గదిలో గుంపులు గుంపులుగా పోగగుటవలనను, కుంపట్లు పెట్టుటవలనను, గాలి చెడిపోవుటచేతనే సాధారణముగా మా శిశువులకుమరణములు సంభవించుచున్నవి. కాఁబట్టి యిన్నిస్మవచ్చినదనియు, సందుకొట్టినదనియు, భ్రమింపక శిశువులయవస్థకు పురిటిండ్లలో శుద్ధవాయువు చాలినంతవఱకు ప్రసరించకపోవుటయే ముఖ్యకారణమని తెలిసికొని ప్రసవమగు గదులలో గాలిశుద్ధముగానుండుటకు తగినప్రయత్నముల నన్నిటిని చేయవలెను. ఈప్రకారముగాఁ జేసినయెడల, పురిటిదినముల లోపలనే సంభవించెడు తల్లులయొక్కయు బిడ్డలయొక్కయు మరణములు సగము తగ్గిపోవచ్చును.

శిశువుల మరణమునకు మఱియొక కారణము పసిపాపలకు కాలనియమములేక యిష్టమువచ్చిన యాహారమును పెట్టుచుండుట. మూఁడు సంవత్సరముల ప్రాయమువచ్చువఱకును శిశువులకు బలమయిన యాహారమేదియు పెట్టఁగూడదు. ఈదేశములో తల్లిదండ్రు లనేకులు భోజనసమయమునందు చంటిబిడ్డలను తమవద్దఁగూరుచుండఁబెట్టుకొని తాము తినెడి యాహారమునే వారికిని బెట్టుచుందురు. అట్లు చేయుటవలన కోమలములయిన పసిబిడ్డల జీర్ణసాధనములు చెడి యందుమూలమున

పలువిధములయిన వ్యాధులు సంభవించి మరణములుకూడ సంప్రాప్తము లగును. కాబట్టి పసిపిల్లల కాహారము పెట్టు విషయములో మిక్కిలి జాగరూకులయి యుండవలెను.

అప్పుడు పుట్టిన శిశువునకు మూడునాలుగు గంటల సేపటివఱకు నాహారమక్కఱలేదు. మూడునాలుగు గంటలసేపయి తల్లికి ప్రసవించినబడలిక తీఱఁగానే శిశువునకు పాలు కుడుపవలెను. తల్లులు పలువురు పాలుపడలేదని చెప్పి మూడవదినమువఱకును తాము పాలీయ్యక, ఆవుపాలను పోయుచుందురు. అట్లుచేయుట క్రమమయినపని కాదు. ప్రసవించినది మొదలుకొని తల్లికి కొంచెముగా పాలుండును. బిడ్డను కుడుపుటచేత పాలుపడి వృద్ధియగును. కాబట్టి బిడ్డకు వెంటనే తప్పక చన్నుకుడుపవలెను. తల్లియొక్క యప్పటిపాలు శిశువునకు మిక్కిలిబల ప్రదమగుటయేకాక, విరేచనమగునట్లుచేసి దేహమునుశుద్ధిపఱచును. దయామయుఁడయిసర్వజ్ఞుఁడయిన యీశ్వరుఁడుపసిపాపలక్షేమమునకే యీయాహారము నుద్దేశించెనని యెఱుఁగక మూఢత్వముచేతమన దేశములో తెలియనివారనేకులు మొదటి మూడుదినములును బిడ్డకు తల్లిపాలనుమాన్పించి యావుపాలనిప్పింతురు. తల్లికి పాలున్నయెడల, ఆవు పాలనిప్పించుట యెంతమాత్రమును యుక్తముకాదు. తల్లిచన్నుగుడిపినను పండ్రెండు గంటలకాలములోపల పాలుపడనిపక్షమున, అప్పుడు మాత్రము రెండువంతుల వేడినీళ్ళలో నొకవంతావుపాలుకలిపి దానిలో కొంచెము పంచదారవేసి నాలుగుగంటల కొకపర్యాయము శిశువునకు కొంచెము కొంచెముగా నిచ్చుచుండవలెను. అటుతరువాత తల్లికిపాలు పడఁగానే యావుపాలను మాన్పవలెను.

బిడ్డకు రెండుమూడుదినములవఱకును చన్ను కుడుపకపోయినపక్షమున, శిశువు బలహీనపడుటయేకాక తఱుచుగా చన్నుకుడువనుసహితము మఱచిపోవును. అంతేకాక యావులకుండెడిజున్ను పాలవంటిచిక్కని

జిగురుపాలను శిశువుపీల్చకపోయినయెడల, చనుమొనలుకదుములుగట్టి పుండ్లుపడి తల్లికి మిక్కిలి యాయాసము సహితము కలుగును. అదిగాక బిడ్డకు వెంటనే చన్నిచ్చుటవలన ప్రసవానంతరము వచ్చెడునొప్పులు తక్కువగుటయే కాక రక్తము ప్రవహించెడి యవకాశము కూడ తగ్గిపోవును.

పాలు పడినతరువాత తల్లి బిడ్డకొకచన్నుతరువాతనొకచన్ను చొప్పున మార్చుచు, పాలియ్యవలెనేకాని యెప్పుడు నొకచన్నుమాత్ర మే కుడుపరాదు. కొన్ని కారణములచేత కొందఱు పిల్లలొక్కచన్ను మాత్రమే కుడుచుకొనుట కిష్టమున్నను, తల్లియాయలవారును సాగ నియ్యకూడదు. కొందఱు తల్లులు బిడ్డలకదేపనిగా పాలిచ్చుచుందురు. ఈదురాచారమువలన తల్లికిని బిడ్డకునుకూడ చెఱుపుగలుగును. త్రాగిన పాలఱుగుటకు కొంతవిశ్రాంతి యవశ్యముగా నుండవలెను. మొదటినెలలో పగలు నాలుగుగడియల కొకపర్యాయమును రాత్రి జామున కొకపర్యాయమును పాలిచ్చుచుండవలెను; రెండవనెలలో పగలు రెండుగంటల కొకసారి పాలిచ్చుచుండవలెను. ఈప్రకారముగా నేనెలలుగడచినకొలం దిని క్రమక్రమముగా కాలమును హెచ్చించుచువచ్చి కడపట నాలుగు గంటల కొకసారిమాత్రము పాలిచ్చువఱకును దీసికొని రావలెను. ఈ ప్రకారముగానే రాత్రులుకూడ కాలమును హెచ్చించుచువచ్చికొన్ని మాసములయినతరువాత పరుండఁబోవునప్పుడొక్కసారి యిచ్చిమరల తెల్లవాఱుజామునమఱియొకసారి యిచ్చుచుండుటచాలును. తల్లినియ మితకాలములో మాత్రమే పాలిచ్చుచువచ్చినయెడల, శిశువుసహితము దానికలవాటుపడి యాకాలమునకుదప్ప పాలు కోరకుండును. పా లెంతయెక్కువగానిచ్చిన బిడ్డకంత యెక్కువబలము కలుగుననియెంచి కొందఱు తెలివి లేమిచేత తమకుండు ప్రేమాతిశయమునుబట్టి బిడ్డకు మాటిమాటికి పాలిచ్చుచుందురు. మఱికొందఱు తల్లులు బిడ్డయేడ్చి

నప్పుడెల్లను చన్ను నోటఁబెట్టుచుందురు. ఏడ్చుటకు కారణమొక్క యాఁకలి యగుటమాత్రమే కాదు. పాలెక్కువయైనను, కాఁకచేసినను జలుబుచేసినను, ఏదైననొప్పియెత్తినను, కూడ బిడ్డ యేడ్చును. అప్పుడెల్లను పాలిచ్చుచువచ్చినయెడల, పాలెక్కువయయి యజీర్ణముకలుగుటయు, కడుపుబ్బుటయు, కడుపులో శూలపుట్టుటయు, వమనములు వెళ్ళుటయు, విరేచనములగుటయు, సంభవించును. ఇట్లధికముగా పాలిచ్చుటచేతనే మన దేశములో ననేకశిశువులు చచ్చుచుందురు. పాలు కుడుపునప్పుడు శిశువు చన్ను వదలివేయఁగానే పాలిచ్చుటమానివేయవలెను. బిడ్డ పాలుత్రాగి నోటిలోనిచన్ను విడిచిపెట్టుట తగినన్ని పాలుత్రాగి తృప్తిపొందెననుటకు నిదర్శనము. శిశువు నడ్డముగా పరుండఁబెట్టి పాలియ్యఁగూడదనియు, తల మొదలయినపయిభాగము పయికిని మొల మొదలయిన క్రిందిభాగము క్రిందికిని నుండునట్లాగున నేటవాలుగాఁబట్టి పాలియ్యవలయుననియు, ఈవఱకే చెప్పియున్నాముగదా! ఇట్లు చేయుటచేత త్రాగినపాలు సులభముగా కడుపులోనికిపోవుటయే కాక కక్కుకొనుట మొదలయినవి సంభవింపవు. ఏహేతువుచేతనైనను తల్లివద్ద బిడ్డకు కావలసినన్ని పాలులేకపోయిన పక్షమున, ముఖ్యముగా రాత్రులయందు కొంచెమావుపాలియ్యవచ్చును. శిశువు జననమొందినతరువాత నయిదాఱుమాసముల వఱకును తల్లిపాలు తప్ప మఱియేవిధమైన యాహారమును పెట్టఁగూడదు. అటుతరువాత వేఁడినీళ్ళను, ఆవుపాలును, సమభాగములుగాఁ కలిపి దానిలో కొంచెము పంచదార వేసి యియ్యవచ్చును. పాలెప్పుడు నొక్కయావువిగానే యుండవలెనుగాని దొరకిన చోటనెల్ల నావుపాలను దెచ్చి పోయరాదు; అంతేకాక యావుపాలు కొంచెముసేపటిక్రింద పితికినవిగా నుండవలెను గాని నిలువ యున్నవి మంచివి కావు. ముందుగా వేఁడినీళ్ళు కాఁచి దానిలో కొంచెము పంచదార వేసి చక్కగా కలిసినతరువాత, కాఁచనిపచ్చియావుపాలనావేఁడి

నీటిలో పోసి కలుపవలెను. అంతేకాని పాలు కాఁచి తరువాత నీళ్ళలో కలుపఁగూడదు. పయివిధముగా నీళ్ళును పంచదారయు కలిపినపాలు మాత్రమే తల్లి పాలతో సమానముగానుండి శిశువునకుబలప్రదమగును. నీళ్లు కలుపని కాఁగినపాలు పోసినయెడలఁ బిడ్డలకజీర్ణమును మలబద్ధమును పుట్టి, పెక్కుజబ్బులు కలుగును. శిశువునకేడుమాసములు వచ్చువఱకును పిండి కలిగిన యాహారమును దేనిని బెట్టరాదు.

శిశువునకుపాలుమాన్పినది మొదలుకొనికాని, ఆఱు నెలలుదాఁటినతరువాతనన్నప్రాశనముచేసినదిమొదలుకొనికాని, అన్నము, రొట్టె, పిండివంటలు మొదలయినవి పెట్టుచుండఁగూడదు. తిన్నఁగానమలుటకు చేతకానట్టియు జీర్ణసాధనములు పూర్ణముగా నేర్పడనట్టియు ఆకాలమునందు గట్టియాహారమును పెట్టినయెడల, తిన్నగానఱగకవిరేచనాదులు కలుగును. కాఁబట్టి శిశువులకు పెట్టెడి యాహార మీక్రింద చూపఁబడెడు విధములలో నేదోయొకరీతిగానుండుట యారోగ్యప్రదము—

(1) అరసేరు మెత్తని బియ్యపుపిండి నొకగుడ్డలో వేసి గట్టిగా మూటకట్టి, ఆమూట చక్కగా మునిఁగి కొంచెము పయికి నీరుండునట్లుగా గిన్నెలో నీరుపోసి పెట్టి సన్నని సెగమీఁద నాలుగైదుగంటలసేపుడుకనిచ్చినయెడల, అది పసిబిడ్డల కనుకూలమైన యాహారమగును. పయిని చెప్పిన ట్లుడికినతరువాత గుడ్డమూటను నీళ్ళలోనుండితీసి మూట విప్పి, బెరడుకట్టినపయిభాగమును తీసివేసి లోపలనున్న మెత్తని యుడికిన పిండిని పాలు మొదలయినవిచేర్చి శిశువులకు పెట్టవచ్చును.

(2) కారన్ఫ్లోర్ (సీమజొన్నపిండి) రెండుడబ్బులయెత్తు తెచ్చి నాలుగైదుడబ్బులయెత్తు చన్నీళ్ళలోపోసి చక్కగాకలిపి, దానిలో నరసేరు సలసలకాగిన వేడినీళ్లుపోసి నాలుగయిదు నిమిషములసేపు నిప్పుమీఁదపెట్టి గరిటెతో కలియఁబెట్టినపక్షమున, అదిజావవలెనయి శిశువులకు మంచియాహారమగును. దానిలో కొంచెముపటిక పంచదార

పొడుము వేసి పిల్లలకు పెట్టవచ్చును. దానిలో ఆవుపాలుపోసినను పోయ వచ్చును.

(3) మంచిసన్నబియ్యము తెచ్చి గంటసేపు నీళ్ళలో నాననిచ్చి తరువాత చక్కగా బియ్యముకడిగికడుగువడిపివేసి, ఆబియ్యమును తేట నీటిలో మెత్తవఅకునుఉడుకనిచ్చి, అప్పుడు పటికబెల్లము కొంచెము వేసి గంజితో జావయగువఅకును ఉడుకనిచ్చి క్రిందకుదింపి, మూడవ వంతు పాలు వేసి శిశువులకు పెట్టవచ్చును.

(4) శిశువునకు జీర్ణశక్తి తక్కువగానున్నయెడల, జావ యీ రీతిగాఁ జేయవలెను. నాలుగయిదు గరిటెల నీళ్ళలో రెండుడబ్బుల యెత్తు మెత్తని వరిపిండివేసి చక్కగాకలిపి, నాలుగయిదు గరిటెల పాలు పోయిమీఁదపెట్టి తిన్నగా కాగినతరువాత దానిలో పంచ దారవేసి కలియఁబెట్టి, అప్పుడాపాలలో అవఅకు పోసికలిపియుంచిన నీళ్ళుపోసి యిరువది నిమిషములసేపు సన్నసెగమీఁదనుడుకనిచ్చి దింపి శిశువునకు పెట్టవచ్చును.

శిశువున కాఱుమాసములు దాఁటకమునుపు పిండి కలిసిన యాహారమేదియు పెట్టఁగూడదు. ఈయాహారము లెప్పటికప్పుడు క్రొత్త గా చేసి గోరువెచ్చగా నుండఁగానే పెట్టవలెనుగాని బొత్తిగా చల్లార నియ్యఁగూడదు. పాలునిలువయుంచిన వయినయెడల పులిసిపోయి శిశు వునకు జబ్బుకలిగించునుగనుక, సాధ్యమయినంతవరకు నాపూట పితికిన పాలనే పోయుచుండవలెను. పాలలోఁగాని జావలోఁగాని పంచదార విస్తారము వేయఁగూడదు. పంచదార విస్తారముగా వేసినపక్షమున ఆఁకలి మందమగును. శిశువుల యాహారములో నుప్పు కొంచెము కలుపుట మంచిది. ఉప్పువలన నాహారమునకు రుచి కలుగుటయేగాక, ఆహారము సులభముగా జీర్ణమయి ప్రేగులలో నులిపురుగులు మొదల యినవి పుట్టకుండును. తల్లిపాలు విడువకున్న కాలములో శిశువునకు

దినమునకు రెండుపర్యాయములకన్న నెక్కువసారు లాహారము పెట్టఁ గూడదు. ఆరెండుసారులు సహిత మాహారము కొంచెముగా పెట్ట వలెను.

రోగాదికారణములచేత తల్లియొద్ద స్తన్యములేనిపక్షమున, శిశువునకు పోతపాలు పోయుటకంటె పాలదాదిని పెట్టి పాలిప్పించుట శ్రేయస్కరము. పాలదాదిని పెట్టకముందు దాని దేహారోగ్యమెట్టిదో, దాని వద్ద కావలసినన్నిపా లున్నవోలేవో, దానిశిశువుకూడ పాలిప్పించెడు బిడ్డతో సమానవయస్సును కలిగియుండెనోలేదో, విచారించిమఱిపెట్ట వలెను. దానివద్ద క్షయ మొదలయిన రోగములున్నను, చర్మము మీఁదమచ్చలు పుండ్లు మొదలయినవియున్నను, తగినన్నిపాలు లేక పోయినను, శిశువు పానముచేయుటకు చాలినంత పొడవుగల చను మొనలు లేకపోయినను, చనుమొనలు పుండ్లుపడియున్నను, దానిశిశువు వయస్సును పాలిప్పించెడుశిశువువయస్సును ఇంచుమించుగాసమానము కాకపోయినను, అదిముల్లుగుచున్నదయినను, దానిబిడ్డ బలహీనముగా నున్నను నోరుపూచియున్నను, అటువంటిపాలదాదినిపెట్టుకొనక మాని వేయవలెను. పాలదాది యిరువదియైదుసంవత్సరములకు మించని వయస్సుగలదయి యుండుట మంచిది. కొందఱివద్ద పాలున్నను త్రాగుటకవి వేగిరము శిశువునోటికి రాకుండును. అటువంటిసమయములో శివువాహారముచాలక కృశించిపోవును. కాఁబట్టి పాలదాదిచన్ను శిశువునోటఁబెట్టినతరువాత వెంటనే శిశువునొకసారిపైకిఁదీసి నోటిలో పాలున్నవో లేవో పరీక్షించిచూడవలెను. బిడ్డయేడ్చినప్పుడేడ్పు మానుటకయి పాలులేకపోయినను వట్టిచన్నునుగాని వ్రేలినిగాని నోట పెట్టి కుడుపుదురు. అట్లు చేయుటవలన బిడ్డకు విరేచనములు మొదలైనవి కలుగునుగనుక, తల్లిగాని దాదిగాని యెప్పుడును వట్టిచన్ను కుడుపరాదు. పాలిచ్చుచున్నదినములలో దాదిగాని తల్లిగాని యనా

రోగ్యకరమయిన యాహారమునుతినక పథ్యముగానుండవలెను. కాఁక చేసెడువస్తువులను తినఁగూడదు; రాత్రి మిక్కిలి ప్రొద్దుపోయిన తరువాత భోజనముచేయఁగూడదు. రాత్రి పదిగంటలు దాఁటినతరువాత మేలుకొనియుండరాదు. ప్రాతఃకాలముననే నిద్రలేవవలెను; కొంచెము సేపు మంచిగాలిలో తిరుగుచుండవలెను. కోపము మొదలయిన మనోవికారములవలనఁగూడ పాలు చెడిపోవునుగనుక, కోపస్వభావముగలిగి చిఱచిఱలాడుచుండెడుదాని నెప్పుడును పాలదాదినిగాఁ బెట్టరాదు.

తల్లివద్దపాలులేక పాలదాదినిపెట్టుటకు శక్తిలేనప్పుడునుమంచి పాలదాది దొరకనప్పుడును పయినిజెప్పినరీతిని పోతపాలుపోయవలెను. గాడిదపాలించుమించుగా తల్లిపాలను పోలియుండునుగాన శిశువులకవి యారోగ్యప్రద మయినను, అవి దొరకుట కష్టమగుటచేత వానిని మానవలెను. అటుతరువాత మేకపాలుశ్రేష్ఠమైనవి. అయినను మేకపాలు బలమైనశిశువులకుగాని పడవు. కాఁబట్టి మంచియావుపాలలో వేఁడి నీళ్ళను సమభాగముగాకలిపి దానిలో కొంచె ముప్పువేసి కొంచెము తియ్యఁబడునట్లుగా పటికపంచదారపొడుము వేసి పాలబుడ్డిలో పోసి శిశువు కుడుచుకొనునట్లు చేయవలెను. పాలబుడ్డిని ప్రతిదినమునుకడిగి శుచిగానుంచవలెను. పాలబుడ్డిదొరకనియెడల గిన్నెతోనేపోయవచ్చును. పాలేపూటకాపూట పితికినవిగానుండవలెననియు, ప్రతిదినమునొక్క యావుపాలే పోయవలయుననియు, పాలుకొనఁగూడదనియు, ఇదివఱకే చెప్పఁబడినదిగదా? పాలలోపోసెడునీరు మసలియుండఁగూడదు; వేడిగామాత్రముండవలెను. మసలి సలసలలాడెడు నీళ్లుపోసిన యెడల పాలుచెడిపోవును. పోసెడిపాలు గోరువెచ్చగా నుండవలెనుగాని చల్లపడిపోరాదు. శిశువునకు వయసు హెచ్చినకొలఁదిని క్రమక్రమముగా పాలుహెచ్చించి నీరుతగ్గించుచు కడపటనొకవంతునీరును రెండువంతుల పాలును నగునట్లుచేయవలెను. మొదటినెలలో రెండువంతులనీళ్లునొక

వంతుపాలును చేర్చవలెను; రెండవ మూడవ నెలలలో నీరునుపాలును సమభాగములుగా చేర్చవలెను; నాలవ యైదవ నెలలలో నీరొకవంతును పాలు రెండువంతులును చేర్చవలెను; అటుతరువాత నీరు కలుపకయే పాలు పోయవచ్చును. అయినను కొంచెముగానో గొప్పగానో యెప్పుడును నీరుకలుపుచుండుట శ్రేష్ఠమని కొందఱువైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. సామాన్యముగా పాలు కాచకూడకపోయినను, శిశువునకు విరేచనము లగుచున్నప్పుడును విరేచనములుకంపుకొట్టుచున్నప్పుడును పాలుకాచి మఱిపోయవలెను. పాలు కాగినతరువాతనిప్పుమీఁదనట్టే యుంచక తత్క్షణమే దింపివేయవలెను. ఆఱుమాసములుదాటిశిశువునకు పండ్లుమొలచుట యారంభమయిన తరువాత పిండికలిసిన యాహారము కూడ పెట్టుటయావశ్యకము. శిశువులకు పాలెప్పుడును కావలసినంత కంటె నధికముగా పోయఁగూడదు. పాలెక్కువయినపక్షమున, కక్కులును విరేచనములును సంభవించును. పాలెక్కువగుటకంటెకొంచెము తక్కువగుటయే సదాక్షేమకరము. పాలు మొదటిమాసములో రెండు గంటలకొకపర్యాయమును, రెండవమాసములో మూడుగంటల కొక పర్యాయమును, ఈప్రకారముగా వెనుక చెప్పినరీతిని నెలలు గడచిన కొలఁదిని కాలము హెచ్చించుచుండవలెను. రోగిష్ఠులయి చిక్కియున్న శిశువులకు పయికాలమును పాటింపక పాలు కొంచెము కొంచెముగా నెక్కువసారు లియ్యవచ్చును. అట్టి దుర్బలశిశువులు కడుపునిండ పాలు పోసినయెడల నఱిగించుకోలేరు.

తొమ్మిదినెలలువచ్చినతరువాత తల్లిపిల్లకు పాలుమాన్పవలయునని యు, పాలిచ్చుట యొక్కసారిగా మానివేయక క్రమక్రమముగాపాలిచ్చుట తగ్గించుచు నితరాహారము పెట్టుట హెచ్చించుచురావలెననియు అటుతరువాత రాత్రులుమాత్రము పాలిచ్చుచు కట్టకడపట శిశువును కొన్నిదినములు చుట్టములయింటికిఁ బంపిగాని శిశువు నింట పెద్దవారి

సంరక్షణమునందుంచి తానే బాధ్యులుయుంటికి పోయిగాని మఱియొక విధముగాఁ గాని బొ_త్తిగా పాలిచ్చుట మానివేయవలయు ననియు, బాలింతప్రకరణమునందే చెప్పియున్నాము.

టీకాలు వేయించుట—అంటురోగములలో నెల్లను స్ఫోటకము వంటి పాడురోగము మరియొకటి లేదు. ప్రతి సంవత్సరమును దీనివలన వేలకొలఁది జనులుమృతినొందుచున్నారు. మృతులుగాక బ్రతికినను బహు జను లంధులయ్యును వికలాంగులయ్యును, మొగమునిండ గుంటలుపడి విరూపులయ్యును, నానావిధనష్టములను పొందుచున్నారు. ఇది వయో నియమము లేక బాలురకును వయసువాండ్రకును ముసలివాండ్రకునుఁ గూడవచ్చును. ఆవుపొదుగులలో లేచెడి యొకవిధమయినపొక్కులలోని రసమునుతీసి మనుష్యునకు వేయుటవలన స్ఫోటకవ్యాధి యట్టివారికి సాధారణముగా రాకుండును. అంతేకాక, ఆవుపొదుగుపొక్కులలోని రసము వేసిన మనుష్యులయొక్క పొక్కులలోనిరసమునుకూడ వేయవచ్చును. ఇట్లు రెండువిధములయిన రసములలో దేనినయినను మనుష్యుల దేహమునందు చొప్పించుటకు టీకాలు వేయుటయని పేరు. టీకాలు సామాన్యముగా భుజములమీఁద మూడుచోట్ల వేయఁబడును. ఒక విధమయిన కత్తితో భుజములమీఁది చర్మమును మూడుచోట్ల గీకి యాభాగములయందు టీకాలరసమును వేసినపక్షమున, ఆమూడుభాగ ములయందును మూడుపొక్కులు లేచును. ఈప్రకారముగా ఏడుసంవ త్సరముల కొకొక్క పర్యాయము టీకాలు వేయించుకొనుచు వచ్చిన పక్షమున, అట్టివారికెప్పుడును మసూచికము రాదు. ఒకవేళనూటికొకరికి వచ్చినను, పాటు మిక్కిలిపలచగానుండి యపాయకరము కాకుండును. టీకాలు వేయునప్పుడు దేహారోగ్యము చక్కఁగా కలవారిచేతులమీఁది పొక్కులలోని రసమునుమాత్రమే వేయవలయునుగాని వ్యాధిగ్రస్తుల బుజములమీఁద లేచిన పొక్కులలోని రసము నెప్పుడును వేయఁగూడదు.

అట్లు వేసినపక్షమున వారికున్న రోగములుకొంతవఱకుటీకాలు వేయించు కొన్నవారికి సంక్రమించును. శిశువునకు రెండుమాసములు దాటిన తరువాత సాధ్యమయినంత శీఘ్రముగా టీకాలు వేయించవలెను. అట్లు వెంటనే వేయించక యాలస్యము చేసినకొలఁదిని శిశువును టీకాలు వేయించుటకులోఁబఱుచుటయు వేయించినతరువాతపొక్కులనుచిదుప కుండను గోకకుండను వారించుటయు కష్టమగుచుండును. నఖమును పొక్కులు చిదిపివేసిరసమంతయు పోవునట్లుచేసినపక్షమునటీకాలవలని ఫలము పూర్ణముగాకలుగదు. శిశువునకు గజ్జిమొదలయినచర్మరోగము లున్నప్పుడు టీకాలు వేయించుటవలన ప్రయోజనము కలుగనేరదు. గనుక, గజ్జిమొదలైనవి మానినతరువాతనే టీకాలు వేయించవలెను. శిశువునకు టీకాలు పొడిపించిన యేడవదినమున జ్వరమువచ్చి మూడు నాలుగు దినములవఱకునుండును; అప్పుడు శిశువునోరు వేడిగానుండి తఱుచుగా పాలుత్రాగుట కభిలాషగలిగియుండును; రాత్రులయందు నిద్రతిన్నగాపట్టదు; శిశువుకొంత చిరచిరలాడుచుండును; ఒకానొకప్పుడు కొంచెముగావిరేచనములగుటయుఁగలదు; టీకాలుపొడిచిన తొమ్మిదిపది దినములకు పొక్కులుచుట్టును నొకటిరెండంగుళములమేర నెఱ్ఱపడివాచి మంటగానుండి, అట్లొకటిరెండుదినములున్న తరువాత వాపుమొదలయి నవిక్రమక్రమముగా తగ్గిపోవును. ఈప్రకారముగాపొక్కులుతిన్నగా లేవక జ్వరము మొదలయినవి రాక పొక్కు లడఁగి పోయినపక్షమున, అవి స్ఫోటకమును నివారించుటకుఁ ఫలకారులుకావు. టీకాలవలన వచ్చిన జ్వరము మొదలయిన వానికి మందులేమియు నియ్యనక్కఱలేదు. అవి క్రమక్రమముగా తమంతటామే తగ్గిపోవును. తిన్నగా నెదుగక మునుపుపొక్కులు చితికి రసముకాఱిపోయిన పక్షమున ప్రయోజనము కలుగనేరదుగనుక, శిశువు చేతినిగోకుకొనకుండునట్లును మంచము మొదలయిన వానిమీఁదపెట్టి రాచుకొనకుండునట్లును జాగ్రత్తపెట్టవలెను.

పొక్కు లెదిగి చెయ్యివాచి మంటగానున్నప్పుడు కొయియాకతో దాని మీఁద కొంచెము వెన్న రాచుచుండవచ్చును. అట్లు వెన్న రాచుటవలన మంట కొంతశాంతిపొంది సుఖము కలుగును.

పండ్లు మొలచుట:—ఆఱుమాసములుదాటినతరువాతసాధారణముగా పిల్లలకు పండ్లుమొలచుట యారంభమగును. మూడుమాసములకే పండ్లు మొలవనారంభించినవారును, పుట్టినప్పుడే పండ్లున్నవారును శిశువులక్కడక్కడకలరుగాని యాశిశువులసంఖ్య అత్యల్పమయినదిగా నుండును. రెండుమూడు సంవత్సరములవఱకును పండ్లురాని పిల్లలు సహితమక్కడక్కడఁగానఁబడుచున్నారు. పండ్లువచ్చుసమయమునందు లక్కదొండపండ్లు మొదలయినకఠినమైన వస్తువులనుపిల్లలకాడుకొనుట కియ్యఁగూడదు. పిల్లలకేదిచేతికిచ్చిన దానినెల్ల నోటిలో పెట్టుకొందురు కాఁబట్టి గట్టివస్తువులను నోటబెట్టుకొనుటవలన చిగుళ్ళు గట్టిపడి పండ్లువచ్చుట మిక్కిలికష్టమగును. అటువంటిసమయములందు నూలుబంతులు, రబ్బరుబొమ్మలు, మొదలయిన మెత్తనివస్తువులనాడుకొనుట కియ్యవలెను. పసిబిడ్డలకు తమబొట్టనవ్రేళ్ళను కుడుచుకొనుటయందు మిక్కిలియాసక్తియుండును. కాఁబట్టి యాసమయమునందు వ్రేళ్లు కుడుచుకోనియ్యవచ్చును. అట్లుచేయుటవలన తరువాతకూడ వ్రేళ్లు కుడుచుకొనుట యలవాటయిన పక్షమున, మొదటివరుసపండ్లన్నియు వచ్చినతరువాత ననఁగా రెండుసంవత్సరములప్రాయము వచ్చినప్పుడు కొంచెము ముసాంబరమును నీటిలో నఱగఁదీసి కొంచెము వ్రేలికి రాచుటచేత వెంటనేదురాయలవాటుతప్పిపోవును; పండ్లుమొలచునప్పుడు విరేచనము లయ్యెడుపక్షమున విరేచనములు కట్టుటకు తగిన మందు లిచ్చుట మంచిదిగాదు, కొంచెము చిట్టాముదము నిచ్చినపక్షమున జాడింపి విరేచనమై లోపలనున్న జబ్బుపోయి విరేచనములు కట్టును. దంతములువచ్చెడుకాలములో నేబాలరోగముల నేకములు వచ్చునుగాన,

ఆకాలమునందు మిక్కిలి జాగరూకతకలిగి యుండవలెను. "బాలపాప చిన్నె" యనఁబడెడు జన్నిరోగము వచ్చినప్పుడు వెంటనే మొగము మీఁద చన్నీళ్లను కొట్టుచు చన్నీళ్లతో తలను తడుపుచు, వేఁడినీళ్ళు కాఁగినతరువాత చేయి పెట్టినచో సహింపఁదగియున్నంత వేఁడినీళ్ళలో శిశువును మెడవఱకునుముంచి యెగుపులడఁగువఱకును గాని పావుగంట సేపటి వఱకునుగాని యుంచవలెను. అటుతరువాత శిశువును నీటిలో నుండి తీసి పొడిగానుండెడు బట్టలతో శరీరముచక్కఁగాతుడిచిపరుండఁ బెట్టి వెచ్చచేసెడు బొచ్చుబట్టను కప్పవలెను. ఈలోపల నుపేక్షచేసి యూరకుండక యెగుపులారంభము కాఁగానే యెవ్వరైన వైద్యుని కొఱకు పరుగెత్తి మంచివైద్యుని పిలుచుకొని రావలెను. దంతములు వచ్చెడు కాలములోనే శిశువులకు శిరోవాతము దగ్గు, మలబద్ధము, విరేచనములు మొదలయిన పెక్కురోగములువచ్చును. పిల్లలకాహార విషయమున వెనుకచెప్పినరీతిని జాగ్రత్తగానుండి, తగిన దేహపరిశ్రమమును మంచిగాలియు కలుగునట్లు చేసెడుపక్షమున, ఈరోగములు సాధారణముగా రావు. సదా బయలను గాలిలో మెలఁగుచు, ఆడుచు. పరుగెత్తుచు నుండుటవలననే పంట్లు వచ్చుకాలమునం దితర జంతువులపిల్లల కీరోగము లేవియు రాకుండును.

దేహపరిశ్రమము- దేహపరిశ్రమముచేయించుట యనఁగా శిశువులను ప్రతిదినమును కొంచెముసేపు గాలిలోత్రిప్పుట శరీరారోగ్యమునకు మిక్కిలిమంచిది. గదిలోపల బిడ్డలనెత్తుకొని యాడించుచున్నను పోరుపెట్టి యేడ్చుచున్నప్పుడు మనమాశిశువులను గాలిలోనికిని వెలుపురులోనికిని తీసికొనివచ్చిన పక్షమున వారేడుపును మానుదురు.మనవారు శిశువులను బట్టబయలను త్రిప్పినయెడల పిట్టలుపాఱు ననియు దానివలన వారికేమో కీడుమూఁడుననియు దుర్భ్రమనుపొంది బిడ్డలను గాలిలోనికి తీసికొనిరాక తమచూఢత్వముచేత పసిబిడ్డలకనేకరోగము

లను తెచ్చి పెట్టుదురు. వేసవికాలములో ప్రసవించినపక్షమున, పది యేనుదినములు దాటిన తరువాత శిశువుల నప్పుడప్పుడు సాయంకాలమున గాలిలో త్రిప్ప మొదలుపెట్టవచ్చును. శీతకాలమునందు నెలదినములు దాఁటనిదే శిశువును బయలకుఁదీసికొని రాఁగూడదు. అప్పుడు సహితము పెద్దగాలియు మంచునులేకున్నసమయమునుజూచి కొంత యెండయెక్కిన తరువాతనే బిడ్డలను పయికి తీసికొనిరావలెను. రెండు మాసములు దాఁటినతరువాత శిశువును తఱుచుగా గాలిలోబయలను త్రిప్పుచుండవలెను. మూఁడు మాసములు దాఁటినది మొదలుకొని యీదరగాలియు వర్షమును గొప్ప మంచును ఉన్నప్పుడుతప్ప సాధారణముగా ప్రతిదినమును తప్పక శిశువును కొంచెముసేపు చల్లపాటువేళ బట్టబయలను త్రిప్పుచుండవలెను. విశాలమయిన మంచముమీఁదఁగాని క్రిందను కంబళి మొదలైనవివేసి వానిమీఁదఁగాని శిశువులను తఱుచుగా పరుండఁబెట్టినపక్షమున, శిశువులు కాళ్లను చేతులను కదల్చుచు, ఆడించుచు, తన్నుచు, ఆడుకొందురు. అట్లుచేయుటయే యాశిశువులకు మంచిదేహపరిశ్రమమయి దానివలన వారికి కండపుష్టియు, దేహబలమును, ఆరోగ్యమును కలుగును. మూఢురాండ్రయిన దాదులు మొదలయినవారు శిశువులను చేతులు మొదలయినవి పట్టుకొని యూపుటయు, పయికెగరవేసి పట్టుకొనుటయు, గిఱ్ఱున త్రిప్పుటయు, విస్తారముగా కదల్చుటయు మొదలయిన పాడుపనులు చేయుచుందురు. అట్లుచేయుటవలన శిశువులకు లోపల భయముకలిగి యనేకవిధములయిన చెఱుపులను గలుగఁజేయును. పిల్లనడ్డముగా చేతులలోఁబెట్టుకొని మెల్లగా ఊపవచ్చును. ఈపనిచేయుటవలన రక్తప్రసారము చక్కఁగా కలిగి, ఆహారము తిన్నగా జీర్ణమయి, హాయిగా నిద్రపట్టును. అయినను శిశువుపాలుత్రాగినతోడనేయీపని నెప్పుడును చేయఁగూడదు.

నిద్ర—శిశువులు పరుండెడుగదు లత్యుష్ణముగాఁగాని అతి శీత

లముగాఁగాని యుండక తగుమాత్రపు వేఁడిమికలిగియుండవలెను. మిక్కి లి యుక్కగానుండు గదులలోపరుండుటచేత నేసాధారణముగా బాలింత రాండ్రకును శిశువులకునుకూడ పలువిధములయిన రోగములు వచ్చు చుండును. పడకగదియొక్క తలుపెప్పుడును లోపలికిగాలివచ్చుచుపోవు చుండునట్లోరవాకిలిగా వేసియుంచవలెను. దీపమును శిశువున కెదు రుగాపెట్టక యొకమూలను పెట్టవలెను. శిశువుదీపమువంక తేఱుచుగాఁ చూచుచుండుటవలన చూపుజబ్బుపడుటయు, ఒకానొకప్పుడు కంటికలక మొదలయినవి వచ్చుటయు సంభవించును. మొదట కొన్నిమాసముల వఱకును శిశువునకు మఱియొకరి వేఁడిమి యవశ్యకముగా కావలసియుం డును. కాఁబట్టితల్లి పసిబిడ్డ నొంటిగాపరుండఁబెట్టక తనప్రక్కను పరుం డఁబెట్టుకొనవలెను. నిద్రనిమిత్తమయి శిశువునుఊపుట యావశ్యకము కాదు. అదిలేకయే శిశువునిద్రపోవును. ఊపుచువచ్చినపక్షమునకలఁత నిద్రపట్టుటయే కాక, ఊపుట యలవాటు పడి తరువాత ఎత్తుకొని యూపునంగాని నిద్రపోవకుండును. నిద్రపోవునప్పుడు బిడ్డలముఖము మీఁద బట్టకప్పరాదు. బట్టకప్పినపక్షమున, ఊపిరి తిన్నగావిడుచుటకు వీలులేక జబ్బుచేయును. ఈగలబాధవిస్తారముగానున్నపక్షమున,సందు లలోనుండి చక్కగా శ్వాసము విడుచుటకువీలుకలుగునట్లు వలగుడ్డను మొగముమీఁదకప్పవచ్చును. పసిబిడ్డలెంతయధికముగా నిద్రపోయిన వారిశరీరారోగ్యమున కంతమంచిది. బిడ్డలను కాళ్ళమీఁదఁగాని బుజ ములమీఁదఁగాని పరుండఁబెట్టుకొని నిద్రపుచ్చినయెడల కలఁతనిద్ర యగునుకాఁబట్టియట్లుచేయకమంచముమీఁద నేపరుండఁబెట్టినిద్రపుచ్చ వలెను. శిశువునకు తిన్నగానిద్రపట్టనిపక్షమున, జాడించి విరేచనమగు చున్నదోలేదో, అయ్యెడువిరేచనము చీముగాని దుర్వాసనగాని లేక పసపువర్ణముకలదిగానున్నదోలేదో తల్లివిచారించి, అప్పుడప్పుడు శిశు వునకు కొంచెము చిట్టాముదము పెట్టుచురావలెను. పిల్లలను ఇతరు

చోట్ల పరుండఁబెట్టక మనసువచ్చినట్లు దొర్లుటకు తగినంతయవకాశ ముండునట్లు చేయవలెను. చోటులేక శిశువులను మిక్కిలి దగ్గఱగా పరుండఁబెట్టుకొనెదు పక్షమున, తల్లి శిశువుయొక్క మొగముతనవైపు నకుఁగాక అవలివైపునకుండునట్లుగా పరుండఁబెట్టుకొనవలెను. ప్రక్కకు తిరిగికాని వీపుమీఁదగాని పరుండునట్లు చేయవలసినదే కాని శిశువు నెప్పుడును బోరగిలపరుండనియ్యఁగూడదు. శిశువుయొక్క తలవద్ద దిండ్లనుగాని బట్టలనుగాని యుండనియ్యఁగూడదు. దిండ్లు మొగము మీఁద వేసికొనియు బట్టలలో తల దూర్చుకొనియు తీసికొనుట చేతఁ గాక శిశువు లొకానొకప్పు డూపిరితిరుగక చచ్చుచుండుట కలదు.

మలమూత్రములు—మొదటి మూడునాలుగు మాసములును తల్లి ప్రతిదినమును తప్పక శిశువుయొక్క మలమూత్రములను పరీక్ష చేసి చూచుచుండవలెను. మలము మిక్కిలి గట్టిగాఁగాని, మిక్కిలిపలచగాఁ గాని, యుండక గట్టిజావవలెనుండి, నారింజపండువర్ణముకలదిగానుండ వలెను. అదిచీముతోఁగలిసికాని, కుదుపలుకట్టిగాని, ఆకుపచ్చగాఁగాని ఉండఁగూడదు. ఈచెప్పిన లోపములలో నేవియున్నను, తన యపథ్య దోషమువలననే యాలోపము సంభవించిన దని తెలిసికొని పథ్యపాన ములయందు మిక్కిలి జాగ్రత్తగానుండవలెను. శిశువులకు మూత్రము తగినంతయగుచు, మిక్కిలికంపులేక, బట్టలను మరకలుకాక యుండ వలెను. మూత్రముతో బట్టలుతడిసి శిశువులు తఱుచుగా నేడ్చుచుం దురు. తడిసినప్పుడెల్లను బట్టలుతీసి పొడిబట్టలు వేయుచుండవలెను మూడుమాసములు వచ్చిన తరువాత శిశువులను దినమునకు పది పండ్రెండుపర్యాయములు లేవఁదీసి తప్పక మలమూత్రములకు కూరు చుండఁబెట్టుచు రావలెను. అట్లుచేయుటవలన తఱుచుగా బట్టలుపాడు గాక బిడ్డలు శుచిగాను శరీరసుఖము గలవారుగాను ఉందురు.

# ఆఱవ ప్రకరణము

## బా ల పో ష ణ ము

స్నానము:—సంవత్సరము దాటిన బిడ్డలకు శిశుసంరక్షణ ప్రకరణమునందు చెప్పిన ప్రకారముననే నిత్యమును స్నానము చేయించుచుండవలెను. వేసవికాలమందు చలినీళ్ళనే పోయవచ్చును; కానితక్కిన కాలములో చన్నీళ్ళలో కొంచెము వేడినీళ్ళనుకలిపి యప్పుడు పితికిన పాలంత వెచ్చగానుండు నీళ్ళను పోయవలెను. ఇష్టమున్న యెడల చన్నీళ్లు గల తొట్టిలో పిల్లవానిని మెడవఱకును ముంచి స్నానము చేయింపవచ్చునుగాని అట్లు ముంచుటకు ముందుగా బిడ్డలనడినెత్తిని చన్నీళ్ళతో చక్కఁగా తడుపుచేసిగాక యొకటిరెండు నిమిషములకంటె నెక్కువకాలము నీళ్ళలోనుంచకుండవలెను. కుంపటిసెగచేతఁగాని వేఱుకారణములచేతఁగాని శరీరము మిక్కిలి వెచ్చగానున్నప్పుడును, విస్తారపు చెమ్మటచేత మిక్కిలి చల్లగానున్నప్పుడును, బిడ్డలను చన్నీళ్ళస్నానము చేయింపరాదు. బిడ్డ మిక్కిలి సుకుమారిగానున్న పక్షమున, సేరునీళ్ళుగలగిన్నెలో చేరెడుప్పువేసికలిపి పిల్లవానిని తొట్టిలోనుండి లేవఁదీయుటకు ముందుగా ఆనీళ్ళనుధారగట్టి యెత్తునుండి పిల్లవానివీపుపొడుగునను గజ్జలలోను పోయుటవలన స్నానము బలప్రదమగును. స్నానాంతర మొదలు చక్కఁగా తుడిచినతరువాత వీపు, ఱొమ్ము, కడుపు, చేతులు, కాళ్ళు పొడిచేతులతో గట్టిగా రాయవలెను. నిత్యస్నానముచేసెడియీ యలవాటును బిడ్డలు పెద్దవారగుకొలఁదినిగూడ విడువక జరుపుచుండవలెను. స్నానము తిన్నఁగా లేకపోవుటవలన శుచిగానుండని శరీరములు స్ఫోటకములు వాంతి భేది మొదలయినయంటురోగములనుశీఘ్రముగాఁ

బొందుట కష్టములుగానుండును. స్నానము లేక దేహములుశుచిగానుండుటయెన్నడునుసంభవింపదు; దేహముశుచిగానుండనిపక్షమునచిడుము మొదలయిన చర్మరోగము లయినను రాకమానవు. శరీరముయొక్క గాలి తగిలెడుభాగములకంటె బట్టలలోనుండుటచేత గాలితగులనిభాగములను మఱింతశుచిగానుంచుటయావశ్యకము. ఈప్రకారముగా బాలురను చిన్నతనమునందియు నిత్యమును స్నానముచేయుటకలవాటుపఱిచినపక్షమున వారికదికూడ స్వభావమయిపోయి స్నానముచేయనిదినమున వారిదేహమున చీమలును, దోమలును ప్రాకినట్లుండిభోజనము చేయకపోవుట యెంతకష్టముగానుండునో స్నానముచేయకుండుటయు నంతకష్టముగానుండును. పురుషులకుగాని స్త్రీలకుగాని స్నానమునకు ప్రత్యేకముగానొకగదియుండి వారందులో వస్త్రవిసర్జనము చేసికొని సమస్తాంగములును నిర్మలముగానుండునట్లు తోముకొని స్నానము చేయునట్లేర్పఱుపవలెను. బాలురు ప్రతిదినమును శిరస్స్నానము చేయవలెను; తలవెండ్రుకలు విస్తారముగానుండుటచేత బాలికలుమాత్రము వారమునకొక్కసారిశిరస్స్నానముచేయవలెను. మంచినీళ్ళకంటెసముద్రజలము దేహారోగ్యమున కెక్కువబలమయినదిగనుక సాధ్యమయినన్నిసారులు బాలురచేత సముద్రస్నానము చేయించుచుండవలెను. సముద్రోదకమువలన దేహమునకు పుష్టియు నుత్సాహమును కలుగుటయేకాక తలవెండ్రుకలును వానికుదుళ్ళునుగూడ బలపడును. అయినను సముద్రస్నానమునకుముందు తలకెప్పుడును చమురు రాచుకొనకూడదు. సముద్రస్నానము ముఖ్యముగా వేసవికాలమునందుమాత్రమేచేయవలెను. సముద్రస్నానము చేయుట కొకదినము ముందుగా గోరువెచ్చగా కాచినయుప్పునీటిలోస్నానముచేయవలెను. భోజనముకాగానే స్నానమెప్పుడును జేయక ప్రాతఃకాలభోజనమయినతరువాత రెండుగంటలసేపు తాళి మఱి సముద్రస్నానముచేయవలెను. సముద్రస్నానమునకు పగలు

పదిపదునొకండుగంటల వేళమంచిది. నీళ్ళలోదిగఁగానేముందుగాతలను ముంచి తడుపవలెను. సముద్రపునీటిలో నరగంటసేపటికంటెనధిక కాల మెప్పుడును నుండక స్నానముచేసివచ్చినతరువాత నరగంటసేపువడిగా నడవవలెను. ఎల్లవారును వారమున కొకసారి తలయంటుకొని వేఁడి నీళ్ళు పోసికొనవలెను. వేఁడినీళ్ళు తఱుచుగా పోసికొనుట దేహమునకు మంచిదికాదు. తలంటిపోసికొన్నతరువాత వెంటనే చలిగాలిలోతిరుగుటగాని, చన్నీళ్లుపోసికొనుటగాని, చన్నీళ్ళుత్రాగుటగాని, తగదు కాని వాడుకగాఁ జేసికొనెడు పనులు మొదలయినవి చేసికొనవచ్చును. తలకు కొబ్బరినూనెను రాచుకొనుట మంచిది. కొబ్బరినూనెవలన తలవెండ్రుక లూడిపోక దృఢముగానుండి యేపుగా నెదుగును.

బట్టలు— అందఱుపిల్లలకునుముఖ్యముగా సుకుమారులుగా నుండువారికిని మెడవఱకును తప్పక చొక్కాలను తొడిగియుంచవలెను. చొక్కాలు తొడుగనిపక్షమున బలహీనులయిన పిల్లలకు దగ్గులు మొదలయినవి పట్టుకొనును. తొడుగుకొనుచొక్కా మిక్కిలి బిగువుగా నుండఁగూడదు. శీతకాలములో నెట్టచేసెడు బొచ్చుబట్టలు లోపల తొడుగవలెను. పిల్లలనడుముల కెప్పుడును బిగువుగానుండెడు నడికట్టులను (పటకాలను) కట్టరాదు. సాధ్యమయినంతవఱకు బిడ్డకాకుపచ్చని బట్టలెప్పుడును తొడుగకూడదు. ఆకుపచ్చనిరంగులో పెక్కువిషపదార్థములు కలుపఁబడును గనుక, ఆరంగువేసిన బట్టలు దేహారోగ్యమునకు భంగకరములుగా నుండును.

ఆహారము—బిడ్డలకు సులభముగా జీర్ణమయ్యెడు లఘ్వాహారమును బెట్టుచు నాలుగయిదు సంవత్సరములవయస్సువచ్చువఱకైనను తప్పక యావుపాలు ముఖ్యాహారముగా చేయవలెను. బిడ్డలకావుపాలవంటి బలమయినయాహారము మరియొకటిలేదు. కొందఱుపిల్లలకు పాలయం దిష్టముండదు. అట్టివారికి రుచికి తగినట్లు పంచదారను

గలిపి పాల నలవాటుచేసి యలవాటు పడినపిదపాత క్రమక్రమముగా పంచదారను తగ్గించుచువచ్చి కడపట పంచదారనుమాని వేయవలెను. పాలయందు కొంతవరకు మలబద్ధముచేసెడు గుణమున్నందున, బిడ్డలకు పోసెడుపాలలో కొన్ని నీళ్ళనుకూడ కలుపుట యావశ్యకము. నీళ్ళు పోయనియెడల వారికి జాడించివిరేచనముకాక కొన్నిజబ్బులుకలుగును. అన్నము తినునప్పుడు బిడ్డలు చిన్నగా నములక ముద్దను గుటుక్కున మ్రింగివేయుదురు గనుక, అట్లుచేయనీయక వారాహారమునుచక్కగా నమలి నుజ్జి మ్రింగునట్లు చేయవలెను. నీళ్ళవిస్తారముగా త్రాగవలదని నివారింపక భోజనసమయమునందు బిడ్డలకు కావలసినన్ని శుద్ధమయిన మంచినీళ్ళను త్రాగనియ్యవలెను. బిడ్డలకెప్పుడును ఒక్కవిధమయిన యాహారమునే పెట్టుచుండక యాహారమును వారికిహితకరములను మార్చుచుండుట యెక్కువయారోగ్యప్రదము. ఆకలిలేక పిల్లవాడన్నము తిననిష్టపడనప్పుడు బలవంతాన పెట్టవలెనని యత్నించి యన్నము పెట్టుట మంచిపని కాదు. బలవంతముగా నన్నము పెట్టుటవలన మేలునకుబదులుగా కీడుకలుగును. అట్లాకలితగ్గుటకు లోపల వ్యాధాంకురములుండుటయో, అదివరకు తిన్నయన్నము సరిగా జీర్ణముకాకుండుటయో, ప్రేగులలోనేదో జబ్బుండుటయో కారణముగానుండును. కానబట్టి యట్టిసమయములందాకలి యగువఱకు నన్నము పెట్టక యూరకుండెడుపక్షమున సాధారణముగా మందక్కఱలేక యాసర్వమునుచక్కపడును. సాధ్యమయినంతవఱకు పిల్లలకు లడ్డువలు మొదలయిన మధురాహారములను పెట్టకుండవలెను. మధురాహారమువలన ఆకలిమందగించి జబ్బుచేయును. అందునిమిత్తము పయినిర్దేశించిన మధురాహారముల నెప్పుడును బాలురను బాలికలను తిననియ్యఁగూడదు. అనేకబాలురు భోజనమయినతరువాత మధ్యమధ్య నేదోతినుచుందురు. దినమునకు మూడుసారులుగాని నాలుగుసారులుగాని తగినవేళలలో

భోజనమును పెట్టవలయుటేకాక బాలికలును బాలురును నడుమనడుమ చిఱుతిండి తినుదురాచారమును సంరక్షకులు తప్పక మాన్పింపఁ బ్రయత్నింపవలెను. భోజనసమయమునందయినను బిడ్డలను మితముగాతినునట్లు చేయవలయునే కాని వారిని బలవంతపెట్టి వెక్కసముగా తినునట్లు చేయఁగూడదు. మూర్ఖురాండ్రయిన తల్లులయొక్క యీయవివేక కార్యములవలననే పిల్లలనేకు లజీర్ణము మొదలయిన వ్యాధులచేత బాధపడుచుందురు.

క్రీడాగృహము—పిల్లలాడుకొనునట్టి కాని పిల్లలు పెరిగెడునట్టి కాని యిల్లు విశాలమయి యెత్తుగా నుండవలెను. అట్టియిల్లు మేడలు మొదలయిన వానిమీఁద ఎత్తుగానుండుగదియైనచో శ్రేష్ఠతరము. పిల్లలుమలమూత్రవిసర్జనము చేయఁగానే వెంటనే వానిని గదిలోనుండి కొనిపోయి పాఱవేసి గుడ్డలు మొదలయినవానిని కడిగి శుభ్రముచేసి తీసికొనిరావలెను గాని మలమూత్రములలో తడిసినగుడ్డల నాగదిలో కొంచెము సేపయిన నుంచఁగూడదు. పిల్లలకు గాలి యధికముగా కావలయును గనుక పిల్లలు పెరిగెడుగదులతలుపులను వేసి యుంచఁగూడదు. ఆగదులలో ఫ్రొయ్యిగాని కుంపటిగాని పెట్టఁగూడదు. ఒకవేళశీతకాలములో కుంపటియున్నను పిల్లవాని నెప్పుడును నిప్పువద్దకుపోయి నిప్పుతోఁగాని దీపముతోఁగాని యాడుకొననియ్యరాదు. తల్లులలక్ష్యముచేసి పిల్లలను నిప్పువద్దకు పోనిచ్చినందున కాలి మృతులయినబిడ్డ లనేకులుగలరు. చలికాలమునందు మంచముక్రిందకుంపటి పెట్టినప్పుడువీపు మంచమున కానునట్లుగా పిల్లలను వెలికిల పరుండబెట్టరాదు. వీపునకు మిక్కిలి సెగ సోఁకెనేని, అందువలన వెన్నెముక బలహీనపడుటయేకాక రక్తము మొగమునకును నెత్తికిని నధికముగాపోయి పిల్లవానికి రోంపపట్టును. మిక్కిలి వెచ్చగానుండు గదులలో పిల్లవానికి చెమ్మటపట్టియున్నప్పుడు చప్పున వెలుపలికి చల్లగాలిలోనికిఁ దీసికొని పోయినపక్షమున, శరీరమునందలి

చెమటరంధ్రములు మూసికొనిపోయి జలుబుచేసిరొంపగాని దగ్గుగాని వచ్చును. పిల్లలను వెలుపలికి తీసికొనిపోయినప్పుడు లోపలికి శుద్ధవాయువు వచ్చునట్లుగా పిల్లలను పరుండబెట్టి గదులతలుపులనుగవాక్షములను తెఱచియుంచవలెను. తేమవలన పిల్లలకు జబ్బుచేయునుగాన పిల్లలు పరుండుగదులను వారముదినములకొకసారికంటె నధికముగాకడుగుట కాని యలుకుట కాని చేయఁగూడదు. అలికినసమయమందు పిల్లలను మరియొకగదిలోనికిఁ దీసికొనిపోయియుంచి, తలుపులన్నియు తెఱచి గది తిన్నగా నాఱినతరువాత మఱి వారిని మరలఁ దీసికొనిరావలెను. అట్టి గదులలో నేలమీఁద నీళ్ళను సహితము విస్తారము చల్లుచుండ రాదు. పిల్లల దేహారోగ్యమునకయి గది శుచిగానుండుట యావశ్యకముగాన ప్రతిప్రాతఃకాలమునందును కొంచెముసేపు పిల్లలనావలకుఁ దీసికొనిపోయి గది శుభ్రముగాతుడిచి దుమ్మడఁగినపిమ్మట మరలఁదీసికొనిరావలెను. గదులు తేమగా నున్నయెడల నందుండుబిడ్డలకుబహువిధములయిన వ్యాధులు సంభవించును. ఆకుపచ్చరంగులో విషముండునుగనుక, ఆకుపచ్చరంగు వేసిన లక్కకాయలు మొదలయినవిపిల్లలకాడుకో నియ్యఁగూడదు. సాధ్యమయినంతవఱ కేరంగును వేయని యాటవస్తువుల నిచ్చుచుండుటయే మంచిది. చేత నయినంతవఱకు బిడ్డలకుల్లాసము కలుగఁజేయుటయావశ్యకముగాన, వారు పెరిగెడుగదులలో మంచివెలుతురును, చిత్రవర్ణములు గల పటములును, కావలసినన్ని యాటవస్తువులును, ఉండునట్లు చేయవలెను. పిల్లలనెత్తుకొని యాడించెడువారిని మంచివారినిగాఁజూచి మఱియేర్పఱుపవలెను. వారు శుచిగా నుండువారుగాను, చిరాకు లేనివారుగాను, అబద్ధములాడనివారుగాను, నవ్వుమొగము గలవారుగాను, నత్తి మెల్లకన్ను మొదలయిన వికారములు లేనివారుగాను, ఉండవలెను. ఈకడపటివిషయమునందు శ్రద్ధవహింపని యెడల పిల్లలకు నత్తి మొదలయినవి పట్టుపడును.

పిల్లలనాడించువారు మొగమునకు ముసుఁగు వేసికొనికాని తలవెంట్రుకలు మొగమునకు కట్టుకొనియో బూడిదమొదలయినవి పూసికొనియో వికారరూపములను ధరించికాని వినోదమునిమిత్తము పిల్లల కేవిధ మయిన భయమును కలిగింప కుండునట్లు గట్టిదిట్టము చేయవలెను. దయ్యాలకథలు మొదలయినవి పిల్లలకెప్పుడును చెప్పకుండునట్లు చేయ వలెను. అట్టికథలవలన బిడ్డలమనస్సులలో శోకవిధమయినభీతి యుద యించి వారు పిఱికివారయి తరువాత యావజ్జీవమునుగూడభూతభయ ము మొదలయినవి కలవా రగుదురు. ఇట్టికథలను చెప్పకపోయినపక్ష మున పిల్లలకు రాత్రులు చీఁకటిలోసహితము భయముండదు. పిల్లల నెప్పుడును చీఁకటిగదులలో పరుండఁబెట్టరాదు. దయ్యపు కథలను మాత్రమేకాక పిల్లలకు భయముపుట్టించెడి యెలుకలు పందికొక్కులు పిల్లులు మొదలయినవాని కథలనుబూచివచ్చుననియుదొంగవాఁడువచ్చి యెత్తుకొనిపోవుననియు చెప్పెడుకథలనుగూడ బొత్తిగా చెప్పకుండ వలెను. ఈవంటి పాడుకథలవలనఁ గలిగినభీతివలన బిడ్డలకు వ్యాధులు మొదలయినవి వచ్చుటయేకాక మనస్స్వస్థతకూడ చెడిపోవును: అట్టి బిడ్డలు నిద్రలో నులికిపడి యేడ్చుచులేచి, పగలు కావలియున్నవారు చెప్పిన దయ్యములును దొంగలునువచ్చి తమ్ముఁ దీసికొనిపోవుచున్నా రని పలవరింతురు; ఇటువంటిభయము దినదినక్రమమున నధిక మయి చీఁకటిపడఁగానే లోపల నేదో బెంగకలిగించుచురోగములను దెచ్చును. ఈప్రకారముగా పిల్లల నెత్తుకొని యాడించువారియొక్కయు పెంచెడి వారియొక్కయు వివేకహీనతవలనఁ గలిగిన యిటువంటి భయమును పోఁగొట్టుటకయి తెల్లవాఱినదాఁక పిల్లవాఁడు పరుండుగదిలో దీపము వెలుఁగుచుండునట్లు చేయవలెను; పిల్లవానికి నిద్రపట్టు వఱకును తల్లి గాని మఱియొకరుగాని దగ్గఱనుండవలెను; భయపడి నిద్రలేచినప్పుడు తప్పక యెవ్వరైనను దగ్గఱనుండి భయపడి నందుకయి కోపపడక

మంచిమాటలతో బుజ్జగించి యోదార్చి భయముతీర్చి నిద్రపుచ్చుచుండవలెను; ఈభయము పూర్ణముగాపోవువఱకును పగలు మఱింతసేపు బయలున గాలిలో తిరుగునట్లుచేయుచు, సాధ్యమయిన పక్షమున రాత్రులు స్థలమునుఁగూడ మార్చవలెను. ఎత్తుకొని తిరిగెడువారుగాని పాలిచ్చి పెంచువారుగాని పిల్లల నెప్పుడును కొట్టకుండునట్లు జాగ్రత్తపెట్టవలెను. పరుండఁబోవుటకుముందు చేతులువెచ్చచేసిగంటసేపు పిల్లవానిని స్వేచ్ఛగా విడిచిపెట్టి మనసువచ్చినట్లుఅచిగంతులువేసి యాడుకొనియ్యవలెను. పిల్లవాని యారోగ్యమునకును యుక్తప్రవర్తనమునకును వానిసంతోషమావశ్యకముగనుక, తల్లిదండ్రులు మాటిమాటికి బిడ్డలమీఁద విసుఁగుకొనక వారిని కసరక వారిమాటలయందు తామును జేరి తోడుపడుచు వారిని సదా ప్రేమతోఁ జూచుచును ఉత్సాహము కలిగించుచుండవలెను.

కొందఱికి పిల్లల నేడ్పించుట ముద్దుగానుండి, వారిని నిష్కారణముగా గిల్లియు బాధించియు నేడ్పించి తాముసంతోషించుచుందురు. ఇట్టివారిని మొగమోటమువిడిచి యెప్పుడును పిల్లలవద్ద చేరకుండునట్లు చేయవలెను. పిల్లలచేతులలోనున్న వస్తువులను లాగుకొనియు వారి నేడిపించియు బాధించుచువచ్చినయెడల, పిల్లలు దుస్స్వభావముకలవారగుదురు. పిల్లలు చిరాకుగానున్న యెడల, ఆసమయమునందు వారి జోలికిపోక దానినిగుఱించి యేమియు శ్రద్ధవహింపక నవ్వుచు నెమ్మదిగా మాటలాడుచువారియందుదయయున్నట్లుకనఁబఱుచుచురావలెను. అట్టి మంచితనముచేత నేవారు తరుచుగామంచినడతగలవారగుదురు. అయినను బిడ్డలవిధేయతగలవారయిమనయాజ్ఞలనునిరాకరించినప్పుడుమాత్రముపేక్షచేయకవారినికఠినంగాశిక్షించియైనను లోబడునట్లుతప్పకచేయవలెను. శాంతముగామాటాడుట స్త్రీకమూల్యాలంకారముకాఁబట్టితల్లి యెల్లప్పుడునుకఠినమయినమాటలనునోటరానియ్యక పిల్లలవిషయమున

చల్లనిమాటలనే యుపయోగించుచు రావలెను. ఇట్లను కఠినమయిన మాటలను తఱుచుగా నుపయోగించుచు వచ్చినపక్షమున, బిడ్డలకుతల్లి మాటలయందు లక్ష్యము తగ్గిపోయి వారు కఠినచిత్తులయి మఱింత దుర్మార్గప్రవర్తనులగుదురు. నీవతిదుష్టుఁడవయితివనియు, నీవిఁకబాగు పడవనియు, తల్లిదండ్రులు పిల్లవాండ్రతో ననుచుండుటయు మంచిది కాదు. వారి నెల్లప్పుడును కసరి భయపెట్టుచుండుటయు కానిపనియే. వారియెడల చనవుచూపక యెప్పుడును వారిని బెదరించుచుండుటవలన వారు పిఱికివారును దుష్టులునయి, తాముమంచిగాప్రవర్తించుటవలన గూడ లాభముండదను నభిప్రాయమును బొందినవారయి, క్రమక్రమ ముగా చెడిపోదురు. కాఁబట్టి వారుదుష్టులయి కానిపనిచేసినను పయిని జెప్పినరీతి మాటలనక, వారు మంచిపనులు చేసినప్పుడెల్లను మెచ్చు కొని హెచ్చరిక పఱుచుచు, వారాప్రకారముగా నెప్పుడును జేయుచు వచ్చినయెడల భగవదనుగ్రహమువలన బాగుపడుదురనియుత్సాహము పుట్టించుచు రావలెను. బిడ్డలతో నసత్యము పలుకుటగాని, మాయ మాటలుచెప్పి మోసముచేసి వారిచేతపనిచేయించుటగాని,యెప్పుడును తగదు. ఒక్కమాఱుమోసముచేసి మనము పిల్లలచేత నేదయిన పనిని చేయింపఁగలిగినను, తరువాత వారు మనమాటలను నమ్మక మనము నిజము చెప్పినప్పుడుకూడ మోసముచేయుచున్నామనితలంచుచుందురు. అంతేకాక యసత్యములాడుటవలన మనయసత్యములే పిల్లలకుఁగూడ పట్టుపడి వారసత్యవాదులయి వృథాగాచెడిపోదురు. కాఁబట్టి యాటల యందయిన నసత్యమాడక బిడ్డ లన్నముతినక మంకుతనముచేసినప్పుడు గాని మఱియెప్పుడుగాని బూచివచ్చుననియుపంతులువచ్చుననియు లేని పోని తెచ్చియిచ్చెద ననియు కల్లలు పలికి మోసపుచ్చకుండవలెను. తల్లిదండ్రులు,తమబిడ్డలలో నెవ్వరివిషయముననను పాక్షికబుద్ధినిజూపక యందఱియందును సమభావమును గనఁబఱుచుచుండవలెను. తల్లిగాని

తండ్రిగాని తమబిడ్డలలోనొక్కరియెడల నెక్కువ యనుగ్రహమును జూపుచు వచ్చినపక్షమున తక్కినవారాబిడ్డయం దసూయయు క్రోధమును గలవారగుదురు. కాఁబట్టి జననీజనకు లేబిడ్డవిషయమునను పక్షపాతమును జూపక యందఱిని సమానముగా నాదరించుచు, వారందఱు నన్యోన్యప్రేమమును దయయుఁ గలవారగునట్లు చేయుచు, ఆటవస్తువులలోను తినువస్తువులలోను ఒకరి వొకరికిచ్చుచు నైకమత్యముగలిగి ప్రవర్తించునట్లును స్వప్రయోజనపరత్వము విడుచునట్లును వారిని ప్రోత్సాహపఱచుచు రావలెను. బిడ్డ లేదయిన తెలిసికోవలెనని యపేక్షపడి ప్రశ్నలు వేసినప్పుడు వారిమీఁద కోపపడి యుత్సాహభంగముకలుగఁ జేయక యోపికతో నుత్తరములు చెప్పి హెచ్చరిక చేయుచు రావలెను. పాఠశాలలో పుస్తకములవలన నేర్చుకొనెడుదానికంటె బాలురకీప్రకారముగా వచ్చెడుజ్ఞానమే దృఢమయినదిగానుండును. కాఁబట్టి పిల్లలడిగిన ప్రశ్నలని యనాదరముచేయక దయతో సదుత్తరములను జెప్పి తెలియనిదానిని తెలుపుచు వారికి జ్ఞానాభివృద్ధి చేయుచు రావలెను. వారడిగినప్రశ్నల ననాదరముచేసినను, వారిన్యాయమయినప్రార్థనల వంగీకరింపకపోయినను, వారిమనస్సులలో మనమీఁద విశ్వాసము తగ్గుటయేకాక వారు బుద్ధిమాంద్యము కలవారుగా కూడ నగుదురు.

మాటలయందు నత్తిగలిగెడు పిల్లవాండ్రు సాధారణముగా భయముగానితొందరపాటుగానికలవారుగానుందురు. అభిప్రాయములు మాటలకంటె వేగముగా వారికిమనస్సులోపరుగెత్తుచుండును; అట్టివారు తామొంటిగానున్నప్పుడునుచనవుగలవారిదగ్గఱనుండునప్పుడునుసామాన్యముగా నత్తిలేకుండఁగనే మాటలాడఁ గలుగుదురు; అలసి యున్నప్పుడును దేహారోగ్యము తప్పియున్నప్పుడును వారు మఱింత నత్తి గలవారగుచుందురు; వారతిసంతోషమువచ్చినప్పుడుగాని కోపము వచ్చినప్పుడుగానిబొత్తిగా మాటలాడలేక యేడ్చుచుందురు. నత్తిపోఁగొట్టుటకుఁబిల్ల

వానినాలోచించుకొని మెల్లఁగా మాటాడునట్లు చేయవలెను; వాని
నొంటిగాకూరుచుండబెట్టి తడవుకొనకుండమాటాడునట్లలవాటుపఱుచు
చుండవలెను; తొందరగా తడఁబడుచు మాటాడ మొదలు పెట్టిన
యెడల నడుమను నిలిపి స్పష్టముగా నుచ్చరింపఁ గలుగువఱకును ప్రతి
వాక్యమును వానిచేత నమ్మదిగా మరలమరల పలికించుచురావలెను;
ముందుగా చక్కఁగా నాలోచించుకొని మాటలనొకటితరువాతనొకటి
స్పష్టముగా నిలిపినిలిపి యుచ్చరించునట్లు చేయవలెను;సంగీతమునునేర్పి
వానిచేత పాడించుచురావలెను.అంతేగానినత్తిమాటలాడినందుకయి
బిడ్డలనెప్పుడును వెక్కిరించి పరిహసింపఁగూడదు.పరిహాసముచేసినచో
నత్తిపదిరెట్లెక్కువగును. కాఁబట్టి బాలుని బుజ్జగించి మంచిమాటలతో
నుత్సాహపఱిచి పైనిజెప్పిన ప్రకారముగాఁ జేయుచువచ్చినచో సాధా
రణముగా శీఘ్రకాలములోనే నత్తిపోవును. ఈనత్తి కొండనాలుక
యొక్క లోపమువలన సంభవించిన పక్షమున వైద్యునిచేత చికిత్స
చేయింపవలెను.

శరీరపరిశ్రమము—పసిబిడ్డలకు వెనుక చెప్పినట్లు దేహపరిశ్రమ
మత్యావశ్యకమే యయినను, నడుచుటకుశక్తి రాకమునుపువారినిబల
వంతముగా చేతులుపట్టుకొని నడిపించుట మొదలయినపనులనుచేయఁ
గూడదు. మనసాహాయ్యమక్కఱలేకయే బిడ్డలు యుక్తకాలము వచ్చి
నప్పుడు తమంతనే మంచములు గోడలు మొదలయినవిపట్టుకొని లేచుట
కును నడుచుటకును ప్రయత్నింతురు. అప్పుడు మాత్రము బిడ్డయొక్క
యిష్టమును కనిపెట్టి మనచేయి యూఁతయిచ్చి సాహాయ్యముచేయ
వచ్చును. బిడ్డలను గాలిలోత్రిప్పుట యారోగ్యప్రదమని వెనుకనే చెప్పి
యున్నాము. వర్షము మొదలయిన హేతువులచేత తేమగానున్నప్పుడు
బాలురను బయలను నడిపించుట క్షేమకరము గాదుగనుక,అట్టిసమయ
ములయందు బాలురనుబాలికలనువిశాలములయినగదులలోనుచావళ్ల

లోను పరుగెత్తునట్లుచేయవలెను. అంతేకానిపుస్తకములనుగానిబొమ్మలనుగాని పిల్లలముందఱ పడవేసి విస్తారపుసేపు వారు వానితో కదలక కూరుచుండునట్లు చేయగూడదు. పిల్లలెంతయాడుకొన్న దేహమునకంత యారోగ్యకరముగానుండును. పరుగెత్తుటవలనను గంతులువేయుటవలనను రక్తము చక్కఁగా ప్రవహించి దేహమున కండపట్టును. ఈ దేశములో బాలురును బాలికలును సాధారణముగా కండపుష్టిలేకబలహీనముగా నుండుటకుఁ గల ముఖ్యకారణము వారికి తగినంత దేహపరిశ్రమమును బయలున మంచిగాలిలో వఱసినంతసేపు తిరుగుటయు లేకపోవుటయేకాని వేఱుకాదు. ఇవిరెండును మొట్టమొదట తిన్నగా లేకపోయెడు పక్షమునక్రమక్రమముగావారి దేహారోగ్యము చెడి వారుమాంద్యమును సోమరితనమును గలవారయి కూర్చున్నస్థలమునుండి లేచుటయే కష్టముగా తోఁచి యాయాసపడుదురు. శ్వాసకార్యమునకును, జీర్ణకార్యమునకును, శుద్ధవాయువును దేహపరిశ్రమమును తప్పక కావలసి యుండును. కాఁబట్టి శ్వాసకార్యమువలన రక్తము శుద్ధపడి తిన్నయన్నము చక్కఁగా జీర్ణమయి యారోగ్యముకలిగి యుండునట్లు చేయుటకయి పిల్లల నలసట వచ్చువఱకును నడచునట్లు చేయవలెను. పిల్లలకు నడచుటవలన కొంచె మాయాస మారంభము కాఁగానే యామీఁదట నడవనియ్యక నిలుపవలెను. ఒక్కసారిగా కాకపోయినను మొత్తముమీఁద నొక్కదినములో పిల్లలను రెండు మూడుక్రోసులదూరము నడుచునట్లు చేయుట మిక్కిలి యారోగ్య ప్రదముగా నుండును. పిల్లలు గుఱ్ఱముమీఁదనెక్కి తిరుగుటకూడ మంచి దేహపరిశ్రమమేకాని, గుఱ్ఱము నెక్కి స్వారిచేయుచున్నారన్న హేతువుచేత నడిపించుటమాత్రము మాన్పరాదు. పట్టణములలో మంచిగాలివచ్చుటకు దూరముగా నడిచి పోవుట కవకాశముండనిబాలురుగుఱ్ఱములనెక్కియూరుబయలను శుద్ధవాయువులో తిరిగి సుఖ మనుభవింపవచ్చును. వేసవికాలములో తెల్ల

వారుజామునబయులుదేఱి నడిచి సూర్యోదయసమయమునకు మరలి వచ్చి యిల్లుచేరుట మంచిది. అప్పటిగాలి యెంతోసుఖప్రదమయినది. పరగడుపున తిరుగలేనిబాలురు నడచుటకు బయలుదేఱకముందు కొంచెము పాలుత్రాగవచ్చును. అన్నము తిన్నతరువాత గడియసేపెక్కడను తిరుగకుండవలెను. భోజనము చేయఁగానే నడుచుచుండెడు పక్షమున జీర్ణశక్తికి భంగము కలుగును.

ఆటలు—ఇంట గదులలో కూరుచుండి యాడెడు గుడిగుడి కుంచము మొదలయిన కుంటియాటల నాడనియ్యక సాధ్యమయినంత వఱకు బాలురను బాలికలను బయలఁదిరిగి నవ్వుచు, కేకలువేయుచు, నడుచుచు, పరుగెత్తుచు, దుముకుచు, ఉండెడు బలప్రదమయినయాటలాడునట్లు ప్రోత్సాహపఱుపవలయును. బాలురాడెడియాటలెప్పుడును సాధ్యమయినన్నియవయవములు కదలి కండపుష్టియు దేహబలమును కలిగించుట కనుకూలమయినవిగా నుండవలెను. అనుకూలమయిన యెడల ప్రత్యేకముగా పిల్లల యాటనిమిత్తమయి యొకదొడ్డినివిడిచి దానిలో వారు త్రవ్వి పువ్వుల మొక్కలను వేసికొనుటకును వానికి నీళ్లుపోయుటకునుగూడ ప్రోత్సాహము చేయవలెను. రాళ్ళువిసరుట, మొదలయిన వానివలన వస్తువులకు హానికలిగెడియాటలను వేనిని పిల్లలనాడుకోనియ్యరాదు. ఇంటనుండు పాత్రములు, కాగితములు, కలములు, సిరాబుడ్లు మొదలయిన వానితోను, అపాయకరములయిన రాళ్ళు, కత్తులు, గంటములు, సూదులు మొదలయిన వానితోను, పిల్లల నాడుకోనియ్యరాదు; గారాబముచేత నట్టివస్తువులతో నాడుకో నిచ్చినయెడల, ఉపయుక్తములయిన వస్తువులను పాడుచేయుటయే కాక తాము గాయములు చేసికొని యొకానొకప్పు డితరులకుగూడ నపాయము కలిగింతురు. కాఁబట్టి యట్టి వస్తువులనిమిత్తమయి పట్టు పట్టి బిడ్డలెంతయేడ్చినను వారి నోదార్చుటకయి తల్లు లెప్పుడును

వారాడుకొనుట కట్టువంటి వస్తువుల నియ్యకుండవలెను. పిల్లలపుష్టి కాహారమెంత యావశ్యకమో యాటలుకూడ నంతయావశ్యకమే యయినందున, ఆడుకొనకుండ పిల్లల నెప్పుడును గృహమున కూరుచుండఁబెట్టరాదు. బంతులాట, కోతికొమ్మచ్చి దాగుడుమూఁతలు, చెడుగుడి, ఉప్పుపట్టె, మొదలయిన యాటలన్నియు బిడ్డల యారోగ్యమున కత్యనుకూలము లయినవి. కొంచెమీఁదువచ్చినబిడ్డలు సాము మొదలయిన వ్యాయామములను గూడ క్రమక్రమముగా నభ్యసింపవలెను; ఇందులో కొన్నియాటలు బాలికల కుపయోగపడకున్నను, వారుయ్యేలలూఁగుట, త్రొక్కుడుబిళ్ళ, వెన్నెల కుప్పలు, నాలుగు స్తంభాలాట, మొదలయిన మఱికొన్ని యాటలాడవచ్చును. పూర్వకాలమునందు క్షత్రియులు మొదలయినవారు తమబాలికలకు నృత్తగీతాదులనుకూడ నేర్పుచుండెడివారు. అవికూడ నాకాలమునందు వారి దేహారోగ్యమున కెంతో సహకారులుగానుండుచువచ్చెను. ఆటల నిమిత్తమును వ్యాయామమునిమిత్తమును ప్రతిగ్రామమునందును గరిడిసాలయొకటి యుండుట మిక్కిలి యుపయుక్తము. కూరుచుండి యాడెడుచీట్లు మొదలయిన మునలియాటల నాడుటకు దేహారోగ్యము తప్పియున్నప్పుడుతప్ప మఱియెప్పుడును బాలురనుగాని బాలికలనుగాని ప్రోత్సాహపఱుపకుండవలెను.

విద్యాభ్యాసము—బాలికలకుఁగాని బాలురకుఁగాని యేడు సంవత్సరములప్రాయమువచ్చువఱకును విద్యావిషయమునకంటె దేహవిషయముననే యధికశ్రద్ధ చేయుచుండవలెను. పసితనములో వారు దినమునకు మూడునాలుగుగంటలసేపు చదువుట చాలును. ఆకాలములో వారికి బోధించెడి దేదియు వారిమనస్సులకు భారముగాతోఁచునట్లు చేయక సర్వమును వినోదకరముగా నుండునట్లు చేయవలెను. ఉదయ సాయంకాలములయందు వారాడుకొనుటకయి ప్రతిపాఠశాలకును జేరి యొకయాటస్థలముండవలెను. చిన్నతనములో పుస్తకముల

మూలమున వారికి విస్తారముగా బోధింపక కథలమూలముననుచిత్రపటములమూలముననుబోధించుచుండుటయేకాక వారుతమచుట్టునుగల వస్తువులనుశోధించి వానివిషయమయి తెలిసికొనుచుండునట్లుప్రోత్సాహపఱుపవలెను. ప్రతిపాఠశాలలోను మంచిపిల్లలవలెనేకొందఱు పనికిమాలినపిల్లలుకూడ నుందురుగనుకను, పిల్లలు సాధారణముగా మంచివారికంటె చెడుపిల్లలతో నధికముగాఁజేరి వారియల్లరిచేష్టల నేర్చుకొందురు గనుకను, తగినవారున్నపక్షమున పసితనములో బిడ్డలనింటియొద్దనేయుంచి విద్యాబుద్ధులు నేర్పుట మంచిది. పెద్దలు చెప్పుదానిని చేయుదానిని విని కనిపెట్టి పిల్లలావిషయములనె మనస్సునందుంచుకొని యాలోచనలేక వారివలె నడువనేర్చుకొందురు. కాఁబట్టి పెద్దవారెప్పుడును బిడ్డలసమక్షమందొట్లు తిట్లు మొదలయినవి నోట రానీయక యోగ్యముగా ప్రవర్తింపవలెను. పిల్లలు వినునట్లుగా రహస్యము మాటాడుకొనఁగూడదు. మాటాడినచో వారారహస్యమును దాఁచనెఱుఁగక యితరులతోఁ జెప్పి వేయుదురు. వారిముందు రహస్యము మాటాడి యది యెవ్వరికడను బలుకవలదని వారికి బుద్ధిచెప్పుటవలనఁగాని యది వెల్లడియయి నష్టము కలిగినప్పుడు వారినికొట్టితిట్టుటవలనగాని ప్రయోజనముండదు. ఎప్పుడో గొప్పతప్పిదము చేసినప్పుడుతప్పఁజిన్నతనములోనింటివద్దఁగానిబడిలోఁగానిపిల్లలనుగొట్టుటమంచిదికాదు అబద్ధములాడినప్పుడును నీతిమాలినయితరములైనపనులుచేసినప్పుడును చెప్పినమాటవినక యవిధేయులయి వర్తించినప్పుడును తగుమాత్రము బెత్తముతో నఱచేతిలోఁ గొట్టవలెను. అంతేకాని పిల్లవానినెత్తిమీఁద నెప్పుడును గొట్టరాదు. ఆప్రకారముగానే దౌడలమీఁదసహితముకొట్టఁగూడదు. సంగీతము, పిల్లలసుఖసంతోషములకుఁగారణమయినందునను దానివలన వారికంఠస్వరము మధురమగును గనుకను, చిన్నతనములో బాలురకును బాలికలకునుగూడ పాటలు మొదలైనవి నేర్పవలెను.

నిద్ర—మూడేండ్లు దాఁటువఱకును మధ్యాహ్నభోజనమునకు పూర్వము రెండుగంటలసేపు పిల్లలను నిద్రపుచ్చుట మంచిది. అట్లు చేసినచో వారు మధ్యాహ్నముపయిని చిరాకులేక యుల్లాసముతో నాడుకొనుచుందురు. అట్టియీడుగల పిల్లలను రాత్రి యింట నందఱి భోజనములు నయినదాఁక నుంచక పెందలకడనే భోజనము పెట్టి సాయంకాలముసాధ్యమైనంతశీఘ్రముగా ననఁగా నేడెనిమిదిగంటలకులోపలనె నిద్రపుచ్చవలెను. వారి నధమపక్ష మెనిమిదిగంటల సేపయినను నిద్రపోనియ్యవలెను. ఒంటిగాఁ బరుండఁబెట్టినప్పుడు బిడ్డను పఱుపుమీఁద నడుముగా నొకప్రక్కకొత్తిగిలించి పరుండఁబెట్టవలెను. శీతకాలములో నొక్క మొగముమీఁదతప్ప తక్కినభాగమంతటను బట్టకప్పవలెను. వేసవికాలములో చేతులమీఁదనుకాళ్ళమీఁదనుగూడబట్టకప్పనక్కఱలేదు. పడకగది యెప్పుడును విశాలమయినదిగా నుండవలెను. వెలుతురున్నగదిలోకంటె చీఁకటిగదిలో నిద్ర చక్కఁగా పట్టునుగనుక, గాలి బాగుగ ప్రసరించెడిగదిలో దీపమును సన్నపఱిచి యొకమూలను మఱుఁగుగా నుంచవలెను. గాలికెదురుగా మంచమును తలుపులవద్దను గవాక్షములవద్దను వేయఁగూడదు. పిల్లల నొకనాఁడెడమప్రక్కను మఱునాఁడు కుడిప్రక్కను మార్చి పరుండఁబెట్టుచు రావలెను. అప్పుడప్పుడు వెల్లవెలికిలఁగూడపరుండబెట్టుచుండవలెను. ఎన్నఁడో యత్యావశ్యకమైనప్పుడు తప్ప శీతకాలములో సహితము పడకగదిలోకుంపట్లు పెట్టఁగూడదు. పెట్టనిమిత్తమయి కంబళ్ళనుగానియితరములైనబొచ్చుబట్టలనుగాని ప్రక్కనువేసి పైనికప్పవలెను. పిల్లలు ప్రాతఃకాలమున సాధ్యమైనంత శీఘ్రముగాలేచునట్లుచేయవలెను. సూర్యోదయమునకు ముందే నిద్రలేచుటచేత సుఖారోగ్యములు కలుగుటయేకాక పెద్దపెరిగిన తరువాతఁగూడ చిన్నప్పటియీసదాచార మలవాటుపడి శ్రేయస్కరమగును. బట్టల తొడుగుటకుఁగాని మందు వేయుటకుఁగాన మఱిదేనిని

నిమిత్తముగాని నిద్రలోనున్న పిల్లల నెప్పుడును లేపఁగూడదు. ఆయా పనులు నిద్రనుండి వారికి మెలఁకువరాఁగానే చేయవచ్చును. పాలు విడిచినతరువాత తల్లి తనబిడ్డను వేఱుమంచముమీఁదపరుండఁ బెట్టవలెను. నిద్రకుఁ బోవుసమయమప్పుడుపిల్లలనేడిపింపఁగూడదు. సంతోషముతో పడకకుఁబోక యేడ్చుచు నిద్రపోయినయెడల శరీరారోగ్యము చెడును. పిల్లలకు రాత్రులు నిద్రపట్టకపోవుటకజీర్ణమో కడుపులో నులిపురుగులుండుటో కారణమగును గావున తన్నివారణమునకయి మందిప్పించవలెను.

పండ్లూడి మొలచుట—సాధారణముగా నేడుసంవత్సరముల ప్రాయమప్పుడు ప్రాఁతపండ్లూడిపోయి మరల క్రొత్తపండ్లు వచ్చును. ఇవి మొలచునప్పుడు మొదటిసారిపండ్లువచ్చునప్పటివలె జబ్బులేవియు రావు. ఆవఱకున్నపండ్లొకటివెనుక నొకటిగా కదలి యూడిపోఁగా వరుసగా వానిస్థానమున క్రొత్తపండ్లు చిగుళ్ళలోనుండి పైకివచ్చి పెరుగును. ఈపండ్లను సదా శుచిగానుంచి కాపాడుచు రావలెను. దంతములను శుచిగానుంచకపోవుటవలన దుర్గంధముకలుగుటయేకాక పుప్పిపండ్లయి దంతశూలవచ్చును. పండ్లు శుచిగానుండుటకయి ప్రతిదినమును ప్రాతఃకాలమునందు తప్పక యుప్పువేసి నూఱినబొగ్గుపొడుముతో చక్కఁగాతోమి దంతశుద్ధి చేసికొని పుక్కిలించి యుమిసి గోరువెచ్చని నీళ్ళతో కడుగుకొనవలెను.

రోగాదికము—గృహిణికి శిశువులకు వచ్చురోగములలక్షణములనుగూర్చియు మందులనుగూర్చియు కొంత తెలుసుకొనియుండుట మంచిది. రోగములు వచ్చినప్పుడు వైద్యుని పిలిపించి మందులు వేయింపవలసినను, కొన్నికొన్నిరోగము లాకస్మికముగా వచ్చినప్పుడును గాయములుతగిలినప్పుడును వైద్యుఁడు వచ్చులోపల తల్లియింట బిడ్డలకుఁ జేయవలసిన చికిత్సలును గొన్నియుండును. వైద్యుఁడువచ్చి

యౌషధమియ్య నారంభించిన తరువాతఁగూడ రోగియొక్క పథ్య పానాదులవిషయమున తల్లిసడపవలసినక్రియలును పెక్కులుండును.

పిల్లవాఁ డౌషధము పుచ్చుకో నొల్లనిపక్షమున, ఆమందువలన దేహము స్వస్థపడునని బోధించి మందుపుచ్చుకొనునట్లు చేయవలెను. అంతేకాని యౌషధము తియ్యగానుండునను మొదలైనయబద్ధములను జెప్పి పిల్లవానిచే మందుతినిపింప నెప్పుడును బ్రయత్నింపఁ గూడదు. పిల్లవాఁ డొక్కసారి తన్ను తల్లి మోసము చేసినదని తెలిసికొన్నపక్షమున, సత్యముచెప్పినప్పుడు సహిత మామెమాటలనునమ్మక సందేహపడుచుండును. బిడ్డ చెప్పియొప్పించుటకు తగినంత యీడు లేనివాఁడయి మందుపుచ్చుకోకున్నపక్షమున, బిడ్డను కాళ్ళమీఁద వెలికిలఁ బరుండఁ బెట్టుకొని చేతులు గట్టిగాపట్టుకొని ముక్కుబిగఁబట్టి నోటిలో మందు పోయఁగానే గుటుక్కున తత్క్షణమే మ్రింగి వేయును. ఇట్లుచేయుట క్రూర కృత్యముగాకనఁబడినను, బిడ్డయొక్కయారోగ్యమును గోరినపక్షమున నిట్లుచేయక విధిలేదు. వైద్యుఁడు చెప్పినకాలపరిమితిననుసరించితప్పక మందిచ్చుచుండవలసినను, మందిచ్చుట నిమిత్తమయి నిద్రపోవుచున్న బిడ్డ నెప్పుడును లేపఁగూడదు. మందుకంటె నిద్రయే దేహారోగ్యమున కధికలాభకరము. కాఁబట్టి బిడ్డమేలుకొని యున్నప్పుడు నియమితకాలములలో మందిచ్చుచు, నిద్రపోవుచున్నప్పుడు మాత్రము నడుమనిద్రా భంగముచేయక వేచియుండి లేవఁగానే మందియ్యవలెను.

వ్యాధిగ్రస్తులయిన బిడ్డలను పరుండఁబెట్టు గదులు విశాలములయి సదా గాలివచ్చునవిగానుండవలెను. గవాక్షముల నప్పుడప్పుడు తెఱచి లోపల గాలిధారాళముగా ప్రసరించునట్లు చేయవలెను. కక్కు కొన్నను మలమూత్రములనువిసర్జించినను వానినిగదిలోనుంచక వెంటనే దూరముగాఁ గొనిపోవలెను. జ్వరము మొదలయినవివచ్చినప్పుడుపక్కదుప్పట్లు దినమువిడిచిదినము మార్చి క్రొత్తవి వేయుచుండవలెను. కట్టు

కొన్నబట్టలను ప్రతిదినమును మార్చి క్రొత్తవి తొడుగుచుండవలెను. విషజ్వరాదులు వచ్చినపుడు మొదట కొన్నిదినములవఱకును రాత్రులు కూడ గదిగవాక్షములనన్నిటిని బాగుగా తెఱచియుంచవలెను. పొంగు (వేపపువ్వు) మొదలయిన వానిచేత జ్వరమువచ్చినప్పుడుగవాక్షములు తెఱవక తలుపుమాత్ర మప్పుడప్పు డోరవాకిలిగానుంచుచురావలెను. శ్వాసకోశములు జబ్బుపడి దగ్గువలనబాధపడుచున్నప్పుడు గవాక్షముల నెంతమాత్రమును తెఱవక మూసియుంచి, క్రొత్తవాయువువచ్చి గది లోని గాలిని శుద్ధపఱుచుచుండుటకయి తలుపుగడె వేయక కొంచెము సందుంచవలెను. శ్వాసమువలన గాలిచెడిపోవునుగనుక రోగియున్న గదిలోనికి పలువురను రానియ్యఁగూడదు.

వ్యాధిబాధితులయి యున్నశిశువులకు జావమొదలైనయాహార మెప్పుడును నధికముగానియ్యక పాలు జావ మొదలైనవికొంచెకొంచె ముగా నరగంట కొక్కసారి గరిటెడుచొప్పున నిచ్చుచుండవలెను. ఇట్లు చేయక యెక్కువబలము కలుగునన్న వెఱ్ఱిచేత నాహారమొక్క సారియే యెక్కువగా లోపలికిచ్చినపక్షమున, శిశు వదియిముడ్చు కోలేక క్రక్కుకొని ధారకములేక నిస్త్రాణపడిపోవును.

రోగములోనున్న పిల్లలను ధినమునకు నాలుగుసారు లయినను లఘుశంకకు కూరుచుండఁబెట్టవలెను. అంతేకాక శిశువెప్పుడల్పశంకకుఁ బోవ ననుమాన మున్నదన్నను, ఉపేక్షచేయక యప్పుడు తప్పక లేవఁ దీసి కూర్చుండబెట్టి మూత్రవిసర్జనము చేయింపవలెను. జ్వరాదులచే పేలుపట్టినచో హారతికర్పూరము వేసిన సూనె తలకు రాచినయెడల కొన్నిసారులు రాచునప్పటికి చచ్చిపోవును. హారతికర్పూరముపలుచని గుడ్డలో మూటకట్టిపఱుపుమీఁదనో మంచముమీఁదనో పెట్టియుంచిన పక్షమునసీఁగలబాధయుతగ్గిపోవును. కర్పూరతైలమును దెచ్చికొంచెము కొంచెముగా నల్లులుండుమంచపురంధ్రములలో రెంకుమూడుసారులు పోసినయెడల నల్లులు నశించిపోవును.

బిడ్డలకు కడుపులోఁగానిపొ త్తికడుపులోఁగానినొప్పివచ్చినప్పుడు, ఉప్పుమంగలములోపోసి వేఁచి వేఁడిఉప్పునుబొచ్చుగుడ్డలోవేసి దానితో నొప్పియున్న భాగమును కాఁచినపక్షమున బాధతగ్గిపోవును. ఆభాగమును బొచ్చుగుడ్డను(ఫ్లేనలు) వేఁడినీళ్ళలోముంచివిడిచిపైనను కాఁచవచ్చును.

పిల్లవాఁడు చేయో కాలో కోసికొన్న పక్షమున, నెత్తురు కడిగి వేయక పయిని వెంటనే యొకగుడ్డపీలికను చుట్టఁబెట్టవలెను. గాజుపెంకు ముక్కలుగాని యిసుక మొదలయినవిగాని గాయములో దూరినప్పుడు మాత్ర మవిపోవునట్లుగా వేఁడినీళ్ళతోకడిగిమఱిగుడ్డచుట్టఁబెట్టవలెను. నెత్తురు విస్తారముగా వచ్చుచుండినయెడల, చల్లనినీళ్లు దానిమీఁద పోయవలెను. గాయము మిక్కిలి లోఁతుగా తెగినపక్షమున వెంటనే వైద్యుని బిలువనంపి యాతనిచేత చికిత్స చేయించవలెను.

పిల్లవానికి దెబ్బతగిలి యొడలు కొట్టుకొనిపోయిన పక్షమున, క్రొత్తవెన్న తెచ్చి కొట్టుకొనిపోయినతావున నయిదేసి నిమిషముల కొకొక్కపర్యాయము చొప్పున రెండుమూఁడు గంటలసేపు రాయవలెను. ఎవ్వరయినను కంటిమీఁదగుద్దుటచేతకన్నుకమిలిన పక్షమున, కంటిచుట్టును రెండంగుళముల మేరను అయిదేసి నిమిషములకొకొక్క సారి యొకటి రెండు గంటలసేపు వెన్నరాచినచో నిమ్మళించును.

శిశువు చెట్టుమీఁదినుండి గాని మఱియొక యున్నతప్రదేశము నుండిగాని తలక్రిందుగాకూలి తలదిమ్మెక్కిపడిపోయినప్పుడు సాధారణముగా కొన్నినిమిషములలోనే మరల తెలివివచ్చును అట్లు రానిచో వైద్యుని నిమిత్తముపంపి యీలోపల పిల్లవాని నొకగదిలోనికిఁ గొనిపోయి, క్రొత్తగాలి వచ్చునట్లుగా గదిగవాక్షములు తలుపులు మొదలయిన వన్నియు తెఱచియుంచి, మొగముమీఁదచల్లనినీళ్ళుచల్లవలెను. ఆగదిలోనికి మూఁకను చేరనియ్యఁగూడదు. శిశువును మాటాడించుటకయి కేకలువేయనుగూడదు.

శిశువు నల్లమందునుగాని నల్లమందు కలిసినపదార్థమునుగాని మ్రింగినపక్షమున, వైద్యుని నిమిత్తము వర్తమానము పంపియాతఁడు వచ్చులోపల తత్క్షణమే వేడినీళ్ళలో ఆవాలుకలిపి లోపలికిచ్చివిషము క్రక్కింపవలెను. గొంతుకలోనికి వ్రేళ్ళుగాని పక్షియీఁకనుగాని పెట్టి వెంటనే క్రక్కించుప్రయత్నము చేయవలెను. ముందర వేఁడినీళ్ళలోను తరువాత చన్నీళ్ళలోను మార్చిమార్చి ముంచి శిశువును స్నానము చేయించుచుండవలెను. మొగముమీఁదనుతలమీఁదను చన్నీళ్ళుకొట్టుచుండవలెను. శిశువును గాలిలో నడిపించుచుండవలెను. నిద్రపోనిచ్చిన యెడలనపాయకరమగునుగాన, శిశువునుకొట్టిగానిగిల్లి కాని కేకలువేసి కాని చేతనైనసర్వవిధములచేతను లేపుచు నిద్రపోకుండఁ జేయవలెను.

పిల్లవాఁడు తొడుగుకున్న బట్టలకు నిప్పంటుకొని మండనారంభించిన పక్షమున, వెంటనే పిల్లవాని నేలమీఁదవేసి పొరలించినచో మంటలాఱిపోవును. కంబళిగాని, రత్నకంబళము (తివాచి)గాని, కొబ్బరి పీచు చాపగాని దాపుననున్నచో బిడ్డనుదానిమీఁదవేసి పొరలించుట మఱింతమంచిది. అట్లుచేయక బాలునినిలువఁబెట్టితొడిగినవస్త్రములను దీయుటకుఁగాని యితర స్థలమునకుఁ గొనిపోవుటకుగాని ప్రయత్నించిన పక్షమున, జ్వాలలుశీఘ్రముగా వ్యాపించియొడలంతయు కాలియపాయకర మగును. మంట లాఱిపోయినతరువాత కాలినస్థలమునకుపిండిదట్టముగా పట్టించి దానిపైనిదూదికప్పి యాపైని గుడ్డను కట్టినయెడల లోతుఁగా కాలనిచో గాయము వెంటనే మానిపోవును. నువ్వులనూనెయు సున్నపుసీళ్ళను సమభాగములగా కలిపికాలినచోటరాయుచుండినను పుండుశీఘ్రముగామానిపోవును. కాలినచోటచన్నీళ్ళుచల్లుట యపాయకరము. దినమువిడచి దినము పుండును వేడినీళ్ళతో కడిగి కట్టుకట్టుచుండ వలెనేకాని తఱచుగా గాయమును తుడుచు చుండరాదు. రసియు చీమును విస్తారముగా కారుచున్నచో మెత్తనిగుడ్డ వేఁడినీళ్ళలో

ముంచిగానితో మెల్లఁగా తుడువవలెను.

గోడలకు వెల్ల వేయునపుడు సున్నముకంటిలో పడిన యెడల, వెంటనే పలుచని కాగితముతోఁగాని గుడ్డతోఁగాని దానిని మెల్లఁగాతీసి వేసి గోరువెచ్చనినీళ్ళతో కన్ను కడిగి వైద్యునికి చూపవలెను. నలుసు గాని దుమ్ముగాని యిసుకరేఁకువుగాని దోమగాని ఱెప్ప వెంట్రుకగాని మఱి యేచిన్నవస్తువుగాని కంటిలోఁబడ్డ పక్షమున కన్ను నలుపనీయక యెడమచేతి బొట్టనవ్రేలితో కంటియొక్క క్రిందిఱెప్పను తెఱచి పట్టుకొని కాగితముతో నలుసుమొదలైనవి మెల్లఁగాఁదీసి వేయవలెను. కన్ను ఱ్ఱపడినపక్షమున, వేఁడిపాలును నీళ్ళునుగలిపి దానితో కన్ను కొన్ని సారులు కడుగవలెను.

రేఁగుఁగింజనుగాని పూసనుగానిమఱి దేనినైనగుండ్రనివస్తువును గాని పిల్లవాఁడు చెవిలో వేసికొన్నపక్షమున, ఆచెవి నేలమీఁదమోచు నట్లుగా ప్రక్కకు పరుండబెట్టి పయిచెవిమీఁద రెండుమూడుసారులు గట్టిగాచఱచినయెడల అది క్రిందఁబడిపోవును. అట్లుచేయక దానిని పుడకతో పయికిఁదీయఁ బ్రయత్నించిన పక్షమున, అది మఱింత చెవిలోనికిఁ బోవును. కందురీఁగ మొదలుగాఁగల జీవజంతు వేదియైనను చెవిలోదూరుట తటస్థించినపక్షమున, ఆచెవి పైపైపున నుండునట్లుగా పిల్లవానిని ప్రక్కకుఁ బరుండఁబెట్టి చెవిలోనూనెగాని నీళ్ళుగానిపోసిన యెడల దానితో నాజంతు వేదియైనను పయికివచ్చును.

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

## శ్రీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళిని సాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నిహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరి ప్రథమభాగము
7 ,, ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థ కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము
24 స్త్రీపునర్వివాహ భూత వర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శాస్త్రీ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము-1951

# స్త్రీనీతిదీపిక




గ్రంథకర్త :

కందుకూరి వీరేశలింగము పంతులు





ప్రకాశకులు :

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1951


[వెల రు 0-4-0

కీర్తిశేషులైన రావుబహద్దూరు

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

### ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర-వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కార గానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగపుత్ర ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహారధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయము)
4 మహారణ్యపురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినిసు వర్తకచరిత్రము

### వచన ప్రబంధములు
### పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పక్షివిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# స్త్రీనీతిదీపిక

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

1950

శ్రీ

# స్త్రీనీతిదీపిక

తే. గీ. శ్రీకరుండు, పవిత్రుండు, లోకగురుఁడు,
సర్వశక్తుఁ, డనంతుఁడు, శాశ్వతుండు,
సర్వకారుణ్యుఁ, డభవుండు, సర్వసాక్షి,
యయినదేవర నుతియింతు నాత్మయందు. 1.

దైవభక్తి

తే. గీ. ప్రతిదినంబును నిక్కంపుభక్తితోడ
మూఁడువేళలయందును ముఖ్యముగను
జెలువరో! పెక్కుమేళ్లను జేసినట్టి
యీశ్వరుని వేఁడుకొమ్ము నీహృదయమందు. 2.

తే. గీ. భోజనము చేసి, నిదురింపఁ బోవునపుడు
నిత్యమును రాత్రి యీశ్వరు నెలఁతలార!
ధ్యాన మొనరింపుఁ డెదలోనఁ దనువు మఱచి
పవ్వళించెడుతఱిని గాపాడుకొఱకు. 3.

ఆ. వె. పడఁతులార! మరలఁ బ్రార్థింపుఁ డీశ్వరుఁ
బడకనుండి లేవతడవ మీరు;
మేను మఱచి నిద్ర పూనియున్నప్పుడు
కరము కరుణ మిమ్ము నరసెఁ గాన. 4.

తే. గీ. సంపదలు వచ్చినప్పుడు సాదరముగ
నట్లుదయచేసినందుకు, నాపదైన

యప్పుడు శీఘ్రముగా దాని నణఁచివేయు,
మఱవకుఁడి దైవమును వేఁడ మగువలార! 5.

బంధుప్రీతి

తే. గీ. పుడమిఁ దలిదండ్రులును దోడఁబుట్టువులును
గాక, మిగులువా రెందైనఁ గలుగఁగలరు;
కావునను, వారియెడఁ బ్రేమ గలిగి యెపుడు
వారిమాటలలో మెలఁగంగవలయుఁ జెలువ. 6.

ఆ. వె. అత్తమామలకును నాఁడుబిడ్డలకును
మనసు నొవ్వకుండఁ బనులు చేసి
నడుచు చుండవలయుఁ గడునడంకువతోడ
శ్రేయ మెదను గోరుచెలువ లెల్ల. 7.

తే. గీ. ఒక్కకడుపుననే పుట్టి, యొక్కకంచ
ముననె భుజియించి, యొకమంచముననె పండి
యుండు తోఁబుట్టుపడుచులు సోదరులును
నెప్పు డన్యోన్యమైత్రితో నొప్పవలయు. 8.

గురుభక్తి

తే. గీ. విద్యచెప్పిన గురువుల విషయమునను
మిక్కిలి కృతజ్ఞతను గల్గి మెలఁగ వలయు,
వారలే తమయుక్త ప్రవర్తనకును
దగుసహాయు లని యెఱింగి తరుణిమణులు. 9.

సత్యము

తే. గీ. సర్వశుభముల కాకర ముర్విలోన
సత్య మది లేనిచో ధర్మసమితియెల్ల
వ్యర్థ మగుఁ; గావున నసత్య మనెడుపేరు
వినాదుచెవి సోఁక కుండంగ మెలఁగ వలయు. 10.

తే. గీ. ధర నసత్యంబు లాడుట తథ్యముగను
బాపముల కెల్ల మూలంబు పడఁతులార !
కాన, సత్యంబె పలుకుఁడు; దాన మీకు
నొదవు నిహపర సౌఖ్యముల్ కొదవలేక. 11.

తే. గీ. అతివ! యొకదానిలోఁ గల్లలాడితేని,
నెవ్వరును నమ్మకుండుదు రెపుడు నిన్ను;
నమ్మకము చెడ్డవెనుకను నరులలోన
జీవనము చేయుకంటెను జావు మేలు. 12.

ఆ. వె. తల్లిదండ్రు లొకట దండింతు రెఱిఁగిన;
మగనివంకవారు తెగడు చుండ్రు;
తోడివారు మిగుల దూషింపు చుందురు;
కల్ల లాడితేని కలువకంటి ! 13.

తే. గీ. చెలువ ! యెప్పుడైనఁ దప్పింత చేసితేని,
నొకట మాఱుమాటాడక యొప్పుకొమ్ము.
పొలఁతి ! నీతప్పు దాఁచంగ బొంకితేని,
కానిపను లొక్కటికిని రెండొనుజుమ్ము. 14.

సత్సహవాసము

తే. గీ. తొలుత నెటువంటివారలచెలిమి గలుగు
నట్టివారలగుణములే యబ్బుఁగాన
బాలికలు నిత్యమును మంచివారితోన
చెలిమిఁ దప్పక చేయంగవలయుఁ జుమ్ము. 15.

తే. గీ. జారిణులతోడ, సరిగానివారితోడఁ,
దార్చువారితో, దాసీవితతులతోడ,
వరుస దుర్గుణములు గల్గువారితోడ,
మైత్రి యొనరింపఁజెల్లదు మగువ కెపుడు. 16.

## విద్య

తే. గీ. విద్యవలనను జ్ఞానంబు వెలయుఁ గాన,
నవని 'నిదిమంచి' 'యిదిచెడ్డ' యనుచుఁ దెలియ
బాలురునుబోలెఁ దప్పక బాలికలును
విద్య నేర్వంగవలయును హృద్యముగను. 17.

తే. గీ. విద్యనేర్చినఁ, దొలుతను వినయమబ్బు,
వినయమున సర్వగుణము ల్వెలయు మిగుల,
వానిచేతను బతిభక్తి పాదుకొనును,
కావునను సుందరులు విద్య గఱవవలయు. 18.

ఆ. వె. చదువు నేర్చిరేని, సావిత్రిమొదలైన
పుణ్యసతులచరితములను జదివి,
వారియట్ల తాము వర్తింపఁ జూతురు,
తెలివి విస్తరిల్లి తీఁగెబోండ్లు. 19.

తే. గీ. చక్కఁదనమునకును దోడు చదువుకూడఁ
గలిగియుండిన, నందమాయలరునకును
దావి గలిగినవడువునఁ దనరు చుంద్రు
పువ్వుబోండ్లు, విద్యాగంధమునను గరము. 20.

తే. గీ. చదువులేమిని మూర్ఖత ముదిరియున్న
మదవతిని భార్యఁగాఁ గొని మనుటకన్న,
నూరు విడనాడి వనవాస మొనరుచుటయె
వసుధలో వాసి యని తోఁచు రసికునకును. 21.

ఆ. వె. ఇంతి చదివెనేని, యింటివెచ్చంబులు
బయల నుదుకవేయువస్త్రములును
బద్దు వ్రాయుచుండు భర్తకు వేఱుగ
శ్రమము గలుగ కుండ జలజగంధి! 22.

ప తి భ క్తి.

తే. అవనిలోఁగల సర్వసౌఖ్యంబులకును
నాథుఁడే నారులకు నిదానంబుగానఁ
దరుణి దైవంబునకు వెన్కదైవమంత
వానిగాఁ జూచుకొనఁదగు వరుని నెపుడు. 23.

తే. గీ. ధర్మములలోన నుత్తమ ధర్మ మరయ
మగువకుఁ బతివ్రతా ధర్మమగును జూవె;
యిహపరసుఖములకు రెంటికీశ్వరుండు,
నిహసుఖమునకుఁ బతి, దాత లింతి కెపుడు. 24.

తే. గీ. వరుఁడు పనినుండి యింటికి వచ్చుతఱిని
జూచివలెఁ దలవిరియగఁ బోసి కోక,
కలిగి నంతటిలో సలక్షణము గాఁగ
నుండి యెదురేగి సంతోష మొసఁగవలయు. 25.

తే. గీ. అలసి పతి రాఁగఁ గాళ్ళకు జలమొసంగి
మంచి మాటలతో శ్రమ మాన్పవలయుఁ;
గాని పొరుగువారలతోడి కలహములను
దెగని సంసారబాధలుఁ దెలుపరాదు. 26.

తే. గీ. పురుషులొకవేళఁ గోపంబుపూని సతులఁ
బరుషములు పల్కి కొట్టినఁ, దిరుగఁబడక
యోర్చుకొనియుండి శాంతులై యున్న యపుడు
హితము బోధింపవలయుఁబో యిందుముఖులు. 27.

తే. గీ. అతివరో! పతి దుష్టుడే యయ్యెనేని,
సమయమును వేచి మిక్కిలి సరసముగను
మనసునకునాట వివిధధర్మములు గఱపి
తెలిపి సన్మార్గమునకును దింపవలయు. 28.

తే. గీ. స్వప్నముననైన నాథుని వలనఁ గలుగు
తప్పులను దుర్గుణంబులఁ దడవరాదు ;
మఱచియైనను బరులతో మాటవరుస
నువిద వానిఁ బ్రస్తావింప కుండ వలయు. 29.

తే. గీ. పురుషులందున్న సద్గుణ పుంజములనె
గొప్పగాఁగను భావించుకొనుచు సతులు
హృదయపూర్వకంబుగ వారియెడలఁ గరము
భయము భక్తియు వెలయింపవలయుఁజుండు. 30.

తే. గీ. దైవసంకల్పమునఁజేసి తరుణులారా ;
యంగహీనులును దరిద్రులైన పతులు
మీకు లభియించినను, వారి మీఁదే నడవ
కెంతయును భక్తితోఁ జరియింపవలయు. 31.

తే. గీ. పరపురుషులెంత సౌందర్యవంతులైన,
ధైర్యశౌర్యాది గుణములఁ దనరి యున్న,
సుదతి వారలఁ గన్నెత్తి చూడఁ గూడ
దితర నరుపొందు తృణముగా నెంచవలయు. 32.

ఆ. వె. మంత్రతంత్రములను, మందుల, నాథులు
వశ్యు లగుదు రనుట వట్టిమాట ;
తెలిసెనేని, మున్నుగల ప్రేమయును బోవుఁ,
గాన నిట్టిభ్రమలు మానవలయు. 33.

ఆ. వె. పురుషుఁడూర లేకపోయినఁ, బూఁబోఁడి
పూలు నగలు మేనఁబూనరాదు,
నిలువఁ గూడ దింతి తలవాకిటను జేరి,
నాతి పెద్దపెట్ట నవ్వరాదు. 34.

మితవ్యయము

తే. గీ. కష్టపడి భర్త యెందైనఁ గడన చేసి
యింట నుంచినవస్తువు లించుకైన
వ్యర్థముగఁ బోవుటకు నోర్వ కతివ యెపుడు
వాని మితముగా వ్యయపెట్టవలయుఁ జుమ్ము. 35.

తే. గీ. అధికముగఁ దెమ్మటంచును ననుదినంబు
మగనిఁ బీడింప కనువున నిగురుబోఁడి
కలుగునంతటిలోపలఁ గడుపుకొనుచుఁ
దెలివి తేటలు గలిగి వర్తింపవలయు. 36.

తే. గీ. భాగ్యవంతులు ధరియించు వస్త్రములను
భూషణంబులఁ గనుఁగొని బుద్ధిహీన
లైననారులు నాథుల వానిఁ దమకుఁ
దెండటంచును బీడింత్రు దీనవృత్తి. 37.

సుగుణములు

తే. గీ. పువ్వులును, మంచిబట్టలు, భూషణములు,
సుగుణములయట్ల యెన్నఁడు సుందరులకు
శోభ తేనేర వది గాన సుదతులార!
సుగుణసంపద గడియింపఁ జూడుఁ డెపుడు. 38.

ఆ. వె. నీతి లేకయున్న, నిఖిలంబు చెడిపోవు,
నీతి గలుగుసతికి నిఖిల ముండు,
నీధరిత్రిలోని దేది యెట్లైనను,
నీతి విడువరాదు నెలఁత యెపుడు. 39.

తే. గీ. తనకు దైవంబు దయచేయుదానితోనె
తృప్తిపొంధిన సుఖపడుఁ దెలివ యెపుడు,

చాలలేదని వగఁబొందుచాన సతము
వ్యాధి లేనట్టి బాధను బడుచు నుండు. 40.

తే. గీ. సౌఖ్య మెక్కడనో విశేషంబుగాఁగఁ
గలుగుననుకొంట భ్రమసుండు కలుకులార!
కాపురము సేయుచుండు సౌఖ్యంబు సతము
తనివి గల దేని, నిలిచి మీమనసులందె. 41.

ఆ. వె. తుష్టి లేకయున్న, దొరకదు సౌఖ్యంబు,
కొట్లకొలఁదిధనము కూడియున్నఁ
గుడువఁ గట్టనున్న, గొప్పగృహములున్న,
నొడలినిండ లత్తొడవు లున్న. 42.

త్యాగము

తే. గీ. "తాను జేసినధర్మంబె తన్నుఁగాచు"
ననెడు లోకోక్తి చిత్తంబునందు నిలిపి,
భర్తయును బంధువులు నియ్యఁబనిచినట్టి
ద్రవ్యమున బీదసాదలఁ దనుపవలయు. 43.

తే. గీ. త్యాగ మొనరింప నగునన్న యాసచేత
ధవుఁడుఁ జుట్టంబు లిచ్చినధనము గాక,
తాను జాటుగఁ దీసి యద్దాని నొక్క
పెసరగింజను బరులకుఁ బెట్టరాదు. 44.

తే. గీ. దాసదాసీజనంబుల దయ దలిర్పఁ
బెట్టుపోఁతలఁ దనుపుచు, వెలఁది వారి
గదిమి చీటికిమాటికిఁ గసురుకొనక
వారు ప్రేమింప వర్తింపవలయుఁ దాను. 45.

తే. గీ. మున్నె తనశక్తియు నశక్తి నెన్ని చూచి
ఋణదులకు నెప్పుడును మాట యియ్యవలయు;

నిచ్చెనేనియు, మఱి యేది యెట్టులైనఁ
దీర్పవలె దాని ధర్మంబు తెగకయుండ. 46.

చౌర్యము

ఆ. వె. దొంగతనము చేయ దొరలు పట్టి శిక్షించు;
నిరుగుపొరుగువార లెగ్గు లెంత్రు ;
పరమునందు నరకబాధలు పైకొను ;
దోషములకుఁ గుదురు దొంగతనము. 47.

తే. గీ. ఎవరు పట్టుకోఁ గలరని యెంచుకొన్న,
దాఁగనేరదు చౌర్యంబు ధరణిలోన ;
దాఁగెనేనియుఁ జానరో! దైవ మైనఁ
గాంచి శిక్షింపఁడే యట్టికట్టిడులను : 48

తే. గీ. భామ లెప్పుడుఁ దృణ మైనఁ బరులసొమ్ము
వారియనుమతి లేకుండఁ జేరఁ బోయి,
ముట్టుకో రాదు ; పొరపడి ముట్టుకొన్న,
శాశ్వతం బైన యపకీర్తి సంఘటిల్లు. 49.

అహింస

తే. గీ. కొమ్మ ! యఱకాలునను ముల్లు గ్రుచ్చుకొన్న
నెంత నొప్పిగ నుండునో యెఱిఁగి నీవు
జీవహింస యెన్నండును జేయఁ బోకు ;
జంతువుల కన్నిఁటికి బాధ సమమె కాన. 50.

తే. గీ. దయను మించినధర్మంబు ధరణిలోన
వెదకి చూచిన నొక్కటి వేఱె లేదు ;
కావునను దీని మది నుంచి కన్నెలార !
భూతదయ గల్గి మెలఁగుడు పుడమి మీఁద. 51.

తే. గీ. మేఁక మొదలుగాఁ గల సాధుమృగములకును
బాధ సేయుదు రూరక పాడుసతులు ;
తమ్ము మించెదు వా రట్లు తమ్ముఁ గొట్ట
నెట్టు లుందురో యొక్కింత యెఱుఁగ వలదె ? 52.

తే. గీ. చిన్నజంతువులకు బాధ సేయుచున్న,
నంత కంతకు నదె హృదయంబునకును
బట్టు వడి, కొన్నినాళ్ళ లోపలనె నిజము
మనుజులకుఁ బీడ గలిగింప మనసు పుట్టు. 53.

తే. గీ. ప్రాణికోటిపై దయ గల్గువారియందు
దైవమును జాల దయ గల్గి తనరుఁ గాన,
సామజంబున కైనను దోమ కైన
నిర్నిమిత్తంబుగా బాధ నెఱప రాదు. 54.

కో ప ము

తే. గీ. కోపమే పాపముల కెల్లఁ గుదు రటంచు
నెప్పుడును దొంటిపెద్దలు చెప్పుచుంద్రు ;
దీని మదిలోన సతతంబు దృఢము చేసి
మానినులు కోప మనుమాట మఱవ వలయు. 55.

తే. గీ. కొలువు కుదిరినవారిపైఁ గోపపడక,
మంచితనముననే మీరు మగువలార !
పని గొనుం డందువలనను వారు కరము
భక్తియును శ్రద్ధ కాన్పింత్రు పనులయెడల. 56.

ఆ. వె. పనులఁ బనుచునపుడు పనివారలను మీరు
కసరు చుందురేని కాంతలార !
పనిని జేయ రెపుడు బాగుగ ; మఱి మీకుఁ
గ్రూరురాం డ్రటంచుఁ బేరు వచ్చు. 57.

తే. గీ. లేమ ! తిన్నఁగా మాటాడ లేనివారు
తెలివిలేమిని నినుఁ దప్పఁ బలికి రేనిఁ,
దప్పుగాఁ బట్టుకొని దానిఁ దడవుకొనుచుఁ
గోప పడకుము వారిపైఁ గొదవలెన్ని. 58.

పాటు

ఆ. వె. పాటు పడిన, నొడల బలము లెస్సగ నుండుఁ
బాటు పడిన, మేనివ్యాధి పోవుఁ ;
బాటు పడిన, సుఖము బాగుగఁ గలుగును ;
బాటు పడఁగ వలయు భామ లెందు. 59.

ఆ. వె. ఇంతదవ్య ముండఁ నిట్లు సాగుచు నుండఁ,
బరిజనంబు నింత బలిసి యుండఁ,
నడచి పనులు సేయ నా కేమి యనఁ బోక,
పడఁతి యెపుడుఁ గష్టపడఁగ వలయు. 60.

ఆ. వె. పనులు సేయు నెడలఁ బడఁతుక యెప్పుడు
దాసివలెను దానె చేసికొనుచు,
ననుభవించుసమయమున రాణికైవడి
ననుభవింప వలయు, నష్టులేక. 61.

శరీ రా రో గ్య ము

తే. గీ. అన్నిధర్మంబులను ముఖ్యమైన దరయఁ
దనదు దేహంబు కాపాడుకొను టె కాన,
లేనిపోనియాచారముల్ పూని, పొలఁతి !
యొడలు చెడఁగొట్టుకొన కెప్డు నుండ వలయు. 62.

తే. గీ. పాలుమాలక భామినుల్ ప్రతిదినంబు
స్నాన మొనరించుచును దమ మేనిముఱికి

పాయునట్లుగఁ దోముకో వలయు నోడలు,
రోగమును నొప్పి లేకుండ సాగుకొఱకు. 63.

తే. గీ. ఎపుడు స్నానంబు మానక యిందువదన
విలువవస్త్రంబె వలె నని వెఱ్ఱిపడక
ముతక దైనను గానిమ్ము ముఱికి లేని
వస్త్రమును ధరించుకో వలయుఁ జుమ్ము. 64.

తే. గీ. కల్మషజలంబు ద్రాగినఁ గలుగు వ్యాధి;
వాస్తవము దీని మది నుంచి వడియఁగట్టు
నిర్మలజలంబె ద్రావుచు నెలఁత యెపుడు
తేర్చి తనవారి కీవలెఁ దేటనీరు. 65.

ఆ. వె. మితము తప్పి తినుట మేలుగా దెన్నఁడుఁ
తినియె నేని, గొప్ప తెవులు వచ్చు;
వల దనంగఁ గొంత వర్ధించుకొం డంచుఁ
బెఱలను బలవంత పెట్టరాదు. 66.

తే. గీ. మంచివాయువు లేదేని మనుజులకును
వ్యాధు లొదవును గావున వనజముఖులు
తలుపులన్నియు మూయక తగినగాలి
పడకయిలుసేరు పనిఁ జూడ వలయుఁ జుండు. 67.

తే. గీ. గాలి దుర్గంధసహితమై కడిసె నేనిఁ
గలికిరో ! దేహమునకు రుగ్మతలు వచ్చు;
నింటిపజ్జను ముఱికినీ రెన్నఁటికిని
నిలువ నీయకు మమ్మరో నెలఁతమిన్న ! 68.

శాంతత్వము

తే. గీ. సర్వధర్మంబులకు నొక్క శాంతగుణమె
వన్నెఁ దెచ్చునలంకార మన్నులార !

యెన్నిపాటులు పడి యైన నెల్లవారు
శాంతతను ద్రాల్చుయత్నంబు సలుప వలయు. 69.

తే. గీ. దాసదాసీజనంబులు తగవు మాలి
తప్పు చేసిన, దానిని తడవ కెపుడు
సైరణ వహించి యొకరెండుసారులైన
వారి మన్నింప వలయును వారిజాస్య! 70.

ధైర్యము.

తే. గీ. ఆపదలు వచ్చినప్పుడు నలరుబోండ్లు
తాము ధైర్యంబు విడువక, తక్కఁగలుగు
వారి నూరార్చి దుఃఖంబు వాప వలయు;
ధైర్యమున నాపద సగంబు తగ్గి పోవు. 71.

తే. గీ. వసుధ నెపు డైనను విపత్తు వచ్చినపుడు
తాల్మి విడనాడి వగ గూరి తలఁకు చున్న,
దానఁగు రెట్టింపుగాఁగను నోఁచుఁ గాని
కొంచె మైనను గార్యంబు కూడిరాదు. 72.

గర్వము.

తే. గీ. చక్కఁదన మున్న, సంపద చాల నున్న
లేరు భువిలోన నాపాటివా రటంచు
విఱ్ఱవీగంగఁ దగ దెందు వెలఁదులకును;
దాన నెంతయు నెగ్గగుఁ దప్పకుండ. 73.

తే. గీ. ఎంతయైశ్వర్య ముండునో యంతయడఁకు
వొనర మెలఁగంగ వలెఁ జుండు వనితలార!
సర్వసుగుణంబు లుండియుఁ జాల, నొక్క
యడఁకువయె లేనిచో వ్యర్థ మవియుఁ గూడ. 74.

ఆ. వె. అడఁగి మడఁగి యుండునతివల నందఱు
ఘనముగాను జూతు రనవరతము;
విఱ్ఱవీఁగు చుండు వెలఁదుల నెల్లరుఁ
జులుకగాను జూతు రిలను నెపుడు. 75.

తే. గీ. కలిమి తన కెంత గలిగిన గర్వపడక
బీదసాదల నరయుచు వినయ మొప్ప
నొరులహృదయంబునకు బాధ యొదవ కుండ
మెలఁగుచుండెడి మెలఁతయె మెలఁత యందు. 76.

చా డీ.

తే. గీ. కొండెములు చెప్పుకంటెను క్రూర మైన
కార్య మొక్కటి యెందును గాన రాదు ;
కాన, లేనివి కల్పించి చానలార !
యొకరిపయిఁ జెప్పఁ బోకుఁడీ యొరులతోడ. 77.

తే. గీ. వెలఁదిరో ! నీవు విన లేదె 'విన్నమాట
కన్నఁ జెప్పెడుమాట చే' టన్నమాట :
కనుకఁ జెవి యిచ్చి చాడిని వినకు మమ్మ ;
వింటివేని, యనర్థంబు లంటుఁజుమ్ము. 78.

ప రో ప కా ర ము.

తే. గీ. ఒకపరోపకారంబు చేయుటయె కాదె
యిలపయిని జన్మమెత్తినఫలము మనకుఁ;
గాన మనమేలు చూడకయైనఁ దరుణి ;
పరుల కుపకార మొనరింప వలయుఁజూవె. 79.

తే. గీ. మహిని మనమెల్ల మనుజసామాన్యముగను
జాన ! దైవ కుటుంబములోని వార
మగుట, లేమిచే, నొక్కఁడు పొగులు చుండ
సాయ మొనరింప కుండుట చనునె చెపుమ. 80.

సమబుద్ధి.

తే. గీ. ఎల్లరును నొక్కదైవంబె యిల సృజించెఁ;
గావునను, భేద మెంచక కలుఁడులార !
యక్కసెలియండ్రవలెఁ జూడ నగును స్త్రీలఁ;
బురుషులను జూడ వలయు సోదరులమాడ్కి. 81.

తే. గీ. ఎదుటివారికి మర్యాద నెఱిఁగి చేసి
వారిచేఁ దాను మరియాద పడయ వలయుఁ;
బరులఁ దొలుతను గౌరవపరుప కున్నఁ,
దలకు గౌరవ మబ్బదు తథ్యముగను. 82.

బాలశిక్షణము.

ఆ. వె. పిల్ల లొక్క వేళ నల్లరి చేసిన,
బుద్ధి చెప్పవలయు బుజ్జగించి ;
నయము భయము చూపి న్యాయంబునకుఁ ద్రిప్పి
చెలువ తగినశిక్ష సేయ వలయు. 83.

తే. గీ. తెలివ నోటికి రానట్టితిట్లు తిట్టి
గొడ్డు బాదిన క్రైవడిఁ గొట్టె నేనిఁ,
దా మృగప్రాయ యౌట యందఱకుఁ దెలుపుఁ
గాని బాలునకును బుద్ధి గఱప లేదు. 84.

వివిధధర్మములు.

ఆ. వె. ఎదుటివారు నీకు నేరీతిఁ జేయంగ
వలయు నంచు మదిని దలఁచు కొనెదొ,
యెదుటవారి కీవు నెప్పుడు నారీతిఁ
జేయు చుండవలయుఁ దోయజాక్షి! 85.

తే. గీ. కుడిచి కూర్చుండియేమిటఁ గొదవ లేక
వీరిని వారినిఁ జేరిచి యూరివారి

దోషముల నెన్నుచుండుట తుచ్ఛగుణము ;
కాన, మంచివా రటుచేయ మాన వలయు. 86.

తే. గీ. దైవవశమున నన్యులతనువులందుఁ
గలుగువక్రతలను గాంచి చెలువలార !
నవ్వఁ దగ దించుకయు నట్టినరులఁ బిలిచి
చేత నైనచో సాయంబు చేయ వలయు. 87.

తే. గీ. నిత్య మరుణోదయంబున నిద్ర లేచి
దంతధావన మొనరించి తగినరీతిఁ
బ్రాఁచిపనులను దీర్చి ప్రతిదినంబు
నిల్లు శుచిగాఁగ నుంచంగఁ జెల్లు సతికి. 88.

తే. గీ. ఒరులసంపదఁ గనుఁగొని యోర్వలేమి
దుర్గుణంబులలో నెల్ల దుర్గుణంబు;
సుదతి యెప్పుడు నట్టియసూయ విడచి
పుడమి సరివారు మెచ్చంగ నడువ వలయు. 89.

తే. గీ. ఇతరు లొనరించుమేలును నించు కేని
మగువ లెప్పుడుఁ గల నైన మఱవ రాదు ;
కొంచె మైనను గొప్పగా నెంచికొనుచుఁ
జేత నౌ మేలు క్రమ్మఱఁ జేయ వలయు. 90.

తే. గీ. ఇంటఁ గల గుట్లు పరులకు నించు కేనిఁ
దెలియ నీఁగూడ దెటు లైనఁ దెలిసె నేనిఁ,
గార్యముల కెల్ల భంగంబు కలుగుఁ గాన ;
మెలఁత కడు మెలంకువ గల్గి మెలఁగ వలయు. 91.

తే. గీ. వీరికడమాటఁ గొనిపోయి వారికడను,
వారికడ మాటలను దెచ్చి వీరికడను,

దెలుపఁబోకుఁడు మీ రెందుఁ దెఱవలార!
తెలిపినను నిందపా లౌదు రిలను మిగుల. 92.

ఆ. వె. ఇద్ద ఱొక్కచోట నేకాంత మాడంగఁ
గాంచి వినఁగ రాదు మించుబోఁడి!
వినుచు నున్నయపుడు కని రేని వారలు
కలహ మొదవుఁ జుమ్ము కలువకంటి! 93.

తే. గీ. ఇరుగు పొరుగు నారులకడ నించు కైనఁ
బరుషవాక్యంబు జిహ్వాగ్రభాగ మెపుడు
కదియ నీయక వారితోఁ గలసి మెలసి
యెల్ల రౌనన మెలఁగంగఁ జెల్లు సతికి. 94.

తే. గీ. పఙ్క్తిభేదంబు సేయక పదిగ నరసి
యందఱకు నేకరీతిగా ననువుమీఱ
భక్ష్యభోజ్యముల్ వడ్డింప వలయుఁ జూవె
కీర్తికే యాశ పడునట్టి కీరవాణి. 95.

ఆ. వె. పుట్టినింటివారు భువిలోన శ్రీమంతు
లగుచు నున్నఁ గాని యందు, బోక
నెలఁత యెపుడు మగఁడు నిరుపేద యైనను
నిలువ వలయు నతని నెలవు నందె. 96.

తే. గీ. ఖ్యాతియైన నపఖ్యాతియైనఁ బతికి
భార్యమూలముగా నెప్పు వచ్చుఁగాన,
లేశ మైనఁ బ్రమాదంబు లేకయుండఁ
దెఱవ సన్మార్గమునఁ బ్రవర్తింప వలయు. 97.

తే. గీ. కుట్టుపనులను నేరుచుకొని నెలంత
తనదు రవికలు బట్టలు తాన కుట్టు

కొనగవలెఁ గాని యిది కట్టుఁ డనుచుఁ
బోరుగువారల నడుగంగఁబోవరాదు. 98.

తే. గీ. సేవకుల నైనఁ దా నాజ్ఞ చేసినట్లు
లోరి యిదిచేయు మోసి యనక,
అమ్మ యిదిచేయు మదిచేయు మయ్య యనుచు
వేఁడుకొనునట్లు చెప్పుట వెలఁది కగును. 99.

తే. గీ. చిన్ననాటనె పాకంబు జిహ్వ కింపు
గాఁగఁజేయంగ నేరిచి కలువకంటి
ప్రతిదినము భోజనము నెల్లవారలకును
వేళపట్టునఁ దప్పక పెట్ట వలయు. 100.

—:(0):—

తే. గీ. బాలికాపాఠశాలల నోలిఁ జదువు
చిన్నతరగతులం దున్న కన్నియలకుఁ
గాఁగ స్త్రీనీతిదీపిక నాఁగ దీని
కందుకూరి-వీరేశలింగము రచించె. 101.

సంపూర్ణము.

బాక్సు ముద్రాక్షరశాల, రాజమండ్రి—1950.

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతిమణి విజయము
6 సుమిత్రా చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతీ పరిణయము
10 గయ్యాళిని సాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజసమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయ విలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆరవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 ,, ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము
24 స్త్రీపునర్వివాహ భూత వర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

జాక్సన్ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము-1951

# సత్యాద్రౌపదీ సంవాదము

## (మాతృపూజ పితృపూజ)



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

**1951**

[వెల రు **0-4-0**

కీర్తిశేషులైన రావుబహద్దూరు

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

### ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కార గానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కల్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

### వచన ప్రబంధములు

### పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజా పూర్వదేశ
యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన
నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పక్షికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 సీసదీపిక

# సత్యాద్రౌపదీసంవాదము

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

1950

కాపీ 1

# సత్యాద్రౌపదీసంవాదము

(ఏకపాదవృత్తము.) పాట.

శ్రీకృష్ణుఁ డొకనాఁడు చెలఁగు వేడుకను
విపినంబులోపల వెత నొందుచున్న
పాండవులను జూచి పలికించుకొఱకుఁ
బయనమై యలసత్యభామను గూడఁ
దనవెంటఁ దోడ్కొని తరలి యచ్చోట
ధర్మరాజాదుల దయమీఱఁ జూచి
వారలసేమంబు వరుసగా నడిగి
సదయవాక్కుల దుఃఖశమనంబు చేసి
యిష్టకథాగోష్ఠి నెల్లవారలును
ముచ్చటగాఁ బొద్దు పుచ్చుచు నుండి,
సత్య యాద్రౌపదిసరసను జేరి
కుశలవార్తల నెల్లఁ గొంతసే పరసి
బహువిషయంబుల భాషించి పిదప
మాటలక్రోరణి మంతనంబునను
ద్రుపదతనూభవతోడ నిట్లనియె—
నతివరో! నిన్ను,నే నడిగెద నొకటి
కరుణించి చెప్పుము కపటంబు విడిచి
కలహూపు సకలంబు కాంతాలలామ!
నీభర్త లేవురు నిరతంబు మిగుల

# సత్యా ద్రౌపదీ సంవాదము

నాకరికంబైన నొక్క రువిద ! నీయందు
ననురక్తు లగుచుంట యత్యద్భుతంబు.
నగు మొగంబులె కాని నాథు లెన్నఁడును
వనిత ! నీపయిఁ గిన్క వహియింపఁ గాన
నిందుకుఁ గారణ మింతియో ! నీదు
మంత్రతంత్రంబులమహిమాతిశయమొ
వశ్యౌషధంబులవలనిగుణంబొ
బలునోములఫలంబొ వ్రతమహత్త్వంబొ
నీదుజాణతనంబొ నీతివైభవమొ
తెలియంగఁ జెప్పుము ; తెలిసి నేఁగూడ
వాసుదేవుని నాకు వశునిఁ జేసికొని
నీవలె సుఖయింతు నిరతభోగముల ;
నని యడిగినయంత నామహాసాధ్వి
హృదయంబులోపల నించుక యలుక
గలిగినను బయికిఁ గనఁబడ నీక
చింత యెల్ల నడఁచి చిఱునవ్వు నవ్వి
దుష్టాంగనలయట్లు తుచ్ఛంపుఁబనులు
సలుపుదు నే నని తలఁచితి గాన
మాపురుషోత్తమున్ననఁ బడయఁ
దగనభార్యవుగాఁగఁ దగవు నీవరయ ;
నీస్వభావం బెల్ల నేఁ డిందుఁ దెలిసె ;
ననుచు మేలపుఁజందమున నావఘాటి
తెలివితక్కువ యెల్లఁ దెల్లంబు చేసి
పాంచాలి యిట్లని పలికెను మఱియు—
శ్రమ యింతయును లేక చల్లగా నుండి

మందుల మాకుల మంత్రతంత్రములఁ
బతుల వశ్యులఁ జేయ భ్రమపడు టెల్లఁ
బెద్ద వెఱ్ఱితనంబు బింబఫలోష్ఠి !
చెలువుని కావార్త చెవి సోఁకె నేని
మును పున్న ప్రేమయు మొదలంట విడిచి
త్రాచుపామును వలెఁ దలఁచు నాసతిని.
మఱియు నామందులు మాయలుఁ జేరి
వికటించి మగలకు వివిధరోగములఁ
బుట్టించి బాధించి ముప్పును దెచ్చు.
దాన నాయింతి నందఱును దూషింప
లోకనిందయుఁ బరలోక హానియును
దలకూడి మిక్కిలి తలవంపు లౌదవు.
కావున సాధ్వులు కాంతులయెడలఁ
గావింపఁదగ దెప్డుఁ గపటకర్మములఁ
గాంతుని మనసును గనిపెట్టి మెలఁగ
నన్ని యౌషధములు నవియె యౌఁ జుమ్మ.
పాండుపుత్రులు నాకు వశ్యు లౌటకును
నేను వేసినయట్టి నెఱమందు నీకు
నుపదేశ మొనరింతు—నోపిక చేసి
నావలె నీవును నడచెద వేని,
వలఁచి పైఁబడుఁ దాన వల్లభుఁ డెపుడు.
హృదయశుద్ధిగ నాదుహితబోధ వినుము—
మదముఁ బ్రమాదంబు మాని భర్తలకు
నెల్లప్రొద్దును భక్తి యినుమడింపంగఁ
జిత్తవృత్తి యెఱింగి సేవ చేసెదను ;

పతులకంటెను ముందు పవళింప నెపుడు ;
పతులు వచ్చిన నర్ఘ్యపాద్యాదివిధులు
నేనె చేసెదఁగాని నెపము కల్పించి
పరిచారికల నెప్డుఁ బనుపను నేను ;
పరపురుషుల గడ్డిపఱకఁగాఁ జూతు ;
మగలకు భోజనమజ్జనాదులను
యుక్త సమయముల నొడఁగూర్తు నెపుడు ;
పొల్లుగా ధనధాన్యములు కొంచెమైన,
వృథవోవుట సహింప ; గృహమునం దెపుడు
స్థలభాండశోధనల్ తప్పక చేసి
పరిశుద్ధముగ నుంతుఁ బడఁతి ! సర్వంబు ;
పానపాత్రాదులఁ బరికించి తఱుచు
శుచిగాఁగ నుంచుదు శుద్ధజలంబు ;
తలవాకిట మెలంగఁ దడవుగా నేను ;
చెడుపడంతులతోడ స్నేహంబు చేయ ;
కలహ మనెడుపల్కు కలలోను నాదు
చెవి సోఁక కుండఁగఁ జేరి వర్తింతు ;
నత్తయాజ్ఞను మీఱి కడఁగి వర్తింతు ,
కలబంధువుల యుక్తగతి గౌరవింతు ;
నతిథిసత్కారంబు లరసి చేసెదను ;
శాంతత వహియింతు సర్వంబునందు ;
ప్రాణంబు పోయెడు పట్టుల నైన,
నీతిమాలినపని నేఁ జేయ కుందు !
చన విత్తు రని భీతి సడలి వల్లభులఁ
జులుక సేయక చరించుదుభక్తితోడ ;

పాండవాగ్రజుతోడఁ బంక్తిని గుడుచు
యతులను విప్రుల ననుదినం బేనె
యన్నపానాదుల నరసి కన్గొనుచు
భూషణాంబరదానముల సత్కరింతు.
మఱియు ధర్మాత్మజుమందిరమందుఁ
బలుదెఱంగుల నొప్పుపనుల వర్తిల్లు
భృత్యులకృత్యముల్ వేర్వేఱ యెఱిఁగి
జీతబత్తెంబులఁ జెలువరో! యిత్తు;
నదిగాక భద్రగజాశ్వాదులకును
ఖాద్యంబు లొడఁగూర్పఁగా నియమింతుఁ
దగినజనంబులఁదఱితప్పకుండ
నొకపని యన నేల? యువిదరో! వినుము—
ఆబాలగోపాల మందఱ నేనె
యర్హరీతిని జూచి యరయు చుండుదును.
పాండవులు కుటుంబభార మంతయును
నామీఁదనే పెట్టి నాతి! నిర్భరతఁ
దారు చరింతురు తమయిష్టగతుల.
వేగ జాము గలుగ వెడనిద్ర పోదు.
కాని నాకెప్పు డీకార్యభారమున
నాహారనిద్రల కైనఁదిన్నఁగను
నెడము లేదు.—విను మీయింద్రజాలంబె
పాండుకుమారులపైఁ బ్రయోగించి
వారలనే వశవర్తులఁగాఁగ
నింతి! చేసికొనితి; నింతియకాని,
నీవు చెప్పెడునట్టి నెఱజాణతనము

మంత్రతంత్రంబులు మరులుమందులును
నింద్రజాలపు విద్య తెలుఁగ నేమియును.
అన సిగ్గు పడి సత్య యనియె ద్రౌపదికి—
నే నెఱుంగమిచేత ని ట్లడిగితిని.
నా నేరము క్షమించి నవ్వుగఁ గొనుము
నామాట తెల్లను. నారీలలామ !
పరమసాధ్వివి నీవు పరికించి చూడ ;
ననినఁ బాంచాలియు నాననాబ్జములఁ
జిఱునవ్వు మిక్కిలి చెంగలింపంగ
సత్యభామను జూచి చనవున ననియె—
వదినెరో శ్రీప్రియవల్లభు నీవు
వరపఱుచుకొనెడు వరసాధనంబు
తగ నీకుఁ జెప్పెద ధర్మాన్వితముగ.—
పతిని మించెడునట్టి పరమ బాంధవులు
మఱి యెవ్వరును లేరు మహిమీఁద సతికి
సర్వసౌఖ్యము లొందఁ సాధ్వీమణులకుఁ
బతియె నిదానంబు పర్వేందువదన !
పతి యనుగ్రహమును బడయుకాంతలకు
సకల గౌరవములు సర్వవస్తువులు
భూషణాంబరములుఁ బుత్రసంపదయు
సద్గతియును గీర్తి సకలంబు గలుగు
కావునఁ బతియాజ్ఞ కలలోన నైన
మీఱక మెలఁతుక మెలఁగంగ వలయు.
కష్టపడినఁ గాని కరము సౌఖ్యంబు
కలుగ దెవ్వరికిని క్ష్మామండలమున.

కావున, దేహంబు కడు దాఁచుకొనక
పనిపాటులను జేసి పతిచిత్త మెఱిఁగి
ప్రేమంబు భక్తియుఁ బ్రియముఁ జూపుచును
వరవర్తనంబున వర్తింప వలయు.
నీవినయంబును నీసుగుణముల
నీపనిపాటుల నీ సుచరితల
వీక్షించి నిత్యంబు విభుఁడు తనంతఁ
బ్రియమార మన్నించి ప్రేమించు నిన్ను.
భర్త నీమందిరద్వారంబు చేర,
సంభ్రమంబున లేచి సలుపుము భక్తి.
గృహము చొచ్చినవెన్కఁ గ్రింది వారలను
పనులు చేయంగను బంచితినంచు
నూర కుండక నీవు నుపచారములను
జేత నైనట్టుగఁ జేయుము పతికి.
ఏకాంతమున నీకు నెపుడైన మగఁడు
చెప్పినపలుకును జెలులతో నైన
మఱపున నైనను మఱి చెప్పకమ్మ.
చెప్పితివేనియుఁ జెడుపడంతుకలు
నీమీఁద నేదియో నెపము కల్పించి
లేనిపోనివి చెప్పి లేమ! నీమగని
చిత్తము విరసంబు చేయుదు రవల.
భర్తకుఁ బ్రియు లైనవారల నెపుడు
నాదరింపుము శీతలాలాపములను.
భర్తకు గిట్టనివారలు నీకుఁ
బ్రియమిత్రు లైనను విడువుము వారి

భామ ! నీదగ్గఱబంధులతోను
నేకాంతమునను నీ వేకాసనమున
మగువరో ! కూర్చుండి మాటాడఁబోకు.
చెడుపడంతులతోడఁ జెలిమి చాలించి,
సద్వర్తనము గల్గు సాధ్వులతోనె
సతతంబు స్నేహంబు సలుపుచు నీవు
గడపు సద్గోష్ఠిచేఁ గాల మెప్పుడును.
నేఁ జేయుహితబోధ నెమ్మనంబునను
దృఢముగాఁగను నిల్పి తిరుగుదు వేని,
సకల సౌభాగ్యముల్ సమకూరు నీకు;
వసుధలోను బ్రతిష్ఠ వచ్చు నిక్కముగ.
అనిన సంతోషించి యాసత్యభామ
ద్రౌపదీదేవికిఁ దనకృతజ్ఞతను
దెలిపి యెన్నన్నియొ దీవన లిచ్చి,
రాజ్యంబు విడిచి యరణ్యంబునందుఁ
గష్టముల్ పడుచున్న కారణమునను
వగఁ బొందు చుండంగ వలవ దటంచు
ధైర్యంపుమాటలు తగురీతిఁ జెప్పి,
మరల రాజ్యము పొంది మగలతోఁగూడ
నతివేగ సుఖయింతు వంచు నోదార్చి ;
పాంచాలి వీడ్కొని భర్తతోఁగూడ
ద్వారకాపురి కేగి ద్రౌపదీదేవి
చేసినహితబోధ చిత్తమం దుంచి
కాంతునిచిత్తందు కనిపెట్టి మెలఁగి
సుచరిత్రమున సత్య సుఖయింపు చుండె.

ద్రుపదాత్మజకు సత్యభామకు నైనట్టి
సంవాదమును దీనిఁ జదివి సుందరులు
వరగుణంబులు గల్గి వర్తింతు రేని,
పతులప్రసాదంబు వడసి యెల్లప్పుడు
సకలశుభంబుల సత్కీర్తిఁ గాంచి
యిహపరసుఖముల నెలమిఁ గాంచెదరు.

## మా తృ పూ జ.

(ద్విపద.)

మునుమున్న దేవతాపూజలు సల్పి
మననిమిత్తము చాల మహిఁ గష్ట మొంది
తొలుత గర్భంబునఁ దొమ్మిది నెలలు
వలనొప్ప మనలను వహియించి కాంచి
కన్నపిమ్మటఁ గూడఁ గడగండ్ల నోర్చి
చన్నుపా లిచ్చి సతతంబుఁ బ్రోచి
యుయ్యలలో నుంచి యూఁచి లాలించి
యెయ్యెడ నొక్కింత యేడ్చినఁ గాని
పరుగెత్తుకొని వచ్చి పాటలు పాడి
యురమునఁ జేరిచి యోదార్చి పిదప
ననుగన్నతల్లి ! యోనాచిన్నిపాప !
యని పిల్చుచును జెక్కు లాస్యంబు నోరు
ముద్దాడి శిరసును మూర్కొని యవలఁ
దద్దయుఁ బ్రేమంబు పైవారఁగాను
మును తొమ్ము మీఁదను బుజముల మీఁద

వెనుకతట్టున నిడి వేడ్క మోయుచును
నవ్వించి యాడించి నయము చూపుచును
బవ్వళించినయట్టి పట్టున నైన
నేమఱి యుండక యెడనెడ వచ్చి
సేమంబుతో నుంట చేరి చూచుచును
దన కిష్ట మైనట్టిదానిని గూడఁ
దన ప్రాణసమముగ దాఁచి పెట్టుచును
దేహమున నొకింత తెవులుచూపట్ట
నాహారనిద్రల నవలఁ బోఁద్రోచి
పరితాప మొందుచు బహువిధంబులను
సరసఁ బాయక యుపచారముల్ చేసి
కాయము స్వస్థఁ గాంచినదాఁక
హాయిగా నుండక యటమటించుచును
మన బాగె లెప్పుడు మదిని గాంక్షించి
చనవున బలిమిని సమయోచితముగ
మంచిబుద్ధులు నేర్పి మనవర్తనమునఁ
గొంచె మేనియు నిలఁ గొదవ లేకుండ
వర్తించునట్లు చేయ వడిఁ బాటు పడుచుఁ
గీర్తి కెక్కెడుమాత కేవల మిలను
మనపాలిఁటికి వేల్పె మాట లేమిటికి ?
మన మామె మాటను మఱి తప్పఁ దగదు:
భయభక్తులను జూపి భజియింప వలయు
దయతోడఁ జూచుచుఁ దల్లి నెల్లపుడు ;
మనమూలమున నామె మది నొచ్చె నేని
మన కది శ్రేయస్సు మఱి కాదు సుమ్ము.

# పితృపూజ.

(ద్విపద)

కడుపూర్ష మిడఁ దల్లి గర్భంబునందుఁ
బడినది మొదలుగ బహుకష్టపడుచు
మనపోషణము తన మనసులో నుంచి
ధనము ధాన్యంబును దక్కువస్తువులు
ముందుగా మందిరమునఁ గూడఁబెట్టి
మందులు మాకులు నుఱిసిద్ధపఱిచి
యెపుడు పుట్టుదుమో యం చెదురు చూచుచును
కృపమీఱఁ గోరుచుఁ గీడు రాకుండ
మనము పుట్టినవెన్క మన కెందులోను
నణుమాత్రమును లోప మగపడకుండ
వేయికన్నులతోడ వెలయఁ జూచుచును
హాయిగాఁ బెరుగుట కాత్మఁ బొంగుచును
వలువలు నగ లాటవస్తువుల్ మఱియు
వలసిన వన్నియు వరుస నిచ్చుచును
దన తిండికైనను దగ్గించి మనకు
దినమును జిఱుతిండి తెచ్చి యిచ్చుచును
మనదేహమున వ్యాధి మఱి యించుకంత
కనఁబడె నేనియుఁ గళవళపడుచు
నడిరేయి యైనను నడచి పర్వెత్తి
వడి గృహంబునకును వైద్యుని దెచ్చి

మందులు వేయించి మాన్పించి తెగులు
తొందరయెల్లను తొలఁగి యామీఁద
నవలికిఁ బనిమీఁద నరిగి నప్పుడును
ప్రవిమలదయతోడఁ బ్రాణంబు లెల్ల
మనమీఁదనే యుంచి మరల నింటికిని
జనుదెంచుతోడనే చాల ముద్దాడి
యెత్తుకొని తిరుగు చెలిమి చూపుచును
విత్తంబు వ్యయపెట్టి విద్య చెప్పించి
మన మెప్పుడును మంచిమార్గంబు నందుఁ
జనునట్లుబుద్ధులు చాలంగ నేర్పి
తనయనంతరమును దడవుగ మనము
ఘనసుఖానందముల్ గలిగి వర్ధిల్ల
హృదయంబునను గోరి యీశ్వరు వేఁడి
ముద మొందుతండ్రిని ముఖ్యంబు గాను
ఘనగౌరవంబునఁ గాంచి ప్రేమించి
మన మాతనియనుజ్ఞ మన్నించి సతము
వినయవిధేయతల్ వెలయించి యతని
మనసు నొవ్వకయుండ మంచిమార్గమున
మెలఁగుచు బుట్టిన మెట్టిన యిండ్ల
కెలమిఁ గూర్పఁగఁ జెల్లు నిలలోన మనము.

బాప్స ముద్రాక్షరశాల, రాజమండ్రి—1950.

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతిమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తకచరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భి విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకనచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతి మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆరవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞ చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 ,, ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హాకృత్యములు
12 నర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము
24 స్త్రీపునర్వివాహ భూత వర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము

అని వ్రాసిన బడయగలరు.

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము-1951

# నీతికథామంజరి

## ప్రథమభాగము




గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు





ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1951


[వెల రు 1-0-0

కీర్తిశేషులైన రావుబహద్దూరు

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

**మొదటి సంపుటము**

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కార గానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషస్వైర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥ భా॥
16 ,, రెం॥ భా॥
17 ,, మూ॥ భా॥

## నాటకములు

**రెండవ సంపుటము**

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయము)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

## భాషాంతరీకృత నాటకములు

**మూడవ సంపుటము**

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసు వర్తకచరిత్రము

## వచన ప్రబంధములు

## పద్యకావ్యములు

**నాల్గవ సంపుటము**

1 సత్యరాజాపూర్వదేశయాత్రలు మొ॥ భా॥
2 ,, రెం॥ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథకవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# నీతికథామంజరి

అను

# ఈసపుకథలు

## ప్రథమభాగము



ఇంగ్లీషునుండి తెనుఁగుభాష కనుకూలముగా నీతిపద్యములతో
వచనరూపమున తెనిఁగింపఁబడినది.

34 పటములతో ప్రకటింపఁబడినది.

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

# విషయసూచిక



పద్యములు.



# నీతికథామంజరి

## ప్రథమభాగము

## 1 గ్రద్ద, పావురము

అనేకపర్యాయములు గ్రద్ద యొకటి పావురములను పట్టుకొనుటకయి ప్రయత్నము చేసి, అవి దొరకక పారిపోయి గూటిలో దూరుచు వచ్చినందున చేసిన ప్రయత్నము విఫలము కాఁగా తరువాత మాయోపాయ మొకటి యాలోచించి వానిని చేరవచ్చి “ఓ పావురములారా! మీరు నామనోభావమును కనిపెట్టలేక నే నేమో మీకు శత్రుపక్షమువాఁడ నని భ్రమపడి నేను దగ్గఱరాఁగానే వృథా భయపడి దూరముగా తొలఁగుచున్నారు. సాధుపక్షులయిన మీకు నిత్యమును సంభవించుచున్న యాపదలకు దుఃఖపడి మీహితము గోరి నే నిప్పుడు మీదాపునకు వచ్చినాను. డేగలు మొదలయినవాని వలన మీకు సదా కలుగుచుండెడి యపాయమునుండి మిమ్ము రక్షింపవలెనన్న సదుద్దేశము తప్ప నామనస్సులో వేఱుచింత లేదు. పనికిమాలిన యవిశ్వాసమును విడిచి మీ రందఱు నన్ను రాజునుగా స్వీకరించెడుపక్షమున మీకు శత్రుభయము కలుగకుండఁ గాపాడి మిమ్మందఱ నాకడుపులోఁ బెట్టుకొని యాదరించెదను” అనిహితోపదేశము చేసెను. ఆపావురము లామాటలకు సంతోషించి యాగ్రద్దను తమరాజునుగాఁ జేకొనుట కంగీకరించి, సర్వస్వాతంత్ర్యముల నిచ్చి గృధ్రమునకు రాజ్యాభిషేకము చేసి తా మాతనిని ప్రభుభక్తి కలిగి సేవించునట్లు ప్రమాణములు చేసెను. అంతట నా గృధ్రరాజు పావు

రములవద్దఁ బ్రవేశించి ప్రజలయొక్క దేహప్రాణములు రాజుయొక్క సొత్తగుటచేత వాని నిచ్చవచ్చిన ట్లనుభవించుట తనకుఁ గల స్వాతంత్ర్యములలో నొక్కటి యని చెప్పి యొక్కొక్క పావురమునే చంపి భక్షింపసాగెను. అందుచేత దినదినక్రమమునపలుచబడి హతశేషము లయినపావురము లన్నియు నొక్కచోటఁ జేరి, స్వభావ మెఱుఁగక పరునికిఁ దమపై నధికార మిచ్చి తమలోఁ దెచ్చిపెట్టుకొన్న పాప ఫల మనుభవింపక తీఱదని విలపింపఁ జొచ్చెను.

గీ. పరుల నైసర్గికగుణంబు లరయకుండ
విశ్వసించిన నాపదల్ వే ఘటిల్లు;
దీర్ఘముగఁ గ్రొత్తవాని శోధింపకుండఁ
బ్రియసఖుం డని యంగీకరింపఁ జనదు.

## 2. తగవులమారి పిల్లులు

ఒకనాఁడు రెండు పిల్లు లొకరియింటి రొట్టె యెత్తుకొనివచ్చి, దానిని పంచుకొనుటకు పాళ్లు తెగనందున రెండును గలిసి న్యాయము పొందుటకయి సభకుఁ బోయెను. ఆసభయం దా మహావ్యవహారమును తీర్చుటకయి మర్కటచక్రవర్తిగారు న్యాయాధికారిగా గూరుచుండి రొట్టెను రెండుముక్కలు చేసి పెద్దముక్క నొక ప్రక్కను చిన్నముక్క నొకప్రక్కను త్రాసునఁ వేసి తూచి, అం దొకటి బరువుగా నున్నందున పెద్దముక్కనుండి నోరుపట్టినంతముక్క కొఱికి న్యాయనిర్ణయమునందు చేతులకేకాక దంతములకుఁ గూడ పని కల్పించెను. అప్పుడు చిన్నముక్క పెద్దది కాఁగా కోతి విచారపడి "అయ్యో! ప్రమాదము సంభవించినదికదా" అని యిప్పుడు పెద్ద దైనభాగమునుండి మఱియొకముక్కను కొఱికి నోటికిని కడుపునకును

మరల పని పెట్టెను. తగవు తీర్చుటయం దద్భుతశక్తిని జూపుచున్న యాన్యాయదాతయొక్క సామర్థ్యమునుబట్టి యొకదానితరువాత నొకటి పెద్దముక్క చిన్నదిగాను చిన్నముక్క పెద్దదిగాను మాటి మాటి కోతికడుపు నిండించుచుండుట చూచి పిల్లులు తమ తెలివి తక్కువ తెలిసికొని "అయ్యో! ఇది యెక్కడిన్యాయము! అంతకంతకు రొట్టె తఱిగిపోవుచున్నది. ఇప్పుడున్న దానిలో చెఱియొకముక్కను మాకిచ్చివేసి మమ్ముం బంపుడు. మేము దానితోనే తృప్తిపొందెదము." అని న్యాయాధిపతిని వేడుకొనెను. "మీరు తృప్తిపొందిన మాత్రమున న్యాయము తృప్తినొందునా? తొందరపడక మీ యుభయులలో నెవ్వరికిని హెచ్చుతగ్గులు రాకుండ మీయిరువురకును పూర్ణమయిన న్యాయము దొరకువఱకును కొంచె మోపికచేయుఁడు. ధర్మాధికారినని కూర్చుండి పక్షపాతము చూపినపక్షమున నన్ను నలుగురును నిందింపరా?" అని పలికి యా యపూర్వ న్యాయాధిపతి యథాప్రకారముగా ముక్కలు కొఱికి తూగడలు దాటించుచు న్యాయమును తీర్పసాగెను. ఇంతవఱకును కోతి రొట్టెముక్కలు మ్రింగుచుండఁగా తాముగుటకలుమ్రింగుచుచూచుచున్న మార్జాలములు శాంతత యంతయు పోగా "అయ్యా! ఇఁక మానిమిత్తము మీ రాయాసపడనక్కఱలేదు. ఈమిగిలిన రవంతముక్కను మాకిచ్చివేసినను మాలో మేము సమాధానపడి యూరకుండెదము. మీవంటి ధర్మదాతలు లోకములో మఱియెవ్వరును లేరు. దుర్బలుల మయిన మమ్మన్యాయముచేయక మీకు తోఁచినంత దయచేసి మమ్ము పంపివేయుఁడు" అని దీనత్వముతో ప్రార్థించెను. అప్పుడు కోతి "అన్యాయ మెవ్వరికిని గూడదు. మీకును నాకునుగూడ న్యాయమే కావలెను. ఇంత సేపటినుండి మీవ్యవహారముయొక్క చిక్కు వదల్చుచు మీనిమిత్తమయి శ్రమపడుచున్నందునకయి యిప్పుడు శేషించియున్న యీ

ముక్క నాది." అని తిన్నంగా మిగిలిన ముక్కను నోర వేసికొని చేతులు దులిపి "మీలో నెవ్వరికిని పక్షపాతము జరుగలేదు. ఇంక శీఘ్రముగా మీయిండ్లకు పొండు" అని తగవు తీర్చి తాను లేచి పోయెను.

గీ. వడిగ సభ కెక్కి తగవులు పడెడువారు
చెలియుచుకొందురు తమలొంటిస్థితినిగూడ,
ఒకరి కింత నష్టం బైన నోర్చి సభకుం
బఱవ కింట సమాధానపడుట యొప్పు.

# 3. ఆడుసింహము, నక్క

ఒకనాండొకసింహమును నక్కయు కలిసి మాటాడుకొను టలో సంతానమును గూర్చి ప్రసంగము వచ్చెను. ఆప్రస్తావనలో నక్క సంతానవిషయమున లోకములోని సమస్తజంతువులలోను తమజాతి మిక్కిలి ధన్యమయిన దనియు, తమకు కడుపు చక్కంగా ఫలించి ప్రతిసంవత్సరమును మూడునాలుగేసి పిల్లలచొప్పున సంతాన లాభము కలుగుచుండుననియు, చెప్పి "కొందరు భాగ్యశాలు లీలోక ములో రెండుమూడుతడవులకంటె నెక్కువగా బిడ్డలను కన నోచు కొకపోయినను, ఆ కన్నప్పుడైన నొక్కకూనకంటె నెక్కువ పెట్ట లేకపోయినను, తమయంతటివా రొరులు లేరని గర్వము చేత విఱ్ఱ వీంగి యితరులను దమకంటెం దక్కువగాం జూచుచుందురు." అని సింహమునకు తాంకునట్లుగా నెగతాళిచేసెను. సింహ మాపరిహాస మును గ్రహించి రోషముతో, "నీవన్నమాట సత్యమే కావచ్చును. అయినను కొంద అట్లు గర్వపడుటకు హేతువులేకపోలేదు. నీవన్ని సారులు పిల్లలం బెట్టినను పెట్టినపుడెల్ల నెన్నేసిపిల్లల నీనినను నీ

కడుపునఁ బుట్టిన వన్నియు నక్కకూనలే. నే నొక్కసారియే బిడ్డను కన్నను నాకడుపునఁబుట్టిన దొక్కటియు సింహపుపిల్ల." అనియుత్తర మిచ్చెను.

గీ. శక్తి లేనట్టి దుష్పుత్రశతముకంటె
గుణయుతుం డైనవాఁ డొక్కకొడుకె మేలు ;
ఉత్తమగుణంబు లేకున్న, నొక్కగొప్ప
వంశమునఁ బుట్టినంతనె వాసి లేదు.

---

## 4. పిల్లి, నక్క

ఒకనాఁ డొకయడవిలో పిల్లియు నక్కయుఁ గలిసి యాత్మరక్షణోపాయములనుగూర్చి మాటాడుకొను చుండగాఁ నక్క "నాకు వేయిమాయలు తెలియును. కాఁబట్టి శత్రువులు తారసించినప్పుడు నే నేమాయోపాయము చేతనైన తప్పించుకోఁగలను శత్రుభయము కలిగినప్పుడు నీ వెట్లు ప్రాణరక్షణము చేసికోఁ గలుగుదువు?" అని పిల్లి నడిగెను. "మిత్రుఁడా! నా కొక్కయుపాయముమాత్రము తెలియును. నాకు తెలిసిన యాయొక్కయుపాయమును తప్పిపోయిన యెడల నేను ప్రాణములకు నీళ్ళు వదలుకోవలసినవాఁడనే" అని పిల్లి చెప్పెను. "పరితాపకరమయిన నీదుస్థితికి నా మనస్సు ఖేదపడు చున్నది. కానిమ్ము. నీయసహాయస్థితికి చింతిలఁబోకు. సమయము వచ్చినప్పుడు నాయుపాయములలో నొకటిరెంటి నీకు నేర్పెదనులే." అని నక్క పిల్లి నూఱడించు చుండెను. ఈమాటలు నోట నుండఁ గానే యచ్చటికి వేటకుక్కలు పరుగెత్తుకొనివచ్చెను. అప్పుడు పిల్లి తనకుఁ దెలిసిన యొక్కవిద్యతోను శీఘ్రముగా చెట్టుమీఁది కెగఁ బ్రాకి తనప్రాణములు కాపాడుకొనెను. నక్కమాత్రము తా నెరిగిన

కోటి విద్యలతోను రక్షణమార్గమును గానక కొంతదూరము పరు గెత్తి తుదకు కుక్కలకు చిక్కి ప్రాణములు విడిచెను.

గీ. బూటకము లైనవిద్యలు నూటికంటె
నుత్తమం బైనసద్విద్య యొకటి మేలు;
ఎల్లవిద్యల నింతవ్రే లిడుటకంటె
నొకటి చక్కఁగా నేర్చిన నొదవు సుఖము.

## 5. పంది, తోడేలు

పిల్లలపంది యొకటి తనపిల్ల లెల్లను చుట్టునుజేరి యాడుకొను చుండఁగా వేడుక చూచుచు వాని సమీపమునఁ గూరుచుండెను. అప్పు డాదారిని బోవుచున్న తోడే లొక్కటి పందిపిల్లలను జూచి వానిలో నొక్కదానిని తన గర్భమునందుఁ జొప్పింపవలె ననియెంచి, తనకోరిక తీర్చుకొనుటకు మార్గము కానక వానితల్లితోస్నేహముచేసి తదనుగ్రహసంపాదనము చేయఁదలఁచి మెల్లగా సమీపమునకు వచ్చి "ఓ యిల్లాలా! నీవు బిడ్డలతో సుఖముగా నున్నావా? గంపెడుపిల్ల లను నిన్నును చూచుటచేత నాకు కన్నులు పండువుగానున్నది. ఈ పిల్లలను రక్షించుటలో నీకు నావలని తోడ్పా టేమైనఁ గావలసియున్న యెడల వీనిని నాకడుపులోఁ బెట్టుకొని నీకు మాఱుగా పెంచుటకు నేను సిద్ధముగా నున్నాను. నీకిష్టమున్నయెడల నీబిడ్డలను నాకొప్ప గించి నీవు కొంచెముసేపు దూరముగాఁ బోయి మంచిగాలి యనుభ వించి రావచ్చును" అనితనశిశువాత్సల్యమునుగనఁబరిచెను. "అయ్యా! మీ హృదయములోని దయారస మంతయు నాకు బోధపడినది. నావంటి యల్పులు తమవంటి పెద్దల కాయాసము కలుగఁజేయుట యపచార మగును. తమరు క్షేమసమాచారమును విచారించుటకయి

తఱుచుగా శ్రమపడి యిక్కడకు విజయం చేయకుండుటయే నాయభిమతము. కాఁబట్టి మీకు మామీఁద నిజమగునయనుగ్రహ మున్న పక్షమున, మీరు మఱియెప్పుడును మాకు దర్శన మియ్యక మీ చాటున మ మెప్పటిగా బ్రతుకనిండు. ఇదియే మీరు మాకుఁ జేయవలసిన మహోపకారము'' అని ప్రార్థించి పంది తోడేలును సాగనంపెను.

గీ. క్రొత్తవారలు తమయంతఁ గూర్మి చూప
వత్తు రేనియు శంకింపవలయు వారి;
బాలు రన్యులయుపచార వాక్యములను
శీఘ్రముగ విశ్వసించుచుఁ జెడుదు రిలను.

## 6 గుఱ్ఱము, గాడిద

యుద్ధభూమికిఁ గొనిపోవుటకు మంచిజీను కట్టి యలంకరించుటచేత సంతోషము పట్టఁజాలక పర్వతగుహలు మాఱు మ్రోయునట్లుగా సకిలించుచు గుఱ్ఱ మొకటి నానాముఖముల పరుగులెత్త మొదలుపెట్టెను. అప్పుడు పెద్దబరువు మీఁద వేసికొని మోయలేక కాళ్ళీడ్చుకొనుచు నడుచుచున్న గాడిద యొకటి మార్గమధ్యమున దాని కంటఁబడెను. ఆగార్దభమునుజూచి గుఱ్ఱము మహాగర్వముతో "నీవు దారి తొలఁగి దూరముగా పో. నీమందగమనము విడిచి వేగిరము కదలలేకపోతివా నీవు నాకాలిక్రిందబడి నలిగిపోదువుసుమా.'' అని పరిహాసముగాఁ బలికెను. గర్వాంధతచేత క్రిందుచూడక గంతులు వేయుచున్న గుఱ్ఱముము దర మారుమాట పలుకుటకు సాహసింపక యాగాడిద మెల్లఁగా నొకమోర కొత్తిగిలి దానికి దారి యిచ్చెను. ఇట్లు జరిగిన కొంతకాలమున కాగుఱ్ఱము యుద్ధములో

గాయపడి కుంటిదయి యొక కాపువాని కమ్మంబడి వాఁడు తనమీఁద మాటలు వేసి తోలుకొనిపోవుచుండఁగా కుంటికాలితో మెల్లఁగా నడుచుచు మరల నాగాడిద కెదురుపడెను. అప్పు డాగాడిద ప్రతి సత్కారము చేయుటకు తన కిప్పుడు వంతువచ్చినదని భావించి "ఓ మిత్రుఁడా!" అని పిలచి, "నాఁడు నానడకను జూచి పరహసించిన మహానుభావులు కారా తమరు? అప్పటి తమ గర్వమును జూచి తమ కెప్పుడో యిట్టియవస్థ పట్టునని నేను నాఁడే నామనస్సులో ననుకొన్నాను" అని పలుకరించెను.

గీ, ముందు గర్వంబు నడవ, నెప్పుడును దాని
వెనుక నే యవమానంబుఁ జనుచునుండు;
గర్వితుని కాపద యొకింత కలుగు నేని,
ఉల్లముల సంతసిల్లుదు రెల్లజనులు.

# 7. తోడేలు. మేక. గొఱ్ఱెపిల్ల

ఒకదినము మేఁక యొకటి గొఱ్ఱెపిల్లకు పాలిచ్చుచుండఁగా తోడేలు చూచి "ఓ వెఱ్ఱిశిశువా ! ఇది నీ కన్నతల్లిగాదు. అదిగో నీ తల్లి యక్కడ మందలో మేయుచున్నది. అక్కడకు పోదము రా" అని దూరముగానున్న యొక గొఱ్ఱెలమందను జూపెను. "అయ్యా! మీరిప్పుడు చూపినది నాతల్లియే కావచ్చును. అయినను పుణ్యాత్మురా లయినయీ మేఁకయే నన్నుఁ జిన్నప్పటినుండియు పుత్ర ప్రేమతోఁ బెంచుచుండుటచేత దీనినే నేను తల్లినిగా భావించుకొను చున్నాను. ఈమేఁక తనకన్నబిడ్డలకయినఁ గొంచెముపాలు తక్కువ చేసి నాకేలోపమును గలుగకుండ పాలిచ్చి పెంచుచున్నది. కాఁబట్టి యిట్టిపుత్రవాత్సల్యముతో నన్నుఁగాపాడుచున్న యీమేఁక

యొద్దనే నేనుండి దీనికే మాతృభక్తిని జూపెదను'' అని యాగొఱ్ఱె పిల్ల మాఱుపలికెను.

గీ. బాగుగాఁ దనసుతులఁ గాపాడనట్టి
వారు లోకంబులోఁ బశుప్రాయు లెపుడు ;
విద్యయును బుద్ధి చెప్పించి పెంచువారి
యెడఁ గృతజ్ఞులై బాలురు నడవవలయు.



## 8. కాకి, నక్క

కాకి యెక్కడనుండియో యొకమాంసఖండమును నోర కఱచుకొని వచ్చి చెట్టుకొమ్మమీఁద కూరుచుండఁగా నక్క చూచి, యేలాగునైనఁ దా నామాంసము నపహరింపవలె నని మెల్లఁగా చెట్టుక్రిందికి వచ్చి కాకిని పిలిచి "అన్నా! నీసౌందర్య మే మని చెప్పను! నీదేహముయొక్క నీలమేఘచ్ఛాయ యేమి! చక్రములవంటి కన్నుల యంద మేమి! వింజామరలవంటి నీరెక్కలసొగసేమి! హంస వంటి నీనడక యేమి! ఆహా! ఏమి నాభాగ్యము! నీరూపము చూచినకొలఁదిని నాకు నేత్రోత్సవ మగుచున్నది! ఒక్క చక్కఁదనమే కాదు. భూమిమీఁద నీతో సరిగా మధురరుతము చేయుపక్షి సహితము మఱియొకటి లేదు. నీ వొక్కసారి నీ గానామృతమును

కూడ వర్ణించి నా చెవులపండువు చేసితివా, లోకములో నాయంతటి ధన్యుఁ డుండఁడు'' అని ముఖస్తుతి చేసెను. ఆపొగడ్త కుబ్బిపోయి దేహము పరవశము కాఁగా, కాకి తనసంగీతమునుకూడ వినిపించి శాశ్వతకీర్తిని సంపాదింపవలెనని యెంచి నోరు తెఱచి కావు కావు మని కూసెను. కాకి నోరు తెఱవఁగానే మాంసము క్రిందపడినందున నక్క చటుక్కున దానిని నోట కఱచుకొని "ఓసి పిచ్చిదానా! నే నింతసేపును నిన్నూరకే పొగడితి ననుకొన్నావా? నావచ్చినపని నాకయినది గనుక, ఇఁక నీపాట నీవే యుంచుకో. నీవంటికురూపిని స్వలాభములేక యెవ్వరు స్తుతింతురు?'' అని తనదారిని పోయెను.

గీ. వసుధలోపల నరులను బాడుచేయ
స్తోత్రపాఠకుల మంచుశత్రువులు లేరు.
లాభ మొంద ముఖస్తుతు ల్సలుపువారి
వలలఁ దగులక కనుగల్గి మెలఁగవలయు.

---



## 9. నెమలిని పక్షిరాజునుగా జేయగోరుట

పూర్వకాలమునం దొకసారి తమకు రాజు నేర్పఱుచుకొనుట కయి పక్షులన్నియు నొకచోట సభచేసి యెవరిని రాజునుగా నేర్ప ఱుచుకొందుమా యని యాలోచించుకొనుచుండెను. అప్పు డనేక

పక్షులు వచ్చి పక్షిరాజ్యాధిపత్యమునకు తామే యర్హులమని బయలు దేఱి తమతమసామర్థ్యములను సభవారితోఁ జెప్పుకొనసాగెను. అప్పుడు నెమలి వారివద్ద నిలిచి తనసౌందర్యమును వారికిఁజూపి, చిత్రవర్ణములుగల పురి విప్పి వారిఎదుట మనోహరముగా నృత్యము చేసి తన నాట్యకౌశల్యమును గనఁబఱచి, పక్షిరాజ్యమునకుఁ దన్ను పట్టము కట్టవలసినదని వారిని ప్రార్థించెను. అవన్నియును చిన్నెలును జూచి భ్రమించి విశేషసంఖ్యగలపక్షులు పక్షిరాజ్యమును నెమలికే యియ్యవలసినదని నిర్ధారణము చేసెను. అంతటి మంచిరాజు తమకు లభించినందునకయి పరమానందముఁబొంది పక్షు లన్నియు ఱెక్క లెగరవైచుచు రాజ్యాభిషేకమహోత్సవమునకయి ప్రయత్నించు చుండఁగా, ఆగుంపులోనుండి చిలుక యొక్కటి పైకి వచ్చి స్వభావ మనోహరమయిన తినసుస్వరముతో సభవారి నుద్దేశించి యిట్లని యెను. "మీరందఱును జేరి యసమానసౌందర్యము గలమయూర మును పక్షిరాజ్యాధిపతినిగాఁ జేయ నిశ్చయించినందుకు నాకెంతో సంతోషముగా నున్నది. ఐనను నామనస్సు నొక్కసందేహము మాత్రము బాధించుచున్నది. మన మిప్పుడీనెమలిని రాజునుగా నేర్ప ఱచుకొని మనధనప్రాణముల నీతనియధీనము చేయుచున్నాము. రాజువలనఁ గలుగవలసిన ముఖ్యఫలము ప్రజల రక్షణము గదా! ప్రజారక్షణము చేయలేని రాజుండుటవలన నేమియు ప్రయోజనము లేదు. రేపటినుండి డేగలు గృధ్రములు మొదలయిన క్రూరపక్షులు మనమీఁద దాడివెడలి మనలను సంహరించి భక్షింప మొదలుపెట్టి నప్పుడు తా నడ్డపడి మన ప్రాణములు కాపాడఁగలుగునేమో యీ రాజు నడిగి మఱి పట్టాభిషేకమహోత్సవము నడపవలెనని నాప్రా ర్థన". ఆమాటలు విని పక్షు లన్నియు నొండొరులమొగములు చూడ మొదలుపెట్టెను. నెమలియు తగినప్రత్యుత్తరమును జెప్పఁ

జాలక క్రిందు చూచుచు నూరకుండెను. అంతట పక్షు లన్నియు తెలివి తెచ్చుకొని నెమలికి పక్షి రాజ్యమిచ్చుట మానుకొనెను.

గీ. శక్తి చూడక బాహ్యవేషముల బ్రమసి
నరుల గౌరవార్హులఁ గాఁగ బరిగణింత్రు ;
కోటి పామరు లాడెడుమాటకన్నఁ
దెలివి గలమర్త్యుఁడొకఁడాడుపలుకు లెస్స.

---

## 10. ఏదుబంది, పాములు

ఒకగుహలో పాము లనేకములు వసించుచుండఁగా, ఏదుఁబంది యొకటి యక్కడకు వచ్చి తాను విశ్రాంతిపొందుటకు కొంచెము తా విండని వేడుకొనెను. అపాతోలు కొంచె మొత్తిగిలి యిక్కడ నుండు మని దాని కొకమూల కొంచెము చోటిచ్చెను. ఆ యేదుఁబంది లోపల ప్రవేశించిన తరువాత మెల్ల మెల్లఁగా లోపలికి జరిగి పాములమీఁదికి రా నారంభించెను. ఏదుపందిముండ్లు గ్రుచ్చుకొన మొదలుపెట్టినందున సహింపలేక యాపాములు దాని నావలికి పొమ్మని యడిగెను. అప్పు డాఏదుబంది పాములను లక్ష్యము చేయక యాగుహలో తన కేమియు నిబ్బంది లేక సుఖముగానే యున్నదనియు, ఎవ్వరి కిబ్బందిగా నున్నదో వారే గుహను విడిచి మఱియొక చోటు చూచికొనుట యుచితముగా నుండుననియు చెప్పి, ముండ్లు గ్రుచ్చుకొనునట్లుగా మఱింతమీఁదికి జరగసాగెను. అప్పు డాపాములు మొట్టమొదట దానికి తా విచ్చినందుకు పరితాపపడ వలసి వచ్చెను.

గీ. నరులు బతిమాలుకొని తోల నొరులచెంతఁ
జేరి పిదప వారికె కీడు చేయు చుంద్రు ;
కావునను బుద్ధిమంతులు కన్ను గలిగి
దుష్టులను జెంత జేర్పక తొలఁగ వలయు



## 11. దుర్మార్గపు కప్ప

ఒకనాఁ డొక యెలుక యొకయేటిని దాటుటకయి యాలోచించుచు గట్టున కూరుచుండి యుండెను. అప్పు డొక కప్ప నీటిలో నుండి పయికి వచ్చి, ఎలుకను వచ్చిన కార్య మడిగి తెలిసికొని దానిని మోసము చేయవలెనని నిశ్చయించుకొని, "ఓయెలుకబావా! నీవు కాలి కొకదారము కట్టుకొని యాదారపుకొనను నామొలకు గట్టిగా కట్టివేసినయెడల, నీవీదవలసిన యాయాస మక్కఱలేకుండ నేను నిన్నావలిదరికి సులభముగాఁ జేర్చెదను" అని చెప్పెను. ఆమాటల కెలుక సంతోషించి యొప్పుకొని చెప్పినట్లుచేసి నీటిలో ప్రవేశించెను. కప్ప దానిని కొంచెము దూర మీడ్చుకొని పోయి లోతునీట ప్రవేశించినతరువాత తా నడుగునకు మునిఁగి దానిని ముంచ నారంభించెను. అదిచూచి యెలుక "ఓకప్పబావా! నన్ను ముంచివేయుచున్నావేమి ?" అని యడిగెను. "ఓబుద్ధిహీనుఁడా! నాచేత పని చేయించుకో సాహసించినందుకు నిన్ను ముంచివేసి మీ మూషకజాతి కెల్లను బుద్ధివచ్చునట్లు చేసెదను. చేతనయినపక్షమున నీ ప్రాణ

ములు కాపాడుకొమ్ము" అని మఱింతవడిగా నీటియడుగునకు లాగ మొదలుపెట్టెను. అప్పు డాకాశమున నెగురుచున్న డేగ యొకటి నీటి పైన కొట్టుకొనుచున్న యామెలుకను జూచి దానిని కాలితో తన్ను కొని పయి కెగిరెను. డేగయొక్క కాలిడ్రేళ్ళసందున నిఱుకుకొన్న యెలుక కాలిదారముతోడఁ గూడ కప్పయు వ్రేలాడుచు పయికి లేచి వచ్చెను. అది చూచి యద్భుతపడి డేగ కప్పను జూచి "ఓ మండూకరాజా ! మీ రేల దయచేసినారు ?" అని యడిగెను. "నావిధి నన్నిక్కడకుఁ దీసికొనివచ్చినది. నేనీయెలుకను నీటిలోముంచి చంపవలెనని యత్నించినాను; ఇప్పుడు నీటిపయికి వచ్చి నేనే చచ్చు చున్నాను" అని కప్ప యుత్తరము చెప్పెను. "నీవు చేసినమోసమున కయి నిన్నుమాత్రమే చంపి భక్షించెదను" అని చెప్పి యాడేగదానిని ముక్కుతో పొడిచి చంపుకొని తినెను.

గీ. అన్యులను మోసపుచ్చంగ నరయువారు
తామె మోసపోవుదు రెందు ధరణిలోన ;
పరులకు గీడు రోసెడువారలకును
మేలు చేయునె దైవంబు మేర మీఱి ?

---



## 12. బంగారుగుడ్లుపెట్టు బాతు

ఒక మనుష్యునియొద్ద నొక బాతుండెను. అది ప్రతిదినమును ఒకబంగారుగుడ్డు పెట్టుచుండును. వాఁడు దానితోఁ దృప్తిపొందక

యత్యాశ గలవాఁడయి ఒకఁ డొంటిగా తనలో తా నాలోచించి దానికడుపులోనున్న బంగారుగుడ్ల నన్నిటిని ఒక్కసారిగాఁ దీసికొని భాగ్యవంతుఁడు కావలె నని నిశ్చయించి, కత్తి తీసికొనివచ్చి దాని కడుపు కోసెను. దానికడుపు పరీక్షించి చూడఁగా నాకడుపులో నొకగ్రుడ్డును లేకపోయెను. అప్పుడు వాఁడు తనబాతును నిష్కారణముగా చంపుకొన్నందునకు మిక్కిలి ఖేదపడి, మునుపు ప్రతిదినమును వచ్చుచుండెడు గుడ్లుకూడ పోయెనుగదా యని పరితాపపడ మొదలు పెట్టెను.

గీ. లోకమున దురాశఁ గొని యనేకమనుజు
లరయ కవివేకకార్యంబు లాచరించి
మున్ను గలదానిఁగూడఁ గోల్పోయి యవలఁ
గ్రొత్తయాపదలను దెచ్చుకొందు రకట!



## 13. తెలివిమాలిన దుప్పి

ఒకనాఁ డొక దుప్పి వేసవికాలములో మధ్యాహ్నవేళను చెఱువులో నీరు త్రాగుచు, తేటనీటిలో తనరూపమును జూచుకొని కొమ్ములయొక్క సౌందర్యమునకు మిక్కిలి యాశ్చర్యపడి నీటిలో

నిలుచుండి యిట్లాలోచించుచుండెను.—"ఆహా! అనేక శాఖలతోఁ గూడి యీకొమ్ము లెంత యాశ్చర్యకరముగా నున్నవి! ఇటువంటి చక్కనికొమ్ము లున్నందుకు భగవంతుఁడు నాకీగడకఱ్ఱలవంటి ఊచకాళ్ళను బెట్టక పొట్టికాళ్ళను బెట్టియున్నపక్షమున నావంటి చక్కని జంతువు లోకములో మఱియొకటి యుండునా? అవివేకి యైనదేవుఁడు నాకీలోపమును గలుగఁజేసినాఁడు"—అని యాలోచించు చుండఁగా, వేఁటగాఁడొకఁడును కొన్ని వేఁటకుక్కలును దుప్పికి నేత్రగోచరము లయ్యెను. ఆదుప్పి కుక్కలను జూచి భయపడి నీరు వెడలివచ్చి కాళ్ళుజాడించి వాయువేగమున నరణ్యములోనికి పరుగెత్తి నిమిషములో నదృశ్యమయ్యెను. కాని యడవిలో పరుగెత్తుచుండఁగా కొమ్ములు చెట్లకొమ్మలలోను తీఁగెలలోను తగులుకొని పరుగెత్తలేక కుక్కలచేత పట్టుకోఁబడి దుప్పి ప్రాణములు విడుచుచు మరల నిట్లు చింతించెను. "అయ్యో! నేను పనికిమాలిన వనుకొన్న కాళ్ళే నాప్రాణము రక్షించి క్షణకాలములో నన్నింతదూరము తెచ్చినవి; ఇంతలో నేనెంతో మెచ్చుకొన్న నాకొమ్ము లడ్డము వచ్చి నన్నిక్కడ నిలుపకపోయినపక్షమున కాళ్ళసహాయ్యమున నేను బ్రతికిపోదును." అనుకొనుచు ప్రాణములు విడిచెను.

గీ. బుద్ధిహీనులు కొంద ఱీపుడమియందు
నీశ్వరునిబుద్ధిమహిమంబు నెఱుఁగలేక
ఘనుల మనుకొంచు నీశ్వరాజ్ఞలను మీఱి
దేవు నపహసించుచుఁ గీడు తెచ్చుకొంద్రు.



## 14. కప్పలు రాజును గోరుకొనుట

చెఱువులలోను గుంటలలోను విచ్చలవిడిగా తిరుగుచు సుఖముగా నుండి యొకనాఁడు కప్ప లన్నియు నొక చెఱువువద్దఁ జేరి యఱచుచు సభ చేసి తమకు రాజు కావలెనని యింద్రుని ప్రార్థించెను. ఇంద్రుఁడు వాని ప్రార్థన విని పైనుండి యొకదుంగను చెఱువునడుమను గుభిల్లున నీటిలో పడవేసి, అదియే మీరాజని చెప్పెను. అంతయెత్తు నుండి పడినప్పుడు పయికి లేచిననీరుఁజూచి తమరా జెంతబలవంతుఁడో యని భయపడి కప్పలు మొట్టమొదట సమీపమునకుఁ బోవుటకే జడియుచు భయభక్తులు కలిగియుండెను. కాని యటుతరువాత తమ రాజు కదలమెదలక యొకచోటనే యుండుట చూచి కొంతభయము తీఱి కప్పలు మెల్లమెల్లగా సాహసించి దాని సమీపమునకుఁ బోసాగెను. అప్పుడును తమరాజు కదలమెదలకుండుట చూచి యందొకటి దానిని పరమసాధువునుగా భావించి తాఁకిచూచెను; మఱి యొకకప్ప దానిని తాఁకినను భయము లేదనుకొని మీఁదికి దుమికెను. అటుతరువాత నొకటొకటే కప్పలన్నియు దానిమీఁద నెక్కి నిర్భయముగా నాట లాడసాగెను. ఈప్రకారముగాఁ గొన్నిదినములు జరిగినతరువాత తమ కింద్రుఁడు మంచిరాజు నియ్యనందున కతృప్తి కలవయి, కప్పలు మరల సభ చేరితొంటికంటె ద్విగుణముగా నఱచుచు

తమకు దుంగరాజు పనికిరాలేదనియు చులుకుఁదనముగల రాజును ప్రసాదింపవలయు ననియు తమకోద లాకాశ మంటునట్లు మరల నింద్రుని ప్రార్థించెను. అప్పు డింద్రుఁడు తలుచుగా తనకు తొందర కలుగఁజేయుచున్నందునకయి వానిమీఁద కోపమువహించి వానికి రాజునుగా నొక కొంగరాజును బంపెను. ఆబకేంద్రుఁడు తనకు రాజ్యము రాఁగానే యపరిమితసంతోషముతో వచ్చి ప్రజలమీఁదఁ బడి కావలసినన్ని కప్పలను యథేచ్ఛముగా ప్రతిదినమును భక్షింప సాగెను. ఇట్లు తమ మొఱ్ఱ నాలింపక దొరకినవాని నన్నిటినిపట్టి భక్షించుచుండఁగా నానాటికి పలుచనయి తమరాజున కగపడకుండ మూలమూలల దాగుచు, ఇఁకను కొన్నాళ్ళీరాజే యున్నపక్షమునఁ దమకు ప్రళయము సంభవించునని భయపడి, కప్పలన్నియు రహస్యముగా నొకచోటఁజేరి క్రూరుఁడయిన యీరాజును దీసివేసి వేఱొక రాజు ననుగ్రహింపవలయుననియు, లేనియెడల వెనుకటిరాజునే మరల ప్రసాదింపవలయు ననియు, బహువిధముల నింద్రునిఁ బ్రార్థించెను. అప్పు డింద్రుఁడు వానిప్రార్థనల నంగీకరింపక మీరు కోరి తెచ్చు కొన్నరాజును తొలఁగింపఁగూడదనియు స్వయంకృతాపరాధఫలము ననుభవింపవలసినదనియు చెప్పి పంపివేసెను.

గీ. క్షితితలంబునఁ దమమంచిస్థితినిఁగూర్చి
తృప్తినొంద కత్యాశ వహించి యెపుడుఁ
జాల వ్యర్థప్రయత్నముల్ సలుపువారు
పెక్కుకష్టంబులను దెచ్చి పెట్టికొంద్రు.

# 15. తాబేలు, కుందేలు

ఒకనాఁ డొకతాబేలు మెల్లఁగా ప్రాఁకుచుండఁగా జూచి కుందే లొకటి దానివద్దకువచ్చి దానినడకను పరిహసించెను. అందు మీఁద తాబేలు రోషము తెచ్చుకొని, పందెము వేసినయెడల నీతో సమానముగా నేను పరుగెత్తఁగల నని కుందేటితో పలికెను. ఆమాటలకు పక పక నవ్వి మంచిదని కుందేలు పందెమున కొప్పు కొని, ఒక క్రోసుదూరములోనున్న మఱ్ఱిచెట్టువద్దకు పరుగెత్తవలెనని చెప్పెను. మంచిదని ప్రయాణమయి కూర్మము మెల్లగా కాళ్ళీడ్చు కొనుచు నడవ నారంభించెను; చెవులపిల్లి వాయువేగమున పరుగెత్తి నిమిషకాలములో నరక్రోసుదూరముచేరి, వెనుక తిరిగిచూచి తాబే లించుమించుగా బయలుదేఱినచోటనే యుండుట కనిపెట్టి, అది వచ్చులోపల నింతలో నొకనిద్ర తీసి తరువాత పరుగెత్తవచ్చు నని యెంచి యొక చెట్టునీడను పరుండి సుఖముగా నిద్రపోయెను. కుందే లీప్రకారముగా గాఢనిద్ర పోవుచుండఁగా తాబేలు విడువక మెల్లఁగా నడిచి సంకేతస్థలమును జేరి పందెమును గెలిచెను. కుందే లంతట మేల్కని యులికిపడిలేచి తొందరగా పరుగెత్తెనుగాని యాలోపలనే కార్యము మించెను.

కీ. నడుమ విడువక పని నల్ల నడపువారె
కార్యసిద్ధిని గాంతురు గాని, మంచి
తఱిని నిద్రించి తరువాతఁ దమకపడుచుఁ
బరుగు లిడువారు ఫలసిద్ధిఁ బడయ రెపుడు.



## 16. పులి, నక్క

విలువిద్యయందు మిక్కిలి నేర్పరియైన వేటకాఁ డొకఁ డరణ్యమునందుఁ బ్రవేశించి బాణములు పఱపి వేటాడ మొదలుపెట్టఁగా మృగము లన్నియు భయపడి నానాముఖముల పరు గెత్తఁజొచ్చెను. అప్పు డొక్క పెద్దపులి వానిముందు నిలిచి భయపడి పాఱిపోవలదని మృగములకు ధైర్యముచెప్పి, అన్యసాహాయ్య మక్కఱలేక తానే యా వేటకాని నెదిరించి పాఱఁదోలి మృగములను రక్షించెదనని వానికభయహస్త మిచ్చెను. ఈమాటలు పులి పలుకుచుండఁగానే యింతలో వేటకాఁడు చెట్టుమీఁదినుండి గుఱిచూచి పులియొక్క వీపున నాటునట్లుగా నొక వాఁడిబాణమును విడిచెను. ఆబాణము వెన్నున నాటినతోడనే పులి వేదనకు సహింపలేక నోరు తెఱచి పండ్లుపయికిఁ బెట్టి మూలగసాగెను. అప్పు డొకనక్క ముందుకువచ్చి వ్యాఘ్రమును జూచి "వేటకానిని శిక్షించి మృగములను రక్షింప దీక్ష వహించిన దేవరవారి నిట్లు నొప్పించిన హీనుఁ డెవ్వఁడు?" అని ప్రశ్న వేసెను. "నేను భ్రాంతిపడినాను. మృత్యుదేవతవలెఁ జెట్టుమీఁదఁగూరుచుండి బాణములు విడుచుచున్న యీ వేటకాఁడు నేననుకొన్నట్లు సామాన్య శత్రువు కాఁడు." అని పులి యుత్తరమిచ్చెను.

గీ. కొండబల మెంత యున్నను గండడంచు
బుద్ధిబల మెక్కుడుగఁగల్గు పురుషవరుఁడు;
దేహబలమునకంటెను ధీబలంబె
శ్రేష్ఠతర మెల్లగతులఁ దర్కించి చూడ.

## 17. ఆబోతులు, సింహము

నాలు గాఁబోతు లొకపొలములో మిక్కిలి మైత్రికలవై యొం డొంటి నెప్పుడు నెడఁబాయక యొక్కచోట నేమేయుచు నొక చెట్టు నీడనే శయనించుచు నత్యంతైకమత్యముతో విహరించుచుండెను. ఆ బలిసినవృషభములను జూచి యొకసింహము నోటియూటలుద్రావుచు వాని నేలాగున్నను దనకడుపులో వేసికొనవలెనని చిరకాలమునుండి కోరుచుండెను. కాని వానియైకమత్యమునుజూచి భయపడి, వానిలో బ్రత్యేకముగా నొక్కొక్క దానిమీఁదఁబడి సంహరించుటకుఁ దనకు శక్తిగలిగియున్నను నాలిగింటితో నొక్కసారిగాఁ బోరాడుటకు శక్తి చాలనిదయి యాసింహము వాటిదాపునకుఁ బోవుటకు సాహసింప కుండెను.అయినను సింహ మంతటితో నిరాశచేసికొని యూరకుండక యీయైకమత్య మున్నంతవఱకు వానిని సాధించుట యసాధ్యమని యెఱింగినదయి యేయుపాయముచేతనైన వానియైకమత్యమునకు భంగము గలిగించి వానిని వేఱుచేసి తన మనోరథము నీడేర్చుకోవలెనని నిశ్చయించుకొనెను. అట్లు నిశ్చయము చేసికొని సింహ మప్పటినుం డియుఁ బని కారంభించి, ఒకదానికిఁ దెలియకుండ నొకదాని చెవిలో నితరవృషభములమీఁద కొండెములు చెప్పుచుఁ గొంతకాలమునకు వాని మనస్సులలో నన్యోన్యద్వేషమును బరస్పరాసూయయు నంకు రించునట్లు చేసెను. అది కనిపెట్టి సింహము సమయముచూచి ప్రతి

దినమును వానిచెంతఁజేరి యిచ్చకపుమాటలు చెప్పి వానిమనస్సులో నుదయించిన ద్వేషాగ్నిని రగులుకొలుపుచుండఁగా, కొంతకాలమునకు వృషభములు తొంటియైకమత్యమును బోఁగొట్టుకొని యొండొంటియుత్కర్షమున కసూయపడుచు దూరదూరములఁ దొలఁగుచు తుదకొండొంటి నెడఁబాసి యొంటిగాఁ దిరుగసాగెను. అప్పుడు తన మనోరథము సఫలమయినందుకు సంతోషించి సింహము వేఱువేఱ వానిమీఁద బడి యొకదానితరువాత నొకదానినిగా చంపి వాని మాంసముతో నాప్యాయనముగా విం దారగించెను.

గీ. అరసి చూడంగ నైకమత్యంబుతోడ
నుర్వి సరివచ్చుబలము వేఱొకటి లేదు
ధర నసూయచే నైకమత్యంబు విడుచు
జనులు సుఖసాధ్యు లగుదురు శత్రువులకు.



## 18. గొఱ్ఱెపిల్ల, తోడేలు

ఒకనాఁ డొక గొఱ్ఱెపిల్లయు తోడేలును ఏకకాలమునందు దాహము తీర్చుకొనుటకయి యొకయేటియొద్దకు వచ్చుట తటస్థించెను. ప్రవాహమునకు పైభాగమునఁ గొంతదూరములో తోడేలును

క్రిందిభాగమునఁ గొంతదూరములో గొఱ్ఱెపిల్లయు నీరు త్రాగుచుం డెను. అప్పుడు తోడే లాగొఱ్ఱెపిల్లను జూచి దానితో కలహముపెట్టు కొనదలఁచి కోపదృష్టితో "పానమునకు పనికిరాకుండ నేను త్రాగు చున్న నీ రిట్లేల కలఁచి పాడు చేయుచున్నావు" అని యడిగెను. ఆ మాటలకు భయపడి గొఱ్ఱెపిల్ల "స్వామీ! మీరు ప్రవాహమునకు పైని జలపానము చేయుచున్నారు. నేను ప్రవాహమునకు దిగువను దూరముగా నీరు త్రాగుచున్నాను. కాఁబట్టి నామూలమున ప్రవాహము పై నీరు కలఁగుట సంభవింపదు" అని మహావినయముతో మనవిచేసెను. "ఇది యట్లుండనిమ్ము. ఆఱుమాసములక్రిందట నన్ను నీవు చాటునఁ దిట్టినావఁట, ఎందుకుఁ దిట్టినావు?" అని కన్ను లెఱ్ఱ చేసి తోడేలు కేకవేసెను. "అయ్యా! ఆఱుమాసములక్రిందట నేను పుట్టనేలేదు. తమ్మిట్లు దూషించినది నేనుగాను" అని గొఱ్ఱెపిల్లమరల నమ్రతతో విన్నవించెను. అందుమీఁద తోడేలు దానితో వాదు లాడుటవలనఁ గార్యము లేదని యెఱిఁగి మఱింతకోపము తెచ్చుకొని పటపట పండ్లు కొఱుకుచు "నన్ను తిట్టినది నీవు కాకపోయినయెడల నీతండ్రి అయియుండును. ఎవరు చేసినను నేరమొకటే" అనిపలికి గొఱ్ఱెపిల్లమీఁదఁబడి దానిని చంపి భక్షించెను.

గీ. దుష్టు లగువారు పరులకు దోసఁగు చేయఁ
గారణం బేదొ కల్పింత్రు కలహములకు:
కావునను బుద్ధిమంతులు తా వెఱింగి
దుష్టులకును దూరఁబుగాఁ దొలఁగ వలయు.



## 19. ఎద్దులు. బండిచక్రములును

సరకులతోను జనులతోను నిండియున్న బరువుబండి నొక దానిని బలమయిన యెద్దులు రెండు లాగుకొనిపోవుచుండఁగా వెనుక వైపునుండి చెవులుగీపెట్టునట్టుగా బండిచక్రము కిఱ్ఱుకిఱ్ఱుమని ధ్వని చేయసాగెను. అప్పు డావృషభములు వెనుకకు దిరిగి చూచి "యింత బరువును వహించి మాటాడక బండి యీడ్చుకొని మేము పోవుచుండఁగా, ఊరక మీ రఱచెద రేమి?'. అని చక్రముల నడిగెను.

గీ. కష్టపడునట్టివారు లోకంబుతోడ
మొఱ్ఱ పెట్టరు తమకష్టములను గూర్చి;
వట్టివారలె యఱతురు మిట్టిపడుచు
గొడ్డుగేదెల కఱపులు గొప్ప కావె?

---



## 20. తోడేలు, కొంగ

తోడే లొకటి మేకను జంపి భక్షించుచుండఁగా దాని యెముక యొకటి గొంతుకలో గ్రుచ్చుకొని నొప్పిగలిగింపఁ జొచ్చెను. అది యూడఁదీసికొన శక్తిలేక బాధపడుచు మూల్గుచు తోడేలు దారిని బోవువారి నెల్లఁ జూచి తనయాపద తొలఁగించినయెడ గొప్ప యుపకారము చేసెద నని ఘోషించుచు వచ్చెను. ఆమొఱ్ఱ విని జాలిపడి దగ్గఱకుఁ బోయి గొప్పబహుమానము దొరకునన్న యాశ చేత నొక కొంగ తనమెడ తోడేలు గొంతుకలో దూర్చి యెముక నూడఁబెఱికి తన కిచ్చెదనన్నబహుమాన మిమ్మని యడిగెను. అప్పుడు తోడే లాకొంగను జూచి "నీకు బుద్ధి లేనట్లున్నది! నీవు నా నోటిలో తల పెట్టినప్పుడు కసుక్కున కొఱుకక దయ తలఁచి విడిచిపెట్టలేదా? నీ కింతకంటె నేమి యుపకారము కావలెను? నీ

వింకఁను తృప్తినొందక సిగ్గులేక బహుమానము కావలెననుచున్నావా? ఇఁక మాఱుమాటాడక దూరముగా తొలగిపో" అని సాగనంపెను.

గీ. అల్పజనులకు నుపకార మాచరింప
నపకృతి యొనర్పు మిదె గొప్పకృప తలంప;
పాములకుఁ బ్రేమతోడను బాలు పోయఁ
గలుగుఫల మెల్ల విషమె వర్ధిలుట కాదె?

## 21. తెవులుఁగొంటు దుప్పి

పూర్వ మొకప్పు డొకదుప్పి రోగముచేత మేతకయి దూరము నడవలేక యొకపచ్చికబయల పరుండి మెల్ల మెల్లగా నడుచుచు, అందిన గడ్డిపఱకలు మేయుచుండెను. ఇంతలో దాని చుట్టము లన్నియు ప్రతిదినమును దాని క్షేమమును విచారించుటకయి వచ్చుచు పోవుచు నుండి యక్కడ గడ్డి యంతయు మేసిపోయెను. ఆ దుప్పి యందుచేత మేఁత దొరకక రోగమువలనఁగాక బంధువుల యాదరమువలననే పస్తుపడి చచ్చిపోయెను.

గీ. వసుధలో బంధువర్గ మీవరుసగానె
చూతు మని వచ్చి బాధింత్రు చుట్టములను;
వారు చేయుసాయంబు దైవంబె యెఱుఁగు;
పాడఁగు గృహస్థు వారి మేపంగ లేక.

## 22. వేటకాఁడు, పావురము

వేఁటకాఁ డొకఁడు పిట్టవేఁటకయి యరణ్యమునకుఁ బోయి యొక చెట్టుకొమ్మమీఁద పావుర మొకటి కూరుచుండి యుండఁగాఁ

జూచి, దానిని చంపుటకయి గుఱిచూచి బాణము వేయఁ బోవు చుండెను. ఆ తొందరలో వాఁడు గుఱి కుదుర్చుకొనుటకయి వెనుక వెనుకకే జరుగుచు, క్రిందఁ జూడక యొక్క త్రాఁచుపాముమీఁద నడుగు వేసినందున, ఆ కృష్ణసర్పము వానికా లొడిసి కఱచెను. అప్పుడు వాఁడు గుఱి తప్పిపోఁగా విల్లు జాఱవిడిచి విషబాధచేత క్రిందఁ బడి, తా నొకసాధుజంతువుప్రాణము గొనఁ దలఁచినందుకు శిక్షగా తన ప్రాణమునకే భంగము వచ్చినదని విలపించుచు ప్రాణములు విడిచెను.

గీ. క్రూరులై యన్యులకును నిష్కారణముగఁ
ప్రాణహాని జేయఁగ యత్నపడెడివారు
తీఱనివిపత్తులను దామె తెచ్చుకొనుచు
దుఃఖపడుదు రావల నాత్మదోషమునకు.

## 23. జ్యోతిష్కుఁడు, మార్గస్థుఁడు

ఇద్దఱుబాటసారు లొకనాఁటిరాత్రి వెన్నెలలో ప్రయాణము చేయుచుండఁగా, వారిలో నొకఁడు జ్యోతిష్కుఁడయినందున మఱి నాఁడు తనకార్యము గ్రహగతినిబట్టి యెట్లు నడుచునో చూడవలయు నని యాకాశమున నక్షత్రములవంకఁ జూచి వ్రేళ్లుమడచి లెక్కించుచు నడిచి క్రిందచూడక దబాలున గోతిలో కూలి కాలికి దెబ్బ తగిలించుకొనెను. అప్పుడు తోడిపాంథుఁ డాజ్యోతిష్కుని గోతిలో నుండి లేవఁదీసి గాయమునకు కట్టుగట్టి "మిత్రుఁడా! ఇప్పుడు సంప్రాప్తమయిన యీదురవస్థనుబట్టి యిఁకముందయిన జ్ఞానము తెచ్చుకొని యాకాశమునందు గ్రహములగొని గ్రహములకు విడిచి

పెట్టి భూమిమీఁద నీగతిని నీవు చూచుకొనుటకు నేర్చుకొమ్ము" అని బుద్ధిచెప్పెను.

గీ. జనుఁడు తనబాగుకొఱకు నక్షత్రములను
గ్రహములను నమ్మి వానికై కాచుకొనక,
శక్తివంచన లేకుండ శ్రమము పడుచుఁ
దనప్రయత్నంబునే నమ్ముకొనఁగ వలయు.



## 24. తాబేలు, గరుడపక్షి

తాబే లొకటి భూమిమీఁద నొకకొలనిలో చిరకాలము వాసముచేసి విసుఁగుచెంది, ఆకాశమున విహరించి యచ్చటి వింతలను జూడవలెనన్నకోరిక గలదయి కన్నవారిని బిలిచి తన్నెవరయిన గగనమార్గమున గొనిపోయి ప్రపంచమెల్లఁ జూపినయెడల భూమిలో నొకచోట ననర్ఘరత్నములతో నిండియున్న నిక్షేపమును చూపెద

నని చెప్పఁ జొచ్చెను. వాగ్దానమును నమ్మి సంతోషించియొకగరుడ పక్షి యాకూర్మమును ఖేచరమార్గమునఁ ద్రిప్పి సమస్తమును జూపెద నని యొప్పుకొని, దానిని మేఘమండలమువఱకును గొనిపోయి చూపి, నీవు చూపెద నన్నరత్ననిధి యెక్కడనున్నదని యడిగెను. అది రత్నము లున్నస్థలమును జెప్పలేక నీళ్ళు నములుచు నూరకుండఁగా గరుత్మంతుఁడు కూర్మము తన్ను మోసముచేసినదని గ్రహించి తన కాళ్ళపట్టు విడిచి మేఘములలోనుండి దాని నొకపర్వతముమీఁదఁ గూలవిడిచెను. ఆపాటుచేత కూర్మము సంధులు పగిలి చావఁగా, గరుడుఁడు దిగి వచ్చి దానిమాంస మనాయాసముగా భక్షించి తన దారిని బోయెను.

గీ. చేతఁగానివాగ్దానముల్ చేయరాదు :
చేసెనేనియుఁ దప్పక చేటు మూడు,
వట్టియాశల నూరక పెట్టు నేని,
తనకుఁ బరులకుఁ గూడ ఖేదంబు గలుగు.



## 25 కప్ప, నక్క

ఒకకప్ప చెరువులోనుండి పయికి దుమికివచ్చి గట్టుమీఁదఁ గూరుచుండి, చుట్టుపట్ల నున్నమృగములతోఁ దాను ఘనవైద్యుఁడ

ననియు సమస్తరోగములను కుదర్పఁగలననియుఘోషించెను. బడ బడలాడుచు పిడుగువానవలెఁ గురిపించిన యాశబ్దాడంబరమున కాశ్చర్యపడి, ఆప్రసంగముయొక్క యర్థ మేమియుఁ దమకు తెలియక పోయినను చుట్టుపట్లజంతువు లామండూకరాజుయొక్క పాండిత్య మును మెచ్చుకొని యతనిప్రతిజ్ఞలకు సంతోషింపఁ జొచ్చెను. ఇట్లుండ నాగుంపులోనుండి యొకనక్కముందునకువచ్చితిరస్కారముతో “ నీగిం గురుగొంతుకయు నీ చప్పిడి దౌడలును నీమేనిపొడలవ్యాధియుబాగు చేసికోలేని నీ వితరులవ్యాధుల నెట్లు కుదుర్పనేర్తువు” అని యడి గెను. ఆమాటలు విని మృగము లన్నియు దూరముగా తొలఁగి పోయెను.

గీ. పరులలోపంబులను జక్కఁబఱతు ననెడు
వాఁడు తీర్చుకోవలె స్వలోపములఁ దొలుత;
తనదురోగంబునే మాన్పుకొనఁగలేని
వైద్యుఁ డొరులరోగము లెట్లు బాగుచేయు?



## 26. గాడిద, ముండ్లపొద

పొలముకాపు కాఁడు తనపొలములో నానావిధములైన ధాన్య ములను మూటలుకట్టి యొకగాడిదమీఁద వేసి యింటికి మోపించు కొని పోవుచుండఁగా, ఆగాడిద త్రోవలో ముండ్లపొద నొకదానిని

జూచి యాఁకలిగొని యుండుటచేత దానియొద్దకు పరుగెత్తి యాకులు కొఱికి తినుచు, "నాకు పనికిరాకపోయినను నే నిప్పుడు మోసికొని పోవుచున్న యీధాన్యముతోఁ రుచ్యము లయినవిందులు గుడిచి యెందఱో యానందింపఁ దలఁచుకొని యుందురు. వీనితోఁ జేసిన యేపిండివంటకంటెను నానోటి కీముండ్లపొదయే యెక్కువ రుచికరముగానుండును" అని తనలో తానాలోచించుకొన మొదలుపెట్టెను.

గీ. ఒక్కనికి మంచియన్నమై యుండునదియె
యన్యునకు నుర్వలో విష మగుచు నుండు;
కావునను, లోకమందు సుఖంబు కలుగు
వివిధజనులకు వివిధవస్తువులవలన.

## 27. భరతపక్షి దానిపిల్లలు

ఒకభరతపక్షి తాను పిల్లలు పెట్టినచేను పండి కోఁతకుసిద్ధము కాఁగా, తనపిల్లలకు ఱెక్కలువచ్చి గూటిలోనుండి యెగురఁగలుగుటకు లోపలనే కోఁతగాండ్రువచ్చి పొల మెక్కడఁ గోయుదురో యనుభయముచేత తాను మేత తెచ్చుటకయి వెళ్ళబోవునపుడు తనపిల్లలను బిలిచి తానులేనిసమయమున నెవ్వ రేమనుకొందురో యామాట లన్నియు శ్రద్ధతో విని తాను వచ్చినతరువాతఁ దనతోఁ జెప్పవలసినదని చెప్పిపోయెను. అది వెళ్ళినతరువాత పొలముకాపు పక్కడకు వచ్చి తనకొడుకుతో "పొలము పండి కోఁతకు సిద్ధమయినది. రేపటిదినము నీవుపోయి మనపొరుగువారిని చేనుగోయుటకు సాయము రండని పిలువు" అని చెప్పెను. ఆమాటలు, విని తల్లి రాఁగానే చెప్పి పిల్లలు తమ్ము వెంటనే మరియొకచోటికిఁ దీసికొనిపొమ్మని యడుగఁగా "మీరు తొందరపడ నక్కఱలేదు. పొలముకాపు పొరుగు

వారితోఁ గూడ నమ్ముకొన్నందున రేపు కోఁత జరుగదు'' అని తల్లి వానికి ధైర్యము చెప్పెను. మఱునాఁడు మేతనిమిత్తము పోవు నప్పుడు సుండ తల్లి పిల్లలకు గతదినమునఁ జెప్పినట్లే చెప్పిపోయెను. అటు పిమ్మట పొలముకాపు పక్కడకు వచ్చి పొరుగువారు వత్తురేమో యని కొంతసేపు కాచుకొనియుండి వారెంతసేపటికి రాకపోఁగా, కొడుకును జూచి ''మన మిఁక పొరుగువారిని నమ్ముకొన్న కార్యము లేదు. నీ వీసాయంకాలమే పోయి నీపినతండ్రి మొదలయిన మనచుట్ట ములను రేపు తెల్లవారకమునుపే కోఁతకు తోడురండని చెప్పిరా'' అని చెప్పిపోయెను. ఈసంగతికూడ పిల్లలు తల్లి రాఁగానే చెప్పి భయపడఁజొచ్చెను. అప్పుడు తల్లి పిల్లలజడుపు తీర్చి ''మీరు విన్న దింతేయయినపక్షమున మీరు భయపడవలసినపని లేదు. మఱియొకరి పనినిమిత్తమై చుట్టము లెప్పుడును పిలువఁగానే రారు. రేపటిదిన మేమి జరుగునో మీరు శ్రద్ధతో విని నాకు చెప్పుఁడు.'' అని మఱు నాఁడు మరల నెర తెచ్చుటకయి పోయెను. నాఁడు నిన్నటివలెనే పొలముకాపు ప్రాతఃకాలముననే వచ్చి వేచియుండి యేవేళకును జుట్ట ములు వచ్చుజాడ కానక విసిగి కొడుకును జూచి ''మన మితరుల తోడ్పాటున కాసపడకూడదు. రేపు నీవు వచ్చునపుడు మంచికొడ వళ్లు రెండు తీసికొనిరా. రేపు మన మిద్దఱమే చేనుఁగోఁత మొదలు పెట్టుదము'' అని చెప్పిపోయెను. ఆమాటలు విని పిల్లలు మరల చెప్పఁ గానే తల్లి ''ఇఁక మన మిక్కడ నిలువఁగూడదు. పొలముకాపు తాను స్వంతముగాపనిచేసికోఁదలఁచినప్పుడు రాక మానఁడు. మనము శీఘ్రముగా పోవలెను'' అని యప్పుడే తన పిల్లలను దీసికొని మఱి యొకచోటికిఁ బోయెను. అనుకొన్నట్టుగా మఱునాటియుదయకాల మున నే పొలముకాపును కొడుకును వచ్చి పొలము కోఁత మొదలు పెట్టిరి.

గీ. పనిని జక్కఁగ నొనరింప వలయు నన్న
స్వయముగాఁ దాని చేసికోవలయు నెపుడు ;
కార్యమును దాని చేసికోఁ గలుగునేని,
పరులసాహాయ్యమున కాశపడఁగఁ దగదు.

## 28. జోస్యుఁడు

ఒకనాఁటిరాత్రి జోస్యుఁడొకఁడు రచ్చచావడిలోఁ గూరుచుండి పురజనులను పోగుచేసి వారికి భావిఫలములను జెప్పుచుండెను. అతఁ డాప్రకారముగా వ్రేళ్లుమడచి లెక్కలువేయుచు, ఆకాశము వంకఁ జూచి నక్షత్రములను గణించుచు, మహోత్సాహముతో నారి వారియదృష్టముల నెల్లఁ జెప్పుచుండఁగా నానడుమ నొకఁడు వచ్చి జ్యోతిష్కుని జూచి "స్వామీ ! మీయింట దొంగలు పడినారు" అని కేక వేసెను. ఆకేక చెవిని బడఁగానే జ్యోతిష్కుఁడు తొందర పడి లేచి యూరివారిభాగ్యములను వదలివేసి తనభాగ్యమును జూచుకొనుటకయి యింటికేసి పరుగెత్త మొదలుపెట్టెను. అప్పు డాశుభ వార్త తెచ్చినమనుష్యుఁడు పరుగెత్తుచున్న జోస్యుని నిలిపి "అయ్యా! ఇందఱి యదృష్టములను దెలిసికొన్న మహానుభావులకు మీకు మీ యదృష్ట మేల తెలియలేదు ?" అని యందఱిముందఱ నడిగెను.

గీ. సర్వవిదుఁడైన దేవుఁడు జనులమేలు
కొఱ కనాగతము మఱుంగు పఱచియుండ,
బూటకపుమాట లగును గ్యకీటకములు
భావి నెఱిఁగింపఁ గలరంట భ్రాంతి కాదె ?



## 29. ఎలుగుబంటి, సింహము. లేడి

ఒకలేడిని జంపి యది తనకే రావలెనని యెలుఁగుబంటియు, తనకే రావలెనని సింహమును తగవులాడి, ఘోరయుద్ధము చేసి యలసి సొమ్మసిల్లి సింహభల్లూకములు రెండును క్రిందపడెను. అవి యట్టికదలలేని యవస్థలో నుండఁగా నప్పు డాదారిని బోవుచున్న నక్కయొకటి చూచి మెల్లగా సమీపమునకు వచ్చి యవి కదల మెదలలేకుండుట కనిపెట్టి యాలేడిని నోటఁ గఱచుకొని నిర్భయముగా నడవసాగెను. ఆచౌర్యమును దాపుననే యుండి కన్నుల మంటగాఁ జూచుచుండియు నేమియుఁ జేయఁజాలక సింహభల్లూకములు నిట్టూర్పులు పుచ్చుచు "ఇది యంతయు మనకు పరస్పర వివాదమువలన వచ్చినలాభము. మనయిద్దఱిలో నొక్కరికిని దక్కకుండ నడుమ పాడునక్క యొకటి వచ్చి యీలేడిని మనకన్నుల యెదుటనే యీడ్చుకొని పోవుచున్నది" అని విచారింప సాగెను.

గీ. తాము తమలోన నధికులు తగవు లాడ
నడుమ నల్పులు లాభంబుఁ బడయు చంద్రు,
పోరు నప్పియు మఱిమఱి పొందు లాభ
మనెడు లోకోక్తి మిగుల సత్యంబు గాదె?

## 30. గ్రద్ద, నక్క

గ్రద్దయొకటి యొక్కచెట్టుకొనకొమ్మను గూడు కట్టి పిల్లలను బెట్టి వానిమేఁతకయి యేదయినజంతువు దొరకునాయని క్రిందఁ జూచుచుండఁగా, దూరమున నెండలో చలి కాచుకొనుచు నొక్కనక్క పిల్ల దానికంటఁబడెను. కంటఁ బడుటయే తడవుగా గృధ్రము బాణ వేగమున క్రిందికి దిగి వచ్చి మృత్యుదేవతవలె జంబుక శిశువును కాళ్ళతో తన్నుకొని పయి కెగిరి పోవుచుండఁగా, ఇంతలో దానితల్లి వచ్చి కన్నులనీరు పెట్టుకొని తనబిడ్డప్రాణమురక్షింపవలసిన దనియు తా నేక పుత్రశోకమును సహింపజాల ననియు, బహువిధము లయిన దీనాలాపములు పలికి గృధ్రమును వేఁడుకొనెను. గ్రద్ద తనగూడు చెట్టుచివర నున్నందున నక్క కంద దనియు, వేఱువిధముగా పగదీర్చుకొనుట దానికి సాధ్యము కాదనియు, తలఁచి దానిమొఱ్ఱ యాలింపక యనాదరము చేసి యానక్కపిల్లను దనపిల్లలపొట్టను బెట్టుటకయి తిన్నగా తనగూటిలోనికిఁ దీసికొనిపోయెను. అందుమీఁద నక్క మిక్కిలి కోపముతో పరుగెత్తుకొనిపోయి యాసమీపమున మార్గస్థులు కొంద ఱొకవృక్షము క్రింద వంట చేసికొనుచుండఁగా పొయిలోని బగబగ మండుచున్న కొఱకంచొక్కటి నోరఁగఱచుకొని వచ్చి పగసాధింపవలెనన్న యుద్దేశముతో గ్రద్దగూడుపెట్టిన చెట్టుమీఁదికెగఁబ్రాఁకుచుండెను. మండుచున్న కొరవితో వచ్చి నక్క మొట్టమొదటి

కొమ్మమీఁదికి దుముకఁగానే యగ్నిజ్వాలచేత తనకును తనకుటుంబము నకును అకాలప్రళయము వచ్చునని భయపడి గ్రద్ద మంచిమాటలు చెప్పి బతిమాలుకొని యప్పుడే నక్కపిల్లను నక్కకిచ్చి పంపివేసెను.

గీ. పరులకును బాధ గలిగించువారలకును
నేఁడొ మఱునాఁడొ యెప్పుడో కీడు మూడు;
క్షితిఁ బ్రజాపీడకులు సురక్షితుల మంచుఁ
బొంగుచున్నను దప్పక పొసఁగు జేటు.



## 31 నూతిలో బడ్డ నక్క

నక్కయొకటి ప్రమాదవశమున నూతిలోఁబడి గోళ్ళతో నూతి యంచు పట్టుకొని పయికిఁ జూచుచు నీటిమీఁద తేలియుండెను. ఇట్లుండగాఁ గొంతసేపటి కక్కడ కొకతోడేలు వచ్చి పయినుండి నూతిలో తొంగిచూచెను. తోడేలును జూచి నక్క సంతోషించి "ఓమిత్రుఁడా! నాపాలిటిభాగ్యదేవత సమయమునకు నిన్నిక్కడకుఁ బంపినది. నీవు వెంటనే యొకత్రాఁడు నూతిలో వేసి నన్నుఁబైకిఁదీసినా ప్రాణము రక్షించి పుణ్యము కట్టుకొమ్ము" అని దీనముగా వేఁడుకొ

నెను. నక్కకు సంభవించిన ఘోరవిపత్తునకు జాలిపడి తోడేలు "ఓ మిత్రుఁడా! నీకు సంభవించిన యీయాపద నాకు వచ్చినట్లుపరితపించు చున్నాను. బుద్ధిమంతుఁడ వైననీ కిట్టివిపత్తెట్లు సంప్రాప్తమయినది?" అని యడిగెను. "మిత్రుఁడా! నీకు నిజముగా నామీఁద ప్రేమయున్న పక్షమున జాలిపడుచు నిలుచుండక శీఘ్రముగా సాయము చేయుము. నేను నీటిలో మునిఁగి చావఁబోవుచున్నప్పుడు జాలిచూపెడు పొడి మాటలవలన నాహృదయమున కూఱట కలుఁగఁ బోదు" అనినక్క పలికెను.

కరుణ గలమిత్రుఁడైనది కానిదియును
గష్టకాలంబునన్ సుమ్ము కానవచ్చు;
కష్టవేళఁ బిల్వక వత్తు రిష్టసఖులు
పిలిచిననుగాని రాకుంద్రు కలిమి వేళ.

## 32. వాయువు, సూర్యుఁడు

పూర్వ మొకప్పుడు తమయిద్దఱిలో నెవ్వఁ డధికుఁ డని వాయుదేవునకును సూర్యునకును వివాదము సంభవించెను. అప్పుడు వా రామార్గమున నొకబాటసారి పోవుచుండఁగాఁ జూచి వానిపయి బట్టలు ముందుగా నెవ్వరు తీయించివేయఁ గలుగుదురో పరీక్షించి దానినిబట్టి తమతమ సామర్థ్యతారతమ్యనిర్ణయమును చేసికొనుటకు నిశ్చయించుకొనిరి. వాయువు ముందుగా తనబలమును చూపుట కొప్పుకొని సూర్యుఁడు మేఘములచాటునకుఁ దొలఁగఁగా, వాయు దేవుఁడు పర్వతగుహలు మాఱుమ్రోయునట్లు మహాధ్వనితో బయలు దేఱి తనకు వానను గూడ తోడుపఱుచుకొని యామార్గస్థులమీఁదఁ బడి చలిచేత వజవజ వడఁకునట్లుగా వీచుచు వానిమీఁదఁదనబలము

నంతను జూపసాగెను. గాలి గట్టిగా గొట్టినకొలఁదిని వాఁ డంత కంతకు శీతముచే నధికబాధ పడుచు పయిబట్టను దీసి వేయుటకు మాఱుగా మఱింత గట్టిగా కప్పుకొని నెత్తిమీఁద సహితము ముసుఁగు వేసికొన నారంభించెను. అంతట సూర్యుఁడు మెల్లఁగా మేఘమండలములోనుండి నిశ్శబ్దముగా బయలువెడలి తనకిరణప్రసారముచేత చలినంతను తఱిమివైచి గాలివానపాలై యలసియున్న యాపాంథునిమీఁద వేఁడికిరణములు సూటిగా పఱచి యుష్ణముచే దేహమంతయు చెమ్మట పట్టునట్లు చేసెను. ఆయెండవేఁడిమికి వాఁడు బయల నిలువలేక యొకచెట్టునీడకు పరుగెత్తి తనపైబట్టతీసి క్రిందఁ బడవైచెను.

గీ. మీఁదబడి తీవ్రభాషలు మిగులఁ బలికి
బలిమిమైఁ బని చేయింపఁ గలుగుకంటె
దూరమునుండి మేనంటి తూలనాఁడ
కెంతపనియైన వడిగఁ జేయింపవచ్చు.

## 33. సింహమును, మృగములును

ఒకనాఁడు సింహమును మఱికొన్ని మృగములును జేరి సంధి చేసికొని తా మితరులమీఁద దాడి వెడలునప్పుడుగాని తమమీఁద నితరులు దండెత్తినప్పుడుగాని పరస్పరసాహాయ్యము చేసికొనుచుం డుటకయి యొడంబడిక యేర్పఱుచుకొనెను. అటు తరువాత నొక సారి సింహమును మఱిమూఁడు మృగములును గలిసి బయలుదేఱి వేఁటకుఁబోయి యొక బలిసిన జింకను బట్టుకొని చంపెను. వానిలో నొకమృగము సంధినిబంధనల ప్రకారముగ జింకను నాలుగుభాగము లుగా భాగించి ముందుగా తనయిష్టము వచ్చిన భాగమును పటు

కొనుటకై నాలుగు భాగములను రాజుముందు పెట్టెను. అంతట సింహ మాభాగములను వేఱు వేఱ వ్రేలితోఁ జూపుచు "ఇది నేను సింహము నయినందున వంశపరంపరాగతస్వాతంత్ర్యముచేత నాకు రావలసిన యగ్రభాగము. అది మనము చేసికొన్న యొడంబడికను బట్టి శత్రువుతో యుద్ధము చేయవలసి వచ్చినప్పుడు విశేష భారము నాబాహువులమీఁదనే పడవలసి యుండుటచేత నాకు రావలసిన భాగము. ఆవలిది నేను మృగరాజు నగుటచేత ప్రజ లయిన మీరా రరి యర్పణము నాకు సమర్పింపవలసిన భాగము. ఆమిగిలినది నాకిప్పుడు క్షుద్బాధ యధికముగా నుండుటను బట్టియు నావద్ద పూర్వసంచితము లేక పోవుటను బట్టియు నే ననివార్యముగా గ్రహింపవలసిన భాగము. కాఁబట్టి బుద్ధిమంతు లయిన మీరీ నాలుగు భాగములును నాకు వదలివేసి మేఁత వెదకుకొనుటకై యింకొకచోటికి శీఘ్రముగాఁ బొండు" అని పంపివేసెను.

గీ. తనకు నధికునితో మైత్రి నొనరుచు నెడ
నిజ మయిన సౌఖ్యము లభింప నేర దెపుడు
సర్వవిధములఁ దనతోడిసములతోడఁ
జేయుమైత్రియె సర్వదా శ్రేయమిచ్చు.



## 34. సింహము ఎలుక

సింహ మొకటి యెండలోఁ దిరిగి యలసి వచ్చి యొక మఱ్ఱి చెట్టునీడను పరుండి విశ్రమించుచుండఁగా నెలుక యొకటి పరిగెత్తు

కొనివచ్చి దానిమీఁదినుండి దుముకుట తటస్థించెను. దానిపాద ములు సోఁకుటచేత మేల్కొని సింహ మలికిపడి లేచి నిద్రాభంగము చేసినందునకయి మహారోషముతో చేయెత్తి యాయెలుకను కొట్టి చంపఁబోయెను. అప్పు డాయెలుక భయముచేత దేహము కంప మొంద గద్గదస్వరముతో "స్వామీ! నేను క్షుద్రజంతువను. దేవర వారిమహిమ నెఱుఁగలేక యవివేకముచేత నేను చేసిన యీయప రాధమును క్షమించి నాకు ప్రాణదానము చేయుఁడు. మృగసార్వ భౌము లయిన యేలినవారు దండనార్హము లయినమహాజంతువుల పయిఁ బ్రయోగింపవలసిన యీనఖములను నావంటియల్పజంతువు రక్తముతో మయిల పఱుచుట ధర్మము కాదు" అని దీనముగా వేఁడుకొనెను. ఆ యార్తవాక్యములకు హృదయము కరఁగిన దయి సింహము కరుణించి దానిని చంపక విడిచిపెట్టెను. అంతట మూష కము తాను బ్రతికియున్నంతకాలమును మేలు మఱవ నని పలికి మ్రొక్కి వీడ్కొని తన బొరియలో దూరెను. అటుతరువాతఁ గొంత కాలమునకు సింహ మాహారమునిమిత్తము వనమునందు విహారము చేయుచు వచ్చి ప్రమాదవశమున వేఁటకాఁడు పన్నిపోయిన వలలోఁ బడి యామృత్యుపాశములనుండి తప్పించుకొనుటకు శక్యము కాక భయంకరముగా నఱచుచు చిక్కులుపడుచుండఁగా, ఎలుక దాని కంఠస్వరము విని తనకలుగులోనుండి వెడలివచ్చి యెదుట నిలిచి, తాను మున్నుపకారము పొందినయెలుక యగుట తెలిపి సింహ మును భయపడవలదని చెప్పి కృతజ్ఞత బయల్పడునట్లుగా కోమలము లైన తనదంతములతో వేఁటకాఁడు వచ్చులోపల వలత్రాళ్ళన్నియు తెగఁగొఱికి సింహమును మృత్యుముఖమునుండి విడిపించెను.

గీ. కొన్ని వేళల నల్పులు కూడఁ దాము
ఘనులకును గోడు చూపంగఁ గలిగి యుంద్రు;
కావునను దామె ఘనులంచు గర్వపడక
సర్వజనులకు నుపకృతి సలుపవలయు.

## 35. గ్రద్ధ, కప్ప, యెలుక

ముండ్లపొదలతో నిండియున్న యొకగుంటయొక్క స్వామ్యము నిమిత్తమయి యొకదినమున నెలుకయు కప్పయు తగవులాడ నారంభించెను. ఆతగవులాట యంతకంతకు ముదిరి కొన్నిదినములలో ఘోరయుద్ధముగా మారెను. ఆయుద్ధములో మధ్యమధ్యమూషకము తన కన్నములోనుండి యాకస్మికముగా పయికివచ్చి శత్రువుమీఁద పడి గాయపఱిచి మరలపోయి తనకలుగులో దూఱుచు వచ్చెను. ఆకపటయుద్ధమునకు సహింపక కప్ప రోషముతో "ఓపిరికిపందా! నీ వెప్పుడును దొంగవలె కన్నములోనుండి వచ్చి యేమఱుపాటున మీఁదపడుదువుగాని ధారాళముగా నెదుట నిలిచి రణశూరునివలె పోరాడఁగల పౌరుషము గలదానవు కావు. నీవద్ద నిజమయిన మగతనమున్న పక్షమున బయలికి వచ్చి బహిరంగముగా నాతో యుద్ధముచేయుము?" అని పిలిచి ద్వంద్వయుద్ధమునకు పురికొల్పెను. అప్పు డాయెలుకయు కప్పయు గట్టుమీఁదికి వచ్చి నిలిచి గదలకు మాఱుగా చేతులలో చెఱియొక జెల్లుపుడకయు ధరించి గదాయుద్ధమున కారంభించెను. అదియంతయుఁ బయినుండి చూచుచున్న గ్రద్దయొకటి మింటినుండి బాణమువలె వానిమీఁద వ్రాలి యాపోటుబంట్లరెంటిని చెఱియొక కాలితోను గోళ్ళసందున నిఱికించుకొని మొగతన్నుకొనిపోయి యొకచెట్టుకొమ్మమీఁద పెట్టుకొని కూరుచుండి యాస్వాయనముగా భక్షించెను.

సీ. ఒక్కచోటను వసియించు చుండువార
లొండొరులతోడఁ బోరాడు చుండు రేని,
హాని యిరువురకునుగల్గుఁగాన, నట్టి
మనుజు లైకమత్యంబుతో మనఁగ వలయు.



## 36. పెద్దకుక్క

ఒక మనుష్యుఁ డొకకుక్కను పెంచెను. అది యింటికి వచ్చిన వారిమీఁద నెల్ల మొఱుఁగుచు కనఁబడినవారి నెల్ల కఱవఁబోవుచు వచ్చుటచేత వాఁడు దానిమెడకొక పెద్దగుదెకఱ్ఱనుకట్టి విడిచిపెట్టెను. ఆ వెఱ్ఱికుక్క యాగుదెకఱ్ఱ తనకు గౌరవసూచక మయినయలంకార మనుకొని మఱింతగర్వము గలదయి తనతోడికుక్కలతోఁ సహితము తిన్నగా మాటాడక వానిముందు తనయాధిక్యమును జూపుచు వానితోఁ గలిసి మెలఁగుటయే తనకు లాఘవమని భావించుకొనుచుండెను. ఇట్లది గర్వముచేత విఱ్ఱవీఁగుచుండఁగా దానిచే ననాదరము చేయఁబడిన మిత్రవర్గములో నొకటయిన ముసలికుక్క యొక్కటి దాని వద్దకు వచ్చి "చెలికాఁడా! నీవిప్పుడు మెడను తగిలించుకొని కులుకుచున్న యీగుదెకఱ్ఱను జూచి నీవుసిగ్గుపడవలసినదే కాని గర్వపడవలసినపని లేదు. నీదుష్టచేష్టలను జూచి నిన్ను శిక్షించుటకయి యవమానచిహ్నముగా నీయజమానుఁడు దీనిని నీమెడను గట్టినాఁడేకాని నిన్ను గౌరవించుటకయి కట్టలేదు. కాఁబట్టి యిదిచూచుకొని విఱ్ఱవీఁగుట మఱచి పొంగఁ బోకు" అని బుద్ధిచెప్పి దానికి గర్వభంగముచేసెను.

గీ. తలిదండ్రులు చెప్పుహితంబు వినక
దుష్టవర్తనులై స్వతంత్రుల మటంచు
నిక్కుదురు బాలకులు కొందరక్కటకట!
సిగ్గుపడ రార తమదు దుశ్చేష్టలకును.



## 37. ఓకుచెట్టు, రెల్లుగడ్డి

నదీతీరమునందున్న యొక ఓకుచెట్టు పెద్దగాలిచేత విఱిగిపోయి నదిలోఁ గూలి ప్రవాహవేగముచేతఁ గొట్టుకొనిపోవుచు, నదియొడ్డున పెరిగియున్న రెల్లుగడ్డిలో తన కొమ్మలు తగులుకొనఁగా నిలిచి, అంతటి ఝంఝామారుతమున కా రెల్లుగడ్డి యెట్లు తాళఁగలిగెనో యని యాశ్చర్యపడి "నావంటి దృఢమయిన మహావృక్షమును సహితము విఱిచి నేలఁ గూల్పఁగలిగిన యాగాలికి సహించి బలహీనతృణమ వయిన నీవెట్లు సురక్షితముగా నిలువఁ గలిగితివి?" అని దాని నడిగెను. "ఆమహావాయువు నెదిరించుట నిష్ఫల మని తెలిసికొని నే నాసమయమునందు నీవలె స్వబలమును నమ్మి తలయెత్తుకొని ప్రతిఘటించి నిలువక గాలియొక్క యుద్రేక మడఁగువఱకు కొంతసేపు తల వంచుకొని యొదిగియుండి దానిని నామీఁదినుండి పోనిచ్చి గాలి వడి తగ్గినతరువాత మరల నెప్పటియట్లు తలయెత్తుకొని నిలువఁగలిగినాను" అని యది యుత్తర మిచ్చెను.

గీ. విక్కి విఱుగఁబడుటకంటె వినయమున నె
సమధికప్రయోజన మొందు సంఘటిల్లు;
స్వల్పకాల మోర్పునఁ దల వంచుకొన్న
ఘనత నెప్పుడుఁ దల యెత్తుకొనఁగ వచ్చు.

## 38. గొఱ్ఱెతోలుకప్పుకొన్న తోడేలు

ఒక తోడేలు గొఱ్ఱెతోలు కప్పుకొనివచ్చి గొఱ్ఱెలమందలోఁ బ్రవేశించి యజమానుని కనుమానము కలుగకుండ రాత్రివేళ నొక్కొక్కగొఱ్ఱెనే చంపి భక్షింప మొదలుపెట్టెను. ఈప్రకారముగాఁ గొన్నిదినములు జరిగినతరువాత గొల్లవాఁ డామోసము కనిపెట్టి, గొఱ్ఱెవేషము వేసికొనియున్న యాతోడేలుమెడ కొకత్రాడుబిగించి, చేరువనున్న చెట్టుకొమ్మకు దానిని వ్రేలాడఁగట్టెను. ఆవింత చూచి చుట్టుపట్లపొలములలో నున్నగొల్లవాం డ్రక్కడకువచ్చి గొఱ్ఱె నేల యురితీయుచున్నావని యడిగిరి. "ఇది గొఱ్ఱెవేషము వేసినతోడేలు గాని నిజమయిన గొఱ్ఱెకాదు. ఏవేషములో నున్నను తోడేలును పట్టుకొన్నప్పు డెల్లను నే నీలాగుననే యురితీసెదను." అని చెప్పి పయిని గప్పుకొన్న చర్మము తొలఁగించి చూపి వారిభ్రమ నివారణము చేసెను. అప్పుడు వా రందఱును మాయవేషము వేసినందున కిది తగినశిక్ష యని సంతోషించి వెడలిపోయిరి.

గీ. కపటవేషంబువలనను గలుగువాసి
వసుధ నిజము బయల్పడువఱకె నిలుచు;
కల్ల తెలిసినపిమ్మట నెల్లజనుల
మోసగానిని ద్వేషింతు రీసు పూని.



# 39. తోడేళ్లు, గొఱ్ఱెలు

తోడేళ్ళకును గొఱ్ఱెలకును దీర్ఘకాలము ఘోరయుద్ధము జరిగిన తరువాత తుద కుభయపక్షములవారును విసిగిపోయి సమాధానపడి యింతటినుండి పోరు మాని సుఖముగా బ్రతుకవలెనని నిశ్చయము చేసికొనిరి. గొఱ్ఱెలు తమ కావలికుక్కలను విడిచిపెట్టునట్లును, సంధి యేర్పాటులను పూర్ణముగా చెల్లించువఱకును నమ్మకము కలుగుట కయి తోడేళ్ళు తమపిల్లలను గొఱ్ఱెలవద్ద పూటపెట్టునట్లును, ఒప్పు కొందుమని తోడేళ్ళు రాయబారులను బంపఁగా గొఱ్ఱెలావొడం బడిక యొప్పుకొని తమ కావలికుక్కలను బంపివేసెను. సంధిపద్ధతుల ననుసరించి తోడేళ్ళు తమపిల్లలను గొఱ్ఱెలయొద్దకుఁ బంపఁగానే యవి తల్లులు దగ్గఱ లేకపోవుటచేత నేడువ మొదలుపెట్టెను. అది సందు చేసికొని తా మిల్లడగా నప్పగించిన తమబిడ్డలను గొఱ్ఱెలు తిన్నగా చూడక యేడిపించినందున సంధి చెడిపోయినదని మిషపెట్టి తోడేళ్ళు గొఱ్ఱెలమీఁద దాడివెడలి కావలికుక్కలులేకపోవుటచేతనసహాయము లయి యున్నవానిపయిబడి వాని నన్నిటిని చంపి భక్షించెను.

గీ. తెలివి గలవారు దుష్టులపలుకు నమ్మి
యొక్కయప్పుడు నేమఱి యుండఁ దగదు ;
ఆత్మరక్షణ మేమఱి యహితులాడు
తేనెమాటలు పాటింప హాని వచ్చు.



## 40 ఒంటికంటి జింక

ఒకజింకకు దైవికముగా కన్నొకటి పోయెను. అది యందుచేత మేఁతకయి ప్రతిదినము సముద్రపుదరికిఁ బోయి నీటివైపునుండి యేమియు నపాయము రాదనుకొని దృష్టికన్నువైపునకును వేఁటగాండ్రను కుక్కలను దూరమునుండి చూడఁగానే పారిపోవచ్చునని మంచికన్ను నేలవైపునకును బెట్టి మేఁత మేయుచుండును. ఇట్లు జరుగుచుండఁగా నొకనాఁ డిద్దఱు వేఁటకాండ్రు చిన్నపడవ యెక్కి దానికిఁ గనఁబడకుండ సముద్రముమీఁద మిక్కిలి చేరువకు వచ్చి గుఱి చూచి దానిని తుపాకితోఁ గొట్టిరి. గుండుదెబ్బ తగిలి చచ్చు నప్పు డది "అపాయము వచ్చు ననుకొన్న నేల వైపునుండి నాకేయపాయమును లేకపోయినది. అపాయము లేక సురక్షితముగా నుండు ననుకొన్న నీటివైపునుండియే నాకిప్పుడు ప్రాణాపాయము సంభవించినది. ప్రాణమునందలి యత్యాశచేత నేను నిష్కారణముగా

నడవి విడిచి సముద్రమునకు వచ్చి యీయాపత్తు దెచ్చుకొన్నాను." అని పరితపించుచు ప్రాణములు విడిచెను.

సీ. ఒకటి తాఁ దలంప నొకటి దైవ మొకటి తలంచుఁ
గావునను మానవుండు తా జీవనంబు
కొఱకె యెపుడు నత్యాశఁ గైకొనక ధర్మ
చింత చేయ వలయు భగవంతు నమ్మి.



## 41. నక్క, తెవులుగొంటిసింహము

సింహము వ్యాధిబాధితమై యున్నదని యరణ్యములో నొక ప్రవాదము కలిగెను. అందుచేత నప్పు డరణ్యములో నున్న మృగము లన్నియు సింహసందర్శనార్థము పోవ నిశ్చయించుకొనెను గాని నక్కమాత్రము వానితోఁ జేరి పోకపోయెను. అది యెఱిఁగి సింహము నక్కను పిలిపించి "నేను వ్యాధిగ్రస్తుఁడ నయి లేవలేకున్న ప్పుడు తక్కిన సమస్తమృగములును వచ్చి నన్నుఁ జూచిపోవుచుండఁగా నీవుమాత్ర మేల రాకుంటివి ?" యనిఅడిగెను. "స్వామీ! తక్కినజంతువుల కెంతప్రభుభక్తి కలదో యంతప్రభుభక్తి దేవర

వారియెడ నాకును గలదు. నేనును సేవరసందర్శనార్థమయి యనేక పర్యాయములు తమగృహద్వారమువరకును వచ్చినాఁడను. అయినను స్వామిదర్శనమునకు వచ్చినమృగము లన్నియు లోపలికిఁ బోవుటయే కాని మరల వెలుపలికి రాకుండుట గుహాముఖమునందలి యడుగుల జాడవలనఁ దెలిసికొని గుహలో నేదో వైపరీత్య మున్నదని భయ పడి లోపల నడుగిడుటకు సాహసింప లేకపోయినాను " అని నక్క ప్రత్యుత్తర మిచ్చెను. నిజముగా సింహమునకు రోగపీడ కలుగనే లేదు. ఈమిషమీఁద మృగములను లోపలి కాకర్షించి యనాయాస ముగాఁ జంపి భక్షింపవచ్చునని సింహమే యీపన్నుగడ పన్ని వట్టి ప్రవాదము వేసినది.

గీ. పరులకుఁ దటస్థమైనయాపదలవలనఁ
దెలివి గలవారు బుద్ధిని దెచ్చుకొంద్రు,
కావునను బుద్ధిమంతులు కన్నుగలిగి
యనయమును లోకవృత్తంబు లరయవలయు.

# 42, డేగ, కాపువాఁడు

ఒక కాఁపువాఁడు తనచేనిలోనిజొన్నకంకు లన్నియు కాకులు తిని పోవుచుండుటచేత వానిని పట్టుకొనుటకయి చేనువచెట్టుమీఁద వల పన్ని తాను దూరముగా నిలుచుండి చూచుచుండెను. అప్పుడు డేగ యొకటి యొకపావురమును తఱుముకొని వచ్చి యాతొందరలో వలలోఁ బడెను. ఇట్లు డేగ వలలోఁ దగులుకొని కొట్టుకొనుచుం డఁగాఁ గాఁపువాఁడు వచ్చి దానిని పట్టుకొని చంపఁబోఁగా, అది "ఓయా! నన్ను చంపుటకు నీకు నే నేమియు నపకారము చేయ లేదు. నే నీపావురమును బట్టుకొనుటకయి నీపొలమునకు వచ్చితినే

కాని నీచేతిలోనిగింజలు మేయుటకయి రాలేదు. కాబట్టి నాప్రాణములు గొనక నన్ను విడిచిపెట్టుము" అని ప్రార్థించెను. "నీవు చంపుటకయి నీ కీపావుర మేమి యపకారము చేసినది?" అని పలుకుచు వాఁడు దానిని మెడ విఱిచి చంపెను.

గీ. మదిని బరు లెట్లు చేయఁ గోరుదుమొ మనకుఁ
బరుల కట్లె చేయఁగఁ జూడవలయు మనము
ఒరుల కపకార మొనరింప నూహ చేయు,
నవల మనకును నపకార మావహిల్లు.

## 43. పిల్లి యెలుకలు

ఒక గృహమునం దెలుకలబాధ యతివిస్తారము కాఁగా, ఆ యింటివా రొకపిల్లిని దెచ్చి పెంచిరి. ఆపిల్లి ప్రతిదినమును దొరకిన యెలుకల నెల్లఁ బట్టి భక్షింపసాగెను. ఈప్రకారముగాఁ గొంతకాలము జరిగినమీఁదటఁ దమసంఖ్య యంతకంతకుఁ దక్కువగుచు వచ్చుచున్నందున కెంతో చింతనొంది యెలుక లన్నియు నొకచోట సభచేసి యాలోచించుకొని యిఁకముం దెప్పుడును తా మటుకమీఁదనుండి క్రిందికి దిగి రాకుండునట్లు నిశ్చయము చేసికొనెను. ఆనియమమునుబట్టి యెలుకలు క్రిందికిరాకుండుట కనిపెట్టి మార్జాలము కడుపుచిచ్చుచేత మలమల మాడుచు మూషకములను మాయోపాయముచేత నాకర్షించి పట్టుకొనవలె నని యాలోచించి, వెనుకటికాళ్లు గోడలోనున్న యొకచిలుకకొయ్యకు తగిలించి యూపిరి బిగఁబట్టి చచ్చినట్టు తల క్రిందుగా వ్రేలాడుచుండెను. పిల్లి యీప్రకారముగాఁ గొంతసే పున్నతరువాత వృద్ధమూషక మొకటి మెల్లఁగా గోడమూలకు వచ్చి తొంగిచూచి "ఓహో! మార్జాలమా! నీ

వికృడనే యున్నావా? అట్లే యుండుము. నీచర్మమొలిచి లోపల గడ్డివేసికుట్టి నిలువఁబెట్టినను నిన్ను నేను నమ్మను.'' అని పలికి తొలఁగి పోయెను.

గీ. అనుభవంబునుబట్టియే యవనియందు
జనులకును దెల్వి యబ్బుట సహజగుణము,
కాలు గాలి శ్రమంపడుగండుఁబిల్లి
నిప్పువద్దకు బోవునేఁ యెప్పుడైన.



## 44. దుఃఖకరవివాహము

ఒకయెలుక యుద్రెకాడు కొఱికి సింహముయొక్క ప్రాణము రక్షించినందున దానియం దత్యంతానుగ్రహముకలదయి కోరినయుపకారమును జేయఁ దలఁచుకొని యాసింహ మెలుకను జూచి నీ కేమి కావలయునో కోరుకొమ్మని చెప్పెను. రాజానుగ్రహముచేత గర్వించి దేహము మఱచినదయి యాయెలుక యేది యడుగఁ దగునో యేది యడుగఁ దగదో యన్నవిచారములేక తాను గొప్ప వాఁడను గావలె నన్నదురాశ చేత సింహముయొక్క కొమార్తెను తన కిచ్చి వివాహము చేయవలసిన దని కోరుకొనెను. అన్నమాట దిఱుగక సింహము తాను జేసిన వాగ్దానానుసారముగా తనపుత్రికను మూషకమున కిచ్చి వివాహము చేసి క్రొత్తయల్లునికోరిక

చెల్లించెను. అటుఁతరువాత వధూవరు లొకనాఁడు వనవిహారము చేయుచుండఁగాఁ బ్రమాదవశమున భార్యయొక్క పాద మొకటి భర్త మీఁద పడినందున, తత్క్షణమే యాయెలుక పెండ్లికొడుకు ప్రియురాలి యొక్క నఖక్షతసుఖ మనుభవించుచు కాలియడుగున నలిగిపోయి యనాయాసముగా స్వర్గస్థుఁ డయ్యెను.

గీ. వంశమందును స్థితియందు వయసునందు
సర్వవిధములఁ బెండ్లికి సమత వలయు ;
సమత లేని వివాహముల్ చాలవఱకు
నంతమున దుఃఖ హేతువు లగుచు ముగియు.

## 45. పిచ్చుక. యితరపక్షులు

ఒక కాఁపువాఁడు తనపొలములో జనుపవిత్తులు చల్లుచుండెను. అది చూచి యొకపిచ్చుక తక్కినపక్షులవద్దకుఁబోయి, వేఁటగాం డ్రసంఖ్యము లయినసాధుపక్షులను ప్రతిసంవత్సరమును పట్టి హింసింపఁగలుగుట యీచెట్టునార పేని చేసినదారములతో నల్లిన వలలమూలముననే కాఁబట్టి యిప్పుడే మన మందరమును జేరి చల్లిన విత్తనముల నెల్ల మొలవకమునుపే యేఱి నాశనము చేయవలెనని చెప్పెను. ఆపక్షులామాట లలక్ష్యముచేసి యూఱకున్నందున కొన్ని దినములలోనే జనుపవిత్తులు మొలకలెత్తి భూమిమీఁద తల చూపెను. అప్పు డాపిచ్చుక మరల పక్షులను పిలచి యింతటనైనను బుద్ధి తెచ్చుకొని పక్షికులమునకు ప్రాణాపాయకర మయిన యీజనుపనారును మొలకలతోనే పీకివేయవలసినదని వేఁడుకొనెను. ఆపక్షు లప్పుడును దానిమాట యాదరింపనందున జనుపమొక్కలు పెరిగి చెట్లుకా నారంభించెను. అప్పటికిని సమయము మించిపోలేదని చెప్పి యీ

చెట్లను వేళ్ళతో పెల్లగించి రూపుమాపవలసినదని కడసారిపిచ్చుక యాపక్షులను మరల బ్రార్థించెను. ఆపక్షు లాపలుకులు పెడచెవిని బెట్టి నేఁటికాలమునకు పక్షులలో నొకయపూర్వదీర్ఘదర్శి బయలుదే ఱెనని మీఁదిమిక్కిలి యాపిచ్చుకను పరిహాసము చేయఁ జొచ్చెను. అంతట పిచ్చుక తనకృషియంతయు వ్యర్థమగుట జూచి, రాఁబోవు సంగతిని కనిపెట్టి ముందుగా మెలఁకువ పడలేని మూఢశిరోమణుల తోఁగలిసి క్షణకాలమును వాసము చేయరాదని తలఁచి, జనుము పెరిగి త్రాళ్ళ కక్కఱకు రాకమునుపే యాపక్షు లున్నయడవినివిడిచి లేచిపోయి యప్పటినుండియు మనుష్యులు వాసముచేయు గృహముల చూరులలో గూండ్లుకట్టుకొని నివసించుచుండెను.

గీ. ఆపదలు వచ్చినప్పు డల్లాడుకంటె
నాదినే మాన్పుకొనుమార్గ మరయవలయు ;
ముందు చూడక ప్రస్తుతమునె తలంచు
మూఢుఁ డాపదలకు జన్మభూమి యగును.

---

## 46. ఎద్దు, కప్ప

ఒకయెద్దు పొలములో మేయుచు క్రిందనున్న కప్పపిల్లమీఁద నడుగువేయఁగా వానిలో నొకఁటి నలిగి చచ్చెను. తోడనే కప్పపిల్ల లన్నియు పరుగెత్తుకొనిపోయి తల్లి కాసంగతి తెలిపి, తమ్ము నలుగఁ ద్రొక్కినంత పెద్దజంతువును తాము జన్మమెత్తిన తరువాత నెప్పుడును జూడలేదని చెప్పెను. అది యెంతపెద్దదని తల్లియడిగెను. ఇంతంత యని చెప్పశక్యము కానంత పెద్దదని పిల్లలు పలికెను. అప్పుడు తల్లి కప్ప తనశరీరము పెంచి "ఇంతయున్నదా ?" యని యడిగెను. ఇంత కంటె పెద్దదని పిల్ల లుత్తరమిచ్చెను. ఆమాటలు విని యా బోదురు

కప్ప దేహము మఱింత పెంచి నిక్కి "ఇంత పెద్దదిగా నున్నదా ?" అని మరల నడిగెను. నీ వెంత పెరిగినను దానిలో సహస్రాంశముండ వని పిల్లలు మాఱుపలికెను. అందుమీఁద రోషము వచ్చి యాకప్ప తానెంత పెద్దదిగా పెరగవలె నన్న యపేక్షచేత పెరిగి యూపిరిబిగఁ బట్టి మరింత పొట్టయుబ్బించి తుట్టతుదకు పొట్టవిచ్చి చచ్చెను.

గీ. అధికులను జూచి యోర్వక యహంకరించి
తనకు లేనట్టియాధిక్యమును నటింప
ఘనవిపత్తగుఁ గావునఁ దనదుస్థితికి
మించువేషంబు వేయక మెలఁగ వలయు.



## 47. పాము, ఆకురాయి

పా మొకటి యొకనాఁటిరాత్రి మేఁతకయి బయలుదేరి కమ్మర వానిపనిశాలలో ప్రవేశించి తినుట కేమయిన దొరుకునేమో యన్న యాశచేత పనిముట్లమీఁదఁ బడి, ఆకురాయి నోటఁగఱచుకొని గట్టిగా కొఱుక నారంభించెను. అప్పుడాయాకురాయి దానిని జూచి నవ్వి "ఓవెఱ్ఱిపామా! నీవేల వృథా శ్రమపడెదవు? నేనితరవస్తువులను తిను దాననే కాని యితరముచేత నెప్పుడును తినఁబడుదాననుగాను. ఇనుము మొదలైన లోహములనే పొడుముచేసెడు నన్ను కొఱుకుటవలనఁ నీ

పండ్లు మొఱవల్గు పోవుటయేకాని వేఱులాభము గలుగదు. కాఁబట్టి నీవు నన్ను విడచి శీఘ్రముగా మఱియొకచోటికిఁ బొమ్ము" అని పలికెను.

గీ. పలువు రీలోకమునఁ దమ కలవికాని
పనులకుఁ గడంగి నిర్వహింపంగ లేక
కడపటను దామె హానిని గాంతు రెపుడు
కలుగునె ప్రయోజన మసాధ్యకార్యములను ?

## 48. కుందేళ్ళు, కప్పలు

ఒక దినము పెద్దగాలివాన పట్టి, ఓరుగాలి చెవులుచిల్లులుపోవు నట్లుగా విసరనారంభించెను. ఆధ్వని విని భయపడి కుందేళ్ళు కొన్ని నానాముఖముల పరుగులెత్తి యెందుఁబోయినను ధ్వని యంతకంత కధికమయి మఱింతభీతిని గలిగింపఁగా తాళఁజాలక, అటువంటి తెంపు లేని కష్టజీవముజీవించుటకంటె నొక్కసారిగా నీటిలోమునిఁగి యాత్మహత్య చేసికొని తమ కష్టములను గట్టెక్కించుకొనుట మంచిదని నిశ్చయించుకొని, తమయెదుటఁ గానఁబడుచున్న సరస్సువద్దకు పరుగెత్తెను. అవి నీటిసమీపమునకుఁ బోవునప్పటి కావఱ కొడ్డున నున్న కప్పలన్నియు నకాలప్రళయము వచ్చునట్లు భయపడి బరుగెత్తి నీటిలో దుమికి మునిగి యడుగునకుఁ బోయి యదృశ్యములయ్యెను. అప్పు డొక్కముసలికుందేలు కప్పల యాదుస్థితిని జూచి తోడికుందేళ్ళను జేరఁబిలిచి "ఆత్మహత్య మానుకొండి. మనకంటెను నెక్కువ కష్టము గలజంతువు లిప్పుడు నాకంటికిఁ గనఁబడుచున్నవి. లోకములో మన మొక్కరమే భాగ్యహీనులము కాము. మన్నలను జూచి భయపడి నీటిలోఁ బడుచున్న యీకప్పలు మనకంటెను నిర్భాగ్య

దశలో నున్నవి. కాఁబట్టి వీనిని జూచి మనమిప్పుడు ధైర్యము తెచ్చుకొని యాపదలను శాంతతతో సహించుకొనుటకు నేర్చుకోవలెను" అని చెప్పి వానిసాహసోద్యమమును మాన్పి వెనుకకుఁ దీసికొని పోయెను.

గీ. అవగుణంబులలో నధైర్యంబుకంటె
నధికదుర్గుణ మొకటి లే దరసి చూడ,
ఆపదలయందు నీశ్వరు నాత్మ నమ్మి
ధైర్య మూనిన, ధైర్యంబె తన్నుఁ గాచు.

## 49. కడుపు, అవయవములు

పూర్వకాలమునం దొకసారి కడుపుతో నితరావయవములకు శుష్కకలహ మొకటి సంభవించెను. అప్పుడు కార్యనిశ్చయము నిమిత్తము తక్కిన సమస్తావయవములును సభ చేసి యాలోచన చేయ మొదలు పెట్టగా వానిలో నొకటి "మనము పడుశ్రమకు ప్రతిఫల మేమియుఁ జేయక తేరతిండి తిని యంతకంతకు తెగబలియుచున్న యీపొట్ట నిమిత్తమయి మన మేల పాటుపడవలెను ?" అని పలికెను; ఇంకొకటి "మనము కష్టపడి యమర్చిన సమస్తపదార్థములను పనిపాటులు లేక యూరక కూరుచుండి యనుభవించుటకీపాడుపొట్టకేల సమర్పింపవలెను ?" అని న్యాయము చెప్పెను; మఱియొకటి "రేపటినుండి మనసేవలు మానివేసి తిండిపెట్టక పొట్టను మాడ్చివేయవలెను" అని కర్తవ్యము నుపదేశించెను. అందుమీఁద నవయవము లెల్ల నౌనౌ ననుకొని, పస్తుపెట్టి పొట్టక్రొవ్వడఁపవలెనని యేకవాక్యతగా నిశ్చయము చేసెను. ఆనిశ్చయమును బట్టి పని చేయక తిరుగఁబడి చేతు లాహారపదార్థములను నోటి కందియ్య మానుకొనెను; నోరు పదార్థముల నందుకొనుట చాలించెను; పండ్లు నములుట వదలివేసెను; గొంతుక మ్రింగుట విడిచిపెట్టెను. ఈప్రకా

రముగా సాధ్యమయినంతవఱ కవయవము లన్నియు తమతమవ్యాపారములను గట్టిపెట్టి కడుపును శిక్షింపవలె నన్నదీక్ష పట్టి యానియమమును గొన్నిదినములు జరుపునప్పటికి దేహములోని రక్తమాంసములు క్షీణించి యెముకలు బయలుపడఁగా, బలహీనపడి చిక్కి-చేతులు కదలమెదలలేక పోయెను; నోరు దౌడల నాడింపలేక పోయెను ; పండ్లు పఋు కెగయలేక పోయెను ; గొంతుక యెండి పోయెను. అంతట నాయవయవము లన్నియు బుద్ధితెచ్చుకొని, తమ యవివేకమునకు పశ్చాత్తాపపడి, పయికి సోమరివలెఁ గానఁబడినను కడుపు తమ యారోగ్యసౌఖ్యములకొఱకు సాహాయ్యపడుచున్నదని తెలిసికొని, మరల యథాపూర్వకముగా పాటుపడి తమతమపనులను నిర్వహింప మొదలుపెట్టెను. అటుపిమ్మటఁ గొన్నిదినములలోనడుమఁ గలిగిన బలహీనతపోయి క్రమక్రమముగా వెనుకటి జవసత్త్వములు రాఁగా, అవయవములన్నియు నైకమత్యముతోఁ బరస్పరక్షేమ నిమిత్తము పాటుపడుచు నెప్పటి సుఖము ననుభవించుచుండెను.

గీ. భువిని మనుజుఁడు తనసౌఖ్యమునకె కాక
పరులకయి కూడఁ బుట్టింపబడినకతన
స్వార్థపరతను విడనాడి సర్వజనులు
నొండొరులకయి శ్రమపడు చుండవలయు.

---

## 50. ఎద్దు, దూడ

ఒకయెద్దు పొలములో నాఁగలి యీడ్చుచుండఁగాఁ జూచి యాపొలములోనే మేఁతమేసి బలిసి పొగ రెక్కి గంతులు వేయుచున్న దూడ యొకటి దానియొద్దకు వచ్చి గర్వముతో "ఓయెద్దా! సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమానమువఱకును మొద

మీఁద కాడి వేసికొని విరామములేక దున్నుచు నీ వెంతనిర్భాగ్యపు జీవనము జీవించుచున్నావు! ఇన్ని యేండ్లు గడచినను నీవు నీయజమానునికి దానిసవై యుండి బండపని చేయుచు దుఃఖపడుచుండుట తప్ప వే తేమియు నేర్చుకోలేదు. చిన్నయయ్యా నీ కన్నులయెదుట నే నెట్లు సుఖపడుచున్నానో చూడు. కొంతసేపు చెట్లనీడను విశ్రమించుచు కొంతసేపు బయల గంతులు వేయుచు నేను నాచిత్తము వచ్చినట్లు సంచరింపఁగలను. స్వేచ్ఛలేని నీకష్టజీవనమును జూచి నాకు సంతాపము గలుగుచున్నది'' అని పరిహాసముచేసెను. ఆయె ద్దాయవమానమునకు సహించి దాని మాటలు గణనచేయక తనపని తాను జేసికొనుచుండెను. నాఁడు దున్నవలసిన పనియైన తరువాత పొలముకా పాయెద్దుమెడ కాడివిప్పి దానిని పచ్చికబీటిలో మేతకు విడిచిపెట్టెను. మఱికొన్ని నిమిషములకు యజమానుఁడాదూడను బట్టుకొని దానిమెడలో వేపరొట్ట కట్టి తాను వెనుక ముక్కుకొన్న ముక్కు చెల్లించుటకయి నాఁటిసాయంకాల మాదూడను గ్రామదేవతకు బలి యిచ్చుటకొఱకు తీసికొని పోవుచుండెను. తనసమీపమునుండి బలవంతముగా నీడ్చుకొని పోఁబడుచున్నప్పు డెద్దు దూడచేరువకుఁ బోయి చెవిలో మెల్లఁగా ''ఓవత్సా రెండు గడియల క్రిందట మహాగర్వముతో నాస్థితిని జూచి పరిహాసము చేసిన నీ కిప్పు డెట్టిగతి పట్టుచున్నదో చూచినావా! ఈపని నిమిత్తమే నీయజమానుఁడు యథేచ్ఛముగా విడిచి ని న్నింత బలిపించినాఁడు. నీస్థితి మంచిదో నాస్థితి మంచిదో యిప్పుడు నీకు బోధపడినదా?'' అని హెచ్చరించెను.

గీ. పడుచుతనమును గర్వంబుఁ బుడమిమీఁద
జెలిమిమై సదా జనులందుఁ గలిసియుండుఁ;

గావునను బాలు రెప్పుడు గర్వమునను
జేరి పెద్దల నగతాళి చేయరాదు.

## 51. నెమలిః కొంగ

దైవికముగా నొకనాఁడు నెమలియు కొంగయు నొకచోట సమావేశమగుట తటస్థించెను. అప్పుడు నెమలి గర్వముతో తోఁక పయి కెత్తి చిత్రవర్ణములు గల తన పింఛముయొక్క సౌందర్యమును జూపుచు, రూపహీన మయిన కొంగను జూచి తిరస్కారభావముతో దాని శ్వేతవర్ణమును గూర్చి హేళనముగా మాటాడెను. ఆసంగతి కనిపెట్టి యాబకము దానిగర్వభంగము చేయవలెనని తలఁచుకొని నెమలిని జూచి "ఓమిత్రమా! ఒక్కతెక్కలవన్నెలనుబట్టి చూచిన పక్షమున పక్షిజాతిలో నెల్ల నెమళ్లు మిక్కిలి చక్కని వగుట నిశ్చయమే. అయినను భూమిని విడిచి పదిబారలు పయి కెగయక సదా నీచపదమునందే యుండి పయివన్నెలను చిన్నెలనుబట్టి మూఢులచేత మెప్పొందుచుండుటకంటె మావలె గగనమార్గమున మేఘమండల మతిక్రమించి మహోన్నతపదము నొందఁ గలిగినయెడల నెమళ్ళును సర్వజనశ్లాఘాపాత్రములయి యుందును గదా!" అని యెత్తి పొడిచెను.

గీ. జగతిలోపల బాహ్యవేషములకంటె
సద్గుణంబులు గలుగుటె శ్లాఘ్యతరము,
పయి మెఱుంగులు రంగులపసలు లేక
శుద్ధహృదయులు లోకవిశ్రుతులు గారె ?



## 52. చీమ, మిడుత

చలికాలము రాఁగానే సందడి చేయుచు చీమ లన్నియు తమ కలుగుచుట్టును గుంపుగాఁ జేరి తా మావఱకును వేసవికాలములో సంపాదించి నిలువచేసికొన్న ధాన్యమునంతను పయికిఁదీసి యెండఁ బోసి తూరుపాఱఁబెట్టి శీతకాలగ్రాసము నిమిత్తము బాగుచేసికొను చుండెను. అప్పు డాఁకలిచేతను చలిచేతను బాధపడుచు నొకమిడుత వానియొద్దకు వచ్చి, తనకుఁ గొంత ధాన్య మిచ్చి శీతకాలములో తిండిలేక చావకుండ తన్ను కాపాడుఁడని మిక్కిలి దీనత్వముతో వేఁడుకొనెను. అప్పు డొకచీమ ముందుకు వచ్చి "మిత్రుఁడా! నీవు వేసవికాలమంతయు నెట్లు గడపితివి? మావలె కష్టపడి పని చేసి శీతకాలమునకుఁ గావలసిన యాహారము కూడఁబెట్టుకొలేదా?" అని యడిగెను. "లేదు. వసంతకాలమంతయు ఆటలతోను పాటల తోను వినోదముగాఁ గడపినాను. నాకప్పు డన్నము పుట్టనిపాడు శీతాకాల మొకటి ముందువచ్చు నన్నస్మరణయే లేకపోయినది" అని మిడుత యుత్తరమిచ్చెను. ఆమాటలకు మందహాసముచేసి చీమ "అట్లయినపక్షమున వేసవికాలములో పాటుపడక యాటపాటలతో కాలము వ్యర్థపుచ్చినవారు శీతకాలములో పస్తుపడి చావవలసిన వారే," అని పలికి యేమియు నియ్యక దానిని సాగనంపెను.

గీ. యౌవనంబునఁ గాలుచే యాడుతఱిని
కూర్చి ముదిమి కించుక దాఁచుకొనఁగ వలయు;
ప్రాయమును వేడుకలఁ బాడు చేయువాఁడు
వయసు జాఱినవెనుకను వ్యసన మొందు.



## 53. బొంతకాకి, నెమళ్లు

బొంతకాకి యొకటి తనస్థితితో తృప్తిపొంది యుండక తన జాతివారిని మించవలె నన్నదురతిశయము కలదయి యందందు తిరిగి నెమలియీఁక లేఱితెచ్చి తనతోకకు గ్రుచ్చుకొని నెమళ్ళగుంపులోనికిఁ బోయి చేరెను. అది తమలో వచ్చి చేరఁగానే యాసుందరమయూరములు మాలకాకినిజూచి యలిగి, దాని యెరవుఱెక్కలనూడఁ బెఱికి ముక్కులతోఁ బొడిచి కాళ్ళతోఁ దన్ని యథార్థదండనము చేసి యావలకు సాగనంపెను. ఇట్లు గర్వభంగము కలిగియవమానము జరిగినమీఁదట నాకాకి సిగ్గుతో నేడ్చుచు మరల వచ్చి తన బంధువర్గముతోఁ జేరెను. అవి యా పలుగాకియొక్క పూర్వపుదురహంకారము దలఁచి తమలోఁ జేర్చుకొనక దానిని తఱిమి వేసెను. అది తలవంచుకొని తొలఁగుచుండఁగా నొకకాకిదానినిజూచి "ఓ చెడుగ!

నీవు నీ కర్తవ్యమైనస్థితితో తృప్తిపొంది యీ పెద్దవేషమును వేయ కుండినపక్షమున, నీవు కోరుకొని చేరఁబోయినవారిలో నవమాన మును స్వజాతివారిలో బహిష్కారమును పొందక సుఖముగా నుండి యుందువు. కుడిచి కూరుచుండలేక నీ వీలేనిపోని వేషము వేసినం దుకు నీకు తగినగర్వప్రాయశ్చిత్తమైనది'' అని పరిహసించెను.

గీ. తలకుఁ దగని వేషంబును దాల్పఁబోక
యెల్లరు యథార్థగతినె వర్తిల్ల వలయు,
అర్హతకు మించునాధిక్య మభినయించు
నీచుఁడు స్వపక్షపరపక్షనింద్యుఁ డగును.

## [illegible] ఇంద్రుడు, బండివాడు

బండివాఁ డొకఁడు తనకఱ్ఱలబండిని బురద సందులోనుండి తోలుకొని పోవుచుండఁగా చక్రములు రొంపిలో దిగఁబడి యెడ్లెంత లాగినను బండి కదలకపోయెను. అది చూచి బండి దిగి నిలిచి వాఁ డాకాశమువంకఁ జూచి చేతులు జోడించి తనకు సాయము చేయవల సినదని యింద్రుని ప్రార్థించెను. అప్పుడు దేవేంద్రుఁ డక్కడ ప్రత్య క్షమయి మేఘములలోనుండి మొగముచూపి, క్రింద చేతులు జోడిం చుకొని నిలువఁబడియున్న బండివానిని జూచి "ఓరి మూర్ఖుఁడా! ఆకాశమువంకఁ జూచుచు పనిచేయక యూరక మొద్దులాగున నిలు చున్నావేమి? ఎడ్లనుతట్టి యుత్సాహపరచి నీ సత్తువకొలఁది రెండు చేతులతోను బండిచక్రములుపట్టి గట్టిగాత్రోయుము. నావలన సాహా య్యము పొందుక్రమ మిదే'' అని చెప్పెను. అంతట వాఁ డింద్రుఁడు చెప్పిన ప్రకారముగా తనసత్తువ యంతయుఁజూపి త్రోయఁగానే చక్రము బురదలోనుండి లేచి బండి కదలెను.

గీ. ఒడలు వంచి బాగుగఁ గష్టపడెడునట్టి
వానికే తోడుపడును దైవంబు నెపుడు ;
పనికి జొరక దేహము దాఁచుకొనెడునట్టి
మందున కెవండు తోడ్పడ మదిఁ దలంచు ?



## 55. కుక్క, గొఱ్ఱె

కుక్క తన కియ్యవలసిన యప్పు తీర్పవలసినదని గొఱ్ఱెతో లేనితగవొకటి పెట్టుకొనెను. గొఱ్ఱె తన కాఋణసంగతియే తెలియదని చెప్పెను. అప్పుడు కుక్క మధ్యవర్తులవద్దకు పోదము రమ్మని గొఱ్ఱెను బిలుచుకొనిపోయి, తోడేలును గ్రద్దను ధర్మాధికారులుగా నుండి తగవు తీర్పవలసినదని కోరెను. అవి మాధ్యస్థ్యమున కొప్పుకొని న్యాయాధిపతులవలె మంచిబట్టలు వేసికొని ధర్మనిర్ణయము చేయుటకయి గంభీరముగాఁ గూరుచుండి వాది ప్రతివాదములు విని, అప్పు పుచ్చుకొన్నందునకు సాక్ష్యము లేకపోయినను వాదిపక్షమున న్యాయము తీర్చెను. ఆతీర్పు ప్రకారముగా వెంటనే కుక్క గొఱ్ఱె మీఁదఁబడి దానిని కఱచి చంపఁగా వాదియు న్యాయాధిపతులును గలిసి దానిమాంసమును పంచుకొని తినిరి.

గీ. లంచము గ్రహించి కొంపలు ముంచువారు
తగవులను దీర్చుటకు ధర్మదాత లైన,
మూలముట్టుగ ధర్మంబు మూలఁబట్టి
సత్పురుషుల కనర్థంబు సంభవిల్లు.



## 56. కాకి, కుండ.

కాకి దాహముచేత బాధపడుచు నీటినిమిత్తమయి వెదకుచుండఁగా నొకచోట దాని కొకకుండ కనఁబడెను. అప్పు డది సంతోషించి కుండవద్దకుఁ బోయి చూచునప్పటికి దానిలో నీ రట్టడుగున నుండెను. అందుచేత నా కాకి మెడ చాచియు తలక్రిందుగా వ్రాలియు నీ రందుకొనఁ జూచెనుగాని యెన్నివిధముల కృషి చేసినను దాని యభీప్సితము ఫలించినది కాదు. తరువాత కాకి యాకుండను తల క్రిందుచేసి క్రింద కారిననీరు త్రాగవలెనని ప్రయత్నము చేసినను కుండ మిక్కిలి బరువయినదగుటచేత దానిని కదలించుటయే సాధ్యమయినదికాదు. అటుపిమ్మట నేమి చేయుటకును తోఁచక కాకికొంచెముసే పాలోచించి యాచేరువను గులకరాళ్ళుండుటచూచి యారాళ్ళొక్కొక్కటే ముక్కునఁ గఱచుకొని వచ్చి యాకుండలోఁ బడవైచి నీరు పయికివచ్చిన తరువాత మెడవంచి కావలసిననీరు త్రాగి దాహము తీర్చుకొని తనదారిని పోయెను.

గీ. పనికి మంచియాలోచన వలయు మొదల ;
నిష్ఫలం బగు బలమెల్ల నేర్పులేక
బలము యోచన రెండును గలియునేని,
సర్వకార్యంబులను గృషి సఫలమగును.

## 57. దుప్పి, దుప్పిపిల్ల

ఒకదుప్పి మిక్కిలి బలిసినదయి కండ్రొవ్వున కనఁబడినవాని నెల్లఁ గొమ్ములతో పొడుచుచు కాళ్ళతో తన్నుచు మందలోఁ గల దుప్పుల కన్నిటికిని భయము కలుగఁజేయుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు దుప్పిపిల్ల యొకటి దానియొద్దకు వచ్చి "అమ్మా! నీ వింత బలిసి యీ శూలవంటి కొమ్ములతోఁ బొడిచి మందలోఁ గల దుప్పుల నన్నిటిని దఱిమి బెదరింప శక్తిగలదానవయ్యును, నీకంటెఁ జిన్నవయిన వేఁటకుక్కలమీఁద నీబలమును జూపక వానికూఁత వినఁబడఁగానే పాఱిపోయెద వేమి ?" అని యడిగెను. "నీవన్నట్లిప్పుడు నా దేహములో పుష్కలముగా జవసత్త్వములున్నవి. ఆ బక్క కుక్కల నొక్కొక్కదానినే యొక్కొక్క పోటుతో నేలపాలు చేయఁ గలబలము నాకుఁ గలదనియే నానమ్మకము. ఇంకొకసారి వేఁట కుక్క నామీఁదికి వచ్చునప్పుడు పడఁగ్రుమ్మి నాశక్తి నంతను జూపి దానికి బుద్ధివచ్చునట్లు చేయవలెనని ప్రతిపర్యాయమును నేను మనస్సులో ననుకొనుచునే యుందును. అయినను కుక్క నాకంటఁబడగానే నాకాళ్ళు నామాట వినక మనస్సును భయపెట్టి నన్ను కుక్కతోఁ బోరాడనియ్యక దూరముగా నీడ్చుకొని పోవుచుండును. నే నేమిచేయఁగలను? ఎవ్వరికిని స్వభావమును మీఱుట శక్యము కాదు గదా ?" అని దుప్పి చెప్పెను.

గీ. పయికి మాటల నెన్నిటిఁ బలుకుచున్నఁ
బనితఁజిని స్వభావము మార్పఁ గనకయుండు,
జగతి దీర్ఘకాలాగతాచారములును
రెండవస్వభావములుగ నౌచుండు నెపుడు.

# 58. తోకలేని నక్క

ఒకనాఁటిరాత్రి యొకనక్క తోఁక కత్తెరబోనులో చిక్కు కొని యూడిరాకపోఁగా, తోఁక పోయినను ప్రాణములు తప్పించు కొని యీవలఁబడినఁ జాలు నని సంతోషించి యానక్క తోఁక త్రెంచుకొని పారిపోయెను. అది తరువాతఁ దన యింటికిఁ బోయి సావకాశముగా తన మొండితోఁకను జూచుకొని తనవారి కీ సంగతి తెలిసినపక్షమునఁ గులమువారిలోఁ దనకు తలవంపులుగా నుండు నని తలఁచి యట్టివంటి యవమానపుబ్రతుకు బ్రతుకుటకంటె మరణము నొందుట మంచిదని యెంచుకొనెను. కాని మఱికొంతసేపటికి ప్రాణ ములమీఁది యాశచేత నాసాహసకృత్యమును మానివేసి, దైవిక ముగా వచ్చినకష్టముల కోర్చి కష్టములవలన సహితము లాభమును బొందనేర్చుకొనుట బుద్ధిమంతులలక్షణమనితలపోసి, తనబంధువర్గము నంతను ఒకచోటఁ బోగుచేసి సభచేసి, యాసభలో తోఁక లేకపో వుటవలని లాభములగూర్చి మహోపన్యాస మొకటి చేసి, తోఁక త్రెంచుకొని లాభకరమయిన యీనూతనాచారము నవలంబించి సుఖపడవలసినదని యన్నిటికిని హితోపదేశము చేసెను. అది చేసిన యుపన్యాసములో సామాన్యముగా తోఁక యనుపయుక్త మగుటయు, జల్లితోఁక యుండుటవలన పొదలలోఁ దగులుకొనుట మొద లయిన యనేకకష్టములు సంభవించుచుండుటయు తోఁక లేకపోవుట

వలన శరీరమున కధిక సౌందర్యము వచ్చుటయు, వెనుకటివలె వట్టి యూహలచేతనే కాక తోఁకలేని సౌఖ్య మిప్పుడు తా ననుభవము వలనఁ గనిపెట్టుటయు, పెంచి చెప్పెను. ఆయుపన్యాసము ముగిసిన తరువాత విశేషలోకానుభవము గలిగిన ముదినక్క యొక్కటి ముందుకు వచ్చి యామెుండితోఁక యుపన్యాసమునకు నిజ మయిన కారణము నూహించి తెలిసికొని "మిత్రుఁడా! నీవలెనేయెప్పుడైనను మేముకత్తెరబోనులోతగులుకొనుట తటస్థించినపక్షమున మేమప్పుడు స్వానుభవమువలన తోఁక తీసివేసికోవలసిన యావశ్యకమును దెలిసికొని యాప్రకారముగాఁ జేసెదములే" అని మందహాసముతోఁ బలికి బంధుబృందమును వెంటఁబెట్టుకొని లేచిపోయెను.

గీ. తమదుదుష్ప్రవర్తనమునఁ దప్పుదారి
తొక్కియితరులఁ ద్రొక్కింపఁ దొడరువార
లన్యహితబోధకు ననర్హులగుట తెలిసి
వారిబోధ నిరాకరింపంగ వలయు.

---

## 59. ఇంద్రుఁడు, లొట్టిపిట్ట

వృషభములు మొదలయినజంతువులకు వలెఁ గొమ్ములుగాని యితర జంతువులకువలె నితరవిధము లయిన రక్షణసాధనములుగాని తనకు లేకపోవుటచేత దేవుఁడు తన కన్యాయము చేసినాఁడని మొఱ్ఱపెట్టుకొని, ఇఁకనయినను దనకుఁ దగినపరిహారము కలుగఁజేయవలసినదని యొక్క లొట్టిపిట్ట యింద్రునిఁ బ్రార్థించెను. దేవునిబుద్ధికి సంతోషింపక యటువంటి తెలివిమాలినకోరికను కోరినందునకయి యింద్రుఁడు దానిమీఁద కోపపడి "నీ బుద్ధిహీనతకు శిక్షగా నిఁక ముందు నీకు కొమ్ములుమాత్రమే కాక చెవులుకూడ లేకుండ పొట్టిగాఁ జేసెదను," అని పలికి దాని ప్రార్థన నిరాకరించి పంపివేసెను.

గీ. తన్మాతలంబునఁ దనకు సౌఖ్యంబుకొఱకు
నేమి కావలెనో మర్త్యుఁ డెఱుఁగలేఁడు,
నరుఁడు తాఁ గోరునది యెల్ల బొరయునేని
పూర్వపు సుఖంబుఁ గూడ గోల్పోవ వచ్చు.

## 60. కాపువాఁడు, కొంగ

తనచేనిలో పండిన ధాన్యమును నిత్యమును వచ్చి తినిపోవు చుండుటచేత కాకులను బాతులను పట్టుకొనుటకయి కాఁపువాఁడు పొలములో వల పన్నఁగా, కాకులతోను బాతులతోను వచ్చి యొక కొక్కెరకూడ దానిలోఁ బడెను. అప్పు డా కాఁపు వలలోఁ బడ్డపక్షుల నన్నిటినిబట్టి యొక్కొక్కదానినే బాతులను కాకులను జంపుచు వాని మధ్య నున్న కొక్కెర మెడకూడఁ బట్టుకొని చంపఁబోగా, కొక్కెర తాను నిర్దోషి ననియు తక్కినవానివలె తా నాచేనిలోనిధాన్యమును దొంగిలి తినుటకయి రాలేదనియు తనపోషణములో నున్నవృద్ధు లయిన తల్లితండ్రు లింటఁ దనరాకకయి యెదురు చూచుచుందు రని యు చెప్పి తనకు ప్రాణదానము చేయవలసినదని వేఁడుకొనెను. "నీవు చెప్పినదంతయు సత్యమే కావచ్చును. అయినను దుర్మార్గులగుంపు లోఁ గలిసియుండఁగా నిన్నుఁ బట్టుకొన్నాను. కాఁబట్టి ని న్నూరక విడిచిపెట్టఁగూడదు. దుస్సహవాసము చేసినందున కయి నీకును దుష్టుల కర్హమైన శిక్ష కావలసినదే" అని కాఁపువాఁ డుత్తర మిచ్చెను.

గీ. సర్వదా దుష్టతతితోడిసంగమంబు
పుడమిలో నాపదల కెల్ల మూల మగును;
కావున వివేకి మిత్రవర్గంబుఁ గూర్చు
కొనుటలో నెంతొ శ్రద్ధ గైకొనఁగ వలయు.



## 61. నెమలియొక్క మొఱ్ఱ

ఎల్లవారును మెచ్చుకొనునట్లుగా కోవెల కిటువంటి మృదుమధుర కంఠస్వరమును దయచేసి తనకట్టి కంఠనాదము ప్రసాదించక పోవుటచేత నన్యాయము జరిగినదనియు, తాను నోరువిప్పి పాడఁబోయినప్పు డెల్లరు తనవికార మయిన కీచుగొంతుకను జూచి యందఱును నవ్వుదు రనియు, నెమలి దేవునితో మొఱ్ఱపెట్టుకొనెను. దేవుడు దానిని దయతో నాదరించి "కోయిలకు శ్రావ్యనాద మున్న నీ కాలోపము కనఁబడకుండ నిరుపమానమయిన సౌందర్య మున్నది. కాఁబట్టి నీవు విచారింపవలసిన పనిలేదు." అని యోదార్చెను. "కర్ణరసాయనము లయినపలుకులచేత నన్నది మించుచున్నప్పుడు నాకీకేవలదేహసౌందర్యముతో నేమిప్రయోజనము?" అని నెమలి మరల విన్నవించుకొనెను. అప్పుడు దేవుఁడు దానినిజూచి "ఓమయూరమా! వినుము. సృష్టిలో నొక్కొక్కపక్షి కొక్కొక్క యాధిక్యమియ్యఁబడినది. నీకుఁ జక్కఁదనమియ్యఁబడినది; గరుత్మంతునకు బలమియ్యఁబడినది; కోకిలమునకు మధురరుతమియ్యఁబడినది; చిలుకకు మాటాడశక్తి యియ్యఁబడినది; పావురమునకు సాధుత్వమియ్యఁబడినది. అవి యన్నియు తమతమస్థితులతో తృప్తిపొంది సంతోషిం

చుచున్నవి. నీవు నిష్కారణముగా పరితాపపడుచుండఁ దలఁచుకొని పక్షమున, వానివలెనే నీవును నీస్థితితో తృప్తిఁబొంది సుఖించుటకు నేర్చుకొమ్ము" అని పలికి దానిని బంపివేసెను.

గీ. సకలసౌఖ్యంబులకును నీజగతిలోన
సతతమును దృప్తియే ముఖ్యసాధనంబు,
న్యాయలబ్ధంబుతోఁ దృప్తి నందలేక
తొలఁగని దురాశలకుఁ బోవ దుఃఖ మొదవు.

## 62. పిల్లి, పుంజు

ఒక పెంపుడు పిల్లి చిరకాలమునుండి యొక బలిసినకోడిపుంజు మీఁద కన్ను వేసియుండి దానినెప్పుడయినఁ బట్టుకొనిభక్షింపవలెనని మనస్సులో నిశ్చయించుకొని యొకనాఁడు ప్రాతఃకాలమున నేమఱుపాటున దానిమీఁదపడి పట్టుకొని "ఎప్పుడును క్రిందనిలువక యెగసి పడుచుండెడు నిన్నిప్పుడు చంపక క్షమించి విడుచుట కేదయిన హేతు వున్నదా ?" అని యడిగెను. తెల్లవాఱుజామున కూసి కాల మును దెలిపి యెల్లవారిని లేపి పనులకుఁ బంపుచుండుటచేఁ దాను మనుష్యుల కుపకారము చేయుచున్నందున తనప్రాణము రక్షింపవలయు నని పుంజు చెప్పెను. "ఓరి బుద్ధిహీనుఁడా ! అందుచేతనే నాకు నీమీఁద మహాకోపము. నీవు తెల్లవాఱుజామున లేచి కీచుగొంతుకతో నఱచి మనుష్యులకు నిద్రాభంగము చేయుచున్నావు. ఇంత కాలమునుండి నీవు ప్రతిదినమును మంచివారినిద్ర చెడఁగొట్టుచున్నప్పుడు నీకు తగినశిక్ష చేయక నేనిఁక చూచి సహించి యూరకుండలేను. నీవిప్పుడు చెప్పుకొన్న దానివలననే నీవు వధ్యుఁడవని రూఢిపడుచున్నది. అని దానిని చంపి విందుగుడిచెను.

గీ. క్రూరుఁ డొక యకృత్యము చేయఁగోరినపుడు
తగుసమాధానము లభించుఁ దత్క్షణంబ
తాను బట్టెను బాఁదంగఁ దలఁచుకొన్న,
మొదటిచెట్టునసే చుప్ప యొదవుఁ గాదె?

## 63. చిఱుతపులి, నక్క

ఒక దినము చిఱుతపులి యొకటి తనశరీరముమీఁద మచ్చల యందమును జూచి యానందించును, అట్టువంటి చక్కనిచుక్కలు లేకపోవుటచేత సింహమే తనకాలిగోరును బోలవప్పుడు తక్కినమృగ ము లేమిలెక్కయని మహాగర్వముతోఁ బలికి తనుఁ దా మెచ్చు కొని పొగడుకొనుచుండెను. ఆగర్వాలాపములు విని యొకనక్క తన కది పరాభవముగా భావించుకొని కోపము తెచ్చుకొని, దానిమాటల వలనఁ దనకుమాత్రమే కాక వనములోనిమృగకులమున కెల్లను గలిగిన యవమానదుఃఖమును దగిన ప్రత్యుత్తర మిచ్చి పోగొట్టవలెనని నిశ్చ యించుకొని ధైర్యసాహసములతో చిఱుతపులిని జేరఁబోయి 'ఓమిత్రుఁ డా! నీగొప్పతనమునుగూర్చి నీవిప్పుడు పడుచున్న యభిప్రాయము సరియయినది కాదు. లోకములో బుద్ధిమంతు లొకని గొప్పతన మును లోపలిగుణసామర్థ్యములనుబట్టి నిర్ణయింతురుగాని పయితోలు యొక్క చక్కఁదనమును బట్టి నిర్ణయింపరు. దేహసౌందర్య మెప్పు డును మనస్సౌందర్యమునకు చాలదు సుమా!'' అని పలికి దానినితల వంచుకొనునట్లు చేసెను.

గీ. హృదయసౌందర్యమునకు నొక్కించు కైన
దేహసౌందర్య మెప్పుడు దీటురాదు
కావున నిరంతరంబును గడఁగవలయు
సద్గుణాలంకృతులఁ బూన సర్వజనులు.



## 64. నక్క, మేక

అంచుమీఁద కాలానుకొని నీరు త్రాగబోయి నక్క నూతిలోఁబడి యేవిధముచేతను బయికి రాలేక యేమియు తోఁచక యీ గండము గడచి నేఁ డెట్లు గట్టెక్కి బయలఁ బడుదునాయని యాలోచించు చుండెను. ఇంతలోఁ గొంతసేపటికి మేఁక యొకటి నీరు త్రాగవలెనని నూతియొద్దనకు వచ్చి నీటిలోనున్న నక్కనుజూచి "అయ్యా! ఈనీరు తియ్యగానున్నదా?" అని యడిగెను. "ఈనీ రమృతప్రాయముగా నున్నది. అందుచేతనే నేనీ నీరు కడుపునిండ కావలసినంత త్రాగియు వదలిపోలేక యీనీటిలోఁ బడి యీఁదులాడుకొనుచున్నాను. ఈనీటిమాధుర్యము దీనిలో దిగి యనుభవించినవారికిఁగాని తెలియదు. నీవుకూడ దిగివచ్చి దీనిచవి చూడుము," అని నక్క మిక్కిలి యాసపుట్టునట్లుగా పలికెను. ఆమాటలు నమ్మి మాఱుమాటాడక వెంటనే మేఁక నీటిలో దుమికెను. అప్పుడు నక్క మేఁకయొక్క కొమ్ము లూఁత చేసికొని నీటిపయినుండి గట్టుమీఁదికి దుమికి పయికి రాలేక నీటిలో కొట్టుకొనుచున్న మేకను నూతిలో దిగవిడిచి, హాయిగా తనదారిని బోయెను.

గీ. కూళయును సాధు వొక్కచోఁ గూడి రేని,
పలువ సుజను వంచించి లాభంబు నొందు;

నిర్మలులు మాయలను బన్న నేర్వ రెపుడు,
నేర్చినను బ్రయోగింపరు నీచమతిని.

## 65. పడుచువాడు పిల్లి

పిల్లియొకటి యొకపడుచువానిని జూచి కామించి వానికి భార్య కావలె నన్నయాశచేతఁ దన్ను మనుష్యకన్యనుగా మార్చవలసినదని లక్ష్మీదేవిని వేఁడుకొనెను. దానిప్రార్థన నంగీకరించి భక్తసులభురాలయినయాదేవి పిల్లిని సుందరకన్యనుగా మార్చివేయఁగా, ఆపడుచువాఁడు దానిసౌందర్యము జూచి మోహించి యాకన్యను వివాహము చేసికొనెను. తరువాత నానూతనదంపతు లొకనాఁడు శయ్యాగృహమునందుఁ గూరుచుండి వినోదించు చుండఁగా వధువుయొక్క పూర్వగుణము మాఱినదేమో పరీక్షింపవలె నని లక్ష్మీదేవి యామెముందొకయెలుకను విడిచిపెట్టెను. ఎలుక కంటఁబడఁగానే యాక్రొత్త పెండ్లికూఁతురు పెండ్లికొడుకుమాట మఱచిపోయి మంచము మీఁదినుండి యుఱికి యెలుక వెంటఁ బడెను. ఆపనికి కోపమువచ్చి యన్యోన్యానుకూల మయినగుణసంపద కలిగియుండినఁ గాని వధూవరులు సుఖపడఁజాలరని యెంచి లక్ష్మీదేవి తత్క్షణమే యామెను మరల మార్జాలమునుగా మార్చివేసెను.

గీ. బాల్యకాలమునుండి యభ్యాసపడిన
సహజగుణముల విడుచు టసాధ్య మెందు,
కావునను సద్గుణంబులఁ గరముఁ బిన్న
నాటినుండియు మనసున నాఁట వలయు.



## 66. చిఱుచేప, జాలరివాడు

బెస్తవాఁడొకఁడు దినమంతయు నదిలో గాలము వేసికొని కూరుచుండఁగా తుద కొకచిన్న చేఁప గాలమునకు తగులుకొనెను. వాఁడు దానిని పయికిఁ దీసి గాలమువదలించి బుట్టలో పడవేయఁ బోవుచుండఁగా, అది తన్ను బుట్టలో పడవేయక మరల నీటిలోఁ బడవేయవలసిన దని వానిని ప్రార్థించెను. కష్టపడి పట్టుకొన్న దానిని మరలనీటిలో నేల పడవేయవలెనని వాఁ డడిగినప్పుడాచేఁప వానిని జూచి "ఓయీ! నే నిప్పుడు పసితనములో నుండుటచేత మిక్కిలి చిన్నదాననుగా నున్నాను. అందుచేత నీకు నేనుకూరకయినను సరి పోను. నీటిలోఁబడి నే నెదిగి పెద్దదాన నైనతరువాత వచ్చి నీవు నన్ను పట్టుకొన్న పక్షమున, నీ వప్పుడు నామాంసముతో నీబంధు వుల కందఱికిని విందు చేయవచ్చును. కాఁబట్టి నన్నిప్పుడు విడిచిపెట్టి యప్పుడు వచ్చి పట్టుకొమ్ము" అని చెప్పెను. "నీవు చెప్పిన దంతయు పయికి చక్కఁగానే కనఁబడుచున్నదిగాని యెప్పుడో మఱియొకప్పుడు రావచ్చునని చేతికి దొరికినప్పుడు వదలివేయుటకు నేనంతబుద్ధిహీనుఁ డను గాను" అని పలికి వాఁ డాచేఁపను బుట్టలోఁ బడవేసెను.

గీ. ఎప్పుడో యెక్కువగ లభియించు నంచు
వట్టియాస వహించి యల్పంబు నైనఁ

గరగతం బైనదానిని ఘనవివేకి
వెడఁగువడువున నెప్పుడు విడిచి చనఁడు.



## 67. గాడిద, కుక్క

ఒకానొక మనుష్యుఁ డొకకుక్కను గాడిదను బెంచెను. కుక్క యజమానుని ముందు తోఁక యాడించి గంతులు వేయుచుండుటయు కాలునాకి యెగిరి యొడిలోని కెక్కుచుండుటయుఁ జూచి యాపనుల వలననే యజమానుఁడు దానియం దధికప్రేమ గలవాఁడయి తాను దినుమంచిపదార్థములనెల్ల దానికిఁ బెట్టుచున్నాఁడని తలఁచి తానును దానివలెఁ బ్రవర్తించి తనయజమానుని యనుగ్రహమును సంపాదించుకొనవలెనని యాగాడిద నిశ్చయము చేసికొనెను. అట్లు నిశ్చయము చేసుకొన్న తరువాతఁ గొంతసేపటికి లోపలినుండి యజమానుఁడు భోజనముచేసి వచ్చి వాకిట చల్లగాలికి బల్లమీఁదఁ గూరుచుండెను. అతనిని చూడఁగానే మహాసంతోషముతోఁ గాడిద యఱచుచు తోఁకఁ యాడించుచు పరుగెత్తుకొని వచ్చి ముందటికాళ్ళు రెండును పయి కెత్తి యజమానుని ఱొమ్ముమీఁదఁ బెట్టి యాతనియొడిలోఁ దుముకఁ బోయెను. అతఁడు దాని భారమును సహింపలేక వెనుక కొఱుగుచు భయపడి కేకలు వేయఁగా, లోపలినుండి మనుష్యులు పరుగెత్తుకొని

నచ్చి దుష్టుకట్టులతో దిట్టముగాఁ గొట్టి యాగాడిద నావలికి సాగ నంపిరి.

గీ. ప్రతిమనుష్యుఁడు నొక్కొక్కపనికిఁ దాను
యోగ్యుఁ డగుచుండు నెప్పు డీయుర్విలోన,
వాఁడు తన కర్తవ్యమైనట్టిపనిని విడిచి
యన్యవిధమున నటియింప హానిఁ బొందు.

---

## 68. బిందె, కుండ

స్నానమునకు వచ్చినవా రేటిగొడ్డునఁ బెట్టుకొన్న యిత్తడి బిందె యొకటియు మట్టికుండ యొకటియు తరంగముల తాఁకున నీటిలోఁబడి ప్రవాహవేగముచేత కొట్టుకొని పోవుచుండెను. అప్పుడు కుండ తానుపగిలిపోదునేమో యన్నభీతిచేతదూరదూరముగా తొలగ నారంభించెను. దానిభయమును జూచి బిందె బంధుత్వము తెలుపు కొని "నీకు నేనేమియు హాని రాకుండఁ గాపాడెదను. నీవు నావద్దకు నిర్భయముగా రావచ్చును" అని కుండతోఁ బలికెను. నీవు నాయం దనుగ్రహించి సాధ్యమయినంత దూరముగా నుండుము. నిన్నుఁ జూచియే నే నిప్పుడు భయపడుచున్నాను. ఏటి వడిచేత నీవు వచ్చి నామీఁదఁబడినను నేను బోయి నీమీఁదఁబడినను నాకే యపాయము సంభవించును. కాఁబట్టి మన మిద్దఱమును చుట్టరికమును మాని యొండొరులకు దూరముగా నుందము" అని కుండ యుత్తర మిచ్చెను.

గీ. వయసుచే విద్యచేత సంపదలచేతఁ
దనకు సరియైనవారితోడనె కడంగి
చెలిమి యెప్పుడుఁ జేయఁగ వలెనుగాని
స్థితికిఁ దగనివారలమైత్రి చేయఁదగదు.

# 69. నక్క, కొంగ

ఒకనాఁడు నక్క కొంగను తనయింటికి విందుకుఁ బిలిచి దానిని హాస్యము చేయవలె నన్నయభిలాషతో విశాలమయిన పళ్ళెములో నడుగున కొంచెము పాలుపోసి ముందు పెట్టి దానితోఁ గలిసి బువ్వ ముబంతికిఁ గూరుచుండెను. నక్క నాలుకతో నాకి పాలు త్రాగి యానందించు చుండెను గాని కొంగ తనముక్కుకొన మాత్రము పాలలో మోపఁగలుగుటచేత పాలుపీల్చి యనుభవింపలేక మిత్రుఁడు పాలు మ్రింగుచున్నంతసేపును తాను గుటకలు మ్రింగుచు నూరక చూచుచుండవలసిన దయ్యెను. ఆసత్కారమును మఱచిపోక మఱు నాఁడు కొంగ తనమిత్ర మైననక్కను మరల తనయింటికి ప్రతిభోజన మునకుఁ బిలిచి యొక యిరుకుమూతి కూజాలో నడుగున కొంచెము మాంసము వేసి, ముందు పెట్టి గతదినమున చేసినట్టే మిత్రునితో బువ్వము బంతికిఁ గూరుచుండెను. మెడ సన్నమయి యిఱుకుగా నుండుటచేత కొంగ తనమెడను కూజాలో దూర్చి యడుగున నున్న మాంసపుముక్కల నందుకొని తిని యనుభవించు చుండఁగా నక్క యాఁకలిచేత బాధపడుచున్నను మూతి యందులో పట్టనందున తిన లేక పయియంచుమాత్రము నాకి నోరూర చూపులతోనే తృప్తి నొంది యూరకుండ వలసిన దయ్యెను. ఆయనాదరణకు మనస్సు మండు చున్నను నక్క పయికేమియు ననలేక చెలికానివద్ద సెలవుగైకొని వెడలునప్పుడు మిత్రుఁడా! నేను నీకు మాయింటఁ జేసిన సత్కార మునకుఁ దగినట్టుగా నీవు నా కిప్పుడు ప్రతిసత్కారము చేయుటచే నాహృదయము పరమానందభరిత మయినది. మొట్టమొదట నీకు నేను జూపిన యుపచారగౌరవమును నీవుచక్కఁగా నేర్చుకొని సరిగా నాయందు ప్రయోగించుటచేత నే నీగౌరవమున కత్యంతపాత్రుఁడ

నయినా నని సంతోషించుచున్నాను," అని తనకృతజ్ఞతను దెలిపి కడుపు నకనక లాడుచుండఁగా నెండలోఁ బడి యింటికి నడిచెను.

గీ. ఒరుల కెట్టిసత్కృతి చేయునో జనుండు
మరల నట్టిసత్కృతిఁ గాంచు నొరులవలన
కావున జనుండు పరియాచకమున కైన
నొరులమనసును నొప్పింప కుండవలయు.



## 70. కుక్క, నీడ

కుక్క నోట నొకమాంసపు ముద్దఁ గఱచుకొని యొకకొండ కాలవను దాఁటుచు, అద్దమువలె స్వచ్ఛముగా నున్న యానీటిలోఁ దననీడను జూచి మఱియొక కుక్క మాంసపుముక్కను నోట గఱచుకొని యున్నదని భ్రమపడి, దానినికూడ తానపహరింపవలె నన్న యాశతో నోరు తెఱచి పట్టుకొనఁ బోయెను. ఆప్రయత్నమువలన క్రొత్తమాంసఖండము నోటికి చిక్కక పోవుటయేకాక మునుపు తన నోటిలో నున్న మాంసఖండముకూడ నూడి నీటిలోఁ బడి మునిఁగి ప్రవాహవేగముచేతఁ గొట్టుకొనిపోయి యదృశ్య మయ్యెను.

గీ. ఎండమావులవంటి సుఖేచ్ఛఁదగిలి
స్థిరసుఖముఁ గోలుపోదురు క్షితిని నరులు,
చొచ్చి నీడలఁ బట్టుకోఁ జూచువారు
ఫలము చెందంగ నేర్తురే భ్రమమె కాక.

---

# 71. పావురము, చీమ

దాహము తీర్చుకొనుటకయి చలిచీమ యొకటి యేటియొద్దకు బోయి నీరు త్రాగుచుండగా తరంగ మొకటి గాలిదెబ్బచేత మీఁదఁ బడినందున చీమ యేటిలోఁ బడి కొట్టుకొనిపోవ నారంభించెను. వృక్షశాఖమీఁదఁ గూరుచుండి చూచుచున్న పావురము దానిదుస్థితిని జూచి జాలిపడి చెట్టుకొమ్మ యొకటి విఱిచి నీటిలో బడవైచెను. ఆకొమ్మ పట్టుకొని బ్రతికి చీమ కొంతసేపటికి మరల దరి చేరెను. అటుతరువాతఁ గొన్నాళ్ళకు వేటగాఁ డొకఁ డడవికిఁ వచ్చి కొమ్మమీఁద నేమఱుపాటునఁ గూరుచుండియున్న యాపావురమును గొట్టుటకయి తుపాకిని చేతఁబూని గుఱి చూచుచుండెను. ఇంతలో వెనుకటి చలిచీమ పరుగెత్తుకొనివచ్చి వానిమడమమీఁద తేలుకుట్టినట్టు గట్టిగా కుట్టునప్పటికి వాఁ డమ్మాయని యఱచి క్రింద చూడఁగా పావుర మాధ్వని విని యపాయమును తెలిసికొని యెగిరి పోయెను.

గీ. పరులకును మేలు చేసెడివాని కెపుడు
దైవమును మేలు చేయుచు దప్పకుండ
పరులవలనను నుపకృతిఁ బడయువాడు
ప్రత్యుపకృతి చూపఁగాఁ జాటుపడుదు రెందు.



## 72. సింహము, గాడిద, నక్క

సంపాదించిన వేఁటను తమలోఁ బంచుకొనుట కొడంబడిక చేసికొని బయలు దేఱి సింహమును గాడిదయు నక్కయు నడవికిఁ బోయి యొకలేడిని వేఁటాడి చంపెను. అప్పుడు సింహము గాడిదను జూచి చచ్చి పడియున్న యాజంతువును భాగములు చేసి పంచవలసినదని యాజ్ఞాపించెను. గాడిద తనశక్తికొలఁదిని ప్రయత్నములు చేసి యాలేడిని మూఁడుసమభాగములుగా భాగించి యెదుటఁబెట్టెను. ఆఁకలిగొనియున్న సింహము మనస్సున కాభాగములు సరిపడనందున మృగరాజాగ్రహపడి తత్క్షణమే గాడిదమీఁదఁ బడి తిన్నఁగా భాగములు చేయలేకపోయినందున కయి దానిని గోళ్ళతోఁ జీఱి చంపివేసి, నక్కను పిలిచి యావేఁటను రెండుభాగములు చేయవలసినదని నియమించెను. నక్క వివేకియైనందున తనవంతు గిట్టలను కొంచెము కొఱుకుకొని మిగిలిన లేడినంతను సింహముయొక్క భాగముగా దూరముగాఁ బెట్టెను. సింహము దానిబుద్ధికిని తనయెడలఁ జూపిన గౌరవమునకు సంతోషించి, తన ఘనతకుఁ దగినట్లుగా నిట్లు భాగమును చేయవలసినరీతిని నీ వెవరివలన నేర్చుకొన్నావని నక్క నడి

గెను. "స్వామీ! మతియెవరివలనను గాదు. ఏలినవారి సన్నిధాన మునం దిప్పుడు చచ్చిపడియున్న యీగాడిదవలననే యీనీతి నేర్చు కొన్నాను," అని నక్క యుత్తర మిచ్చెను.

గీ. తెలివి గలవాఁడు పరులపాటులను జూచి
యెంతయును దాను మహిం బుద్ధిమంతుఁ డగును
జనులు జగమునఁ బరులకష్టములఁ జూచి
కాదె సామాన్యముగ వివేకంబుఁ గనుట?

## 73. కౌజు, కోడిపుంజులు

ఒకకాఁపువాఁడు కౌఁజుపిట్ట నొకదానిని బట్టుకొని ఱెక్కల యీఁకలు కొన్ని తీసివేసి దానిని కోడిపుంజు లున్న దొడ్డిలోఁ బెట్టెను. అక్కడి పుంజు లాకౌఁజుపిట్టను ముక్కులతోఁ బొడిచి కాళ్ళతో అక్కి తిండి తిననియ్యక కొంతసేపు మిక్కిలిబాధ పెట్టెను. క్రొత్తగా వచ్చిన యతిథివిషయములోఁ జూపిన యీయనాదరమున కాపిట్ట మొట్టమొదట మనస్సులో దుఃఖించెను గాని యటు తరు వాత పుంజు లొండొంటితో కలహించి మాటిమాటికి జగడము లాడుకొనుచుండుట చూచి తమలోఁ దామే యింతమత్సరముతో ను ద్వేషముతోను పోట్లాడుచుండు పుంజు లన్యులవిషయమున నిర్దయత చూపుట యొకవింత కాదని కొంత యూఱట నొందెను.

గీ. రక్తసంబంధమున ననురాగ మూని
పరమమిత్రతతో మన వలయు వారె
యొండొరులతో డఁ బోరాడు చుందు రేని
పరుల కెటు వారు మైత్రి చూపంగఁ గలరు?

# 74. ఎలుగుబంటి, తేనెయీగలు

ఎలుఁగుగొడ్డొకటి యొకకంచె కెగఁబ్రాకి యందు తేనె యీఁగలు పెట్టుకొన్న తేనె తెరలను క్రిందఁ బడఁద్రోచి తేనె త్రాగ మొదలు పెట్టెను. అప్పుడు తమ సొత్తు నన్యాయముగా నపహరించి యనుభవించుచున్న మృగముమీఁద పగ తీర్చుకోవలెనని తేనెయీఁగ లాగ్రహముతో గుంపులు గుంపులుగా బయలుదేరి భల్లూకముమీఁదఁ బడి శరీరమునిండ దట్టముగా నున్న బొచ్చులో దూరి కుట్టి నొప్పింపలేక పోయినను రోమములు లేని ముక్కుమీఁదను కన్నులలోను దిట్టముగాఁ గుట్టి తేలుకుట్టినట్లపరిమితబాధను గలుగఁ జేసెను. ఎలుఁగుగొడ్డు దుస్సహమయినయాబాధకును దురదకును తాళఁ జాలక నేలమీఁదఁ బడి పొరలుచు స్వయంకృతాపరాధమునకు పరితపించుచు దురద పోవుటకై వాడిగోళ్ళతో గీఁకుకొని మొగమును మఱింత గాయపఱచుకొని తా నన్యులసొత్తును దురాశచేత నక్రమముగా తస్కరించిన దోషమునకు తగిన శిక్ష ననుభవించెను.

గీ. అల్పజనులచేఁ దన కేమి హాని వచ్చు
నంచు నన్యుల కపకార మాచరింప
ఘనున కల్పులవలననే కట్టకడకు
సంగసక్తిచే వేదన సంఘటిల్లు.



## 75 దుప్పి, గుఱ్ఱము

ఒక పచ్చికబయలియందు మేయుచు దుప్పియు గుఱ్ఱమును గడ్డికయి తగవులాడఁగా దుప్పి తనవాఁడి యయిన వాఁడికొమ్ములతోఁ బొడిచి గుఱ్ఱము నచ్చటినుండి తఱిమివేసెను. గుఱ్ఱమాయవమానమును సహింపలేక పగసాధింపవలె నన్న బుద్ధితో మనుష్యునియొద్దకుఁ బరుగెత్తుకొనిపోయి దుప్పిని చంపుమని వేఁడుకొని యొప్పించి, తన కార్యమునిమిత్తమై యతనిని తననోట కళ్లెము పెట్టనిచ్చి వీపుమీఁద నెక్కించుకొని వాయువేగమున నరణ్యమునకుఁ దోడుకొనివచ్చెను. అతఁడు గుఱ్ఱ మెక్కివచ్చి దాని యిష్టప్రకారముగా దుప్పిని వేఁటాడి చంపెను. అంతట గుఱ్ఱ మాతనిని మరల నింటికిఁ దీసికొనిపోయి విడిచి తన కతఁడు చేసిన యుపకారమున కయి కృతజ్ఞతను దెలిపి నమస్కరించి సెలవు గైకొనఁబోఁగా నతఁడు దానిని విడువక "ఓమిత్రమా ! నీ వింతయుపయుక్తమయిన జంతువ వని నే నీవఱ కెన్నఁడు నెఱుఁగను. నీ యుపయోగము నాకిప్పుడు పూర్ణముగా బోధపడినది. కాఁబట్టి యిఁక ని న్నెప్పుడును విడిచిపెట్టక నాసేవ యందే యుంచుకొనెదను." అని చెప్పి నాఁటినుండియు గుఱ్ఱమును దనకు వాహనముగాఁ జేసికొనెను.

గీ. ఎదకుఁ బగదీర్చుకొనుబుద్ధి యుంపె కాని
తత్ప్రయోగంబుచే ననర్థములు వచ్చు;
ఆపనికిఁ దోడు తెచ్చుకొన్నట్టివారె
యెదురు తిరిగి బాధింతురు తుదను మనల.

# గ్రద్ద, కప్ప, యెలుక

గీ. గుజ్జుపొదలతో నిండినగుంటకొలకుఁ
గప్పయును మూషకంబును గలహ మాడి
డాలువారులు వాలులుఁ గేలఁ దాల్చి
పోరఁ దొడఁగెను సంగ్రామశూరు లట్లు.

గీ. గట్టుపయి నిల్చి కయ్యంపుఁగాంతు దీఱఁ
బోటుబంట్లయి యొండొంటిఁ బొడుచుచున్న
కప్ప నెలుకను వీక్షించె గ్రద్ద యొకటి
దూరమున నున్న చెట్టుపై గూరుచుండి.

గీ. అట్లు వీక్షించి గృధ్రంబు హర్షమునను
బాణవేగంబుతో వానిపయిని వ్రాలి
రెంటి నొక్కొక్క కాలితో నంటఁ బట్టి
తన్నుకొని పోయె నింగికిఁ దత్క్షణంబ.

గీ. గృధ్ర మారెంటిఁ దనవాసగృహముఁ జేర్చి
శీఘ్రముగ నాత్మసంతతిఁ జేరఁ జీరి
సంతసంబున వానిమాంసంబుతోడ
వడిగ విందారగించె నాప్యాయనముగ.

గీ. ఒక్కచోటను వసియించుచుండువార
లొండొరులతోడఁ బోరాడుచుందు రేని,
హాని యిర్వురకును గల్గుఁ గాన, నట్టి
మనుజు లైకమత్యంబుతో మనఁగ వలయు.

## అవివేకత్వము

గీ. మృత్యుదేవత యాత్మీయభృత్యులందు
నొక్కరికి మంత్రిపద మియ్య నూహ చేసి
కొలువులో సింహపీఠికఁ గూరుచుండి
తనదుపరివారమును జేరి యనియె నిట్లు—

గీ. "భృత్యవరులార! మీలో నహీనశక్తు
నొక్కరుని నాకు మంత్రిగా నొనరుచుకొనఁ
దలఁచి యున్నాను; మీసమర్థతలు చెప్పి
తెలుపుకొను, డర్హు లెవరొ మంత్రిత్వమునకు."

గీ॥ అనుడు జ్వరరాజు ముందటి కరుగుదెంచి
"దేవి! నేనే యర్హుండ మంత్రిత్వమునకు
స్వామిభక్తిచే నీభృత్యవర్గమందు
నెవ్వరును నాకు సరి రారు పృథ్విలోన."

గీ. "మొదలు నొకింత యవకాశ మొదవఁగానె
వెంటనే పట్టుకొని పీల్చి పిప్పి చేసి
జనుల వేలకొలంది నీసన్నిధికిని
బంపుకొనుచుందు నేఁ బ్రతిసంవత్సరంబు."

గీ. అనిన వాతరోఁగుడు వచ్చి యనియె నిట్లు—
"అమ్మ! ఆత్మసంస్తుతి యనర్థ౦బె యైన
నన్ను నే నిష్టు చెప్పుకొనంగ వలసె
నీప్రధానత్వమున కేనె నిపుణతముఁడ."

గీ. "కాలు మొదలు తలవఱకుఁ గీలు కీలు
నవశముగఁ జేసి మర్త్యుల నహరహంబు
ప్రభ్వికడ కెందఱినో నేను బంపుచుందు
సర్వదేశంబులందును సంచరించి."

గీ. ఇంతలో వచ్చి సుఖరోగుఁ డిట్లు లనియె—
"రాణి! మంత్రిత్వమున కేఁ బ్రవీణతముఁడ.
వీరువారునువలె వృద్ధవితతికడకు
నీచగతి నొక్కయప్పుడు నేను బోను."

గీ. "వయసులో నున్నవారినె వడిగఁ జేరి
చెఱిచి రక్తంబు నంగముల్ కొఱికివేసి
ప్రతిదినము లక్షలకొలందిఁ బడుచువాండ్రఁ
దఱుముచున్నాఁడ నీసన్నిధానమునకు."

గీ. శ్వాసకాసాదులైనట్టివ్యాధిరాజు
లెల్ల నొక్కరొక్కరె వేగ నేగుదెంచి
వరుసవెంబడి నాత్మప్రభావములను
విన్నపము చేసికొనిరి వేర్వేర తాము.

గీ. మృత్యుదేవియు సభ నిట్లు భృత్యు లెల్లఁ
జేసికొన్నట్టి మనవులు చిత్తగించి
మంత్రిపద 'మమితత్వశర్మకు' నొసంగి
యఖిలభృత్యుల కిట్లని యాన తిచ్చె—

గీ. ఆ ప్తవరులార! తాపజ్వరాదులార!
జాగరూకులు మి మ్మెల్ల శత్రువులుగ
నెంచి దరికి రానీరు; రానిత్తు రేని
తఱుచుగా మిమ్ము వైద్యులు తఱుముచుండ్రు.''

గీ. ''ఇంక నీయమితత్వమో యెల్లరకును
బ్రాణమిత్రమై యుండును; బ్రజలు తెచ్చి
కొందు రమితత్వశర్మను గోరి తారె;
చేరి సుఖమిచ్చుచు నె ప్రజఁ జెఱచు నితఁడు.''

గీ. మొదలు నమితత్వుఁ డేగి తా, బూనకున్న
మీకు నెవరికని బని లేక యుండు;
మీకుఁ బని పెట్టి మిమ్మేలుమేటి గాన
నీతని కె ప్రధానత్వ మే నియ్య వలసె''

గీ. పుడమిలో వ్యాధు లమితత్వమూలమున నె
పెక్కు రెల్లవారికి సంభవించుఁ గాన,
నన్న పాన సంభోగ నిద్రాదు లెపుడు
ప్రజలు మితముగా ననుభవింపంగ వలయు.

---

## కాకి, నక్క

గీ. కాక యొకటనుండియో మాంసఖండ మొకటి
కఱచుకొని వచ్చి యొక్కవృక్షమున వ్రాలి
విందు గుడువంగ వలెనన్న వేడ్కతోడఁ
గొమ్మమీఁదను జక్కఁగాఁ గూరుచుండె.

గీ. కాకినోటను గలమాంసఖండ మరసి
దాని నెట్లైన హరియింపఁ దలఁచి నక్క
చెట్టు మొదటికి మెల్లఁగాఁ జేర వచ్చి
యింపు గులుకంగఁ గాకికి నిట్టు లనియె.

గీ. "అన్న ! యెన్నాళ్ళకును గల్గె నిన్నుఁ జూడ !
నేఁడుగా పండువు మదీయ నేత్రములకు !
నీదుసౌందర్యమహిమంబు నిపుణముగను
బ్రహ్మదేవుని కైనను వశమె పొగడ ?"

గీ. "అహాహ ! నీలమేఘచ్ఛాయ నడఁచు మేను !
చక్రముల మించు నీదులోచనయుగంబు ;
నిక్క పింజామరల మీఱు ఱెక్కలార !
నవ్వెడు హంసముల నీదునడక తీరు."

గీ. "ఏమి నాభాగ్య మియ్యెడ నింతతడవు
కనులు తనియంగ నీరూపు గాంచ గలిగె !
చూచుకొలఁదిని నొక క్రొత్తసోయగంబుఁ
గూర్చుచును నెంతకును దృప్తికొలుప దహాహ !"

గీ. "పుడమిపై నొక్క సౌందర్యమున నె కాదు
కాకరాజమ ! నీవు ప్రఖ్యాతి గనుట '
నీదుకంఠస్వరము గూడ నిరుపమాన
మఖిలజంతువులందు నీయవనిమీఁద."

గీ. "సఖుఁడ! భువిలోన నీతోడ సమము గాఁగ
నింపుగా గాన మొనరింప నెవరు గలరు?
పెదవి కదలించి యొక్కింత వీను లలరఁ
బలికి తేనియుఁ దేనియ లొలుకుఁ జుమ్ము.

గీ. "సఖుఁడ! నీ గానరస మింత చవి గొనంగ
వేచి యున్న యీ చెవులకు విందుగాఁగ
గానసుధ యింత వర్షించి తేని, నిన్నుఁ
బోలుధన్యుఁ డింకొకఁ డుండఁ బోవఁ డెందు.'

గీ. అని ముఖస్తుతు లొనరింప నాత్మ నలరి
కాయ ముప్పొంగ నావెఱ్ఱికాకి యపుడు
తనదు సంగీతమును గూడ ఘనత మీఱఁ
బాడి శాశ్వతకీర్తిని బడయఁ దలఁచి.

గీ. నక్కజిత్తులు కనక గానంబు చేయఁ
గోరి యుత్సాహ మడరంగ నోరు తెఱచి
కావు కా వనికూసె; నాక్షణమునందె
యూడి పడె నోటిమాంసంబు నుర్విమీఁద.

గీ. పుడమి మాంసంబు పడుటయే తడవు గాఁగ
నక్కపోతును మాంసపుముక్క గొనుచుఁ
జూడ్కి నిగిడించి వెఱఁ గంది చూచుచున్న
కాకిమిత్రునిఁ జెట్టుపైఁ గాంచి పలికె.

గీ. "వెడఁగుకాకమ! నే నింతతడవు నిన్ను
నూరక స్తుతింతునే లాభ మొదవ కుండ?
నాదుపని తీఱెఁ బోయెద; నీదుపాట
యుంచుకొమ్ము నీయొద్దనే" యంచుఁ జనియె.

గీ. వసుధలోపల పరులను బాధ చేయ
స్తోత్రపాత్రుల మించుశత్రువులు లేరు
లాభ మొంద ముఖస్తుతు ల్సలుపువారి
వలలఁ దగులక కనుగల్గి మెలఁగ వలయు.

---

## వేటకాఁడు, పావురము

గీ. వేఁటకాఁ డొకండు పిట్టవేటకు వచ్చి
విపినభూమి నొక్కవృక్షశాఖ
పైనిఁ గూరుచుండి పావురం బుండంగఁ
గాంచి దానిఁ జంపఁగాఁ దలంచి.

గీ. తనతుపాకి తీసి తగుకున గుఱిపెట్టి
వెనుక వెనుక జరుగు వేళ వాఁడు
క్రింద చూడ కొక్కకృష్ణసర్పముమీఁదఁ
గాలుప్రేరణమునఁ గాలువైచె.

గీ. అడుగు వేసినంత నలుకమై నాత్రాచు
పాద మొడిసి కాటు వైచె నంత
వేగ నొడల నెల్ల విష మెక్క సోలుచు
శబరుఁ డలతుపాకి జాఱ విడిచి.

గీ. ధరణిమీఁద నొరగి తా సాధుపక్షికి
హాని చేయఁ బూని తానె యిపుడు
హానిఁ దెచ్చుకొంటినని విలపించుచు
నొల్లఁబోయి బోయ యుసురు విడిచె.

గీ. క్రూరులై పరుల క కారణంబుగ నుర్వి
హానిఁ జేయఁ జూచునట్టివారు
తీఱనికడగండ్లఁ దెచ్చుకొనుచుఁ దామె
దుఃఖపడుదు రాత్మదోషమునకు.

# నూతిలోబడ్డ నక్క

గీ. వంచకం బొక్కటి ప్రమాదవశముచేత
నూతిలోఁ గూలి, గోళ్ళతో నూతిగోడ
పట్టుకొని నీటిపై దేలి వగచుచుండ,
వడిగ నట కొక్కతోడేలు వచ్చెనపుడు.

గీ. వచ్చినవృకంబుఁ గని నక్క యిచ్చ నలరి
"హితుఁడ! నాపాలిభాగ్యదేవతయె యిటకు
నిన్ను నిచ్చెఁ గాన నొకత్రాడు నీట వైచి
నన్నుఁ బై కీడ్చి వేగఁ బుణ్యమునఁ బొమ్ము."

గీ. అనుచుఁ బ్రార్థింపఁ దోడేలు కనికరమున
"సఖుఁడ! నీ కిట్టిగతి యేల సంఘటిల్లె?
వివరముగఁ దెల్పు నాతోడ వెఱవు మాని;
ధైర్యము వహింపు" మంచు నోదార్పఁ దొడఁగె.

గీ. కనికరపుమాటలను శాంతి గనక నక్క
"ప్రియుఁడ! నామీఁద నణువైనఁ బ్రేమ మున్న
జాలి చూపుచు నిలువక సరగ వచ్చి
తోడు చూపుము నీ" వంచు వేఁడుకొనియె.

గీ. కరుణగల మిత్రుఁ డైనది కానిదియును
గష్టకాలంబుననె సుమ్ము కానవచ్చు;
కష్టవేళఁ బిల్వక వత్తు రిష్టసఖులు
పిలిచినను గాని రాకుంద్రు కలిమి వేళ.

## స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తకచరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నిహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 ,, ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థులధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్వా కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము
24 స్త్రీపునర్వివాహ భూత వర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర



జాక్సన్ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము-1951

# నీతికథామంజరి

## ద్వితీయభాగము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1951

[వెల రు 1-0-0

[illegible]

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

### ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్వివాహ ప్రహసనము
5 బలాత్కార గానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషనైశ్వర విలాసము
12 వేశ్యప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥ భా॥
16 ,, రెం॥ భా॥
17 ,, మూ॥ భా॥

### నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

### వచన ప్రబంధములు

### పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥ భా॥
2 ,, రెం॥ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# నీతికథామంజరి

అను

# ఈసపుకథలు

## ద్వితీయభాగము



గ్రంథకర్త:

**కందుకూరి వీరేశలింగము పంతులు**

ఇంగ్లీషునుండి తెనుఁగుభాష కనుకూలముగా నీతిపద్యములతో

వచనరూపమున తెనిఁగింపఁబడి

37 పటములతోఁ బ్రకటింపఁబడినది.



ప్రకాశకులు:

**హితకారిణీసమాజము**

**రాజమహేంద్రవరము**

**1950**

| కథ | | | పుట |
|---|---|---|---|



పద్యములు

శ్రీ

# నీతికథామంజరి

## ద్వితీయభాగము



### 76. నక్క, కోడి

నక్క యొకటి యొకనాఁటి తెల్లవాఱుజామున కోళ్ళదొడ్డివద్దకు వచ్చి తననిమిత్తమయి పన్నియున్నవలలో పడెను. అది యొక కోడిపుంజు దూరమునుండిచూచి, అట్టివంటి భయంకరమయిన శత్రువులను సమీపించుట కొక్కసారిగా సాహసింపలేక భయపడుచు మెల్లమెల్లగాఁ గొంతదాపునకు వచ్చి, గుండెలు తటతటకొట్టుకొనగా చాటుననుండి తొంగిచూచెను. నక్క దానిరాకచూచి చేరఁబిలిచి మాయ యచ్చుపడునట్లుగా "ఓమిత్రమా! నాకిక్కడ నెటువంటి కష్టము సంప్రాప్తమయినదో చూచితివిగదా! ఈయాపత్తంతయు

నాకు నీమీఁదియుపేక్షచేత వచ్చినది. నేను గ్రామసంచారముచేసి యీకంచెదాపుననుండి యింటికిఁ బోవుచుండఁగా నింతలో నీకంఠస్వరము వినఁబడినందున నీక్షేమసమాచారము విచారించి పోవలెనని వచ్చి యీవలలో పడినాను. కాఁబట్టి నీవీయురిని ఛేదించుటకయి నా కొకకత్తిని దెచ్చిపెట్టవలెను. ఆపని నీచేత కాకపోయినా, నే నీయురిత్రాటిని నాపండ్లతో మెల్లఁగా తెగఁగొఱుకువఱకు నాదుర్దశను నీ వెవ్వరితోను జెప్పక యూరకుండు'' అని మంచిమాటలు చెప్పెను. ఆకోడిపుంజుమాఱుమాటాడకపరుగెత్తుకొనిపోయిబిగ్గరగాఁ గూసి వెంటనే తనయజమానుని కానక్కవార్త తెలియఁబఱిచెను. అంతట వాఁడొక దుడ్డుకఱ్ఱ తీసుకొనివచ్చి పాఱిపోవుట కవకాశము కలుగకముందే నక్కను చావమోఁదెను.

గీ. ముఖముముందఱస్తుతులకు మోసపోక
తాను వారింపఁదగు నాపదలవిధంబు
ముందుగవిమర్శ యొనరించి బుద్ధిమంతుఁ
డర్హులకుమాత్ర ముపకార మాచరించు.

## 77. సింహపుతోలు కప్పుకొన్నగాడిద

సింహచర్మ మొకచోటఁ బడియుండఁగాఁ జూచి యొకగాడిద యాతోలు తనమీఁదఁ గప్పుకొని పట్టరానిగర్వముతో గంతులు వేయుచుఁ బరుగులెత్తి మనుష్యులను మృగములను బెదరించుచు సాయంసమయమునం దొకపొలములోఁ బ్రవేశించిమేయుచు నింటికిఁ బోకుండెను. అంతట యజమానుఁడు తనగాడిద వేళ కింటికి రాకపోవుటచేత దాని వెదకుకొనుచు వచ్చి దాని నిడుదచెవులను బట్టి ఘూనవాలుపట్టి చేరువకుఁ బోయి, సింహచర్మము కప్పుకొన్నను

సింహము గాక గాడిదగానే యుండునని తెలిసికొని బుద్ధి తెచ్చుకొను నట్లుగా దుడ్డుకఱ్ఱతోఁ గొట్టి, దాని నింటికిఁ దోలుకొనిపోయెను.

గీ. అధికుఁ డనితోఁప మాయ చేయంగఁబోక
నరుఁడు స్వదశకుఁ దగినట్లె నడవవలయు
లేని వేషంబు వేసెడుహీనునకును
గల్గు పయి నుబ్బి కష్టముల్ పెల్లువచ్చు.

## 78. పురమూషకము, వనమూషకము

బాల్యస్నేహమునుబట్టి తన్నుచూడవచ్చిన పట్టణవాసియైన యెలుకకు వనమునందు వాసముచేయుచున్న యెలుక యొకటి విందు చేసెను. ప్రతిదినమును తా నట్టిభోజనము చేసినను గృహస్థధర్మమునుబట్టి యతిథి యింటికివచ్చినప్పు డతిథిసత్కారము చేయవలసి యుండుటచేత నాఁ డాయడవియెలుక తాను సాధారణముగా భుజించెడు జొన్నకంకులు మొదలయినవి పెట్టక తనమిత్రునకపూర్వము లయిన గుమ్మడికాయ ముక్కలు చిక్కుడుగింజలు మొదలయిన పదార్థములను గుడువఁ బెట్టెను. అప్పు డాయూరియెలుక తనచెలికానిని జూచి "మిత్రుఁడా! ఇంతకాలమునుండి నీవీ యిఱుకు బొఱియలో వనవాస మెట్లుచేయుచున్నావో నాకు మహాశ్చర్యకరముగా నున్నది. ఇక్కడ చెట్లును పుట్టలును రాళ్ళును రుప్పలును దప్ప మఱి యేవియు కంటికిఁ గానరావు. మాపట్టణ మిట్టిదిగాక దర్శనీయము లయిన సమస్తవస్తువులను గలదయి భూతలస్వర్గమువలె కన్నులపండువుగా నుండును. మాయూ రొక్కసారి చూచితివా యిఁకనెప్పుడును నీవు దానిని విడిచిపెట్టవు. తేపటిదినము మనదికాదు. బ్రతికియున్న దినములలో నేఁడే సుఖ మనుభవింపవలెను. కాఁబట్టి యీరీతిగా నట్ట

డవిలో కాలము వ్యర్థముగా పోఁగొట్టక వెంటనే నావెంటరమ్ము.” అని వేగిరించి యాయెలుకను దనతోఁ బ్రయాణము చేసెను. ఆవన మూషకము మిత్రవాక్యమునునమ్మి భోగాశచేత నాఁటిరాత్రిచీఁకటి పడగానే బయలుదేఱి మిత్రునితో నడచి యర్ధరాత్రమునకు పుర మూషకము యొక్క గృహమును జేరెను. ఆదివ్యభవనమునందు నాఁటిరాత్రి గొప్పవిం దగుటచేత విం దారగించినవారు విడిచిపోయిన పంచభక్ష్యపరమాన్నముల శేషము నట్టింట చెదరి యుండెను. అప్పు డాపురమూషక మాముక్కల నేఱితెచ్చి వనమునుండి వచ్చినమిత్రు నకుఁ గుడువఁ బెట్టుచు పురవాసమువలని సౌఖ్యములను వేయినోళ్ళ శ్లాఘింప మొదలు పెట్టెను. ఈశ్లాఘన సగమయినను ముగియక మునుపే యింతలో లోపలినుండి యెవ్వరో వచ్చి యదలించి యాయె లుకను కఱ్ఱతో తఱిమివేసిరి. ఆ యెలుకలు ప్రాణములు తప్పించు కొని కలుగులో ప్రవేశించుటయేతడవుగా వానియలుకుడువిని లోపలి నుండి పెంపుడుపిల్లి యొకటి పరుగెత్తుకొనివచ్చి వానిని తన పొట్ట బెట్టుకొనుటకయి యాకన్నముముందు నడయాడసాగెను. అదియం తయుఁ జూచి యడవియెలుక కలుగులోమూర్ఛపోయి కొంతసేపటికి తెలివి తెచ్చుకొని నాఁటిదిన మంతయు నా కారాగృహములో నెట్లో గడపి తనమిత్రునితో “చెలికాఁడా! నీపురనివాససౌఖ్య మంతయు నింతేకదా! నీసౌఖ్యమునకును నీకును వేయి నమస్కారములు. ఈ భోగములు నీవే యీదివ్యభవనములో ననుభవించుచు మాయిఱుకు బొఱియలో నాజొన్నకంకులతో కష్టపడుటకయి నన్ను శీఘ్రముగా నాయడవికిఁ బంపివేయుము” అని సెలవు గైకొని మఱునాఁటిసాయం కాలము చీఁకటి పడఁగానే బయలుదేఱిపోయి మరల నిజనివాసము చేరెను.

గీ. భూరిభయయుక్తపాయసభుక్తికంటె
గాసి లేకుండ లభియించు గంజి మేలు
పరులకృప నబ్బుభాగ్యజీవనము కంటె
వసుధ స్వచ్ఛందమౌ బీదబ్రతుకె లెస్స.



## 79. నక్క, సింహము

నక్క యొక్కటి మొట్టమొదట సింహమును జూచినప్పుడు భయముచేత వడకుచు కదల మెదలలేక పోయెను. రెండవసారి మరల సింహమును జూచినప్పుడు నక్క కొంచెము భయము తీఱి యెదుట నిలుఁవబడి సింహమువంకఁ దలయెత్తి చూడఁగలిగెను. అటుతరువాత మూడవసారి సింహ మెదురుపడినప్పు డానక్క నిర్భయముగా సమీపమునకుఁ బోయి నమస్కరించి ప్రసంగమున కారంభించెను.

గీ. అతిపరిచయంబున నవజ్ఞ యగుట తెలిసి
తెలివిగలవారు కనుగల్గి మెలఁగవలయు.
అధికగర్వంబుగాని నైచ్యంబుకాని
విడిచి ఋజువృత్తి నెప్పుడు నడుచు టొప్పు.



## 80. పర్వతము ప్రసవించుట

ఒకదేశమునందున్న యొకపర్వతములోనుండి యేదో యొక గొప్పధ్వని వినఁబడెను. అది విని కొందఱుజనులు పర్వతము నొప్పులు పడుచున్నదని యొకప్రవాదము వేసిరి. ఆమాటలు వెంటనే దేశమంతటను వ్యాపింపఁగా మూఢులు సమ్మి పర్వతముయొక్క ప్రసవవేదనను జూడవలెనని పట్టణములనుండియు పల్లెలనుండియు ప్రతిదినమును గుంపులుగుంపులుగా రాఁ దొడఁగిరి. ఇట్లు వేలకొలఁదిజనులు వచ్చి పర్వత మేమిబిడ్డను కనునో వేడుక చూడవలెనని చిరకాల మత్యాసక్తితో కొండచుట్టును జేరి కనిపెట్టుకొని యుండఁగా తుట్టతుదకొకనాఁ డాపర్వతములోనుండి యెలుకపిల్ల యొకటి పయికి వచ్చెను.

గీ. అల్పు లొకకొంద ఱేదో యత్యద్భుతంపుఁ
గార్య మాచరించెదు నట్లుగా నటించి
వట్టియాడంబరము చేసి తుట్టతుదకు
హాస్యపాత్రు లగుదు రల్ప మాచరించి.

# 81. గరుత్మంతుఁడు, కాకి

క్షుద్బాధచేత గరుత్మంతుఁ డొకఁడు పర్వతాగ్రమునుండి వచ్చి పొలములో మేయుచున్న గొఱ్ఱెపిల్ల నొకదానిని కాళ్ళసందున నిఱికించుకొని నిమిషములో మరల గగనమార్గమున నెగసి పోయెను. చేరువ చెట్టుమీఁదఁ గూరుచుండి చూచుచున్న కాకి తానుకూడ గరుత్మంతునివలెఁ జేయఁదలచుకొని, చివ్వన నెగిరివచ్చి యొకగొఱ్ఱె వీపుమీఁద వాలి తనకాళ్ళు దాని బొచ్చులో తగుల్కొనఁగా వదల్చుకోలేక యఱచుచు గిజగిజ కొట్టుకొన నారంభించెను. అది చూచి గొల్లవాఁడు గొఱ్ఱెవద్దకు వచ్చి గోళ్ళు గొఱ్ఱెబొచ్చులో చిక్కుకొనుట చేత నెగరలేకున్న కాకిని సులభముగా పట్టుకొని యాడుకొనుట కయి తనపిల్లవాండ్ర కిచ్చెను.

గీ. ఆత్మపరశక్తు లరయక స్వాతిశయతఁ
జేత కానట్టి పనులకుఁ జేయి చాపి
యధికునట్లు నటించెడు యధమ జనుఁడు,
ధాత్రిలోపలఁ బరిహాసపాత్రుఁ డగును.



## 82. కుక్క, తోడేలు

ఒకనాఁటి వెన్నెలలో వనమంతయుఁ దిరిగి వేసారి యాహార మెక్కడను దొరకకపోవుటచేత సాహసముచేసి చిక్కియున్న బక్క తోడే లొక్కటి గ్రామములోఁ బ్రవేశించి యొకధనికునియింటి ముందటఁ దిరుగుచున్న బలిసియున్న యొక కుక్కను జూచెను. అప్పు డాతోడేలు కుక్కసమీపమునకుఁబోయి నమస్కరించి కుశలప్రశ్నము చేసి తనబంధుత్వమును దెలుపుకొని "మిత్రుఁడా! నీవు మిక్కిలి యారోగ్యదశలో నున్నట్లు కనఁబడుచున్నావు. ఇటువంటి కాయ పుష్టియు సుందరవిగ్రహమును గలవానిని మనబంధువర్గములో మఱి యెవ్వరిని నే నీవఱకుఁ జూచియుండలేదు. నాకంటె నెక్కువమంచి స్థితిలో నీవెట్లుండఁగలిగితివో కారణము కొంచెము నాయందనుగ్రహించి తెలుపుము. నన్ను నేను బ్రశంసించుకొన్నచో నాత్మస్తుతిగాఁ దోఁచునేమోకాని నిజముగా నేను నీకంటె పదిమడుఁగు లెక్కువ సాహసముతో వెలువడి యెక్కడెక్కడనోయున్న రహస్యస్థలము లన్నియు నీకంటె నెక్కువగా తిరిగి ప్రతిదినమును పొట్టకయి నేను నీకంటె సహస్రగుణము లెక్కువగా పాటు పడుదును. అయినను కడుపు నిండక యాఁకలిచేత బాధపడుచు నే నిట్లు చావునకు సిద్ధ

ముగా నున్నను.'' అని పలికెను. ''నేను జేసినట్లే నీవును జేసినపక్షమున నీవును నావలెనే యుందువు'' అని కుక్క యుత్తర మిచ్చెను. ''నీవుచేసెడిపనియేమో నాకుఁ జెప్పుము.'' అని తోడేలడిగెను. ''ఇల్లు కావలికాచి దొంగలను లోపలికి రానియ్యకుండుట. ఇంతకంటె మఱేమియు లేదు,'' అని కుక్కబదులు చెప్పెను. ''ఇంతే కదా! ఈపని నేను నామనఃపూర్తితోఁ జేసెదను. ఇప్పటి నాస్థితి మహాదుఃఖకరమయినది. గాలికి వానకుమంచునకు సహించి మలమల మాడుచు నట్టడవిలో బట్టబయలను నివాసముచేయుచుండుటకంటె వేళ తప్పకుండ ప్రతిదినమును మంచిభోజనము చేయుచు హాయిగా మంచికప్పుగలవెచ్చనియింట వాసము చేయఁగలుగుటమహాభాగ్యము కదా ?'' అని తోడేలు పలికెను. ''అందుకు సందేహము లేదు. ఇఁక నీవు నీయింటిమీఁది ధ్యానమును విడిచి పెట్టి యిక్కడ నాతో నుండి నావెంటఁ దిరుగుచుం[illegible]ము,'' అని కుక్కతోడేలునకు హితోపదేశముచేసెను. అంతట నారెండును దొడ్డియంతయుఁ దిరుగుచుండఁగా తోడేలు కుక్క మెడలో పట్టెడయొకటి యుండుట చూచి, అది యేమో యడిగి తెలిసికోవలెనన్న వేడుక గలదయి ''మిత్రుడా! నీమెడలో నేమో కనఁబడుచున్నది. దాని యుపయోగ మేమో వివరించి నాయభిమతమును దీర్పుము'' అని వేఁడుకొనెను. ''అట్లయిన చోఁ జెప్పెదను వినుము. నేను కొంచెము కోపస్వభావము కలదానన గుటచేత మనుష్యుల నొకవేళ కఱచిపోదునేమోయని పగటిపూట నన్ను కట్టిపెట్టి యింటివారు రాత్రిపూటమాత్రము నన్ను విడిచిపెట్టుదురు. అంతేకాక నేను పగలు నిద్రపోయి రాత్రులు మెలఁకువగలిగి యుండి యింటిని జాగరూకతతో కావలికాచుచుండవలెనన్న యుద్దేశముచేత నన్ను ముఖ్యముగా నీపట్టెడకు గొలుసు తగిలించి యింటి స్తంభమునకు కట్టిపెట్టుదురు. ఇట్లు పగళ్లు కట్టిపెట్టినను సూర్యాస్త

మానము కాఁగానే మెడగొలుసు విప్పి నన్ను విడిచిపెట్టుచుండుట చేత రాత్రులు నేను యథేచ్ఛముగా సంచారము చేయవచ్చును. నా యజమానుఁడు ప్రతిదినమును మాంసము తానుతిని మాంసములో దిగఁబడిన యెముకలు మొదలయినవాని నన్నిటిని స్వయముగాఁ దీసికొనివచ్చి తనచేతులతో నాకుఁ బెట్టును: ఇంట నున్నవారి కంద ఱికిని నామీఁద ప్రేమయగుటచేత వారందఱును తాము తినఁగా మిగిలినవస్తువులను దెచ్చి మనుగుడుపు పెండ్లికొడుకువలె నాకుఁగుడువఁ బెట్టుదురు. నేను సుఖపడువిధ మంతయు నీవు విన్నావుకదా? ఇఁక నావెంటరమ్ము. ఏమి? అనుమానించుచున్నావేమి ?" అని కుక్క పలికెను. "రాను. నేను నీవెంట రాను. నీసౌఖ్యమంతయు నీకే యుంచుకొని యిఁక నన్ను విడిచిపెట్టుము. నీవు చెప్పినసౌఖ్యము నా కక్కఱలేదు. నాకు ముఖ్యముగా కావలసినది స్వతంత్రత్వము. అది లేకపోయినతరువాత రాజ్యాధికార మిచ్చినను నా కక్కఱలేదు. అని పలికి యచ్చట నిలువక తోడేలు వెడలిపోయెను.

గీ. అన్యునకు దాసుఁడయియుండి యనవరతము
పాయసాన్నంబుఁ గుడుచుచు బ్రతుకుకంటెఁ
దాను బరు వేడఁబోక స్వతంత్రవృత్తి
గంజిత్రాగుచు బ్రతుకుట కరము లెస్స.



## 83. నక్క, తోడేలు

ఒకతోడేలు తాను వాసముచేయుచున్న గుహాయందు ఆహార పదార్థములను నిలువచేసికొని యిల్లు కదలవలసిన పనిలేక సుఖముగా జీవనము చేయుచుండెను. నక్క యీసంగతిని విని యోర్వలేక నిజము తెలిసికొనిరావలెనని తోడేలుయొక్క దర్శనము నిమిత్తము పోయి తనరాకను లోనికిఁ జెప్పి పంపఁగా, తోడేలు తన దేహ మస్వస్థముగా నున్నదని మిషపెట్టి దానికి దర్శనమియ్యక పంపివే సెను. అందుచేత నక్క మిక్కిలి కోపించుకొని తిన్నగా గొల్లవాని యొద్దకుఁబోయి తోడేలు మందలోని గొఱ్ఱెపిల్లల నెత్తుకొనిపోయి తనగుహలోఁ బెట్టుకొని తినుచున్నదనియు, మంచియీటె తీసికొని తనవెంటవచ్చి దానిని పొడిచి చంపినపక్షమున నేఁటితో దానిబాధ మానుననియు, చెప్పి వానిని గుహయొద్దకుఁ దీసికొనిపోయి వానిచేత నాతోడేలును చంపించెను. తోడేలు చావఁగానే దానిస్థానమున నక్క యాగుహలో ప్రవేశించి యది సంపాదించుకొన్న భోజనపదార్థము లను తాను యథేచ్ఛముగా ననుభవించుచుండెను. కాని యాభోగ

మానక్కకు చిరకాలము దక్కినదికాదు. ఒకగొల్లవాఁడు తనగొఱ్ఱె పిల్లయొకటి తప్పిపోఁగా దానిని వెదకుకొనుచు సింహలగుహావద్దకువచ్చి నక్క యక్కడనుండుట చూచి ముందేలును పొడిచిన యీటెతోనే దానిని పొడిచి చంపి తనదారిని బోయెను.

గీ. పరుల నపహరించుకొన్న పాయములను
దెలిసి తా భాగమును నపేక్షించువాఁడు
కోరి పరులకై ప్రవ్యాసగోష్ఠిలోన
యవల దానును గూలి మరణము నొందు.

---



## 84 పాము. కాపువాఁడు

కాపువాఁడొకఁడు శీతకాలములో ప్రాతఃకాలముననే లేచి తనపొలములోనికిఁ బోయి యందుఁదు తిరిగి కంచెవద్ద నొక పాము మంచుచేత బిఱ్ఱబిగిసికొని చచ్చినట్లు పడియుండఁగా జూచి జాలిపడి దాని నింటికిఁ దీసికొనివచ్చి పొయివద్ద వెచ్చనిస్థలములో నుంచెను. ఆ పెట్టుచేతఁ గొంతసేపటికి కదలఁ దేఱుకొని లేచి యిల్లు నాలుగుమూలలు తిరుగుచు బుసకొట్టుచు వాని భార్యమీఁదను, బిడ్డలమీఁదను బడి కఱువఁబోయెను. పాముకు భయపడి వారందఱు నఱచుచు నానా ముఖముల పరుగులెత్తఁగా ఆకాలములో నిల్లంతయు నల్లకల్లోలమయ్యెను. ఆసందడివిని కాపువాఁడు వీధిలోనుండి పరుగెత్తుకొనివచ్చి

సంక్షోభకారణమును తెలిసికొని "ఓ పాపపుసర్పమా ! నీయందు దయ తలఁచి ప్రాణము రక్షించినమాకు ఫలము తోడనే కలిగినది. ఇఁక నీవు నీకృతఘ్నతకు తగినచావు చావుము." అని యొకదుడ్డు కఱ్ఱతో దానితల చితుకఁగొట్టి దానిని మృత్యుగృహమునకుఁ బంపెను.

గీ. ధరణిఁ బాపాత్ములందుఁ గృతఘ్నుతోడఁ
దుల్యుఁ డగుపాపి ! యెందును దొరకఁ బోఁడు

వధముఁ గృతఘ్నుకు తగిన సమ్మతముగు.



## 85. ముసలివాఁడు, కొడుకులు

ఒక ముసలివానికి కొడుకు లనేకు లుండిరి. వారు తమలోఁ దాము తఱుచుగా తగవు లాడుచుండిరి. వారి తగవులాటలు మాన్పి వారిలో వారి కైకమత్యము కలిగింపవలెనని యెన్నిసారులో తండ్రి ప్రయత్నము చేసెను గాని యాతని కృషి యంతయు నిష్ఫల మయ్యెను. అతఁడు తరువాత నొక యుపాయ మాలోచించి యొక

వాఁడు కొడుకుల నందఱిని దనయొద్దకుఁ బిలిపించి, వారిముం దొక కట్టెలమోపుపెట్టి మీలో నెవ్వఁడైన తనబలమునంతను జూపి దీనిని విఱువఁగల మగవాఁడున్నాఁడేమో ప్రయత్నముచేసి చూడుఁడని చెప్పెను. అప్పుడు వారొక్కరొక్కరే మహాపౌరుషముతో ముందుకువచ్చి రెండుచేతులతోను కట్టెలమోపును గట్టిగాఁబట్టి యావచ్ఛక్తిని వినియోగించి విఱువఁజూచిరి గాని కట్టెలు కట్టగాఁ గట్టఁబడి దుర్భేద్యముగానుండుటచేత విఱువ లేక సిగ్గుపడి పండ్లికిలించుచు వెనుకకు తొలఁగిపోయిరి. అటు తరువాత వాఁడు వారిని మరలఁ బిలిచి మోపు విప్పి యెదుటఁ బెట్టి యిప్పుడు తల యొకకట్టయుఁ బుచ్చుకొని విఱువఁగలరేమో చూడుఁడని చెప్పెను. అప్పుడు వారందఱును మహాసంతోషముతో నొక్కొక్కకట్టనే చేతఁ బట్టుకొని యవలీలగా క్షణకాలములో కట్టలన్నియు విఱిచి పోగులు పెట్టిరి ; అంతట తండ్రి కొడుకులను జూచి "ఓపుత్రులారా! సంఘీభావముయొక్క శక్తి మీకిప్పుడు బోధపడినది గదా! ఈకట్టెలవలెనే స్నేహానుబంధముచేఁ గట్టఁబడి మీరందఱు నేకమయి యున్న పక్షమున మీ రెవ్వరికిని సాధ్యులు కాకుందురు. ప్రేమానుబంధమును బోఁగొట్టుకొని కలహములచే విడిపోయి యొంటరిగాండ్రయిన పక్షమున మీరు పరులకు సుఖసాధ్యులగుదురు పరస్పరైకమత్యమువలనను ప్రేమమువలనను గలుగు లాభమును సౌఖ్యములను బోఁగొట్టుకొని దుఃఖముల పాలగుదురు." అని బోధించెను. ఆమాటవలన వారు బుద్ధి తెచ్చుకొని నాఁటినుండియు నన్యోన్యానురాగముగలవారయి పోరాటము మాని సుఖపడఁ జొచ్చిరి.

గీ. వసుధ నేకకుటుంబమువార లెప్పుడుఁ
గలిసి యన్యోన్యమైత్రితో మెలఁగ వలయు.
ఒండొరులతోడఁ బోరాడు చుందు రేని,
యహితులకు వారు సుఖసాధ్యు లగుదు రొకట.

# 86. ముసలికుక్క

ఒకవేఁటకుక్క తనవయఃకాలములో మిక్కిలి యుపయుక్తముగా నుండి యెంత బలవంతమైన జంతువుమీఁదనైనను పులివలెఁ బడి వేఁటాడి యజమానుని కెంతో సంతోషము కలుఁగజేసి యిప్పుడు కాలమహిమచే ముసలిదయి బలహీనపడిపోయెను. ఇట్టి స్థితియందాకుక్క యొకనాఁడు తనయజమానునితో పొలమునకుఁ బోయినప్పుడు దుప్పియొక్కటి యక్కడకు పరుగెత్తుకొని రాఁగా మహావేగముతోఁ బోయి దానిమీఁదఁ బడి పిక్కపట్టుకొనెను గాని ముదిమిని బట్టి పండ్లతో గట్టిపట్టు లేక పోవుటచేత దుప్పి యాపట్టును వదల్చుకొని యావృద్ధశునకమును తన్ని తప్పించుకొని పాఱిపోయెను. అప్పుడు యజమానుఁడు దుప్పిని వదలిపెట్టినందునకయి మిక్కిలి కోపముగలవాఁడయి దాని గొడ్డకుఁబోయి కఱ్ఱయెత్తి కొట్టఁబోఁగా, "కాలమంతయు నీసేవకే ధారపోసి దుర్బలుఁడనయియున్న నన్ను నిష్కారణముగా నేల కొట్టెదవు! ఇప్పుడు సహితము నామనస్సు నీసేవకొఱకే దీక్షవహించియున్నను శిథిలములయిపోయినవి యీయవయవములు పని చేయఁజాలకున్నవి. నే నేమి చేయుదును? ఇప్పటి నాస్థితి నీకు కోపము తెప్పించుచున్నను నాపూర్వస్థితిని గొంచెము స్మరణకుఁ దెచ్చుకొని శాంతి వహించి నన్ను మన్నింపుము" అని యాకుక్క పలికెను.

గీ. కాల మెల్లను బ్రభుసేవఁ గడపినైచి
పూర్వజవసత్వములఁ బాసి ముసలులైన
మంచిభృత్యులకృతిమును మఱచిపోక
నాయకుఁడు వారిపోషణ చేయవలయు.



# 87. రోగము వచ్చిన గ్రద్ద

ఒకగ్రద్ద దీర్ఘవ్యాధిచేత బాధపడుచు దేహము మరల స్వస్థపడు నన్నయాశలేనిదయి తల్లిని జేరఁ బిలిచి "అమ్మా! నీ విప్పుడు దేవాలయమునకుఁ బోయి దేవతలకు మ్రొక్కి యభిషేకములు చేసి నాపాపముల క్షమించి నాకారోగ్యము దయచేయుటకయి ప్రార్థన చేసి రమ్ము" అని వేఁడుకొనెను. "నాయనా! నీబ్రతుకు నిమిత్తమయి నే నేపనిని చేయుమన్నను జేసెదను. అయినను నేను దేవతల నేమని ప్రార్థించవలయునో తెలియఁజాలకున్నాను. నీవు తిన్నగా నున్నంతకాలమును జీవహింసనే నిత్యవ్రతముగాఁ జేసికొని సదా సాధుజంతువులను బాధించుచుంటివి. అంతేకాక ప్రతిదినమును నే నిప్పుడు మ్రొక్కఁబోయెడు దేవతలసన్నిధానమునందా దేవాలయములోని పావురములనే హింసించి వాని రక్తముతో దేవతల నెత్తిమీఁదనే యభిషేకము చేయుచువచ్చిన నిన్ను దయ చూడవలసిన యా దేవతలను నే నేమొగముతో వేఁడుకోఁ గలుగుదును?" అని పలికి యాముసలిగ్రద్ద కన్నుల నీరు పెట్టుకొనెను.

గీ. మరణకాలమందు దఃఖములు మనసు నెపుడు
బాధపెట్టును గావున వ్యాధి తఱిని
పాపము క్షమింప వేఁడక ప్రాజ్ఞుఁ డెపుడు
దురితమును జేయ కుండంగఁ దొడఁగవలయు.

## 88. ముసలి సింహము

ఒకసింహము జంతువులను జంపి చంపి ముసలిదయి యవసాన కాలము సమీపించినందున దొమ్మ రోగులుచేత బాధ పడుచు మూలుగుచుండెను. అప్పుడు పూర్వము దానివలన బాధపడి తప్పించుకొని బ్రతికిన జంతువు లనేకము లక్కడకు దవచ్చిమరణవేదన ననుభవించుచున్న తమ వృద్ధశత్రునిమీఁద పగ తీర్చుకొన నారంభించెను. ముందుగా వరహ మొకటి వచ్చి యాసింహమును తనవాఁడి కోఱలతోఁ బొడిచెను; అటు తరువాత వృషభ మొకటి వచ్చి సింహమును కొమ్ములతోఁ గ్రుమ్మెను; ఆరెంటిని జూచి యిఁక సింహము వద్దకు నిర్భయముగాఁ బోవచ్చునని ధైర్యము తెచ్చుకొని గాడిద యొకటి మెల్లగా దాపునకు బోయి వెనుకటి కాళ్ళతో దానితల తన్నెను. ఆయవమానమును సహింపలేక కుట్టూపిరితో నున్న సింహము "అయ్యో! అవమానము ధైర్యశాలులవలనఁ గలిగినప్పుడు సహితము దుస్సహమయి మానవంతునకు చావువలెనుండును. అటువంటి స్థితిలో నిప్పు డీచచ్చుగాడిదవచ్చి మొగముమీఁద తన్నఁగాఁ జూచుట వేయి చావులు చచ్చుటకన్నను దుఃఖకరముగా నున్నది." అని పలికి ప్రాణములు విడిచెను.

గీ. వార్ధకంబునఁ బురుషుండు పరులవలనఁ
దాను గౌరవ మొందంగఁ దలఁచు నేని,
పడుచుతనమున నెప్పుడుఁ బరులయెడల
మిత్రతయు సాధుతయుఁ గల్గి మెలఁగవలయు.



## 89. వేటకాఁడు, సింహము

పూర్వకాలమునం దొక వేటగాఁడును సింహమును వనములో నొకచోటఁ దారసించినప్పుడు జరిగిన సంభాషణములో బలమునందు మనుష్యుఁ డెక్కువా సింహమెక్కువా యన్నప్రశ్నము వచ్చెను. అప్పుడా వేటగాఁ డడవిలోఁ దమ కెదురుగా సింహమును మనుష్యుఁడు పట్టుకొని యలయించుచున్నట్లు మలఁచఁబడియున్న రాతివిగ్రహమును సింహమునకుఁ గనఁబఱిచి, మృగరాజుకంటె మనుష్యుడే యధికుఁ డన్న తనవాదమును స్థాపించుటకయి దాని నొకనిదర్శనముగాఁ జూపెను. ఆమాటలకు పకపక నవ్వి "నీవాదమునకుఁగల బలమంతయు నింతే యైనపక్షమున నింతకంటె దుర్బలహేతు వింకొకటిలేదు. రాతియం దావిగ్రహములను మలఁచినశిల్పి మనుష్యుఁడుగాక సింహమే యయియుండిన పక్షమున, సింహమే మనుష్యునిఁ బట్టుకొని యలయించు చున్నట్లు చెక్కియుండును." అని సింహ ముత్తరము చెప్పి వాని వాదమును ఖండించెను.

గీ. నరుఁడు స్వాధిక్యనిర్ధారణంబునందుఁ
దానె యర్హుఁడు కాఁ డెందుఁ దలఁచిచూడ
ఉభయపక్షంబులందును గల్గుయుక్త లరసి
యన్యులే కార్యమును దీర్ప నర్హు లెపుడు.



## 90. సింహము మనుష్యస్త్రీని కామించుట

ఒక చెంచువాఁడును కూఁతురును వనములో సంచరించు చుండఁగా సింహమొకటి వారి కెదురుపడి యా చెంచుకన్నియయొక్క చక్కఁదనమును జూచి యద్భుతపడి మోహించి యాకన్యను దన కిచ్చి వివాహము చేయవలసిన దని తండ్రినడిగెను. ఆ చెంచువాఁడు తనకొమార్తెను మృగరాజు పాలుచేయుట కిష్టము లేనివాఁడయి తానాప్రార్థన నంగీకరింపని పక్షమున సింహ మేమిచేయునో యన్న భీతిచేతఁ దా నియ్య నని స్పష్టముగాఁ జెప్పలేక కొంతసే పేమిచేయుటకును తోఁచక యాలోచించి యొకయుపాయమును కనిపెట్టి "ఓమృగేంద్రా! నా పుత్రిక కపాయము కలుగ కుండుట కొఱకును నిన్నుఁ జూచి యీ చిన్నది జడియ కుండుటకొఱకును నీవు ముందుగా నీపండ్లను గోళ్ళను తీసివేసికొనుట కొప్పుకొన్నపక్షమున, నాకొమార్తెను నీ కిచ్చి వివాహము చేసెదను." అని సింహముతోఁ జెప్పెను. కామాంధమయియున్నసింహ మాచిన్నదానిమీఁది వలపుచేత వాఁడు చెప్పిన పద్ధతి కంగీకరించెను. అంతట వాఁడు క్రొత్తపెండ్లికొడుకుయొక్క పండ్లను గోళ్ళను పట్టుకారుతో నూడఁబెఱికి నిరాయుధుని జేసి, తన కూఁతునకు భర్తగా నపేక్షించి యున్నయానాలుగు కాళ్ళయల్లుని దుడ్డుకఱ్ఱతో చావ మోఁది గృహప్రవేశము నిమిత్తము యమమందిరమునకుఁ బంపెను.

గీ. వలచి కామాతురుం డైనవాఁడు పుడమి
నెట్టియిడుమల నైనఁ బైఁ బెట్టుకొనును
కరము నితరేతరానురాగంబుచేత
జోడు కలిసిన పెండ్లియే సుఖము నిచ్చు.



## 91. చీమ, ఈఁగ

ఉభయులలో నెవ్వరిజీవన మాశ్చర్యకర మయిన దన్నవిషయ మునుగూర్చి యీఁగకును చీమకును నొకనాఁడుగొప్పచర్చ జరగెను. అప్పుడాయిరువురును గొంతసేపు పూర్వపక్షసిద్ధాంతపూర్వకముగా నన్యోన్యయోగ్యతలనుగూర్చిమహావాదముచేసిరి. ఆవాదములో నీఁగ ముందుకు వచ్చి గంభీరస్వరముతో "నాస్థితి యెంతపూజ్యమయినదో లోక మంతయు నెఱుఁగును. దేవతానివేదమున కుంచిన పవిత్రప్ర సాదమును సహితము దేవునికంటెను ముందుగా నే నాఘ్రాణించి చవి చూచెదను. నేను సమస్తపుణ్యస్థలములకును బోయి యెల్లవారును పూజించెడు దేవతల శిరస్సుమీఁదనే యెక్కి యున్నతపదవిని ననుభ వించెదను. నే ననన్యప్రాప్యములగు రాజాధిరాజుల దివ్యభవనముల

యందు సహిత మిష్టవిహారము సలుపుచు వారి కరీటములమీఁద నా పాదములు సోఁకునట్లు నిలిచి గౌరవము పొందుదును. లోకములోని యెటువంటి యంతఃపురసుందరి చెక్కులమీఁద నైనను వ్రాలి యథేచ్ఛగా ముద్దుపెట్టుకొనఁ గలుగుదును. వేయేల? నేనణుమాత్రమును కష్టపడ నక్కఱలేకయే లోకములోని యుత్తమపదార్థముల నెల్లనను భవింపఁ గలుగుదును. ఇటువంటి మహావైభవము నీకెక్కడనున్నది?" అని తనయాధిక్యమును జెప్పుకొని చీమ నాక్షేపించెను. అప్పుడు చీమ రోషముతో ముందునిలిచి "ఇప్పుడు నీవు చెప్పినదానిలో మానవంతులు విని లజ్జపడవలసిన దేకాని సంతోషింపఁదగిన దేదియు నాకుఁ గానరాదు. ఆహ్వానముచేసి సమ్మానించినప్పుడు నీవిప్పుడు చెప్పిన విందు లన్నియు గౌరవనీయములు కావచ్చును గాన పిలువని పేరంట మెంతమాత్రము శ్లాఘాపాత్రము కానేరదు. ఆభోగములమాట యట్లుండనిమ్ము. లోకములోని యుత్తమపదార్థముల నెల్ల తేరగా ననుభవించు చున్నానని నీ వెంతగర్వించి దంభములు పలికినను, నేను పొలములో ధాన్యము సేకరించు చున్నప్పుడు నీ చుట్టము లందఱును జేరి గట్టుక్రింద కుళ్ళి కంపెత్తుచున్న కుక్కమాంసముతో విందారగించుచుండఁగా నిన్ననే నేను కన్నులారఁ జూచినాను. శరీరభరణమునకయి కష్టపడ నక్కఱ లేదని నీవిప్పుడేమో గొప్పగా ప్రజ్ఞ చెప్పుకొనుచున్నావు. యుక్తసమయములో పాటుపడకపోవుటచేతనే నీవు వర్షాకాలములో తడిసి తిండిలేక చచ్చుచున్నప్పుడు నేను వేసవి కాలములో కష్టపడి సంపాదించుకొన్న పదార్థముల ననుభవించుచు వెచ్చగా నాయింట నుండి బంధుమిత్రులతో హాయిగా సుఖించుచున్నాను" అని యుత్తరమిచ్చెను.

గీ. చెమట యూర్చి స్వార్జితముతో జీవనంబు
చేయువా రొక్కరే సుఖజీవు లెందు

ఉర్విలోపల నన్యభాగ్యోపజీవు
లెపుడు సుఖమును బడయలేం రించుకైన.

## 92. అడవిపంది, గాడిద

గజ్జెలకళ్ళెమును వన్నెలపల్లమును వేసి యలంకరించి యమ్మ వేయుటకయి యొక చాకలివాఁడు తనగాడిదను సంతకుఁ గొనిపోయి యడవిసమీపమున పొదలలో మేఁతకు విడిచిపెట్టెను. అది యలంకారములు తగిలించుకొన్నసంతోషముచేత నిక్కి ముండ్లపొదలు మేయుచు దానిని బోవువారి నెల్ల గర్వముతోఁ జూచుచు అప్పు డామార్గమున తలవంచుకొని పోవుచున్న యొకవరాహమును పరిహాసము చేయవలెనన్న యుద్దేశముతోఁ బిలిచి "మిత్రుఁడా! నీవిధేయసేవకుఁ డిక్కడ నున్నాఁడు." అని పలుకరించి యికిలించెను. వరాహము వెనుకతిరిగి చూచి పనికిమాలినగాడిద తన్ను "మిత్రుఁడా!" యని పిలుచుట యవమానకరముగా భావించుకొని, మిక్కిలి కోపముగలదయి, "ఓపశువా! నన్ను నీపరమాప్తుఁడ నయినట్లుగాఁ బిలిచి యెక్కసక్కెముచేసిన నీకండక్రొవ్వడఁగునట్లుగా నిన్ను పడఁబొడిచి పొట్ట చీల్చెదను జూడు" అని దానిని బెదరించెను. కాని యింతలో కోపమాపుకొని "ఓగాడిదా! ఇఁక మాఱుమాటాడక ప్రాణములు దక్కించుకొని యిక్కడినుండి పాఱిపో. నిజముగాఁ దలఁచుకొన్న యెడల నే నొక్కనిమిషములో నీప్రాణములు పుచ్చుకొని నన్ను నీ విప్పుడు చేసిన పరాభవమునకు తగినశిక్ష చేయఁగలను. అయినను నాస్వచ్ఛమయిన కోఱలను నీపాడునెత్తురుతో తడిపి మయిలపఱచుట నా కిష్టములేదు. ఇఁకనైన నీ వెప్పుడును నీకంటె నధికులను జూచి యికిలింపక బుద్ధిగలిగి బ్రతుకు." అని మందలించి యావరాహము తనదారిని బోయెను.

గీ. అల్పు లొక్కింతసిరి తమకబ్బఁగాను
గర్వమున వెక్కిరింతురు ఘనులఁ జూచి,
పాటిపట్టక తుచ్ఛలవచనములను
బటుతిరస్కృతితోఁ జూడవలయు బుధులు.

## 93. తండ్రి, కొడుకులు

ఒకకాపువాఁడు తాను బ్రతికియున్నంతకాలమును కష్టపడి పనిచేసి గౌరవముతో జీవించి, అవసానకాలము సమీపించి నప్పుడు తనవలెనే తనకొడుకులనుగూడ పాటుపడువారినిగాఁ జేయవలెనని యుద్దేశించి వారి నందఱిని తనమంచమువద్దకుఁ బిలిపించి, "ఓప్రియ పుత్రులారా! నేను మిమ్మందఱిని విడిచి యీలోకమునుండి పోవుచున్నాను. నాప్రాణములు పోకముందే నాధనమును మీ కప్పగింత పెట్టవలెను గదా! నాకున్నధనమంతయు మనపొలములో నున్నది. దానిని మీరు త్రవ్వుకొని నాయనంతరమున మీయావజ్జీవమును దానితో సుఖజీవనము చేయుఁడు." అని చెప్పి దేహము విడిచెను. తండ్రి పోయినతరువాత కొమాళ్లందఱును జేరి గడ్డపాఱలును పాఱలును గైకొని పొలమునకుఁ బోయి, అందెక్కడనో తమతండ్రి ధనము పాతిపెట్టి పోయినాఁడని వా రెన్నిసారు లెంతలోతుగా త్రవ్వి క్రిందిమన్ను మీఁదికిని మీఁదిమన్ను క్రిందికిని కదలించినను దానిలో నెక్కడను వారి కొక్కరూకయినను కంటఁ బడలేదు. కాని వారట్లు వెదకివెదకి తుద కందులో ధాన్యము చల్లఁగా, పలుమాఱు కదలత్రవ్వుటచేత పొల మాసంవత్సర మధికముగా ఫలించి యెక్కువ లాభము కలిగినందున ధనము మఱియొకవిధముగా వారికంటఁ బడెను. అందుచేత వారు తమతండ్రి పొలములోనుండి ధనము త్రవ్వుకోవలసినదని చెప్పిపోయినమార్గ మిదియే యని తెలిసికొని

యప్పటినుండి ప్రతిసంవత్సరమును చక్కఁగా పాటుపడుచువచ్చి కొంతకాలములో నిరుగుపొరుగులవారికంటె నధికధనమును గౌరవమును సంపాదించుకొని సుఖపడిరి.

గీ. ఒడలు వంచి చక్కఁగఁ బాటుపడినఁగాని
కలుగదు ఫలంబు జగతి నేకార్యమందు
కావున జనుండు సర్వదా కష్టపడుచు
గౌరవసుఖంబు లొందంగఁ గడఁగ వలయు.



## 94. కోయువాఁడు. వృక్షములు

వనచరుఁ డొకఁ డడవిలోఁ దిరుగుచు తన కేదో కావలసి యున్నట్లుగా నన్నిచోట్లను వెదక నారంభించెను. వాఁ డేమి వెదకుచున్నాఁడో తెలిసికోవలె నన్న యపేక్షచేత వృక్షములు వానిని జూచి నీ కేమి కావలె నని యడిగెను. "మఱియేమియు నధిక మక్కఱ లేదు. ఈగొడ్డలికామకొఱకై యొకచిన్నకఱ్ఱమాత్రము కావలెను."

అని వాఁ డుత్తర మిచ్చెను. వాఁడు కోరినకోరిక యల్పముగా కనఁబడినందున గట్టికఱ్ఱ నొకదాని నిచ్చి వానియభిమతమును తీర్పవలెనని నిశ్చయించి చెట్లు దృఢమగునకఱ్ఱ నొక దానిని వానికి దానము చేసెను. వాఁ డాకఱ్ఱ పుచ్చుకొని చెక్కి తనగొడ్డలికి కామగా నమర్చుకొని, తత్క్షణమే బయలుదేఱి కట్టలనిమిత్తమయి తనమీఁద దయదలఁచిన మహావృక్షముల నన్నిఁటిని నఱికి నేలఁ గూల్ప నారంభించెను. అప్పు డందులో నొకవృక్షము తక్కిన చెట్లనుజూచి "మిత్రులారా! మనము పాత్రవిచారము చేయక కిరాతునకు దానము చేసిన పాలఫల మనుభవించక తీఱదు." అని పలికి నేలఁ గూలెనఁట.

గీ. ఇతరులొకఁ దన్ను యాచించునెడ వివేకి
పాత్ర మెఱిఁగి దానము చేయవలయు నెపుడు
ఈవి యరయక పాత్రేతర కిచ్చు నేని
తనకుఁ దనవారికిని ముప్పు దాన వచ్చు.



## 95. గొల్లపిల్లవాఁడు

ఒకపిల్లవాఁడు పొలములోఁ గొఱ్ఱెలను మేపుచు, చుట్టు పట్లవారిని రప్పించి వేడుక చూడవలె నని యూరక "తోడేళ్లు!

తోడేలు!!" అని ఆటలకొఱకు కూయుచు వచ్చెను. వానియఱపులు విని యనేకపర్యాయములు చుట్టుపట్టులపొలములలో పనిచేసికొనుచున్న కాపులు తమపనిని మాని వానికి సాయముచేయుటకయి వచ్చి, వాఁడు తమ్ముఁ జూచి నవ్వుచుండఁగా వాఁడూరక తోడేలు రానిదే వచ్చినదని యఱచి తమ్ము మోసము చేసినాఁడని తెలిసికొని యిఁక ముందెప్పుడును వాఁడు కేకలువేసినప్పు డెవ్వరును రాకుండవలయునని కడసారి నిశ్చయము చేసికొని వెడలిపోయిరి. అటుతరువాతఁ గొన్నిదినములకు నిజముగానే తోడేలు వచ్చెను. అప్పుడు వాఁడు భయపడి వెనుకటివలెనే తోడేలు తోడే లని మరల నఱచెను. కాని వానియఱపులు విని యెవ్వరును తోడు రానందున తోడేలు మందమీఁదఁ బడి కావలసినన్ని గొఱ్ఱెలను జంపి యీడ్చుకొని పోయెను.

గీ. బొంకులవలన నెప్పుడుఁ గీడె మూడుఁ గాన
నాటలందు నైనఁ త మసత్య మాడరాదు
పురుషుఁ డొకసారి మొదలను బొంకె నేని
సత్యమాడిన నమ్మరు జనులు పిదప.

---

## 96. కోడి, పనికత్తెలు

ఒకముసలామెవద్ద నిద్దఱుపనికత్తెలుండిరి. ఆమె వారిని ప్రతిదినమును కోడికూసినతోడనే పనిచేయుటకు లేపుచుండును. ఈప్రకారముగాఁ గొంతకాలము జరిగినతరువాత తమకు ప్రతిదినమును నిద్రాభంగము కలుగుచుండుటకు విచారపడి పనికత్తె లిద్దఱును జేరి యాలోచించి "మన మీకోడిమూలమున తెల్లవాఱుజామున లేవవలసి వచ్చుచున్నది. మన మీపాడుకోడిని చంపివేసినపక్షమున ఱేపటినుండి హాయిగా ప్రొద్దెక్కినదాఁక నిద్ర పోవచ్చును. కాఁబట్టి

యీకోడిని చంపివేయుదము.'' అని నిశ్చయించి మఱునాఁడాకోడిని చంపివేసిరి. ముసలివాండ్రకు రాత్రులు తిన్నగా నిద్రపట్టదు గనుక సాధారణముగా మేలుకొనియుండెడి యావృద్ధాంగన కోడిలేకపోవుట చేత ప్రొద్దు తెలియనిదయి యాదినము మొదలుకొని పనికత్తెలను రాత్రి రెండుజాములకే లేప మొదలు పెట్టెను.

సీ. పనికి దొంగలై తప్పించుకొనుటకొఱకు
వివిధకుత్సితోపాయముల్ వెదకువారు
మహిని సౌఖ్యంబుఁ గనుటకు మాఱుగాఁగ
దుఃఖ మెక్కువ గాంతురు తొంటికంటె.

## 97. కోడి, రత్నహారము

ఒకకోడి తనపిల్లమేఁతనిమిత్తమయి పెంటపోగులను పెల్లగించు చుండఁగా దగదగలాడుచున్నమణిసర మొకటి దాని కాలికి తగిలెను. కోడికన్నులు మిఱుమిట్లుగొలుపుచున్న యారత్నమాలనుజూచి "ఓరత్నహారమా! తళతళలాడుచు నీవెంతో సుందరముగాఁ గనఁబడుచున్నావు. ఇట్టి నీ వీ పెంటపోగులయడుగున కేల వచ్చితివో నేను తెలియఁజాలకున్నాను. నీవిప్పుడు నాకుమాఱుగా నీయజమానునికి కంటఁబడినపక్షమున, అతఁడెంతో సంతోషమును బొందియుండును. నీతోడ నాకేమియు ప్రయోజనము లేనందున నిన్ను నేను గొప్పగా భావింపను. ఇందు లోకములోనిరత్నము లన్నియు దొరకుటకంటె నాలుగుధాన్యపుగింజలు దొరకినపక్షమున నా కధికసంతోషకరముగా నుండును.'' అని పలికి దానిని విడిచి పోయెను.

సీ. పయిపయిమెఱుంగు లీక్షించి భ్రాంతిపడక
పనికివచ్చువస్తువులె కైకొనఁగ వలయు
కడుపునిండఁగఁ దిండిని గానకున్న
భూషణముల కాసింతురు మూఢజనులు.



## 98. నక్క, ద్రాక్షపండు

మిక్కిలి యాఁకలిగొనియున్ననక్కయొకటి ద్రాక్షతోఁటలోఁ బ్రవేశించి పరిపక్వములయినఫలములు గుత్తులుగుత్తులుగాఁ బైనితీఁగలకు వ్రేలాడుచుండుట చూచి సంతోషించి, ఆపండ్లను భక్షింపవలె నన్న యాశచేత పయి కెగిరియు తీఁగెల కెగఁబ్రాకియుఁ బహుప్రయత్నములు చేసి చూచెనుగాని తుద కేయుపాయముచేతను వాని నందుకోలేకపోయెను. ఇట్లు చేసినకృషి యంతయు భగ్న మయినతరువాత వివేకము తెచ్చుకొని యానక్కయొకరాతిబండమీఁదఁ గూరుచుండి "ఈపాడుపండ్లెవరికిఁ గావలెను? ఇవి తిన్నగా పండ్లైనను పండలేదు. ఈపచ్చిపండ్లు నమలినపక్షమున పండ్లన్నియు పులిసిపోవును; నే నీపండ్లను వాసనకైనను జూడను." అని ద్రాక్షపండ్లను దూషింప మొదలుపెట్టెను.

గీ. తమకృషి నశింప, సత్పదార్థములమీఁద
దోషముల నెంతు రూరక దుష్టజనులు;
యత్నవైఫల్య మొదవిన నధికకృషిని
జేయవలెఁగాని దూషణఁ జేయరాదు.



## 99. దాది, పిల్లవాఁడు

ఒకనాఁటిరాత్రి పిల్లవాఁడు పోరుపెట్టి యేడ్చుట కారంభించి యెంతయోదార్చినను మాననందున దాది విసిగిపోయి కోపముతో "నీ వీయేడుపు మాననిపక్షమున నిన్ను గవాక్షములోనుండి వీథిలో నున్నతోడేలునకు పాఱవైచెదను" అని పిల్లవానిని బెదరించెను. అప్పు డాదారినిబోవఁ దటస్థించిన తోడేలామాటను విని నమ్మి నిజముగా దాది పిల్లవానిని వీథిలోఁ బడవేయునన్నయాశతో తెల్లవాఱినదాఁక గవాక్షమువద్ద వీథిలో వేచియుండెను. ఆపిల్లవాఁడేడిచియేడిచి యలసి తెల్లవాఱుజామున నిద్రపోయెను. అంతట తోడేలు నిరాశచేసికొని భోజనములేక మాడుచు మెల్లగా తనయడవికిఁ బోవుచుండెను. అప్పుడు నక్కయొకటి యెదురుపడి విచారముతో తలవంచుకొని యింటిదారిని నడచుచున్న తోడేలును జూచి "బావా! రాత్రియంతయు గ్రామసంచారము చేసి విచారముతోఁ బోవుచున్నవేమి" అని యడిగెను. "ఓనక్కబావా ఏమని చెప్పుదును? నే నొకపనికిమాలిన యాడుదాని మాట నమ్మి మోసపోయి యింతసేపు వేచియుండి తుదకు తిండికి

చెడి యున్నరని యింటికిఁ బోవుచున్నాను.” అని తోఁడే లుత్తర మిచ్చెను.

గీ. ఆగ్రహంబున మానవుం డాడినట్టి
పలుకు నెప్పుడుఁ బాటిగాఁ బట్టరాదు
పదరి క్రుద్ధుఁడు తా నన్నపలుకులకును
దాని శాంతుఁడై నపుడు సంతాప మొందు.



## 100. డేగ, కోయిల

కోకిల యొకటి మామిడిచెట్టుమీఁదఁ గూరుచుండి వనమంతయు మాఱుమ్రోయునట్లుగా కర్ణరసాయనమయిన మృదుమధురస్వరముతో కో యని కూయ నారంభించెను. ఆసమయమునందుఁ దనకడుపు చిచ్చార్చుకొనుటకయి పిట్టను దేనినైనఁ బట్టుకోవలె నని నలుదిక్కులు చూచుచుఁ గాచియున్న డేగ యొకటి దానికంఠస్వరమును విని యావంకకు దృష్టి సారించి క్రౌర్యనాదముతో రుతము చేయుచు నొకకొమ్మమీఁదఁ గూరుచుండియున్న కోయిలను జూచి, బాణమువలె తిన్నగా దానిమీఁదవ్రాలి వాఁడిగోళ్ళతో దానిని బట్టుకొని, చావుకు సిద్ధముగానుండుమని చెప్పెను. అప్పు డాకోయిలదానిని

జూచి "నిష్కారణముగా నావంటి సాధుజంతువును హింసించుటనీకు ధర్మముకాదు. నే నెప్పుడును నీకపకార లేశమైనను జేసియుండలేదు. అంతేకాక నావంటియల్పజంతువునుజంపిభక్షించుటచేత నీకడుపు నిండదు. కాఁబట్టి నన్ను విడిచి పెట్టి నీ గౌరవమునకుఁదగినట్టుగామహాజంతువును దేనినైనను బట్టుకొమ్ము" అని ప్రార్థించెను. "నీ వెంత చెప్పినను, ఆఁకలి గొనియున్న నామనస్సున కిప్పుడు నీమీఁద జాలి పుట్టనేరదు. ఈదినమెల్లను వేచియున్నను నాకింతవఱకొక్క జంతువయినను లభించినది కాదు. ఇంతసేపటికి నీవొక్కతెవు నాగోళ్ళలో తగులుకొన్నావు. ఇట్లు చేతఁజిక్కినదానిని వదలివేసి రానిదాని నపేక్షించు బుద్ధిహీనుఁ డెక్కడనైన నుండునా?" అని డేగపలికెను.

గీ. దాపునఁ గరస్థమయియున్న దాని విడిచి
దవుల సందిగ్ధమగుదానిఁ దగదు కోర.
మింటిమేఘంబులను నమ్మియుండి చెఱువు
జలముఁ బాఱఁ జల్లించెడుజడుఁడు గలఁడె?



## 101. వేటగాఁడు, తిత్తిరిపిట్ట

వేటగాఁడరణ్యములో వలపన్ని పోఁగా తిత్తిరిపిట్ట యొకటి వచ్చి యా వలలోఁ బడెను. అంతట వేటగాఁడు వచ్చి దానిని బట్టు

కొని చంపఁబోఁగా, అది వానినిజూచి తన్నిప్పుడు చంపక వదలివేసిన పక్షమునఁ దాను బోయి తనజాతిపక్షుల నన్నిటిని వంచించి వలలోఁ బడునట్లు ప్రేరేపించెద నని చెప్పెను. "నిన్నిప్పుడు నే నెంతమాత్రమును వదలివేయను. నీప్రాణము తీయుటకు నేను మొట్టమొదటనే నిశ్చయించుకొన్నాను. అపయిని నీ విప్పుడు నీదుష్టవర్తనముచేత మఱింతఘోరదండన కర్హమయినదాన వయినావు. తుచ్ఛమయినశరీరమును కాపాడుకొనుటకయి మిత్రులకును బంధువులకును ద్రోహము చేయఁదలఁచుకొన్నవాఁడు సాధ్యమయినయెడల మరణదండనకంటెను క్రూరతరమయినశిక్ష కర్హుఁడు." అని పలికి వాఁడు దానిని వధించెను.

గీ. ప్రాజ్ఞునకు మానహీనమౌ బ్రతుకుకంటె
గౌరవముతోడిమరణంబె కరముమేలు.
జీవనంబునకై కీడు చేరుపుకొక
యశము నెల్లరు గడన చేయఁగవలయు.



## 102. మార్గస్థులు, ఎలుఁగుబంటి

ఒకనాఁ డిద్దఱుబాటసారు లడవిమార్గమునఁ బోవుచుండఁగా వారిలో నొకఁడు రెండవవానిని జూచి "మిత్రుఁడా! అడవిమృగములు

వచ్చినప్పుడు మన మొకరి కొకరు సాయముచేసికోవలెను'' అని చెప్పెను. రెండవవాఁడును దాని కంగీకరించినందున, వారిద్దఱును పరస్పరసాహాయ్యము చేసికొనుట కొడంబడిక చేసికొనిరి. ఈమాట లనుకొని కొంచెముదూరము నడుచునప్పటికి వారికొక యెలుఁగుబంటి యెదురుపడెను. దానిని జూచి భయపడి మొట్టమొదట స్నేహము కలిపి తోడుపడవలె నన్నవాఁడుఁ తననూతనమిత్రుని నెలుఁగు గొడ్డుయొక్క దయకు విడిచిపెట్టి, పలుచనివాఁ డగుటచేత పరుగెత్తి యొకచెట్టున కెగఁబ్రాకి తనప్రాణములు కాపాడు కొనెను. రెండవ వాఁ డసహాయుఁడయి స్థూలకాయుఁడగుటచేత పరుగెత్తలేక క్రింద పరుండి, ఊపిరి బిగియఁబట్టి కాలును చేయియు కదలింపక చచ్చినట్లు పడియుండెను. ఎలుఁగుబంటి వానిసమీపమునకు వచ్చి ముక్కును నోరును చెవులును వాసనచూచి శవమనుకొని వానినివిడిచి తనదారిని పోయెను. అది పోయినతరువాత చెట్టువీఁదివాఁడు క్రిందికిదిగి, రెండవ వానివద్దకు నవ్వుమొగముతో వచ్చి, ''భల్లూకరాజు నీచెవిలో నేమో చెప్పిపోయినాఁడు. ఆరహస్యమును మిత్రునకుఁగూడ వినిపింపుము.'' అనియడిగెను. అందుమీఁద రెండవవాఁడు ''తమకార్యము కొఱకు మంచిమాట లాడి యాపద వచ్చినప్పుడు మిత్రులను విడిచిపెట్టెడు నీక్రొత్త మిత్రునివంటి స్వప్రయోజనపరు లయిన నిర్భాగ్యులమాట యెప్పుడును నమ్మి మోసపోక యికముందు తెలివిగలిగి బ్రతుక వలసినది'' అని బుద్ధి చెప్పిపోయినదని బదులుచెప్పెను.

గీ. మంచిమాటలు పలికెడుమనుజు లెల్ల
మిత్రు లనుచు భావించుట మేలు గాదు.
మాట లధికంబుగాఁ జెప్పుమానవులను
విశ్వసింపకయుండు వివేకి యెపుడు.

## 103 సొరచేప. రెక్కలచేప

సాధారణముగా సముద్రవ్యాఘ్రమని చెప్పబడుసొరచేప యొకటి తన్ను తఱుముకొనిరాగా భయముచేత బహుదూరము పరుగెత్తుకొని వచ్చి యొక రెక్కలచేప సముద్రములోనుండి యెగిరి యొక మెట్టమీఁద బడెను. అక్కడ తనచావు నిశ్చయమని యా రెక్కలచేప యెఱిఁగిన దయినను, శత్రువయిన సొరచేపకూడ తన్ను మ్రింగవలె నన్నయాశచేత తరంగములలోనుండి దుమికి తన వెంబడినే యామెట్టయొద్ద నొడ్డున పడి వగర్చుచుండుట చూచి "ఇప్పుడు నాకు చావుతప్పకపోయినను, నాచావుకు మూలమయిన యీసొరచేపకూడ నాతోనే చచ్చుచున్నందున నేను తృప్తితో ప్రాణములు విడుచుచున్నాను" అని పలికెను.

గీ. పగను సాధించు టల్పులౌ ప్రజలమదికి
జగతిలోపల నానందజనక మగును.
అయినను మహాత్ము లగువార లహితులకును
గీడు కోరక మేలె కాంక్షింతు రెపుడు.

## 104. ముసలినక్క, పడుచునక్క

ఒకనాఁటిరాత్రి యొకముసలినక్కయు పడుచునక్కయుఁ గలిసి బయలుదేఱి యొకయింట నున్న కోళ్ళదొడ్డిలో దూఱి కోడిపిల్లలను జంపుచు పరస్పరసంభాషణమున కారంభించెను. అప్పుడు పడుచునక్క వృద్ధజంబుకమును జూచి "ఓ మిత్రమా! మన కిప్పు డెన్ని పుంజులు, పెట్టలు, పిల్లలు లభించినవో చూచినావా మనమీరాత్రియే వీనినన్నిటిని జంపి కడుపునిండ తిని మఱి యిక్కడనుండి కదలుదము" అని చెప్పెను. ముసలినక్క "బిడ్డా! నేను నాచిరకాలాను

భవమునుబట్టి చెప్పుచున్నాను. మనము వీని నన్నిటిని నేఁడే తిని వేసినయెడల రేపాహారము దొరకక పోవచ్చును. కాఁబట్టి మనము స్థలము తెలిసికొంటిమి గనుకఁ గొన్నిటిని నిలువ చేసికొని ప్రతిదిన మునువచ్చి తినిపోవు చుందము. అని హితబోధ చేసెను. ఆమా టకుపకపకనవ్వి పడుచునక్క "ఓతాతా! ముసలివాండ్రకు మతి యుండదు. నీబుద్ధి యత్యద్భుతముగా నున్నది. ఈదినమిన్నికోళ్ళను చంపి రేపటిదిన మిక్కడకు మరల వచ్చినపక్షమున, యజమానుఁడు కాచియుండి మన ప్రాణములు పుచ్చుకొనక విడుచునా? నేను నాకడుపు పట్టినన్ని పిట్టలను భక్షింపక యీస్థలము విడిచిరాను." అని బదులుచెప్పెను. ఈసంభాషణము ముగిసినతరువాత పడుచు నక్క ప్రక్కలుబ్బ కోడిపిట్టలను మిక్కిలి వెక్కసముగా మెక్కి, కద లలేక మెల్లగా నింటికిఁ బోవుచు త్రోవలో కడుపునొప్పి వచ్చి చచ్చె ను. ముసలినక్క నాఁటికి కొంచెమే తినిపోయి మఱునాఁటి రాత్రి యూరు మాటు మడఁగినతరువాత కోళ్ళగూటివద్దకు మరల వచ్చెను. తనకోళ్ళన్ని యొక్కరాత్రి చచ్చుటకు దుఃఖించి కోళ్ళయజమానుఁ డు నాటిరాత్రి కోళ్ళదొంగను కాచి పట్టుకోవలె నని పొంచియుండి యావగ్గునక్క వచ్చి కోళ్ళగూటిలో ప్రవేశింపగాఁనే దుడ్డుకఱ్ఱతో మోఁది దానిని చంపెను.

గీ. వృద్ధుఁ డతికాంక్షఁ దినలేక వెతలఁగుడుచు;
వ్యధలపా లగు నతిభుక్తిఁ బడుచువాఁడు.
కావున వివేకి యీరెండుగతులుఁ దాను
వదలి మితముగా ననుభవింపంగ వలయు.

# 105. పశువులదొడ్డిలో దూఁకినదుప్పి

ఒకదుప్పి తన్నరణ్యమునుండి వేఁటకుక్కలు తఱుముకొని రాఁగా భయముచేత పరుగెత్తుకొని వచ్చి యొకపొలములోఁ బ్రవేశించి యం దున్నపసువులదొడ్డిలో దూఱి వట్టిగడ్డిలోఁ దాఁగి యుండెను. అప్పుడక్కడ నున్నయెద్దులలో నొకటి దానినిజూచి యడవిని విడిచి ప్రాణాపాయకరమయినయీస్థలమున కేల రా సాహసించితివని యడిగెను. "మీరు నాజాడ చెప్పి నన్నుపట్టియొప్పగింపక రక్షించిన పక్షమున, మీధర్మమున నే నిక్కడఁ గొంతసేపు తలదాచుకొని యుండి చీఁకటి పడఁగానే నాయడవికిఁ బోయెదను." అని దుప్పి యుత్తరము చెప్పెను. అటుతరువాత దుప్పి దీపములవేళవఱకును గడ్డిలో నుండెను. అంతట పసులకాపరివాఁడు కొన్నిగోవులను తోలుకొని వచ్చి గుంజలకు కట్టిపెట్టి గడ్డివేసిపోయెనుగాని వాఁ డాదుప్పిని మాత్రము చూడలేదు. అటుతరువాత కొందఱు పాలేరువాండ్రొకని తరువాత నొకఁడుగా పశువులదొడ్డిలోనికి వచ్చి పసువులనుజూచియెడ్లకు గడ్డివేసి పోయిరిగాని వారును దుప్పిని జూడలేదు. ఆపయిని తోఁటకావలివాఁడు వచ్చి దొడ్డి నాలుగుమూలలు తిరిగి పశువులు కట్టి యున్నవో లేవో చూచిపోయెనుగాని యందేదియు వింతజంతువు వానిదృష్టికిని గోచరము కాలేదు. ఈకడపటివాఁడు వెడలిపోయిన తరువాత దుప్పి తన కింక ప్రాణభయము తప్పిపోయిన దని సంతోషించి మెల్లగా తలయెత్తి యచ్చటగిత్తలను బిలిచి "మిత్రులారా! మీరు మిక్కిలి దొడ్డవారు ఆపత్సమయమునందు తావిచ్చి నాప్రాణములు గాపాడినారు." అని తనకృతజ్ఞతను దెలుపు చుండెను. అందొకయెద్దు దానిమాటలు విని "మిత్రుఁడా! నీవింకను సంతోషపడ వలసిన సమయము రాలేదు. నీవీరాత్రి యిందుండి తప్పించుకొని

పోయి సుఖముగా నీయడవి చేరఁగలుగుట మార్కండేయునకును పరమసంతోషమే కాని యింకొకఁడు వచ్చి చూచిపోవువఱకును నీవు ప్రాణములు దక్కినవనుకోఁగూడదు. మాయజమానుఁ డప్పుడప్పుడు వచ్చి మమ్ముఁ జూచి పోవుచుండును. అతనికి వేయికన్ను లున్నవి; ఈయందఱి కన్నులను గప్పి తప్పించుకొన్నను నీతనికంట బడక తప్పించుకొనుట యసాధ్యము. అతఁడిప్పు డిచ్చటకు వచ్చుట తటస్థించెనా, నీప్రాణములు నీవికావు." అని చెప్పుచుండఁగానే యజమానుఁడు వచ్చి పశువులదొడ్డిలోఁ జొచ్చి యందున్న పశువుల నొక్కొక్కదానినే చూచుచు "దీనికి గడ్డి తిన్నగా వేసినారు కారు", "దీనివద్ద పేడ తీసివేయ లేదు." "దీనిముందఱ రొచ్చుగానున్నది." అని సేవకుల మీఁద కోపపడుచు దొడ్డియెల్ల దిరిగి గడ్డియొద్దకుఁ బోయి చేతితో తడవిచూచి గడ్డిలో దుప్పికొమ్ములు చేతికి తగులఁగా నిందులో నేదో యున్నది రండని కేకలు వేసెను. ఆ కేకలు విని పొలములో నున్న పాలేరువాండ్రందఱును కఱ్ఱలు పట్టుకొనివచ్చి యజమానుని యాజ్ఞా ప్రకారముగా దుప్పిని గొట్టి చంపిరి.

భృత్యజనముల బహు నేత్రదృష్టికంటె
నురుబలం బుండు బ్రభు నేత్రయుగ్మమందె;
భృత్యులకె సర్వమును స్వామి విడువఁ బోక
తనదుకనులారఁ బని చూచుకొనఁగవలయు.

## 106 గ్రద్ద, గుడ్లగూబ

ఒకనాఁ డొకగ్రద్దయు గుడ్లగూబయు నొకచోట చేరి యిఁకముం దొకరిపిల్లల నొకరు మ్రింగకుండ నేర్పఱుచుకొని మైత్రి చేసికొనెను. అప్పుడు గ్రద్ద గూబనుజూచి "నాపిల్లల నీ వానవాలెఱుఁ

గుదువా?'' యని యడిగెను. ''ఎఱుంగను'' అని గూబపలికెను. అంతట తనబిడ్డలరూపమును ఉన్నది యున్నట్లుగా గృధ్రము దానితోఁ జెప్పి, ''నీబిడ్డల నానవాలుపట్టుటకు గుఱుతు లేవి?'' అనిప్రశ్న వేసెను. అందుమీఁద గూబ తన పిల్లలు లోకములోని పక్షులలో నెల్లను మిక్కిలి సుందరముగాను మృదుమధురస్వరము కలవిగాను ఉండునని యానవాలు చెప్పెను. ఈ ప్రకారముగా సంధి చేసికొని యాపక్షులు రెండును తమవాసస్థానములకుఁ బోయినతరువాత మఱికొన్ని దినములకు గృధ్ర మాహారార్థమక్కడక్కడ సంచారముచేసి మధ్యాహ్న సమయమునం దొక పాడింట కలుగులో నున్న పక్షి గూడును జూచి యందులో నున్న పిల్లలు తనమిత్రురాలివేమోయని మొట్టమొదట కొంతసందేహపడెను. ఇట్లు సంశయము మనస్సును బాధింపఁగా గృధ్రము కొంతసేపా పిల్లలమొగము పరిశీలించి చూచి యింత వికృతరూపము గలవి లోకములోని పక్షులలో నెల్లను సుందరమయిన నామిత్రురాలి పిల్లలయి యుండవని యాలోచించుచుండఁగా, ఇంతలో గూబపిల్లలు చేరువ కేదో పక్షి వచ్చిన ట్లులుకు డయినందున వికృతముగా కూసెను. ఆకూఁత చెవిని బడఁగానే గ్రద్ద కావలసియున్నసంశయము పోయినందున, ఇట్టి యసహ్యపుకూఁత లఱచెడు పక్షులు మృదుమధురస్వరముగల తన మిత్రురాలిబిడ్డలు కావని నిశ్చయించి యాగృధ్రము వానిని భక్షించి కడుపుచిచ్చార్చుకొని యథేచ్ఛముగాఁ బోయెను. అటువాత కొంతసేపునకు గూబ తనగూటికి వచ్చి యందు పిల్లలను గానక వానియీఁకలు మొదలయినవి చూచి దుర్మార్గురా లయిన యాపాడుగ్రద్దయే నమ్మించి ద్రోహము చేసెనని దానిని దూషించుచు విలపింపసాగెను. ఆ సంగతి యంతయు నెఱిఁగినగబ్బిల మొకటి దానిసమీపమునకు వచ్చి, ఇదియంతయు గృధ్రము నీ బిడ్డలగుఱుతు లడిగినప్పుడు యథార్థమును జెప్పక నీవేదో

లేనిపోని యావాక్యమును కల్పించి చెప్పినస్వయంకృతాపరాధము యొక్కఫలమే యగుటచేత దీనినిగూర్చి యన్యులను నిందింపవలసిన పని లేదని బుద్ధి చెప్పెను.

గీ. తమదుబిడ్డలలోపముల్ దాఁచిపెట్టి
తల్లిదండ్రులు చెఱుతురు తామె వారి;
కొడుకులసుఖంబు జనకులు కోరు నెడల,
తెలిపి తప్పులు తెఱిని దిద్దింపవలయు.



## 107. జింక, ద్రాక్షతీగ

ఒకజింక తన్ను వేటగాండ్రు తఱుముకొనిరాఁగా వారికంటె ముందు పరుగెత్తికొనిపోయి యొక ద్రాక్షపొదలో దూఱి దాఁగి యుండి ప్రాణరక్షణము చేసికొనెను. మఱికొంతసేపటికి కావేఁటగాండ్రక్కడకు వచ్చి యాద్రాక్షతీఁగలవద్ద నుండియే ముందుకు సాఁగిపోయినను జింకను చూడక యాస్థలమును దాఁటిపోయిరి. ఇంతవఱకును లోపల నడఁగియున్న జింక వారు దాఁటిపోఁగానే తలయెత్తి యిఁక

తనకుపద్రవము తప్పిపోయినదని ధైర్యమును తెచ్చుకొని తనకు ప్రాణ రక్షణము చేసిన ద్రాక్షతీఁగలనే కొఱికి తిన మొదలుపెట్టెను. ఇంతలో వేఁటగాండ్రు కొంత ముందుకుపోయి యక్కడ జింక జాడ గానక మరలవెనుకతిరిగి వచ్చుచు ద్రాక్షతీఁగలుకదలుచుండుటను బట్టి జింక యందు దాఁగి యుండవచ్చునని యూహించి సమీపమునకు వచ్చి దానిని పట్టుకొని చంపిరి. తన్ను రక్షించినదానినే భక్షింప నారంభించిన పాపఫల మనుభవింపక తీఱదని మనస్సులో ఖేదపడుచు జింక ప్రాణములు విడిచెను.

గీ. అవనిలోనఁ గృతఘ్నత యరసిచూడఁ
బాతకంబులలో ఘోరపాతకంబు
బాగు చేసినవారికి నోగు చేయు
పాపి నెప్పుడు దేవుండె పాడు చేయు.

# 108. ఆత్మస్తుతిపరాయణుఁడైన యాత్రికుడు

దంభవ్రతుఁడైన యాత్రాపరుఁ డొకఁడు బహుతీర్థయాత్రలు సేవించి దేశాటనము చేసివచ్చి తానుదర్శించిన దివ్యక్షేత్రములమహిమలను తాను నిర్వహించిన యద్భుతకార్యములను తనయూరివారితో దెలుపుచు "ఓమహాజనులారా! రామేశ్వరమువద్ద నేను పంతమువేసి యొక్కయంగతో పెద్దకాలువను దాఁటి యావల పదియడుగుల దూరముదుమికినాను. దక్షిణదేశమం దంతటను మహాబలవంతుఁ డని ప్రసిద్ధి గన్నమల్లుఁడు సహితము తనయావచ్ఛక్తిని వినియోగించియు నాతో సమానముగా దుముకలేక నాకంటె తుదకాఱడుగులుతక్కువ దుమికినాఁడు. రామేశ్వరము వచ్చినపక్షమున మీ కీసంగతి కన్నులార చూచినవారిచేత ఋజువు పలికించెదను" అని యాత్మశ్లాఘ

చేసికొనుచుండెను. అప్పుడాసంఘములోనున్న బుద్ధిమంతుఁ డొకఁడు ముందుకు వచ్చి "అయ్యా! సాక్షులనిమిత్తము మన మంతదూరము రామేశ్వరము పోవలసినపని లేదు. మనయూరే రామేశ్వర మనుకొని మన చిన్నకాలువ నిక్కడనే యొకసారిలంఘించి మీ సామర్థ్యమును జూపుఁడు. మే మందఱమును ప్రత్యక్షముగాఁ జూచి యానందించెదము" అని పలికి యాతని నోరడఁచెను.

గీ. స్వస్తుతులు నసత్యంబులుఁ బలుకువారి
వారలయసత్యవాక్కులే పట్టియిచ్చు
ఘనవిరుద్ధవార్తలు తాము కనినయట్లు
చెప్పు నెడలఁ జూడక విశ్వసింపరాదు.

## 109. గడ్డివేఁటిలోని కుక్క

ఒకనాఁ డొకయెద్దు మిక్కిలి యాఁకలిగొని వచ్చి గడ్డివామి యొద్దకుఁ బోయి మేయఁబోయెను. ఎక్కడినుండియో వచ్చి యాగడ్డి మేటిలో పరుండియున్న చెడుకుక్క యొకటి మొఱుగుచు లేచి యెద్దు మీఁద బడి కఱచి దానిని గడ్డి తిననియ్యక తఱిమివేసెను. అప్పు డాయెద్దు కుక్కనుజూచి "నామీఁదబడి మొఱుగుటవలన నీ దుష్టత్వమును వెల్లడి చేసికొనుటతప్ప నీ విందేమి బావుకొనుచున్నావు? తెలబొమ్మవలె నిందుగూరుచుండి నీవును తినవు; తినువానిని తినను నియ్యవు." అని పలికి యుస్సురని విచారముతో వెడలిపోయెను.

గీ. అల్పులు ధనాదులను దాము ననుభవింప
కితరులను గూడ భుజియింప నీయకుంద్రు;
పరులకును దమ కుపయోగ పడెడునట్లు
చేయుదురు సజ్జనులు తమసిరుల నెపుడు.

# 110. బంగారమును పాతిపెట్టిన లోభి

ధనికుఁ డయిన యొక పిసినాఁరి తనకున్న సొత్తంతయు బంగారముగా మార్చి యాబంగారమంతయు కరఁగి యొకదిమ్మగాఁ జోసి యొకనాఁటిచీఁకటిరాత్రి దానిని రహస్యముగాఁ గొనిపోయి తనతోఁటలో నొకమూల పాతిపెట్టి నిత్యమును బోయి దాని నొక్కసారి దర్శించుచుండెను. వాఁ డక్కడకు తఱుచుగా పోవుచు వచ్చుట చూచి యందేమో యున్నదని కనిపెట్టి యొకదొంగ యొకచీఁకటిరేయి పోయి దానిని త్రవ్వి తస్కరించెను. కొన్నాళ్ళకా లోభి తన ధనము పోయినదని తెలిసికొని తలవీడ బట్టుయూఁడ రొమ్ము బాదుకొని యేడ్చుచు సొమ్ము నిమిత్తమయి క్రిందఁబడి పొరల మొదలు పెట్టెను. ఆయేడుపు విని చేరువతోఁటలో నున్న మిత్రుఁ డొకఁ డక్కడకు వచ్చి "చెలికాఁడా! పోయినబంగారమును తలఁచుకొని యేల విలపించెదవు? ఉన్నప్పుడు సహితము నీ వెప్పుడును దాని నుపయోగించి యెఱుఁగకపోవుటచేత నిజముగా నీ కది యప్పుడును లేనట్టే. అప్పు డది యున్నట్టు భావించుకొని సంతోషించుచుంటివి. నీ విప్పుడుసహితము దానిస్థానమున నొక పెద్దరాయి తెచ్చి పాతిపెట్టి యదియే పోయిన బంగార మనుకొని సంతోషపడవచ్చును. పూర్వ మాబంగారము నీ కెంత యుపయుక్తముగానుండెనో యిప్పుడీరాయియు నీకంత యుపయుక్తముగానే యుండును." అని యోదార్చెను.

గీ. లోభికంటె దరిద్రుండు లోకమునను
వేఱొకండు గల్గఁడు భోగవిరహమునను
కలిమి గల్గినఫలము లోకంబునకును
దాని నుపయోగపఱుపంగఁ దగుటకాదె ?



## 111. మృగములు, పక్షులు, గబ్బిలములు

పూర్వకాలమునం దొకసారి పక్షులకును మృగములకును యుద్ధము సంభవించినప్పుడు గబ్బిలము తా నేపక్షమునను జేరక దేహము దాంచుకొనుటకయి చూచెను. ఇట్లుండంగా మొట్టమొదట యుద్ధములో మృగములకు గెలుపు కలుగునట్లుగా కనంబడినందున గబ్బిలము వానియొద్దకుబోయి "ఓమృగములారా! నేనుమీంవాడను. నేను పక్షి నయినపక్షమున నానోటిలో రెండువరుసల పండ్లుండునా?" అని వానిలోం జేరెను. అటుతరువాతం గొంతసేపు ఘోరయుద్ధము జరిగినమీందట గరుత్మంతుని పరాక్రమముచేత కట్టకడపట పక్షులకే విజయము కలిగెను. అప్పుడు గబ్బిలము మెల్లగా పక్షులవద్దకు వచ్చి "ఓపక్షులారా! నేను మీవాండను. నేను మృగము నయిన తొడల నాకీఱెక్కలును పయి కెగరంగలశక్తియుం గలుగునా? అని వానితో తనచుట్టఱికమును తెలుపుకొనెను. పక్షులు దానిమాటలు నమ్మక కాళ్ళతో తన్ని ముక్కులతో పొడిచి దానిని దూరముగా ఁటిమివేసెను. అంతట గబ్బిలము మరల మృగములయొద్దకుం బోగా

నవియు తమ్ముఁ జేరనీయక దానిని వెడలఁగొట్టెను. అందుచేత గబ్బిలమప్పటినుండియు నెవ్వరిలోను గలియక పక్షులును మృగములును కూడ నిద్రపోవుకాలములో రాత్రిమాత్రము లేచి తిరుగ సాగెను.

గీ. ఎల్లరకు మంచివారుగా నెదను గోరి
యిచ్చకము లాడుచు నీతి యెడలితిరుగు
స్వప్రయోజనధూర్వహుల్ సర్వగతుల
భ్రష్టులగుదు రేరికి మంచివారుగాక.

## 112. చెట్టుక్రింద శయనించినబాటసారి

ఒకమార్గస్థుఁడు బహుదూరము నడిచి యలసివచ్చి చల్లని మఱ్ఱినీడను విశ్రమించి, చేరువనుప్రాఁకి కడవలంతలేసికాయలతో నున్న గుమ్మడితీఁగను జూచి మనసులో తా నిట్లు చింతింప మొదలు పెట్టెను—"భగవంతుఁడు వట్టిబుద్ధిహీనుఁడు గా నున్నాఁడు. బలిష్ఠమయిన యీమఱ్ఱిచెట్టుకు కుంకుడుగింజలంతలేసి చిన్నకాయలు పెట్టి దుర్బలమయిన గుమ్మడితీఁగెకు బానలంతలేసి పెద్దకాయలు పెట్టినాఁడు. ఈ చిన్నమఱ్ఱికాయ లీగుమ్మడితీఁగకును, ఈ పెద్దగుమ్మడికాయ లీమఱ్ఱిచెట్టునకును బెట్టియుండినయెడల, దేవునిబుద్ధి యెంత శ్లాఘాపాత్రముగా నుండును!" అని యాలోచించుచు హాయిగా నిద్రపోయెను. ఇంతలో పెద్దగాలి వీచి మఱ్ఱికాయలు కొన్ని మీఁద రాలినందున మేలుకొనఁగాఁగా, ఆబాటసారి కన్నులు తెఱచి చూచి "అయ్యో! ఈపెద్దగుమ్మడికాయలు మఱ్ఱిచెట్టుననేయుండి గాలికి నామీఁద పడియుండినపక్షమున నే నీపాటికి తలవ్రక్కలయి చచ్చిపోదునుగదా అజ్ఞానముచేత నిష్కారణముగా సర్వజ్ఞుడయిన యీశ్వరునియెడ

లోప మారోపించి పాపము గట్టుకొన్నాను.'' అని పశ్చాత్తాప పడుచు తనదారిని బోయెను.

గీ. మూఢజనములు తమయల్పబుద్ధిచేతఁ
దత్వ మెఱుఁగ కొనర్తురు దైవనింద
తమకుఁ దోఁచిన దెల్లను దథ్య మనక
సృష్టిమహిమ లెల్ల రెఱుంగ నెన్నవలయు.



## 113. ఇంద్రుఁడు, గొల్లవాఁడు

ఒకగొల్లవాఁడు తనమందలోని గిత్తయొకటి యాకస్మికముగా కనఁబడకపోఁగా దానినిమిత్తమై యడవియందును వెదకెనుగాని దాని జాడ యెక్కడను తెలియరాలేదు. అంతట వాఁడు మనుష్యప్రయత్నమువలన కార్యము లేదని యెంచుకొని ''నాగిత్తను దొంగిలించిన దొంగ నొక్కసారి నాకంటికిఁ గనఁబఱిచినపక్షమున నీకొక మేఁకను బలియిచ్చెదను,'' అని యింద్రునకు మ్రొక్కుకొనెను. ఇట్లు మ్రొక్కుకొని వాఁ డరణ్యములో ముందుకు కొన్నియడుగులు నడవ గానే యొకపొదలో వాని గిత్తను దొంగలించిన చోరుఁడు వాని కన్నుల

యెదుట ప్రత్యక్ష మయ్యెను. అప్పు డావంకను గొల్లవాఁడు చూడఁ గానే గిత్తను బొంగిలినది రెండుకాళ్ళదొంగ కాక నాలుగుకాళ్ళదొంగ యయ్యెను. ఎద్దును నోటఁ గఱచుకొని సింహమొకటి కన్నుల యెదుట కనఁబడఁగానే భయముచేత వానిప్రాణములు పయి కెగసి పోయినవి. ఇట్లు కొంతసేపు వాఁడుచిత్రప్రతిమవలె నిశ్చేష్టితుఁ డయి యుండి కొంతతడవునకు తెలివి తెచ్చుకొని ప్రాణభీతిచేత దేహము వడవడవడఁక గద్గదస్వరముతో "ఓభగవంతుఁడా ! నాకిప్పుడు నీ వీ దొంగను మరల కనఁబడకుండఁ జేసినపక్షమున, నేను నాప్రాణములు దక్కించుకొని యిల్లు చేరఁగానే యీసారి నీకు మేకపోతునుగాక యాఁబోతును బలి యిచ్చెదను." అని దేవేంద్రునకు మరల మ్రొక్కు కొనెను.

గీ. ఇలను మనకోరుకోరిక లెల్ల దేవుఁ
డొసఁగు నేనియు మన కెంతొ దొసగు పొసఁగు
కాన, నిహలోకవస్తువుల్ కాంక్ష చేయ
కాత్మసుఖమునె భగవంతు నడుగవలయు.

# 114. నక్క, గాడిద

సింహచర్మ మొకటి కనఁబడఁగా దానిని పైనికప్పుకొని యొకగాడిద వనములో విచ్చలవిడిగాఁ దిరుగుచు రూపాటోపముచేత మృగముల నన్నిఁటిని బెదరించుచుండెను. ఇట్లు కొంతసేపు విహరించినతరువాత దానికంటి కొకనక్క కనఁబడగా, తక్కిన మృగముల వలెనే దానినికూడ భయ పెట్టవలెనని తలఁచి సింహనాదముచేయుచుఁ బోయి దానిచెంతకు భయంకరముగా దుమికెను. కంఠస్వరముచేత నక్క దానిని గుఱుతుపట్టి "ఓహోహో గార్దభస్వాములా తమరు !

ఏలినవారు కొంచెముసేపు మౌనముద్ర ధరించి నోరు విప్పకుండిన పక్షమున తక్కిన మృగములవలెనే నేనును దేవరవారిని సింహముగా భ్రమించియుందును. ప్రభువారు గౌరవము కాపాడుకొనక నోరు తెఱచుటచేత నిప్పుడు తమ రెవరో యిట్టె తెలిసిపోయినది." అని పరిహాసము చేసెను.

సీ. నరుడు చేయుసంభాషణంబువలన
నెట్టిగుణవంతుడో వాని నెఱుగ వచ్చు
భూషణాంబరములు దాల్చి మూర్ఖజనుడు
పెదవియెత్త నంతదాకె శోభిలుగాదె ?



## 115. గ్రద్ద, బాణము

కంటబడినజంతువును దేనినైనను జంపి తినవలెనని యొక గ్రద్ద కొండకొమ్ముమీద గూరుచుండి చూచుచుండగా, వెనుక నుండి వేటగాడొకడు దానిని బాణముతో గొట్టెను. ఆదెబ్బచేత

గ్రద్ద తలక్రిందుగాకూలి తనకుగ్రుచ్చుకొన్న బాణమువంకఁ జూడఁగా, ఆ బాణముయొక్క పుంఖమునకు తనయీఁకలే కట్టఁబడియున్నట్టు తెలియవచ్చెను. అందుచేత గృధ్రము మరణసమయమునందు తనకుఁ గలుగుచున్న శరవేదనకంటె తనశరీరమునఁబుట్టిన యీఁకయే తన చావునకు మూల మయినబాణమును జేరియున్నదను విచారమే యెక్కువ వ్యథ పెట్టఁగా దేహము త్యజించెను.

గీ. ఇడుములకు నాత్మదోషంబె హేతు వైన
గష్టము మఱింత యధికంబుగాఁగ దోఁచు.
బహువిపత్తులు తనవల్ల వచ్చుఁగానఁ
దెలిసి జనుఁ డప్రమత్తుఁడై మెలఁగవలయు.

## 116. సోమరిగుఱ్ఱము, బరువెత్తుకొన్నగాడిద

ఒకఁడు తనవస్తువుల నన్నిటిని గాడిదమీఁద వేసి మోపించుకొని దానివెంట వట్టిగుఱ్ఱమును నడిపించుకొని తనయూరికి పోవుచుండెను. శక్తికిమించిన యాబరువును మోయలేక తూలుచు గాడిద తనబరువులోఁ గొంతవహించి సాయముచేయవలసినదని గుఱ్ఱమును వేఁడుకొనెను. గుఱ్ఱము దుస్స్వభావముగలది యగుటచేత దానిప్రార్థన యంగీకరింపక నిరాకరించెను. అందుపయిని గాడిద యెంతోకష్టముతో మఱికొంతదూరము కాళ్ళీడ్చుకొనుచు నడచి దుర్భరమయిన యాభారమునకు సహింపలేక వగర్చుచు మార్గమధ్యమున ముందుకుఁ గూలఁబడి ప్రాణములు విడిచెను. అప్పుడు యజమానుఁడు తనగాడిద చచ్చుటచూచి దుఃఖపడి దానిమీఁది బరువంతయుఁదీసి గుఱ్ఱముమీఁద వేయుటయేకాక చచ్చినగాడిదయొక్క చర్మమొలిచి దానిని సహితము పయిని వేసి యాగుఱ్ఱమును తోలుకొనిపోయెను. అందు

వలన గుఱ్ఱము తనతోడిజంతువునకు కొంచెము తోడుచూప ప్రాలు మాలిన తప్పిదమునకు శిక్షగా రెట్టింపుభారమునువహించి శ్రమపడ వలసినదయ్యెను.

గీ. శ్రమములో నున్నవానికి సాయ మదనఁ
జేయ కున్నను దుద కెంతొ చేటు వచ్చు.
కావున నరుండు కొంతిస్వకార్యపరత
విడిచి తోడివారికిఁ దోడు పడఁగవలయు.

---

## 117. కుక్క, దొంగ

ఒకనాఁటి యర్ధరాత్రమందు కొందఱుదొంగలు వచ్చి యొక యింటికి కన్నము వేయుచుండఁగా, కావలికుక్క వారినిజూచి మొఱుగ నారంభించెను. అప్పుడు దొంగలలో నొకఁడు కుక్క నోరడఁచుట కయి రొట్టెముక్క యొకటి దానిముందు విసరివైచెను. ఆకుక్క దానిని పుచ్చుకొనక "ఓచోరులారా! నే నెప్పుడును లంచమున కాశపడి నాయజమానునికి ద్రోహముచేయుస్వభావము కలవాఁడను గాను. అంతేకాక నేఁ డీచిన్నరొట్టెముక్క నిమిత్తమయి నాభావిసుఖమును స్వాతంత్ర్యమును మీకు విక్రయించి యెల్లకాలము కష్టమనుభవించుటకు నే నంతబుద్ధిహీనుఁడను గాను. మీరు నాయజమానునిఁ జంపఁ గూల్చినతరువాత రేపటినుండి యిఁక నన్ను పోషించువారెవ్వరు? అని మఱింతబిగ్గరగా మొఱిగి యింటివారిని లేపి దొంగలను పట్టియిచ్చెను.

గీ. స్వచ్ఛవృత్తియె సర్వార్థసాధకంబు
కావున జనుండు నిమిషసౌఖ్యంబుకొఱకు
లంచమును గ్రహించి యతిహేయలాభ మొంది
చెఱుచుకొరాదు ఘనతయు స్థిరయశంబు.

## 118. నక్క, నాటకశాల

ఒకనక్క యాహారనిమిత్త మందందు తిరిగి యెక్కడను మేఁత దొరకక పోయిపోయి తుద కొకనాటకశాలలోఁ బ్రవేశించెను. నాటకులు వేషములు వేసికొనునప్పుడు మొగములకు తగిలించుకొను కాగితపుతలలు కొన్ని దాని నక్కకు కనఁబడఁగా పయిరంగులను జూచి యవి నిజమయిన తల లని భ్రమించి వానిలోపలి మెదడు భక్షింపవచ్చునని సంతోషించి సాహసముగఁ గాలితో వానిని కదలించిచూచెను. కదలించఁగానే యవి యంతస్సారము లేనివయి లొటలొటమని ధ్వనిచేయఁగా, నక్క విచారపడి "ఈశిరస్సులు పయి కెంతో యందముగా నున్నవి. అయినను లోపల నెంతవెదకినను మెదస్సుమాత్ర మావగింజంతయు కనఁబడకున్నది." అని పలికి యుస్సురని యందుండి వెడలిపోయెను.

గీ. ఈప్రపంచనాటకశాల లెల్లయెడల
సతతము నటించుచుండు నసంఖ్యజనులు
ప్రజలఁ బలువేషముల భ్రమపఱచుచున్న
సార మెచట లోపల లేనివారె సుమ్ము.

## 119. గుఱ్ఱము, సింహము

సింహ మొకబలసిన గుఱ్ఱముమీఁద కన్నువేసి దానినేలాగున నైనఁ దనపొట్టనుబెట్టుకోవలెనని తలఁచెనుగాని దానిని పట్టుకొను మార్గ మేదియు తోఁచినదికాదు. అయినను కొంతసేపాలోచించి యాసింహము గుఱ్ఱమును తనయొద్దకు రాకర్షింపఁదగినయుపాయ మొకటి యూహించి, తాను సకలమూలికలను దెలిసినఘనవైద్యుఁడ ననియు సమస్తజంతువులయొక్కయు సర్వవ్యాధులను నివారణము

చేయఁగలుగుదు ననియు ప్రకటనచేసెను. జంతువులను సులభముగా తనగర్భముఁ జొప్పింపఁగలుగుటకు పన్ని యుండునని యామాయో పాయముయొక్క యుద్దేశమును గుఱ్ఱము గ్రహించి, మాయకుఁదగిన ప్రతిమాయపన్ని యాయభినవవైద్యునిరోగము ముందుగా కుదిర్చి గర్వభంగము చేయవలెనని నిశ్చయించుకొని, తా నేమియు నను మానపడక యావర్తనమును నమ్మినట్లు నటించి యెడమకాలిలో ముల్లువిరిగిన ట్లభినయించి కుంటుచు మెల్లగా సింహముయొద్దకునడిచి, తనకుమరణవేదనకలిగించుచున్న ముల్లుతీసి కాలికిమందు వేయవలసిన దని వెనుకకాలుచాచెను. సింహముతత్క్షణమే వైద్యము చేయుటకంగీక రించిదగ్గఱకువచ్చి కాలుచూపుమనిగుఱ్ఱమునడిగెను. గుఱ్ఱము వెనుకవం కతిరిగి తనవెనుకటికాలొకటి పయికెత్తిచూపి, సింహముకాలు పట్టు కొని శోధించుటకయి ముందుకుజరుగుచున్న సమయములో వెనుకటి కాళ్ళతో సత్తువకొలఁదినెత్తి పైకెగిరి దిమ్మెక్కిపడునట్టుగా దాని మొగముమీఁద నొక్కతన్నుతన్ని, సింహమువెనుక కొఱిగి క్రిందబడి కొట్టుకొనుచున్న సమయములో తన్నువంచించి చంపఁదలఁచుకొన్న దానిని తానేవంచింపఁ గలిగితినన్న సంతోషముచేత సకిలించుచు కాలికొలఁదిని పరుగెత్తి యదృశ్యమయ్యెను.

గీ. అవని నంగిటబెల్లంబు నాత్మవిషముఁ
బెట్టుకొని తేనెమాటలు వెలికిఁ బలికి
పరుల వంచింప నెంచెడుపాపరతులు
కడకుఁ దమమోసములఁ దామె చెడుదు రెపుడు.

## 120 ముసలివాడు. మృత్యుదేవత

బలహీనుఁ డయిన యొక బీదముసలివాఁడు తనయూరిచేరువ నున్న యడవికిఁబోయి చితుకులేఱి మోపుకట్టుకొని నెత్తిమీఁదఁబెట్టుకొని యింటికి మరల వచ్చుచుండెను. ఎండదెబ్బచేతను దారినడచిన బడలికచేతను ముసలివాఁడలసిపోయి యాకట్టెలమోపు మోయలేక కొంతదారిసాగినతరువాత క్రిందఁబడవైచి నేలమీఁద చతికిలఁబడి రొప్పుచువిసుగుచేత "ఓమృత్యుదేవతా! నీవొకసారివచ్చి నాశ్రమ నివారణముచేయుము" అని మృత్యువును పిలిచెను. ఆమాటలు పలుకఁగానే మృత్యుదేవత వానివద్దకువచ్చి "ఓవృద్ధుఁడా! నన్నేలపిలిచి నావు? నావలన నీకేమి కావలెను?" అని యడిగెను. ఆవృద్ధుఁడు మృత్యువు తనకంతసమీపమున నున్నదని యెఱుఁగక మృత్యుదేవత సన్నిహితురాలు కాఁగానే భయముచేత వడవడవణఁకుచు "అమ్మా! ఈకట్టెలమోపు నానెత్తిమీఁదినుండి జాఱిపడినందున ముసలితనము వలనఁ గలిగిన బలహీనతను బట్టి మరల నేనిది నెత్తిమీఁది కెత్తుకో లేక నిన్నుఁ బిలిచినాను. ఇంతకంటె నీవలన నాకు మఱియేమియు నక్కఱలేదు." అని వాఁ డుత్తరమిచ్చెను.

గీ. కొంత శ్రమకల్గఁగనె చావు కోరుకొనుచు
మరణ మనఁగానె వెఱతురు మనుజు లిలను.
మరణమునుగోరక నరుండు మరణ మొదవ
భయపడనిసాధువర్తన వఱల వలయు.

## 121. గాడిద, గుఱ్ఱము

ఒకవర్తకుఁడు తనగాడిదమీఁద రెండు బొచ్చుమూటలును, గుఱ్ఱముమీఁద రెండుప్పుమూటలును వేసి తనగ్రామమునకు తోలుకొనిపోవుచుండెను. ఇట్లు పోవుచుండఁగా నడుమ నొకకాలువ యడ్డమువచ్చెను. ఆరెండుజంతువులును నీటిలోదిగినడుచుచుండఁగాగుఱ్ఱము

దిగినవైపున నీరు మిక్కిలి లోతుగా నున్నందున తడిసి మూటల లోని యుప్పు కొంత కరఁగి మూటలు తేలికయ్యెను. ఇట్లవి రెండును కాలువ దాఁటి మరల మెట్టను నడుచుచుండఁగా గుఱ్ఱము తనమూట తేలికగుటయు తేలికయిన కారణమును మెల్లగా గాడిదతోఁ జెప్పెను. అదివిని గాడిద తన మూటలను కూడ తేలికచేసికోవలెనని తలఁచి కొంతదూరము సాగినతరువాత మఱియొక కాలువ కనఁబడగానే దాని లోదిగి బుద్ధిపూర్వకముగా తనవీపుమీఁదిమూటలను నీటిలోముంచి వేసెను. గాడిద యనుకొన్నట్లు నీళ్ళలోముంచుటచేత బొచ్చుమూటలు తేలికకాక మఱింత బరువెక్కినందున, అది యామూటలు మోచుకొని నడువలేక చచ్చెను.

గీ. సరిగ యోచించి, యితరులు సలుపునట్టి
కార్యముల మేలుకీడులు కనఁగలేక,
యన్యులొనరించునట్లు చేయంగఁ బూన
నష్టమె పొసంగు లాభమునకును మాఱు.



## 122. గుడ్లగూబ

మధ్యాహ్నసమయమునం దొకగుడ్లగూబ తొఱ్ఱలోనుండి వెడలివచ్చి యొకకొమ్మమీఁదఁ గూరుచుండి, అద్భుతముగా వెలుగు

చున్న సూర్యబింబమువంకఁ జూచి యిట్లు ప్రలపింప మొదలుపెట్టెను. "ఓహో! ఈసూర్యకిరణము లెంత పనికిమాలినవిగా నున్నవి! కన్నులు మిఱుమిట్లుగొలిపి యెలుకలు మొదలగునవానిని కనఁబడకుండఁ జేయుట తప్ప నాకీసూర్యప్రకాశమువలన లేశమును బ్రయోజనము కానరాకున్నది. ఇటువంటి నిష్ప్రయోజనకరమయిన సూర్యబింబమును దేవుఁడేలచేసెనో నేనూహింపఁ జాలకున్నాను. పగలుకూడ చీఁకటియున్నపక్షమున, ఎంతో మనోహరముగా నుండును!"—అని తలపోయుచుండఁగా చేరువకొమ్మమీఁదికి వచ్చుచున్న గరుడపక్షి యామాటలువిని "ఓబుద్ధిహీనుఁడ! సూర్యబింబమేమి ప్రయోజనము కొఱకు చేయఁబడినదో తెలిసికోఁ జాలక నిష్కారణముగా నేల దూషించెదవు? ఉన్నలోపమంతయు నీకన్నులలోనున్నదికాని సూర్యబింబములో నెంతమాత్రమును లేదు. గుడ్లగూబ యెలుకలను పట్టుకోలేక పోవునని, నీమూలమున లోకమంతయు కన్నులున్నప్రయోజన మనుభవింపకుండవలెనని కోరుచున్నావా? నీవు పనికిమాలిన దనుకొనుచున్న సూర్యబింబము లోకమున కంతకును పరమప్రయోజనకరముగా నున్నది. బుద్ధిహీనులుతప్ప లోకములో మఱియెవ్వరును తామేబుద్ధిమంతులమని తలఁచుకోరు." అని బుద్ధి చెప్పెను.

గీ. ధారుణిని దామె కడుగొప్పవార మనియుఁ
దమకుఁ గొఱగాని దెల్ల వ్యర్థంబె యనియు
భావమునఁ దలంపక యెల్లవారికొఱకు
నీశ్వరుఁడు సృష్టిచేసెనం చెఱుఁగ వలయు.

## 123. కోఁతి, నక్క

ఒకపర్యాయము మృగరాజయినసింహము మృతినొందఁగా, అరణ్యమునందుగల జంతువు లన్నియు మృగరాజు నేర్పఱచుకొనుటకయి సభచేసి యొకవానరపతిని మృగరాజమున కభిషిక్తుని జేసెను.

మృగరాజ్యాధికారము నిమిత్తమయి ప్రయత్నముచేసిన జంతువులలో నొకటియయిన నక్కమర్కటమును రాజునుగాఁ జేయుటచేత లోపల మిక్కిలి కోపముగలదయి పయి కాకోపమేమియుఁ గనఁబడనీక యడఁచుకొని నవ్వుమొగముతో తిన్నగా క్రొత్తరాజువద్దకుఁ బోయి యేకాంతదర్శనము చేసి నమస్కరించి, "దేవా! నేనిప్పుడొకధన నిక్షేపమును జూచి వచ్చినాను. అయినను తనరాష్ట్రములో దొరకిన ధనమంతయు రాజు దయినందున నేను దానిని ముట్టుకొనక యీశుభ వార్తను దేవరకు నివేదించుటకయి వచ్చినాను. ఈనిక్షేప మితరుల కంటఁ బడకమునుపే దేవరవారక్కడకువిజయముచేసి చేతికిదక్కించు కొనవలెను. అని మహావినయభక్తులతో విన్నపము చేసెను. అప్పు డాకోఁతిరాజు ధనాశచేత తననక్కభృత్యునివెంట తత్క్షణమే బయ లుదేఱి ధనమును స్వాధీనము చేసికొనుటకయి నడిచెను. నక్క యాయపూర్వమృగరాజును దూరముగాఁ గొనిపోయి యెలుకలను బట్టుటకయిపెట్టిన యినుపయంత్రము నొకదానిని చూపి యీసందు చేయిపెట్టి తీసినయెడల మూఁతవిడిపోయి ధనము పయికివచ్చునని చెప్పెను. కోఁతి యామాటనమ్మి యాయంత్రములో చేయిపెట్టఁగానే బెట్టువదలి మీఁటపడి చేయియందులో చిక్కుకొని యూడి రాకపో యెను. చేయియూడిరాక బాధపడుచు రాజు "రాజద్రోహీ! ఇది యేమి? ఇట్లు మోసముచేసితివి?" అని కోపపడియడుగఁగా నక్క "ఓవెఱ్ఱిరాజా! ఈయంత్రములో తగులుకొన్న నీవ్రేళ్ళనే నీవు పయికి దీసికొని కాపాడుకోలేనివాఁడవు నీప్రజలయాపదలనుదీర్చి వారి నెట్టు కాపాడఁ గలుగుదువు?" అని రాజు నక్కడవిడిచి తనదారిని బోయెను.

గీ. జనులు ప్రభువుఁగా నొకని జేకొనునపుడు
గుణబలాఢ్యునినే యేర్చుకొనఁగ వలయు.
తమపనులె చక్కఁబెట్టుకోఁ దగనివారు
పరులకార్యము లెటు చక్కఁబఱుపఁ గలరు?

# 124. కోడి, కుక్క, నక్క

ఒకకోడియు కుక్కయు మిత్రము లయినందునఁ గలిసి దేశాటనము చేయుటకు నిశ్చయించుకొని ప్రయాణమయి బయలుదేఱి అడవిమార్గమునఁ బోవుచు చీఁకటిపడిన తరువాత కోడి యొక పెద్దచెట్టుయొక్క పయి కొమ్మమీఁది కెక్కి కూరుచుండి కూరుచుండఁగా కుక్క దాని క్రింది తొఱ్ఱలో శయనించెను. ఇట్లా రెండును రాత్రిగడపిన తరువాత తెల్లవాఱుజామున కోడి ముందుగా నిద్ర లేచి వాడుక ప్రకారముగా బిగ్గరగా కూయ మొదలు పెట్టెను. ఆకూఁత చెవి సోఁకఁగానే యొకనక్క యా కోడిని ప్రాతఃకాలభోజనమున కుపయోగింపవలెనన్న యుద్దేశముతో మెల్లగా చెట్టు సమీపమునకు వచ్చి పైవంక జూచి "మిత్రుఁడా కర్ణరసాయన



ముగా వినఁబడిన నీపాట నాహృదయమును కరఁగించి నీమీఁద నవ్యాజానురాగము పుట్టించినందున, నీదర్శనమపేక్షించి నేనిప్పుడింత దూరము నడచి వచ్చినాను. నాకొక్కసారి నీయాలింగన సౌఖ్య మిచ్చి నన్ను ధన్యునిజేయుము.'' అని వేఁడుకొనెను. కోడి దాని మాయమాటలు విని యనుమానపడి ''మిత్రుఁడా! నీవింతదూరము నన్ను వెదకుకొనుచు వచ్చినందునకై నాకు పరమానందము కలిగి నది. నీవు దయచేసి చెట్టుయొక్క వెనుకవైపునకుఁ బోయి తొఱ్ఱలో నిద్రించుచున్న ద్వారపాలకుని లేపిన పక్షమున, నీకాతఁడు పయికి వచ్చుటకు దారి చూపును.'' అని చెప్పెను. ఆమాటలువిని నక్క చెట్టుయొక్క తొఱ్ఱవద్దకుఁ బోయి పిలుచునప్పటికి లోపలనుండి కుక్క లేచివచ్చి దానిమీఁది కుటికి గొంతుకొఱికి చంపివేసెను.

గీ. స్వప్రయోజనపరతతో సరసఁ జేరి
యాత్మలోపల లేని నెయ్యంబు నెఱపి,
యిచ్చకములాడునట్టి నిర్హేతు కాప
వరుల నమ్మక మెలఁగవ పడఁగ వలయు.

## 125. కాకి, పావురము

పెంచినవారు ప్రతిదినము వేసెడు మేఁత తిని యొకరి యింట పావురములు సుఖపడుచుండుట చూచి చేరువ చెట్టుమీఁద నున్న కాకి వానిలోఁ గూడి తాను సుఖపడవలెనని తలఁచి, వానివలె కనఁ బడుటకయి ఱెక్కలకు తెల్లరంగు వేసికొని తన బంధువులను విడిచి సంజవేళను బోయి పావురపు గూటిలోఁ బ్రవేశించెను. పావురములు చీఁకటిలో నానవాలు పట్టలేక తమలోనికి రానిచ్చినందున కాకి యారాత్రి సుఖముగా వానితో భోజనముచేసి పవ్వళించి యూర

ఉండక, తాను వానిని మోసపుచ్చితిని గదా యన్న సంతోషము
చేత తన్ను మఱచి యుత్సాహముతో పాటపాడ నారంభించెను.
ఆకంఠస్వరము చెవినిబడఁగానే యది తమలోని పక్షి కాదని తెలిసి
కొని పావురము లాకాకిని తన్ని పొడిచి తమలో నుండి వెడలనడఁ
చెను. కాకి దెబ్బలకు భయపడి యక్కడ నుండి వెడలి మరల తన
వారిలోఁ జేరుటకయి కాకులవద్దకు పరుగెత్తెను. కాకులు దాని
ఱెక్కలయొక్క తెల్లరంగును జూచి యది స్వజాతిపక్షి కాదనుకొని
దానిని తమలోనికి రానియ్యక తఱిమివేసెను. తన యవివేకముచేత
కాకి యిట్లు లేనిపోనికష్టమును తెచ్చుకొని యుభయభ్రష్టమయ్యెను.

గీ. స్వసుఖలబ్ధికై మాయలు పన్నువాఁడు
దుర్దశల పొందు మితిలేక తుట్టతుదకు
ప్రజలు పయివేషములఁ గొత్త భ్రమము గొన్నఁ
దెలిసికొందురు పిదపఁ జేష్టలనుబట్టి

## 126. గ్రద్ద, పిల్లి, పంది

ఒక పెద్దచెట్టుయొక్క కొనకొమ్మలలో గూడు కట్టుకొని గ్రద్దయొకటి వాసముచేయుచుండెను; చెట్టుకు నడిభాగమునందున్న తొఱ్ఱలో నొకయడవిపిల్లి కాపురముండెను; చెట్టుయొక్క యడుగున బోలుగానున్న భాగములో పందియొకటి తన పిల్లలతో నివసించుచుండెను. అవి యన్నియుఁ గలిసి కొంతకాలము సుఖముగానే యుండెను గాని యటు తరువాత పిల్లియొక్క కుతంత్రము పన్ని సహవాసుల సౌఖ్యమునకు భంగము గలుగఁజేసెను. ఒకనాఁ డాపిల్లి చెట్టుపయికిప్రాఁకి గృధ్రమువద్దకుఁ బోయి మెల్లఁగా దానిచెవిలో "మిత్రమా! చెట్టుక్రింది పంది యేమిచేయుచున్నదో చూచినావా? అది చెట్టుచుట్టును త్రవ్వి వ్రేళ్ళ నన్నిటిని పెల్లగించివేయుచున్నది.

ఇట్లు త్రవ్వఁగా చెట్టు కూలినపక్షమున మనము లేనప్పుడు మన పిల్లలకు హానిచేయవలె నన్న ద్రోహచింతతోనే యది యీపని చేయుచున్న దని నా కిప్పుడు తోఁచుచున్నది. కాఁబట్టి యిల్లువిడువక నెలదినములవఱకును నీవు సదా దానిని కనిపెట్టి చూచుచుండవలయును." అని చెప్పెను. ఆమాటలు నమ్మి భయపడి గ్రద్ద తన గూడు విడువక యాహారనిద్రలు మాని దివారాత్రములు కాచుకొని యుండెను. అంతట పిల్లి మెల్లగా చెట్టు దిగి వచ్చి దీనముఖముతో పందియొద్దకుఁ బోయి యేకాంతముగా "మిత్రమా! నీ వీదిన మిల్లు విడిచి బయట పోఁగూడదు. నేఁడు నీ వావలికిఁ బోఁగానే నీపిల్లలలో నొకదానిని తెచ్చి కుడువఁ బెట్టెద నని చెట్టుపయి నున్న పాడుగ్రద్ద తనపిల్లలతో మెల్లగాఁ జెప్పుచుండఁగాఁ గొన్నిమాట లిప్పుడు నా చెవిని బడినవి. ఈసంగతి ముందుగా నీకుఁ దెలియఁజేయుట మంచి దని సహవాసగోషముచేత నీయొద్దకు పరుగెత్తుకొనివచ్చినాను. నేను వేగిరము నాయింటికిఁ బోవలెను. ఈలోపల గ్రద్ద నాపిల్లల కేమి మోసము తెచ్చునో యని భయమగుచున్నది." అని యచట నిలువక పయికిఁ బోయెను. ఈకుత్సితవాక్యములను నమ్మి తనపిల్లలకు గ్రద్ద యేమిహానిచేయునో యని క్రింద పందియు, తనపిల్లలకు పంది యేమిహానిచేయునో యని పయిని గ్రద్దయు, తమనివాసములు వదలక యక్కడనే రేయింబగళ్లు కాచుకొని యుండుటచేత పస్తుపడి కృశించి కొన్నిదినములలో గృధ్రవరాహములు చావఁగా మాయలమాఱి పిల్లి వానిపిల్లలను తానును తనపిల్లలును జేరి భక్షింపఁ జొచ్చెను.

గీ. వారియొద్దఁ గొన్నియుఁ గొన్ని వీరియొద్దఁ
జెప్పి చెడఁగొట్టుదురు ఖలుల్ చెలులసుఖము
కావునను బుద్ధిమంతులు కపటు లైన
పొరుగువారిమాటలు త్రోచి పుచ్చవలయు.

---



## 127. గాడిద, కుక్క, తోడేలు

ఆఁకలిగొనియున్న కుక్కయు, బరువువేసినగాడిదను దనవెంటఁ గొని యొకపాంథుఁడు దారిప్రయాణముచేయు చుండెను. కొంత దూరము పోయినతరువాత వాఁ డలసి యొకచోట తనగాడిదను కుక్కను నిలిపి తా నొకచెట్టుక్రింద పరుండి హాయిగా నిద్రపోయెను. అంతట గాడిద చేరువనున్నపొదలు మొదలయినవి మేయుచుండెను. కుక్కమాత్ర మాఁకలిచేత బాధపడుచు దాపునఁ గూరుచుండి గాడిదను జూచి "చెలికాఁడా! నీ వొక్కసారి వంగి నాసిమిత్తమయి నీవీపుమీఁద వేసియున్న యన్నము కొంచెమునన్ను తీసికోనిమ్ము." అని యడిగెను. గాడిద దానిమాటలు పెడచెవిని బెట్టి యది యెన్ని విధములఁ బ్రార్థించినను వినక తాను గడ్డి తినుచు "మనయజమానుఁడు నిద్రలేచినదాఁక నీవు కొంచెమునే పోపికపట్టవచ్చును. అతఁడు లేచి మూటతీసి నీయన్నము నీకు పెట్టక మానఁడులే. ఇంతలో తొందరపడకు." అని కసరెను. ఇంతలో నొకతోడేలు చేరువయడవిలోనుండివచ్చి గాడిదమీఁది కుఱికి గొంతు పట్టుకొనెను. అప్పుడా గాడిద "చెలికాఁడా! రమ్ము రమ్ము. శీఘ్రముగా వచ్చి తోడుపడి

కీనిని విడిపింపుము" అని కుక్కను పిలిచెను. "మన యజమానుఁడు నిద్రలేచినదాఁక నీవు కొంచెము నీ షోపిక పట్టవచ్చును. అతఁడు లేచి నీకు తోడుపడకమానఁడులే. ఇంతలో తొందరపడబోకు. అని పలికి కుక్క యక్కడనుండి కదలకుండెను. ఈమాట లనుచుండఁగానే తోడేలు గాడిదను గొంతు కొఱికి చంపివేసెను.

గీ. ఒక్కచోటను గొలువులో నుండువారు
సాకులను జెప్పి తగువేళ సాయపడక
తాము తప్పించుకొనఁ బ్రయత్నంబు పడక
యొండొరులకును గోడ్పడుచుండ వలయు.

## 128. తోడేలు, మేకపిల్ల

ఒక మేఁకపిల్ల యింటి నడికొప్పుమీఁది కెక్కి కూరుచుండి యాదారిని తోడే లొకటి పోవుచుండఁగా దానిని పిలిచి యనేక దుర్భాషలాడి తిట్టెను. ఆమాటలు విని తోడేలు తలయెత్తి పయికిఁ జూచి "ఓరిదుష్టుడా! ఈమాటలవలన నన్నవమాన పఱుపఁగలిగితి నని యెంచుకొని గర్వపడఁబోకు. ఈమాటలు నీ విప్పుడెక్కియున్న యున్నతస్థలమునుండి వచ్చినవని భావించుచున్నాను గాని నీనోటి నుండి వచ్చినవని నే నెంచను. అధికుల నవమానపఱిచెడియీమహిమ యీస్థలముది కాని నీది కాదు." అని దానిమాటలు పాటిగాఁ బట్టక తనదారిని బోయెను.

గీ. అల్పుల కతిశయస్థాన మబ్బు నేని,
తూలనాడుదు రధికులఁ దుచ్ఛమతిని.
తులువమాటలు పలుకుటవలనఁ దమకు
వేఱుహాని రాకున్నను బేరు చెడును.

## 129. దొంగపిల్లవాఁడు

ఒకపిల్లవాఁడు నూతిగట్టునఁ గూరుచుండి యొంటిగా నేడ్చుచుండెను. వానియొద్ద నేమయినను న్న తస్కరింపవలెనని దొంగవాఁ డొకఁడా బాలునియొద్దకుఁబోయి "ఏల యేడ్చుచున్నావు? అని యడిగెను. నూతిలోఁ దొంగి చూచుచుండఁగా నామెడలోనికంటె యూడి నీటిలోఁ బడిపోయినందున నేడ్చుచున్నాను." అని యాబాలకుఁడు చెప్పెను. అప్పు డాచోరుఁడు వానికంఠాభరణమును దా నపహరింపవలె నన్న దురాశచేత తనపయిబట్టలు తీసి యొడ్డునఁబెట్టి చూచుచుండవలసినదని యాబాలునితోఁ జెప్పి నూతిలో దిగి కొంతతడవు తడవులాడి యం దేమియుఁ గానక మరల పయికివచ్చెను. ఇట్లు పయికివచ్చి చూచునప్పటి కక్కడ తనబట్టగాని బట్టలకు కావలియున్న చిన్నవాఁడుగాని కనఁబడకపోఁగా వాఁడు మోసముచేయఁబోయి తానే మోసపోతి నని దుఃఖించుచు నింటికి నడిచెను.

గీ. పరుల మోసముచేసెడువారుకూడఁ
బోగులురురు తమ్ముఁ బరు లింత మోసపుచ్చ
కడకు వంచన వ్యథ తెచ్చుఁ గానఁ మనుజు
లొండొరుల మోసపుచ్చక యుండ వలయు.

---

## 130. గొల్లవాఁడు, కుక్క

ఒకగొల్లవాఁ డొకకుక్కను పెంచి తాను పనిమీఁద పోవలసినప్పు డెల్లను గొఱ్ఱెలమందకు దానిని కావలిపెట్టి పోవుచుండెను. వాఁడు తన్నెంతో ప్రేమతోఁ బెంచి కాపాడుచున్నను, కొంతకాలమున కాచెడుకుక్క తన యజమానుఁడు దూరముగా పోయినతరువాత గొఱ్ఱెలలో నొకదానిని పట్టి కఱచి చంపి భక్షించి యజమా

నుఁడు వచ్చునప్పటికి తా నేమియు నెఱుఁగనట్లు తోఁకయాడించుచు నెదురుగాఁ బోవుచుండెను. ఒకటిరెండుసారు లీప్రకారముగా జరిగిన తరువాత తా నుపనిమీఁదఁబోయినప్పు డెల్లను గొఱ్ఱెయొకటి తక్కు-వగుచుండుట కనిపెట్టి యది తనకుక్కపనియే యని తెలిసికొని యా గొల్లవాఁడు దాని నురిపెట్టి చంపి చెట్టునకు వ్రేలాడదీయవలెనని నిశ్చయించి మెడకు త్రాడు తగిలింపఁబోఁగా, కుక్క వానిని జూచి "ప్రతిదినమును గొఱ్ఱెల నెత్తుకొనిపోయి చంపి భక్షించుచుండెడు తోఁడేలును విడిచిపెట్టి యెప్పుడో యొకసారి యొకగొఱ్ఱె నెత్తుకొని పోయెడు నన్నేల కరుణమాలి చంపెదవు? పెంచిన ప్రేమచేత నైనను నాప్రాణములు రక్షింపుము," అని వేఁడుకొనెను. అందుమీఁద గొల్లవాఁడు "నీ విప్పుడు చెప్పినది నిజమే. అయినను తోఁడేలుకంటె నీవే యధికశిక్ష కర్హుఁడవు. తోఁడేలు గొఱ్ఱెలకు శత్రువని యెఱిఁగినందున నేను దానిని వారించుటకై యెప్పుడును కనుగలిగియుందును. నీవో గొఱ్ఱెలను కాచుపనికి నియమింపఁబడి యాపని నిమిత్తమే పోషింపఁబడుచున్నందున నేను నిన్నునమ్మి గొఱ్ఱెలను నీకప్పగించి యేమఱియుందును. అందుచేత నీవు చేసినయీస్వామిద్రోహ మెంతమాత్రమును క్షమింపఁదగినది కాదు." అని చెప్పి దాని నురితీసెను.

గీ. పగతుఁ డొనరించు ఘోరపాపంబుకంటె
భటునివిశ్వాసఘాత మల్పమె యఘంబు.
చేరినమ్మినమిత్రునిఁ జెఱుచువాఁడు
ఘోరపాతకికంటెను క్రూరతరుఁడు.



# 131. కుక్క, మొసలి

కుక్క యొకటి గొప్పనదిగట్టుననుండు పరుగెత్తుచు దప్పిక యయినందున నీరుద్రాగవలెనని యెంతో యభిలాషకలదయినను నదిలోని మొసళ్ళను దలంచుకొని నీటిలోదిగుటకు భయపడి పయినుండియే మూతిచాచి నడుమనడుమ కొంచెమునీరు కతుకుచు పరుగిడఁజొచ్చెను. అప్పు డొక మొసలి దానిజాడ కనిపట్టి నీటిపయికి తల యెత్తి "మిత్రుఁడా! నీవంత తొందరపడి పరుగెత్తుచున్నావేమి? ఎంతోకాలమునుండి నేను నీతో చెలిమిచేయవలయునని మనసుపడి యున్నాను. దైవ మిప్పుడు నిన్ను నాసమీపమునకుఁ దెచ్చినందున నీవు నామనోరథమును సఫలముచేసితివా మహానందభరితుఁడ నయ్యెదను" అని కుక్కను పలుకరించెను. "నీవు నాయెడలఁ జూపిన గౌరవమున కెంతో సంతోషించినాను. నే నిప్పు డింత తొందరపడి పరుగెత్తుచున్నది నీవంటి మిత్రులను తప్పించుకొనుట నిమిత్తమే" అని యుత్తరమిచ్చి కుక్క యచ్చట నిలువక ముందుకు పరుగెత్తెను.

గీ. సఖుల మని చేరుకుజనులసంగమంబు
ననయము వివేకి తప్పించుకొనఁగవలయు.
దుష్టతతితోడి సాంగత్యదోషమునను
సాధులకు సర్వకష్టముల్ సంభవించు.

## 132. తోడేలు. మేక

ఒక మేక పర్వతశిఖరమునందు విషమప్రదేశమున మేయుచుండఁగాఁ జూచి తోడేలు దాని నేలాగునైనఁ దనపొట్టను బెట్టుకొనవలెనని యాలోచించి తానక్కడకు పోలేమికి విచారపడి మేకనుపిలిచి మంచి మాటలతో "చక్కనిదానా! అటువంటి యెగుడుదిగుడు చోట మేత మేయుటకయి కొండమీఁదికేల యెక్కినావు? అక్కడనుండి కొంచెము కాలు జారిపడిన పక్షమున నీతల నూఱువ్రక్కలగును. ఆయపాయస్థలమును విడిచి శీఘ్రముగా క్రిందికి దిగివచ్చి హాయిగా నిరపాయకరమైన యీ బయలియందున్న తీయనిపోదలు మేయరాదా?" అని యడిగెను. "నీవు చెప్పిన మాటలన్నియు మంచివిగానే యున్నవి. అయినను నీమాటలు నమ్మి నేనిప్పుడు క్రిందికిరాఁజాలను నాదృష్టికి నీవిప్పుడాఁకలిగొనియున్నట్లు కనఁబడుచున్నావు. కాఁబట్టి నీవున్నచోటెంత సుఖప్రదమైనదైనను సాహసముచేసి వచ్చుటకు నాకు బుద్ధిపుట్టకున్నది," అని చెప్పి మేక యక్కడనే యుండెను. అంతట మేక తన మాయలోఁ బడనందునకు చింతిల్లి నిరాశచేసికొని తోడేలు తన దారిని బోయెను.



సీ. చెప్పుహితబోధ మంచిదై యొప్పుచున్న
నదియె స్వప్రయోజనపరుఁ డైనయట్టి
వంచకునినోటినుండి వెల్వడియె నేని
జాగరూకత వలయు నాచరణమందు.

---

## 133. వైద్యుడు, అంధురాలు

ఒక వృద్ధురా లంధురా లయినందున వైద్యుని నొకనిఁ దన యింటికిఁ బిలిపించి తన నేత్రములు బాగుచేసినపక్షమున కొంతసొమ్మిచ్చునట్లును బాగుచేయకపోయిన పక్షమున నేమియు నియ్యనక్కఱలేకుండునట్లును మధ్యవర్తులవద్ద నిర్ణయము చేసెను. ఈయేర్పాటు చేసికొన్నతరువాత ప్రతిదినమును వైద్యుఁ డామెయింటికిఁ బోయి కన్నులకుఁ గాటుకవేసి, ఆమె గ్రుడ్డిదయి చూడలేకపోవుటచేత నేదో యొకవస్తువును చేతఁబట్టుకొని పోవుచువచ్చెను. ఇంటఁగల వస్తువు లన్నియు కడతేరునప్పటి కావైద్యుఁ డామెకన్నులు కుదిర్చి తనకిచ్చెదనన్న బహుమాన మిమ్మని యడిగెను. ఆమె మరల దృష్టిబలము పొంది తనసొత్తును జూచుకొనఁగలుగునప్పటి కింట నొకవస్తువును కంటికి కనఁబడనందున వైద్యునికిచ్చుటకుఁ దనయొద్దనేమియు లేదని చెప్పెను. అప్పు డావైద్యుఁడు తనకు రావలసిన రొక్కము నిమిత్త మధికారులయొద్ద నభియోగము తేఁగా ఆవృద్ధాంగన ధర్మసభకుఁ బోయి "ఓధర్మాధికారులారా! నాకు దృష్టి యెప్పటియట్లు వచ్చినపక్షమునఁ గొంతసొమ్మితని కిచ్చుటకును నాయంధత్వము బాగుపడనిపక్షమున నేనీతని కేమియు నియ్యకుండుటకును నేనొప్పుకొని నేత్రచికిత్స చేయించుకొన్నమాట వాస్తవమే. నాకన్నులు కుదిరినవని యీతఁడు చెప్పుచున్నాఁడు. నాకన్నులు బాగుపడనేలేదని నే ననుకొనుచున్నాను. నాకన్ను లీఘనుఁడు బాగుచేయుట కారంభింపకముందు మాయింట నెన్నోవస్తువులను నేను చూచు

చుండెడిదానను; ఇతఁ డిప్పుడు నా యంధత్వముపోయి నా కన్నులం బాగుపడినవని దృఢముగా చెప్పుచున్నను నాకంటి కిప్పుడు నాపూర్వపు వస్తువులలో నొక్కటియుఁ గానఁబడకున్నది. నే నీయనకు నిర్ణయించుకొన్న సొమ్మియ్యవలయునో లేదో ధర్మాధికారు లయిన మీరే నిర్ణయించి చెప్పుఁడు.'' అని విన్నపముచేసెను. అప్పుడు సభవారామెవస్తువుల నతఁడు దొంగలించినాఁడని తెలిసికొని యతఁడు తెచ్చిన యభియోగము కొట్టివేసి నలుగురిలో నతని నవమానపఱిచి పంపివేసిరి.

గీ. న్యాయమార్గంబుచేత ధనార్జనంబు
చేయుటకు మాఱు మోసంబు చేయునేని,
గౌరవము గోలుపడి సరివారిలోనఁ
బండితుండైనఁ దానవ్వుఁబాటు పొందు.

---



## 134. తల్లి, పిల్లవాడు

ఒకపిల్లవాఁడు పాఠశాలలో మఱియొక బాలునియొక్క పుస్తకము నొకదానిని దొంగిలించి తెచ్చి తల్లిచేతి కిచ్చెను. దొంగపుస్

చేసినందుకు తల్లి వానిని శిక్షింపక వానిశక్తిని మెచ్చుకొని తల్లి తన కొడుకెంతో ఘనకార్యము చేసినాఁడని సంతోషించి వానికొక నారింజపండు బహుమానము చేసెను. ఈ ప్రోత్సాహముచేత వాఁడు ధైర్యము తెచ్చుకొని యప్పుడప్పుడు పొరుగువారి వస్తువులను వారేమఱియున్నప్పుడెల్లను తస్కరించి తెచ్చితల్లికిచ్చుచుక్రమక్రమముగా చౌర్యవిద్యయందు గడితేఱి తుదకు పరిపూర్ణపండితుఁడయి పెద్దవాఁడయినతరువాత నొకరియింట బందిపోటు దొంగతనము చేసెను. అప్పుడు రాజభటులు వానిని పట్టుకొని దండనాధికారి కొప్పగింపఁగా నతఁడు విమర్శించి వానికి మరణదండనము విధించెను. ఆశిక్షను జరుపుటకు చేతులు వెనుకకు విఱిచికట్టి వానిని తలారు లురికొయ్యవద్దకు తీసికొనిపోఁగా వేడుక చూచుటకొఱకు గుంపులు గుంపులుగా వచ్చిన పౌరజనులతోఁ గలసి యక్కడకు వానితల్లికూడ వచ్చి క్రిందఁబడి పొరలుచు ఱొమ్ము మోఁదుకొనుచు కొడుకునిమిత్తము పెద్దపెట్టున నేడ్వఁజొచ్చెను. తననిమిత్త మట్లు నేలఁ బడి విలపించుచున్న తల్లిని జూచి వాఁడు తనతల్లి చెవిలో నొక్కమాట చెప్పివచ్చుట కనుజ్ఞ యియ్యవలసినదని యధికారులను వేఁడుకొని వారి సెలవుపొంది రాజభటులవెంట తిన్నగా తల్లియొద్దకు నడిచి, చూచువారందఱును తల్లితోనేదో యేకాంత మాడుచున్నాఁడని తలఁచుచుండఁగా తల్లి చెవి రెండుపండ్లసందునను బెట్టి కఱుక్కునకొఱికి ముక్క యూడఁదీసెను. ఆబాధకు సహింపలేక తల్లి మఱింతబిగ్గరగా నేడ్చుచు చెవినుండి నెత్తురు వఱదలుగట్ట మూఁకలలోఁబడి పరుగులెత్తఁ జొచ్చెను. అప్పుడక్కడ నున్నవారందఱును వానిదౌష్ట్యమున కాశ్చర్యపడి మహాకోపముతో వానినిజూచి "ఓరిపాపాత్ముఁడా! ఈవఱ కొకఘోరపాతకముచేసి యురిశిక్ష ననుభవింపఁ బోవుచుండియు బుద్ధిలేక యీ నక్షమను కన్నతల్లి చెవులు త్రెంపి యీ క్రొత్తపాపమేలకట్టుకొన్నావు?"

అని యడిగి వానిని నానావిధముల దూషింపసాగిరి. అందుమీఁద వాఁడా పౌరబృందమునుజూచి "అయ్యలారా! నామనవి యొక్కటి చిత్తగింపుఁడు. నేను నాచిన్ననాఁడు బడిదినములలో నొకబాలుని పుస్తకమును దొంగిలించి తెచ్చి తనచేతికిచ్చినప్పు డీమెుండ నన్ను మెచ్చుకొని బహుమానమిచ్చి ప్రోత్సాహపఱుపక నాకప్పుడే తగిన దండన చేసియుండిన పక్షమున నాకిప్పు డీగతి పట్టకపోయి యుండును. నాయొక్క యీదుర్దశకంతకును మాతృరూపమున నున్న యీశత్రువే యాదికారణము. కాఁబట్టి నామృత్యువునకు మూలమయిన యీతల్లి నా విషయమునఁ జేసిన యపరాధమునకు నేనిప్పుడు చేసిన యీ యల్పశిక్ష చాలదని చెప్పి యురికొయ్యలవద్దికి నడచెను.

గీ. జనకులయుపేక్షవలననె జగతిలోనఁ
చెడుదు రెందఱో బాలురు శిక్షలేక
చిన్నపుడు నాటుమంచియొ చెడుగొ పిదప
బలపడి శిలాక్షరం బట్లు వదల దెపుడు.

## 135. సింహము గాడిదతోఁగలిసి వేటాడుట

గాడిదను తోడుచేసికొని వేఁటాడవలయు నన్నబుద్ధి పుట్టఁగా సింహ మొకనాఁడు గాడిదను బిలిచి "నీవు నా వెంటవచ్చి పొదలలో దాఁగియుండి నీచేతనైనంత బిగ్గరగా భయంకరధ్వని చేయుము." అని యాజ్ఞాపించెను. గాడిదకూఁత విని మృగములు బెదరి తమస్థానములు విడిచి ప్రాణరక్షణార్థమయి నానాముఖముల పరుగెత్తునప్పుడు కొన్నిటిని సులభముగా పట్టుకోవచ్చునని సింహ మీ యుపాయ మాలోచించెను. ఇట్లు మృగరాజుయొక్క యాజ్ఞానుసారముగా గాడిద యరణ్యమునకుఁ బోయి యొక పొదలో దాఁగియుండి దిక్కులు ప్రతి

ధ్వని యిచ్చునట్లుగా నోండ్ర పెట్ట నారంభించెను. ఆవింతశబ్దము విని భీతిచేత గుండె లదర మృగములు కొన్ని కాలికొలదిని పరుగులెత్తి మృత్యుముఖమునకుఁ బోవునట్లుగా సింహము పొంచియున్న చోటికే పోయి సింహముచేఁ జంపఁబడిభక్షింపఁబడెను. ఈప్రకారముగా కావలసినన్ని మృగములను సింహ మాప్యాయనముగా భక్షించి తృప్తి నొంది ఇఁక నీవు నీ సంగీతము చాలించి పయికి రావచ్చునని గాడిదను బిలిచెను. అప్పు డాగాడిద తనరహస్యావాసమునుండి బయలు వెడలి వచ్చి సింహమునకు నమస్కరించి యెదుట నిలువఁబడి మహాగర్వముతో "ఓమహాప్రభూ! మీసేవకుఁ డిప్పుడు చూపినపాండిత్య పరీక్ష యెట్లున్నది?" అని యడిగెను. "దివ్యముగా నున్నది. నీప్రభావమును నేనివఱకెఱుఁగి యుండనిపక్షమున దీర్ఘమయిన నీకూఁతకు నేనుసహితము భయపడియుందును" అని సింహము మెచ్చుకొనెను.

గీ. క్రొత్తవారికి మది భీతిఁ గొలుపుచున్నఁ
బరిచితులకు హాస్యాస్పదుఁడై వదరుపోతు
అఱపులనుబట్టి సింహము లట్లయున్న
గాడిదలె చేష్టలందుఁ బెక్కండ్రు జనులు.

## 136. ఇద్దరు బాటసారులు

ఇద్దఱుమనుష్యు లరణ్యమార్గమున నడుచుచుండఁగా వారిలో నొకనికి దారిప్రక్కనున్న చెట్టుమొదట గొడ్డలియొకటి కనఁబడెను. వాఁ డప్పుడు రెండవవానిని జూచి సంతోషముతో "మిత్రుఁడా! నా కిక్కడ గొడ్డలి దొరకినది." అని చెప్పెను. "చెలికాఁడా! నాకని చెప్పఁబోకు. సహచరుల మయిన మనయిద్దఱిలో నెవ్వరి కేది

దొరకినను మనముభయులమును పంచుకొని యనుభవింపవలసినవార మగుటచేత మనకని చెప్పు'' అని రెండవవాఁ డనెను. ఆమాటకు మొదటివాఁ డొప్పుకొనక గొడ్డలి చేతఁబట్టుకొని నడువ నారంభించెను. ఈప్రకారముగా వా రిరువురును తగవులాడుచు కొంచెము దూరము నడుచునప్పటికి గొడ్డలి పోఁగొట్టుకొన్నవాఁడు ప్రక్కతోఁటలోనుండి పరుగెత్తుకొనివచ్చి "దొంగలారా! నిలువుఁడు, నిలువుఁడు. నే నీచెట్టు మొదటఁ బెట్టుకొన్న గొడ్డలి నెత్తుకొని పోవుచున్నారా? '' అని కేకలు వేయుచు వారివెంటఁబడెను. రెండవ దండధరునివలె వెనుక పరుగెత్తుకొని వచ్చుచున్న మనుష్యుని జూచి భయపడి గొడ్డలి చేతఁబట్టుకొనియున్న మొదటివాఁడు రెండవవానిని జూచి "మిత్రుఁడా! మనము చెడితిమి?'' అని పలికెను. "మిత్రుఁడా! మన మనబోకు. నేను చెడితినను. మొట్టమొదట లాభము వచ్చినదనుకొన్నప్పు డాలాభములో నాకు భాగ మిచ్చుటకు నీ వొప్పుకొనవందున నిప్పు డీనష్టములోఁ గూడ నాకు భాగము లేకుండ సర్వమును నీ వనుభవించవలసినదే'' అని తోడివాఁ డనెను.

సీ. చెలుల మంచును సుఖవేళఁ జేరవచ్చి
తొలఁగుదురు కష్టవేళను దుచ్ఛజనులు.
సుఖము దుఃఖము నిజమైన సఖులు రెండుఁ
బాలికాపులై యనుభవింపంగవలయు.



## 137. విగ్రహము మోచుకొని పోవుచున్న గాడిద

ఒక నూతన దేవాలయములో ప్రతిష్ఠ చేయుటకయి యర్చకులు మిక్కిలి ప్రసిద్ధికెక్కిన యొక విగ్రహమును పొరుగూర నున్న యొకానొక జీర్ణాలయమునుండి తెచ్చి గాడిదమీఁద బెట్టి వీధులలో నుండి తీసికొనిపోవుచుండిరి. అప్పు డావిగ్రహమున కెదురుపడినవా రందరును చేతులు జోడించి వీధిపొడుగునను గాడిదకాళ్ళవద్ద విగ్రహమునకు సాగిలఁబడి మ్రొక్కసాగిరి. ఆగాడిద పురజను లందఱును తన యందలి భక్తిచేత తనకే మ్రొక్కుచున్నారని తలఁచుకొని గర్వము తల కెక్కఁగా తలనిక్కఁబెట్టి దిక్కులు చూచుచు స్వగౌరవము నందఱికిని జూపవలెనని వీధినడుమ నిలువఁబడి యచ్చటినుండి కదలకుండెను. తోలువాఁడెంత యదలించినను కదలకుండుటచూచి యది మాటలతో నడుచుః జాడ కానక "ఓ మొద్దు గాడిదా ! జను లెల్లను గాడిదను కొలుచునంతటి బుద్ధిహీను లయిన కాల మింకను రాలేదు. నీగర్వ

మింతటితో చాలించి యిఁక ముందుకు నడువు." అని పలుకుచు చబుకుతో చుఱ్ఱున వీఁపుమీఁద నాలుగు దెబ్బలు వేసి నిమిషములో క్రొత్తగా వచ్చిన గొప్పతనము నంతను మఱచి పరుగెత్తునట్లు చేసెను.

గీ. తమకు యోగ్యతలేనిసద్గౌరవమున
కర్హుల మటంచు నిక్కి వారల్పమతులు
విఱ్ఱవీఁగుచుఁ దగనిదు ర్వ్యాపములను
బూనె నేమియు జనుఁ డవమాన మొందు.



## 138. ఎలుకలసభ

అందఱును నిద్రపోయి తలుపులు వేసికొన్న తరువాత నెలుక లన్నియు నర్ధరాత్రమం దొకసభామందిరములో పెద్దసభ చేసి తమకు ప్రతిదినమును సంభవించుచున్న పిల్లి బాధను తొలఁగించుటకయి మార్గము నాలోచింప మొదలుపెట్టెను. అప్పు డాసభికులందఱును

రెండుపక్షములుగా నిలిచి సాధకబాధకము లాలోచించి మహా వాదములుచేసి పూర్వపక్షసిద్ధాంతములతో గొప్పగొప్ప ప్రసంగములుచేసిరి. ఆసమయమునందు మహావక్తయైన మూషకకుమారుఁడొకఁడు ముందుకు వచ్చి తక్కినవారి నూరకుండ నియమించి, ముందెప్పుడును తమకు పిల్లిబాధ కలుగకుండుటకుఁ దగిన మంచి యుపాయమును తాను కనిపెట్టితినని పలికి, "మన మిప్పుడు పిల్లి మెడలో నొకగంట కట్టవలెను. ఆఘంటానాదముచేత పిల్లి ప్రయాణమయి కొంచెము కదలఁగానే దాని రాక ముందుగానే మనకుఁ దెలియును. ఆగంట చప్పుడు కొంచెము చెవిని బడఁగానే మేలఁకువపడి మన మందఱమును మన కలుగులలో దూఱి సురక్షితులమయి యుండవచ్చును. నిరపాయమైన పరమోపాయ మింతకంటె మఱి యొకటి లేదు." అని తన సామర్థ్యము ప్రకటనచేసెను. ఆయాలోచన శ్లాఘాపాత్రముగా నున్నదని యామూషకకుమారుని సభవారందఱును వేయినోళ్లఁ గొనియాడిరి. అప్పుడింతవఱకును మౌనము ధరించియున్న యొక వృద్ధమూషకము లేచి "ఓసభికులారా! ఈయాలోచన చక్కఁగానే యున్నది. నిశ్చితకార్యమును వెంటనే నిర్వహింపవలయును. అయినను మనలో నిప్పుడాపిల్లి మెడకు గంట కట్టువా రెవ్వరో బయలుదేఱవలసియున్నది. ముందుగా నాపౌరుష శాలిని నిర్ణయింపుడు." అని యడిగెను. "మీరందఱును జేరి పిల్లి యొక్క సర్వాంగములను గట్టిగా పట్టుకొన్నపక్షమున నిర్భయముగా గంటను మెడకు నేను గట్టెదను." అని యుపన్యాసకుఁడు మహాధైర్యముతోఁ జెప్పెను. తరువాత తక్కిన యవయవముల నన్నిటిని పట్టుకొనువారు కుదిరినను ముందుగా గోళ్లను పండ్లను బట్టుకొనువారు మాత్ర మెవ్వరును మహాసభికులలో దొరకనందున నాఁటికి సభ కలిసిపోయెను.

గీ. ఇంట నూరక కూర్చుండి యెందఱైనఁ
గానఁబడుదు రుపాయముల్ కలుపువారు.
కాని, కానరా రొక్కరుఁ గష్టమైన
పనిని బయివేసికొని చేయుబాహుబలులు.

# 139. కోడి, నక్క

ఒకకోడిపుంజు చెట్టుయొక్క మీఁదికొమ్మమీఁదఁ గూరు చుండి కూయుచుండఁగాఁ దాని కంఠస్వరము విని యాహారసంపాద నము నిమిత్తము చేరువను చెరలాడుచున్న నక్క యొక్కటి యక్క డకు వచ్చి, కోడి తా నందుకోలేని యెత్తుకొమ్మమీఁద నుండుట చూచి దానిని మాయచేసి క్రిందికి రప్పింపఁ దలఁచుకొని చెట్టుచేరు వకుఁ బోయి "ఓమిత్రమా చిరకాలమునకు నేఁడు నిన్నుఁ జూడఁ గలుగు భాగ్యము నాకు సంభవించినది. అయినను నీ విప్పు డసంద ర్భపు స్థలమునం దుండుటచేత నీవంటి ప్రాణమిత్రుని తనివితీఱ కౌఁగిలించుకొని స్పర్శసుఖ మనుభవించు పుణ్యము నాకు లభింప కున్నది. కాఁబట్టి నీ వొక్కసారి చెట్టు దిగి వచ్చి క్షణకాలము నాకు నీగాఢాలింగన మిమ్ము" అని పిలిచెను. "చెలికాఁడా! మిత్రసందర్శనముచేత నాకన్ను లిప్పుడు కృతార్థము లయినవి. నామీఁఁద నీకు మనసులో నెంత ప్రేమ యున్నదో నే నెఱుఁగని వాఁడఁగాను. అయినను నే నిప్పుడు నీమాట విని క్రిందికి దిగి రాఁజాలను. కడుపులో లేని ప్రేమ కౌఁగలించుకొన్న రాదుగదా! నామీఁది నిర్హేతుక కటాక్షముచేత నీ వొక్కవేళ నన్ను విడిచిపెట్టి నను తక్కిన జంతువులు విడిచిపెట్టునా?" అని కోడి యుత్తర మిచ్చెను. "మిత్రుఁడా! నీ వటువంటి సందేహము పెట్టుకోవలసిన

పనిలేదు. భయపడక క్రిందికి దిగి రా. సమస్త మృగములును పక్షులును తమతమ సహజమయిన జాతివైరమును విడిచి యేకముం దన్యోన్యమైత్రి పూని యొకరి కొకరు హానిచేసికొనక సోదరభావము వహించి క్షీరోదకన్యాయమున సుఖముగా బ్రతుకవలయు ననియుఁ ఎవ్వఁడయిన నీనియమ మణుమాత్ర మతిక్రమించి యేజంతువున కైనను గొంచెము బాధకలుగఁజేసిన పక్షమున నట్టి పాపాత్ముఁడు క్రూరశిక్షలకు గురి కావలసినదనియు, జంతువులలో కొంతకాలము క్రిందట జరిగిన సంధివార్త యిన్నిసారులు సమస్తాటవులలోను ఘోషింపఁబడినను నీ వింకను వినసే వినలేదా ? ఏమి యీయాశ్చర్యము'' అని ముక్కుమీఁద వ్రేలువేసికొని యద్భుతపడఁజొచ్చెను. ఈమాటలయం దంతగా నాదరముంచక యప్పుడు కోడి తలయెత్తి దూరమున నేదో వింత జంతువు కనఁబడుచున్నట్లు ముందు వంక చూడ మొదలుపెట్టెను. ఆనక్క దాని యాకారవికారము కనిపెట్టి "మిత్రుఁడా! ఏల నీ వావంక నంత శ్రద్ధతోఁ జూచుచున్నావు ? అక్కడ నేమి కవఁబడుచున్నది?'' అని యడిగెను. "మ తేమియు లేదు. ఆపయినుండి మనవైపునకుఁ గొన్ని వేఁటకుక్కలు మాత్రము పరుగెత్తుకొని వచ్చుచున్నవి.'' అని కోడి యుత్తరము చెప్పెను. ఆమాటలు చెవిని బడఁగానే గుండెలు తటతట కొట్టుకొనఁగా నక్క "మిత్రుఁడా! ఇఁక నాకు సెలవిచ్చిపంపుము. అర్ధనిముషమును నేనిందు నిలువఁగూడదు.'' అని ప్రయాణమయ్యెను. "మిత్రుఁడా! తొందరపడఁబోకు. సమస్త జంతువులును జాతివైరము మానియున్న యీసంధి సమయములో నీవు కుక్కలకు భయపడవలసిన పని లేదు గదా? అవి మనయొద్దకు రానిమ్ము. అప్పుడు మీయుభయుల యొక్కయు సమావేశసౌఖ్యము చూచిన తరువాత నేను కూడ చెట్టు దిగి వచ్చి నీయభీష్టము తీర్చెదను. అందాఁక నిందు నిర్భయ

ముగా నిలువుము.'' అని కోడి వేడుకొనెను. "నిలువను ఈయడవిలో చాటించిన సంధివార్త యింకను కుక్కల చెవులకు చేరినదో లేదో యెవ్వ రెఱుఁగుదురు? అని నక్క యక్కడ నిలువక పరుగెత్తెను.

గీ. వగలకును మాయలకుఁ బేరుపడినవారు
క్షేమ మరయుచు మనమీఁదఁ బ్రేమ మెంతొ
గలిగినట్లుగఁ దియ్యనిపలుకు లాడు
చున్నను దదుక్తి నెద నమ్మకుండ వలయు.

# 140. వనదేవత పక్షపాతము

పిల్లలలో నెల్లను మిక్కిలి చక్కని పిల్లను దెచ్చి చూపిన తల్లికి గొప్ప బహుమానమిచ్చెదనని పూర్వ మొకసారి వనదేవత వనములోఁ గల మృగములలో నెల్లను జాటఁబంపెను. ఆఘోషము విని యనేక మృగములు తమతమ శిశువులను దీసికొని వచ్చుచుండఁగా నన్నిటికంటెను ముందుగా కోఁతి యొకటి చప్పిడి దౌడలును చితుక ముక్కును బల్లతలయుఁ గల కురూపియైన తనశిశువును మాతృవాత్సల్యముతోఁ దీసికొని వచ్చి వనదేవతముందు పెట్టి, అసమానసౌందర్యము గల పిల్లను దెచ్చిన తల్లి కిచ్చెదనని ఘోషించిన బహుమానము న్యాయముగా తన కొక్కతకే రావలసినదని మనవి చేసికొనెను. ఆమాటలు విని యప్పు డక్కడ నున్న మృగములన్నియు పక్కున నవ్వెను. అందుపయిని కోఁతి సమస్త జంతువులను రోషముతోఁ జూచి "ఓమృగములారా! మీ రేల యూరక నవ్వెదరు. ఈవనదేవత నాకొడుకు సౌందర్యమునకు మెచ్చి బహుమానమిచ్చినను ఇయ్యకపోయినను నాకు చింత లేదు. తల్లి నైన నాదృష్టి

కీశిశువు నిస్సందేహముగా లోకములోని శిశువులలో నెల్లను మిక్కిలి చక్కనిదిగాఁ గనఁబడుచున్నది.'' అని చెప్పెను.

గీ. ఆత్మదృష్టిచేతఁ గురూపు లంచు నెంచి
పరులబిడ్డలఁ బరిహసింపంగ రాదు
తల్లిదృష్టి కింపుగనుండుఁ దనదుబిడ్డ;
కాకిపిల్ల కాకికి ముద్దుగాదె యెపుడు ?

## 141. గాడిద, కోడి, సింహము

ఒకగాడిదయు కోడియు నొకచోట మేఁత తినుచుండఁగా సింహ మొకటి వానివైపునకు వచ్చుచుండెను. ఆసింహము కంటఁ బడఁగానే కోడిపుంజు గొంతెత్తి బిగ్గరగా కూయ నారంభించెను. స్వభావముచేత సర్వదా కోడికూఁత సింహమునకు భయప్రదముగా నుండుటనుబట్టి సింహ మాకూఁత చెవిని బడఁగానే వెనుక తిరిగి సహజభీతిచేత పరుగెత్తఁజొచ్చెను. అక్కడ నున్న గాడిద యప్పుడు తన యాకారమును జూచియే భయపడి పాఱిపోవుచున్న దని భావించి పాఱిపోవుచున్న సింహమును మఱింతదూరము పాఱఁద్రోలి తోడిజంతువులకు తనపౌరుషము చూపవలసినసమయ మిప్పుడు తటస్థించిన దని తలఁచుకొని కోడికూఁత వినఁబడుచున్నంతదూరము దానివెంటఁ బరుగెత్తెను. కోడికూత చెవినిబడుట మానఁగానే భయముతీఱి సింహము వెనుక తిరిగి చూచి తన్నుఁ దఱుముకొని వచ్చుచున్న గాడిదమీఁదఁ బడి దానిని పట్టుకొనెను. అప్పుడాగాడిద "నాస్వభావమును నే నెఱిఁగియుండియు లోపల లేనిపౌరుషమును పయికి నటించి సాటిజంతువులవద్ద మెప్పుపొందవలె నన్న బుద్ధిహీనతచేత సురక్షితస్థలమును విడిచి మృత్యుముఖమునకుఁ బరుగెత్తు

కొని వచ్చి నిష్కారణముగా ప్రాణములు పోఁగొట్టుకొనుచున్నాను గదా ?" అని తనలో ననుకొనుచు సింహముచేత భక్షింపఁబడెను.

గీ. లేశమును స్థైర్యధైర్యములు లేనివారు
పయికిఁ గలవారివలె నటింపంగ నెంచి
యధికు లొనర్చు నట్టి కార్యములు చేసి
కష్టములు తెచ్చుకొందు రకారణంబ.

---

## 142. తండ్రి, ఇద్దఱు కొమార్తెలు

ఒకానొక కాపువాని కిద్దఱు కూఁతులు గలరు. అతఁడు వారిలో నొకతెను వ్యవసాయము చేయువానికిని, ఒకతె నిటుకలవ్యాపారము చేయువానికిని, ఇచ్చి వివాహములు చేసెను. ఇట్లిద్దఱుకూఁతులును తమభర్తలతోఁ గలసి సుఖముగా కాపురము చేయుచుండఁగా, తండ్రి యొకనాఁడు వారిని చూచుటకై పోయి కాలస్థితి యెట్లున్నదో విచారించి వారివిషయమున తాను చేయవలసిన దేమైన నున్నదా యని యడిగెను. అప్పుడు వ్యవసాయము చేయుచున్నవానికి భార్యయైన పెద్దకూఁతురు "నాయనా ! ఎండలు హెచ్చుగా నుండుటచేత మాపొలములోని పయిరెండఁబాఱుచున్నది. శీఘ్రముగాఁ గొన్ని వర్షములు కురిసిన బాగుండును కాఁబట్టి వెంటనే వానలు కురిపింపుమని దీవు దేవుని ప్రార్థింపుము." అని తండ్రిని కోరెను. ఇటుకల వ్యాపారము చేయువానికి భార్యయైన చిన్నకూఁతురు "నాయనా! ఎండలెక్కువగా నుండుటచేత మాయిటుకలు చక్కఁగా నెండుచున్నవి. ఇంకను గొంతకాలము మాయిటుక లెండవలయును మంచియెండలు కాచిన బాగుండును. కాఁబట్టి వెంటనే వానలు కురిపింపకుండుమని

నీవు దేవుని ప్రార్థింపుము.'' అని తండ్రిని కోరెను. అప్పు డతఁ డా చిన్నకొమారితను జూచి ''అమ్మా! నీవు వానలు కురియకుండు నట్లు ప్రార్థింపు మనుచున్నావు. నీయక్కగారు వానలు కురియునట్లు ప్రార్థింపు మనుచున్నది. ఇట్లు పరస్పరవిరుద్ధములయిన కోరికలు కోరుచున్న మీ యిరువురిలో నే నెవ్వరికోరికను మన్నింతును?'' అని యడిగెను.

గీ. స్వప్రయోజనమునుబట్టి సర్వజనులు
వాంఛ చేయుదు రాత్మలాభంబె యెపుడు
సర్వసముఁడైన దేవుఁడో సకలజనుల
క్షేమ మారసి తగినట్లు క్షేమ మిచ్చు.

# 143. గాడిద, దానినీడ

ఇద్దఱు బాటసారు లొకయూరికిఁ బ్రయాణమయిపోవుచుండిరి. వారిలో నొకనియొద్ద నొకగాడిద యుండెను. కొంతదూరము దారి సాగినతరువాత రెండవమార్గస్థుఁడలసి నడవలేక తోడివానివద్దనద్దెకు పుచ్చుకొని గాడిదమీఁద నెక్కిపోవుచుండెను. ఈప్రకారముగా మఱి కొంతదూరము పోయినపిమ్మట వాఁ డాగాడిదను దిగి దానినీడలోఁ గూరుచుండెను. ఇంతలో గాడిదయొక్క యజమానుఁడు వచ్చి కలసి కొని తన్నుఁగూడా దానినీడలోఁ గూరుచుండ నియ్యవలసినదని రెండవవాని నడిగెను. ఆగాడిదయొక్క నీడ యొక్కనికిమాత్రమే సరి పోవునదిగా నున్నందున, వాఁడు తా నద్దెకుఁ బుచ్చుకొన్నగాడిద యొక్కనీడ తనయొక్కనిదే కాని యందితరులకు భాగము రాదని చెప్పి యజమానునికి తా వియ్యక నిరాకరించెను. అందుపయిని సొంతగాఁడు తాను గాడిదనుమాత్రమే యద్దె కిచ్చితినిగాని దానినీడ

నియ్యలేదని యొక యద్భుతయుక్తి కల్పించి తగవులాడ మొదలు పెట్టెను. ఈవిధముగా నారంభమయిన వివాద మంతకంతకు ముదిరి మాటలనుండి చేతలకు దిగఁగా, వా రిద్దఱును లేచిముష్టియుద్ధమున కారంభించిరి. ఈసందడిలో గాడిద సందు చేసికొని కాలికొలఁదిని పరుగెత్తి వారిముష్టియుద్ధము ముగియులోపల వారి దృష్టిపథమును దాఁటిపోయెను.

గీ. పుడమిలోపలఁ గొందఱుపురుషవరులు
నిర్నిమిత్తంబుగా వట్టినీడకొఱకుఁ
గయ్యమాడుచు మున్నున్న గట్టిసొత్తు
గూడ దానికై పోఁగొట్టు కొందు రహహ.

## 144. విగ్రహవిక్రయించుపురుషుడు

ఒకానొక యాచార్యపురుషుఁడు బీదతనముచేత బాధపడుచు విక్రయించుటకయి తనయింట నున్న యొక రాగివిగ్రహమును దీసి కొనివచ్చి కనఁబడినవారి కెల్లను జూపి "ఓ భక్తాగ్రేసరులారా! ఈ విగ్రహము నొద్ద నుంచికొని కొలుచుచుండువారికి మహాదైశ్వర్యము పట్టును. ఇంతమహిమగల యీ యమూల్యవిగ్రహమును మీ కల్ప క్రయమున కమ్మెదను. మీలో నెవ్వరైనను దీనిని శీఘ్రముగాఁ గొని భాగ్యసంపన్నులుకండు." అని యందఱికిని హితబోధ చేయఁ జొచ్చెను. అప్పు డక్కడ నున్నవారిలో నొక బుద్ధిమంతుఁ డా గురూపదేశము విని దాపునకువచ్చి గురువందనముచేసి "స్వామీ! అటువంటిమైశ్వర్యదాయకమయిన దివ్యవిగ్రహమును తమయొద్దనే యుంచుకొని యది ప్రసాదించెడి యైశ్వర్యమునంతను తామే యను భవింపక యింత స్వల్పధనమున కితరుల కేల విక్రయించెదరు?" అని యడిగెను, "ఈక్షణముననే నా కిప్పుడు కొంతసొమ్ము కావలసి

యున్నది. ఈదేవత చిరకాల మారాధించినఁగాని ధన మియ్యదు."
అని యాచార్యుఁ డాతని కుత్తరము చెప్పెను.

గీ. అబ్బు సిరి మంత్రతంత్రాళి నంచుఁ జాటి
యమ్ముదురు వాని వంచకు లన్యులకును
అదియె నిజమైన, సిరి వారె యనుభవింప
కేల రాగికాసుకు విక్రయింపవలయు?

## 145. కుంటి గ్రుడ్డివాఁడు

ఒకకుంటివాఁడును గ్రుడ్డివాఁడును పూర్వ మొకసారి యొక గ్రామమునకు పోవలెనని బయలుదేరిరి. కుంటివాఁడు మెల్లగా కుంటుచు కొంతదూరము నడచి నడవలేక యొక చెట్టు క్రిందఁ గూరుచుండెను. గ్రుడ్డివాఁడును తడవుకొనుచు త్రోవ పొడుగునను దెబ్బలు తగిలించుకొనుచు నడిచివచ్చి యాచెట్టుక్రిందికే చేరెను. ఇద్దఱును నొకచోటఁ జేరి యెక్కడికిఁ బోయెదవని యొకరి నొకరు నడుగ నిరువురును నొక్కయూరికే పోవలసినవారుగాఁ దెలిసికొనిరి. వారిలో గ్రుడ్డివాఁడు "నేను పోవలసిన గ్రామ మిచ్చటికిఁ క్రోసెఁడుదూరమేయున్నను నేను నడచుటకు శక్తుఁడ నయి యున్నను త్రోవ కనఁబడక పోవుటచేత పోలేకున్నాను" అని పలికెను. కుంటివాఁడు తాను త్రోవను చూడఁగలిగినను కాలు లేకపోవుటచేత నంతదూరము వంకకఱ్ఱలతో నడవలేకున్నానని చెప్పెను. అప్పుడు వారిద్దఱును కొంతసేపాలోచించి యొక యుపాయము కనిపెట్టిరి. కుంటివాఁడు గ్రుడ్డివాని బుజము మీఁద నెక్కి త్రోవ చూపుచుండఁగను గ్రుడ్డివాఁడు కుంటివానిని తన వీపుమీఁద నెక్కించుకొని నడచిపోవుచుండను, తమలో దా మొక యేర్పాటు చేసుకొని యాప్రకారముగాఁ జేసి యుభయులును సుఖముగా గమ్యస్థానమును జేరిరి.

గీ. అంగహీనులు సహిత మన్యోన్యశరణు
లగుచు సాధించుకొనవచ్చు నర్థములను.
కావునను నంగవైకల్యకారణమున
మానవుఁడు చేతనౌపని మానరాదు.



## 146 రెండు మేఁకలు

ఒకనాఁడు రెండుమేఁకలు చెఱియొకవైపునుండియు వచ్చి యొకకాలువగట్టు చేరెను. ఈవలనుండి యావల కాకాలువమీఁద నడ్డముగా నొకబల్లచెక్క వేయఁబడియుండెను. ఆబల్లచెక్క మిక్కిలి సన్నముగా నుండుటచేత నొకసారి యొక్క మేఁక దక్క రెండును దానిమీఁదనుండి నడచుట కనుకూలపడకుండెను. అయినను మేఁకలు మిక్కిలి గర్వముకలవై తమలో నొకదానిని ముందుగా కాలువ దాఁటి పోనీక యొకసారియే రెండును చెఱియొక ప్రక్క నుండియు బల్లమీఁది కెక్కివచ్చి మధ్యగా తారసించెను. ఈబల్ల మీఁదినుండి కాలువను దాఁటుటకు నీ కెంతస్వాతంత్ర్యమున్నదో నాకు నంత స్వాతంత్ర్యమున్నదని యొకటియు, ఈబల్ల నీయొక్క దాని నిమిత్తమే వేయఁబడి యుండలేదని రెండవదియు, కొంతసేపు

తగవులాడి యొకదాని నొకటి త్రోసికొని రెండును కాలువలోఁబడి మృతినొందెను. మఱికొంతసేపటికి నాప్రకారముగానే మఱి రెండు మేఁకలు చెఱియొకదిక్కునుండియు నాకాలువగట్టుకు వచ్చి యొకసారిగా బల్లమీఁదికి యెక్కి కాలువనడుమ తారసించుట తటస్థించెను. అవి మిక్కిలి సాధుస్వభావము కలవగుటచేత వెనుకటివానివలె పోట్లాడక తమలో నొకటి వెనుకకు పోవలెనని యెంచి యాయిరుకు బల్లమీఁద నిరువురకు నవకాశము చాలక యాలోచించి యొకటి బల్లమీఁద పరుండి రెండవదానిని మెల్లగా తనమీఁదినుండి దాటి పొమ్మని చెప్పెను. అట్లుచేసి రెండును సుఖముగా కాలువ దాటి తమదారిని తాము పోయెను.

గీ. గర్వమున నొండొరులతోడఁ గలహమాడు
నల్పబుద్ధులు చెడిపోదు రవనియందు ;
గర్వ[illegible] యొండొరులతోడఁ గలసి మెలసి
[illegible] ప్రేమమం[illegible] బాగుపడుదు రెపుడు



## 117. పిల్లి గబ్బిలము

ఇంటనున్న పెంపుడు చిలుకను చంపినందున యజమానుఁడు ఖేదపడి యీసారి కంటఁబడిన పక్షమున తన్ను చావఁగొట్టెదనని

మహాకోపముతోఁ బ్రతిజ్ఞ పట్టుట విని, పిల్లి భయపడి పాఱిపోయి యొక మూలను దాఁగి దేవుని ధ్యానించి "స్వామీ! ఈసారి నన్నీ యాపదనుండి తప్పించిన పక్షమున నేనికముం దెప్పుడును నా జీవితకాలములో పక్షులను భక్షింపను" అని మ్రొక్కుకొనెను. యజమానుని కోపము శాంతపడి తనకు మరణము తప్పిపోయిన తరువాత నొకనాఁడు పిల్లి గదిలో పెట్టెవద్దఁ గూరుచుండియుండఁగా గబ్బిల మొకటి వచ్చి పెట్టెమీఁదవాలెను. అప్పు డాఁకలి యొకమూలను వెనుక తాను మ్రొక్కుకొన్న మ్రొక్కుబడి యొకమూలను మనస్సును బాధింపఁగా పిల్లి కొంతసే పేమిచేయుటకును తోఁచక యాలోచించి, తుదకు రక్షణమార్గ మొకటి కనిపెట్టి సందేహ నివారణము చేసికొని నోటిలోపలనున్న హేతువును బట్టి గబ్బిలము పూర్ణముగా పక్షి కానందున దానిని వధించుట దోషము కాదని నిశ్చయించి తత్క్షణమే యెగిరి పట్టుకొని దానిని భక్షణము చేసెను.

గీ. స్వార్థపరతను ధర్మబాహ్య పుంబనులు
చేయఁగాఁ దాము జనులు వాంఛించునపుడు
ధర్మసూక్ష్మతలంచు వ్యర్థంబులైన
భేదములు పెట్టి చొత్తురు విపథమందు.

## 148. బాలుఁడు [illegible]

ఒకనాఁడు బాలుఁ డొకఁడు నూతియంచు పైని పరుండి నిద్రపోవుచుండెను. అదృష్టదేవత వానిని దూరమునుండి చూచి దాపునకు వచ్చి యా చిన్నవానిని కొట్టి లేపి "బాలుఁడా! నీ వీ యపాయకరమైన స్థలమును విడిచి నిరపాయమైన మఱియొక చోటికి బోయి హాయిగా నిద్రింపుము. ప్రమాదవశమున నీ విప్పు డీనూతిలో

గూలిన పక్షమున, లోకులు నీతప్పిదమును కనిపెట్టలేక యీ యాపదను నిష్కారణముగా నా కారోపించి నామీఁద లేనినింద మోపుదురు. కాఁబట్టి నాయం దనుగ్రహించి శీఘ్రముగా లేచి పొమ్ము." అని వాని నక్కడనుండి పంపివేసెను.

గీ. ప్రజలు తమదోషమున నె విపత్తు లొంది
నిలుపుదు రదృష్ట దేవతలను దప్పు
ధరణిఁ దమకీడు మేళ్ళకుఁ దామె కాని
కాదు భాగ్యదేవత యెందుఁ గారణంబు.

## 149. తపస్వి. భల్లూకము

ఒకానొకతాపసుఁ డొకయెలుఁగుబంటి కుపకారముచేయఁగా ఉపకార స్మృతి కలదయి యాభల్లూక మాతనియొద్ద నివసించి సేవ చేయుచుండుటకయి సెలవు వేఁడుకొనెను. ఆతపస్వి దాని ప్రార్థన నంగీకరింపఁగా, ఎలుఁగుబంటి ప్రతిదినము నాతని కుపచారము చేయుచు నతఁ డున్న గుహలోనే యుండెను. కొంతకాల మీ ప్రకారముగా నుండఁగా నతఁ డొకనాఁటి మధ్యాహ్నమున నెండబడలిక చేత తన గుహలో నిద్రపోవుచున్నప్పు డెలుఁగుబంటి దాపునఁ గూరుచుండి యీఁగలు మొగముమీఁద వాలకుండ తోలుచుండెను. అది యెన్నివిధముల తోలినను పోవక యొక యీఁగ మరలమరల వచ్చి యాతని మొగముమీఁద వాలుచువచ్చెను. "ఈసారి నిన్ను తప్పక చంపెదను చూడు." అని పలికి యెలుఁగుగొడ్డు ముక్కుమీఁద వాలియున్న యీఁగమీఁది కోపముచేత నాతనిముక్కుమీఁద తనచేతికొలఁది మంచి యుద్దేశముతోనే యొక్క చఱపు చఱచెను. ఈఁగ యాచఱపుతో చచ్చెను గాని గోళ్ళు గ్రుచ్చు

కొనుట చేత తపస్వియొక్క మొగము గాయపడి యాతనికి మిక్కిలి బాధ కలిగించెను.

గీ. చెలులఁ గా బుద్ధిహీనులఁ జేర్చుకొన్న
మంచియుద్దేశములతోనె మనకు వారు
తెలివిలేమిని సహితంబు సలుపవచ్చుఁ
గాన, మూర్ఖులతో మైత్రి పూనరాదు.



## 150. బీదవాఁడు, కొడుకు, గాడిద

ఒక బీదవాఁడును వానికొడుకును విక్రయించుటకయి తమగాడిదను సంతకు తోలుకొనిపోవుచుండిరి. ఇట్లు పోవుచుండఁగా దారిలో నూతివద్ద నీళ్ళు తోడుకొనుచున్న కొందఱు స్త్రీలు వారిని జూచి తమలోఁ దాము నవ్వుకొని "అక్కలారా! ఇటువంటి బలిసిన గాడిదను వెంటఁబెట్టుకొని తాము దానిమీఁద నెక్కక కాళ్ళీడ్చుకొనుచు క్రింద నడుచుచున్న యీబుద్ధిహీనులవంటివారిని మీ రెప్పుఁడైనఁ జూచినారా?" అని ముక్కుమీఁద వ్రేళ్ళువైచుకొని యాశ్చర్యపడసాగిరి. ముసలివాఁడా యమ్మలక్కలమాటలువిని వెంటనే తనకొడుకును గాడిదమీఁద నెక్కించి తాను దానిప్రక్కను నడిచి పోవు

చుండెను. అటుతరువాతఁ గొందఱు ముసలివాండ్రు వారి కెదురు పడి "ఈకాలములో పెద్దలయెడ నెవ్వరికిని గౌరవములేదు. నడువ సత్తువలేని తనతండ్రిని ముసలివాఁడని చూడక క్రింద నడపించుచు తానుమాత్రము సుఖముగా గాడిదమీఁద నెక్కి యీసోమరిపుట్టువాఁడెట్లు నిర్విచారముగాఁ బోవుచున్నాఁడో చూడుఁడు. ఓబుద్ధిమాలిన బాలుఁడా! పిక్కబలముగల నీ వింతట నైనను గాడిదమీఁదినుండి దిగి శోషిల్లుచున్న యీవృద్ధునికొంతసేపు దానిమీఁద నెక్కనిమ్ము" అని మందలించిరి. అటుపిమ్మట ముసలివాఁడు తనకొడుకును గాడిద మీఁదినుండి దింపి తాను దానిపై నెక్కిపోవ మొదలుపెట్టెను. ఇంతలోఁ గొందఱు బాలురు వారి కెదురుగావచ్చి "ఓ నిర్దయుఁడా! ఈపసివానికి కాళ్ళకు నెత్తురు దిగునట్లుగా క్రింద నడిపించుచు తుందులాగున నీవు గాడిదమీఁద నెక్కిపోవుటకు నీ కెట్లు మనసు వచ్చినది?" అని కేకలువేసిరి. అంతట ముసలివాఁడు తనకొడుకును గూడ గాడిద మీఁద నెక్కించుకొని యూరివంకఁ బోవుచుండెను. ఈవిధముగా వా రూరుచేరువకుఁ బోవునప్పటికి మఱియొకగుంపు వారిని గలిసికొని "ఈగాడిద యెవరిది?" అని యడిగెను. "మాదే" అని వారుచెప్పిరి. "మీదే యయినపక్షమున మీ రిద్దఱు దీనిమీఁద నెక్కియుండరు. ఈబక్కగాడిదమీఁద మీ రిద్ద ఱెక్కి మోపించుకొని పోవుటకంటె మీరిద్దఱును జేరి యీగాడిదను మోచుకొనిపోవుట మా బుద్ధికియుక్తముగాఁ గనుపట్టుచున్నది." అని వా రాతండ్రికొడుకులను పరిహాసము చేసిరి. అందఱిని సంతోషపెట్టవలెనన్న యాశచేత నాముసలివాఁడు తోడనే తాను గాడిదమీఁదినుండి దిగి కొడుకును దింపి త్రాళ్ళు తెచ్చి యాగాడిదకాళ్ళంటఁగట్టి నడుమ నొకగడ తగిలించి యిరువురును చెఱియొకకొనను బుజములమీఁదఁ బెట్టుకొని యూరి బయలనున్న వంతెనమీఁదినుండి యాగాడిదను తలక్రిందుగా మోచు

కొనిపోవుచుండిరి. అప్పుడు జను లావింతనుజూచి యద్భుతపడి చప్పట్లు చఱచి యఱవసాగిరి. ఆ కేకలకు బెదరి యాగాడిద కాళ్ళు నిగుడఁదన్ని కట్లు త్రెంచుకొని క్రింది కాలువలోఁబడి చచ్చెను. అది చూచి యావృద్ధుఁడు తన బుద్ధిహీనతకు పశ్చాత్తాప పడి, స్వబుద్ధి ననుసరించి నడవక యెల్లవారిని మెప్పింపవలెనని ప్రయత్నించుటకంటె వెఱ్ఱి వేఱొకటి లేదని తెలిసికొని, గాడిద పోయినందున ఖేదపడుచుఁ గొడుకుతోడఁగూడ నింటికి నడిచెను.

గీ. ప్రజల నందఱ సంతోషపఱుపఁ గోరి
యెల్లరకు నింపుగ మెలంగ నెంచువాఁడు
పిదప నెవ్వరి సంతోషపెట్టలేక
యన్నిటికిఁ జెడ్డమతిహీనుఁ డగును జుమ్ము.



## 151 తోడేలు, మేకపిల్ల

కావలికుక్కలు చెట్లక్రింద శయనించి యుండఁగా, మేఁకలమంద యొకటి దొడ్డిలో మేయుచుండెను. అందొక మేఁకపిల్ల యాటలసందడిని మందను విడిచి దూరముగాఁ బోయి కంచెవద్ద నిలు

చుండెను. అప్పు డొక్క బక్కతోడేలు కుక్కల భయముచేత లోపలికిఁ బోవుటకు సాహసింపలేక వెలుపలనుండి తొంగిచూచుచుండెను. దానిని జూచి మేఁకపిల్ల "నీ విక్కడ నేమి వెదకుచున్నావు?" అని యడిగెను. "మ తేమియు లేదు. నాలుగు గడ్డిపోఁచలు గొనిపోవుటకు వచ్చి చూచుచున్నాను. సంతుష్టి గలవానికి స్వచ్ఛందముగా మొలచినగడ్డిపరకలు నాలుగు నోటవేసికొని దోసెఁడు నీరయినను పుడిసెడు త్రాగిన కడుపు నిండదా? జానెడు పొట్టకయి యేల యాయాసపడవలెను? నే నిప్పుడు చెప్పినట్టి యల్పాహారముతో తృప్తిపొంది యుండెడు మీ జాతిని జాడఁగా నా కత్యంత సంతోషము కలుగుచున్నది." అని తోడేలు చెప్పెను. "నీవు మాంసభక్షణము చేయుదు వని మా పెద్దలు చెప్పుచుందురే! అది సత్యము కాదా?" అని మేఁకపిల్ల మరల నడిగెను. "మీవారు చెప్పినట్టు పూర్వము నేను మాంసాహారము గొనువాఁడనే కాని యీనడుమ వేదాంతోపదేశము పొంది యుదరపోషణమునకయి హింసాకర్మము చేయుట పాపమని రోసి జలపర్ణమాత్రభక్షణముచేత దేహయాత్ర చేయుచు నాకుఁ గలిగినదానిలో నిట్లు నీవంటి యతిథ్యభ్యాగతులకుఁ బెట్టుచు సంతుష్టుఁడ నయి వనవాసమున కాలము గడపుచున్నాను. నీ వొక్కసారి యీవలికి వచ్చి నావలన నతిథిసత్కారమును బొంది మరలఁ బొమ్ము. నీవంటివానికుక్షిలో నాచేతి దొక్క తృణము పడినపక్షమున నేను కృతార్థుఁడ నగుదును." అని తోడేలు దాని నాతిథ్యమునకుఁ బిలిచెను. లోకానుభవము లేకపోవుటచే మేఁకపిల్ల దాని మాయమాటలు నమ్మి మోసపోయి యీవలికివచ్చి యా మాయవేదాంతిచేత భక్షింపఁబడెను.

గీ. పూని లోకానుభవశూన్యులైనవారి
మోస మొనరించి తమపొట్ట పోసికొనఁగ

వెదకుచుందురు వంచకుల్ వృకము లట్లు
కావున మనీషు లవ్వారి గదియరాదు.

---

## 152 నౌకాధికారి, యాత్రికుడు

ఒకడు సముద్రయాత్ర చేయుచుండగా నౌకకొంతదూరము పోయినతరువాత నడిసముద్రములో గొప్ప గాలివాన పట్టెను. అప్పుడు తరంగములు పర్వతోపమానములుగా లేచి సముద్రము నల్లకల్లోలము చేయగా మహావాయుపథమందలి గాలిపటమువలె నావ యల్లలనాడుచుండుట చూచి యెల్లవారును ప్రాణములమీఁది యాశ వదలుకొని యోడ పగులు నని నిశ్చయించుకొని యుండిరి. అయినను దానాసమయమునందు భయపడక నౌకాధికారియు నావికులును మహోత్సాహముతోఁ బని చేయుచుండిరి. ఇట్లు కొంతసేపు జరిగినపిమ్మట నీశ్వరానుగ్రహమువలన గాలి చల్లారఁగా నెల్లవారికిని మరల ప్రాణములమీఁదియాశ కలుగ నారంభించెను. గాలి శాంతి పొందినతరువాత నోడలోనున్న యాత్రికుఁడు మెల్లగా నౌకాధికారి యొద్దకు పోయి "అయ్యా! మీతండ్రిగా రేమి పనిలోనుండిరి?" అని యడిగెను. ఈయోడ కధికారిగానుండెనని యతఁ డుత్తరముచెప్పెను. ఆయన యెక్కడమృతినొందిరని మరలయాత్రికుఁడడిగెను. మాతండ్రి మాత్రమేకాక నాతాతకూడ సముద్రముమీఁద నేకొలువుచేసి యోడ మీఁదనే మృతినొందిరని యతఁడు చెప్పెను. "మీ తండ్రితాతలకు ప్రాణోపద్రవము తెచ్చిన యీ సముద్రముమీఁద వాసము చేయుటకు మీకు భయమగుచుండలేదా?" అని యాత్రికుఁ డడిగెను. "నా కణుమాత్రమును భయములేదు. మీ తండ్రిమాత్రము చావలేదా?" అతఁ డెక్కడ మృతినొందినాఁడు?" అని యా యోడ యధికారి యాత్రికునకు ప్రశ్న వేసెను. "అతఁడుమాయింట పాన్పు

మీఁద సుఖముగ ప్రాణములు విడిచినాఁడు'' అని యాత్రికుఁడుత్తర మిచ్చెను. "మీతండ్రి పాన్పుమీఁద పోయినప్పుడు పాన్పుమీఁద పవ్వళించుటకు నీవుభయపడుచున్నావా? సముద్రముమీఁద వాసము చేసినను భూమిమీఁద వాసముచేసినను పుట్టినవాఁడెల్ల నవశ్యముగా గిట్ట వలసినదే. ఈశ్వరప్రసాద మున్నయెడల నెక్కడ నున్నను భయము లేదు.'' అని యానౌకాధికారి చెప్పెను.

గీ. అవనియందున్న సాగరమందు నున్న
జనుల సమముగా రక్షించు సర్వభర్త,
ఎచట నున్నను భయమించుకేని పడక
యెల్లరు స్వధర్మమును నిర్వహింప వలయు.



## 153. మద్దిచెట్టు. [illegible] పొదలు

తిన్నఁగా [illegible] కెదిగియున్న మద్దిచెట్టొకటి తనచుట్టుపట్లనున్న పొదలను నిక్కిచూచి గర్వముతో "ఓచిఱుపొదలారా! నే నీ యడవిలోఁ గలవృక్షము లన్నిటిలోను చక్కనిదాన నయి యెట్టిమహోన్నతస్థితి నొందియున్నానో చూచితిరా? నాకొమ్మలాకాశమునంటి యేజంతువునకును ముట్టరాకున్నవి. నేనిట్టి శ్లాఘ్యపదవి ననుభవించు చుండఁగా, మీరు భూమినుండి నిలువెత్తయినను తలయెత్తుకొని లేవలేక దురవస్థ పడుచున్నారు. ఈ ప్రాంతములఁ దిరుగుగొఱ్ఱెలును

మేఁకలును మీ యాకులను మేసి మిమ్ముఁ దలయెత్తనీకున్నవి. మీదురవస్థను జూడఁగా నాకు పరితాపము గలుగుచున్నది." అని పరిహాసము చేయఁ జొచ్చెను. దానిగర్వోక్తులు విని యొకముండ్ల పొద "ఓ వృక్షమా! మాస్థితి నీకు నేఁడు పరిహాసాస్పదముగా కనఁబడుచున్నది. రేపు బోయవాఁడు గొడ్డలిచేతఁబూని వచ్చి కట్టెలకయి నీ మొదలు నఱక నారంభించినప్పుడు మనయిరువురిలో నెవ్వరిస్థితి కెవ్వరు పరితాప పడవలయునో నీవే తెలిసికొందువు. వేగిరపడక రెండుదినము లోపిక పట్టుము." అని ప్రత్యుత్తరము చెప్పి దానికి గర్వభంగము కలిగించెను.

గీ. కొలఁదివారలకునుబోలె గొప్పవారి
కాపదలు వచ్చుఁజుమ్ము కాలాంతరమున
కావునను లోకమునఁ దామె ఘనుల మనుచుఁ
బరులదుస్థితిఁ గని తూలఁబలుకరాదు.



## 151. గాడిద, తోడేలు

గాడిదయొకటి యొక పొలములో మేయుచు తన్ను పట్టుకోవలెనని తోడేలొకటి చేరువను తనవంక వచ్చుచుండుటచూచి తప్పిం

చుకొనుట కొకయుపాయ మాలోచించి కాలెత్తి త్రివేయుచు వెంటనే తాను కుంటిదయినట్లు నటింపసాగెను. అంతట తోడేలు దాపునకు వచ్చి యది యింక పాఱిపోలేదని తలంచి నేమలకుంటుచున్నావని కుశల ప్రశ్నము వేసెను. తానొక కంచె దాటిపోవునప్పుడు కాలిలో నొక మోడు విఱిగె నని చెప్పి, తన్ను భక్షించునపుడు గొంతులో గ్రుచ్చికొని బాధపెట్టకుండుటకయి యామోడును ముందుగాఁ నూడ దీయవలసినదని యా గాడిద తోడేలును వేఁడుకొనెను. తనక్షేమము నిమిత్తమని చెప్పిన యాపనికి తోడే లొప్పుకొని దానికా లెత్తి చూపుమనిచూచి తలవంచి మోడెక్కడ గ్రుచ్చుకొన్నదో శోధించు చుండఁగా, గాడిద వెనుకటికాళ్ళతో మూతిపం ళ్లూడునట్లుగా దాని నొక్కతన్ను తన్ని క్రిందఁబడవైచి పరుగెత్తెను. తోడే లాదెబ్బతో సొమ్మసిల్లి వెనుక కొఱగి మరలలేచి కూరుచుండి నోటినుండి నెత్తురు కాఱ బాధపడుచు "ఇఁకముం దెప్పుడును జోలిమాలిన పనులకు పోకుండు నట్లుగా నాకీగాడిద మంచిబుద్ధి చెప్పినది. నాతండ్రి నా కొక్కజంతుమారణవిద్యనుమాత్రమే నేర్పినప్పుడు నాకుతెలియని వ్రణ వైద్యములో నేనేల ప్రవేశింపవలెను?" అని తలపోయు చుండెను.

గీ. తనకుఁ గర్తవ్య మెనట్టిపని నెతాను
జూచుకొనక యాధిక్యంబుఁ జూపఁ గోరి
జోలిమాలిన పనులకుఁ జొచ్చె నేని
నరుఁడు లాభంబు గోల్పోయి నష్ట మొందు.

## 155. కోతి, దానిపిల్లలు

ఒక కోఁతికి రెండుపిల్లలు పుట్టెను. తల్లి యారెంటిలో నొక దానియం దధికప్రేమ గలదయి దానిని మిక్కిలి గారాబముతోఁ బెంచుచు రెండవదానిని తిన్నగాఁ జూడక యనాదరము చేయుచుం

డెను. ఇట్లుండఁగా నొకనాఁ డాకస్మికముగాఁ గొందఱు వేఁటగాండ్రు కుక్కలను వెంటబెట్టుకొని యా స్థలమునకు వేఁటకురాఁగా, కోఁతి వారినిజూచి భయపడి తత్క్షణమే పాఱిపోవలసిన దయ్యెను. అట్లాత్మ రక్షణార్థము పరుగెత్తునప్పుడు సహితము తనముద్దులబిడ్డను మఱచి పోక యాకోఁతి దానిని పదిలముగాఁ దనవీపుమీఁద నెక్కించుకొనెను. నిరాకరింపఁబడిన రెండవపిల్లకూడ స్వాభావికమైన ప్రాణభీతిచేత పరు గెత్తుకొని వచ్చి యప్పుడే వెనుకనుండి తల్లివీపుమీఁద దుమికెను. ప్రాణార్తయై పరుగెత్తుచున్న వేగిరపాటుచేత కన్నుగానక తల్లివీపు మీఁద నున్న తనబిడ్డలలో నొకదాని నింకొకదానినిగా భ్రమించి మహాకోపముతో తనకూరిమిబిడ్డనే చేతులతో నందుకొని నేలమీఁద వేసి కొట్టిచంపెను. అందుచేత తల్లిచేత ద్వేషింపఁబడుచు వచ్చిన పిల్లయే తల్లివీపును గట్టిగా నంటిపెట్టుకొని యుండి సర్వాపాయము లను తప్పించుకొని కుక్కలవాతఁ బడక బ్రతుకఁగలిగెను.

గీ. ప్రియసుతుల గొందఱం దతిప్రేమ చూపి
భ్రష్టులను జేయుదురు కన్నవారె వారి
అధికముగఁ గూర్మి చూపనియట్టి సుతులె
బాగుపడుదురు తెలుచు సద్వర్తనమున.

## 156. జంబుకము, మార్జాలము

కాలము గడపిన నక్కయు పిల్లియు కలిసి యాత్రచేయుచు త్రోవలో ప్రొద్దుజరుగుట కయి నీతివిషయమయిన సంభాషణ మా రంభించెను. "సమస్తసద్గుణములలోను భూతదయ మహోత్కృష్ట మయినది. మిత్రుఁడా! ఈ విషయమున నీ యభిప్రాయమేమి" అని

నక్క యడిగెను. "నిస్సందేహముగా భూతదయ సర్వోత్తమమైనది. లోకములో భూతదయను మించినధర్మము వేఱొకటిలేదు. దయావిహీనుని జన్మము నిరర్థకము" అని పిల్లి గంభీరభాషణములతో దన అభిప్రాయమును వ్యక్తీకరించెను. ఈవిధముగా నక్కయుపిల్లియుతమ పాండిత్యప్రకర్షమును గనఁబఱచి యహింసను ప్రశంసించుచుండఁగా చేరువ పొదలోనుండి యొక తోడేలువచ్చి పచ్చికబయలున మేయుచున్న గొఱ్ఱెల మందమీఁదఁ బడి యొక గొఱ్ఱెపిల్ల మెడపట్టుకొని యది యెంత యేడ్చుచున్నను జాలిపడక చంపి వాని కన్నులయెదుటనే దానిని భక్షించెను. "ఇది కేవల ఘోరకృత్యము ఈ పాడుపొట్ట కయి సాధుజంతువులను హింసించు రాక్షసకృత్యమును మాని కందములఫలాదులతో కడుపునింపుకోరాదా." అని పిల్లి వేదాంతవాక్యములు పలికెను. "ఇది నిశ్చయముగా మహాదారుణకార్యము. జీవహింస యెవ్వరికిని కూడదు. అడవిలో మొలచినయేతృణముతో నైనను జేనెడుపొట్ట పూడ్చుకోవచ్చును." అని నక్కమఱింత యుత్సాహముతో పరమార్థవిషయమునకుచ్చరించుచుండెను. ఈ రీతిని నిరర్గళధారగాజంబుకమార్జాలవదన గుహాలలోనుండి ధర్మోపన్యాసఝరములు ప్రవహించుచుండఁగా నింతలో దయార్ద్రహృదయముగల యానక్కయొక్క దృష్టి దారిప్రక్క నొక్కగుడిసెముందు నూక తేఱుకొని తినుచున్న కోడిమీఁదికి ప్రసరించెను. కోడి నేత్రగోచరముకాఁగానే నక్క భూతదయకు సెలవిచ్చి తనహృదయమునుండి దూరముగాఁ బంపివేసి తాను కోడిమీఁది కుఱికి కన్నుమూసి తెఱచునంత కాలములోదానిని తనగర్భములోనికిఁ బంపివేసెను. ఆనిమిషమందే బలిసినయెలుక యొకటి గుడిసెలోనుండి యీవలికిరాఁగా జాలిగుండెగల మార్జాలము దానిమీఁది కెగిరి పట్టుకొని తనలోపలి జీవదయాపరత్వమును వెంటనే పైకి సాగనంపి దానిస్థానమున మూషకమును బ్రవేశపెట్టెను.

గీ. పయికి వేదాంతవాక్యముల్ పలుకుచున్న
జంబుకములట్లు నడుతు రసాధుజనులు
నరుఁ డెపుడుఁ జెప్పినట్లె తా నడుచుకొనుచుఁ
బిల్లిశీలంబు విడిచి వర్తించ వలయు.

---

## 157. మార్గస్థులు, పుచ్చిచెట్టు

ఇద్దఱుమార్గస్థులు మధ్యాహ్నసమయమునం దొకయూరికిఁ బోవుచు నెండఁబడి డస్సి త్రోవలో నొకపుచ్చిచెట్టునీడను విశ్రమించి యలపు తీర్చుకొనుచు నొండొరులతో మాటాడుకొనుచుండిరి. కొంతసేపు సంభాషణ జరిగినతరువాత వారిలో నొకఁడు పుచ్చిచెట్టువంకఁ జూచి రెండవవానితో "ఇదిచెట్లలో నెల్లను మిక్కిలినిష్ఫలమయినది సుమా! జిహ్వకింపుగా తినుట కొక్కపండయినను లభింపని యిటువంటి పనికిమాలిన చెట్లవలన లోకమున కేమిప్రయోజనము!" అని యాచెట్టును తిరస్కరించి మాటాడ మొదలుపెట్టెను. రెండవవాఁడామాటల కౌనౌనని తలయూఁచుచుండెను. అప్పుడాచెట్టు వారిమాటల కడ్డమువచ్చి "ఓకృతఘ్నులారా! మీరిప్పుడు నానీడలో హాయిగా విశ్రమించి సుఖమనుభవించుచుండియు నిష్ఫలమయినదానినని నన్నే నిష్కారణముగా నిందించుచున్నారు. మీ రిప్పు డనుభవించుచున్న దానికంటెను నావలన మీ కధికప్రయోజన మేమి కావలెను!" అని పలికి వారి నోరడఁచెను.

గీ. పుడమిఁ బలువురు తమయల్పబుద్ధిచేతఁ
దెలియరు స్వలాభకరవస్తువుల నెఱుఁగరు.
అయిన, నుపయోగ పడుచుండు నవనిఁ గలుగు
వస్తుతతియెల్ల నొక్కొక్కపనికిఁ బ్రజకు

# 158. సింహము, ప్రతిధ్వని

అరణ్యములో సింహ మొక మృగమును జూచి గర్జించుచు దాని వెంటఁబడెను. ఇట్లు వెంబడించుచుఁ గొంతదూరము పరుగెత్తి యొకపర్వతగుహను సమీపించు నప్పటికి మఱియొకసింహ మఱచి నట్టు ప్రతిశబ్దము బైలుదేఱెను. ఆశబ్దమువిని సింహమాశ్చర్యపడినిలు చుండి "నాగర్జనమునకు ప్రతిగర్జనము చేయువాఁడెవఁడు?" అని కేక వేసెను. "నాగర్జనకు ప్రతిగర్జనము చేయువాఁడెవఁడు?" అని మాఱు మ్రోత వినఁబడెను. "నేనుమృగరాజను" అని సింహము గంభీరస్వర ముతోఁ బలికెను. "నేనుమృగరాజును." అని మరల గంభీరనాదము వినవచ్చెను. "ఓరిమూర్ఖుఁడా! చాటుననుండి యఱవక నీవు నిజమైన పౌరుషశాలి వగుదువేని నాయెదుటఁబడి ప్రేలుము." అని మహాగ్ర హముతో సింహము బిగ్గరగా నఱచెను. "ఓరిమూర్ఖుడా! చాటున నుండి యఱవక నీవు నిజమైనపౌరుషశాలి వగుదవేని నాయెదుటఁ బడి ప్రేలుము." అని మరల బిగ్గరగా ప్రతిధ్వానము వినఁబడెను. ఆమాటలకు జంకి ధైర్యము విడనాడి ఱిచ్చవడి సింహము దిక్కులు చూడ మొదలుపెట్టెను. ఇదియంతయు దూరమునుండి వినుచుండిన నక్కయొకటి యప్పుడుచేరువకువచ్చి నమస్కరించి "ఓమృగకులసార్వ భౌమా! దేవరవారిహృదయములో భీతిగలిగించినది తమశత్రువు కాదు. ఇప్పుడు వినఁబడిన యాసింహనాద మాపర్వతగుహనుండి వెలువడిన యేలినవారివాక్యములప్రతిశబ్దము గాని వేఱు గాదు." అని విన్నవించెను.

గీ. భావనాసృష్టములగు నాపత్తులకును
ధీరులును భయంపడుదురు భీరు లట్ల;
కావునను భీతిహేతువు కనఁబడుట నె
దిగులు పొందక సత్యంబు తెలియవలయు.

# బోయవాడు, వృక్షములు

గీ. వనచరుఁ డొకండు తన కేదొ వలసినట్లు
విపినమును జొచ్చి యెల్లెడ వెదకుచుండ,
వృక్షములు వానిఁ గని "యేమి వెతకె" దనుచు
నాదరముతోడ నడిగినవాతఁ డనియె.

గీ. "ఎక్కు వేమియు లేదు. నా కొక్కచిన్న
కఱ్ఱ కావలె గొడ్డలికామకొఱకు.
అంతె" యన, వానిప్రార్థన యల్ప మగుటఁ
దలఁచి వృక్షం బొకకఱ్ఱ దాన మొసఁగె.

గీ. కఱ్ఱఁ గైకొని వెడలి యాక్షణమె వాఁడు
దానిఁ దనగొడ్డలికిఁ గామగా నమర్చి,
తనకు దయచూపినట్టి యాతరుల నెల్లఁ
గొట్టి కట్టెలకై నేలఁ గూల్చఁజొచ్చె.

గీ. చెట్టొకటి యప్డు తక్కినచెట్లఁ జూచి
"మనము, సఖులార పాత్రవిమర్శ లేక
యీకిరాతునకును దాన మిచ్చినట్టి
పాపఫలమెసుం డిది" యని పలికి కూలె.

గీ. ఇతరు లొగిఁ దన్ను యాచించు నెడ వివేకి
పాత్ర మెఱిఁగి దానము చేయవలయు నెపుడు.
ఈవి యరయ కపాత్రున కిచ్చునేని,
తనకుఁ దనవారికిని ముప్పు దాన వచ్చు.

# గరుత్మంతుడు, కాకి

గీ. పర్వతాగ్రంబునందుండి పక్షిరాజు
క్షుత్తుచేఁ దూలి పసిగొఱ్ఱెఁ జూచి క్రింద
గోళ్ళసందున నిఱికించుకొనుచు దాని
గగనవీథికి నెగసెను గ్రమ్మఱంగ.

గీ. చేరువమహీరుహముమీఁదఁ గూరుచుండి
చూచుచుండిన యొక కాకి చోద్య మంది
తాను నటుచేయఁగా నెంచి తత్క్షణంబు
మేయుచుండిన యొక గొఱ్ఱెమీఁద వ్రాలె.

గీ. వ్రాలినంతనె బొచ్చులో వడిగఁ గాళ్ళు
తగులుకొని యూడి రాకున్న నెగర లేక
గిజగిజను గొట్టుకొనుచుండె గింజుకొనుచు;
గొల్లవాఁడును జరగిన దెల్లఁ జూచి.

గీ. చెంత కరుదెంచి కాకంబుఁ జేయి సాఁచి
పట్టుకొని మెల్లగా గోళ్ళపట్టు తిగిచి,
గుడిసెకును గొంచుఁ జని యాడుకొనెడుకొఱకు
వాయసంబును దనపిల్లవాండ్రకిచ్చె.

గీ. ఆత్మపరశక్తు లరయక స్వాతిశయతఁ
జేతకానట్టిపనులకుఁ జేయి చాఁపి
యధికునట్లు నటించెడి యధమజనుఁడు
ధాత్రిలోపలఁ బరిహాసపాత్రుఁడగును.

## జంబుకము, మార్జాలము

గీ. వృద్ధజంబుకమును ముదిపిల్లి కలిసి
యాత్రచేయుచు దారి నన్యోన్య మిట్లు
నీతివిషయంబులనుగూర్చి నిపుణమతిని
బుణ్యసంభాషణ మొనర్ప మొదలుపెట్టె.

గీ. "కోవిదోత్తమ! సర్వసద్గుణములందు
భూతదయ మహోత్కృష్ట మీవుడమిమీఁద.
నీయభిప్రాయ మేమియొ నిక్కముగను
జెప్పు" మని నక్క వేఁడినఁ జీలి పలికె.

గీ. "జంబుకోత్తమ యీప్రపంచంబునందు
నొక్కభూతదయయె యుత్తమోత్తమంబు.
దానిసరిపోల్పఁ గలదె సద్ధర్మ మొకటి ?
వ్యర్థము దయావిహీనునిబ్రతుకు తలఁప."

గీ. ఇటు సృగాలమార్జాలంబు లేపుమీఁటి
సాధుసల్లాప మొక్కింత సలుపు చుండ,
దండపాదనుండి తోడే లొకండు దుమికి
గొఱ్ఱెపైఁ బడి వడి దానిగొంతు కొఱికె.

గీ. కాంచి మార్జాలపతి "కటకట! యిదెంత
ఘోరకృత్యము! చెడుపొట్టకొఱకు సాధు
జంతువులఁ జంపు టుచితంబె? శాకమాత్ర
మునను నుదరంబు పూరించుకొనఁగరాదె!"

గీ. అనవుడు సృగాలపతి యిట్టు లనియె "నకట
యెంత దారుణకార్య మీవృకము చేసె!
నెవ్వరికిని గూడదిట్టు జీవహింస చేయ;
పొట్ట నేగడ్డితో నైనఁ బూడ్పవచ్చు."

గీ. ఉభయులును ధర్మములు పల్కుచుండఁగానె
కొంతదూరంబునను నొక్కగుడిసెముందు
గోచరం బయ్యె దృష్టికిఁ గోడియొకటి
ముక్కుతో మూక లేఱుచు నక్క కపుడు.

గీ. కుక్కుటము కంటఁ బడఁగానె నక్కతలఁచి
దయను హృదయాంతరమునుండి తఱిమివేసి
మెఱుఁగు మెఱసినగతిఁ గోడిమీఁది కుఱికి
పట్టి దానిని దనదుగర్భమునఁ బెట్టె.

గీ. కలుగులోనుండి యొకమూషికంబు వెలికి
వచ్చుడు నహింస నవలికిఁ బాఱఁదోలి
దానితావున నెలుకను లోన నపుడె
దానుఁజొనిపె భూతదయార్ద్ర మైనపిల్లి.

గీ. పయికి వేదాంతవాక్యముల్ పలుకుచున్న
జంబుకములట్లు నడుతు రసాధుజనులు
నరుఁ డెపుడుఁ జెప్పునట్లె తా నడుచుకొనుచుఁ
బిల్లిశీలంబు విడిచి వర్తిల్ల వలయు.



## ముసలివాఁడు, కొడుకులు

గీ. ఒక్కవృద్ధునిపుత్రులొండొరులలోనఁ
దగవు లాడంగఁ గనుఁగొని తండ్రివగచి
వారలకు బుద్ధిచెప్ప నుపాయ మొకటి
చిత్తమున నెంచి యందఱఁ జేరఁ బిలిచి

గీ. వడిగఁ గట్టెమోపొక్కటి వారియెదుటఁ
బెట్టి వేర్వేర దానిని విఱువుఁ డనుచు
నాజ్ఞ యిచ్చెను; వారును హర్ష మొంది
వచ్చి తమశక్తి చూపెడువాంఛతోడ.

గీ. కట్టెమోపు సిరుకేలను గదియఁబట్టి
బిట్టుమోఁకాలికిని బెట్టి విఱువఁ జూచి
దాని భేదింపఁ జాలక తలలు వంచి
యొక్కొకరు సిగ్గుచే వెన్క కొదిగి చనిరి.

గీ. మరల జనకుండు తనయుల దరికిఁ బిలిచి
మోపు విడఁదీసి కట్టెలు ముందు పెట్టి
వీని నొక్కొకటిని వీరారు విఱువుఁ డనినఁ
గడఁగి యవలీల విఱిచిరి కట్టెలెల్ల.

గీ. తండ్రి యప్పుడాత్మజులఁ జూచి "తనయులార
తెలియఁబడెనె సంఘీభావబలము మీకు ?
ప్రేమపాశానుబద్ధులై పెంపు గన్న
నెట్టివారు భేదింపలే రిట్టి మిమ్ము.

గీ. ఒండొరులఁగూడ కొంటిగా నుండు రేని
యన్యులకు నిట్లు సుఖసాధ్యు లగుదు రీరు"
అనుచుఁ జెప్పినబుద్ధి గైకొనుచు వారు
తగవు లాడక యైకమత్యంబుఁ గనిరి.

గీ. వసుధ నేకకుటుంబమువార లెపుడుఁ
గలసి యన్యోన్యమైత్రితో మెలఁగవలయు.
ఒండొరులతోడఁ బోరాడు చుందు రేని,
యహితులకు వారు సుఖసాధ్యు లగుదు రొకట.

స ం పూ ర్ణ ము

---

## స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తకచరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భి విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 ,, ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థ కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహ భూత వర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ- దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు :—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము-1951

# దేహారోగ్యధర్మబోధిని



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

**1951**

[ వెల రు **0-10-0**

శ్రీ శేషశైలవాసు బహద్దూర్

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కార గానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషనైశ్చర విలాసము
12 వేశ్యప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధి పత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వచన ప్రబంధములు

## పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథకవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# దేహారోగ్యధర్మబోధిని

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

1950

కాపీరైటు

# విషయసూచిక



మొదటి ప్రకరణము



రెండవ ప్రకరణము



మూడవ ప్రకరణము



నాలవ ప్రకరణము



అయిదవ ప్రకరణము

# పీఠిక

## మొదటి కూర్పు

దేహారోగ్యధర్మములను బోధించెడు గ్రంథములు తెలుఁగుభాష లోనంతగా లేవు. ఉన్నవానిలో సహితము కొన్ని మిక్కిలి పెద్దవిగాను, కొన్ని మిక్కిలి చిన్నవిగాను ఉండి బాలురకును బాలికలకును సుబోధ ములు కాకున్నవి. కాఁబట్టి యెల్లవారికి నుపయోగపడునట్లుగామిక్కిలి సులభశైలితో నేనీగ్రంథమును రచియించితిని. ఇది మొట్టమొదట స్త్రీలయుపయోగము నిమిత్తమయి "సతీహితబోధిని" లోఁ బ్రక టింపఁబడినను, ఇది పాఠశాలలలోని బాలురకును బాలికలకును సమస్త జనులకును గూడ నుపయోగకరముగా నుండు ననుటకు సందేహముండదు. పరీక్షలకుం బోవువారు దీనిని జదివి సులభముగా గ్రహించి పరీక్షలలోఁ గృతార్థులు కావచ్చును. ఇట్టి గ్రంథములు ప్రతికుటుంబములోను ప్రతిగృహిణియొద్దను ఉండఁదగినవి. మహాజను లును విద్యాశాఖవారును దీనినాదరించి గ్రంథకర్తకు ప్రోత్సాహ మును గలుగింతురని నమ్ముచున్నాను.

రాజమహేంద్రవరము
10 వ మెయి 1889 సం॥ } కందుకూరి వీరేశలింగము.

# ఉపోద్ఘాతము.

ప్రపంచములోని సుఖము లన్నిటిలోను దేహారోగ్యమువలనఁ గలుగు సుఖముతో సమానమయినదిమఱియొకటియేదియు లేదు. కావు న నే మనపూర్వులు "శరీరమాద్యంఖలు ధర్మసాధన" మ్మనిశరీరము నే మొదటిధర్మసాధనమునుగాఁ జెప్పియున్నారు. కోట్లకొలఁదిధన మున్నను, లక్షలకొలఁది వస్త్రాలంకారము లున్నను, వేలకొలఁది పరిచారిక లున్నను, నూఱులకొలఁది దివ్యభవనము లున్నను, ఈలోకములోనివి మఱియేవి యెన్నియున్నను, అనుభవించుట కొక్క దేహారోగ్యము లేని యెడల దేనివలనను సుఖముకలుగదు. మనము రోగమువచ్చి మంచ మెక్కినప్పుడు కానిఁ తిన్నగా తిరుగుచున్నంతవఱకును దేహారోగ్యము వలనిసౌఖ్యలాభములను దెలిసికోలేము. గృహయజమానునకో, ఆతని భార్యకో, కుటుంబములోనిమఱియెవ్వరికో వ్యాధివచ్చి వారిని నిరుప యుక్తులనుగాఁ జేసెనేని మన మప్పు డారోగ్యహీనతవలనినష్టములను పూర్ణముగాఁ దెలిసికోఁగలుగుదుము. ఆరోగ్యము చెడుటచే గృహయజ మానుఁ డిల్లువిడిచిపోయి పనిచేయలేక సంపాదించి తెచ్చి కుటుంబపోష ణముచేయుటకశక్తుఁడగుటయే కాక మందులకొఱకును వైద్యులనిమిత్త మును ఋణములపాలుకూడ కావలసివచ్చి నప్పటికంటె కుటుంబమున కెక్కువకష్టము మఱి యే ముండును? ఒకవేళ సంపాదించుగృహకర్త తిన్నగాతిరుగుచున్నను గృహపత్నియారోగ్యముతప్పినదయినపక్షమున, బిడ్డలపథ్యపానములు విచారించువారు లేకయు వంట మొదలయినగృహ కృత్యములను నిర్వహించువారు లేకయు కుటుంబములోనివా రెంత శ్రమపడవలసి యుండును? రోగులు పడెడిశ్రమయటుండఁగా వారి కుప చారములు చేయవలసినవారు నిద్రాహారములు తిన్నగా లేక మనో వ్యాధిచేత నెంత చింతపడ వలసియుండును? కాఁబట్టి యివి యన్నియు

విచారింపఁగా లోకములో దేహారోగ్యము గలవారిభాగ్యమేభాగ్యము కాని యితరులదికాదు. దేహారోగ్యములేనియాగర్భశ్రీమంతునికన్నను దేహారోగ్యము గల గర్భదరిద్రుఁడే సౌఖ్యవంతుఁడు. మన శరీరావయవము లన్నియు వేనిపనియందవి తిన్నగా ప్రవర్తిల్లుచున్నంతవఱకును మనకు సుఖముకలుగ వలెనని యీశ్వర నిర్ణయము ; ఏయేయవయవము లేయేపనులను జేయుచుండవలయునో యాయాయవయవములాయాపనులను జేయుచున్నస్థితి కారోగ్య మని పేరు. మన తెలివితేటవలననో, అశ్రద్ధవలననో, ఇతరలోపములవలననో, అవయవములలో నొక్కటిగాని యనేకములుగాని స్వకృత్యమును క్రమముగా నిర్వహింపక మనకాయాసమును గలిగించెడుస్థితికే రోగమని పేరు. కాఁబట్టి మనల నాశ్రయించెడిజ్వరాదు లయినసమస్తరోగములకును కారణమేదో యుండునుగాని నిష్కారణముగా రోగ మెప్పుడునురాదు. ఆకారణమును కనిపెట్టలేక మూఢులు రోగములు దైవతంత్రమువలనఁ గలిగినవని చెప్పుచు, కొన్నిరోగములకు పిశాచములును మఱికొన్నిరోగములకు దేవతలును కర్తలని భ్రమించుచు, పనికిమాలినపనులను జేయుచుందురు. వమనవిరేచనములుగాని స్ఫోటకముగాని వచ్చినప్పుడుతగినచికిత్సలను జేయింపఁజూడక మరిడిదేవతయనియు పొక్కులమ్మయనియు జాతరలు చేయించుచు మేఁకలను కోడిపిట్టలనుబలియిచ్చుచువృథాధనవ్యయముచేసి రోగములను మఱింత హెచ్చుచేయించుచుందురు. ఇటువంటియంటురోగములు వచ్చినప్పుడు మాత్రమేకాక యితరరోగములు వచ్చినప్పుడు సహితము మూఢు లయినసామాన్యజనులు వైద్యులయింటికి పరుగెత్తుటకు మాఱుగా సోదె చెప్పువారియిండ్లకు పరుగులెత్తుచు, ఔషధములను సంపాదించుటకుమాఱుగా విభూతులను రక్షరేకులను సంపాదింప యత్నించుచు, పథ్యపానములను విచారించుటకు మాఱుగా బలులను దిగఁదుడుపులను విచారించుచు, రోగములుపెరుగునట్లుగా వ్యర్థముగా కాలహరణము చేయుచుందురు. ఇట్టివెఱ్ఱిపనులను

జేయించుటకుమాఱుగా స్ఫోటకము రాకుండఁ జేయుట కయి ముందు
గానే టీకాలువేయించి జాగ్రత్తపడుచు, దైవికముగా స్ఫోటకమువచ్చి
నప్పుడు రోగ నివారణమునకుఁ గావలసిన సాధనములను జేయించుచు
వచ్చినపక్షమున, ఎంతమంది ముఖములమీఁద గుంటలుపడివికారరూప
మును పొందకయు కన్నులను కాళ్ళను పోగొట్టుకొనకయు తాము బలి
యిచ్చెడుజంతువులకు తోడుపాటుగా రోగభూతములకు తమబిడ్డలను
గూడ బలియియ్యకయు సుఖపడుచుందురు! గ్రహశాంతులను మ్రొక్కు
బడులను జేయనక్కఱలేక యేయారోగ్యధర్మములను దెలిసికొని యవ
లంబించుటవలన, ఎన్ని దేశములయందు జనులు కొన్ని వ్యాధులను తమ
దేశమునుండి పాఱఁదోలి యారోగ్యసంపద ననుభవింపుచున్నారుకారు!
మనము తెలివిగలవార మయి యారోగ్యధర్మములను దెలిసికొని శరీర
తత్త్వమును గనిపెట్టి ప్రవర్తించుచుందుమేని, పెక్కురోగములు మన
వద్దకు వచ్చుటకే భయపడుచు సాహసించి వచ్చిన కొన్నిరోగములును
విస్తారముగాహానిచేయ వెనుకతీయుచు నుండుటకు సందేహముండునా?
కాఁబట్టి యీశ్వరనిర్ణయము లయినయారోగ్య ధర్మములను మీఱి
వర్తించుటవలన రోగములువచ్చుటయే దైవతంత్రముగాని రోగవిషయ
మున దైవతంత్రము మఱియొకటిలేదు. రోగములువచ్చుట యీశ్వర
నిర్ణయము కాదనియు రోగములకు మనమౌఢ్యమోదుష్ప్రవర్తనమో
కారణమనియు మనమెప్పుడు తెలిసికొందుమో యప్పుడే యారోగ్య
ధర్మములను దెలిసికొని యవలంబించుటకుఁ బ్రయత్నించుచు రోగనివా
రణమునకును రోగశాంతికినిదగినసాధనములఁబూనివర్తించుచు దృఢ
గాత్రుల మయి సుఖపడుచుందుము. కాఁబట్టి మనమిప్పుడు విచారింప
వలసిన దేహారోగ్యధర్మములేవి, వేనిని మీఱుటవలన మనకు రోగ
ములువచ్చును, అనునంశము లయియున్నవి. అన్నవస్త్రములకు లోప
ములేకున్నయెడల సుఖముకలుగునని యెల్లవారును జెప్పుదురు. కాని
మనశరీరసుఖమునకీరెండునుమాత్రముచాలవు. కడుపునిండ భోజనము

చేసి మంచిబట్టలుకట్టుకొన్నను మనము కొంచెముసేపు గాలిలేనిగదిలో కూరుచున్నను మనలోపలికి గాలిపోకుండ నెవ్వరైన నిమిషకాలము మనముక్కును నోరును మూసినను మన మెంతో యాయాసపడుచు సుఖహీనుల మగుదుము——ఇందువలనగాలిమనసుఖమునకాధారమయి నట్టు స్పష్టమగుచున్నది. ఒక్కదినము మంచినీళ్ళు త్రాగకపోయినయెడల నాలుక యెండి పరితాపపడుదుముగాన, జలమును మనసుఖమున కావశ్యక మయినదే. కడుపుపట్టినంతనీరు త్రాగినను రెండుమూడు దినములాహారము తినకపోయినపక్షమున లేవసత్తువలేక బలహీనపడి మనము శ్రమపడుదుము. కాఁబట్టిభోజనముకూడమనసుఖమునకు ముఖ్యముగా కావలసియుండును. మనదేహముశుచిగానుండక మురికిగానున్నను మన గృహములు శుచిగానుండక మురికినీరు మొదలయినవానిచేత దుర్గంధ సహితములుగానున్నను గజ్జి మొదలయినవి పట్టియు తలనొప్పులు మొదలయినవి వచ్చియు మనము బాధపడుదుము.. కాఁబట్టి మనసుఖమునకు దేహపరిశుద్ధతయు, గృహపరిశుద్ధతయు కూడ నత్యావశ్యకములు. ఈ పయిని జెప్పినవే కాక మనము పనిపాటులను దేహపరిశ్రమమును చేయక పోయినను యుక్తకాలములోనిద్రపోవుచువిశ్రాంతినిపొందకపోయినను మనము సుఖము పొందఁజాలము. కాఁబట్టి శరీరసుఖమునకు దేహపరిశ్రమము విశ్రాంతియు తప్పక కావలసియుండును. ఇప్పుడు చెప్పిన దానినిబట్టి చూడఁగా దేహారోగ్యమున కావశ్యకము లయినవి——

1. వాయువు.
2. జలము.
3. భోజనము.
4. దేహ గృహ పరిశుద్ధతలు.
5. దేహపరిశ్రమ విశ్రాంతులు.

ఈయైదు విషయములనుగూర్చియు ఈగ్రంథమునందుసంగ్రహముగాఁ జెప్పఁబడును.

# దేహారోగ్యధర్మబోధిని

## మొదటి ప్రకరణము.

### వాయువు.

అన్నపానములు లేక కొన్ని దినములవఱకయినను బ్రతుకఁగలము గాని గాలి లేక కొన్ని నిమిషములయినను జీవింపలేము. తల్లిగర్భము నుండి జాఱి భూమిమీఁద పడినతోడనే మనము మొట్టమొదట చేయు పని పయిగాలిని లోపలికి పీల్చుటయు, మన మీభూమిని విడిచిపోవునప్పుడు కట్టకడపట చేయుపని లోపలిగాలిని పయికివిడుచుటయు, అయియున్నది. పుట్టినది మొదలుకొని చచ్చువఱకును మేలుకొనియున్నను నిద్ర పోవుచున్నను మనమీనడుమ నెల్లప్పుడును చేయుచుండువ్యాపారము గాలిని పీల్చుచు విడుచుచు నుండుటయే. కాఁబట్టి వాయువే మనబ్రతుకునకు ముఖ్యాధారము.

గాలి మనకన్నులకగపడక పోయినను మహావాయువు పయి కేఁబదిమయిళ్ళవఱకును భూమిచుట్టును వ్యాపించి యున్నది. మనము పరుగెత్తునపుడుగాని, విసనకఱ్ఱ మొదలయినవానితో విసరుకొనునప్పుడు గాని, ఇతరకారణములచేత కదలి వీచునపుడుగాని, స్పర్శేంద్రియము వలన మనము గాలిని తాఁకి తెలిసికోఁగలము. సముద్రములో చేపలున్నట్టుగానే మన మీ మహావాయుసముద్రములో ఉండి తిరుగుచున్నాము. గాలిలో నాలుగువిధము లయినవాయువిశేషములు చేరియున్నవి. ప్రాణవాయువు, లవణవాయువు (ఉప్పుగాలి), అంగారకామ్ల వాయువు (బొగ్గుపులుసుగాలి), జలవాయువు (లేక జలధూమము నాడిసీట్లు

యావిరి), అది నాలుగు భాగములలోను మొదటి రెండును ప్రధానము లయినవి. తక్కిన రెండు భాగములును గాలిలో మిక్కిలి తక్కువగా చేరి యున్నందున, సామాన్యముగా గాలి ప్రాణవాయువును లవణవాయువును మాత్రమే కలిగియున్నదని చెప్పవచ్చును. ఈ రెంటిలోను ప్రాణవాయువు జంతుకోటి జీవించుటకును నిప్పు నిప్పుమండుటకును ముఖ్యాధారమయినది. అది లేకపోయిన యెడల, జీవజంతువు లేవియు బ్రతుకవు; దీపములు మొదలయిన వేవియు వెలుగవు. గాలియంతయు నొక్క ప్రాణవాయువునే కలిగియున్న యెడల, అది మిక్కిలి వడి గలదగుటచేత జీవజంతువులతి వేగముగా శ్వాసించి చచ్చిపోవును. ఒకచోట నిప్పంటుకొన్నప్పుడు ప్రపంచ మంతయు వ్యాపించి యొక్కసారిగా దహించుకొని పోవును. కాబట్టి దానివడినడచి బలమును తగ్గించుటకయి జీవదయాపరుడయిన పరమేశ్వరుండు ప్రాణవాయు వొక్కభాగముతో నాలుగు భాగములు లవణవాయువును చేర్చి, జీవజంతువులసుఖజీవమునకును నిప్పుతగినట్టుగా మండుటకును అనుకూలపఱచి, దానినత్యంతోపయుక్తముగా చేసి యున్నాడు. మనము శ్వాసమూలమున గాలిని లోపలికి పీల్చునపుడు గాలియందలి ప్రాణవాయువు శ్వాసకోశములవద్దకు పోయి రక్తమును పరిశుద్ధపఱచి దేహమునందలి యపరిశుద్ధము లయినపదార్థములను దహించుటవలన దేహమునకుష్ణత్వము కలుగుటయే కాక అంగారక్షార వాయువను నొకవిషవాయువు పుట్టి శ్వాసము విడుచునప్పుడు పయికివచ్చి గాలిలో చేరుచుండును. ఇదిగాక కట్టెలు మొదలయిన వస్తువులు కాలుట వలనను దీపములు వెలుగుటవలనను జీవజంతువులును వృక్షాదులును కుళ్లుటవలనను అంగారక్షారవాయువు కల్గి గాలియందు కలియుచుండును. ప్రాణవాయువును బొగ్గును చేరి యంగారక్షారవాయు వుత్పత్తి యగును. ఇది సామాన్యవాయువుకంటె మిక్కిలి బరువు గనుక కొన్నిసమయములయందు లోతునూతులలో అడుగుతట్టున నిలిచియుండును. అద్ది

యెఱుఁగక చటుక్కన నూతులలో దిగినవారు మృతినొందుదురు. కాఁబట్టి యీవిషవాయువు నూతిలో నున్నదో లేదో తెలిసికోవలెనన్న పక్షమున ముందుగా దీపము నొకదానిని వెలిఁగించి దానికి త్రాడుకట్టి నూతిలో దింపి చూడవలెను. దీప మారిపోయినయెడల, అంగారక్షారవాయు వున్నట్టే. ప్రాణవాయువు జీవజంతువుల ప్రాణసంరక్షణమునకును నిప్పు మండుటకును సహాయముగా నున్నట్టే యీయంగారక్షారవాయువు ప్రాణమునకును నిప్పునకును హాని చేయునదియైనను, వృక్షాదులకాహారముగా నుండి వానిని జీవింపఁజేయుచుండును. కాఁబట్టి చెట్లు మొదలయినవి పగలంతయు ఈవిషవాయువును పీల్చుచుండును. శుద్ధవాయువునందీబొగ్గుపులుసుగాలి రెండువేలయైదువందల పాళ్ళలో నొకపాలుగానుండును. ఈవిషవాయువింతమాత్రము గాలిలో కలిసియుండుటవలన నేహానియు కలుగదు; ఇంతకంటెనధికముగానున్నయెడల మనముబలహీనులమయి రోగిష్ఠులమగుదుము. గాలిలో చేరియున్న నాలవపదార్థము జలవాయువు. భూమిలోనుఁడి సదా యావిరిరూపమున నీరు పయికి లేచుచు కొంత భాగము గాలిలో చేరియుండును. గాలిలో జలధూమము చేరియుండని పక్షమున మనదేహము లెండిపోయి బీటలు వాఱుటయేకాక సారము లేక చెట్లు మొదలయినవికూడ చచ్చిపోవును. ఈనాలుగును తగినభాగములుగాచేరి వాయువు శుద్ధముగా నున్నయెడల దేహ మారోగ్యదశయం దుండును.

మనము భూమిమీఁదజన్మించినది మొదలుకొనిమరణమునొందువఱకును వాయువే మనకు ప్రాణాధారమయినను, మనసుఖజీవనమునకు నిర్మలవాయు వుండవలెనుగాని యేదో యొకవిధమయినవాయువు పనికిరాదు. కల్మషవాయువును మన మాఘ్రాణించుచు వచ్చినయెడల అది మనకుప్రాణాధారమగుటకుమాఱుగా ప్రాణనాశనమునకే కారణమగును. బహుకారణములచేత మనచుట్టును వ్యాపించి యుండుగాలి

యెప్పుడును విషమిళిత మగుచుండును. లోకములో జీవకోటికి హాని చేసెడువిషపదార్థములు గణనాతీతములుగా నున్నను, వానిలో నెల్లను బహుజనులకు రోగాదిబాధలు తెచ్చిపెట్టి విశేషప్రాణహానిని కలిగించుచుండునది విషవాయువేయని చెప్పవచ్చును. 1756 వ సంవత్సరమునందుసురాజదౌలా యనుమహమ్మదీయప్రభువు నూటనలువదియారుగుర నింగ్లీషువాండ్రను కలకత్తానగరమునందలి పదునెనిమిదియడుగులు చదరము గలయిఱుకుచెఱసాలయందుత్రోయించినప్పుడు, వారికందఱికిని విదాహముపుట్టించి చెమ్మట వెల్లువలుకట్టదేహములకుతాపము గొలిపి భయంకరమయిననానావిధవేదనలను కలుగఁజేసి యొక్కరాత్రికాలములో నూటయిరువదిముగ్గురప్రాణములు గొన్నది విషసహిత మయినదుర్వాయువు గాక మఱియేదియున్నది? చావునకుఁదప్పి ప్రాణమాత్రావశిష్టు లయి జీవచ్ఛవములవలె మిగిలి యున్నయిరువదిముగ్గు రయినను తెల్లవాఱి తలుపు తెఱచునప్పటికి తమంత బయటికి వచ్చుటకుకూడ నశక్తులయి తమయవయవములు తమయధీనము గాక కొట్టుకొనుచుండిరి. ఈప్రకారముగా ప్రతిస్థలమునందును దుర్వాయువు వలన నొక్కరాత్రిలో నిట్టిసంఘమరణములు కలుగకపోయినను, బహుస్థలములయందు శుద్ధవాయువు లేకపోవుటవలన లక్షలకొలఁదిజనులు రోగిష్ఠు లయిబలహీనపడి బ్రతికియున్నంతకాలమునుగూడ నెందునకుంబనికిరానివారయి పోవుచున్నారు. కాఁబట్టి మనము వాయువునందు ప్రాణాపాయకరము లయిన విషపదార్థములు చేరువిధమును కనిపెట్టి వానికి తగినప్రతిక్రియలు చేయుచు సాధ్యమయినంతవఱకు వాని క్రౌర్యమును తగ్గించుచు రావలయును.

జీవజంతువులు శ్వాసమువిడుచుటవలనను, కట్టెలుమొదలయినవి కాలుటవలనను, అంగారక్షారవాయు వనుపేరు గలయొకవిషపదార్థముత్పన్నమగు నని యీవఱకే చెప్పియున్నాము. మన మూపిరివిడుచు

నప్పుడొక్క యంగారకామ్లవాయువునుమాత్రమే కాక కొంతమర్జలమును కొన్ని యితరదుష్పదార్థములను గూడ బైట విడుచుచుందుము. దానికి నిదర్శనముగా మనము నాలుగయిదుసారు లొకయద్దముమీఁద నూపిరి విడిచి యాభాగమును వ్రేలితో స్పృశించినపక్షమున కొంచెము తడిగాను జిగురుగాను కనఁబడును. ఈపదార్థము లన్నియు మన మాఘ్రాణించెడు ప్రాణవాయువు లోపలికి పోయి యక్కడి రక్తము మొదలయినవానిని శుద్ధపఱుచుటవలన పయికివచ్చెడుపనికిమాలినపదార్థము లేగనుక మురికి కుండ్లనుగాని యిండ్లనుగాని శుద్ధపఱుచుటవలన పయికి వచ్చెడు చెడునీరు మొదలయినవానివలెనే యివియు ప్రాణమునకపాయకరముగా నున్నవి. దేహసంబంధము చెడి శ్వాసమూలమున పయికివచ్చెడి యీజంతుపదార్థములను శరీరములోన నట్టేయుండనిచ్చినయెడల, అవి యక్కడకుళ్ళిమురిగి కంపెత్తి శరీరమున కురుపులు మొదలైనవి బయలుదేఱి పెక్కువ్యాధులు కలుగుటకు కారణమగును. ఈప్రకారముగా ప్రతిస్థలమునందును ప్రతిక్షణమునందును మనుష్యుల శ్వాసములవలననే కాక పశువులు పక్షులు మొదలయిన సమస్త జీవజంతువుల శ్వాసములవలనను పయిని చెప్పినమూఁడు విధములయినదుష్టపదార్థములును బయలుదేఱి గాలిని పాడుచేయుచుండును. ఇదిగాక మండెడు ప్రతిపదార్థమును ప్రాణవాయువుయొక్క సాహాయ్యముచేత రూపు చెడి, అంగారకామ్లవాయువుగా మాఱుచుండును. ఈవిధముగా ప్రాణవాయువు తఱిగిపోయి యంగారకామ్లవాయువు హెచ్చినపక్షమున, నిప్పు మండక పోవుటయే కాక జీవజంతువులుసహిత మఱ నిమిష మయినను బ్రతుకఁజాలవు. అందుచేతనే మన మొకదీపమును పెట్టెలో పెట్టి తాళము వేసినయెడల చమురెంతయున్నను ప్రాణవాయువు నశించుటవలన కొంచెము సేపటికెల్లను దీప మాఱిపోవును; ఆపెట్టెలోనే యొకపిట్టను బెట్టి మూఁత వేసినయెడల శ్వాసమువలన ప్రాణవాయువు నశించి యంగారకామ్లవాయువు వ్యాపించును గనుక కొంచెము సేపటి

కెల్లను పక్షి గిజగిజ కొట్టుకొని ప్రాణములు విడుచును. ఇంతకుముందు చెప్పిన చెఱసాలయొక్క పయిగోడకు రెండుచిన్నకిటికీలున్నను రాత్రియెనిమిదిగంటలు మొదలుకొని సూర్యోదయ మగులోపల నొక్కసారిగా నూటయిరువదిముగ్గురు ప్రాణములుపోఁగొట్టుకొనుటయు, అందఱొక్క గదలోచేరి శ్వాసమువిడుచుటచేతఁ గలిగినయంగారక్షారవాయువువలననే విశేషజనసమ్మర్దము కలిగి విశేషదీపములు వెలుగుచుండు సభలు మొదలైనస్థలములయందున్నవారి కాయాసమును తలనొప్పియుకలుగుచుండుటయు వారాస్థలమునువిడిచిబయటికివచ్చి కొంచెముసేపు మంచి గాలిలోనుండఁగానే హాయిగానుండుటయు పలువురకనుభవమునలనఁ దెలిసియుండును. ఈయంగారక్షారవాయువునకు కంపేమియు లేదు.

ఒక్కచెట్టు గాని జీవజంతువు గాని చచ్చినతరువాత కొంచెము కాలములోనే కుళ్ళిపోవుట కారంభించి వస్తునాశము చెందునపుడు దానిలోనుండి దుర్గంధసహితమైన విషవాయువులు పుట్టి పయికిలేచి మనమాఘ్రాణించుమహావాయువులోఁ జేరి పలువిధములైననష్టములు కలుగఁ జేయును. శీతదేశములకంటె నుష్ణదేశములో వస్తువు లతిశీఘ్రముగా కుళ్ళి మురిగిపోయి కంపెత్తనారంభించును. దొడ్లలోతీసి వేసిన కలుపుమొక్కలును, గడ్డియు, చెట్లకొమ్మలును, అరటిమట్టలు మొదలయినవియు, కూరలు తరిగినతరువాత వానిపెచ్చులు మొదలయినవియు, ఇండ్లసమీపమున పాఱవేసి యుపేక్ష చేసినయెడల, అవి యక్కడనే కుళ్ళ నారంభించి నానావిధదుర్గంధములు బయలుదేఱి వాయువునందు వ్యాపించి యిండ్లయందు కాపుర మున్నవారికి వ్యాధులు కలిగించును. ఈకుళ్ళెడువస్తువులు తేమగలచోటులయందు వేసినయెడల దానివలన మఱింతచెఱుపు కలుగును. సాధారణముగా మనకువచ్చెడుజ్వరములు చెట్లు చేమలు కుళ్ళుటచేత సంభవించినవిషవాయువులవలననే కలుగుచున్నవని వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. మనుష్యులు స్నానము

చేయుటకును పాత్రములు మొదలయినవి శుద్ధిచేయుటకును వాడిన కలుషజలము నిలుచుమురికికుండ్లయందును మురికికాలువలయందును చెడువాసనతోఁ గూడినవాయువులు పుట్టిశరీరారోగ్యమునకు మిక్కిలి చెఱుపుకలుగ జేయును. దుర్వాసనలతో నిండియున్నయీవిషవాయువు నకు గంధకజలవాయువని పేరు. తూముకాలువలు, మురికికుండ్లు, స్నానముచేయుస్థలములు, అంట్లుతోముచోట్లు, మొదలయినవియెప్పటికప్పుడు శుద్ధపఱుపక అశ్రద్ధచేసి పురుగులు పడి కంపెత్తునట్లుగావిడిచినపక్షమున, ఆసమీపమున వాసముచేయువారికి తలనొప్పి, వాంతి, ఆఁకలితప్పుట మొదలయిన తెగుళ్ళు కలుగును. ఈవిషవాయువు భూమిలోనుండి దిగికాని మఱియొకవిధముగాఁగాని పోయి మనము పానము చేసెడుజలములో ప్రవేశించినయెడల, ఆనీరు త్రాగువారికి నెత్తురు గడ్డలు, రక్తవిరేచనములు మొదలయినవి కలుగును.

ఇవిగాక తేమగానున్నస్థలములనుండియు, వర్షపునీరు మొదలగునవి నిలుకడగానుండి పాకుడుపట్టియుడకగానుండు చోట్లనుండియు, పశువులను కట్టినచోట్లనుండియు, వెంటనే శుద్ధి చేయని మఱుఁగు పెరళ్ళనుండియు, నిలువ చేసెడు పేడకుప్పలు మొదలయిన యెరువువస్తువులనుండియు, పందిపెంటలు మొదలయినవి యున్నప్రదేశములనుండియు, తోళ్ళుబాగుచేయుస్థలములనుండియు, రంగులు వేయుశాలలనుండియు, మాంసవిక్రయము చేయుకొట్లనుండియు, ఆముదమువండిపిప్పిపాఱవేయుచోట్లనుండియు, బహువిధములయినదుర్వాసనలునుదుర్వాయువులును కలిగి దేహసుఖమునకు భంగము కలిగించును. కాఁబట్టియివిసాధ్యమైనంతవఱకిండ్లసమీపమున లేకుండునట్లును, అనివార్యముగా నున్నవానిని తఱచుగా శుభ్రము చేయునట్లును, చేయవలయును. ఇవిగాక పయినిచెప్పిన కుళ్ళెడుచెట్లుచేమలును, శవములను పూడ్చెడు కాల్చెడు స్మశానవాటికలును, గృహసమీపములయందుండి విషవాయువులధిక

మయినయెడల వమనవిరేచనరోగములు మొద లయినయంటురోగ ములు పుట్టి మంచివోట్లఁగూడ వ్యాపించి విస్తారముగా ప్రాణనాశనము కలుగఁజేయును. మనుష్యులమూత్రాదులనుండినవాచార వాయువనెడి యొకవిషవాయువు పుట్టి కొంతచెఱుపు కలుగఁజేయును. కాఁబట్టి మనము మూత్రవిసర్జనమునకు దొడ్లలో దూరముగా పోవలయును.

ఇంతవఱకు చెప్పినదానిచేత సాధారణముగా జీవజంతువులు శ్వాసము విడుచుటవలనను, నిప్పు మండుటవలనను, కాయగసురులును జంతుపదార్థములునుకుళ్ళుటవలనను, మురికికాల్వలు మొదలయినవాని వలనను, మురుగుడుమఱుఁగుదొడ్లు మొదలయిన వానివలనను, ఇవక భూములవలనను, చెడిపోయి వాయువు రోగహేతు వగుచుండునని తేలుచున్నది.

ఇప్పుడు వివరించినపలుకారణములచేత లోకమునందలిశుద్ధ వాయు వంతయు ప్రతిదినమును ప్రతినిమిషమును చెడిపోవుచుండి విష పూరిత మగుచున్నయెడల లోకములోనివా రందఱును నీవఱ కేనశించి ప్రపంచము నిర్మానుష్యమైయుండవలసియుండును. కాని జీవదయాపరుఁ డయినపరమేశ్వరుఁడుకలుషవాయువునుశుద్ధపఱుచుటకై తగినసాధన ములనుకూడ కల్పించియుండుటచేత ప్రజానాశనము కలుగక జనులు వివేకు లయి యారోగ్యధర్మముల నెఱిఁగి నడుచుకొన్నయెడల ప్రజా వృద్ధియే కలుగుచుండును.

గాలివ్యాపనస్వభావము కలదిగనుక శ్వాసమువిడుచుట మొద లయినపనులవలన పుట్టువిషపదార్థములు మహావాయువులోఁ గలిసి విశేషజలములో కొంచెముపాలుపోసినయెడల నంతటనువ్యాపించి కనఁ బడకపోయినట్లు సర్వత్రవ్యాపించి చెదరిపోయి వానివలననంతగా హాని కలుగకుండును. ఇదిగాకఝుంఝూమారుతముబలముగావీచివిషవాయు వులను నిమిషములో దూరప్రదేశములకుఁ గొనిపోయి వాయువును

శుద్ధపఱుచు చుండును. ఓరుగాలివలన మనకు కొన్ని సమయముల యందుకొన్ని నష్టములుకలిగినను మొత్తముమీఁద గాలికొట్టుచుండుట వలననే విశేషలాభము కలుగును. ఇప్పుడు చెప్పిన రెండుపద్ధతులును గాక వాయువును శుద్ధపఱిచెడి ముఖ్యమయిన ప్రకృతిసాధనము మఱి యొకటి యున్నది. లోకములోని సమస్తజీవజంతువులును సదా శ్వాసము విడుచుచుండుటవలన పుట్టుచుండెడి యపరిమిత మయినయంగార క్షారవాయువు పగలు సూర్యకిరణములసాహాయ్యముచేత వృక్షములు లతలు మొక్కలు గడ్డి మొదలయినవి తమలోనికి పీల్చుకొని ప్రాణ వాయువును బయట విడిచి మహావాయువును శుద్ధపఱిచి ప్రాణికోటి యాఘ్రాణించుటకు యోగ్యముగా చేయుచుండును. అంగారక్షార వాయువు వృక్షాదుల కాహారముగా నుపయోగపడును. వృక్షాదుల యందువలెనే మనదేహములయందును అంగారపదార్థమే విశేషముగా నుండును; అదియేమనశరీరములకు పోషకమును పుష్టికరమునుగా నున్నది. అందుచేతనేశ్వాసకార్యమునందుమనము ప్రాణవాయువును లోపలికి పీల్చుకొనిమాంసాదులలోనుండి చెడిపోయినయంగారక్షారవాయువును పయికి పంపివేయుచున్నాము. పరీక్షతో చూడనప్పుడు మనము లోపలికి పీల్చుగాలికిని పయికి విడుచుగాలికిని వ్యత్యాస మేమియు కనఁబడక పోయినను, ఒకసీసాలో మూడవవంతు తేటయైనసున్నపునీళ్ళను పోసి, అందులో మంచిగాలి నొకపర్యాయమును శ్వాసమువిడిచినగాలి నొక పర్యాయమును విడిచి చూచినయెడల భేదము తక్షణ మగపడును. బాహ్యవాయువు సీసాలో ప్రవేశించునప్పుడు సున్నపునీళ్ళు మాఱక యథాప్రకారముగానేయుండును. ఆసీసాలోనే శ్వాసమువిడిచినగాలిని ప్రవేశపెట్టినయెడలసున్నపునీళ్ళు చిక్కపడిపాలవలెనగును. ప్రత్యేకము గానున్నప్పుడుప్రాణవాయువును, అంగారపదార్థమును, మనకుపోషకము లేయయినను, అవియొండొంటితోచేరియంగారక్షారవాయువుగానూట్టి

నప్పుడుమాత్రము ప్రయోజనకరముగాక నష్టకరముగానగును. ఉప్పును షంచదారయు ప్రత్యేకముగా నున్నప్పు డెంతయుపయుక్తములయినను రెంటిని కలిపినప్పుడు నిష్ప్రయోజనముగునట్లే యివియుచేరియననుకూలమగును. కలిసిపోయినయుప్పును పంచదారను ప్రత్యేకింపఁ గలిగిన యెడల అవి రెండును మరల ప్రయోజనకరములగునట్లే యంగారపదార్థమును ప్రాణవాయువును విడఁదీయఁ గలిగినయెడల, అవి రెండును మనకు పరమప్రయోజనకరము లగును. ఈమహాకార్యమునే వృక్షాదులు సర్వదా నిర్వహించుచు ప్రాణవాయువును మనకు శ్వాసయోగ్యముగాను, అంగారపదార్థమును ఫలశాకాదిరూపముననాహారయోగ్యముగాను, చేయుచున్నవి. రాత్రులు వృక్షాదులుకూడ అంగారక్షారవాయువునుకొంతవిడుచునుగనుక వృక్షసమీపములయందు రాత్రివేళనిద్రింపఁగూడదు. అయినను దొడ్లయందును గ్రామసమీపములయందును వృక్షాదులనుబొత్తిగానఱికివేయక పెరుగునట్లుచేయవలెను. ఈమూడు సాధనములునుగాక వానకురియునప్పుడువిషవాయువు లనేకములువర్షజలముతో కలిసి భూమియందు ప్రవేశించి యడఁగిపోవుచున్నవి.

మనుష్యుఁడు వాయువులో లేనియపరిశుద్ధతలను తాను తెచ్చిపెట్టనియెడల వాయువును శుద్ధపఱిచి యారోగ్యప్రదముగాఁ జేయుట కీప్రకృతిసాధనములే చాలియుండును. అయినను మనుష్యుఁడుతనయవివేకమువలననుకొన్నియపాయకరములయినవృత్తులవలనను వాయువును కలుషపఱిచి విషయుక్తముగాఁ జేయునుగనుక దానిని శుద్ధపఱుచుటకయి మనమును కొన్నిసాధనముల నాలోచింప వలయును. శుద్ధవాయువు లోపల ధారాళముగా ప్రవేశించుటకయి యిండ్లకుముందును వెనుకను కొంతస్థలము విడిచియుంచవలెను. పరుండుగదులొక్కొక్క మనుష్యునకు పదియడుగులపొడుగునుపదియడుగుల వెడల్పునుపదియడుగుల యెత్తును గలస్థల ముండులాగునవి శాలముగాకట్టించియిరుప్రక్క

లను పయిని గవాక్షముల నుంచవలెను. సాధారణముగా విషవాయువులు తేలికగనుక చెడుగాలికిటికీలగుండఁ వలికిపోయిమంచిగాలిలోపల ప్రవేశించు చుండును. రోగుల దేహముచుండియు శ్వాసములనుండియు కలుషపదార్థములు మఱింతయధికముగాబయులవెడలుచుండునుగనుక వారికిశుద్ధవాయువు వచ్చెడివిశాలమయినగదు లుండవలెను. సాధారణముగామన దేశమున పురిటిండ్లలో శిశువులుమరణము నొందుచుండుట లోపల నిర్మలవాయువు కావలసినంత లేకపోవుటచేతనే మనముగ్రాసి కొను నప్పుడును పనిచేయునప్పుడునువంగియుండక తిన్నగానుండిశ్వాస కోశములలోనికి గాలి యథేచ్ఛముగా ప్రవేశించునట్లు చేయవలెను. గాలిని శుద్ధపరచుటకయి గోడల కప్పుడప్పుడు సున్నపుపూత వేయుచుండవలెను. క్రొత్తబొగ్గులయందు విషవాయులను నశింపఁజేయు శక్తియున్నదిగనుక, బొగ్గు పొడుముచేసి గుడ్డసంచులలో పోసికాని బొగ్గుతునకలను సందులుగలవెదురుపేళ్ళబుట్టలలో వేసికాని పయిని వ్రేలాడ కట్టవలయును. గంధకపుపొగకూడ బహువిధము లయినవిష వాయులను నివర్తింపఁ జేయునుగనుక, మసూచికము మొదలయినవి వచ్చి వ్యాధిగ్రస్తులున్నచోట్ల మనుష్యులు లేనప్పుడు తలుపులుమూసి నిప్పులమీఁద గంధకపుపొడుము వేసి పొగఁ బెట్టి తలుపులు తెఱచి మంచిగాలి లోపల ప్రవేశించినతరువాతగదులనువాడుకొనుచుండవలయును. మన మీవిషయములలో శ్రద్ధవహించి యిందుచెప్పినప్రకారముగానడుచుకొనుచు వచ్చినపక్షమునమనకిప్పుడుసాధారణముగాసంభవించు జలుబులునుపడిసెములునుతలనొప్పులునుజ్వరములును లేక దేహబలము గలవారమయి సుఖజీవనము చేయఁగలిగి యుందుము.

# రెండవ ప్రకరణము.

## జలము.

మనవారు రోగము వచ్చినప్పుడు తమకు నీళ్ళుపడలేదనిసాధారణముగా చెప్పుచున్నను, జలమే బహుతరముగా రోగములకుకారణమని తెలిసికొని దానిని శుద్ధపఱుచుటకును దానియందు కాలుష్యములు చేరకుండునదుపాయములనుజూచుటకునుమాత్ర మంతగాప్రయత్నింపరు. కాఁబట్టి జలమునారోగ్యప్రదముగాఁ జేయుటనుగూర్చియు దాని నుపయోగింపవలసినక్రమమునుగూర్చియు కొంత యిచ్చట వివరింపుచున్నాము. వాయువుతరువాత మనబ్రతుకున కుదకమే ముఖ్యాధారము. నీరులేక యేజీవజంతువుగాని చెట్టుకాని బ్రతుకదు. మన మాహారములేక యిరువదిదినములకంటె నధికకాలముజీవింపవచ్చును గాని నీరులేక వారముదినములయినను బ్రతుకలేము. ఇది మనజీవనమునకు ప్రధానాధార మగుటచేతనే జీవదయాపరుఁ డయినపరమేశ్వరుఁడు వాయువుతరువాత జలమునే విశేషముగా సృజించియున్నాఁడు. నదులలోఁగాని, చెఱువులలోఁగాని, బావులలోఁగాని,ఎక్కడనేజలమున్నను, అదియంతయు వర్షమూలముననే వచ్చును. ఒక్కసంవత్సరము వర్షములు కొంతయాలస్యమయినపక్షముననదులుసన్నగించును; చెఱువు లెండిపోవును; నూతులఱుగంటును.వర్షమునకుముఖ్యముగాసముద్రమాధారము. సూర్యకిరణముల వేఁడిమిచేత సముద్రజల మావిరిరూపమున పయికిలేచి మేఘములై దేశమంతటనువ్యాపించియెల్లచోటులను వాన కురియును. వర్షకాలములోనదులు వెల్లువపాఱి గట్టుపొరలిప్రవహించును; తటాకములునిండి జలసమృద్ధము లయియుండును; బావులు నిండి నీరుపయికివచ్చును.వర్షజలమీప్రకారముకొంతభాగము నదులు

మొదలైనవాని కుపయోగపడఁగా మిగిలినభాగము భూమిలో నింకి యూడలుగా నేర్పడి నూతులకును నదులకును సదాజలమునిచ్చుచుం డును. ఆవిరిరూపమున సముద్రజలము నిత్యమును పైకిఁబోవుచుండును గనుకనే దానిలో నెన్నినదులువచ్చి పడినను సముద్ర మెప్పుడునుమేర మీఁటి పయికి రాదు. ఈప్రకారముగా నదు లన్నియుఁబోయి సముద్ర మున చేరుచుండఁగా సముద్రజల మావిరిరూపమునపయి కెగసివానగా కురియుచుండును. ఈవానసీరు సాధారణముగా శుద్ధమయినది. అది పైనుండి పడెడునప్పు డంగారకామ్లవాయువును ప్రాణవాయువునుదాని లోచేరును గనుక వర్షజలము మిక్కిలి మధురముగా నుండును. అయి నను వానసీళ్లిండ్లకప్పులమీఁదనుండిపడునప్పుడు పైనున్నదుమ్ముతోను కాకిరెట్టలు మొదలైనయపరిశుద్ధపదార్థములతోను కలియును గనుక అట్టికలుషోదక మెంతమాత్రమును పానయోగ్యము కాదు. నీరుభూమి మీఁద పడినతరువాత నేలమీఁది యపరిశుద్ధపదార్థములతోఁ జేరును గనుక ఆజలము నదులలోనో నూతులలోనో చేరి శుద్ధ మగువఱకును త్రాగుట కర్హ మయినది కాదు. మనముత్రాగెడునీరుసామాన్యముగా నదులనుండియు, చెఱువులనుండియు, నూతులనుండియు, లభించును:—

1. నదులు—ఏళ్ళలో నానావిధము లయినవఱదలును వాగు లును వచ్చి చేరునుగనుక నీరు బహువిధములైన భూములమీఁదుగా ప్రవహించునుగనుకను నదీజలము కలుష మగుచుండును. అయినను నదులలోనినీరు గాలివలనను పాఱుదలవలనను నిర్మల మగుచుండును గనుక సాధారణముగా పెద్దనదులలోనియుదక మారోగ్యకరముగానే యుండును. మనుష్యుఁడు స్వదోషమువలన దానిని చెఱుపక పోయిన పక్షమున, దానివలన నేచెఱుపును కలుగదు. కానియీదేశప్రజనులు సాధారణముగా జలముయొక్క యుపయోగమును దానిని శుద్ధముగా నుంచవలసిన యావశ్యకమును తెలియనివారుగనుక త్రాగుటకు మంచి

నీరు తెచ్చుకొను రేవులలోనే మురికిబట్ట లుదుకుట, కొయ్యలు వెదుళ్లు జనుపనార మొదలైనవాని నూర వేయుట, పశువులను కడుగుట, స్నానములు చేసి దేహములు తోముకొనుట, అంట్లు తోముట, ఇండ్లలోని మురికినీళ్లు చెత్త మొదలైనవానిని తెచ్చి వేయుట, దంతధావనములు చేసి నీటిలో పుక్కిలించి యుమియుట, నువ్వులుధాన్యము మొదలైనవి కడుగుట, మొదలైన యపాయకరము లగుపనులను చేసి నీరు పాడుచేసి రోగమునకు కారణ మగునట్లు చేయుచుందురు. స్నానములు చేయునప్పుడు కొందఱు పురుషులును జలస్పర్శ చేసికొనుటకుసమీపమునమఱుఁగు స్థలము లుండవుగనుక సాధారణముగా స్త్రీలును జలములోనేమూత్ర విసర్జనముకూడ చేయుచుందురు. అంతేకాక బహుజనులు నదులగట్లనే మఱుఁగు పెరళ్ళుఁగా నుపయోగించుకొని యచ్చట దేహబాధతీర్చుకొనుచుండుటవలన గాలిచేతను ముఖ్యముగా వర్షముచేతను దుష్టమయిన యాయశుద్ధపదార్థములు నీటిలోపడి నీటిని వ్యాధిజనకముగాఁ జేయుచుండును. కాఁబట్టి వివేకులయినవారుసాధ్యమైనంతవఱకుపామరజనుల కారోగ్యధర్మములను బోధించి బట్ట లుతుకుట మొదలైనపనులు నీళ్ళు ముంచుకొను రేవులలో జరపకుండునట్లు చేయవలయును. నీళ్లు తెచ్చుకొను రేవున కెగువను చాకి రేవులను తీయించి ప్రవాహమునకు దిగువను పెట్టించవలయును. ఆప్రకారముగా నేలంట్లుతోముట మొదలయినపనుల నెల్లను నీరు తెచ్చుకొను రేవులకుదూరముగావాలునకుదిగువనుచేయింపవలయును. స్ఫోటకము మొదలయిన రోగములచేత చచ్చినవారిశవములను ఏటిలో విడిచిపెట్టకుండ మానుపుటయే కాక దహనముచేసిన శవములబూడిదను కూడ నీటిలోపోయకుండునట్లు వారింపవలయును. ఈ విషయములయందు శ్రద్ధవహించినపక్షమున వర్షకాలమునం దేళ్లు పొంగినప్పుడుతప్ప నదులలోనినీరు శుద్ధముగానే యుండును. వర్షములు కురిసియు వఱదలు వచ్చియు పెంటలు మొదలయినవిచేరికలఁగఁబాటికలు

పముగా నున్నప్పుడు, దానిని చక్కఁగా శుద్ధపఱుపక త్రాగినపక్షమున రక్తవిరేచనములు మొదలయినవ్యాధులు వచ్చును. ఒక్కవఱదలవలననే కాక నది ప్రవహించెడిభూస్థితినిపట్టికూడ జలముయొక్క గుణము వ్యత్యాసముగా నుండును. ఒకానొకప్పుడు నదియొక్క యొకయొడ్డున నున్నజలము మంచిదిగానున్నను దాని కెదుటప్రక్కనున్నజలమే చెడ్డదిగా నుండవచ్చును. కొండయేళ్ళనుండి వచ్చెడునీరు పయికి తేటగాఁ గనఁబడుచున్నను దానిలో చెట్లు చేమలు మొదలయినవి కుళ్ళినవిషపదార్థములుండి తాపజ్వరములు మొదలయిన వ్యాధులనుకలిగించును. కాఁబట్టి సాధ్యమయినంతవఱకు జలమును కాచి తేర్చి పుచ్చుకొనుట మంచిది. అట్లు కాచుటవలన జలముతోఁ జేరియున్న కొన్నివిషవాయువులు పయి కెగిరిపోవుటయే కాక మిగిలినపదార్థము లడుగునకు పోవును. కాచి తేర్చిననీరు రుచి తక్కువయయినను దానిని కొంచెము సేపు మంచిగాలి వచ్చెడిచోట మూఁతతీసి పెట్టెడుపక్షమున దాని కెప్పటి రుచి వచ్చును. కలఁగిపోయిననీళ్ళలో కొంచెము పటికపొడుముగాని యిండుపుగింజగంధముగాని వేసి కలిపినయెడల కొంచెముసేపటి కెల్లను నీరు శుద్ధమయినకలుషపదార్థమడుగుననిలుచును. ఆప్రకారముగా జలమొక్కదినముండనిచ్చి పయి తేటనీటి నొక్కపాత్రములో వంచి త్రాగుట యారోగ్య ప్రదము. గొప్పప్రవాహము గల పెద్దనదులలోని నీరు పయిని చెప్పిన బట్టలుతుకుట మొదలయిన చెడుపనులవలనవిస్తారముగా చెడకపోయినను ప్రవాహమంతగా లేక యించుమించుగా నీరు నిలుకడగానుండు చిన్నయేళ్ళలోనినీళ్ళు [illegible]గానే చెడిపోవును. గనుక వానివిషయమయి యెక్కువజాగ్రత్తకలిగియుండవలెను. నదులలోనీటికిసమీపమున నొడ్డున నిసుకలో నూతులుగాని చెలమలుగాని త్రవ్వినయెడల వానియందూరెడుజలము నిర్మలముగాను సుఖప్రదముగాను ఉండును.

2 చెఱువులు—నదులలోచేసెడి యంట్లుతోముట బట్టలుతు

కుట మొదలయినజలమును కలుషపఱుచుపనుల నన్నిటిని మనవారు చెఱువులలో సహితము చేయుదురు. అంతేకాక చెఱువులలోపందులు గేదెలు మొదలయినవి పడి పొరలాడుటకూడ తఱుచుగా సంభవించు చుండును. చెఱువులయందు ప్రవాహములేక నీరు నిలుకడగానుండును గనుక నదీజలమునకంటె నిట్టిచెఱువునీరు మఱింత యపాయకరముగా నుండును. కొన్నిచోట్ల ఆకులు మొదలయినవి పడి కుళ్ళి నీరు పాకుడు కూడ పట్టియుండును; మఱి కొన్నిచోట్ల మురికికాల్వలనీరు చెఱువుల లోనికి పాఱుటకూడఁ గలదు. ఇట్లెన్నివిధములనీరుపాడగుచున్నను మన వారాజలమునేతీసికొనిపోయి పానముచేయుదురు. చెఱువుగట్లమీఁద నుండుచెట్లవలనను నీటిలోనుండు చేఁపలవలననునీటికిహానిలేదుసరిక దా వానివలన నీటికి మేలుకూడకలుగును. అయినను చెట్లయాకులునుకొమ్మ లును నీటిలోపడి నీరు మురిగి కంపెత్తినయెడల జలము త్రాగినవారికి మాత్రమేకాక చుట్టుపట్లగాలికూడపాడగునుగనుక దాని నాఘ్రాణించు చేరువగ్రామములవారికిసహితము వ్యాధులువచ్చును. కాఁబట్టి నీటిలో పడినయాకులు మొదలయినవాని నెప్పటివప్పుడుతీసి వేయవలెను. వేసవి కాలములో నీళ్ళింకి యడుగంటియున్న చెఱువులలోనినీరు మిక్కిలియనా రోగ్యకరము. కాఁబట్టి యట్టిచెఱువులలోనినీరు త్రాగక లోఁతుగా నుండు పెద్దచెఱువులను త్రవ్వించుకొని యందలిజలమునే పానముచేయ వలెను. అప్పుడుసహితము త్రాగుటకు నీళ్ళు తెచ్చుకొను చెఱువులలోనే బట్ట లుతుకుట మొదలయినపనులు చేయక స్నానములనిమిత్తమును బట్ట లుతుకుటనిమిత్తమును పశువులకు నీరుపెట్టునిమిత్తమును వేఱుగా చెఱువులను వాడుకొనవలయును. పానముచేయుటకువలె స్నానము చేయుట కంతమంచినీ రక్కఱలేదనియు, బట్టలు మొదలైనవేనీటిలో నయిన నుతుకవచ్చుననియు, పశువులకు బురదనీ రయినను సరిపోవు ననియు, పలువురు తలఁతురుగాని వారియభిప్రాయము సరియయినది

కాదు. మురికినీటిలో స్నానముచేయుటవలనను చిడుము మొదలయిన చర్మరోగములుపుట్టును ; మురికినీటిలోనుతికినబట్టలు కట్టుకొనుటవలనను గజ్జిమొదలయినవికలుగును ; మురికినీరుపశువులకుపెట్టుటవలనను వాని దేహములు ముడుతలుపడి శుష్కించి బుద్ధపుబుదులతో నిండి యుండును. కాబట్టి మనుష్యులకుగాని పశువులకుగాని నిర్మలజలమే యవశ్యముగా కావలెను. సర్వప్రయత్నములను చేసి చెఱువులనుసదా పరిశుద్ధముగా నుంచుటయేకాక మురికినీరు మొదలయినవి భూమిలో నుండి కాని పయినుండి కాని చెఱువులలో ప్రవేశింపకుండులాగునను, వర్షముచేత పెంటలు మొదలయినవి నీటిలోనికి కొట్టుకొని రాకుండులాగునను జాగ్రత్త పెట్టవలయును. నదులయందువలెనే చెఱువులలోను నూతులుగాని చెలమలు కాని తీసినయెడల శుద్ధమయినజలమూరి త్రాగుటకు మిక్కిలి యనుకూలముగా నుండును.

3. నూతులు—బావులలో మిక్కిలిలోతుగా నూరెడు జలము త్రాగుటకు మంచిది. భూమికి సమీపముగా నూతులలో పడెడునీరు పయి కలుషపదార్థములతో చేరియుండును గనుక సాధారణముగా మంచిదికాదు. నల్లరాతిబండలనుండి కాని యిసుక తెరరాళ్ళనుండిగాని యూరెడుజలము సాధారణముగా శ్రేష్ఠమయినది. మనవారునూతుల ననుకూలమయినస్థలములయందు త్రవ్వింపక యింటికిపైవుననే నుయ్యి యుండవలయునన్న మూఢవిశ్వాసముచేతసులభముగానీరూరనిచోట్లను కూడ త్రవ్వుదురు. భూమి సమముగా నున్నయెడల వర్షము కురిసినప్పుడు నీటివాలేప్రక్కనుండి నేలపల్లముగానుండునోయక్కడత్రవ్విన యెడల నీరు సమీపమునపడును; చెట్టుచేమలును గడ్డియు విశేషముగా మొలిచియుండుతావులను జలము సమీపముననే యుండును; గడ్డిమొలవనియిసుకభూమియందు పురుగులేప్రక్క చేరి యుండునో యక్కడ నీరు చేరువను పడును. మనవారుబావులనుశుద్ధముగానుంచి కాపాడరు,

కొందఱు నూతులకుచుట్టును గట్టి యుంచరు గనుక నీళ్ళుతోడునప్పుడు పయిన పడెడునీరు మురికికాల్వవలె నూతిలోనికిప్రవహించుచు నేయుండును. సాధారణముగా నూతులకు గట్టున్ననుచుట్టును వాళ్లుపఱపించి గచ్చు చేయకపోవుటవలన నీరు నిలిచి రొచ్చుపడి, ఆకలుషజలమే నూతులలోనికి దిగుచుండును గనుక దానిని త్రాగువారిసుఖమునకు తఱుచుగా భంగము కలుగుచుండును. కొందఱు నూతులయొద్దననే స్నానముచేసి దేహములు తోముకొనుటవలనను బట్టలుతుకుటవలనను నీళ్లు నూతిలోనికిచింది జలము కలుష మగును. నూతియంచుమీఁదనే బట్ట లుప్పొంగించుప్రబుద్ధులును పలువు రుందురు. నూతిచుట్టును రొచ్చుపడి దుర్గంధసహిత మయి యున్న యెడల, ఆదుర్జలము బీటలగుండలోపలికిదిగి త్రాగెడువారి కపాయము కలుగఁజేయుటయే కాక నీళ్ళు తోడుకొనుటకయి వచ్చి దానిని త్రొక్కువారికసహితము కాళ్ళలో దురదపొక్కులు నారికురుపులు మొదలయినవి లేచి బాధపెట్టును. కాఁబట్టి నూతిచుట్టును నీళ్ళుపడి రొచ్చుపడకుండునట్లుగా రెండుమూఁడుగజముల వెడల్పున నేటవాలుగా నూతితట్టున నెత్తుగాను అంతకంతకు పల్లముగాను ఉండులాగున రాళ్ళుగాని యిటుకలుగానిపఱపించి పయినిగచ్చు చేయించి పళ్ళెముకట్టించి పడిననీ రంతయు నొకకాలువదారిని దూరముగాపోవునట్లు చేయవలయును. నూతిసమీపమున పందులు గేదెలు మొదలయినవిపడి పొరలునట్టిగానిమురిగిపురుగులుపడికంపెత్తునట్టిగాని గుంటలు లేకుండ చేయవలెను. నూతియొద్దన నెవ్వరిని స్నానములు చేయనియ్యఁగూడదు; బట్ట లుతుకనియ్యరాదు. గాలిచేత నెగరఁగొట్టుకొనివచ్చి పడినట్టికాని పయినుండి కొమ్మలనుండి పడినట్టికానియాకులు మొదలయినవానిని, తోడునప్పుడు తెగిపడినచేదలు మొదలయినవానిని తఱుచుగా తీసివేయించవలెను, నూతియడుగునఁ జేరినమంటిని కుండముక్కలు మొదలయినవానిని కూడ నప్పు డప్పుడు తీసివేయించుచు

రావలెను. ఈప్రకారముగా చేయనియెడల నూతులలోని కలుషజలమును త్రాగినవారికి కపాయకరము లయిన యనేకవ్యాధులువచ్చును గనుక బహుజాగ్రత్తగా నుండవలయును.

పానయోగ్య మయినమంచినీరు వాసనగాని రుచిగాని వర్ణముకాని లేక యద్దమువలెస్వచ్ఛమయినదిగానుండవలెను. సున్నము మొదలయిన ఖనిజము లధికముగానుండునప్పుడు నీరుబరువుగా నుండును; ఆ ఖనిజములు లేనప్పుడుగాని తక్కువగానుండునప్పుడుగాని నీరు తేలికగా నుండును. బరువునీటిచే పప్పునుకూరగాయలునుసులభముగా నుడకవు గనుక పాకముచేయుటకును త్రాగుటకునుకూడ తేలికనీరేమంచిది. అదుగున నేవిధమయినకసటును లేకుండ ప్రతిదినమును తోమిమంచినీళ్ళు త్రాగుపాత్రములను శుచిగా నుంచవలయును. మనవారనేకులు మూతులు సన్నగానుండి లోపల చేయిపెట్టి తోముటకనుకూలముగా నుండని చెంబులను మంచినీరుత్రాగుటకుపయోగింతురు. అట్టివానిలో మయిల తిన్నగాపోక చెరుపు కలుగును కనుక సాధ్యమయినంతవఱకు మూతి వెడల్పుగా నుండుపాత్రములనే జలపానార్థముపయోగించుకొనవలెను. సున్నపురాళ్ళలో నూరినజలమునుగాని యపరిశుద్ధ మయినజలమునుగాని త్రాగినయెడలకడుపులో నెమిడికలుపలుపడుట, ఆఁకలితప్పుట జిగటవిరేచనము లగుట మొదలయినవ్యాధులుకలుగుటయేకాక కొన్ని సమయములయందు దుష్టజలపానమువలన వాంతిభేది మొదలయిన ప్రజానాశనకరములయినరోగములుకూడ కలుగును. కాఁబట్టి యెల్లవారును శుద్ధజలమును సంపాదించుటయందును దొరకినజలమును శుద్ధపఱుచుటయందును మిక్కిలి శ్రద్ధ వహించ వలెను. మొట్టమొదట నిర్మల మయినజలమునేసంపాదించి దానినికలఁకపాఱకుండునట్లు తెచ్చి శుద్ధపాత్రములయందుపోసి పైనిమూతవేసి శుచిగానుంచి పదిలముగా కాపాడుకొనుటయే యుత్తమమైన పద్ధతి. అంతస్స్వచ్ఛోదకములభింపని

యెడల పయిని చెప్పినట్లు నీళ్ళు కాచి కాని యిందుపు గంధము పటికారపు పొడుము మామిడి టెంకలోని పప్పు గంధము మొదలైన యొగరు పదార్థములను నీళ్ళలో కలిపి కాని జలమును శుద్ధము చేసికొనవలెను. వడియబోఁత యంత్రము దొరకిన యెడల దానితో నీటిని శుద్ధపఱుచుకొనుట శ్రేష్ఠమయిన పని. మంచి క్రొత్త బొగ్గులను తెచ్చి కలుష జలములో నుంచినట్టయిన నీటిలోని మయిల నవి లాగుకొని జలమును శుద్ధపఱుచును. మసిబొగ్గులు ముఱికి నీటిని మఱింత మలినముగా చేయునని కొందఱనుకోవచ్చును గాని బొగ్గు నీటిని మలినపఱుచుటకు మాఱుగా దానియందలి సూక్ష్ములైన మలిన పదార్థముల నన్నిటిని తన ప్రక్క కడుగు తట్టున కాకర్షించి పయిని నిర్మలమయిన తేటనీరు నిలుచునట్లు చేయును. సాధారణముగా గృహములయందు జలమును శుద్ధపఱుచుటకై సులభోపాయ మొకటి గలదు. మూఁడు పెద్దకుండలను తెప్పించి వానిని మూఁడు వెదురు కాళ్ళను గాని కఱ్ఱ కాళ్ళను గాని కలచట్రమునం దొకదానిమీఁద నొకటి కొంచెమెడముగా నిలిపి, వానిలో పయి రెండు కుండలకును అడుగు తట్టున రెండు మూఁడు చిన్న రంధ్రములు చేసి పయి కుండలో సగము వఱకు క్రొత్త బొగ్గులను శుద్ధమైన యేటియిసుకను పోసి, నడిమి కుండలో సగమువఱకును మంచి యిసుకను మాత్రమే పోసి, దొరకినంత మంచి జలమును పయి కుండలో మెల్లగా పోసిన పక్షమున జలము పై రెండు కుండల నుండియు క్రమముగా బొట్టుబొట్టుగా చిల్లులు లేని యడుగు కుండలో పడి త్రాగుటకర్హమయి యారోగ్యప్రదమై నిర్మల మయినదిగా నుండును. ఇంతకంటెను సులభముగా రెండు కుండలను మాత్రమే పెట్టి పై కుండకు రెండు మూఁడు చిన్న చిల్లులు పొడిచి దానిలో మొదట నొక వరుస మంచి యిసుకను దానిపై వరుసను మంచి బొగ్గులను వేసి నీరు మెల్లఁగా చేర్చిన యెడల అడుగు కుండలోనికి మంచినీరు దిగును. అడుగు కుండలో పై నుండి దుమ్ము మొదలైనవి పడకుండునట్లుగా రంధ్రములు గల మూకుడు పయిని యూత

వేసి గాలికొట్టనిస్థలమునందీకుండల నుంచవలెను. కుండలోని బొగ్గులను, ఇసుకను, కొన్నిదినముల కొకపర్యాయము మార్చి కుండలను శుద్ధపటిచి మరల క్రొత్తవానిని వేయుచుండవలయును. ప్రయాణములలో ఇట్లుచేయుట తటస్థింపదుగనుక, ఒకపాత్రముయొక్క మూతికి బొగ్గుతునుకలుగల దట్టమయినగుడ్డసంచిని కట్టికట్టి తెచ్చిననీరునుదానిగుండ పాత్రలో పోసినయెడల జలముశుద్ధమగును; అట్లుకాక యిండుపుగింజ మొదలయినవానివలన నీరు శుద్ధపటిచి యానీటినికాచి తేటినపైనీటినుపయోగించుచున్నను ఉపయోగించుకోవచ్చును. ఇట్లుచేయుటవలన నీటిపల్లడి చేయక సుఖము కలుగును. మంచినీళ్లు దొరకనిచోట్ల దొరకినసముద్రజలమును గాని మఱి యేనీటిని గాని కుండలో పోసి దానికి దిట్టముగా సందులేకుండమూత వేసి యామూతమధ్యనుండి వంకరగానుండుగొట్టము నొకదానినిమఱియొకపాత్రలోనికి పెట్టి మొదటికుండనుపొయిమీఁదనుంచి క్రిందమంటపెట్టినయెడల, ఆవిరిరూపముగా గొట్టముగుండ రెండవపాత్రలోనికి దిగిననీరు శుద్ధమై పైగాలిసోకినతరువాత తియ్యపడి త్రాగుటకు యోగ్యమైనదిగా నుండును. మంచినీరుత్రాగుటవలనదాహశాంతికలిగి, ఆరోగ్యప్రదమగును. సారాయము మొదలైనవిత్రాగినకొలఁదిని దాహమధికమయిశరీరతత్వముచెడి వివిధవ్యాధులు సంభవించును గనుక, ఎల్లవారును సురాపానాదులను మాని నిర్మలోదకమునేసదాపానముచేయుటకుప్రయత్నింపవలయును. రోగులగదులలో నుంచినమంచినీటిమీఁద నెప్పుడును మూఁతవేసి యుంచవలెను. అట్లు మూఁతవేయనియెడల రోగుల దేహమునుండ సదా విషపదార్థము లధికముగా పయికి లేచుచుండును గనుక, గాలిమూలమున ఆవిషపదార్థములుజలములో ప్రవేశించి త్రాగెడువారికి హానిచేయును.



# మూడవ ప్రకరణము

—)o(—

## భోజనము.

వాయు జలముల తరువాత భోజనమే మన బ్రతుకునకు ముఖ్యాధారము. ఆహారము లేక సాధారణముగా మన మిరువదిదినములకంటె నధిక కాలముజీవింపము. ఒక్కదినమన్నము లేకపోయినపక్షమున కాళ్ళు లాగ లేవ సత్తువలేక బలహీనపడుదుము. రాతిబొమ్మలవలెఁగాక పని చేయుటవలన మనశరీరముల కలుగుదలవిశేషముగా నుండును. మనము నడుచుటవలనను, మాటాడుటవలనను, తక్కినపనులు చేయుటవలనను దేహములో కొంతభాగము తఱుగుచుండును. కొన్నిపనులు మనము తెలిసిచేయుచున్నను, శ్వాసమువిడుచుట గుండెలుకొట్టుకొనుట మొదలయిన మఱికొన్నివ్యాపారములు మన ప్రయత్న మక్కఱ లేకయే రాత్రులు మనము నిద్రపోవునపుడు సహితము మన దేహములో సదా విరామములేక జరుగుచు కొంతభాగమును వ్యర్థము చేయుచుండును. శ్వాసమువలనను, చెమటవలనను, మలమూత్రాదులవలనను శరీరములోనిపనికిమాలినపదార్థములు పయికి వచ్చుచుండుటయందఱకును తెలియును. ప్రాతఃకాలముననిద్రలేవఁగానే తూచుకొని పనిచేసివచ్చి మరల భోజనము చేయుటకుముందుతూచుకొన్నపక్షమున మనుష్యుఁడు బరువు తక్కువగానుండును. ఈప్రకారముగా ప్రతినిమిషమును మనము పని చేత క్షీణించుచున్నపక్షమునకొంచెముకాలములో మనము శుష్కించి నశింపవచ్చును. కాఁబట్టి పనివలన శరీరములో పోయినభాగములు పూర్తిపడుటకయి యేదోసాధనము కావలసియుండును. మనము భుజించెడియాహారమే యీపనిని చేసి మన దేహములు సన్నగిల్లి శిథిలము కాకుండ కాపాడుచుండును. ప్రతిదినమును మన దేహమునుండి చెడిన

పదార్థ మెంత పయికిపోవునో యంతయాహారము లోపలికి పోవుచుండ వలెను. మనము తినెడియన్నము, కూరలు, పప్పు, పండ్లు మొదలయినవిమనశరీరమునకంటెవిజాతీయములుగా కనఁబడుచుండునుగనుక, అవి యెట్లు మాంసములోను, చర్మములోను, ఎముకలలోనునరములలోను ప్రవేశించి వాని కెట్లు పుష్టికలుగఁ జేయునాయని సంశయము కలుగవచ్చును. అవి రక్తరూపమును పొంది శరీరమంతటనువ్యాపించి తలలోను, కాళ్ళలోను, చేతులలోను, గోళ్ళలోను, వ్రేళ్ళలోను, తక్కిన సమస్తావయవములలోను జొచ్చి వాని కెల్లను బలము కలుగఁజేయును. ఈ నెత్తురు తలవెంట్రుకల కంటెను సన్నముగానుండురక్తవాహికలనఁబడు సూక్ష్మము లయినగొట్టములగుండ సూదిమొన మోపినంతమేరనైన నెడము లేకుండ శరీరమునం దంతటను వ్యాపించును గనుకమన దేహముమీఁద నెక్కడ కొంచెము సూదితో పొడిచినను, ఏదోయొక రక్తవాహిక పగిలి పయికినెత్తురు రాకమానదు. ఇటువంటిసూక్ష్మనాళములగుండ నిరాతంకముగా పోవునట్లు చేయుటకయి మనముభుజించెడి యాహారమును పలుకులు లేకుండ మెత్తగా కాటుకవలెనూరిపలచగా నీటిలోకలిపి చిక్కనిపాలవలెఁ జేయవలెననుట యెల్లవారికిని తెలిసిన సంగతియేకదా ? ఉప్పు పంచదార మొదలయినవి కొన్నిసులభముగా నీటిలోకరఁగికలిసిపోయినను, మెతుకులు, రొట్టె, కూరలు మొదలయినవి విశేషప్రయత్నముచేసి పనిచేసినంగాని నీటిలో కలిసిపోవు. కాఁబట్టి మనము ముద్ద నోటిలో వేసికొన్నతోడనేచక్కఁగానమలియుమ్మితో కలిసినతరువాత మఱి మ్రింగవలయును. అట్లు చేయక తొందరపడి మ్రింగినపక్షమున తిన్నయన్నము జీర్ణమయి బలమియ్యక పోవుటయే కాక, అజీర్ణాదిరోగములుకూడ పుట్టును. మనయుమ్మి నమలినపదార్థములను పలచపఱునట్లు చేయుటయేకాక వానిలో కొన్నిటిని కరఁగించెడిగుణమునుకూడ కలిగియున్నది. కాఁబట్టి మన మేదితిన్నను సావ

కాశముగా నమలి యుమ్మితో చక్కఁగా కలిసినతరువాత నేమ్రింగవల యును. ఇట్లుమ్రింగినపదార్థములు గొంతుక్రోవికి వెనుకతట్టున నుండు గొట్టముగుండపోయి జీర్ణకోశములో పడును. ఈజీర్ణకోశము వీని నన్ని టిని కలియఁగలిపి, అక్కడ నూరుచుండెడుజఠరాగ్నిరసముతో చేర్పఁ గా, ఆజీర్ణరసబలముచేత తిన్నవస్తువులు పక్వమై గంజివంటి యన్న రసముగా మారును. ఆయన్నరసములో కొంతభాగము జీర్ణకోశము యొక్కప్రక్కల నుండుసూక్ష్మరంధ్రములగుండ దేహములోప్రవేశించి కొంతభాగము వస్తువులను జీర్ణముచేయు పైత్యరసముతోచేరి ప్రేగుల గుండ పోవుచు ప్రేగులపొడుగున నుండుసూక్ష్మరంధ్రములదారిని శరీర ములో ప్రవేశించుచు రాఁగా, మిగిలిన పనికిమాలినజీర్ణముకానిపదా ర్థము మలరూపమున పయికి వెడలిపోవును. ఈప్రకారముగా దేహ ములో ప్రవేశించినయన్నరసము కండరములు, నరములు, ఎముకలు, చర్మము, గోళ్లు, వెంట్రుకలు మొదలయినవానితోచేరి వాని కన్నిటికిని పుష్టిని కలుగఁజేయును.

ఆహారము దేహమునందు ప్రవేశించి పుష్టిని కలుగఁజేయుక్రమ మును కొంత గ్రహించితిమి గనుక, ఇఁక నెటువంటియాహారము బల ప్రదమో యెటువంటిదానిచేత శరీరము పెరుగునో యెన్నిసారులెప్పుడు భుజింపవలయునో కొంత తెలిసికోవలసి యున్నది. మనము పుట్టఁగానే మనము పెరుగుటకయిభగవంతుఁడుపాలాహారముగాకల్పించియున్నాఁ డు.మనదేహపోషణమునకయి కావలసినపదార్థము లన్నియు పాలయం దిమిడియున్నవి. పాలలో మాంససారమును, క్రొవ్వును, పిష్టసారము (పిండి) తోఁగూడినపంచదారయు, ఉప్పును,జలమును కలిసియున్నవి. కాఁబట్టి మానవదేహముల కీయయిదుపదార్థములు నావశ్యకములు.

౧. మాంససారము.—కండ పట్టఁ దగినమాంససారమువలన శరీరబలమును దృఢత్వమును మనోబలమును కలుగును. ఈమాంస

సారము పాలలోఁ జేసెడుజున్నునందును మాంసాహారములయందును, విస్తారముగా నుండును. ఈపదార్థము కొంచెముగానో గొప్పగానో బియ్యము మొదలయినవానియందును కాయధాన్యముల యందును దుంపలయందును కూరగాయలయందును కూడనుండును. ఇది యెంత మనముభుజించి జీర్ణముచేసికొందుమో మన దేహబుద్ధిబలములంతయధికముగా నుండును.

2. క్రొవ్వు—మెదడును నరములను వృద్ధిచేయఁదగిన యీ క్రొవ్వు మన దేహమునందు వెట్టను పుట్టించి కాపాడును. పాలలోని వెన్నయును నేయియు క్రొవ్వుపదార్థములే. ఈపదార్థము నువ్వులు మొదలయిన ధాన్యాదులయందుకూడ నుండును.

3. పిష్టసారమును పంచదారయు—ఇవి దేహములో నేభాగమును పోషింపక పోయినను వెట్టనుపుట్టించి శరీరసుఖమునురక్షించును. పాలుతియ్యగా నుండుటచేతనే యందులో పంచదార కలిసియున్నదని యందఱును తెలిసికోవచ్చును. ఇది యొక్క చెఱకుగడలలో మాత్రమే కాక చిరగడము మొదలయిన దుంపలయందును ద్రాక్షపండ్లు మొదలయిన ఫలములయందునుగోధుమలు మొదలయిన ధాన్యములయందును కూడనుండును. వీనిలో పిండియున్నదని వేఱెచెప్పనక్కఱయుండదు.

4. ఉప్పు—మనకు పయికి తెలియకపోయినను పాలలో కొంచెముప్పు చేరియుండును. ఉప్పు, సున్నము, మొదలయిన ఖనిజపదార్థములనేకములు పండ్లయందును మనము ప్రత్యేకముగా భక్షించులవణమునందును చేరి యుండును. ఇవి యెముకలుమొదలయినవానిని వృద్ధి పొందించుట కుపయోగించును. ఉప్పుతగినంత తిననియెడల పేగులలో పురుగులును పెక్కువ్యాధులును పుట్టును.

5 జలము—మనముతినెడు ప్రతివస్తువునందును పయినిచెప్పిన నాలుగువిధములయిన పదార్థములను వేఱుచేయఁగా మిగిలెడిదంతయు

జలమే. ఇది పాలు పెరుగు మొదలయినవానిలో విస్తారముగానుండును. మనము భుజించెడి యాహారములో నొక్క-పాలు పయిని చెప్పినగట్టి పదార్థమును రెండుపాళ్ళు జలపదార్థమును చేరియుండవలెను.

పయిని చెప్పిన పదార్థములయందు దేహపుష్టికే దేది యెంతెంత కావలయునో అంతంత పాలలో చేరియున్నదిగనుక, పాలు సుఖముగా జీర్ణమయి శిశువులకు మంచిశరీరపోషణమును జేయును. ఆవుపాలు మనుష్యులపాలకంటె చిక్క-నివిగాను పంచదారతక్కు-వకలవిగాను ఉండును గనుక, శిశువులకుపోసెడునప్పుడు వానిలో నీళ్ళుకలిపి కొంచెముపంచదార వేసిమరిపోయవలెను. పులిసిపోయినపాలనుగాని, మిక్కి-లి వేడిగానున్నపాలనుగాని, బొత్తిగాచల్లారిపోయినపాలనుగాని, శుచిగానుండని పాత్రములలోపోసిన పాలనుగాని, పిల్లలకుఁబోసినయెడల దేహారోగ్యమునకు భంగముకలుగఁజేయును. కాఁబట్టి తల్లులుశిశువులకుపోతపాలు పోయుటలో మిక్కి-లిజాగరూకతగలిగి యుండవలెను. శిశువులకన్నము మొదలయిన గట్టియాహారమును విస్తారముగా పెట్టఁగూడదు. అట్లు పెట్టెడుపక్షమున తిన్నయన్నము బలమునుకలుగఁజేయక యజీర్ణమగుటయేకాక బలప్రదమయిన పాలయందరుచినికలిగించును. శిశువులజీర్ణించుకోలేనిపదార్థములను పెట్టుటచేతనే, సాధారణముగా నెగుపులును బాల (పాప) రోగములునువచ్చును; ఎగుపులు మొదలయిన వొక వేళ రాకపోయినను శిశువులు వ్యాధిగ్రస్తులును బలహీనులునయియావజ్జీవమును రోగిష్ఠులుకావచ్చును. శిశువులు పెరిగి పెద్దవారయ్యెడుకొలఁదిని గట్టియాహార మధికముగా కావలసియుండును. అయినను పిన్నలుగాని పెద్దలుగాని బలముకావలసినయెడల పాలు తగినన్ని పుచ్చుకొనుచుండవలెను. పాలను చక్క-ఁగాకాఁచి, అందులో కొంచెము చక్కె-ర వేసి, ఆవిరిలేచుచున్నప్పుడే యావేఁడిపాలను సందులేకుండ సీసానిండపోసి, వెంటనే బిగువైన మూఁతనువేసి లోపలికి గాలిపోకుండ దానిచుట్టును

మైనమంటించి యుంచినపక్షమున, పాలు చెడిపోకుండ నెలలకొలఁది
నిలువయుండును. కొన్ని దేశములలో పాలెండఁబెట్టి గడ్డచేసి, కావలసి
నప్పుడు నీరుకలిపి వాడుకొందురు. పాలలో కొంచెము పంచదార వేసి
సన్ననిసెగమీఁద విడువక కాచఁగా కాచఁగా తుదకాపాలు గడ్డకట్టును.
తరువాతదాని నెండలోఁబెట్టి చక్కఁగా నెండనిచ్చి గాలిప్రవేశింపనిపాత్ర
ములో నిలువచేసి కావలసినప్పుడెల్ల పాలగడ్డలో కొంచెముతీసి దానిని
వేఁడినీటిలో వేసినయెడల, మంచిపాలయి త్రాగుటకర్హముగానుండును.
ఈదేశములో వివిధములయిన ధాన్యములు మనుష్యులకు ముఖ్యాహార
ముగానున్నవి. వానిలో నెల్లను బియ్యముతక్కువసారముగలదిగానున్న
ది. గోధుమలు, జొన్నలు, చోళ్ళు మొదలయినవి బియ్యమునకంటె
నెక్కువసారముగలవి. వరియన్నము తినువారికంటె జొన్నయన్నమును
గాని చోడియంబలినిగాని తినువారెక్కువబలమునుగలిగియుందురు. వరి
యన్నములో పప్పుకలిపి భుజించినయెడల నెక్కువబలము చేయును.
అన్నముతోఁగూడ మాంసాహారమును జేర్చినయెడల మిక్కిలిబలప్రద
మైనను, మాంసభక్షణముచేయనివారు పాలువిస్తారముగా త్రాగినయెడల
దానితోసమానమైన బలమునే చేయును. ఒకరికిబలముచేసెడియాహార
మొకరికి బలముచేయదు. బలముకలిగి యారోగ్యదశలోనున్నవారుతిని
యఱిగించుకొనిపుష్టినిపొందదగినపదార్థములను బలహీనులును బాలు
రును వృద్ధులును జీర్ణింపఁజేసికోలేకపోవుదురు. ఇంట తినికూరుచుండెడి
భోగులకన్న దేహపరిశ్రమముగలిగి పాటుపడెడివారి కధికసారముగల
యాహార మెక్కువగా కావలెను. కాఁబట్టి యెల్లవారునుతమ దేహస్థితి
కనుకూలమయినయాహారమునే పుచ్చుకొనుచుండవలెను.

వరియన్నము గంటలో జీర్ణమగును; పప్పు మొదలయిన యుడికిన
కాయధాన్యములుమూడుగంటలలో జీర్ణమగును. గోధుమరొట్టె, నేయి
జున్ను మొదలయినవి మూడుగంటలముప్పదినిమిషములలో జీర్ణమగును,

కండపుష్టి చేసెడు దుంపకూరలును కొన్ని కాయకూరలునునాలుగుగంట లక్కుగాని జీర్ణములు కావు. కాచినపాలు రెండుగంటలలో జీర్ణమగును. మాంసాహారము తగినంత లేని యాహారమును తినువారు దేహబలమును చురుకుదనమును తక్కువగలవారుగా నుందురు; వారిలో కొందఱికి బుద్ధిసూక్ష్మతయున్నను, వారు చాలసేపు కఠినమయిన దేహపరిశ్రమ మునకోర్చియుండజాలరు. కాబట్టిమాంసాదులుతిననివారు సెనగలు, కందులు, పెసలు, మినుములు, చిక్కుళ్లు మొదలయిన కాయధాన్యము లను పాలను సాధ్యమయినంత యధికముగా భుజించుచుండవలెను. మాంససారము పాలలోకన్నను కాయధాన్యములలో నధికముగానుం డును. అయినను కాయధాన్యములఱుగుట కష్టముగనుక, బలహీను లును బాలురును తగినంత శరీరపరిశ్రమము లేనివారునువానినితక్కువగా తినవలెను. కాయధాన్యములు నూతినీళ్ళయందు వేగముగా నుడుకవు కాబట్టి పప్పేటినీళ్ళతో వండుటమంచిది. వరియన్నమును, మధురా హారములును, నేయియు, విస్తారముగా తినువారు స్థూలకాయులయి కఠినమయినపనిని చేయుటకు శక్తులుగాక, ముసలితనమురాకమునుపే తల తెల్లపడినవారగుదురు. బాలురు మధురాహారములనతివిస్తారముగా తినెడుపక్షమున, పండ్లనుజబ్బుచేయుటయే కాక యితరపదార్థములనుతినుట కు వారికాకలి లేకపోవును. వరియన్నమునకంటె జొన్నలు మొదలయిన వానియన్నమెంతో యధికసారవంతమయినను, దానినివిడిచిపనిపాటులు లేనిధనికులనుజూచి పాటుపడెడుబీదవాండ్రుకూడనాగరికు లనిపించుకో వలెనని వారివలెవరియన్నమునుసంపాదించుకొని తినుటకయి ప్రయాస పడుట మిక్కిలి యవివేకకార్యము. చక్కగాపండిన పండ్లుమంచియా హారము. పచ్చికాయలను మిగులమాగినపండ్లనుమాత్రముతినకూడదు. వండినయన్నమును చాలసేపట్టెయుంచినయెడల పాడయి తినుట కన ర్హమగును. ఏలకులు, లవంగములు, మిరియములు, జాజికాయ,

జాపత్రి, మొదలయినసంబారములుమితముగాతిన్నయెడల, ఆహారమును జీర్ణింపఁజేయునుగాని, మితముతప్పితినినయెడలజీర్ణాశయమును పాడు చేయును. వట్టిపోకచెక్కలతో తమలపాకులనునములుట నిష్ప్రయోజన మగుటయేగాక దానివలన పండ్లకు జబ్బుకూడ కలుగును.

మనకాకలి తీఱినట్లుకనఁబడఁగానే యన్నముతినుటమాని వేయ వలెను. పదార్థములయందలియభిరుచినిబట్టి యెక్కువగాతిన్నపక్షమున పలువిధములైనచెఱుపులుగలుగును. మితిమీఱితినుటవలనతిన్నయాహా రములో కొంతజీర్ణముగాక ప్రేగులలో నిలిచియుండి రోగముపుట్టిం చుటయేగాక క్రమక్రమముగా జీర్ణసాధనములను దుర్బలపఱిచిమిక్కిలి చెఱుపుచేయును. కొన్నిపదార్థము లాలస్యముగాను కొన్ని పదార్థ ములు వేగముగానుజీర్ణమయినను మొత్తముమీఁదనాహారముజీర్ణమగు టకు మూఁడుగంటలసేపుపట్టును. జీర్ణరసము చక్కఁగా నూరుటకు జీర్ణాశయమున కటుతరువాత రెండుగంటలైనను విశ్రాంతి కావలెను. కాఁబట్టి యొకసారి భోజనమైనతరువాత అయిదుగంటలలోపల మరల భోజనముచేయకుండుటమంచిది. మధ్యమధ్య గడియగడియకునేదైనను తినుచుండెడుపక్షమున, ఉడుకుచున్నబియ్యములో నడుమనడుమబియ్య ము పోయుచువచ్చినచోనన్నము పాడగునట్లే తిన్నపదార్థములుతిన్నగా నఱుగక వ్యాధులు కలుగును. సాధారణముగా ప్రాతఃకాలమున తొమ్మిదిగంటలకనఁగా జాముప్రొద్దెక్కి భోజనముచేసి, మరల మధ్యా హ్నము రెండుగంటలకును, సాయంకాల మేడుగంటలకును, భోజనము చేయుట యారోగ్యప్రదము. దేహపరిశ్రమము విశేషముగా లేనివారు ప్రాతఃకాలమున పదిగంటల కొకసారియు, రాత్రి యేడుగంటల కొక సారియు, రెండుభోజనములు చేసినఁజాలును. పనిపాటులుచేయువారు ప్రాతఃకాలమున పనికిపోకముందు కొంచెమన్నముతినిపోయి, మధ్యా హ్నమువచ్చితృప్తిగాభోజనముచేయవలెనుఎల్లవారికిని రాత్రిభోజనము

లఘువుగానుండవలెను. రాత్రి మిక్కిలి ప్రొద్దుపోయి భోజనముచేయగూడదు. భోజనమునకునునిద్రకునుమధ్య రెండుమూడుగంటలసేపవకాశముండవలెను గనుక, రాత్రియేడుగంటలకు భోజనముచేసిపదిగంటలకు పరుండుట మిక్కిలి సుఖకరము. దినమునకొకసారియే వెక్కసముగా భుజించుటకంటె మితముగా రెండుసారులు భోజనముచేయుట మంచిది. కాయగూరలు మొదలయిన భోజనపదార్థములను ప్రతిదినమునొక్కటిగానేచేయక మార్చి పలువిధములుగా పాకముచేసి తినుట యారోగ్యప్రదము. నోటిలోని యన్నమంతయు చక్కఁగా ఉమ్మినీటితో కలియునట్లుగా బాగుగ నమలిమఱిమ్రింగవలెను. తిన్నగానమలనియెడలనజీర్ణవ్యాధికలుగును. భోజనమయినతరువాత కఠినమైన దేహపరిశ్రమము చేయఁగూడదు; మెల్లఁగా కొంచెముసేపు నడుచుట మంచిది. ఇత్తడి రాగి మొదలయిన చిలుముపట్టెడు పాత్రలలోని భోజనపదార్థములు మాత్రమేకాక సీసపుపాత్రములలోని పదార్థములును విషమెక్కి రోగహేతువులగును. తగరపు గిన్నెలలో పోసెడు మజ్జిగ మొదలయినవి చెఱుపుచేయవుగనుక. తిండివస్తువులుపెట్టెడు రాగియిత్తడిపాత్రములకు తగరపుపూత పూయించి మఱివాడుకోవలెను. బాలురకు కారపువస్తువులు విస్తారముగా పెట్టఁగూడదు. బాలురయొక్కయు వృద్ధులయొక్కయు భోజనము సులభముగా జీర్ణముకాదగినదిగా నుండవలెను. పదునాఱు సంవత్సరములు వచ్చువఱకును బాలురు మూడుసారులకు తక్కువగా భోజనముచేయగూడదు. ఇతరసమయములయందుకంటె వాంతిభేది వ్యాపించియున్నకాలములో భోజనవిషయమయి యెక్కువశ్రద్ధను వహింపవలెను. ఆకాలమునందు పచ్చికాయలను, ఆకుకూరలను, సులభముగా జీర్ణముకానిసమస్తవిధములయిన పదార్థములను, తినకుండవలెను.

# నాలవ ప్రకరణము.

-:0:-

## దేహ గేహ పరిశుద్ధతలు

దేహారోగ్యమునకు భోజనపదార్థములు మొదలయినవి మాత్రమే కాక మనయాత్మకు వాసస్థానమయిన దేహమును, దేహములకు వాసస్థానములయిన గృహములను, కూడ సదా శుచిగానుంచుట యత్యంతావశ్యకము. దేహమును శుచిగానుంచుటకయి నిత్యస్నానమును, దంతధావనాదులును, ధౌతవస్త్రధారణమును, అనివార్య ధర్మములయి యున్నవి. వీనిలో నేనిని మనము నిరాదరము చేసినను దాని ఫలము వెంటనే కానఁబడి శరీరారోగ్యమున కనేకవిధములయిన చెఱుపులు కలుగును భూతదర్పణమును బెట్టి పరీక్షించి చూచినయెడల మనచర్మమునిండను సంఖ్యాతీతములయిన రంధ్రములున్నట్లు కానవచ్చును. సూక్ష్మాతి సూక్ష్మములైనయీరంధ్రముల దారిని మనశరీరములోనుండి చుర్జలమును పనికిమాలిన యితరకలుష పదార్థములును సదా పయికి వెడలుచుండును. ఆకలుషపదార్థములతోఁ గూడినజలమునే మనము స్వేదమనియు చెమ్మటయనియు వాడుదుము. అది యెప్పటిదప్పుడు పయికిరానియెడల, శరీరమున నిలిచి యనేకవిధములైన యపాయములను గలుగఁజేయును. దాని వలన నొకానొకప్పుడు ప్రాణాపాయము సహితము సంభవించును. కాఁబట్టి యీమార్గములు కప్పుపడిపోకుండునట్లును ధారాళముగా స్వేదజలము పయికి వెడలిపోవుట కేప్రతిబంధమును కలుగకుండునట్లును

చేయుచుండవలెను. చెమ్మట పయికి వెడలుటకయి యేర్పఱిచిన రంధ్రములు మనయఱచేతిచర్మములో చదరపుటంగుళమునకు మూడువేల యేనూఱు-చొప్పుననుండును. మన దేహముయొక్క యితర భాగములయందీరంధ్రము లింతవిస్తారముగా లేకపోయినను, మొత్తముమీఁదచదరపుటంగుళమునకు రెండువేల యెనిమిదివందలచొప్పున నుండునని శారీర శాస్త్రజ్ఞులు చప్పియున్నారు. ఈరంధ్రములు చర్మము మొక్క యడుగు భాగమునందుండెడు స్వేదగ్రంథులలోనుండివచ్చినస్వేదనాళములయొక్క ముఖద్వారములయి యున్నవి. ఇవిగాక చర్మములో స్వేదోత్పాదక గ్రంథులనఁబడెడు యొకవిధమయిన క్రొవ్వును గలిగించెడి మాంసగోళములుండి వానినుండి చమురుసదాపయికి వెడలిచర్మమును తడుపుచుండును. ఈచమురుమూలముననే మనచర్మము గాలిచేతను వేఁడిచేతను బీటలువాఱ యుండి పగులక మృదువుగానుండును.మనము ప్రతిదినమును స్నానము చేసి దేహమునుతోముకొనిశుచిగానుంచనిపక్షమున లోపలినుండి చెమ్మటతో వచ్చి దేహమునంటుకొనెడి సూక్ష్మములయిన కలుషపదార్థములవలనను పయినుండి గాలి కెగిరివచ్చిపడెడు సూక్ష్మములయిన భూరేణువులవలనను పయినిజెప్పిన రెండువిధములయినరంధ్రములనుపూడిపోయి దేహారోగ్యమునకుభంగముకలుగును.రంధ్రములు మనగృహములోగలముఱికినీటిని వెలుపలికిఁగొనిపోవుతూములవంటివి. వీధులలోని ముఱికికాలువలలోనికి గృహమునుండి ముఱికినీటిని గొనిపోయెడు తూములను వీధివైపున మూసివేసినపక్షమున, లోపలకలుషజలము నిలువయుండి కంపెత్తియెంతనష్టము కలుగఁజేయునో యనుభవముగలవారికి స్వేదనాళాదుల రంధ్రములు మూతపడుటచేత పయికి రావలసినదుర్గంధాదులు దేహములోపలనె నిలిచిపోయి యెంతచెఱుపును గలుగఁజేయునో సులభముగా తెలియవచ్చును.

స్నానము—మనము నిత్యమును శరీరముచక్కఁగాతోముకొని

స్నానము చేయుచున్న పక్షమున, స్వేదనాళములు మొదలైనవానియొక్క ద్వారములు మన్ను చేత పూడిపోక తెఱచుకొనియుండి లోపలినుండి కలుషపదార్థములతోఁ గూడిన చెమ్మటధారాళముగా పయికిపోవుచుండును: గజ్జి మొదలయిన చర్మరోగములు రాకుండును; శరీరమునకు బలమును సుఖమును కలుగును. మన దేహమును తిన్నగా తోముకొని స్నానము చేయని యెడల, బలోత్సాహములు తగ్గుటయే కాక దేహమున మురికి యంటుకొనియుండి కలుషజలము తిన్నగా పయికిపోవుట కవకాశము లేక చిడుము మొదలయినవి పట్టును. చెమటరూపమున నొక్క దినములో నొక్క శరీరమునుండి బయలువెడలెడు కలుషజలము పెద్దసారాబుడ్డెడు కంటె నధికముగానుండును; ఆజలములోఁ గలిసి పయికివచ్చెడి యితర కలుషపదార్థములు దినమునకరతులముకంటె హెచ్చుగానుండును. ఇవి యన్నియు నెప్పటివప్పుడు పైకిపోవుచు దేహమారోగ్యదశలోనుండుటకు స్నాన మత్యంతావశ్యకము. పానమునకువలెనే స్నానమునకును శుద్ధ జలమే కావలయునుగాని యేదోయొకనీరు పనికిరాదు. మురికినీరు పోసికొనుటవలన గజ్జి లేచును. ఉదయకాలమున స్నానము చేయుట మిక్కిలి మంచిది. అయినను కూలినాలిచేసికొని పాటుపడువారు సాయంకాలము స్నానము చేయవలెను. అన్నము తిన్నతోడనేగాని తిన్నయన్నము జీర్ణమగుచున్న సమయమునందుఁగాని స్నానము చేయరాదు. ప్రాతఃకాలమున స్నానము చేయలేనివారు భోజనమునకు ముందు చేయవచ్చును. దేహపరిశ్రమము చేయుటచేత చెమ్మట పట్టియున్నప్పుడు నీళ్ళుపోసికొన్న పక్షమున జలుబుచేసి జ్వరాదులు సంభవించును. కాఁబట్టి చెమ్మట యారి చర్మము పొడిగానున్న తరువాతనే యట్టివారు స్నానము చేయవలెను. గాలికొట్టుచున్న స్థలములో బట్టబయలను స్నానము చేయక సాధ్యమయినంతవఱకు పయినికప్పున్న గాలికొట్టని స్థలములో నీళ్ళు పోసికొనుచుండవలెను. ఒడలిమురికి తిన్నగాపోవుటకయి నీళ్ళుపోసికొను

నప్పుడు నబ్బుతోఁగాని కుంకుడుకాయలరసముతోఁగానిరుద్దుకోవలెను. నబ్బు తలుచుగా రాచుకొనుట మంచిదికాదు. అరగంట సేపటికంటె నెక్కువకాలమునీళ్ళలోనుండఁగూడదు. చన్నీళ్ళలోనైనపక్షమున పావుగంటకు లోపలనెస్నానము ముగింపవలెను. వయసులో నున్నవారును బలముగలవారును చన్నీళ్ళలో స్నానముచేయవలెను. చన్నీళ్లుపోసికొన్న తోడనే శరీరముజివ్వుమనిచల్లగానున్నను తరువాత దేహాయంత్రములకు ప్రోత్సాహముకలిగి రక్తప్రసారము చురుకుఁదనమునుపొంది సుఖము కలుగును. చన్నీళ్ళుపడనివారును బాలురనుబలహీనులునువ్యాధిగ్రస్తులును గోరువెచ్చనినీళ్ళుపోసికోవలెను. శీతాకాలములో బలముగలవారు సహితము నులివెచ్చనినీళ్ళుపయోగించవచ్చును. మిక్కిలి వేఁడిగానుండు నీళ్ళెప్పుడును పోసికొనఁగూడదు. మిక్కిలి శరీరప్రయాసముపడినవారును, ఎండకాలములో బహుదూరమునడిచివచ్చినవారును, కండలకు దెబ్బలుతగిలినవారును, వేడినీళ్ళుపోసికోవలెను. మిక్కిలి వేడినీళ్ళుపోసికొనుట వలన దేహపటుత్వము చెడిపోవును. ఈదేశములో పసిబిడ్డల కుదురు నీళ్ళుపోసెడు దురాచారము విస్తారముగానున్నది. వేఁడినీళ్ళు పోయుట వలన శరీరముకంది బహువిధములయిన చెరుపులుకలుగును. కాఁబట్టి పసిబిడ్డలకుగోరువెచ్చనినీళ్లనేపోయుచుండవలెను. ఎల్లవారునుస్నానము కాఁగానేమొట్టమొదట సన్నబట్టలతో తడియంతయు పోవునట్లుగా శరీరమంతయు చక్కఁగాతుడుచుకొని తరువాత వెట్టపుట్టుటకయిముదుగు బట్టతో దేహమును కందునట్లు గట్టిగా రాచుకొనవలెను.

దంతధావనము—స్నానముచేసి దేహముననున్న మురికిపోఁగొట్టుకొనుట యారోగ్యమున కెట్లావశ్యకమో యట్లే ప్రతిదినమును దంతములను శుద్ధిజేసికొని పండ్లపాచిని పోఁగొట్టుకొనుట యత్యంతావశ్యకము. నోరు కంపుపోవునట్లుగా పండ్లుతోముకొనిపక్షమున శ్వాసవాయువు దుర్గంధముతోఁగలిసి పెక్కుచెరుపులను గలుగఁజేయును.

కాఁబట్టి యెల్లవారును ప్రతిదినమును ప్రాతఃకాలమున శుద్ధముగా పండ్లు తోముకొని పుక్కిలించియుమిసి తాటాకుతో నాలుక గీచుకొని మొగము కడుగుకొనవలెను. నల్లకచ్చికతోఁగాని, ఇసుకతోఁగాని ఇటుకపొడుముతోఁగాని, మోటుగానుండు పుల్లలతోఁగాని, పండ్లు తోముకొనఁగూడదు. అట్లు తోముకొనుటవలన దంతములఱిగి కొంతకాలమునకు పండ్లనొప్పులు మొదలయినవి కలుగును. బొగ్గునుగాని కాల్చిన పోకచెక్కనుగాని మెత్తగానూరి దానిలో కొంచెముప్పుపొడుముకలిపి యామెత్తనిపొడుముతో కొంచెము సేపు పండ్లుతోముకొని ముఖప్రక్షాళనము చేసికొనవలెను. విస్తారము సేపు దంతధావనము చేయఁగూడదు. అప్పుడప్పుడు పటికపొడుముకలిపిన నీళ్ళను కొంచెము సేపునోటఁబట్టి పుక్కిలించి యుమియుటవలన పండ్లచిగుళ్ళకు బలముకలుగును.

వస్త్రధారణము——మన దేహములోపలినుండి సదా పయికి వచ్చుచుండెడి చెమ్మట, మన్ను మొదలయిన వెప్పుడును మనముధరించుకొనెడు బట్టలకు పట్టుకొనుచుండును; అంతేకాక పయినుండి గాలిలోఁ జేరివచ్చెడు దుమ్ము మొదలయిన కలుషపదార్థములుగూడ కొంతవఱకు పయిబట్టలకంటుచుండును. ఈరెండు కారణములచేతను మాసిపోయిన బట్టలను వెంటనేవిడిచి, చక్కగానుతికిన శుద్ధవస్త్రములను కట్టుకొనుచుండవలెను. అట్లుచేయక మాసినబట్టలనుగాని మాసినట్లు కనఁబడని రంగుబట్టలనుగాని మరలమరల కట్టుకొన్న పక్షమున, స్నానము చేసిశుచిగానున్న ప్రయోజనములేక బట్టలనంటుకొన్న యపరిశుద్ధతలు మరల దేహమునఁ జేరిగజ్జి, చిడుము మొదలయిన చర్మరోగములను పుట్టించుటకు హేతువులగును. కాఁబట్టి దేహారోగ్యమును కోరువారందఱును మాసిన బట్టలెప్పటివప్పుడు తీసివేసి యుతికినబట్టలను కట్టుకొనుచుండవలెను. మడిబట్టలని పేరుపెట్టి చిరకాలముతుకకుండిన పట్టుబట్టలు మొదలయిన మఱికిఁ బట్టలను నెలలకొలఁదిదినములు కట్టుకొనుచుండెడు దురాచార

మీఁ తెలుఁగు దేశమునందు వ్యాపించియున్నది. ఈమడిబట్టలుజిడ్డుతోను చెమట మురికి మొదలయినవానితోను గలిసి కంపెత్తుటయుఁ గలదు. వివేకులయినవారీదురాచారమునుమాని భోజనసమయమునందు చక్కఁగా నుతికి తెచ్చిన మురికిలేనిబట్టలనుకట్టుకొనెడి సదాచారమును నేర్చికొనవలెను. మృగాదులకు దేహములమీఁదబొచ్చు మొదలైనవున్నట్లుగా మనమృదు దేహములయొక్క సంరక్షణమునకై యేమియు లేదుగనుక, మనము దేశకాలానుగుణముగా నూలుబట్టలుబొచ్చుబట్టలు మొదలైనవానిని ధరించుకొని శరీరమునుకాపాడుకొనుచుండవలెను. చలిదేశములయందుండువారును, చలికాలమునందుష్ణదేశములయందుండువారును, బొచ్చుబట్టలనుధరించుకొనవలెను; ఉష్ణదేశములయందుండువారికిప్రత్తి వస్త్రములు చాలియుండును. శీతకాలమునందు వెట్టచేయుబట్టలు లేకపోవుటవలన బీదలనేకులు జ్వరాదులచేత బాధపడుచుండును. అట్టివారు నగలకును వైద్యులకును వ్యయముచేయుటకుమాఱుగా దానిలోకొంతసొమ్మును కంబళ్ళు మొదలయిన వెట్టచేయుబట్టలక్రింద నుపయోగించిన నెంతో ప్రయోజనకరముగానుండును. మనయవయవములలో నెల్లను ముఖ్యములయిన శిరస్సును కడుపును మనముముఖ్యముగాకాపాడుకొనవలెను. ఎండలోనడుచునప్పుడు మనతలమీఁదపాగానుగానిటోపీనిగాని తప్పకయుంచుకొనవలెను. తలగుడ్డ మిక్కిలి బరువైనదయిన పక్షమున రక్తప్రసారణము సరిగాజరగక శిరోవేదనము మొదలయినవికలుగును గాన సాధ్యమయినంతవఱకు మిక్కిలి తేలికయినతలగుడ్డనే పెట్టుకొనుచుండవలెను. మిక్కిలిబిగువుగా బట్టలు కట్టుకొనుటవలన రక్తవ్యాపనమునకు భంగముకలిగి పెక్కుకీళ్ళుసంభవించును. కాఁబట్టి యెవ్వరును బట్టలను మిక్కిలి బిగువుగా నేభాగమునందును కట్టుకొనకుండవలెను. మనలోననేకులకు మొలగజ్జ మొదలయినవి కలుగుటకు బట్టబిగించికట్టుకొనుటయేకారణము. ప్రేగులు, శ్వాసాశయములు, మొదలయి నవాని

సంరక్షణమునిమిత్తము సదాబట్టయుండుటయావశ్యకముగానఎప్పుడును కడుపుపయిని చొక్కా తొడిగియుండుట మంచిది. ఱొమ్మయొక్క సంరక్షణనిమిత్తము వెట్టచేసెడు ఫ్లానలు మొదలయిన బొచ్చుబట్ట లవశ్యముగానుండవలెను. చెమ్మటతో తడిసినబట్టలను వెంటనేతీసి వేయవలెను తీసివేయుటకువీలులేనిపక్షమున, అవియాఱువఱకునిటునటు తిరుగుచుండవలెను. లేనియెడల తడిబట్టవలన మిక్కిలి చెఱుపుకలుగును. నదులలోను చెఱువులలోనుస్నానముచేసితడిబట్టలతో వచ్చుచుండుటయుమడి పేరుచెప్పివిధవలు మొదలైనవారుతడిబట్టలతో వంట మొదలైనవిచేయుచుండుటయు మన దేశములో గొప్పదురాచారములుగా నున్నవి. తడిబట్టను తడవుగా ధరించుటవలన శరీరమునందలి యుష్ణము తగ్గిపోయి పలువిధములయిన వ్యాధులు సంభవించును. పెద్దవారికంటె బిడ్డలకు మంచిబట్ట లెక్కువయావశ్యకము. వారి దేహములుమిక్కిలికోమలములు గనుక శీతోష్ణములనంతగా సహింపలేవు. కాబట్టి పసిబిడ్డల దేహములయందెప్పుడును మంచిబట్టలుండునట్లు చేయవలెను. మంచిబట్టలనగా పరిశుద్ధమయినవిగాని విలువబట్టలని యర్థముకాదు. శీతకాలమునందు పిల్లలకులోపలనూలుబట్టలుతొడిగి పైనిబొచ్చుబట్టలు వేసి యుంచవలెను మన దేశమునందు బట్టలుతిన్నగాతొడుగకపోవుటచేతనే పసిబిడ్డలకువిరేచనములు మొదలైన పెక్కు వ్యాధులునువానిమూలమునమరణములును హెచ్చుగా సంభవించుచున్నవి. పిల్లలకుపక్క వేసెడుబట్టలను కప్పెడు బట్టలనుకూడతఱుచుగామార్చి శుచిగానుంచవలెను. ఒక్కపిల్లలవిమాత్రమే కాక పెద్దవాండ్రప్రక్క దుప్పట్లనుకూడ మాసినతోడనేతీసి వేసి క్రొత్తవిమార్చుచుండవలెను. మార్చకమాసినవానినే పెక్కుదినములుంచెడుపక్షమున, వానినంటుకొన్న కాలుష్యములు దేహమునంటుకొని వ్యాధిజనకములగును. తెల్లబట్టవలన దేహమునకుష్ణమధికముగాసోకదు గనుక, వేసవికాలములో తెల్లబట్టలుధరించుకొనుటమంచిది. రంగుబట్టల

లోనల్ల నానివలన దేహమునకుష్ణమధికముగా గలుగునుపయిబట్టలకంటె లోపలతొడుగుకొన్న బట్టలనుపలుమారుమార్చుచుండవలెను. కొందఱు ముఱికిచొక్కాలను లోపలతొడుగుకొని పయినిమంచివానిని వేసికొనుటయు, మాసినదుప్పట్లు మొదలైనవానిని ప్రక్కయందుగున వేయుటయు కలదుకాని యట్టిమాయలవలన నష్టమేకాని లాభమేదియులేదు.

ఇండ్లు——మన దేహారోగ్యమునకయి శరీరము నెట్లుపరిశుద్ధముగా నుంచుకొనవలయునో యాప్రకారముగానే మనము వాసముచేసెడు గృహములనుగూడ మిక్కిలిపరిశుద్ధముగానుంచుకొనవలయును. ముందుగాగృహములను తిన్నగాకట్టించుకొనుటయందు శ్రద్ధవహించినంగాని, ఆరోగ్యమునకనుకూలమగునట్లువానినిశుద్ధముగానుంచుకొనుటశక్యము కాదు. ఇండ్లు కట్టుకొనునప్పుడు వానిచుట్టును విడిగా కొంతస్థలమును విడిచిపెట్టి మధ్యభాగమునం దిండ్లుకట్టుకొనుట మంచిది. ఇంటిచుట్టును స్థలమున్నపక్షమున; ఇంటిలోనికి శుద్ధవాయువు నిరాతంకముగా ప్రవేశించుటయేకాక, లోపలంగలిగెడు దుష్టవాయువులన్నియు పూర్ణముగా పయికిపోవుట కవకాశముకలుగును. మధ్యను వట్టిస్థలములేకుండ నిండ్లనొకదానిమీంద నొకటి యిఱుకుగాం గట్టినపక్షమున, మంచిగాలి తిన్నంగా లోపలికి రాకయు చెడుగాలి పయికిపోకయు లోపల వసించువారి యారోగ్యమునకు భంగము కలుగును. నదులసమీపమునంగాని, చెఱువులసమీపమునంగాని, నీరునిలిచియుండెడు గుంటల సమీంపమునంగాని, ఇండ్లెప్పుడునుగట్టక సాధ్యమయినంతవఱకెత్తయిన ప్రదేశములయందే గృహములనుకట్టుచురావలయును. ఎత్తయినచోట్ల కట్టునప్పుడుసహిత మిండ్లనుకట్టెడు భాగమును భూమికంటె రెండు మూడడుగుల యెత్తుచేయుటవలన వర్షాకాలమునందునీరునిలువక నట్టిళ్ళును గోడలును, తేమయెక్కకపొడిగానుండియారోగ్యప్రదములగును. సాధారణముగా మనవారికివచ్చెడు జ్వరములలో విశేషభాగమిండ్లు

క్షేమగానుండుటచేతను, చుట్టుపట్లనీరునిలిచెడు పల్లపునేలలుండి యూ
కలములుకుళ్ళుచుండుటచేతనుకలుగుచుండును. ఇండ్లలోనివసించువారికి
గాలివిస్తారముగాఁ గావలసియుండునుగాన, గోడలను కుఱుచుగా నుం
చక సాధ్యమయినంతవఱకు కెత్తుగాపెట్టించవలెను. వెలుపలిగాలిధారా
ళముగావచ్చుటకయి సర్దియావరణపు గోడలనుమాత్రముపొట్టిగానే
యుంచవలెను. లోపలికి కావలసినంతగాలియును వెలుతురును వచ్చు
చుండుటకై వాసముచేయుగృహములకు తగినన్ని ద్వారములనుగవా
క్షములను పెట్టవలెను. గాలియు వెలుతురును తిన్నగారానియిఱుకుసం
దులలోసహితముగృహములను గట్టరాదు. మనదేశమునందనేకగృహ
ములలోని గదులు తిన్నగా వెలుతురువచ్చుటకు వీళ్ళు లేనివై పగలు
సహితము చాలవఱకు చీఁకటిగానుండును. అట్టిగదులు వసించుటకుఁ
గాని శయనించుటకుఁగాని యర్హమయినవి కావు. దేహసుఖమునకు
గాలివలెనే వెలుతురునుమిక్కిలియావశ్యకమయినదే. వెలుతురుచొరని
ప్రదేశమునందు నాటఁబడిన మొక్కలు తెల్లపడి బలహీనముగానుండు
నట్లు వెలుతురురాని గృహములయందు వసించుజనులును పాలిపోయి
బలహీనులయిరోగిష్ఠులయి దేహమనస్సౌఖ్యములుతిన్నగా లేనివారయి
యుందురు. వెలుతురు చక్కగావచ్చెడు గదులలో నుంచఁబడెడు రో
గులు చీఁకటిగదులలో నుంచఁబడినవారికంటె శీఘ్రముగా స్వస్థతను
బొందుదురు. వెలుతురువలన గాలి శుద్ధతనుబొందును. గదులలోపురు
గులుమొదలయినవి చేరవు; గదులలోనుండుగోడలముఱికి మొదలయినవి
మనకన్నులకు స్పష్టముగాకనఁబడుటచేతమనమువానినిశుభ్రముచేయు
దుము. అంతేకాక వెలుతురువలనమనమనస్సులకుత్సాహముకలుగును.
కాఁబట్టి వాసగృహములయందు సదా వెలుతురుప్రవేశించునట్లుచేయ
వలెను. వాసగృహములయందు శుద్ధవాయువుండుట యావశ్యకమని
యిదివఱకే పలుమాఱు చెప్పఁబడినది. మంచిగాలిచాలినంతయుండుట

కయి యొక్కొక్క మనుష్యునకు పదియడుగులయెత్తుగల గదిలోనలు వదియెనిమిది చదరపుటడుగుల స్థలము కావలసియుండును. గాలిస్వేచ్ఛగా వచ్చుటకును పోవుటకునుగల మార్గములున్న యెడల తక్కువస్థలమయిననుసరిపోవును. కాబట్టిగదులలోగోడలకెదురుప్రక్కలనుపయిగా కిటికీలనుంచవలెను. ఎదురుపరిక్కలగోడలనుగవాక్షములుండుటవలన, ఒకపరిక్కనుండి గాలిలోపలికి వచ్చుచుండుటయు మఱియొక పరిక్కనుండిపోవుచుండుటయు సంభవించుచుండును. నడికప్పునకుసమీపమునగాని వీలులేనియెడల గోడలకొనలనుగాని సందులుండునట్లు విడుచుట మంచిది. అట్లుండుటవలన మనము శ్వాసమువిడిచిన చెడుగాలిపయికిలేచి యాసందులలోనుండి వెలుపలికిపోవుచుండును. మనవారుపడకయిండ్లలో పెట్టెలును బియ్యపుబిందెలు మొదలయినవియు పెట్టి గాలిమఱింత తక్కువగునట్లు చేయుదురు. పడకగదులను పెట్టెలు మొదలయినవానితో నింపుట సుఖమునకు భంగకరము. గవాక్షములు లేకపోవుటవలనను గదులను వస్తువులతో నిండించుటవలననుగాలి చెడిపోవుచుండుటయాగదులలో పరుండువారికి తెలియదు. క్రొత్తగా పయినుండివచ్చువారికి గుప్పున దుర్గంధముకొట్టి గాలి చెడుచున్నట్లు తెలియవచ్చును. కాబట్టి శుద్ధవాయువు రాకపోకలు చేయుటకుఁదగినగవాక్షములు లేనిగదులలోనిద్రింపఁగూడదు. గవాక్షములు లేని పెద్దగదులకంటె గవాక్షములున్న చిన్నగదులే యెక్కువయారోగ్యప్రదములు. గవాక్షములును ద్వారములును వెలుతురునిమిత్తమును గాలినిమిత్తమునుద్దేశింపబడినను, మనవారనేకులు గవాక్షములను సదామూసియుంచి వానిలో వస్తువులను పెట్టియుంచుట యీదేశమునం దొక గొప్పదురాచారమయియున్నది. ఇట్టి గోడలయందు సందులు మొదలయినవియుండనీయక గచ్చుపూతనుగాని బీదలైనయెడల మట్టిపూతనుగానియవశ్యముగాచేయించవలెను. అంతేకాక గోడలను తఱుచుగా తుడిపించుచు సాలెగూండ్లు మొదలయినవి

లేకుండఁ జేయవలెను. సంవత్సరమునకు రెండుపర్యాయములు వెల్ల యనఁగా గోడలకు సున్నపునీళ్ళపూత వేయించవలెను. సుద్దనీళ్ళతో వెల్ల వేయించుటవలన నేమియుప్రయోజనములేదు. గోడలకప్పుడప్పుడు సుట్టిపూత పెట్టించవచ్చునుగాని పేడపూతమాత్రమారోగ్యమునకను కూలమయినదికాదు. దానివలనదుర్గంధంకలిగి శరీరసుఖమునకుచెఱుపు కలుగఁజేయును. నట్టిళ్ళు మొదలయినవి విస్తారముగా నీళ్ళుపోసి ప్రతి దినమును అలుకుచుండుటవలనఁగూడ నేల తేమయెక్కి, అందుతిరుగుచుం డెడువారికి సుఖహీనత కలుగును. పొగవలనఁగూడశరీరారోగ్యమునకు చెఱుపుసంభవించునుగనుక వంటయిండ్లు వాసగృహములకుచేరకప్రత్యే కముగా నుండునట్లుచేసి వానియందు పొగ పయికిపోవుటకై పొగగొట్ట ములను పెట్టింపవలెను. గాలి తేమయెక్కి జబ్బుచేయునుగాన, పడక గదులలోఁగాని తఱుచుగాకూరుచుండు గదులలోఁగాని యెప్పుడునుతడి బట్టల నాఱఁగట్టఁగూడదు. పనికిరాని కాయగూరలను, తినఁగామిగిలిన భోజనపదార్థములను, అరటాకులు మొదలయిన పచ్చియెంగిలాకులను, అరటికాయలు గుమ్మడికాయలుపనసకాయలు మొదలయినకాయలును కంద చేమ పెండలము మొదలయిన దుంపలును చెక్కినపై పెచ్చులను ఇండ్లకుసమీపమున పాఱవేయుట మనలో సర్వసాధారణమైయున్నది. ఇట్టిపదార్థములను నివాసగృహములకుసమీపమునఁబాఱవేయుటవలన ఆపదార్థములుకుళ్ళివానినుండినానావిధములైన విషవాయువులుబయలు దేఱి, బహువిధములయిన రోగములను పుట్టించును. కాఁబట్టి పెంటలు మొదలయిన యపరిశుద్ధ పదార్థములను వేనిని గృహములసమీపమున బోయక, ఇండ్లకుసాధ్యమయినంతదూరమునగోతులుత్రవ్వించివానిలో పోయుచురావలెను. మనస్త్రీలు కొన్నియడుగుల దూరమైనను గృహ మునుదాటి నడుచుటకుబద్ధకించి వీధిగుమ్మములలోనిలుచుండియేయెంగి లాకులు మొదలయినవానిని వీధిలోవిసరివేసెదరు. పెంటలు మొదలైన

వెళ్ళుటకవకాశముండుటకు దూరముగాఁ దీసికొనిపోవుటకు వల్లపడనియెడల వాని నెల్ల నొకకుండలో వేసి మూత వేయుచు తీఱిక యైనప్పుడు తామయినను దూరముగాఁ గొనిపోయి గోతులలో వేయవలెను; లేదా పనికత్తెలచేత నైనను వేయించవలెను. ఈప్రాంతములయందు సాధారణముగా గృహములమధ్య కుండ్లుండుటయు, వానిలో స్నానములు మొదలయినవి చేయుచుండుటయు, ఆచారముగానున్నది. అట్టికుండ్లలోను మురికికాల్వల లోను మురికిగాని మురికినీరుగాని యెంతమాత్రమును నిలువనీయక వానిని ప్రతిదినమును మంచినీటితో కడుగుచు, మురికినీరు మొదలయిన వానిని యత్తిదూరముగా పాఱఁబోయించుచురావలెను. మురికినీరు మొదలయినవి నిలువయున్నపక్షమున కంపెత్తి దుర్గంధసహితమయిన విష వాయువులు బయలు వెడలి నానావిధములయినజ్వరాదులను కలిగించును. రాత్రులయందు కుండ్లలోనుండి మురికినీటిని గొనిపోయెడు తూము కాల్వలయొక్క ద్వారములను మూసియుంచవలెను. దొడ్లలో మఱియుఁగు పెరళ్ళున్నను, అక్కడకుపోవుటకు పాలుమాలి బిడ్డలను వీధులలోను గుమ్మములముందను రెంటికి కూర్చుండబెట్టెడి మిక్కిలి గొప్పదురాచారము మన స్త్రీలలో విశేషముగానున్నది. అంతేకాక పెద్దవారుసహితము రాత్రివేళ వీధులలో మలబాధకుపోవుదురు. వివేకము గలవారు మహానర్థదాయకమైన యీ చెడ్డయలవాటును తాము మానివేయుటయే కాక సాధ్యమయినంతవఱకితరులచేతఁగూడ మాన్పవలెను. మఱియుఁగు పెరళ్లు సాధ్యమయినంతవఱకు దొడ్లలో దూరముగా కట్టించి వానిని ప్రతిదినమును పరిశుభ్రము చేయించుచుండవలెను గృహసమీపమునందు నీడనిమిత్తమయి చెట్లుండవచ్చునుగాని మంచిగాలి లోపలికివచ్చుటకు ప్రతిబంధము కలుగునట్లు మిక్కిలివిస్తారముగానుండఁగూడదు. చెట్లెత్తుగా పెరిగి గాలిగాని వెలుతురుగానివచ్చుటకడ్డముగానున్నపక్షమున, అడ్డముగానున్నకొమ్మలను చెట్లను కొట్టివేయుచురావలెను. దొడ్లలో

చికిలింత కసింద మొదలయిన చెట్లు పెరుగకుండ తీసివేయుచుండవలెను. చెట్లనుండి రాలిన ఆకులు మొదలైనవానినూడ్పించి గోతులలోపోయించి కాల్పించుచుండవలెను. ఇండ్లలోఁగాని యిండ్లకు మిక్కిలిసమీపమునఁ గాని పశువులు మేఁకలు మొదలయినవానికట్టనియ్యఁగూడదు. ఒకవేళ కట్టతటస్థించినయెడల, గొచ్చుకానియ్యక పేడ మొదలైనవానిని వెంటనే తొలఁగించుచు వచ్చుటయేకాక గొడ్లలో పేడ కుప్పలు నిలువ యుండనియ్యను సహితముకూడదు. గోడలకు పిడకలు చఱచుటయు మంచిదికాదు. ఇటువంటివన్నియు నథమపక్షమింటికి నూఱుగజముల కన్న తక్కువ దూరములో నుండఁగూడదు.

# అయిదవ ప్రకరణము



## దేహపరిశ్రమ విశ్రాంతులు

దేహపరిశ్రమము—పయిప్రకరణములయందుఁ జెప్పఁబడినసుఖసాధనములనన్నిటినిమనమనుసరించినను, దేహపరిశ్రమము నొక్కదానిననాదరముచేసినపక్షమున మనకుచక్కనిశరీరారోగ్యమెన్నటికినికలుగనేరదు; కాఁబట్టి దృఢగాత్రులయి యారోగ్యమనుభవింపవలెననికోరువారందఱును దప్పక యేదోయొకవిధమున నిత్యమునుశరీరపరిశ్రమమును జేయుచుండవలెను. పనిలేకుండ నొకమూలవ్యర్థముగాపడవేసియుంచఁబడినయెడల సంవత్సరములోపలనె చక్రములుమొదలయినవిత్రుప్పుపట్టి గడియారములుమొదలయినయంత్రములెట్లుపాడగునోయట్లేమన దేహయంత్రమును పనిపాటులులేకుండ నిరుపయుక్తముగా నుంచినయెడల శీఘ్రకాలములోనే యవయవపటుత్వముచెడిపోయి దుర్బలమయియెందునకుం బనికిరానిదగును. ఒకమూల పాఱవేయఁబడిన తాళముచెవి త్రుప్పుపట్టి చెడిపోవుటయు నిత్యమును వాడుకలోనుండెడు తాళముచెవి మెఱుఁగెక్కి గట్టిగానుండుటయు నెఱిఁగినవారికి, పనిచేయనిశరీరములు గుల్లసాఱిలావయి దుర్బలములగుననియు పనిచేసెడుశరీరములు గట్టిపడి బలిష్ఠములయియుండుననియు చెప్పవలసినయక్కఱయుండదు. మనలోని ధనికులభార్యలు మొదలయినవారు సాధారణముగా బలహీనురాండ్రై యడిగెడుదూరము వడిగానడిచినను రొఁజుచు నాయాసపడుచుండుటకు తగినపాటులేకపోవుటయేముఖ్యకారణము. ఏయవయవములకుచక్కగా పనియుండునో యా యవయవములు కండపెరిగి బలిష్ఠములయి పనిచే

యుటకు సమర్థులయియుండును; ఏయవయవములకు చక్కఁగా పని యుండదో యాయవయవములుచిక్కిదుర్బలములై పనిచేయుటకసమర్థములయియుండును. సుత్తితో నిత్యమును పనిచేయుచుండెడు కంచరులు మొదలైనవాండ్రకుడిచేతులుదిట్టముగాకండబలిసి యెట్టికఠినమైనపనిని చేయుటకైన నర్హములయియుండుటయు, పనిలేక దేవునికిచేతులుమీఁదు కట్టెడు యోగులు మొదలైనవారికుడిచేతులు శుష్కించిబిఱ్ఱబిగిసికొని పోయి యన్నముతినుటకైన నర్హములు కాకుండుటయు, అనేకులు కని పెట్టియుండవచ్చును. ఈ హేతువుచేత నేమన మేయవయవమునుగదల్పక రాత్రియును పగలును పోతఁబొమ్మలవలె కూరుచున్నపక్షమున,సమస్తావయవపటుత్వమును తప్పిపోయి మనకుతప్పకవ్యాధివచ్చును. కాఁబట్టి సమస్తావయవములకును పనికలుగునట్లుగా మనమునిత్యమును దేహపరిశ్రమముచేయుచుండవలయును. భాగ్యవంతులలోవ్యాధులువిశేషముగా నుండుటకు కారణమువారికిపనిలేకుండుటయేయనియు, వారిపనిలేమియే వారినిమెల్లమెల్లఁగాతినివేయుచున్నదనియు, వారిపాలిటికిదీర్ఘములుగా కానఁబడెడుదినములను వారెట్లుగడపవలయునో తెలియకరోగములలో గడపెదరనియు, ఒకఘనవైద్యుఁడు వ్రాసియున్నాఁడు.

చక్కని దేహపరిశ్రమమువలనశుద్ధరక్తముశరీరమునందలిసమస్తావయవములకును వేగముగా ప్రవహించి వారికిబలోత్సాహములను సుఖమును కలుగఁజేయును. అందువలనశ్వాససాధనములునుజీర్ణసాధనములును క్రమమయినస్థితియందుండి సుఖప్రదములగును. నడుచుటపరుగెత్తుట మొదలయిన పరిశ్రమమువలన మఱింతవేగముగా శ్వాసమును విడుచుచుందుముగనుక శుద్ధవాయువు లోపలికధికముగాపోయి రక్తమునుమఱింతఅధికముగాశుద్ధపఱుచును చెమ్మటవిస్తారముగాపట్టి లోపలనున్న యపాయకరములయిన కలుషపదార్థములు మఱింత వేగముగా పైకివెడలిపోవును. దేహపరిశ్రమములేనివారికి బలప్రదములయినమంచి

పదార్థములను భుజింపవలెనని కొండంతయాసక్తియున్నను, తిన్నవస్తువులుతిన్నగా జీర్ణముగాకయు వానిసారమంతయు శరీరమునఁబట్టకయు అవి బలప్రదములు కాకుండును. దేహపరిశ్రమమునకు ప్రాతఃకాలమును సాయంకాలమును మిక్కిలి యనుకూలములైనవి. ఈరెండువేళలలోను ప్రాతఃకాలమునందలి వాయువు మిక్కిలి శుద్ధముగా నుండును గనుక, సాయంకాలమునకంటెనుదయకాలమునందలి దేహపరిశ్రమ మెక్కువ యారోగ్యదాయకముగానుండును. శీతకాలములో ప్రాతఃకాలమునందు మంచధికముగా నుండెడు పక్షమున నుదయకాలమునందు శరీరపరిశ్రమమునుమాని సాయంకాలమునందే చేయవలెను. దేహపరిశ్రమములనేకవిధములుగానున్నను, వానిలోనెల్లను మంచి గాలిలో వేగముగా నడుచుటయు పరుగెత్తుటయు మిక్కిలిశ్రేష్ఠములయినవి. మంచిగాలిలో నని చెప్పుటచేత జనసంఘము విస్తారముగాఁగల పట్టణ వీధులలో నడువక యూరిబయలను పొలములును మనోహరములయిన వృక్షాదులునుగలచోట్లనడువవలెననిమీరెఱిఁగి తెలిసికోవచ్చును. భోజనముచేయగానేగాని, తిన్నయన్నము జీర్ణమగుచుండఁగాగాని శరీరపరిశ్రమమును జేయక భోజనము చేసినతరువాత నర్ధమముజామునేపుతాళియే దేహపరిశ్రమమారంభింపవలెను. ప్రాతఃకాలమున నడుచుటకు బయలుదేఱక ముందుకొంచెముపాలనుగాని తేయాకునీళ్ళనుగాని పుచ్చుకొనుట మంచిది. నడచుటయు పరుగెత్తుటయుఁగాక యీఁదులాడుట, బంతులాట, తోఁటలలోత్రవ్వుట, సాముచేయుట, గుఱ్ఱములనెక్కి సవారిచేయుట, మొదలైన పరిశ్రమలను శక్త్యనుసారముగా చేయవచ్చును. ఒకమనుష్యుఁడదమము ప్రతిదినమును నాలుగుక్రోసులదూరమయినను నడువవలెను. కాని యంతదూరమును నొక్కసారియే నడువవలసిన యావశ్యములేదు. ప్రొద్దుననొకక్రోశము నడిచివచ్చి మరల సాయంకాలమంతదూరము పోయిరావచ్చును. మిక్కిలియలసిపోయినట్టుకనఁబడు

గానే నడకనుమాని వేయవలెను. బొత్తిగా దేహపరిశ్రమము లేకపోవుట వలన నెట్లో యట్లే అతి దేహపరిశ్రమమువలనఁగూడ పలువిధములయిన చెఱుపులుగలుగును. కాఁబట్టి యెల్లవారును తమశక్తికి తగినట్లుగా పరిమితమైన దేహపరిశ్రమమునే చేయుచుండవలెను. సాధారణముగా నుదయకాలమున నొకగంటసేపును సాయంకాలమున నొకగంటసేపును దినమునకు రెండుగంటలకాలము దేహపరిశ్రమము చాలును. దేహపరిశ్రమము చేయువారు మొట్టమొదటనే యొక్కసారిగా కఠినములయిన వ్యాయామాదులకుపూనక కొంచెముగా నారంభించి క్రమక్రమముగా హెచ్చుచేయుచు రావలెను. అటుతరువాత సహితమల్పకాలమతికఠినమయిన పరిశ్రమమును జేయక కొంచెమెక్కువసేపు సామాన్య పరిశ్రమమును జేయుచుండుటమిక్కిలి క్షేమకరము. అట్టిపరిశ్రమమును సరిగా నిత్యమును జేయుచుండవలయునే కాని కొంతకాలము చేయుచు కొంతకాలము మానుచు నుండరాదు. దేహపరిశ్రమము చేత విస్తారముగా చెమ్మట పట్టియున్నప్పుడు దేహముమీఁద చల్లనిగాలి సోఁకనిచ్చినను వెంటనే స్నానము చేసినను జలుబు చేసి జ్వరాదులు సంభవింపవచ్చును. కాఁబట్టి చెమ్మట యాఱిన తరువాతనే గాలిలోనికి పోవుటగాని స్నానము చేయుటకాని జరపవలసినది. నడుచుట మొదలయిన దేహపరిశ్రమములను జేయునప్పుడేవిషయమును గుఱించియైన నాలోచించుచు మనస్సునకాయాసము కలిగింపక మిత్రులతో మాటాడుచుఁగాని వృక్షములు మొదలయిన వానిని జూచుచుఁగాని యుల్లాసముగా నుండవలయును. దేహపరిశ్రమమును జేయునప్పుడు మనస్సును, మనఃపరిశ్రమమును జేయునప్పుడు దేహమును విశ్రాంతి పొందుట యారోగ్యప్రదముగాన, గదులలోఁ గూరుచుండి వ్రాయుట చదువుట యాలోచించుట మొదలయిన మనఃపరిశ్రమమును చేయుటచే విసుగు కలిగినప్పుడు వెంటనే యీవలికి వచ్చి కొంతసేపు మంచిగాలిలో బయల నటుతిరుగవలెను. ఈప్రకారముగానే కార్యస్థానములయందు పగ

ల్లను గూరుచుండిపనిచేసి యాయాసపడివచ్చినవారు వెంటనేయింటికి వచ్చి యుస్సురని కూలఁబడక బయలను కొంచెముసేపుశుద్ధవాయువులో తిరిగివచ్చినయెడల, మునుపున్న యాయాసమంతయు పోయి దేహము హాయిగా నుండుటయేకాక మంచి యాఁకలియయి రాత్రిసుఖనిద్రయు కలుగును.

ఇట్టిపరమప్రయోజన కరమయిన దేహపరిశ్రమము జేయక యుపేక్షచేసినపక్షమున, శరీరమునందు జవసత్త్వములు లేక క్రొవ్వధికమై దేహములు స్థూలములై నిస్సారములును బలహీనములును అగును. శరీరము పూర్ణముగా పెరిగిన కాలమునకంటె పెరుగుచున్న కాలములో దేహపరిశ్రమమధికముగా కావలయును. కాబట్టి పెద్దవారికంటె బాలురధికముగా శరీరపరిశ్రమమును చేయుచురావలెను. బాలురుగాని బాలికలు గాని యుత్సాహముతో గంతులువేయుట పరుగెత్తుట కేకలువేయుట మొదలైనపనులుజరుపుచు నాటలాడుచున్నప్పుడు వృథాగా వారియాటలకు భంగముకలిగించి వారిసంతోషమును చెఱుపరాదు. బాలికలుయ్యాలలూగుటయు వారికిమంచిసాధకమే. దేహమునందలికీళ్ళు కదలునట్లుగా వారాడెడి యేవిధమయిన యాటలను మాన్పక యట్టియాటలయందు వారికుల్లాసమును నుత్సాహమును కలుగునట్లుచేయవలెను. ఈదేశమునందలి విద్యార్థులుసామాన్యముగా తమకాలమునంతను పాఠములను జదువుటయందేవినియోగపఱుచుచు దేహపరిశ్రమము నెంతమాత్రమును పాటింపక పరీక్షాకాలములయందురోగపడియు యావజ్జీవమునుబలహీనులయ్యును చెడిపోవుచున్నారు. ఎంతయెక్కువసేపు చదివిన నంతయెక్కువచదువు వచ్చుననుకొనుట భ్రమయేకాని సత్యముకాదు. ఎల్లకాలమును చదువునందే గడపెడివానికంటె కొంతసేపాటలాడి కొంతసేపు చదువుకొనువానికే యధికవిద్య వచ్చును. కాఁబట్టి విద్యార్థులు సూర్యాస్తమయ సమయమునందు బంతులాడుట మొదలయిన దేహపరి

శ్రమమును నిత్యమునుతప్పక చేయుచుండవలెను. విద్యార్థులకుచదువుట వలన నాయాసము కలిగినప్పుడు వెంటనేలేచి బయలను కొంతసేపు తిరిగివచ్చుటయేవారికి విశ్రాంతిగానుండును. విస్తారముగాతిరుగుటవలన బడలిక కలిగినప్పుడొకచోట కూరుచుండి చదువుటయేవిశ్రాంతిగానుం డును. చదువునప్పుడు మనస్సునకును నేత్రములకును పనికలిగితక్కినకర చరణాద్యవయవములకు విశ్రాంతికలుగును. నడుచునప్పుడుకరచరణాదు లకు పనికలిగి మనస్సునకును నేత్రములకునువిశ్రాంతికలుగును. వృధ్ధ గాత్రులకు పనికివచ్చెడు పరిశ్రమముబలహీనులకునురోగబాధితులకును పనికిరాదు. అట్టివారు కఠినమయిన దేహపరిశ్రమములేవియు చేయక తేలికయైన పరిశ్రమములను కొంచెముసేపు చేయుచురావలెను. తేలిక యైన సాధకమునుసహితము వారొక్కసారిగా చేయక నడుమనడుమ కొంచెముసేపాగుచువచ్చి యలపుతీర్చుకొను చుండవలెను. మంచిగాలి కొఱకు వారు బండ్లలోనెక్కి యూరిబయలను తిరుగవచ్చును.

విశ్రాంతి—మనశరీరమునకువిశ్రాంతి రెండువిధములుగాఁ గలు గును. అందు మొదటిది యొకవిధమయినపనిని చేయుటవలనబడలికకలిగి నప్పుడాపనిని విడిచిపెట్టి మఱియొకవిధమయినపనినిగాని యాటనుగాని చేయుట. చాలసేపు కూరుచుండి చదువుటవలన నాయాసముకలిగి నప్పుడు కొంచెముసేపు లేచి తిరిగివచ్చుట విశ్రాంతిగానుండుననియు, చాలదూరము నడిచివచ్చుటవలన నాయాసముకలిగినప్పుడు కొంచెము సేపు కూరుచుండి చదువుట విశ్రాంతిగానుండుననియు, ఈవఱకొక చోటఁ జెప్పఁబడినది. ఒకపనిని చేయునప్పుడు శ్రమపడుచుండిన యవ యవములు వేఱొక పనిని చేయునప్పుడు విశ్రాంతిపొందును గనుక ఇది యొకవిధమయిన విశ్రాంతియేయైనను పూర్ణమయినవిశ్రాంతిమాత్రము కానేరదు. ఇటువంటి విశ్రాంతివలనను వేడుకలవలనను మనకు కొంత సుఖము కలిగినను, మనకు పూర్ణమయిన యలసటగలిగి మనమనస్సు

గాని శరీరముగాని యేపనిని చేయుటకును నే వేడుకననుభవించుటకును సమర్థముగాక సంపూర్ణ విశ్రాంతిని పొందనపేక్షించెడి కాలమొకటి ప్రతిదినమునుండునని యనుభవముచేత నెల్లవారికిని దెలియును. ఆ సంపూర్ణవిశ్రాంతికే నిద్రయని పేరు. అదిమనప్రయత్నమక్కఱలేకయే దేవదూతవలె తనంతనేవచ్చి, పనిచేసియలసిన యవయవములనుమరల బలపఱిచి, సుఖమును పుష్టిని కలిగించి, మరల మనలను పనిచేయుట కర్హులనుగాఁజేసి మనలను విడిచిపోవును. అదియెట్లువచ్చునో, ఎట్లుపని చేయునో, శాస్త్రవేత్తలకు సహితము పూర్ణముగా తెలియదు. నిద్ర లేక మనముచిరకాలము జీవింపనేరము. మనమేపనిచేసిననుదానివలన మన దేహము కొంతయఱుగుదలకలుగుచుండును. ఆ యఱుగుదలవలన పోయినపదార్థములకు మాఱుగాఁ గ్రొత్త పదార్థములువచ్చిచేరియవయవములు మరల పూర్తిపడుచువచ్చినంగాని యవయవ పటుత్వమును స్వకృత్యమును నిర్వహించుటకు సామర్థ్యమునుగలుగవు. పగలు చేసెడు పనులవలనఁగలిగెడునష్టము రాత్రులు నిద్రలో పూర్తియగుచుండును. పగలెల్లను జనులుతోడుకొనుటవలన నూతిలోనుండి తగ్గిపోయిననీరు రాత్రిపూర్తియగుచు వచ్చునట్లే పగలు పనివలన శరీరములోగలిగెడు లోపములును రాత్రిపూర్తి యగుచుండునుగాన, రాత్రివేళతగినంత సేపు నిద్రపోవుట మన దేహారోగ్యమున కత్యంతావశ్యకము. పగలు పనిచేయుట కనుకూలముగా వెలుతురుండుటయు రాత్రిపనిచేయుటకు ప్రతికూలముగాను విశ్రాంతికనుకూలముగాను చీఁకటియుండుటయుచూడఁగా, మనముపగలుపనిచేసి రాత్రివిశ్రాంతిననుభవింపవలయుటయీశ్వరోద్దేశమని స్పష్టపడుచున్నది. అయినను కొందఱపూర్వబుద్ధిమంతులు పగలెల్లను నిద్రపోయి రాత్రులు పనిచేయుచున్నారు. అదిమంచిపద్ధతి కాదు. పగలు పదిగంటలసేపు నిద్రపోయినను, అదిరాత్రిరెండుగంటల కాలముపోయెడునిద్రతో సమానముకాదు. రాత్రి నిద్రపోవునప్పుడు

విస్తారముగా చెమ్మటపట్టి దానిమూలమున శరీరములోని కాలుష్యములు పోయెడు లాభములు మొదలయినవి పగటినిద్రయందుండవు. కాబట్టి రాత్రినిద్రతో సమానమయిన యమూల్యలాభము మనకుమఱియొకటి దొరకదు. అందుచే నెల్లవారును రాత్రివేళయుక్తకాలములో తగినంత నిద్రను పొందుచుండుటకయి సమస్తప్రయత్నములు చేయవలెను.

మనయారోగ్యమున కనివార్యముగాఁ గావలసిన నిద్రకుశత్రువులయిన ప్రతిబంధములు రెండువిధములయినవిగానున్నవి. అందు మొదటివి మనకు నిద్రరాకుండఁ జేయునవి; రెండవవి పట్టిననిద్రకుభంగమునుకలిగించునవి. ఈద్వివిధములయిన ప్రతిబంధములకును మనము తగిన ప్రతిక్రియలనాలోచించుచుండవలెను. చిన్నవాండ్రకు పరుండిపరుండఁగానే గాఢముగా నిద్రపట్టినను, పెద్దవాండ్రకనేకులకు పగలెంతపనిచేసి యలసినను రాత్రి పడకచేరినతరువాత నెంతసేపటికిని నిద్రపట్టదు. నిద్రపట్టకుండుటకుఁగలకారణములలో నొకటి పరుండఁబోవునప్పుడు దేనివిషయమయినను నాలోచించుచుండుట. మనకేదయిన కష్టము సంభవించి దానివిషయమయి యాలోచించునప్పుడుమాత్రమే కాకసంతోషకార్యవిషయమయి యాలోచించునప్పుడుకూడనిద్రపట్టదు. కాబట్టిపరుండఁబోవునప్పుడు దేనివిషయమునను నాలోచింపకుండవలెను. కొందఱు మంచిపుస్తకము దొరకినప్పుడుదానినంతను శీఘ్రముగాముగింపవలెనని చదువుచుండియు, ముగించినతరువాత దానిలోని విషయములనుగూర్చి యాలోచించుచుండియు, రాత్రులు నిద్రను చెడఁగొట్టుకొందురు. అటుతరువాత నిద్రపోవలెనన్నను వారికిపట్టదు. అటువంటిసమయములందు కొంచెము సేపావలికిపోయి యఱగంటసేపు గాలిలోతిరిగివచ్చి మరల పరున్నచో సామాన్యముగా నిద్రపట్టును. బయలపోయితిరుగుటకువీలుపడనియెడల రుచిలేనిపుస్తకము నొకదానిని ముందుపెట్టుకొని చదువనారంభించినచో సాధారణముగా కొంచెము సేపునకు నిద్రపట్టును.

ఇట్లు లేనివల్లను నిద్రపట్టక మనస్సునకారాటము విస్తారముగా నున్న పక్షమునమంచముమీఁదపరుండిదానివిషయమే యాలోచించుచుండక వెంటనే లేచివచ్చి వ్రాసికొనుట మొదలయిన పనులుచేయ నారంభించి మఱునాఁడుపగలునిద్రపోకుండు రేనిన్నాటిరాత్రిగాఢమయిన నిద్రపట్టును. నిద్రకు భంగముకలుగునట్లుగా విచారములకెప్పుడును మనస్సున నెడ మియ్యఁగూడదు. మనకేకార్యమువిషయమైనను విచారముకలిగినప్పుడు దానినిచక్కపెట్టుటకయి చేతనయినంతప్రయత్నముచేయవలెను; అప్పటికిని సాధ్యముకాక కార్యము చక్కపడనిపక్షమున, ఇఁకదానివిషయమైన యాలోచనను మానుకొనవలయునేకాని దానినిగుఱించియేసదా విచారించుచు బెంగపెట్టుకొని మనస్సునకును దేహమునకునుసుఖహీనత తెచ్చుకొనరాదు. నిద్రపట్టకపోవుటకు మఱియొకకారణము చేయవలసినదానికంటె నెక్కువపనిచేయుచు నతికష్టపడుట అతికష్టమువలన నిద్రపట్టనిపక్షమున మఱునాఁడు విస్తారముగా పనిచేయక యాయాసము తగ్గునట్లుగా తక్కువపనిచేసి నిద్రపట్టించుకొనవలెను.

నిద్రాభంగముకూడ ననేకవిధములచేతఁగలుగును. రాత్రియతి విస్తారముగా భుజించుట నిద్రాభంగమునకొక కారణమయి యున్నది. మితిమీఱిభుజించిపడుకొన్నపక్షమునమంచినిద్రపట్టక రాత్రియంతయు పీడకలలువచ్చుచుండును. బలమైనయాహారమునుజీర్ణింపఁజేయుటకయి జీర్ణాశయమతికష్టపడుచున్నప్పుడు మేదస్సునకు విశ్రాంతి కలుగనేరదు. కాఁబట్టి రాత్రులయందు కొంచెము లఘువుగా భోజనముచేసి, భోజనమయినతరువాత రెండుగంటలసేపువఱకునునిద్రపోవకతరువాత నేపాన్పు చేరవలెను. రాత్రులు భోజనసమయమునందు సులభముగా జీర్ణము కానిపదార్థములను వేనినితినఁగూడదు. కలఁతనిద్రకింకొక కారణముమన పడకగదులుశుచిగానుండకపోవుట. మన చెమటచేతతడిసిమాసినప్రక్క

దుప్పట్ల నెప్పటికానినప్పుడు తీసియుతికిన క్రొత్తదుప్పట్లను వేయుచుండ వలెను. కప్పుకొనెడుబట్టలనుకూడ తఱుచుగా గాలిపాఱంబెట్టిశుభ్రము చేయుచుండవలెను. పగలెల్లను మనపడకగదులతలుపులనుగవాక్షము లను తెఱచియుంచి మంచిగాలి లోపలికివచ్చునట్లుచేయవలెను. పగలు మాత్రమేకాక రాత్రులు పరున్నప్పుడుకూడ పడకగదులోనికి తగినంత మంచిగాలి వచ్చునట్లుచేయవలెను. శుద్ధవాయువుతగినంత ప్రవేశింపని యిరుకుగదులలోపరుండుట ఆరోగ్యమునకు భంగము కలుగఁ జేయును. కాఁబట్టి రాత్రులయందు సహితము గాలి ధారాళముగా సంచారము చేయునట్లుగా పడకగదుల గవాక్షములు తెఱచియుంచవలెను. ఐనను గాలికెదురుగా పరుండినిద్రపోఁగూడదు. చలిగాలినిద్రించెడువారి దేహ ములమీఁదకొట్టుచుండెడుపక్షమున, దేహములోని వేఁడితగ్గిపోయివ్యా ధులాశ్రయించును. వేసవికాలములో మాత్రము బయలను గాలిసోఁకు నట్లుగా పరుండవచ్చునుగాని, అప్పుడుసహితము మంచు మొదలయినవి మీఁదపడిజ్వరాదులురాకుండునట్లుగా పయినికప్పున్నచోట్ల నేశయనింప వలెను. విషవాయువులు భూమికి సమీపముగా నుండునుగాన వట్టి నేలనుపరుండక సాధ్యమయినంతవఱకు మంచములమీఁదనే పరుండు చుండవలెను. మంచములులేనప్పుడైనను కటికినేలనుచాపలమీఁదనుప రుండుటకంటె పరుపులమీఁదపరుండుటశ్రేయస్కరము. నేలతేమగానుం డనప్పుడంతహానికలుగకపోయినను, నేలమీఁదపరుండుచువచ్చినయెడల సాధారణముగా దేహములకునొప్పులును వాతజ్వరములును గలుగును. అంతేకాక క్రిందపరుండుటవలన రాత్రులయందాహారార్థము సంచరిం చెడుపాములు మొదలయినవానివలనియుపద్రవముకూడఁగలుగవచ్చును భూమి తేమగానుండి పరుపులు మొదలయినవిలభింపనియెడల వట్టిగడ్డిని గాని యెండాకులనుగాని వేసికొని దానిమీఁద పరుండవలెను. పగలు చక్కఁగా పనిచేయుటవలననుతగినంత దేహపరిశ్రమను జేయుటవల

నను పగటిపూటనిద్రింపకుండుటవలనను రాత్రులు మంచినిద్రపట్టును. రాత్రితొమ్మిది పది గంటలకు లోపలనె నిద్రపోయి తెల్లవాఱుజామున తప్పకనిద్రలేవవలయును. సూర్యోదయ మయినతరువాత నెప్పుడునిద్ర పోఁగూడదు. రాత్రి పండ్రెండుగంటలకులోపల పోయెడునిద్ర మిక్కిలి యారోగ్యప్రదమయినది. వయస్సును దేహస్థితినిఅనుసరించి నిద్రపో వలసిన కాలముయొక్క పరిమితివ్యత్యాసపడియుండును. కృషి మొదలైన కఠినములయిన పనులు చేయువారికి కొంతయధికనిద్ర కావలసియుండును. అయినను మంచియారోగ్యదశలోనున్న పెద్దవాండ్రకు దినమునకాఱేడు గంటలనిద్రచాలియుండును. శరీరకష్టపడువారికివలెనే చదువు మొదలైన మనఃకష్టమును పొందువారికిని నిద్ర హెచ్చుగానేయుండవలయును. శరీర పరిశ్రమమునకంటె మనఃపరిశ్రమ మేయధికాయాసముకలుగఁజేయును. కాఁబట్టి, అతిమనఃక్లేశమునుపొందినిద్ర చెడఁగొట్టుకొనకయట్టివారుమిత ముగా పనిచేసి తగినయారోగ్యమును నిద్రయు కలుగునట్లు చేసికొన వలెను. శిశువుల కధికనిద్రకావలసియుండును గనుక వారు పగటిపూట సహితము నిద్రపోవచ్చును. ఆఱేడుసంవత్సరముల ప్రాయము వచ్చు వఱకును బిడ్డలు దినమునకు పండ్రెండుగంటలసేపు నిద్రపోవలెను. అటు తరువాత పదియాఱుసంవత్సరములు వచ్చువఱకునుదినమునకుతొమ్మిది పదిగంటలసేపు నిద్రపోవలెను. శరీర స్థితియొక్క తారతమ్యమునుబట్టి నిద్రయొక్క పరిమాణములోఁగూడ తారతమ్యము లుండవలసినను, మొత్తముమీఁద పెద్దవాండ్రురాత్రిపదిగంటలకుపరుండి తెల్లవారుజామున నయిదుగంటలకునిద్రలేచుటకుప్రయత్నింపవలెను. రాత్రిపరున్నప్పుడు ముగముమీఁద బట్టకప్పుకొనరాదు. ఒకానొకప్పుడు వేడుకసమయములయందాటపాటలతో రాత్రిమిక్కిలి ప్రొద్దుపోయినదాఁక గడపినను, ఆరోగ్యముగోరువారెవ్వరును రాత్రివిస్తారముసేపు మేలుకొనసలవాటు చేయఁగూడదు. పనిపాటులులేక కాలమునువ్యర్థముగా గడపెడు భాగ్య

వంతులు విస్తారకాలము మంచములమీఁద పరుండియున్నను కష్టపడు వారికివలె వారికిసుఖనిద్రకలుగదుగాన ధనికులైననుబీదలైనను, సేవకులున్నను లేకపోయిననుగూఁడ నెల్లవారునుతగినంత దేహపరిశ్రమమును జేసి సుఖనిద్రకలిగించుకొనుటకును దానివలన నారోగ్యమునుపొందుటకును దానివలన మంచికార్యములు చేయసమర్థులు కాఁగలుగుటకును శక్తివంచనలేక ప్రయత్నము చేయవలెను.

సంపూర్ణము.



**స్త్రీల కుపయోగించుకథలు**

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తకచరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

**స్త్రీలకుపయోగించుపుస్తకములు**

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 ,, ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

**ఉపన్యాసములు**

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము